యమ్. యన్. రాయ్ (i)

# స్వీయ గాథలు

అనువాదకులు :

బి. యస్. యల్. హనుమంతరావు, M. A., B. Ed.,

ప్రజాసాహిత్యపరిషత్తు

తెనాలి-2

(iii)

# విషయసూచిక

I

# పరిచయం

ఇవి మానవేంద్రనాథ్ రాయ్ స్వీయగాథలు మాత్రమే కావు. ఇరవైయవ శతాబ్దపు విప్లవగాథే యిది. మెట్టు మెట్టుని విప్లవ విన్యాసంతో ఆరోహించి, విప్లవభావాన్ని, విప్లవగీతాన్ని వీనులకు విందుగా, ఉత్తేజకరంగా, ఆలాపించిన విప్లవ విపంచి యిది.

సామాన్య విప్లవకారుడుగా పయనం సాగించి, విప్లవ పంథాన పయనించి, పయనించి, అంతిమ సమయందాకా పయనిస్తూనే, రాయ్ తన జీవితాంతానికి, లోకకళ్యాణకరమైన, ఉదాత్తమైన మానవతా సిద్ధాంతాన్ని, గమ్యస్థానాన్ని చేరుకున్నాడు. రాయ్‌ది అనంతమైన విప్లవయాత్ర. అది చివరి ఘడియ వరకు సాగుతూనే వుంది.

ఆశయసిద్ధిని కత్తి, కటారులతో సాధించడం, విప్లవం క్రింద చలామణీ అవుతూ వచ్చింది ఆదిలో. రాయ్ కూడా అలాగే తన విప్లవ జీవితాన్ని ఆరంభించాడు. రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించడం ఆనాటి విప్లవకారుల ఆశయం. గాంధీగారి పేరు భారత భూమిలో ఇంకా తలెత్తని రోజులవి. ఆనాడే రాయ్ లాంటి అనేక యువకులకు స్వాతంత్ర్య పిపాస పెరిగింది. తమ జీవితాలను అందుకు అంకితం చేసిన కార్యనిరతి, త్యాగ తత్పరత వారిది. తరువాత తరంలో పెరిగి వచ్చిన స్వాతంత్ర్య సమర వీరులకు, ఈ త్యాగధనులు మార్గదర్శకులు; ఆదర్శప్రాయులు. ఆనాటి వారి నాయకులలో యం. యన్. రాయ్ ఒకడు.

బ్రిటిష్ పరిపాలనపై తిరుగుబాటుకు వారు ప్రయత్నించారు. అందుకై ఆయుధ సామగ్రి, ధన సహాయం కావలసి వచ్చింది. అప్పుడు మొదటి యుద్ధం ఆరంభమైంది. అందువల్ల బ్రిటిష్ సామ్రాజ్యంతో యుద్ధానికి తలపడ్డ జర్మనీ, ఆనాటి విప్లవకారులకు ఆశాజ్యోతి అయింది. జర్మనీ నుండి ఆయుధాలను, ధనాన్ని సేకరించడానికి రాయ్ భారతభూమినుండి ప్రయాణం ప్రారంభించాడు. అప్పుడు మొదలైన యాత్ర, 1929 సంవత్సరములో రాయ్ భారతదేశానికి తిరిగి వచ్చే

వరకు సాగుతూనే వుంది. కాదు, ఆయన అంతిమ సమయం వరకు సాగుతూనే వుంది.

జాతీయవాదిగా బయలుదేరిన రాయ్ త్వరలోనే కమ్యూనిస్టుగా మారాడు. జాతీయవాది కమ్యూనిస్టు కావడం సులభం; సహజపరిణామం కూడా. వాటికి తత్వభేదం స్వల్పం. రెంటికీ ఆవేశమే, ద్వేషమే చేతనాశక్తులు; స్వోత్కర్ష, పరనింద, అసహనమే కార్యక్రమాలు; ఒక దానికి మానవులను విస్మరించే ఒక భూభాగం ఆరాధ్య దేవత అయితే, మరొక దానికి మానవులనుసరకు చేయని సమాజం సర్వస్వామ్య సంభరితం. అందువల్లనే, జాతీయవాద నినాదాలతో రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న క్రొత్త దేశాలన్నీ, నేడు కమ్యూనిస్టు రాజ్యాలపై మొగ్గు చూపుతున్నయ్.

కమ్యూనిస్టు అయిన రాయ్ ఆ ఉద్యమానికి మహానాయకుడైనాడు. మెక్సికోలో ఆ పార్టీని ప్రారంభించి, కొంతకాలం నడిపి, ఆ పిమ్మట కమ్యూనిస్టు ఉద్యమానికి అంతరాలయమైన మాస్కో జేరుకున్నాడు. ఆనాటి కమ్యూనిస్టు పీఠాధిపతి లెనిన్‌తో మంతనాలు జరిపాడు. ఆయనకు బాసటైనాడు. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాధినేతలలో ప్రముఖుడైనాడు. చైనాలో విప్లవాన్ని సాగించడానికి కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధిగా వెళ్ళాడు. ఆసియాలోని అనేక దేశాల నుండి వచ్చిన యువకులను కమ్యూనిస్టు కార్యకర్తలుగా తీర్చి దిద్దాడు. ఆసియాలో పెరిగిన కమ్యూనిస్టు ఉద్యమానికి బీజాలు వేసి, నాయకులను తయారు చేసిన ఘనత రాయ్‌ది.

కమ్యూనిస్టు ఇనపకచ్చడాలలో రాయ్ ఎక్కువకాలం బందీగా వుండలేక పోయాడు. స్వేచ్ఛకై అహరహము అన్వేషించే రాయ్‌కి కమ్యూనిస్టు నియంతృత్వ వాతావారణం సహించ లేదు. మానవ ప్రగతీ చైత్రయాత్రలో కమ్యూనిస్టు భావం ఒక మజిలీ మాత్రమేనని, కమ్యూనిస్టు భావాన్ని దాటి, అధిగమించి, మానవుడు ముందుకు సాగాలని రాయ్ విశ్వసించాడు. అందుచేత భారతదేశానికి తిరిగిరాకముందే, కమ్యూనిస్టు వాతావరణంనుండి రాయ్ బయటకు వచ్చేశాడు.


సంయుక్త రాష్ట్రములు
శాన్‌ఫ్రాన్సిస్కో
న్యూయార్క్
హానొలూలూ
స్వేచ్ఛాన్వేషణలో
యం. యన్. రాయ్.
ప్రపంచయాత్ర.

భారతదేశంలో కూడా రాయ్ కాంగ్రెసుపార్టీలో ఇమడలేక పోయాడు. రెండవ యుద్ధం పరిస్థితిని మార్చింది. సామ్రాజ్యతత్వాన్ని అది కూకటివేళ్ళతో కూల్చగలదన్న రాయ్ వాదాన్ని భారతప్రజలు యుద్ధకాలంలో గుర్తించ లేదు. ఆయన్ని అపార్థం చేసుకున్నారు. అపార్థాలకు, అపవాదులకు భయపడని ధీరు డాయన; పలుకుబడికై విశ్వాసాలను బలి ఇవ్వని ధీరు డాయన.

యుద్ధానంతరం ప్రపంచమంతటా వెల్లివిరిసిన స్వాతంత్ర్య వాతావరణంలో, మానవునకు ఉండవలసిన, రావలసిన స్థానం లేకపోవడం రాయ్ గుర్తించాడు. మానవుణ్ణి కేంద్రంగా స్వీకరించని, మానవుని విశిష్ఠ వ్యక్తిత్వాన్ని గుర్తించని, మానవుని స్వేచ్ఛాప్రియత్వాన్ని మన్నించని ఏ వ్యవస్థ అయినా, తిరోగమనానికి దారి తీస్తుంది కాని, పురోగమనానికి ఉపయోగించదని రాయ్ ప్రబోధించాడు. నవ్య మానవవాదాన్ని ప్రపంచానికి అందించాడు.

ఈ విధంగా ఆదినుండి తుదివరకు రాయ్ జీవితం ఒక చైతన్య స్రవంతిగా పురోగమించింది. చాలామంది విప్లవకారులు, ఏ కొంత కాలమో విప్లవ వీధులలో విహరించి, ఆ పిమ్మట ఆ మార్గం నుండి మరుగు పడడం జరుగుతున్నది. కాని రాయ్ మాత్రం ఆఖరు క్షణం వరకు విప్లవకారుడుగానే ప్రవర్తిల్లాడు. ఆయనలో విప్లవజ్యోతి ఎన్నడూ ఆరలేదు. ప్రతి క్షణము అది ప్రజ్వరిల్లుతూనే వుంది. దానికి ప్రధాన కారణం రాయ్ తాత్వికుడు కావడం. కత్తి, కఠారులతో ప్రారంభమైన ఆయన విప్లవభావం, తాత్వికదృష్టిని అలవరచుకుని, పెంచుకుని, ఉన్నత స్థితిని పొందింది. ఔదాత్తను సాధించింది. రాయ్ విప్లవకారులలో తాత్వికుడు. తాత్వికులలో విప్లవకారుడు.

అందుచే రాయ్ గాథ చదవడం, చైతన్య స్రవంతిలో పయనించడం. భావుక ప్రపంచానికి ఈ గాథ ఉత్తేజాన్ని కలిగించగలదు; భావి తరాలకు మార్గదర్శిగా మనగలదు.

మామూలు స్వీయచరిత్రలకు, దీనికీ చాలా వ్యత్యాసం వుంది. ఈ గాథ భావప్రగతిని, ఒక తాత్వికుని తాత్విక పురోగమనాన్ని

విశదీకరిస్తుంది. వ్యక్తిగత విషయాలకు ప్రాధాన్యతనివ్వదు. ఇందులో స్వోత్కర్ష లేదు. సత్యము, సత్యాన్వేషణ ఈ గాథకు మూలసూత్రాలు. ఈ చరిత్ర, పాఠకుని బుద్ధిని సునిశితం చేస్తుంది.

రాయ్ తాత్వికుడు, దార్శనికుడు అవడంచేత ఆయన భాష కూడా తార్కిక గమనానికి అలవాటు పడ్డది. అయితే, ఈ గాథలో రాయ్ భాష, శైలి క్రొత్త రూపాన్ని దాల్చినయ్. మామూలు తార్కిక పాటవంతో బాటు, కథాగమనానికి కావలసిన చాతుర్యాన్ని కూడా ఈ శైలి హృదయంగమంగా ప్రదర్శిస్తుంది. ఈ గాథ ప్రపంచ రంగంలో జరిగిన విప్లవ సంఘటనల నెన్నిటినో కళ్ళకు కట్టినట్లుగా చిత్రిస్తుంది. అందులో విఖ్యాత మానవు లెందరో మన కళ్ళముందు మెసలుతారు. తిరిగి జీవం పోసుకొని, వారు మన కళ్ళముందు వ్యవహరిస్తున్నట్లే వుంటుంది. అంతటి పటిమగల చిత్రణా చాతుర్యం ఈ స్వీయ గాథల్లో వుంది.

అనువాదం మూలానికి న్యాయం చేకూర్చింది. రాయ్ చేతిలో ఇంగ్లీషు భాష ఎలా నడిచిందో, హనుమంతరావుగారి చేతిలో తెలుగు భాష అలా సాగింది. సూటీగా, కమ్మగా, చక్కగా, సులువైన రాయ్ శైలికి దీటైనది హనుమంతరావుగారి తేట తెలుగు. మూలానికి చక్కగా అతికింది అనువాదం. రాయ్ రచనలతో, సంపర్కంతో ప్రభావితుడైన మేధావి హనుమంతరావుగారు. రాయ్ ప్రవచించిన నవ్యమానవ వాదాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకొన్న వాడాయన. అందువల్లనే అనువాదం అంత బాగా కుదిరింది.

రాయ్ అసంపూర్తిగా వదలవలసి వచ్చిన స్వీయగాథను, మరి రెండు అధ్యాయాలు కలిపి, పరిపూర్ణం చేశాడు అనువాదకర్త. అలా చేయడం ఈ గాథకు నిండుతనాన్ని, రాయ్ తాత్విక వికాస చరిత్రకు పతాకస్థాయిని ప్రసాదించింది. అందుకు హనుమంతరావుగారు అభినందనీయులు.

ఈ విప్లవ విపంచి పాఠకుని మేధస్సులో ప్రగాఢ భావతరంగాలను రేకెత్తించగలదు.

—అవుల సాంబశివరావు

# పూర్వగాథ

## పరిచయము

యమ్. యన్. రాయ్ వంటి వ్యక్తులు చరిత్రలో అరుదుగా కన్పిస్తారు; ఆజన్మాంతమూ అతని జీవితం స్వేచ్ఛాన్వేషణలో సాగించిన ప్రస్థానం. "ఇరవయ్యో శతాబ్ద ప్రారంభంలో ఆసియాజాతీయ విప్లవ చైతన్యమూర్తియే యమ్. యన్. రాయ్" అంటాడు గ్రైవింట్ అనే బ్రిటిష్ పత్రికా రచయిత. కాని రాయ్ జీవితాశయం కేవలం జాతీయ స్వాతంత్ర్యం కాదు; సాంఘిక, ఆర్థిక స్వాతంత్ర్యమూ కాదు; సమగ్రమైన మానవ స్వేచ్ఛ. స్వేచ్ఛాన్వేషణయే మానవ అస్తిత్వానికీ, అభ్యుదయానికీ కీలకమని రాయ్ సిద్ధాంతం. అందుచేతనే అతని విప్లవ కార్యక్రమాలు జాతి, దేశం, వర్గం అనే పరిధులను దాటి ప్రాత క్రొత్త ప్రపంచాలు రెంటికీ విస్తరించినై. అతని జీవితం జాతీయ దౌర్జన్యవాదిగా (Terrorist) ప్రారంభమైంది. క్రమంగా అఖిల ఆసియా భావాన్నీ, సోషలిస్టు కమ్యూనిస్టు భావాల దశలనూ గడిచి మానవవాదిగా అతడు పరిణమించాడు; ప్రపంచాన్ని ఏక పరిమాణంగా, మానవజాతిని ఏకైక ప్రమాణంగా దర్శింపగల ఉదాత్త మానవతావాదానికి దార్శనికుడైనాడు. కాబట్టి సమకాలిక భావ పురోగతి చరిత్రయే రాయ్ జీవిత చరిత్ర. దోపిడిగాడైన వాల్మీకి 'ఆదికవి' కావటంలో ఆశ్చర్యం లేదని రుజువు చేసాడు రాయ్. నిజానికి అతని జీవితాదర్శం మానవుడు సహజంగా మంచివాడని నిరూపించటమే! వీరి కోవలోనివాడే అరవిందమహర్షి! కాని అరవిందుని మానవతావాదానికి చాలవరకు ప్రాచీన భారతీయ సంస్కృతియే పునాది. రాయ్ నవ్యమానవవాదం ప్రాచీన, అర్వాచీన, ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞాన నిధులను మథించి రూపొందించిన విశ్వతత్త్వం. ఈ కారణం చేతనే కొందరి దృష్టిలో శంకరాచార్యుల తరువాత భారతదేశంలో జన్మించిన జగద్గురువు యమ్. యన్. రాయ్.

ఇంతటి వైశిష్ట్యం గల రాయ్ జీవిత చరిత్ర స్వేచ్ఛాపిపాస గల మానవులకు మార్గదర్శి; భావి విప్లవకారులకు నిఘంటు స్వరూపం. కాని ఆ చరిత్ర నుద్ధరించి వ్రాయటం సాధ్యం కాని పని. సమగ్రంగా ఆ జీవిత చరిత్ర వ్రాయగల వ్యక్తి యమ్. యన్. రాయ్ ఒక్కడే. ఐతే రాయ్ తన స్వీయ చరిత్రను వ్రాసికొనటానికి నిరాకరించాడు. ఎంతటి సత్యసంధుడైనా, స్వవిషయంలో నిరపేక్షకంగా ఉండ లేడని రాయ్ ఉద్దేశ్యం. ఆప్తమిత్రులతో గూడా స్వవిషయం చెప్పేవాడు కాదట! అందుచేతనే రాయ్‌ని 'మాయ మనిషి' (Mystery Man) అనేవారు.

XVI

చివరి రోజుల్లో, అంటే రాయ్‌కి ప్రమాదం సంభవించి కోలుకొన్న తరువాత, మిత్రుల కోరకపై 'స్వీయ గాథలను', అదికూడా తన వ్యక్తిగత జీవితంగా గాక, నాటి చరిత్రలో అంతర్భాగంగా మాత్రమే వ్రాయ బూనుకున్నాడు. కాని అది అసంపూర్తిగనే అంటే 1915 నుండి 1922 వరకు మాత్రమే వ్రాయగలిగాడు; తన జీవిత కాలంలోనే గాక చరిత్రలోనే రాయ్ 'మాయ మనిషి'గా నిలిచిపోయినాడు.

ఐతే, 1915 కు పూర్వము దౌర్జన్యవాదిగా రాయ్ చర్యలనూ, 1922 తరువాత రాయ్ జీవితంలోని ప్రధాన ఘట్టాలనూ పత్రికలనుండీ, పోలీసు రికార్డులనుండీ, ఇతర గ్రంథాలనుండీ సేకరించే ప్రయత్నాలు జరుగుచున్నై. ఆ విధంగా లభ్యమైన అంశాలలో, ఆతని స్వీయగాథలు (Memoirs) జోడించి సమగ్రమైన జీవిత చరిత్ర రూపంలో ఆంధ్రలోకానికి అందించటానికి చేసిన ప్రయత్నమే ఇది!

## బాల్యం

నరేంద్రనాథభట్టాచార్య అనే పేరుతో యమ్. యన్. రాయ్ బెంగాలు రాష్ట్రంలో అర్బేలియా గ్రామంలో, విక్రమ శకం చైత్ర శుద్ధ అష్టమినాడు (1887 మార్చి). జన్మించాడు. అర్బేలియా ఆతని మాతామహస్థానం; ప్రస్తుతం పశ్చిమ బెంగాలు, 24 పరగణాల జిల్లాలో ఉంది. తండ్రి దీనబంధుభట్టాచార్య, గొప్ప సంస్కృత విద్వాంసుడు; దీనబంధు రెండవ భార్య బాసంతీకుమారి. వీరి నాల్గవ కుమారుడే నరేంద్రనాథుడు తల్లి దండ్రు లితణ్ణి ముద్దుగా 'దానూ' అని పిలిచేవారట!

భట్టాచార్యుల స్వగ్రామం మిడ్నపూర్ జిల్లాలోని ఖేపుట్. రాయ్ బాల్యంలో కూడా ఖేపుట్ సిరిసంపదలతో ఏక కుటుంబంగా తులతూగింది. భట్టాచార్య కుటుంబమే శాఖోపశాఖలై వేయిమందికి పైగా ఉండేవారు; ఆ గ్రామంలో చాల ప్రాచీనమైన కాళీ ఆలయంలో పూజారులుగా దేవాలయ మాన్యాలను తరతరాలుగా అనుభవించేవారు. రామాయణగాథా, సతీదహన (దక్షయజ్ఞం) గాథా, ఖేపుట్ కాళీదేవత జన్మగాథతో ముడివడిపోయి ఆ దేవాలయాన్ని ఏబది రెండు పుణ్యక్షేత్రాలతో చేర్చి వేసినై. ఈ దేవాలయ అర్చకత్వానికి భట్టాచార్య కుటుం

---

జైలు నుండి వ్రాసిన జాబుల్లో, 1933 నాటికి తనకు 40 యేండ్లని రాయ్ వ్రాశాడు; అందుచే నతడు జన్మించినది 1893 అగుచున్నది. అదీగాక 1919 లో లెనిన్‌ను కలుసుకొన్నప్పుడు తన వయస్సు 27 సంవత్సరాలని రాయ్ చెప్పాడు. దీనినిబట్టి కూడా అతడు జన్మించినది 1893 లోనే.

M. N. Roy, The Humanist Philosopher
R. S. Dass
Tower Publications, Calcutta (1956)

బంలోనీ ప్రధానశాఖకే హక్కు ఉంది. దీనబంధుభట్టాచార్య ప్రధాన శాఖకు చెందిన వాడే! ఐన సాహసించి దీనబంధు, అర్చకత్వాన్నీ, ఖేపుట్ గ్రామాన్నీ విడిచి ఆర్బెలియాలో కొంతకాలం గడిపి 1898 లో కొడాలియా చేరి అచట స్థిరపడ్డాడు. ఆధ్యాత్మికమైన కులవృత్తినీ, స్వస్థలాన్నీ విడిచి వెళ్లి లౌకిక వృత్తి నవలంబించిన భట్టాచార్యులలో దీనబంధు మొట్టమొదటివాడు. అదే ఆ కుటుంబంలో సాంప్రదాయంపై తిరుగుబాటుకు ప్రారంభోత్సవం!

కొడాలియాలో దీనబంధు, ఉపాధ్యాయ వృత్తి నవలంబించి కుటుంబ పోషణ సాగించాడు. కొడాలియా సమీపంలో నున్న "హరినాభి ఆంగ్లో సంస్కృత పాఠశాల"లో నరేంద్రనాథుని విద్యాభ్యాసం ప్రారంభమైంది. బడికి వెళ్ళటం కంటె పొరుగువారి తోటల్లో జొరబడి పండ్లు కోసుకు తినటంలోనే కాలం గడిపేవాడట నరేంద్రనాథుడు.

## స్వాతంత్ర్య ఉద్యమ ప్రవేశం

నాటికే బెంగాల్ రాష్ట్రంలో జాతీయ స్వాతంత్ర్యోద్యమ సన్నాహాలు ప్రారంభమైనై. నరేంద్రనాథుని యువకోత్సాహాన్నీ, సహజ స్వాతంత్ర్య కాంక్షనూ ఆ కార్యక్రమాలు ఆకర్షించినై. 1901 నుండీ అతడు స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్నట్లు తెలుస్తుంది. భారత జాతీయ మహాసభా (Indian National Congress) స్థాపకులలో నొకరైన సురేంద్రనాథ్ బెనర్జీ కొడాలియాను సందర్శించినప్పుడు నరేంద్రనాథుడు స్వాగత మిచ్చాడట! ఆ నేరానికి, పాఠశాల నుండి అధికారులు నరేంద్రనాథుని బహిష్కరించారు. ఈ సమయంలోనే నరేంద్రనాథుడు తండ్రి దగ్గిర సంస్కృతంలో మంచి పాండిత్యం సంపాదించాడు.

తరువాత, అషుతోష్ ముఖర్జీ స్థాపించిన జాతీయ కళాశాల నడిపిన ప్రవేశ పరీక్షలో ప్రథముడుగా ఉత్తీర్ణుడై బంగారు పతకం బహుమతిగా పొందాడు. పాఠశాలల్లో రాయ్ విద్యాభ్యాసం, బెంగాల్ సాంకేతిక విద్యాసంస్థ (Bengal Technical School) లో చేరటంతో పరిసమాప్తమైంది.

ఇంతలో బెంగాల్ విభజన జరిగింది (1905). దేశం 'వందేమాతరం' నినాదంతో ప్రతిధ్వనించింది. బంకించంద్ 'ఆనందమఠం' ప్రజలకు స్వాతంత్ర్య సందేశాన్నిచ్చి విప్లవ కార్యక్రమాలకు పురికొల్పింది. యువకుల్లో ఉత్సాహం ఉరకలు వేసింది. 1905 లోనే దీనబంధుభట్టాచార్య మరణించాడు; తరువాత రెండు సంవత్సరాలకు బాసంతీకుమారి చనిపోయింది. నరేంద్రనాథుడు రాజకీయరంగంలో ప్రవేశించటానికి గల ఆటంకాలన్నీ తొలగిపోయినై. స్వేచ్ఛాన్వేషణలో ప్రస్థానం ప్రారంభమైంది.



ఆ రోజుల్లో బెంగాలు రాష్ట్రంలో 'అనుశీలన సమితి' అనే రహస్య విప్లవ సంఘం యేర్పడి స్వాతంత్ర్య ఉద్యమ ప్రచారం సాగించింది. ఆ సంఘమే తరువాత 'యుగాంతర్'గా రూపొందింది. అనుశీలన సమితి నాయకులు సతీశ్ బోస్, బ్రహ్మ బాంధవ ఉపాధ్యాయ. వీరి కార్యస్థానం కలకత్తా. నరేంద్రనాథుడు, పదమూడు సంవత్సరాల వయస్సులోనే, మిత్రుడైన హరికుమార చక్రవర్తితో బాటు 'అనుశీలన సమితి'లో చేశాడు. నాయకులతో సంప్రదించటానికై 1906-7 లో మొదటిసారిగా కలకత్తా వెళ్ళాడట; క్రమంగా కలకత్తా నరేంద్రనాథుని నివాసమైంది.

## చింగ్రిపోత దోపిడీ, 1907

నరేంద్రనాథుని రాజకీయ జీవితం చింగ్రిపోత రైలుస్టేషన్ దోపిడీ నేరంతో 1907 డిసెంబర్‌లో ప్రారంభమైంది. 'అమృతబజార్' పత్రికా ప్రకటన ప్రకారం, "అర్ధరాత్రి రెండు గంటలకు E. B. S. రైలు మార్గంపై, కలకత్తాకు పన్రెండు మైళ్ళ దూరంలో నున్న చింగ్రిపోత స్టేషన్‌మీద సాయుధ దోపిడిగాండ్రు దాడి జరిపి, స్టేషన్ మాష్టర్ని, ఆతని సిబ్బందినీ తరిమివేసి ఏడువందల రూపాయీలు దోచుకున్నారు" ఈ సందర్భంలోనే నరేంద్రనాథుని అరెస్టు చేసి (డిసెంబర్ 9) సీల్దా (Seldah) పోలీసు మేజస్ట్రేటు ముందు హాజరు పరచారు. కాని అతడు విద్యార్థియనీ, అతనిపై నేరం రుజువుకాలేదనీ విడుదలచేశారు (డిసెంబర్ 17). ఆ రోజుల్లో ఉన్నత వంశీయులు (భద్రలోగ్) నేరం చేయరనే విశ్వాసం గాఢంగా ఉండేదట! నరేంద్ర నాథుని విడుదలకు ఆ నమ్మకమే ప్రధానకారణం! చింగ్రిపోత దోపిడియే బెంగాలులో జరిగిన మొదటి రాజకీయదోపిడీ! దానితో నరేంద్రనాథుని కీర్తిప్రతిష్ట లినుమడించినై.

## జటిన్ ముఖర్జీ నాయకత్వం

ఈలోగా, బెంగాల్ విప్లవ వీరులందర్నీ ప్రభుత్వం నిర్బంధించింది. బ్రహ్మ బాంధవ ఉపాధ్యాయ మరణించాడు. అనుశీలన సమితి విచ్ఛిన్నమైంది. బెంగాల్ ఉద్యమం క్షీణించే ప్రమాదం యేర్పడింది. ఆ పరిస్థితిలో బెంగాల్ యువకులు జటిన్ ముఖర్జీ నాయకత్వం క్రింద ఉద్యమాన్ని పునరుద్ధరించారు. జటిన్ ధైర్యసాహసాలూ, దీక్షాగల యువక వీరుడు; ఒక సందర్భంలో చాకు సహాయంతో పులితో పోరాడి చంపాడట! అందుచే అతణ్ణి జటిన్‌బాఘా అనేవారు. జటిన్ ముఖర్జీకి నరేంద్రనాథుడు కుడిభుజమై ఉద్యమానికి అవసరమైన ధనాన్ని సేకరించే బాధ్యత వహించినట్లు స్వీయ గాథలవల్ల తెలుస్తుంది. ధనాన్ని సేకరించటానికి రాయ్ అనుసరించిన విధానం దోపిడి!

## హౌరా కుట్ర నేరం, 1910

హౌరాకుట్ర సందర్భంలో 1910 లో నరేంద్రనాథుడు రెండవ మారు అరెస్టయినాడు. "ఆంగ్ల చక్రవర్తి సార్వభౌమత్వాన్ని కూలద్రోసే ఆశయంతో

ఆయుధాలు సేకరించి దాస్తున్న"ట్లు నరేంద్రనాథునిపై నేరం మోపబడింది. అతనితో సహా నలభై ఆర్గురిని అరెస్టు చేశారు. నేర విచారణ సందర్భంలో లలిత్ మోహన చక్రవర్తి 'అప్రూవర్'గా మారి నరేంద్రనాథుడు 1908, 1909, 1910 సం. లలో దోపిడీలు చేసినట్లు వాఙ్మూల మిచ్చాడు. అదే సమయంలో నరేంద్రుని దగ్గిర 'వర్తమాన రణనీతి', 'మాయేర్ అబహన్' (తల్లి పిలుపు) అనే బహిష్కృత గ్రంథాలు దొరికినై. హౌరా కుట్ర నేరాన్ని విచారించటానికి ప్రత్యేక న్యాయాధికార సంఘం నియమించబడింది. దీనికి అధ్యక్షుడు కలకత్తా హైకోర్టు ఉన్నత న్యాయమూర్తి; న్యాయమూర్తులైన బ్రెట్, ఛటర్జీలు సభ్యులు. చివరకు న్యాయస్థానంలో లలిత్ మోహన్, నరేంద్రనాథుని గుర్తింపలేక పోవటంవల్ల నరేంద్రనాథుని (20-4-1911) విడుదల చేశారు.

## గార్డెన్‌రీచ్ దోపిడి, 1915

నరేంద్రనాథుడు చిట్టచివర చేసినది గార్డెన్‌రీచ్ దోపిడి. 1915 లో కలకత్తాలోని గార్డెన్‌రీచ్ సమీపంలో మోటారుకారు నాపి 18 వేల రూపాయలు దోచుకొన్నారు. ఈ సందర్భంలో నరేంద్రనాథుని 24 పరగణాల జిల్లాలో ధాసా దగ్గర అరెస్టు చేసి (ఫిబ్రవరి, 17) అలీపూర్ జిల్లా మేజస్ట్రేటు జె. ఎ. యల్. స్వాన్ ముందు హాజరు పరచారు. ఇద్దరు మిత్రులు చెరొక ఐదు వందల రూపాయిలు ధరావతు కట్టి జామీనుమీద నరేంద్రనాథుని విడుదల చేయించారు. నరేంద్రనాథునిపై నేరం రుజువైంది; అలీపూర్ సంయుక్త న్యాయాధికారి సి. బార్ట్లీ ముందు విచారణకు వాయిదా వేశారు. వాయిదా రోజున జామీన్‌దార్లు హాజరై నరేంద్రనాథునకు మశూచి వ్యాధి వచ్చిందనీ, మరునాడు డాక్టర్ సర్టిఫికేట్ దాఖలు చేస్తామనీ వాయిదా కోరారు. మశూచి వర్తమానం, కేవలం అధికారుల కండ్లు కప్పటానికి కల్పింపబడిన కట్టుకథ! నాలుగైదు రోజుల తర్వాత, జామీనుదార్లు కోర్టుకు వచ్చి 'విడుదలైనప్పటి నుండీ నరేంద్రనాథుడు కన్పించటం లేద'ని చెప్పి ధరావతును వదులుకొన్నారు.

## జర్మన్ ఆయుధాలు - జావా ప్రయాణం

గార్డెన్‌రీచ్ కేసులో శిక్ష తప్పించుకొన్న నరేంద్రనాథుడు, హరిపాద ముఖర్జీ నడిపిన హోటల్లో రహస్యంగా గడుపుతూ, జతీన్ బాఘాకు సహాయపడినట్లు తెలుస్తుంది. ఈ రోజుల్లోనే, భారతీయ విప్లవకారులు జర్మనీ నుండి ఆయుధాలు సంపాదించే ప్రయత్నాలు ప్రారంభించారు. బెర్లిన్‌లో భారతీయ విప్లవ సంఘం యేర్పడింది. జతిన్ ముఖర్జీ కూడా జావాలోని జర్మన్ రాయబారితో ఒక ఏర్పాటు చేశాడు; జర్మన్ ధన సహాయం పొందటానికి 'హరి అండ్ కంపెనీ' అనే దొంగ కంపెనీ స్థాపింపబడింది. జర్మన్ ఆయుధాలను బెంగాలులోని సుందర్ బనులకుగాని,



ఒరిస్సాలోని బాలాసోర్ ప్రాంతాలకుగాని చేర్చటానికి సన్నాహాలు చేశారు. జటిన్ చేసిన యేర్పాటు ప్రకారం "అమెరికాలోని జర్మన్ ఏజంటు, కాలిఫోర్నియాలోని శాన్ పెడ్రో దగ్గర 8090 రైఫుల్సూ, 2400 కార్ట్రైజులూ, 40 లక్షల తూటాలూ కొని 'మావరిక్' అనే జర్మన్ నౌకలో పంపుతున్నాడు. ఆ ఆయుధ సామగ్రి, మరి కొంత ధనమూ, జావా ద్వీపంలో జటిన్ అనుచరుల పరం చేయబడుననీ" జర్మన్ రాయబారి వాగ్దానం చేశాడు. ఈ 'పెన్ని ధానా'న్ని జావా నుండి ఇండియాకు చేర్చే బాధ్యత వహించి, నరేంద్రనాథుడు 1915 ఏప్రియల్ నెలలో జావా చేరాడు; 'మావరిక్' జాడ తెలియలేదు; ఆశాభంగంతో స్వదేశం చేరాడు. కాని ఆతనిలో ఆశలు నశింపలేదు. తిరిగి ఆగస్టు నెలలో బయలుదేరాడు. ఆ బయలుదేరటం నరేంద్రనాథుడు మానవేంద్రనాథుడుగా 1929 చివర్లో స్వదేశానికి తిరిగివచ్చాడు!

## 'యమ్. యన్. రాయ్' జననం

జావాలో నరేంద్రనాథుడు 'మావరిక్'ను చూచాడు. కాని ఆయుధాలు లేవు. నిరాశా నిస్పృహలతో ఆతని అనుచరులు వెనుకకు మరలారు. వారిని బర్మా సమీపంలో బ్రిటిష్ పోలీసులు అరెస్టు చేశారు. ఇది గ్రహించి నరేంద్రనాథుడు వెనుకకు మరలి ఒక డచ్చి నౌకలో బటేవియా చేరాడు. జావా నుండి షాంఘైకు బయలుదేరాడు. మార్గ మధ్యంలో తిరిగి బ్రిటిష్ పోలీసుల ప్రమాదం తటస్థించింది. నౌకాధిపతి సహాయంతో సముద్రంలోకి దూకి రెండు రోజులు లైఫ్‌బోటు మీద గడుపుతాడు. లైఫ్‌బోటు నుండి అతణ్ణి ఒక చైనా జంక్ రక్షిస్తుంది. చైనా నౌకలోనే కాంటన్ చేరి, అటనుండి జపాన్, చైనా దేశాలగుండా అమెరికా సంయుక్త రాష్ట్రాలు చేరాడు. ఈ ప్రయాణంలో నరేంద్రనాథుని పేరు ఫాదర్ మార్టిన్! కాలిఫోర్నియా సమీపంలోని స్టాన్‌ఫర్డ విశ్వవిద్యాలయంలో ధనగోపాల్ ముఖర్జీ నరేంద్రనాథునకు మానవేంద్రనాథుడని నామకరణం చేస్తాడు. 'భట్టాచార్య'కు బదులు రాయ్ పేరు నాతడే స్వయంగా చేర్చుకొన్నాడట. ఇదీ యమ్. యన్. రాయ్ జన్మగాథ! అన్ని విధాలా అమెరికా చేరటం రాయ్ జీవితంలో పునర్జన్మయే! రెండవ జన్మలో తనకు లభించిన పేరును గురించి మానవేంద్రనాథ రాయ్ మురిసిపోయే వాడని ఆతని పరిచయస్థుల ద్వారా తెలుస్తుంది. నిజంగా అది గర్వింప దగిన నామధేయమే!



యమ్. యన్. రాయ్; ఎలెన్ రాయ్, 1953

# 3

# అఖిల ఆసియా భావం

## ఎండమావులు

భారతదేశం చివరకు 1947 లో జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించింది. అప్పటికి 30 సంవత్సరాలకు పూర్వమే, ఆ మహత్తర ఆశయాన్ని సాధించడం సాధ్య మనే ఊహాచిత్రాలు యువకుల ననేక సాహసకృత్యాలకు పురికొల్పినై.

1914 లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైంది; విదేశాల్లో తలదాచు కొంటున్న భారత విప్లవకారు లందరూ, జర్మనీని ఆశాజ్యోతిగా భావించి, ఆ దేశా నికి పరుగెత్తటం ప్రారంభించారు. బెర్లిన్‌లో ఒక 'భారతీయ విప్లవసంఘం' స్థాపింప బడింది. భారత స్వాతంత్ర్య యుద్ధాన్ని నడపటానికి అవసరమైన ఆయుధాలూ, ధనమూ సహాయం చేస్తానని జర్మనీ ఆ సంఘానికి వాగ్దానం చేసిందనే వర్తమానం 1914 చివరలో ఇండియాలోనున్న మాకు చేరింది. ఆ సమాచారం కారుమబ్బులాగా దేశం నలుమూలలా వ్యాపించింది. చివరకు బ్రిటిషు సైన్యంలోని భారతీయసైనికుల్లో గూడా కలవరం ప్రారంభమైంది. విప్లవం పొలిమేరల్లోకి వచ్చింది; ఏ పరిణామాలు రాబోతున్నవో ఎవరికీ స్పష్టమైన అభిప్రాయాలు లేవుకాని స్వాతంత్ర్యం కనుచూపు దూరంలో ఉందనే భావం అందరిలోనూ బలపడింది. అప్పటికే స్వాతంత్ర్యం సంపాదిద్దాం అనే ఆశయంతో పెక్కు రహస్య సంఘాలు పనిచేస్తున్నై. సత్వరం స్వాతంత్ర్యం సిద్ధించబోతోందన్న ప్రస్తుత భావంవల్ల ఒక మేలు జరిగింది. ఆ ఊహా మాత్రమైన స్వాతంత్ర్యప్రాప్తి రహస్య సంఘాలన్నింటినీ సన్నిహితపరిచింది. తమతమ విభేదాలను మరచి వారందరూ ఒక పెద్ద సమావేశం జరిపి తమ కార్యక్రమాన్ని నిర్ణయించుకొన్నారు. విప్లవాన్ని నడిపించటానికి జతిన్ ముఖర్జీ సర్వసేనానిగా ఎన్ను కొనబడ్డాడు. ఒక కార్యవర్గం కూడా ఏర్పాటు చేయబడింది.

మొదట్లో విప్లవం కొనసాగటానికి అవసరమైనధనం సేకరించేబాధ్యత నాపై బడింది. ఆ బాధ్యతను నేను సక్రమంగానే నిర్వహించగలిగాను. తరువాత, జర్మనీ మాకు వాగ్దానం చేసిన ఆయుధాలను ఇండియాకు ఎలా చేర్చడమా అనే సమస్య ఎదురైంది. జర్మనీవంటి దూరదేశంనుండి నేరుగా ఇండియాకు ఆయుధాలు దిగుమతి చేయటం సాధ్యంకాదు; అందుచేత ఇండియాకు సమీపంలోనున్న ఒక తటస్థ

రాజ్యంలో మాకు ఆయుధాలను అప్పగించే యేర్పాటు చేయవలసిందిగా, జర్మనీ ప్రభుత్వాన్ని కోరడానికై ఒక రాయబారి బెర్లిన్ వెళ్ళాడు. డచ్చి తూర్పుఇండియా దీవులే ఆ తటస్థరాజ్యంగా సూచింపబడినై. 1914 చివరలో నేను జావా ప్రయాణం కట్టాను. దేశం విడిచి బైటికి వెళ్ళడం అదే మొదటిసారి. అప్పటికి నా వయస్సు 22 సంవత్సరాలు. రెండు నెలల్లోనే కొద్దిపాటి ధనంతో తిరిగివచ్చాను. కాని జర్మనీ నుండి ఆయుధాలను ఆశించడం ఎండమావుల వేటగా పరిణమించింది. కొంతకాలం గడచిన తరువాత ఈ ఆయుధగాథ అంతా వట్టిబూటకమని తెలిసింది.

ఐనా, మా ఉడుకురక్తంలోని ఉత్సాహం, ఉజ్వల భవిష్యత్తును గురించి ఆలోచనాశూన్యమైన ఆశలూ, అన్నిటికంటె ముఖ్యంగా జర్మనీ భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించగలదనే అచంచల విశ్వాసమూ అంత సులభంగా చెదిరి పోయేవికావు. అందుచేత ఒక క్రొత్తప్రణాళికతో తిరిగి ప్రయత్నాలు ప్రారంభించాం. 1915 మొదట్లో మరల ఎండమావులను వేటాడుతూ దేశంవిడిచి వెళ్ళాను. పసిఫిక్ మహాసముద్రంలో ఎక్కడో ఒక ప్రాంతంలో తేలుతున్న పెన్నిధిని తీసికోకుండా ఇండియాలో అడుగు పెట్టగూడదనే పట్టుదలతో బయలుదేరాను.

సముద్రంమీద ప్రయత్నాలు విఫలంకావటంవల్ల భూమార్గాన తిరిగి కృషి ఆరంభించాను. చైనాగుండా, ఈశాన్య సరిహద్దులోని కొండజాతుల ప్రాంతాల ద్వారా ఇండియాకు ఆయుధాలు చేర్చాలని నా సంకల్పం. ఆ ప్రాంతంలోనే కొండ జాతులైన 'అబర్లు' ఉన్నారు. నేను దేశంవిడిచి వెళ్ళిన వెంటనే మా మిత్రులలో సమర్థులైనవారు ఆ ప్రాంతానికి వెళ్ళారు. విదేశ ఆయుధాలతోనూ, సాధనసంపత్తి తోనూ 'అబర్లను' పురిగొల్పి తిరుగుబాటు చేయించటమే వారి ఆశయం.

ఈలోగా, ఇండోనీషియాద్వారా సముద్రంమీదుగా ఇండియాలోని విప్లవ కారులకు సహాయం పంపుదామని మరొక విఫలప్రయత్నం చేశాను. సుమత్రాద్వీపం ఉత్తరాగ్రంలో కొన్ని జర్మను నౌకలు నిర్బంధంలో ఉన్నై. వాటి సహాయంతో అండమానులను వశపరచుకొని, అక్కడి ఖైదీలకు ఆయుధాలిచ్చి ఆ స్వాతంత్ర్య దళంతో ఒరిస్సాతీరమున దిగుదామని నా యెత్తు. ఆ నౌకలన్నీ మందుగుండుసామగ్రి తోను, తుపాకులతోను, యుద్ధానికి బాగా ఉపయోగపడేస్థితిలో ఉన్నై. నావికులు గూడా మంచి శిక్షణపొందిన సమర్థులే. నిర్బంధంనుండి తప్పించుకొని వారంతా వెళ్ళి పోవాలి. నావికోద్యోగులు యుద్ధాన్ని నడుపుతారు. ఇంకా కావలసిన ఆయుధ పరికరాలు చైనా దొంగవర్తకుల దగ్గర కొనవచ్చు. కాని ఈ చెలగాటానికి జర్మనులు సాహసించలేక పోయారు. నా యెత్తుగడ అంతా విఫలమైంది. నా ప్రణాళిక అమలు జరిగే సమయానికి జర్మను ప్రధాన రాయబారి మటుమాయమైనాడు. ఆయుధాలు

కొనటానికి చివరిదశలో డబ్బులేకపోయింది. ఐనా ఏదో రకంగా తంటాలుపడి జర్మనులవద్దనే ధనం సంపాదించి ఆబర్ల విప్లవానికి పంపించాను.

## రాస్ బిహారీ బోసుతో

పై సంఘటనలతో నాకు పూర్తిగా విసుగెత్తిపోయింది. ఐనా ఇంకా ఆశలు మాత్రం చావలేదు. జపానులోఉన్న రాస్ బిహారీబోస్ నాకు సహాయం చేస్తాడనే ఆశతో జపాను వెళ్ళాను. కాని అతని ఆలోచనలు నాకు ఆశ్చర్యాన్ని కలిగించినై. శ్వేతజాతుల బారినుండి అఖిల ఆసియా విముక్తికి జపానుచేసే మహత్తర సాధన ఫలితంగా ఇండియాకు స్వాతంత్ర్యం లభిస్తుందని రాస్ బిహారీ నమ్మకం. నేనూ జాతీయ వాదినే. జాతీయ ఐక్యతలో నాకూ గట్టినమ్మకం ఉంది. కాని నాడు జపాను బ్రిటనుకు మిత్రరాజ్యమనే సత్యాన్ని మరచిపోవటం నాకు సాధ్యంకాలేదు. ఆంగ్లేయుల నుండి స్వాతంత్ర్యం పొందటానికి వారి మిత్రదేశమైన జపానుపై ఆధారపడటం సబబుగా ఉంటుందా? అని నా ప్రశ్న. అంతర్జాతీయ వ్యవహారాలలో నా పసితనాన్ని చూచి రాస్ బిహారీ నవ్వాడు. "ఏదో ఒక ఆశయాన్ని సాధించటానికి మాత్రమే జపాను మిత్రరాజ్యాలపక్షాన యుద్ధంలో చేరింది; వారిమధ్య మైత్రి తాత్కాలికం. ఈ సందర్భంలో భారతీయ విప్లవకారులను జపాను ఎంత క్రూరంగా హింసిస్తున్నా బాధపడకూడదు; అఖిల ఆసియాకు నాయకత్వం వహించబోతున్న జపానులో మనం విశ్వాసం ఉంచి, ఓర్పుతో అవకాశంకోసం ఎదురుచూస్తూ ఉండటమే మన కర్తవ్యం" అని రాస్ బిహారీ వాదం.

ఈ సిద్ధాంతం పైకి బాగానే కన్పించవచ్చు. కాని నాకుమాత్రం తృప్తి నివ్వలేకపోయింది. సుఖంగా జపాను రాజకీయపోషణ ననుభవిస్తూ, జపాను వేస్తున్న అంతర్జాతీయ యెత్తుగడ ఫలించేవరకూ వేచియుండవచ్చు. ఈలోగా మా మిత్రులగతి యేంకావాలి? సుఖంమాట దేవుడెరుగు. ఇండో చైనా సరిహద్దులలో పర్వతప్రాంతాల్లో కొండజాతులమధ్య దినదినగండంగా గడుపుతున్నవారి గతి యేంకావాలి? జపానులో రాస్ బిహారీ పొందుతున్న రాజకీయ పోషణలో కించిత్తైనా నాకు లభించలేదు!

## సన్‌యట్‌సేన్‌తో

ఇక నాదారి నేను చూచుకోవలసిందే. పొరజూడగా చైనా జాతీయ నాయకుడైన సన్ యట్ సేన్ కన్పించాడు. 1913 లో రెండవ చైనా విప్లవం—అంటే నాన్‌కింగ్ తిరుగుబాటు—విఫలమైన తరువాత జపానులో తలదాచుకొంటున్నాడు సన్ యట్ సేన్. జపాను వహిస్తున్న 'ఆసియా విముక్తి బాధ్యతను' అధికార స్వరంతో వివరించి చెప్పి ఓర్పు వహించివలసిందని నా కాతడు సలహా ఇచ్చాడు. ఈ చైనా నాయకుని గురించి, ఇండియాలో ఉండగా చాల విన్నాను. వస్తుతః,

భగవత్స్వరూపులే నాయకులు అని నమ్మే సంప్రదాయంగల భారతజాతిలో జన్మించటంవల్ల సన్ యట్ సేన్ కూడా అవతారమూర్తియనే నమ్మాను. కాని అతణ్ణి చూచిన తర్వాత మాత్రం, అతనికి మోకరిల్లి నమస్కరించటానికి మనస్కరించలేదు. అందుకు కారణం ఆజన్మ విప్లవవాదికుండే జిజ్ఞాస కాకపోవచ్చు; సంప్రదాయాలతో ప్రోదిచేసుకున్న ఆ మూఢవిశ్వాసాన్ని మా మిత్రులపట్ల నాకున్న స్నేహపూర్వక విశ్వాసం ధిక్కరించింది. చిన్నతనంనుండీ కూడా నాలో విశ్వాసమూ, తిరుగుబాటూ కుస్తీపడుతూనే ఉండేవి; అదంతా మరొక పెద్దగాథ.

ఐరోపా వానిషత్యంనుండి ఆసియా దేశాలను విముక్తి చేయటం జపాను స్వార్థంలో ఒక ముఖ్యాంశమని సన్ యట్ సేన్ విశ్వాసం. ఏదైనా అనివార్య కారణంచేత జపాను ఆసియావిముక్తిని సాధింపలేకపోతే, అమెరికా ఆ పనికి పూనుకో గలదని అతడు భావిస్తున్నాడు. అతని విశ్వాసాలన్నిటికీ క్రైస్తవమతమే ఆధారం. ఆసియా ప్రజలు రాజకీయంగా విముక్తిపొంది, సాంఘికంగా పురోగమించటానికి క్రైస్తవమతం తప్పక పుచ్చుకోవాలని స్పష్టంగా చెప్పాడు సన్ యట్ సేన్. ఈ సంగతులన్నీ విచారించటానికి నేనింకా చిన్నవాణ్ణే. తెల్లజాతులను యెదిరించటానికి ఆసియా ప్రజలలో ఐక్యత అవసరమనే సిద్ధాంతమే ఆతని సహాయం కోరమని నన్ను ప్రోత్సహించింది.

ఆసియా జాతీయ ప్రవక్తయైన సన్ యట్ సేన్ బ్రిటనుపై కత్తిగట్టిన ఇండియాకు సహాయం చేయటానికి నిరాకరించాడు; అంతటితో పైన చెప్పిన 'జాతుల ఐక్యత' అనే సిద్ధాంతంలో నాకు విశ్వాసం సడలిపోయింది. సన్ యట్ సేన్ వాదనంతా అవకాశవాదంపైనే ఆధారపడింది. దక్షిణ చైనాలో అతని విప్లవ కార్యక్రమానికి కేంద్రమైన హాంకాంగ్ బ్రిటిషువారి చేతుల్లో ఉండటంచేత బ్రిటను నెదిరించటం ఆతనికి అసాధ్యమైంది. ఇక చైనా విషయంలో జపానుకు పూర్తిస్వేచ్ఛ ఇవ్వటానికి అతని కేమాత్రమూ అభ్యంతరంలేదు. 'జపానువారు ముందు ఐరోపావారిని ఆసియానుండి తరిమివేస్తారు; తరువాత జాతీయ, సాంస్కృతిక ఐక్యతాసూత్రంపై జపాను, చైనాలొక సమాధానానికి రాగలవు' అని సన్ యట్ సేన్ వాదన. నా జాతీయ భావోద్రేకానికి అది ఉత్సాహకరంగా కన్పించినప్పటికీ ఆలోచించి చూచినకొద్దీ అదంత సమంజసంగా తోచలేదు. అందుచేత ఈ సిద్ధాంతమే ఇండియాకు గూడ వర్తిస్తుందన్నప్పుడు నేను సమ్మతించలేను. తెల్లవారిని తరిమివేసిన తర్వాత నిదానంగా చైనాను, తర్వాత ఇండియాను విముక్తి చేస్తుందట జపాను. అంతవరకు మనం వేచియుండాలి!

# చైనాకు రహస్య ప్రయాణం

## సన్‌యెట్‌సేన్‌తో ఒప్పందం

**1915** సంవత్సరం చివరిలో యువాన్‌షికాయ్ తానే చక్రవర్తిగా చైనాలో రాచరికాన్ని పునరుద్ధరించటానికి ప్రయత్నిస్తున్నాడు. అతని యత్నాలను ప్రతిఘటిస్తూ బర్మా - ఇండియా సరిహద్దుల్లో ఉన్న యూనాను, జెషువాన్ రాష్ట్రప్రజలు తిరుగుబాటులు ప్రారంభించారు. దీనినే మూడవ చైనా విప్లవమని వర్ణిస్తుంటారు. ప్రవాసం (జపాను)లో ఉన్న సన్‌యట్‌సేన్ ఈ విప్లవానికి కూడా కారణమని నేను భావించటం సహజం. ఆ ఉద్దేశ్యంతోనే సన్‌యట్‌సేన్‌తో కలిసి ఒక వ్యూహం పన్నాను. యూనాను, జెషువాను రాష్ట్రాలనుండి ఇండియాకు ఆయుధాలు పంపితే స్వాతంత్ర్య పోరాటంలో చైనా, ఇండియా ప్రజల మధ్య ఐకమత్యాన్ని నెలకొల్పవచ్చని సన్‌యట్‌సేన్‌కు సూచించాను.

అందుకతడు సమ్మతించి, జెషువాను విప్లవకారులవద్ద ఉన్న ఆయుధాలు కొనటానికి 50 లక్షల డాలర్లు అవసరమనీ, ఆ ధనం కోసం చైనాలోవున్న జర్మను రాయబారిని కలుసుకొమ్మనీ నాకు సలహా యిచ్చాడు. డబ్బు దొరికితే, దానితో యువాన్‌షికాయ్ అనుచరులను కూడా త్రిప్పివేయవచ్చు. ఇక, ఆయుధాలతో ప్రమేయమే లేకుండా మూడవ చైనావిప్లవం విజయవంతమౌతుంది. ఆ ఆయుధాలన్నీ ఇండియా సరిహద్దులలో నా వశం చేయబడతై; ఈ ఎత్తు బాగానే ఉంది. అందుచేత వెంటనే జర్మన్ రాయబారితో సంప్రతించటానికై నేను పీకింగ్ వెళ్ళాలి. పీకింగ్‌లో నా యత్నం ఫలించిందని తెలియగానే మా ఒప్పందాన్ని అమలు జరపటానికై తన ప్రతినిధిని యూనాను రాష్ట్రానికి పంపిస్తాడు సన్‌యట్‌సేన్. తర్వాత స్వయంగా నేను షాంఘై వెళ్ళి అక్కడే సన్‌యట్‌సేనుకు డబ్బు యిచ్చి, ఆయుధాలు వశపరచుకోటానికై ఇండియా సరిహద్దులకు వెళ్ళాలి. అప్పుడే "వెండి గుండ్ల"తో యువాన్‌షికాయ్‌పై యుద్ధం ప్రారంభించటానికి సన్ ప్రయాణం కడ్తాడు.

నాలో ఉరకలు వేస్తున్న సాహసానికీ పథకం బాగా నచ్చింది. ఇండియా సరిహద్దుల్లో గొప్ప సైన్యాన్ని తయారుచేయాలనే నా కలలు ఫలించవచ్చు. ఆ ఉద్రేకంలో సన్‌యట్‌సేనుతో సంబంధించినంత వరకూ నా ప్రణాళికలోగల అసందర్భాలను గమనించలేకపోయాను. కాని కొన్ని సంవత్సరాల తరువాత నవ చైనా చరిత్రను, అచట జరిగిన అనేక విప్లవాలను పరిశీలించినప్పుడు, మూడవ చైనా విప్లవాన్ని సన్‌యట్‌సేను సమర్థించలేదని తెలుసుకొన్నాను. అందుకు కారణమేమంటే ఆ విప్లవానికి నాయకత్వం వహించినవాడు యూనాను రాష్ట్ర

గవర్నరు. అతడు లియాన్ చాయ్ చావో అనే లిబరల్ రాజకీయ తత్త్వవేత్తకు శిష్యుడు. అందుచేత సన్‌యట్‌సేను ఆ విప్లవాన్ని బలపరచటానికి నిరాకరించాడు.

ఏమైనాసరే, జపాను దేశాన్నిమాత్రం త్వరలో విడిచిపెట్టాలి; చైనా ఒక్కటే గమ్యస్థానంగా కన్పించింది. నాగసాకీ (జపాను) లో దిగినప్పటినుండి పోలీసులు నన్నొక కంట కనిపెడుతూనే ఉన్నారు. రాస్‌బిహారీని నేను కలిసికొనే యేర్పాటుచేసే వ్యక్తి టోకియోలో ఉన్నాడు. రహస్యంగా అతనిని కలుసుకొన్నాను. ఐనా మా సంగతంతా పోలీసులు పసిగట్టారు; పోలీసు ఉన్నతాధికారి నా బసకు వచ్చాడు; నేను జపాను యెందుకు వచ్చిందీ, రాస్‌బిహారీని కలిసికొన్నదీ, లేనిదీ ఇంకా ఏవేవో విషయాలను గురించి ప్రశ్నించాడు. రాస్‌బిహారీని కలిసికోలేదని చెప్పగానే నిర్లక్ష్యంగా నవ్వి వెళ్ళిపోయాడు. నిర్లక్ష్యంగా నవ్వటం జపానువారి లక్షణాల్లో ఒకటి! రెండురోజుల తర్వాత రాస్‌బిహారీ రహస్య ప్రతినిధివచ్చి, 24 గంటలలో జపానును విడిచి వెళ్ళాలనే ఉత్తరువు నాకు అందబోతోందనీ, వెంటనే ప్రయాణం కట్టకపోతే షాంఘైలో నిర్బంధం తప్పదని చెప్పాడు. నేనూ వెళ్ళటానికే నిశ్చయించుకొన్నాను; జపానులో తనకున్న పలుకుబడితో రాస్‌బిహారీ నాకు సహాయం చేయకపోగా, సలహా గూడా ఇవ్వలేక పోయినాడే అని ఆశ్చర్యం కలిగింది. ఇక చైనా వెళ్ళటమే మంచిది.

## రహస్య ప్రయాణం

జపానులో ఉండి చేసేదేమీలేదు; పైగా సన్‌యట్‌సేన్‌తో అప్పటికే ఒడంబడిక చేసికొనియుండటంచేత చైనా ఎటూ వెళ్ళకతప్పదు. కాబట్టి వెంటనే వెళ్ళటమే మంచిది. కొరియాగుండా వెళ్ళాలని ముందుగానే నిర్ణయించుకొన్నాను. జపాను వేటకుక్కలను (పోలీసులను) తప్పించుకోవటం చాలాకష్టం. ఆ సాయంకాలం ప్రభుత్వ అంగడికి వెళ్ళాను. అది ఏడంతస్తులభవనం; లోపల వరండాలోను, గదులలోనూ, తివాచీలు పరచిఉంటై. వాటినిండా దుమ్ము పడకుండా ఒక యేర్పాటుంది; లోనికి వెళ్లేవారు ద్వారంలోనే తమ జోళ్ళను విడచి అక్కడ ఇచ్చే గుడ్డజోళ్ళను ధరించి లోనికివెళ్ళాలి. అలాగే నేను లోనికివెళ్ళాను. తిరిగి నా చెప్పులను తీసుకోవటానికైనా బైటికి రాలేదు. వేరొక వాకిలిగుండా బైటపడి తిన్నగా రైలు స్టేషను చేరాను. ఒక గంటతర్వాత షిమొనెస్కీ వెళ్ళే బండి కదిలింది. నన్ను వెంటాడిన నల్గురు గూఢచారుల కళ్ళల్లో కన్పించిన క్రోధం నా నవనాడులను క్రుంగదీసింది. ఐనా వారి కళ్ళల్లో దుమ్ముకొట్టగలిగాను. మరునాడు పూసా చేరాను. ముక్డెన్‌కు నేరుగా టిక్కట్టుకొని, న్యూలుకు వెళ్ళే రైలు ఎక్కాను. న్యూలుదగ్గర సూటిదారి తప్పించి, మూల్పోరేవు చేరాను. అక్కడినుండి పచ్చసముద్రంమీదుగా షాంఘైక్యాన్ గాని, టీన్‌ట్సిన్‌గాని చేరాలని నా సంకల్పం. టీన్‌ట్సిన్‌లో గదర్‌పార్టీ

ప్రముఖనాయకు డొకడున్నట్లు రాస్‌బిహారీ చెప్పాడు. ఐనా జపాను పోలీసులు నా వెంట రావటంలేదని ముందుగా ధృవపరచుకోవాలి. అందుకని నా మార్గాన్ని మరి కొంత మార్పుచేయాలనే ఉద్దేశ్యంతో షాంఘైక్వాన్‌కు ప్రయాణం యేర్పాటుచేసి రహస్యంగా డైరన్‌దగ్గరనే దిగి రైలులో ముక్డెన్ చేరి, అక్కడ పీకింగ్ రైలుకు మారాను. పచ్చసముద్రంమీద చేసిన ప్రయాణం చిన్నదే ఐనప్పటికీ శీతాకాలం కావటంచేత చాలా బాధపడ్డాను. అదీగాక నేను ప్రయాణంచేసింది జపాను వర్తక నౌక కావటంచేత భోజనంగాని, విశ్రాంతిగాని బాగా లభించలేదు. ఇక నన్నెవరూ వెంబడించటంలేదనే నమ్మకంతో పీకింగ్‌కు వెళ్ళే రైల్లో విశ్రాంతి తీసుకున్నాను.

టిక్కట్టు పీకింగ్ నగరానికే కొన్నప్పటికీ, నేరుగా వెళ్ళే బండిని షాంఘై క్వాన్‌దగ్గర దిగి, ఆ రాత్రి అక్కడే గడిపి, ఒక 'లోకలు' బండిలో టీన్‌స్టిన్ చేరాను. అక్కడ ప్లాట్‌ఫారంమీద ఒక ఆంగ్ల సామ్రాజ్యవాది తారసిల్లి : "మిష్టర్ వైట్! గుడ్ ఆఫ్టర్ నూన్" అన్నాడు.

జపానులో ఉన్నప్పుడు నా పేరు వైట్. ప్రక్కవారితో మాట్లాడు తున్నట్లు నటించి తప్పుకోవటానికి ప్రయత్నించాను. కాని నన్నతడు విడిచిపెట్టలేదు. నా అడుగులో అడుగువేస్తూ అర్ధస్వరంతో తిరిగి అన్నాడు- "మీ గమ్యస్థానం చేరే ముందు కొంచెం నా వెంట వస్తారా?"

"ఎక్కడికి? ఎందుకు?" అని అడిగాను.

"పోలీసుస్టేషనుకు. నేను బ్రిటిష్ పోలీసు దళాధికారిని" అన్నాడు.

అంతకు పూర్వమే, స్టేషను రష్యాప్రాంతములో ఉన్నదనీ, ఎదురుగా కన్పించే రోడ్డుకు అవతల జర్మనుప్రాంతమనీ తెలుసుకున్నాను. అందుకని మరోమారు ప్రయత్నించి చూద్దామనే ఉద్దేశ్యంతో :

"ప్రయాణంలో పూర్తిగా అలసిపోయాను. ఏదైనా మంచిహోటలుకు వెళ్ళి విశ్రాంతి తీసుకోవాలి. ఐనా మనం ఉన్నది బ్రిటిషు ప్రాంతంలో కాదను కుంటాను" అన్నాను.

"చాలాబాగుంది; నా ధర్మం నాకు తెలుసు. మిమ్మ్ము ఎక్కువసేపు విసిగించము పదండి" అన్నాడు అధికార స్వరంతో. రోడ్డుమీద ఉన్న కారును సమీపించాము.

పోలీసుస్టేషనులో ఏవో మామూలు ప్రశ్నలు వేసి చివరకు "మీరీరాత్రి ఇక్కడే గడపవలసి వస్తుందేమో. సాధ్యమైనంతవరకు మీరు సుఖంగా ఉండే యేర్పాట్లు చేస్తాము. భోజనం హోటల్ ఆస్టర్ నుండి వస్తుంది. జపానునుండి ఒక సమాచారంకొరకు ఎదురుచూస్తున్నాం" అన్నాడు.

పట్టుబడ్డానురా భగవంతుడా అని హతాశుడనైనాను. ఐనా సాహసమంతా కూడగట్టుకొని ప్రశ్నించాను - "నేను వస్తున్నట్లు మీకెలా తెలిసింది ?"

"జపాను పోలీసులు చాలా చాకచక్యం గలవారు. గుడ్ నైట్" అని నవ్వుతూ వెళ్ళిపోయాడు.

## బ్రిటిషు వారి బోనులో

ఇనుప కటకటాల వెనుక ఉండిపోయాను. సాయుధులైన భటులిద్దరు వాకిట్లో కాపలా కాస్తున్నారు. వారు శిక్కులు. కొద్దిసేపట్లో వారి స్థానంలో ఇద్దరాంగ్లేయులు వచ్చారు. నిర్బంధం నాకు కొత్తగాదు. విచిత్ర మేమంటే అట్టి పరిస్థితుల్లో నేను గంటలతరబడి నిద్రపోగలను. ఉదయం భోజనం వచ్చింది. అది ఐన వెంటనే పోలీసు అధికారి వచ్చాడు.

"కాన్సలేటుకు (రాయబారి కార్యాలయానికి) రావటానికి సిద్ధంగా ఉన్నారా ?" అన్నాడు.

మారు మాటాడకుండా అతన్ని వెంబడించాను. దారిలో నా చెవిలో ఊదాడు : "కాన్సలర్ న్యాయస్థానంలో మిమ్మ హాజరు పెడ్తున్నాం."

"నా నేర మేమిటి ?" అని అడిగాను.

"రిపోర్టుకోసం ఎదురు చూస్తున్నాం" అన్నాడు.

ప్రధాన కాన్సలు సింహాసనంలాంటి కుర్చీలో, బూజుపట్టిన ధనికవాద శీవిలో కూర్చుని ఉన్నాడు. కొంచెం వయసు మళ్ళినవాడు; మనిషి అంత ఆరోగ్యంగా ఉన్నట్లు కన్పించలేదు. దయగా, మర్యాదగా మాట్లాడాడు. నేను జపాను ఎందుకు వెళ్ళిందీ, విప్లవకారుడైన రాస్‌బిహారీ ప్రతినిధిని జపానులో ఎందుకు కల్సుకొన్నదీ, ఇక ముందు నా కార్యక్రమాన్ని గురించీ ప్రశ్నించాడు. పాపభీతి నటిస్తూ చెప్పాను -- "ఇంగ్లండులో విద్యాభ్యాసం చేయాలని నా ఆశయం; అందుకు యుద్ధం అడ్డు తగిలింది. ఐనా విదేశాల్లో విద్యాభ్యాసం చేయాలనే ఉత్సాహం తగ్గక పోవటంవల్ల జపాను వెళ్ళాను; ఇబ్బందులలో చిక్కుకొన్నాను. నేను ప్రయాణం చేస్తున్న నౌకలో ఒకరు టోకియోలో ఒక చిరునామా ఇచ్చి అవసరమైతే అక్కడ నాకు సహాయం లభించగలదని చెప్పారు. నాకా భాష అర్థం కాకపోవటంచేత అతడొక భారతీయుడనీ, నాకు తప్పక సాయం చేస్తాడనీ ఆశించాను. కాని వెంటనే తప్పుచేశానని గ్రహించాను. పోలీసులు నిర్బంధించారు. భయపడి ఇంటికి పోదామని నిశ్చయించాను. ఐనా దారిలో కొంచెం ప్రపంచం చూడాలనే అభిలాషతో చైనా వచ్చాను. ఇక్కడా వుండాలనే వాంఛ లేదు. నేరుగా ఇండియా వెళ్ళటమే నా సంకల్పం."

కాన్సలు జనరలు శ్రద్ధగా విని నా కథను నమ్మినట్లే కన్పించాడు. నా కథనం ముగిసినంతనే పోలీసు అధికారిని పిలిచి "జపానునుండి సమాధానం వచ్చిందా?" అని అడిగాడు.

"లేదు. ఎప్పటికైనా రావచ్చు" అని గంభీరంగా జవాబిచ్చాడు పోలీసు అధికారి.

ఈ పరిస్థితిలో ఆంగ్లేయుల న్యాయ విచక్షణాదృష్టి నన్ను కాపాడింది.

"కాలవ్యవధి లేకుండా ఇతణ్ణి నిర్బంధించి ఉంచటం సబబు కాదు" అంటూ నా వైపు తిరిగి, కాన్సలు : "నీవు చిక్కుల్లో పడ్డావు; ఒకటి రెండు రోజు లిక్కడే హోటలులో గడిపి ఇండియాకు తిరిగివెళ్ళాలి. ఈ ప్రాంతాలలో అనేక విప్లవాలు జరుగుతున్నాయి. వాటితో జోక్యం పెట్టుకోకు" అన్నాడు తండ్రి కొడుకును గదమాయిస్తున్న ధోరణిలో.

పశ్చాత్తాపాన్ని, విధేయతను నటిస్తూఉన్నా నాలో రేగిన కొంటెభావాన్ని ఆపుకోలేక "నాకే ఆటంకాలు రాకుండా ఇండియా వెళ్ళటానికి పాస్‌పోర్టును కాన్సలు నాకు దయచేయగలరా?" అని అడిగాను. నా సాహసానికి పోలీసు అధికారి నివ్వెరపోయాడు. వృద్ధుడు కూడా హఠాత్తుగా గాంభీర్యాన్ని వహించి "వీల్లేదు నీవు బ్రిటిష్ పౌరుడవని మాకెలా తెలుసు ?" అని గద్దించాడు.

తడుముకోకుండా వెంటనే తిరిగి ప్రశ్నించాను— "బ్రిటిష్ పౌరుడనని తెలియకపోతే నన్ను మీ పోలీసు లెందుకు నిర్బంధించారు ?"

వృద్ధుడు కొంచెం కలవరపడి— 'అవన్నీ ధర్మసూక్ష్మాలు' అన్నాడు.

ఏది ఏమైనా, ఆంగ్లజాతి స్వభావంలో జీర్ణించిన 'విచారణ లేకుండా నిర్బంధించరాదు' అన్న న్యాయదృష్టిని ఆ వృద్ధకాన్సలు విడువలేక పోయినాడు.

"నేరాన్ని బలపరచే సాక్ష్యం లభించేవరకు ఇతన్ని విడిచిపెట్టాల్సిందే" అని పోలీసు అధికారిని ఆజ్ఞాపించాడు.

పోలీసు అధికారికి చాలా కోపం వచ్చింది. వరండాలోకివచ్చి కాన్సలును అతడు దూషించటం స్పష్టంగా విన్నాను.

"ఏ హోటలుకు వెళతావు ?" అని అడిగాడు.

"ఏదైనా మంచిహోటలుకు" అన్నాను.

"ఇక్కడ ఒక్కటే మంచిహోటలు ఉంది. అదీ బ్రిటిష్ ప్రాంతంలోనే" అన్నాడు.

"నేనూ బ్రిటిష్ పౌరుణ్ణే. అక్కడికే వెళుతాను" అన్నాను నిర్లక్ష్యంగా. ఒక రిక్షానుపిలిచి 'ఆస్టోరియా' అని ఆదేశించాడు.

## ఆ శా భ ం గ ం

ఆస్టోరియా మంచిహోటలే. నాకు ముఖ్యంగా కావలసింది వేడి నీటి స్నానం; మంచి భోజనం. అవి అక్కడ లభించినై. తర్వాత పట్టణం ఏమూల ఏమున్నదో తెలుసుకోటానికి ఒక పటం సంపాదించాను. సాయంత్రం రిక్షాలో చైనీయ ప్రాంతానికి వెళ్ళాను. నదీతీరానికి సమీపంగా వెళ్ళాలని నా ఉద్దేశ్యం. నదికి ఆవలివైపునే వున్నది జర్మన్ ప్రాంతం. రెండు రిక్షాలు నన్ను వెంబడిస్తున్నట్లు గ్రహించాను. చీకటి పడుతోంది. ఒక పెద్ద షాపులో ప్రవేశించి పచార్లు ప్రారంభించాను. నన్ను వెంబడించినవారు విసిగిపోయి యెదురుగావున్న టీ షాపులోకి వెళ్లారు. వేరొక ద్వారంగుండా ఒక ఇరుకు గొందిలోపడి సునాయాసంగా నదీ తీరం చేరాను. పడవలో నదిని దాటాలి. పడవ నడిపేవాడికి ఒక చైనా నాణెమివ్వాలి. అవి నా దగ్గిర లేవు. అందుకని అతని చేతిలో ఒక వెండినాణెం పెట్టాను. సంతోషంతో, మిగిలిన ప్రయాణీకుల నందర్నీ ఆపి, నన్నతడు ఆవలి గట్టుకు చేర్చాడు. రెండు నిముషాల్లో సురక్షితప్రాంతం చేరుకొన్నాను. మరునాడుదయమే జర్మన్ ఉద్యోగులతో సంప్రదింపులు జరిపాను.

## జర్మనుల వాగ్దాన భంగం

నా పథకం విజయవంత మౌతుందని భావించటమే నే చేసిన పొరపాటు. కారణమేమంటే ఒప్పందం ప్రకారం నా పాత్రను నేను నిర్వహించినప్పటికీ, యూనాను రాష్ట్ర గవర్నరు (3వ చైనా విప్లవకారుడు) సన్ యట్ సేన్ ప్రణాళికను అంగీకరిస్తాడనే నమ్మకం లేదు. ఐనా నా పథకం ఆలోచించదగినదే నని జర్మను రాయబారి అంగీకరించాడు.

యువాన్ షికాయ్ చైనా సింహాసన మెక్కకుండానే మరణించాడు. అంతటితో చైనాలో రాజరిక పునరుద్ధరణ ప్రసక్తి అడుగంటింది. అందుచేత 3వ విప్లవం అర్థరహితమైంది; అంటే ఆ విప్లవకారులకు ఆయుధా లక్కరలేదు. ఆయుధాలను కొనాలనే నా ఆశ బలపడింది. అందుకు కావలసిన ధనం కోసమే జర్మనులను కలుసుకొన్నాను. వారు నా ప్రణాళికలోని లోపాలను చూపించారు. "షాంఘైలో ఉన్న సన్ యట్ సేను కిచ్చిన డబ్బుకు ప్రతిఫలంగా, యూనాను రాష్ట్రంలోని ఒక అపరిచిత వ్యక్తి తన స్వాధీనంలోనున్న ఆయుధాలను మన స్వాధీనం చేస్తాడని నమ్మటమా?" అన్నారు జర్మనులు. నాకు కోపం వచ్చింది. ప్రఖ్యాత

చైనా నాయకుని యోగ్యతపట్ల తెల్లవారి కింత అనుమానమా! కోపంవచ్చి నేను చేసేది మాత్రం యేమున్నది? ఐనా, ఈ లోపాలన్నీ తొలగించితే జర్మనుల ధన సహాయం పొందవచ్చనే ఆశతో బయలుదేరాను; అనేక గండాలు గడిచి యూనాను చేరి గవర్నరును కలుసుకొన్నాను.

హాంకాంలో జర్మను కాన్సలు సమక్షంలో యూనాను నాయకుని ప్రతినిధితో ఒడంబడిక జరిగింది. ఆ ఒడంబడిక ప్రకారం మధ్యవర్తులతో ప్రమేయం లేదు. జర్మనులు ఆయుధాల ఆసామికే డబ్బు ముట్టజెప్పవచ్చు; అస్సాము ఈశాన్య సరిహద్దులలో ఉన్న కొండజాతుల ప్రాంతానికి ఆయుధాలను చేర్చటానికి యూనాను ప్రతినిధి సమ్మతించాడు. కొన్ని వేలమందికి కా ఆయుధాలు సరిపోతై. ఈ ఒడంబడిక చేసుకొని పీకింగ్ చేరాను.

ఈ లోగా మరొక తాత్కాలిక ఒప్పందం జరిగింది. మరికొంత ధనంతో టిబెట్ సరిహద్దులో ఉన్న జెషువాన్ రాష్ట్రానికి ముఖ్యపట్టణమైన చెన్‌గ్టులోని ఆయుధ కర్మాగారంనుండి భారతీయ విప్లవ సైన్యానికి ఆయుధాలు సరఫరా చేయటానికి యేర్పాట్లు జరిగినై. సాదియా సమీపంలో ప్రయాణానికి వీలుగా బాట కూడా ఉంది.

1916 ప్రారంభంలో ఇండియాలో దేశరక్షణకు కావలసినంత సైన్యంలేదనే చెప్పవచ్చు. అక్కడక్కడ ఉన్న భారతీయ సైనికోద్యోగులా నామమాత్రమైన సైన్యాన్ని విడిచిపెట్టి ప్రజాఉద్యమంలో చేరటానికి సిద్ధంగా ఉన్నారు. వారందరితోనూ 1915 లోనే యేర్పాట్లు జరిగినై. పరిస్థితులన్నీ సాయుధ విప్లవానికి అనుకూలంగా ఉన్నై.

ఇంతటి మంచి తరుణంలో జర్మనులు వాగ్దానభంగం చేశారు. అసలు ఇండియాకు సహాయం చేయాలన్న తలంపే వారికి లేదని తర్వాత గ్రహించాను. నా ప్రణాళిక విశ్వాసపాత్రమైనదని, అవశ్యాచరణీయమని సమ్మతించి కూడా జర్మను రాయబారి అంత పెద్ద మొత్తాన్ని ఖర్చుచేయగల సమర్థత తనకు లేదని విచారించాడు. ఆ సమయంలో నా కోపానికి మేర లేకపోయింది.

"యూరప్‌లో యుద్ధం చేయటానికి ధనరూపంలోనూ మానవరూపంలోను ఎంత ఖర్చవుతుంది?" అని అడిగాను.

"నీవేం మాట్లాడుతున్నావో నీకే అర్థం కావటంలేదు" అన్నాడు తన పోషణలో ఉన్న నల్లజాతి కుఱ్ఱవాడింతటి తలబిరుసు ప్రశ్న వేస్తాడని ఊహించికూడా ఉండనట్లు. అతని మాటతో నా కోపం ఇనుమడించింది.

"ఇండియాను కోల్పోయిన బ్రిటిషువారికి యిరోపాలో పరాజయం తథ్యం. అందుచేత ఒక మహాయుద్ధంలో విజయాన్ని సాధించటానికి 50 లక్షల డాలర్లొక లెక్కా?" అని అడిగాను. చివరకు విసుగెత్తి "ఇండియాలో మేము సాగిస్తున్న పోరాటం జర్మనీకోసం కాదు" అనేశాను. ఇక అతనితో వ్యవహారం తేలిపోయింది.

తర్వాత జర్మన్ రాయబారి నన్ను బుజ్జగించటానికి ప్రయత్నించాడు. బెర్లిన్ వెళ్ళి అక్కడ ఉన్నతాధికారికి నా పథకం చూపించవలసినదిగా సలహా ఇచ్చాడు. చివరి మాటలుగా "విదేశ సహాయం లేకుండా మీ దేశాన్ని మీరు చక్కబెట్టుకో గలరా?" అని ప్రశ్నించాడు.

చప్పున అతనివైపు తిరిగి "స్వాతంత్ర్య పోరాటంలో సహాయం చేయటం వల్ల భవిష్యత్తులో మాకు సలహా ఇచ్చే యోగ్యత పొందగలమని మీరు భావించారా?" అన్నాను.

తన నిస్సహాయతను, విచారాన్ని వెల్లడిస్తూ నవ్వి — "మీలాంటివారు ఇండియాలో ఎంతమంది ఉన్నారు?" అని ప్రశ్నించాడు.

"మాది బ్రహ్మాండమైన విప్లవ వీరుల సమాజం. దానికి నేనొక ప్రతినిధిని మాత్రమే" అని సమాధాన మిచ్చాను.

ఈ జర్మను రాయబారి పేరు అడ్మిరల్ వాన్‌హిన్‌ట్సు. తరువాత అతడే జర్మను సామ్రాజ్యానికి చివరి యుద్ధమంత్రిగా పనిచేశాడు. నేను సూచించిన ప్రణాళిక సైనికంగా బాగున్నదనీ, జర్మనులు పెద్దయెత్తున డబ్బు ఖర్చుచేయ తగినదేననీ, కాబట్టి నేను జర్మనీకెళ్ళి అక్కడ అధిష్టాన వర్గంతో సంప్రతించటం శ్రేయస్కరమనీ సలహా యిచ్చాడు. కాని ఇతనితో మాట్లాడిన తర్వాత, బ్రిటిష్ సామ్రాజ్య పీడితులఎడల జర్మనీ సానుభూతి వహించిందని నాలో ఇంకా దాగియున్న విశ్వాసం పూర్తిగా పోయింది.

ఐనా చేసేదేమీ లేకపోవటంవల్ల అమెరికాలోని జర్మను రాయబారిని, తర్వాత బెర్లిన్‌లోని సైనిక ప్రముఖులను కలిసి ప్రయత్నించవచ్చుని భావించాను. అదీగాక అమెరికాలో ప్రవాసం అనుభవిస్తున్న భారత విప్లవకారులను గురించి ఎంతగానో వింటున్నాము. వారిని కూడా చూడాలనే ఉబలాటం కలిగింది. కాని పసిఫిక్ మహాసముద్రాన్ని దాటటం చాలా కష్టం. అందులో పాస్‌పోర్టుకూడా లేదు; అమెరికా సంచారచట్టం భారతీయులపై ప్రత్యేక కఠిన నిబంధనలు విధించింది. స్వామి వివేకానందుని విజయ యాత్రల తర్వాత గూడా అమెరికా భారత దేశాన్ని గుర్తించలేదు!

జర్మన్ రాయబారి సలహాపైనే, నేను అమెరికా వెళుతున్నాను; అందుచేత అతని అనుచరులు, ఇంకా ఇతర పెద్దలు నా ప్రయాణానికి తోడ్పడ్డారు. ట్యూటన్ జాతికి చెందిన అమెరికను వర్తకనౌకలో నా రహస్యప్రయాణానికి యేర్పాట్లుజరిగినై. ఇదంతా బ్రిటిష్ పోలీసులు గమనించకపోలేదు! ముందుగా షాంఘైచేరాలి. అందుకై పీకింగ్ నుండి హాంకౌకు రైలులో వెళ్ళాను; అక్కడనుండి యాంగ్‌ట్సీ నదిమీద స్టీమరులో నాన్‌కింగ్ చేరాను. షాంఘై చేరగానే నన్ను గూఢచారులు పట్టుకో వచ్చుననే భయం కలిగింది; అందుకని నాన్‌కింగ్, ఫ్యూకౌ నగరాలమధ్య నదిలో నున్న జర్మన్ యుద్ధనౌకలో ప్రవేశించాను; ఆ నౌకలోనే గదర్ పార్టీ నాయకుడైన భగవాన్‌సింగ్ ఉన్నాడు; బర్మాలోనున్న ఇండియా సిపాయిలను ప్రోత్సహించి, వారిచేత తిరుగుబాటు చేయించటానికి ప్రయత్నించాడు; కాని ఆ ప్రయత్నాలు ఫలించకపోవటంచే అతడు తిరిగి అమెరికాకు వెళుతున్నాడు; నాతోబాటు అతడు కూడా రహస్యప్రయాణీకుడు.

భగవాన్‌సింగ్:

ఆ యుద్ధనౌకలో వారంరోజులు జర్మన్ అతిథులుగా కాలక్షేపం చేశాం. ఆ వారంరోజులలోనే భగవాన్‌సింగ్ సహవాసం అంత యోగ్యమైనది కాదని గ్రహించాను. అప్పటి కాతనికి 50 సంవత్సరాలు నిండినై; అజానుబాహు విగ్రహం; తన జాతి సైనికస్వభావాలతోబాటు, అమెరికా పురుషత్వంలోని అవగుణాలను చాలా అలవరచుకున్నాడు. అతని అవసరాలలో ప్రధానమైనవి తిండి, త్రాగుడు. షాంఘై నుండి అమెరికా చేరటానికి కొంత నెలరోజులు పడుతుంది. ఆ నెలరోజులు ఇబ్బంది లేకుండా గడపటానికి కొన్నిడజనుల బీరుసీసాలు, తినుబండారాలు జాగ్రత్తచేసి ఉంచుకొన్నాడు. ప్రయాణం సాధ్యమైనంతవరకు సుఖప్రదం చేసికోవాలనే అతని తాపత్రయం.

చివరికి ఒకనాటి వుదయం షాంఘైలో ఒక వర్తకనౌకలోనికి మమ్మ రహస్యంగా చేరవేశారు. అందులో మాకు లభించిన జాగా సుఖప్రయాణానికి వీలుగాలేదు; చుక్కానికి కుడివైపునుండే నావికుని గది క్రింద ఇరుకుసందులో కూర్చొని కాలక్షేపం చేయాలి. అది ఎంత హాయిగా ఉంటుందో మీరు ఊహించుకోగలరు! ఓడ కదిలీకదలకముందే ఒక ముసలి నావికుడు పరుగెత్తుకొంటూ వచ్చి బ్రిటీషు పోలీసు దళం సోదా చేయటానికి వస్తున్నదనీ, కాబట్టి మేము దాక్కోవాలనీ చెప్పాడు.

తొందరగా 'బంకు' క్రింద ఒకచెక్కను ఊడపీకాము. అచ్చట ఒక చీకటి కన్నం బైటపడింది. అందులోదూరి బోర్లగాపరుండాలి. ఆ కన్నం చాలచిన్నది కావటం చేత, ఇద్దరు నావికులు బలవంతంగా నన్నూ, భగవాన్ సింగునూ లోపలికి నెట్టారు. తరువాత చెక్కను యథాప్రకారం మేకులతో బిగించారు. అంధకార బంధురమైన నౌకా

గర్భంలో సమాధియై పోయినాం. అలాగే శాశ్వతంగా ఉండాల్సివస్తుందేమోననే భయం కలిగింది. ఇంతలో చుక్కాని తిరిగిన చప్పుడైంది. నౌక ప్రయాణం ప్రారంభించింది.

సమాధినుండి మమ్మ బయటికి లాగేసరికి బాగా ప్రొద్దెక్కింది. నావ నడి సముద్రంలో ప్రవేశించింది. ఇక భయంలేదు. మాకు పరిచితుడయిన వృద్ధనావికుడు మమ్మ నౌక పైభాగానికి తీసుకువెళ్ళాడు. అక్కడే చక్రంచుట్టూ చుక్కాని తిరుగుతుంటుంది. ప్రపంచముఖం చూచాము. ఇంతలో భగవాన్‌సింగు భోజనంవేళ యైనట్లు గమనించాడు. కొన్ని బీరుసీసాలు, భోజనం పొట్లాలు పైకివచ్చినై. ఉల్లాసంగా బీరుత్రాగి భోజనాని కుపక్రమించాడు. జీవితంలో అనేక ఉత్తమ అంశాలను కోల్పోతున్నందుకు నామీద జాలి వెల్లడించాడు భగవాన్‌సింగ్. ఉన్నట్లుండి గొలుసు కదలటం ఆగి చుక్కాని గమనం మందగించింది. మరోక్షణంలో నౌక ఆగిపోయింది. వృద్ధనావికుడు మమ్మలను పిలవటానికి వచ్చాడు. ఒక ఆంగ్లనౌక మా నౌకను ఆగవలసిందిగా ఆజ్ఞాపించిందట! తిరిగి మమ్మల్ని భద్రంగా సమాధి చేశారు. నా మిత్రుడు భోజనంమాత్రం విడిచిపెట్టలేదు; బీరుసీసాలు పైనేవదలి భోజనం పొట్లాలు మాత్రం వెంటతెచ్చుకొన్నాడు. పొట్టపై సుఖంగా పరున్నతర్వాత కాగితం చప్పుడైంది. ఆ చీకట్లో నా మిత్రుడు "బాబూ! ఇది కాస్త భోంచేయండి" అంటూ ఏదో ఇచ్చాడు. అదేమిటో నాకు తెలియదు. నేనింకా శాకాహారినే. "ఎంతకాలం ఇలా భోజనంలేకుండా ఉంటారుబాబూ" అని ఆశ్చర్యపోతూ భోజనంలో నిమగ్నుడైపోయాడు.

సరిగా మా నెత్తిపైనే అడుగుల చప్పుడూ, మాటలు వినబడటంతో ఉలిక్కిపడ్డాం. కొందరు మెట్లెక్కి నావికుని గదిలోకి వెళ్ళారు. వారి మాటలు స్పష్టంగానే వినిపిస్తున్నై. అందులో ఒకడు అధికార స్వరంతో 'వారు ఈ నావమీదనే వున్నారని మాకు గట్టినమ్మకం. ఎక్కడ వున్నట్లు?' అంటూ బరువైన బూట్లతో మా నెత్తిపైగానున్న చెక్కను త్రొక్కడం ప్రారంభించాడు. "బాబూజీ అబ్‌తో ప్రక్రియా...." అని జాలిగా నా సహచరుని గొణుగుడు వినిపించింది. నాకు కలిగిన అసహ్యభావం వ్యక్తమయ్యేటట్లు నవ్వాలనిపించిందిగాని కష్టంమీద ఆపుకొన్నాను. అప్పుడే ఏదో వెచ్చని ద్రవపదార్థంలో నా దుస్తులు తడిసినై. ఆ విప్లవవీరుడు భయంతో మూర్ఛపోయాడా! అని ఆశ్చర్యం కలిగింది. ఆ అనారోగ్యకర వాతావరణంలో మరికొంతసేపు ఉండాల్సివచ్చింది. ఆ వచ్చిన బ్రిటిషు పోలీసు అధికారి చాలా గడుగ్గాయిలాగా కన్పించాడు. నావికులను వేధించుకుతిన్నాడు. ప్రతిసరుకును కదలించి మధ్యాహ్నంవరకు సోదాచేశాడు. చివరకా పరీక్షలో మా మిత్రులే నెగ్గారు. మాకు గండం గడిచింది.

మేము చుక్కాని దగ్గరకు తిరిగి వెళ్ళేసరికి సూర్యుడస్తమిస్తున్నాడు. నా సహచారి వృకోదరుడు భోజనంమీద పడ్డాడు. ఎన్ని బీరుసీసాలు త్రాగాడో లెక్క లేదు. నేనూ రొట్టె, వెన్న, జున్నులతో పొట్ట నింపుకున్నాను. సాయంకాల మందానిలం ప్రశాంతంగా ఉల్లాసకరంగా వీస్తోంది. భగవాన్‌సింగుకు యింకా బద్ధకం వదలలేదు. భోజనానంతరం 'మరల రాత్రికి ఆ దుర్మార్గులు రారుకదా?' అని ప్రశ్నించాడు. 'రారు' అని వృద్ధనావికుడు హామీ యిచ్చాడు. ఈలోగా ఆంగ్లేయుల అధికారం ఉన్న ప్రాంతాన్ని అతిక్రమించింది మా నావ. ఇక నాల్గురోజుల వరకు అంటే 'కోబీ' చేరేవరకు మా నావ నెవ్వరూ ముట్టుకోరు. ఆ రోజుల్లో అమెరికా పతాకను అవమానించగల ధైర్యం జపానువారికి లేదు.

భగవాన్‌సింగుతో పరిచయమైన కొద్దిరోజులలోనే అతనిపై నాకు సద్భావం సన్నగిలింది. నానాటికి అతని సహచర్యం నాకు సహింపరానిదిగా తయారైంది. అటువంటిది నెలరోజులు అతనితో గడపటం అసంభవం. 'కోబీ' ని దాటి నావ యోకహామా చేరగానే ఏదో ఉపాయంతో బైటపడాలి. 'కోబీ' సమీపిస్తున్నకొద్దీ భగవాన్‌సింగు సహచర్యంనుండి విముక్తి పొందటానికై తీవ్రంగా ఆలోచించసాగాను. రాస్‌బిహారీని కలుసుకొంటే ఏదో ఒక జపాను నౌకలో నాకు సౌకర్యం కలిగించక పోతాడా అనే అభిప్రాయానికి వచ్చాను.

మేము ప్రయాణంచేస్తున్న నౌక 'కోబీ' రేవులో ఒకరాత్రి అంతా ఉండాలి. లంగరు వేసేసరికి చీకటిపడింది. నౌకచుట్టూ బోట్లు చాలాచేరినై, అందొకదానిలోనికి మెల్లగాజారి ఒడ్డు చేరవచ్చు; నా మిత్రునకా సూచన చేశాను; నగరంలో కాలక్షేపానికి అతడూ ఉబలాటపడ్డాడు. గీషా *ప్రాంతాన్ని చివర సారిగా చూడకుండా వెళ్ళడం విచారకరం. చుక్కానికి సమీపంలోనున్న బోటు లోనికి తాటినిచ్చెనద్వారా దూకటానికి సమ్మతించాడు. చీకటి వుండగానే తిరిగి రావాలని అతని నిబంధన. ఒడ్డుచేరగానే అసలుసంగతి బైటపెట్టాను. అత్యవసరంగా టోకియోలో ఉన్న రాస్‌బిహారీని కలుసుకోవాలనీ, అందుచేత నేను 'కోబీ' దగ్గర నౌకను అందుకోవటం అసంభవమనీ, కాని సాధ్యమైనంతవరకు యోకహామాదగ్గర నౌకను చేరుకుంటాననీ చెప్పాను. అతని మైత్రి నెలాగైనా వదిలించుకోవాలనే చివరి అబద్ధం ఆడాను. కాలహరణమై పోతున్నదనే తొందరలో అత డంగీకరించాడు. నేను అనుకొన్నదానికంటె సులభంగానే మేమిద్దరం విడిపోయాం. 'బ్రతికాసురా' అనుకొంటూ టోకియో వెళ్ళే రైలుబండిని అందుకోటానికై స్టేషనుకు పరుగెత్తాను.

* మర్యాదస్తులైన ఉంపుడుగత్తెలను జపానులో గీషాలు అంటారు.

## క్రిస్టియన్ వేదాంతి వేషంలో

నా రాక పోలీసులకు తెలిస్తే, వారి ఉచ్చుల్లోనుండి తప్పించుకుపోవటం అసంభవమే కావచ్చు. అందుచేత ప్రస్తుతానికి రాస్ బిహారీని కలుసుకొనే సాహస ప్రయత్నం విరమించాను. టోకియోలో ఒక హోటలుగదిలోనే కాలక్షేపంచేస్తూ పసిఫిక్ మహాసముద్రాన్ని దాటే ఉపాయం ఆలోచించాను. చైనాలో ఉండగా, జర్మనులు నాకోసం ఫ్రెంచి ఇండియా పాస్‌పోర్టు ఒకటి సంపాయించారు; పారిస్‌లో వేదాంతం చదవటానికి వెళ్ళే పుదుచ్చేరి నివాసికని ఇవ్వబడినది ఆ పాస్‌పోర్టు. వేదాంతాభ్యాసం అపాయంలేని వృత్తి! ఆ పాస్‌పోర్టుమీద 'అమెరికాగుండా' అనే మాటలుంటే అది బాగా పనికివస్తుంది. వీలుదొరికింది కాబట్టి 'పిల్లికి గంట కట్టే' సాహసానికి పుపక్రమించాను. నా కోటుకు బంగారు శిలువ (Cross) తగి లించి అమాయక విద్యార్థిముఖంతో అమెరికా రాయబారి కార్యాలయానికి వెళ్ళాను. ఒక యువతి నా రాకకు కారణం అడిగింది. నా కథ అంతావిని పాస్‌పోర్టు తీసుకొని మాయమయింది. కొంతసేపటికి తిరిగివచ్చి 'రాష్ట్రాలగుండా ప్రయాణం చేస్తున్నావా?' అని అడిగింది. కాబోయే క్రిస్టియన్ గురువు మరొక అబద్ధమాడాడు: 'పారిస్‌లో వేదాంత పరిషత్తు జరగబోతోంది; దానికి హాజరుకావాలి; కాబట్టి యెంతత్వరగా వెళ్ళితే అంతమంచిది.' కొద్దిక్షణాలలోనే ఆమె పాస్‌పోర్టుమీద అధికార ముద్రతో తిరిగి వచ్చింది. స్వర్గద్వారాలు కాకపోయినా కనీసం గాంధర్వలోక ద్వారాలను తెరిపించినట్లుగా భావించాను; నా సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయినవి. మాతృ వాత్సల్యం వెల్లివిరిసే దేవతలాగా నన్నభినందిస్తూ కరస్పర్శచేసి 'పారిస్ వెళ్ళడం చాల గొప్పవిశేషం. భారత క్రిస్టియను యువకుడవైన నీతో ప్రయాణంచేస్తే చాల బాగుండేది. కొద్దిరోజుల్లోనే పారిస్ కాన్సులేట్‌కు నన్ను మారుస్తారని ఆశిస్తున్నాను' అన్నది.

కృతజ్ఞతతో నా హృదయం నిండిపోయింది. వెంటనే క్రిస్టియన్ పుస్తకాల షాపుకువెళ్ళి అందంగా క్యాలికో బైండుచేసిన బైబిలుకొని నా ఆయుధ ప్రణాలికతో నింపుకొన్నాను. తర్వాత నౌకా కార్యాలయానికి వెళ్ళి రెండురోజుల తర్వాత బయలుదేరే నౌకలో మొదటితరగతిలో ప్రయాణం చేయటానికి యేర్పాట్లుచేశాను. నా యేర్పాటులన్నీ పూర్తికాగానే చిన్న సాహసం చేయాలనిపించింది. ఇంకా జపానులోనే ఉన్నాననీ, అమెరికాగుండా జర్మనీ వెళుతున్నాననీ, రాస్‌బిహారీకి తెలియజేయాలి. క్రిందటిమారు కలుసుకున్న భారతీయ వర్తకుని సహాయం కోరాను. నేను టోకియోచేరిన తర్వాత నా సమాచారం అతిడే రాస్‌బిహారీ ప్రతినిధికి అంద జేశాడు. ఎలాగైతేనేం, ఒక అర్ధరాత్రి రాస్‌బిహారీని కలుసుకొని, నేరుగా యొకహామా వెళ్ళి మరునాడుదయమే నౌకనెక్కాను.

నేను సుఖంగా చేసిన మొదటి సముద్ర ప్రయాణం ఇదే. అదొక పెద్ద జపానునౌక; నాటి నౌకావేగాన్నిబట్టి పసిఫిక్ మహాసముద్రాన్ని దాటడానికి మంచి నౌకకే రెండువారాలు పడుతుంది. అందులో ఒకరోజు హనోలూలూవద్ద మకాం. షాంఘైనుండి కోబీకి రావటమే నా మొదటి రహస్య నౌకాప్రయాణం కాదు. అంతకు పూర్వం చైనా సముద్రంమీదా, జావానుండి ఇండోచైనాకూ, ఫిలిప్పైనులకూ చేసిన ప్రయాణాలన్నీ అటువంటివే. ఒక్కొక మారు లైఫ్‌బోటుల్లోనే ప్రయాణం చేయవలసి వచ్చేది. ఆ అనుభవాలు ఉద్రేకపూరితమైనవేగాని సుఖమైనవిమాత్రం కాదు. ఇంతకు ముందు మద్రాసునుండి పెనాంగ్‌కు ప్రయాణంచేస్తూ రెండుమార్లు బంగాళాఖాతాన్ని దాటాను. ఆ ప్రయాణాల్లో ప్యాసుపోర్టు అవసరము లేకపోయింది. అందుచేత మొదటి తరగతిలో ప్రయాణముచేసే ఐరోపావారి జీవితపద్ధతి నాకు అలవడలేదు. మద్రాస్ పెనాంగులమధ్య నౌకల్లో బడాయికోరులైన బ్రిటిష్ సైనికులు, వలసఉద్యోగులు, రబ్బరుపనివాండ్రు ప్రయాణంచేస్తూ వుండేవారు. స్వదేశీయులపట్ల ఆంగ్లేయుల ప్రవర్తన 'కబడ్దార్' అన్నట్లుండేది. వారి నిలువెల్లా నిర్లక్ష్యం, అహంభావం. అందుచేత ఆ ప్రయాణాలు నాకు ఆనందాన్ని యివ్వలేకపోయినై.

పసిఫిక్ మహాసముద్రంమీద చేసిన ఈ ప్రయాణం నాకొక ప్రత్యేక అనుభవాన్ని కలిగించింది. నేనింకా శాకాహారినే; ఐనా ఐరోపా భోజనపద్ధతీ, వస్త్రధారణ పద్ధతి అలవరచుకొన్నాను; క్రొత్తవారిమధ్య సరిగా మెలగడంకూడా అలవడింది. పూర్తిగా ఇహలోకవ్యక్తినైనాను.

23

# అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో

ఏమైనప్పటికీ ఆ రెండువారాల సముద్ర ప్రయాణం నాకు చాలా కష్టమనిపించింది. మొదటి తరగతిశాలలో భోజనంచేసే ఉద్యోగులందరూ జపానువారే; మిగిలినవారు చైనా, జపాను మొదలైన ప్రాచ్యదేశాల్లో నివసిస్తున్న అమెరికా మతప్రచారకులు. వీరిలో కొందరు ఇండియాలో కూడా మతప్రచారం చేసినవారే. నాలాంటి క్రిస్టియన్ కానివాడు క్రిస్టియను వేదాంతి కావటం లేదా! ఒక యువక విద్యార్థి మత గురువు కావాలని ప్రయత్నించటం వారికి ఆశ్చర్యంగా కన్పించవచ్చు. ఇది ఆలోచించే నేను ఒంటరిగా ఉండే గదిని మాట్లాడాను. అందుచేత చాల రోజులవరకు ఇతరులతో సంబంధంలేకుండా ఉండిపోయాను. కాని నాకు సముద్రజ్వరం (Sea fever) రాకపోవటం కూడా వారికి ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు. అందుకని జ్వరం వచ్చినట్లు నటించటం కూడా అవసరమే! అంతకు పూర్వమే చైనా సముద్రంమీద ప్రయాణాల్లో బాగా ఆరితేరి ఉండటంచేత నాకు జ్వరం రాలేదు. చైనా సముద్రం చాలా భీభత్సంగా ఉండేది. ఒకమారు మనీలానుండి నాగసాకీకి ప్రయాణంచేసిన రెండు రోజుల్లో నౌక గవ్వలాగా ఊగిపోయింది. ఆ సమయంలో ధైర్యంగా డెక్ మీద నిలబడ గలిగిన వ్యక్తిని నేనొక్కడనే! ఇటువంటి అనుభవాలు నాకు గర్వకారణమైనై.

అసలు విషయమేమంటే, ఈ రెండువారాలూ నేను రహస్యంగా ఉండలేకపోయాను. ఒకనాడు భోజనాలదగ్గిర తమాషా జరిగింది. నేను ఇద్దరిమధ్య కూర్చోటం తటస్థించింది. అందులో ఒకరు దాక్షిణాత్య భారతీయ క్రిస్టియన్ యువతి; ఉపాధ్యాయ వృత్తిలో పెద్దచదువుకై అమెరికా వెళ్ళుతోంది. మరొకరు టోకియో విశ్వవిద్యాలయంలో వేదాంతాచార్యులుగా పనిచేస్తున్న అమెరికా యూనిటేరియను మతగురువు. ఈ ఆచార్యులవారి సాహచర్యం ఏమంత కష్టమనిపించలేదు; అతని సంభాషణ ఉపన్యాసంలాగా ఉండేది; శ్రద్ధగా వినటం తప్ప నాకు మాట్లాడే పని లేదు. అక్కడక్కడ వేదాంతం అర్థం గాకపోయినా మొత్తాని కాతని ఉపన్యాసాలు బాగానే ఉండేవి. ఒకరోజున నా బంగారు శిలువవైపు చూస్తూ: 'దాన్ని ఎందుకు ధరిస్తున్నారు?' అని ప్రశ్నించాడు. క్రిస్టియన్ మతగురువు ఇంత అప్రాచ్యంగా మాట్లాడుతున్నాడేమా అని ఆశ్చర్యం కలిగింది. క్రిస్టియనులలో కూడా వెఱ్ఱ

శాఖలున్నై. వానిమధ్య గల భేదాలు నాకింకా తెలియవు. అందులో యూనిటేరి యనులను శిలువలోగానీ, త్రివర్గాలలోగాని నమ్మకం లేదనికూడా నాకు తెలియదు. అందుచేత మామూలు ధోరణిలో సమాధానం చెప్పాను. 'క్రీస్తు అనేవాడొకప్పు డున్నాడనీ, శిలువ వేయబడ్డాడనీ నమ్ముతున్నారా!' అని తిరిగి ప్రశ్నించాడు. నాకు మరింత ఆశ్చర్యమైంది; రక్షణోపాయంకోసం వెదకాల్సివచ్చింది. 'ఒక ఆదర్శంకోసం, జీవితాన్ని త్యాగం చేయడమే ఉత్తమోత్తమ ఆశయానికి చిహ్నంగా శిలువను ధరిస్తున్నాను' అని చెప్పాను. ఆచార్యులవారు సహజ ధోరణిలో ఉప న్యాసం ప్రారంభించారు. ఒక అభిప్రాయాన్ని గూర్చి ఆలోచిస్తున్నట్లు ఉందిగాని, వ్యాఖ్యానిస్తున్నట్లు లేదు ఆ ఉపన్యాసం.

ఇక ఆ యువతి సంగతి; ఆమెపేరు మిస్. గ్రే. నాకు బాధకలిగించేఉద్దేశ్యం ఆమె కేమాత్రం లేదు; కాని ఆమె స్నేహమే నాకు కష్టమనిపించింది. ఇద్దరమూ భార తీయులమే; జాతీయభావం దృష్ట్యా ఇద్దరమూ ప్రతీపగాములమే; అంటే ఒకరు హృద యపూర్వకంగానూ మరొకరు కృత్రిమంగానూ దేశద్రోహులమే. మా బాల్యదశలను పోల్చుకుంటూ ఒకరి నొకరు పరిచయం చేసికొన్నాం. ఆమె మాతృభాష అరవం; ఆ భాష నాకురాదు. కాని మాతృదేశంలో సాంస్కృతిక ఐక్యత అడుగునఉన్న భాషా విభిన్నత్వం నా అశక్తతను సమర్థించుకోటానికి ఉపయోగపడింది. జన్మతః బెంగాలీనని, చంద్రనాగూరు నివాసిననీ, అందుచేత ఫ్రెంచి పౌరుణ్ణి ఐనాననీ, ఫ్రాన్సుతో సన్నిహిత సంబంధం యేర్పరచుకొనే ఉద్దేశ్యంతో కొన్ని సంవత్సరాల నుండి పుదుచ్చేరిలో ఉంటున్నాననీ ఆమెతో చెప్పాను. నా సర్వసమభావానికి మిస్. గ్రే ఆశ్చర్య పడింది. ఆమెకు చిన్నతనంలోనే తల్లి దండ్రులు గతించారు. ఒక క్రిస్టియను మతసంస్థ ఆమెను పెంచింది. అందుచేతనూ, కొన్ని సంవత్సరాలు గా ఆంగ్లంలో విద్యాబోధన జరుపుచుండుటచేతనూ ఆమె ఇంగ్లీషు ఒకటే మాట్లాడ గలదట! ఒక మతప్రచారక దంపతులతో, వారి పెంపుడు బిడ్డగా అమెరికా వెళు తోంది. గ్రే శరీరచ్ఛాయ చామనచాయ. ఐనా ఆమె పెంపుడు తల్లి దండ్రులు మాత్రం పక్కా అమెరికన్లు. అందుచేత నల్లవానితో ఆమె మాట్లాడటం వారికి సమ్మ తంగా ఉండేదికాదు. కాని తెల్లవారితో పరిచయానికి తనరంగు ఆటంకంగా గ్రే భావించేది. జపానువారు కూడా తమ జాతి శ్రేష్ఠమైనదని గర్విస్తుండేవారు. అదృష్ట వశాత్తు గ్రే వైపరీత్యాలను గమనించలేదు. ఆమె బలవంతం చేసినప్పుడు మాత్రం ఆమెతో మాట్లాడేవాడిని. ఇతర సమయాలలో ఒంటరిగా కూర్చుని బైబిలును పదేపదే చదువుతూ కాలక్షేపం చేసేవాణ్ణి. ప్రయాణీకు లందరూ నేను వేదాంత విద్యార్థిననీ, రేపో మాపో మఠంలో (సన్యాసులలో) చేరిపోతాననీ అనుకునేవారు. అది నాకు చాలా లాభించింది.

ఒకనాటి ఉదయం డెక్ మీద ఒక విచిత్ర దృశ్యం కంటబడింది. క్రిందటి రోజు వరకూ జపాను వారందరూ తమ జాతీయ దుస్తులు ధరించేవారు. ఉద్యోగులు మాత్రం 'టక్సిడోలు' ధరించేవారు. ఆ ఉదయం 'కిమోనోలు' మాయమైనై. జపానువారంతా నీటుగా ఐరోపా దుస్తులు ధరించారు. మిస్. గ్రే చీర ధరించటం లేదు; ఐనా జపానువారి తిమ్మాయి చేష్టలను తీవ్రంగా విమర్శించింది. నేను కూడా ఆమెతో ఏకీభవించాను. జపానువారంటే నాకు సహజంగానే అయిష్టం. పైగా ఈ చేష్టలేమిటి? నాకు హనోలూలు సమీపించటమే వారిలో మార్పుకు కారణమని తెలిసింది. మధ్యాహ్నానికి, అమెరికా నాగరికతా రక్షణ శ్రేణులను చేరుకొన్నాం. ప్రయాణీకులందరూ నగరంలోని వినోదాలు చూడటానికి వెళ్ళారు. వేదాంతాచార్యులు నన్ను బీచి షికారుకు ఆహ్వానించాడు. దేదీప్యమానంగా వెలుగుతున్న హనోలూలూ నగరాన్ని చూస్తూ ప్రశాంతంగా ఆ సాయంత్రం గడిపాను. హనోలూలు నగరమే నేను మొట్టమొదట చూచిన అమెరికా నగరం.

## అమెరికాలో భారతీయ విప్లవకారులు

1916 వేసంగిలో శాన్ ఫ్రాన్‌సిస్కో (అమెరికా పశ్చిమతీరంలోని రేవు పట్టణం) చేరాను. పసిఫిక్ మహాసముద్రాన్ని ఎలా దాటాను? చేతిలో ఒక బైబిలు, గడియారం గొలుసు చివర ఒక శిలువ - వీటితో పారిస్‌లో వేదాంతశాస్త్రం అధ్యయనించటానికి పుదుచ్చేరినుండి బయలుదేరిన అమాయికవిద్యార్థి అవతారంతో ప్రయాణం చేశాను. నాటికే అమెరికా సంయుక్త రాష్ట్రాలలో యుద్ధోన్మాదం విజృంభించింది. ఐనా, తూర్పుదేశంనుండి వచ్చిన ఈ పేరులేని ఆగంతుకునికి అమెరికా స్వాగతమిచ్చింది.

మరునాడు ఉదయం వార్తాపత్రికల్లో ఒక విశేషం చూచాను. 'మాయపరదేశి అమెరికా వచ్చాడు. ఇతడు ప్రఖ్యాత బ్రాహ్మణ విప్లవకారుడా? లేక జర్మను గూఢచారియా?' అని పెద్దపెద్ద అక్షరాలతో పత్రికల్లోపడింది. అది చూచిన వెంటనే, నా హోటలు గదిలోనే భోజనం ముగించుకొని దగ్గరలోనున్న పాలోఆల్టో నగరం చేరాను. ఆనగరం స్టాన్‌ఫర్డు విశ్వవిద్యాలయానికి కేంద్రం. అక్కడ ధనగోపాల్ ముఖర్జీతో పరిచయమైంది. ధనగోపాలు అన్నయైన జాదుగోపాల్ నాకు మంచిమిత్రుడు. ధనగోపాలుకు ఇంకా ముప్పది సంవత్సరాలు నిండలేదు. ఐనా, అప్పటికే కవిగా మంచిపేరుప్రతిష్టలు సంపాదించాడు. నాకు వాత్సల్యంతో స్వాగతమిచ్చి నా గత చరిత్రనంతా తుడిచివేయమనీ, నూతన వ్యక్తిగా సరిక్రొత్త జీవితం ప్రారంభించమనీ సలహాయిచ్చాడు. ఆ సలహా ప్రకారం ఆరోజు సాయంత్రమే స్టాన్‌ఫర్డు విశ్వవిద్యాలయ ఆవరణలో నాకు యమ్. యన్. రాయ్ అనే నామకరణం జరిగింది. పాలోఆల్టోలో చాలా కాలం రహస్యంగా గడపవలసి వచ్చింది. అక్కడే

డాక్టరు డేవిడ్ జోర్డాన్‌తో పరిచయం కలిగింది. ఇంకా కొంతమంది స్నేహితులను కూడా సంపాదించాను. రెండు మాసాలు పశ్చిమతీరంలోనే గడిపి వర్షాకాలంలో న్యూయార్కు నగరం చేరాను. న్యూయార్కులోనే నాకు మానసికంగా రాజకీయ పునర్జన్మ కలిగింది.

గుప్తాతో పరిచయం :

న్యూయార్కులో గుప్తాను కలుసుకున్నాను. అంతకుపూర్వం జపానులో ఉన్నప్పుడే గుప్తాను చూచాను. అతడప్పుడే అమెరికానుండి వచ్చాడు. బెర్లిన్‌లోని భారత విప్లవసంఘానికి ప్రతినిధినని చెప్పుకొనేవాడు. తమదేశం విడచి వెళ్ళవలసి నదిగా జపాను ప్రభుత్వం గుప్తాకు శ్రీముఖ మిచ్చింది. అందుచే రహస్యంగా రాస్ బిహారీతో ఉంటూఉండేవాడు. అప్పటికే రాస్‌బిహారీ, టోయామాతో స్నేహం సంపాదించాడు. టోయామా అంటే అఖండ ఆసియా సూత్రానికి సిద్ధాంతకర్త. మంచి పలుకుబడికల వ్యక్తి. 'కాలసర్పం' అనే విధ్వంసక ఫాసిస్టు రహస్య సంఘ మును గూడ టోయామా స్థాపించాడు. ఇక గుప్తా విషయానికి వద్దాం. తన సిఫారసు లేనిదే వాషింగ్‌టన్‌లోని జర్మను రాయబారి భారతీయులకు దర్శనంగూడ ఇవ్వడని, అందుచేత తానులేనిది, నేను అమెరికాలో యేమీ సాధించలేనని చెప్పాడు. నిజానికి అతనికి అంత పలుకుబడే వున్నట్లయితే నాకు ఒక పరిచయలేఖ నివ్వటం భావ్యంగా ఉండేది. అలా కాక నా ఆయుధ ప్రణాళికకు ఆమోదముద్ర వేయించే బాధ్యత తానే వహిస్తానని అందుకై తానే అమెరికాకు, అక్కడినుండి అవసరమైతే జర్మనీ వెళతా ననీ, అంతవరకు నన్ను దూరప్రాచ్యంలోనే ఉండమనీ సూచించాడు. కాని, జపా నులో వుంటే నాకు కారాగారమో లేక బహిష్కరణో తప్పదు. ఈ పరిస్థితిలో చైనా వెళ్ళినా, అక్కడ చేయగలిగిన దేమీలేదు. అందుచే అమెరికా ప్రయాణం మానటం నాకు సమంజసంగా తోచలేదు. గుప్తాకుమాత్రం నేను ఒంటరిగా వెళ్ళటం ఏమాత్రం యిష్టంలేదు. నాతోగూడ అతనిని రమ్మనమని సూచించాను. కాని అందు కతడు సంసిద్ధుడుగాలేడు. ఒకవేళ నేను అమెరికా వెళ్ళటం తటస్థిస్తే, ఎవ్వరినీ కలుసుకోవద్దనీ, తనకోసం నిరీక్షిస్తూఉండమనీ సలహాయిచ్చాడు.

ఇప్పటికి గుప్తా తన కార్యక్రమం మార్చుకొన్నాడు. అతని వయస్సు నాటికి నలభై సంవత్సరాలు ఉంటాయి. కొలంబియా యూనివర్సిటీలో గ్రాడ్యుయేట్ క్రింద తరగతి చదువులు ప్రారంభించాడు. రాజకీయ కుట్రలతో పూర్తిగా విసిగిపోయాడు. ప్రాణాలనుగూడ తృణీకరించి దూరప్రాచ్య విప్లవాలను నడిపిస్తున్న తనను బెర్లిన్ కమిటీతో అతని స్థానంలో ఎవరు వచ్చారో తెలిసికొందామని అడిగాను. గుప్తా ఉలిక్కిపడి అసందర్భంగా డాక్టరు చక్రవర్తిని తిట్టటం ప్రారంభించాడు.

న్యూయార్కు నగరమంటే ఆకాశమంటే సౌధాలమహారణ్యము. అందులో చిక్కుపడిపోయాను. అప్పుడు శిశిరఋతువు గడచి హేమంతం ప్రవేశింపబోతుంది. నాకు వున్నదల్లా ఒక్క చైనా సిల్కు సూటు మాత్రమే. జేబులో దమ్మిడీలేదు. ప్రయాణంలో ఒక పెట్టెను పారేసుకొన్నాను. దానితో రెండు ట్రౌజర్లు పోయినై.

కొన్ని రోజులపాటు బసంతకుమార రాయ్ యింట్లో గడిపాను. ఈ శతాబ్ద ప్రారంభంనుండి అతను అమెరికాలోనే వుంటున్నాడు. అతను విప్లవకారుడు కాదు. అయినా, ప్రముఖ విప్లవనాయకులతో అతనికి పరిచయముండేది. యుద్ధానికి పూర్వము అంటే జర్మనీపై అభిమానము కలుగకముందు భూపేంద్రనాథ దత్తా (వివేకానందుని సోదరుడు), తారకనాథదాస్ మొదలైనవారు యితనితో సంప్రదిస్తూవుండేవారు. అతని ప్రధానాశయం ప్రపంచ సారస్వతంలో స్థానం సంపాదించటమే. రవీంద్రనాథ టాగూరు మొదటి అమెరికా పర్యటన యేర్పాటుచేసిన దీతడే; టాగూరు జీవిత చరిత్రను గూడ వ్రాశాడు. అతడు చాల దయార్ద్రహృదయుడు. కాని ఆర్థికంగా నాకంటే యేమంత మంచిస్థితిలోలేడు. అందుచేత లజపతిరాయ్‌ని కలుసుకొమ్మని సలహా యిచ్చాడు.

## అమెరికాలో రామకృష్ణ మఠం :

బసంత కుమారరాయ్ నివసిస్తున్న మేడ క్రింద అంతస్థులో రామకృష్ణ - వివేకానంద సమాజానికి చెందిన న్యూయార్కు శాఖ కార్యాలయమున్నది. అందులోని స్వామీజీని కలుసుకొని శ్రద్ధాంజలి సమర్పించాను. వచ్చేవారం ఉపన్యాసానికి రమ్మని నన్ను ఆహ్వానించారు. ఆ అంతస్థులో అతిథుల కేర్పాటుచేసినగదే ఉపన్యాస మందిరం. ప్రేక్షకులు మొత్తం ఇరవైమంది. ముఖ్యంగా వయసు్స మళ్ళినవారు. వారిలో స్త్రీలందరు 'దేవీ' అని చివర ఉండే భారతీయ నామములు ధరించినవారే. నేను యిండియాలో ఉన్నప్పుడు భారతీయ వేదాంతముపట్ల అమెరికాలో చాల శ్రద్ధాసక్తులు కలవని వింటూవుండేవాణ్ణి. అందుచేత శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్ ఏంజల్స్ నగరాలలోని రామకృష్ణ మఠశాఖలను పనిబెట్టుకు వెళ్ళి దర్శించాను. అన్నిచోట్లా ఒకేరకమైన దృశ్యం ప్రత్యక్షమైంది. భౌతికవాదం ప్రబలిన పాశ్చాత్య దేశాలు తమ పాపాలకు పశ్చాత్తాపం పొంది భారతీయ ఆధ్యాత్మిక సందేశాన్ని పొందగల సూచనలు నాకు కన్పించలేదు! భారతదేశ సందేశంలో యింకా దృఢవిశ్వాసమున్న నాకు ఆ అనుభవం గొప్ప ఆశాభంగాన్ని కలిగించింది.

## జిడ్డు విప్లవనాయకుడు :

అమెరికాలోని భారత విప్లవకారులను గూర్చి బసంతకుమారరాయ్ కొద్దిగా చెప్పాడు. పరస్పర ద్వేషము, అసూయ, మోసము, కుతంత్రాలతో గూడిన విషాద గాథ. గుప్తాస్థానంలో ఉన్న డా. చక్రవర్తినుండి సహాయం అపేక్షించవలదని కూడా

చెప్పాడు. బెర్లిన్ కమిటీ సభ్యులలోని కలహాలే యీ మార్పులకు కారణమని తెలిసింది. గుప్తా చెప్పిన గుర్తులనుబట్టి ఒక నాడు చక్రవర్తి నివాసం చేరాను. నగరం ఎగువ భాగంలో మధ్యతరగతి కుటుంబీకులు నివసించే ప్రదేశము. అదొక మూడంతస్థుల మేడ. మెట్లెక్కి ఎంత పిలిచినా సమాధానం లేదు. కిటికీలుగూడా మూసివున్నాయి. అందుచే ఆ యింట్లో ఎవ్వరూ నివసించటంలేదేమో అని అనుమానం కలిగింది. దిగివచ్చి గృహయజమాని యింటికివెళ్ళి తలుపు తట్టాను. కొంతసేపైన తరువాత తలుపు సందులలోనుండి ఎవరో తొంగిచూచారు. మరుక్షణంలో ఒక బక్కచిక్కిన విగ్రహం ప్రత్యక్షమైంది. దుస్తులన్నీ బురదగావున్నై. విరబోసుకొన్నజుట్టు, దానిలోనుండి చమురు కారుతోంది. సాధారణంగా అమెరికాలో కాపలావారు నీగ్రోలై వుంటారు. ఇతడు నీగ్రో కాదు. అందుచేత కాపలావాడు కాదనిమాత్రం స్పష్టమైంది. కాబట్టి యితడెవరో స్వదేశస్థుడే. ఒక తత్వవేత్తను కలుసుకొందామని వచ్చిన నాకు యీతని దర్శనమేమిటి? నా తికమకలనుండి నన్ను రక్షించినట్లుగా ఆ వ్యక్తి నన్ను లోనికి ఆహ్వానించి తలుపు మూసివేశాడు.

"ఈ పరిసరాల్లో డా. చక్రవర్తి నివసిస్తున్నారా?" అని అడిగాను.

"కూర్చో. నీవు వస్తావని అనుకుంటూనే ఉన్నాను." అన్నాడు.

ఇతడే నా మాయానిధియైన డా. చక్రవర్తి? ఇతడేమిటీ, భూగర్భంలోఉన్న వంటగదిని కార్యాలయంగా ఉపయోగించట మేమిటి? మిగిలిన యింట్లో ఎవరుంటున్నారు? ప్రస్తుతం యీ ఆరాలు తీయటం నా పని కాదు.

"బెర్లిన్ కమిటీ ప్రతినిధిగా గుప్తాస్థానంలో వచ్చారా?" అని అడిగాను.

టేబుల్ మీదవున్న పాత్రలోనుండి వ్యాసిలైన్ తీసి తలమీద రుద్దుకుంటూ నాకు సమాధానంగా తల వూపాడు.

ఈ డాక్టరువల్ల ప్రయోజనం కన్పించలేదు. ఇతడు విప్లవోద్యమాలలో యేమాత్రము ప్రధానపాత్ర నిర్వహించినప్పటికి నాకితని పేరు తెలియకుండా వుండదు. అందుచేత, నా ఎత్తుగడలను గురించి యితనికి తెలియచేయటం మంచిది కాదు అనే వుద్దేశ్యంతో చక్రవర్తితో సూటిగా మాట్లాడాను.

"జర్మనీ వెళ్లదామని నా ప్రయత్నం. అందుకు తగిన యేర్పాట్లు మీరు చేయగలరని ఆశిస్తున్నాను." అన్నాను.

"ఎందుకు?" ఏదో ఆలోచిస్తున్నట్లు కళ్లు మూసుకొని అడిగాడు.

నాకీ నాటకంతో ఒళ్లు మండిపోయింది—

"కాలక్షేపానికి కాదు. బెర్లిన్ కమిటీకి ఒక ముఖ్యమైన సందేశాన్నందజేయాలి." అని సమాధానం చెప్పాను.

దీనితో చక్రవర్తికి మగత వదిలింది. వ్యాసిలైను నెత్తిన పూసుకొంటూ "బెర్లిన్‌నుండి కొన్ని సూచనలకోసం ఎదురు చూస్తున్నాను. రేపు మధ్యాహ్నంరండి. మీ కార్యక్రమం గురించి ఆలోచిద్దాము" అన్నాడు.

బెర్లిన్‌నుండి చక్రవర్తి యే సూచనలను కోరలేదు; అతడు చెప్పిన సూచనలు యెన్నటికి రానూలేదు. ఇక క్రమక్రమంగా చక్రవర్తి నివసిస్తున్న భవనంలోని వ్యక్తులను గురించీ, అందులోని యింద్రజాలాన్ని గురించి తెలుసుకొన్నాను. ఆ మేడలో ఒక జర్మన్ వైద్యుడు గూడ వుండేవాడు. పేరు మాత్రము గుర్తులేదు. ఒక ప్రచార సాహిత్య గ్రంథంలో శారీరక, ఆధ్యాత్మిక వ్యాధులను నయముచేసే వైద్యశాలగా ఆమేడ వర్ణింపబడింది. ఆ కరపత్రంమీద కలువలోనుండి ఉద్భవిస్తున్న కవలపిల్లల బొమ్మవుంది. చక్రవర్తి సాధారణంగా బయటికి వెళ్ళేవాడుకాదు. జర్మన్ వైద్యుడు కూడ మేడమీదనే ఉండేవాడు. ఆధునికపద్ధతిలో స్పర్శవేదిలో ప్రయోగాలు చేస్తుండేవాడని నా అనుమానం. ఒకనాడు నేను వెళ్ళే సమయానికి చక్రవర్తి బయటికి వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. జర్మన్ డాక్టరు నన్ను మేడమీదికి తీసుకొని వెళ్ళాడు. ఇంతలో చక్రవర్తిలోనికి వచ్చి వ్యాసిలైను తలపై మర్దించి హేటు పట్టుకొని వెళ్ళిపోయాడు. అమెరికాలో చక్రవర్తిని 'జిడ్డు విప్లవానికి జిడ్డు నాయకుడు' అని పిలవటంలోని ఔచిత్యం బోధపడింది. చక్రవర్తి విషయంలో ఆ వర్ణన అక్షరాలా సత్యమే. కాని విప్లవాన్ని మాత్రం జిడ్డువిప్లవం అనటం నేను సహించను. కాని చక్రవర్తివంటి వ్యక్తులు నాయకత్వం వహించే ఉద్యమాలపట్ల ప్రజలకు అటువంటి అభిప్రాయం కలగటం సహజమే!

చక్రవర్తికి అసలు విప్లవంతో సంబంధమేలేదు. అయితే పూర్తి మోసగాడని అనటానికీ వీలులేదు. 'నీయంత వాడు లేడంటే' ఎంతటి దుర్మార్గమైనా చేయటానికి వెనుదీసేవాడు కాడు. ఈ నాటకంలో అసలు మోసగాడు జర్మను డాక్టరు. అతడొక జర్మను గూఢచారి. గత చరిత్ర వల్లగాని, శక్తి సామర్థ్యాల వల్లగాని యోగ్యత లేనప్పటికీ, చక్రవర్తికి నాయకత్వం ఇచ్చింది జర్మను డాక్టరే. అయితే బెర్లిన్ కమిటీ ఎలా సమ్మతించిందో మాత్రం తెలియదు. వారు గూడా చేయగలిగింది లేదు. ఈ విషయాలలో అమెరికాలోని జర్మను గూఢచారి దళ నాయకుడే అంతిమ నిర్ణయాలు చేస్తుండేవాడు. తన చేతుల్లో కీలుబొమ్మగా వుండేవానిని అతడు అమెరికాలో ప్రతినిధిగా నియమించాడు. అతని వుద్దేశ్యంలో ఎంత దద్దమ్మ అయితే ఆ పాత్రకు అంత పనికివస్తాడు.

పైన చెప్పిన భవనంలో విలాస జీవితానికి కావలసిన ఏర్పాట్లన్నీ వున్నాయి. అది ఒక క్లబ్బులా వుండేది. బయట జరిగే ప్రచారానికి, ఆ యింటిలోని వాతావరణానికి యేమాత్రం సంబంధంలేదు. చక్రవర్తి మాత్రమే ఆ వాతావరణానికి సరిపడిన

వ్యక్తి. జర్మను డాక్టరు మాత్రం మహర్షిత్వమును పొందటానికి సాధన చేస్తున్నట్లు నటించాడు. అయితే అందుకు యీ విలాస భవన మెందుకా అని సందేహం కలగటం సహజం. ఆలోచింపగా నాకొక భావం కలిగింది. ఈ డాక్టర్లు యిద్దరూ యీ భవనానికి చెందినవారు మాత్రం కాదు. అది ఉన్నతస్థాయిలో రహస్య సమావేశాలు జరపటానికి నిర్దేశింపబడిన భవనం కావచ్చు. పోలీసుల దృష్టి నాకర్షించి వారి 'నిఘా'లో వున్నట్లు అనుమానించటానికి గూడా అవకాశమున్నది.

## నూతన కర్తవ్యం

అచిరకాలంలోనే యీ డాక్టర్లవల్ల సహాయం లభించదని తెలుసుకున్నాను. ఈలాగా క్రొత్తవ్యక్తులతోను, క్రొత్తభావాలతోను పరిచయమైంది. విప్లవాన్ని గురించిన నూతనభావనలు, నూతన భవిష్యత్ స్వరూపము జర్మనీ వెళ్ళాలనే కోరికను చాలవరకు తగ్గించినై. స్వదేశంలోని మిత్రులు ఆకాంక్షతో నా కర్తవ్య విజయానికి ఎదురుచూస్తూ వుంటారేమో అనే ఆలోచన ఒక్కటే జర్మనీ ప్రయాణానికి నన్ను ప్రోత్సహిస్తూ వుండేది.

ఇండియానుండి వార్తలు చాల స్వల్పంగా వచ్చేవి. పత్రికలు రావటానికి కొన్ని వారాలు పట్టేవి. ఆ పత్రికలుకూడ చాల స్వల్పంగా వస్తూవుండేవి. విప్లవ సమాచారాలు కల జాబులు ఇండియా సరిహద్దుల్లోనే మాయమయ్యేవి. అమెరికాకు చేరిన కొద్ది సమాచారాలవల్ల నేను గ్రహింప కల్గినదేమంటే—1915లో నేను రెండవ మారు ఇండియాను విడిచివచ్చిన కొన్ని రోజులకే ప్రముఖ విప్లవనాయకు లందరూ అరెస్టు చేయబడ్డారు. వారికి దీర్ఘకాల కారాగారమో లేక ఆజన్మ కారాగారమో శిక్షగా విధింపబడింది. కొందరు మాత్రం తప్పించుకు తిరుగుతున్నారు. అమెరికాలో వున్న నాకు వారి జాడలు తెలుసుకోవడం సాధ్యంకాదు. ఈ ఉద్యమ ఆలోచనా సంఘంలోని సభ్యులచే నియమింపబడిన కొందరు ఆయుధాలు అందుకొనే నిమిత్తం యీశాన్య సరిహద్దులకు వెళ్ళారు. తరువాత యేమిజరిగిందో తెలియదు. అందుచే నన్నొక పెద్దసమస్య వేధింపసాగింది. నా ఆదియాసలు ఫలించి, నా కృషి సఫలీకృతమైతే నేను సంపాదించిన ఆయుధాలు ఎవరికి పంపాలో అంతుపట్టలేదు. అందుచేత ఆ ప్రయత్నాన్ని కొనసాగించటంలో ప్రయోజనం కన్పించలేదు. కాని ఆ ప్రయత్నాన్ని మానుకోవటం నమ్మక ద్రోహం చేస్తున్నట్లు బాధ కలిగించేది.

ఒకవైపు మిత్రులపట్ల విశ్వాసంతో కూడిన ప్రవర్తన అనే ఆవేశం, మరోవైపు ఆలోచనా పూర్వకమై మహదాశయసమన్వితమైన నూతన కర్తవ్య స్వీకారం - ఈ రెంటికీ మధ్యజరిగిన తీవ్రసంఘర్షణలో మానసికంగా తీవ్రవేదన పొందాను. నా మిత్రులలో ఒకరియందు మాత్రమే గాఢ్ఢిగా విధేయత చూపేవాడిని. అతని ఆదేశము

నెప్పుడూ మరచిపోలేదు. అతడే జితేంద్రుడు. నేను ఇండియాను విడిచిపెట్టక పూర్వం జితేంద్రుడు రహస్య ప్రదేశానికి వెళ్తుండగా అతని వెంట ఉన్నాను. ఆ ప్రదేశంలోనే అతడు పోరాటం సాగించి చివరకు మరణించాడు. భావోన్మాదంతో 'ఆయుధాలు లేకుండా తిరిగి దేశంలో అడుగుపెట్టను' అన్న నా యువప్రతిజ్ఞకు సమాధానంగా ఆ వృద్ధుడు వాత్సల్యంతో 'ఆయుధాలున్నా లేకపోయినా వెంటనే తిరిగిరా నాయనా' అని కోరాడు. ఆ కోరిక నాకొక మహాదాదేశం. ఆ వృద్ధుడే మాకు సర్వసేనాని; మాకు దాదా!

జితేంద్రుని మృతి అతని ఆజ్ఞలను మన్నించాలిఅనే నైతిక విధినుండి నన్ను విముక్తుని చేసింది. 1915 శిశిరకాలంలో మనీలాద్వీపంలో ప్రయాణం చేస్తుండగా ఆ విషాదకరమైన వార్త విన్నాను. అప్పుడు నాలో ఉద్రేకపూరితమైన భావాలనేకం చెలరేగినై. జితేంద్రుని మృతికి ప్రతీకారం చేయాలి అనుకున్నాను. ఇంతలోనే సంవత్సరం గడిచిపోయింది. మానవత్వంలోని ఉత్తమమైనదంతా ఆకృతి వహించి జితేంద్రుడైనాడు; ఆ విషయం అతనికి తెలియక పోవచ్చు. కాని అందుచేతనే అతనిని నేను గౌరవిస్తున్నానని - మానవులలోని ఘనత వ్యక్తంకావటానికి అవకాశాలుండే సాంఘిక వ్యవస్థను నిర్మించటమే జితేంద్రుని మృతికి ప్రతీకారమనే అభిప్రాయానికి వచ్చాను. అదే నా నూతన కర్తవ్యం. ఇక వారి భీతి లేకుండా పాత ప్రయత్నాలన్నీ విరమింపవచ్చు. నా ఆవేశాన్నేకాక నా ఆలోచనా సామర్థ్యాన్ని కూడ బలంగా ఆకర్షించిన నూతన కర్తవ్యమే గోచరించక పోయినట్లయితే, నిరాశా, నిస్పృహల వలన పాత ఆశయాలతోపాటు సాహసోపేతమైన నా జీవితంగూడ అంతమై యుండేది.

## లజపతిరాయ్‌తో పరిచయం

ఆ రోజుల్లో లజపతిరాయ్ కూడా న్యూయార్కులోనే ఉన్నాడు. ఆ క్రిందటి సంవత్సరమే అచటికి చేరాడు. తన వాగ్ధాటితో భారత స్వాతంత్ర్యానికి సానుభూతిని సంపాదించాడు. ఒక విజేతగా అమెరికానుండి లండన్ మీదుగా ఇండియా చేరాలని లజపతిరాయ్ ఆశయం. కాని న్యూయార్కునుండి అతడు కదలరాదని ఆంగ్ల ప్రభుత్వం ఆంక్ష విధించింది. అమెరికాలోని కుట్రదారులతో అతనికి సంబంధం ఉందనీ, ఇండియా చేరగానే అరెస్టు చేస్తామనీ బెదరించింది. వలస రాజ్యాలలోని జాతీయవాదు లందరివలెనే లజపతిరాయ్ కూడా జర్మను అభిమాని. కాని కుట్రల విషయాలలో చాల జాగ్రత్తగ వ్యవహరించేవాడు. ఏమైనా, అరెస్టు కావటం ఇష్టంలేక లండన్‌నుండి అమెరికా తిరిగి వచ్చాడు. ఈ సంఘటనతో అతనిలోని బ్రిటిషు వ్యతిరేకత తీవ్రతరమైంది. కాని ఈ లోగా 'స్వేచ్ఛాభూమి'

(అమెరికా) లో రాజకీయ వాతావరణంలో వచ్చిన మార్పులు బ్రిటనుపై కత్తిగట్టిన ఈ మహావీరునకు బాధాకరమైన అనుభవాలకు కారణమైనై. బ్రిటనుపై వ్యతిరేక ప్రచారం జర్మనీకి సహాయం చేయటమని భావించి, మితవాదమిత్రులతనికి వెడ మొంగం పెట్టారు.

అప్పటికే లజపతిరాయ్ బాగావృద్ధుడు. పైనచెప్పిన అనుభవాలవల్ల అతనికి ఒంటరితనం సహింపరానిదై, స్వదేశవాంఛ మరింత బాధాకరమైంది. అమెరికా భోజనంకూడా గిట్టలేదతనికి. భారతీయ వంటకాలను నేను చేసిపెట్టినప్పు డెంతో ఆనందించేవాడు. ఒకరోజున 'రసగుల్లాలు చేయగలవా?' అని అడిగాడు. రసగుల్లా బెంగాలు వంటకం; లజపతిరాయ్ పంజాబీ; బెంగాలు సంస్కృతి పంజాబులోకూడా ఆదరాన్ని పొందటం నాకు గర్వకారణమైంది. రసగుల్లాలు చేసే ఉద్యమానికి పూనుకున్నాను. ఆటవికతే నాగరికతగా చలామణి అయ్యే ఈ దూరదేశంలో రసగుల్లాలకు కావలసిన సరుకులు దొరకటం దుర్లభమని అనుకున్నాను. రసగుల్లాలు చేయటానికి 'జునా' అవసరం. దీన్ని కాగే పాలతో చేస్తారు. అది అమెరికాలో దొరకదు. ఐనా నా ప్రయత్నం ఫలించటం నాకే ఆశ్చర్యం కలిగించింది. రసగుల్లాలు తినటంలో ఆ వృద్ధుడు పసిపిల్లవాడులా ప్రవర్తించాడు! మే మిద్దరం మిత్రులమైనాం; కేవలం తిండికోసమేకాదు మా మైత్రి. ఇద్దరమూ ఏదో రూపంలో ఆశాభంగంచే దెబ్బతిన్నవాళ్ళమే. ప్రస్తుతం, లజపతి రాయ్ ఆశయం ఇండియాకు వెళ్ళి గొప్ప బహిరంగసభలో ప్రజలకు మహత్తర సందేశాన్నిచ్చి దేహం చాలించాలని; ఇక నా ఆశయం జర్మనీవెళ్ళి ఆయుధాలు సంపాదించి భారతదేశాన్ని దాస్యంనుండి విముక్తి చేయాలని; పరిస్థితులు మా చేతుల్లో లేవు; పరస్పరం కష్టసుఖాలు వెళ్ళబోసుకొన్నాం; ఒకరినొకరు ఓదార్చుకొన్నాం.

అమెరికాలో సానుభూతిపరులకోసం వెదకి చివరకు రాడికల్ వాదులను (Radicals) పట్టుకొన్నాం. సోషలిస్టులను, సిండికలిస్టులను నాడు అమెరికాలో అతివాదులనేవారు. నాటికింకా కమ్యూనిస్టులు జన్మించలేదు. సిండికలిస్టులు అరాచకవాదులు. వీరు మార్క్సు భౌతికవాదాన్ని ఆరాధిస్తారు. వీరు ప్రచారం చేసేది సాంఘిక విప్లవవాదం. వీరు అటు జర్మనీకిగాని ఇటు బ్రిటనుకుగాని విరోధులు కారు; వీరు ముఖ్యంగా శాంతివాదులు. అందులోనూ కొందరు సామ్రాజ్యవాద వ్యతిరేకులు. వీరిలో యూనిటేరియను సిద్ధాంతానికి చెందిన ఒక ఆచార్యు డుండే వాడు; ఆర్థికంగా వలసలు మాతృదేశానికి లాభసాటిగాదని అతడు వాదించటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. మేము జాతీయవాదులం కావటంచేత, అతివాదుల సాంఘిక విప్లవసిద్ధాంతం మాకు నచ్చలేదు. అదీగాక, భారతీయులకు సహజలక్షణమైన ఆధ్యాత్మిక ప్రజ్ఞతో (Spiritual genius) మార్క్సు భౌతికవాదాన్నిగూడా

తీవ్రంగా నిరసించాం. ఐనప్పటికీ పరాధీన ప్రజల స్వాతంత్ర్య వాంఛలతో అతివాదులు సానుభూతి వహించటంచేత లజపతిరాయ్‌కి క్రొత్త ఉపన్యాస వేదిక లభించింది. లజపతిరాయ్‌కి ఒక అలవాటుంది. ప్రేక్షకులు ఎంత కొద్దిమందిఉన్నా అతడు బిగ్గరగా ఉపన్యసించేవాడు. స్వగాత్ర మాధుర్యాన్ని విని ఆనందించటమే వక్తృత్వంలోని పరమరహస్యం! లజపతిరాయ్ మహావక్త. నేను వక్తనుకాదు; అప్పటివరకూ కుట్రదారుగానే జీవితం గడపటమే నేను వక్తగా రాణించక పోవటానికి కారణం.

సోషలిస్టు ఆర్థికవిధానాన్ని తిరస్కరించటం, మార్క్సు భౌతికవాదాన్ని ప్రతిఘటించటం మా జాతీయతకు నూతన ఆదర్శంగా కన్పించింది. ఈ సందర్భంలో మాకు మిత్రులు, సానుభూతిపరులు ఐన వారితోనే (అతివాదులతో) యుద్ధానికి దిగవలసివచ్చింది. ఐనా వెనుకంజ వేయలేదు. కాని యుద్ధానికి దిగటానికిముందు ప్రతిపక్షుల బలాబలాలు పూర్తిగా తెలుసుకోవాలి. నాచేతిలో దమ్మిడీ లేదు. లజపతిరాయే మార్క్సు గ్రంథాలను, ఇతర సోషలిస్టు అధికార గ్రంథాలను కొన్నాడు. చదువు ప్రారంభించాను. కాని నా చదువు ఏ ఆశయంతో ప్రారంభించానో దానికే భంగం కలిగించేటట్లు కన్పించింది. ఐనా పరవాలేదు. నేను వెనుకంజ వేయటంవల్ల మహావీరుడైన లజపతిరాయ్ ధైర్యోత్సాహాలు చలించవు. కాని నా చదువు ఫలితంగా నా జీవితంలో అత్యంతక్లిష్టమైన సన్నివేశానికి వచ్చాను. లజపతిరాయ్ దారి, నా దారి వేరైనై.

## క్రొత్త వెలుగు

'గొప్ప ప్రాచీన సంస్కృతిగల ఇండియా దాస్యంలో క్రుగ్గిపోతుండగా, శ్రామిక వర్గదోపిడి అనే సూత్రానికి అర్థంలేదు' అనే విషయంపై సోషలిస్టు సభలో లజపతిరాయ్ మాట్లాడాడు. భారతీయుల దారిద్ర్యాన్ని కన్నులకు గట్టినట్లు వర్ణించిన అతని బ్రిటీషు వ్యతిరేకత ప్రేక్షకుల నుత్సాహ లూగించింది. అక్కడ చేరిన వారంతా దోపిడీ విధానాన్ని నిరసించేవారే. కాని వారిలో కలిగిన ఉత్సాహం ఎంతో కాలం నిలువలేదు. సభలో చివర కూర్చున్నవ్యక్తి ఒకరు లేచి లజపతిరాయ్ నుద్దేశించి ఇలా ప్రశ్నించాడు: "హాలులో సమావేశమైన వారందరూ సామ్రాజ్య దోపిడీ విధానానికి వ్యతిరేకులే. వీరి తరఫున మిమ్మల నొక ప్రశ్న అడుగుతాను. భారతీయుల దారిద్ర్యాన్ని రూపుమాపడానికి జాతీయవాదుల ప్రణాళిక యేమిటి?"

దీనితో ఉపన్యాసకునికీ పృచ్ఛకునికీ మధ్య తీవ్రవాగ్వాదం జరిగింది. లజపతిరాయ్‌లో ఓర్పు నశించి, ఆవేశం హెచ్చింది. "ముందు మాకొంపకు మమ్మల్ని యజమానులము కానివ్వండి. తర్వాత దాన్ని మేము చక్కబెట్టుకొంటాం" అన్న

అతనిమాట లెవ్వరికీ తృప్తి నివ్వలేదు. రెచ్చగొట్టుతున్న ధోరణిలో ఆ పృచ్ఛకుడు "భారత పెట్టుబడిదారుల దోపిడికి, విదేశ సామ్రాజ్యవాదుల దోపిడికి భేదమేమిటి!" అని అడిగాడు. లజపతిరాయ్ కోపం మిన్ను ముట్టింది. "సోదరునిచే తన్నులు తినటం లోను, పరాయివాడిచే తన్నులు తినటంలోనూ వ్యత్యాసం లేదూ?" అన్నాడు. ప్రేక్షకులు ఆశ్చర్యంతో నిశ్చలులై పోయారు. మొదట్లో నాకుగూడా 'హాబోసు' వితండవాదంతో లజపతిరాయ్‌కి వచ్చినంత కోపమూ వచ్చింది. అమెరికాలో కార్మిక ఉద్యమాలలోని వామపక్షీయులను 'హాబోసు' అని హేళనగా పిలిచేవారు. కాని క్రమంగా మా జాతీయ విధానంలో ఏదో లోటుందనే అసంతృప్తి నాలో కలిగింది. నా మనస్సులో క్రొత్త వెలుగు మెరిసింది.

ఆ హాలంతా అల్లకల్లోలంగా ఉంది. దాన్ని విడిచి, చిందర వందరగా ఉన్న మనసుతో బయలుదేరాను. స్వాతంత్ర్యం క్రొత్త క్రొత్త రంగుల్లో ప్రత్యక్షం కాసాగింది. నాటినుండి లజపతిరాయ్‌ని, ఇతర మిత్రులను విడిచి న్యూయార్కు పబ్లిక్ గ్రంథాలయానికి వెళ్ళటం ప్రారంభించాను. మార్క్సు గ్రంథాలు చదివి, అందులో క్రొత్త అర్థం కనుక్కున్నాను. క్రమంగా భౌతికవాదం మినహాయించి మిగిలిన సోషలిస్టు సిద్ధాంతాన్ని అంగీకరించటానికి నాకు అభ్యంతరం లేకపోయింది. ఇక నా జాతీయతకు ఆధ్యాత్మికవాదమే మిగిలిన రక్షణశ్రేణి. ఆ రక్షణశ్రేణిని చాలారోజుల వరకూ కాపాడుకుంటూ వచ్చాను.

ఇంతకు పూర్వమే, జాతీయవాదం దృష్ట్యా, శాంతి విధానాన్ని విమర్శిస్తూ ఒక వ్యాసం వ్రాయాలనుకొన్నాను. సామ్రాజ్యవాదమే యుద్ధానికి కారణమని భావించటంచేత, పరాధీనప్రజల దాస్యవిముక్తియే - అందులోనూ ఇండియా స్వాతంత్ర్యమే సుస్థిరశాంతికి మార్గమని ఆ వ్యాసంలోని సారాంశం. కాని, పైన వివరించిన సంఘటన తర్వాత జరిగిన గ్రంథపఠనంవల్ల అంతర్జాతీయ సంఘర్షణలను గురించిన క్రొత్తవిషయాలనేకం గ్రహించాను. ఈ విజ్ఞానంవల్ల నా పాతసిద్ధాంతాలలో నాకు అనుమానాలు రాసాగినై, అందుచేత ఆ వ్యాసాన్ని తిరిగి వ్రాయటానికి పూను కొన్నాను. వ్యాసం మొదటిదానికన్న చాల పెద్దదైంది. కొంచెం డబ్బు రావచ్చనే ఆశతో ప్రముఖ సోషలిస్టు పత్రికాకారచయితకు నా వ్యాసం చూపించాను. కొన్ని రోజుల తర్వాత రాడికల్ విజ్ఞానుల సమావేశంలో అతణ్ణి మరల కలుసుకున్నాను. సోషలిస్టు దృక్పథంతో యుద్ధకారణాలను చక్కగా వివరించినందులకు నన్నాతడభినందించాడు. ఇండియానుండి ప్రథమ సోషలిస్టుగా నన్ను వారి సమాజంలోకి ఆహ్వానించాడు.

## అరెస్టు - మెక్సికోకు పలాయనం

### ప్రపంచయుద్ధం - విల్సన్ ఆదర్శవాదం

జర్మనీ స్నేహ సానుభూతులతో బ్రిటిషు సామ్రాజ్యవాదాన్ని కూలద్రోసే ఉద్యమంలో, విప్లవ జాతీయత పంపిన రాయబారిగా అమెరికా వచ్చాను. నేతాజీ కంటె 25 సంవత్సరాలు ముందుగనే అదే ఆశయంతో జర్మనీ ప్రయాణం కట్టాను. కాని నా యాత్ర న్యూయార్కు నగరంలోనే ఆగిపోయింది. అందుకు కారణాలను 'భారతదేశానికి వెలుపల భారతీయ విప్లవ చరిత్ర'ను వ్రాయటం సంభవిస్తే అందులో వివరిస్తాను. ఆ కారణాలు ఉత్సాహ ఉద్రేకాలు కలిగిస్తై అనటంలో సందేహం లేదు. కాని శాశ్వితంగా గుర్తుంచుకోతగినంత ముఖ్యమైనవేమీ కాదు. నా యాత్రలో నాకు ఆశాభంగమే కలిగింది. కాని ఆశాభంగం చెడు ఫలితాలకు దారితీయక నాకు మేలు కూర్చింది. సంకుచిత మనస్తత్వంతో ఫలశూన్యమైన నా గత చరిత్రను విస్మరింప జేసి, ఉత్కృష్టమైన అనుభవాలతో, గర్వింపదగిన సాహసాలతో నిండిన అజ్ఞాత భావిజీవితంలోనికి నా దృష్టిని ప్రసరింప జేసింది. ఆ భావిజీవితం కూడా నిరాశాత్మకంగానే పరిణమించిందనే విషయంతో మనకిప్పుడు ప్రమేయంలేదు. ఒక క్రొత్త ప్రపంచంలోనికి ఆవేశపూరితమైన యాత్ర ప్రారంభమైంది.

అమెరికా స్వేచ్ఛాప్రపంచమనీ, అచ్చట తమకు సానుభూతి సహకారాలు లభించగలవనీ ఆశపడి భారతీయులనేకు లచటికి చేరారు. కాని మొదటి ప్రపంచ యుద్ధంలో అమెరికా తటస్థంగా ఉన్న 18 నెలలూ, భారతీయుల కచట పరీక్షా సమయంగా తయారైంది. బ్రిటిషు వ్యతిరేక ప్రచారం సాగిస్తున్న భారతీయులకు మొట్టమొదట అమెరికాలో మంచి ప్రోత్సాహందొరికింది. మితవాద పత్రికలలోనూ, వేదికలమీదా, లజపతిరాయ్ మున్నగువారికి స్థానమిచ్చారు. క్రమంగా భారతీయులు విచక్షణాజ్ఞానంలేకుండా ప్రవర్తించారు. అందుచేత భారతీయుల ప్రచారం, జర్మనుల ప్రచారంలో లీనమై, తమ తాటస్థ్యానికి భంగం కలిగిస్తున్నదని అమెరికనులు భావింప సాగారు. తటస్థవిధానాన్ని బలపరచటంవల్లనే 1916 ఎన్నికల్లో ఉడ్రోవిల్సన్ అధ్యక్షపదవికి ఎన్నుకోబడ్డాడు. ఆరు నెలలైనా నిండక పూర్వమే, తాటస్థ్యం లాభసాటిగా లేదని ఆ విధానానికి విల్సన్ స్వస్తిచెప్పాడు. ఈ ఆరు నెల్లలోను అమెరికాలో జర్మనీపట్ల వ్యతిరేకత బాగా బలపడింది. ఇటువంటి వాతావరణంలో భారతీయుల బ్రిటిషు వ్యతిరేక ప్రచారం జర్మనులకు అనుకూల ప్రచారమని నిరసింప బడింది. భారతీయులు అమెరికా సానుభూతిని కోల్పోయారు. అమెరికా విప్లవం (1776) నాటి బ్రిటిషు వ్యతిరేక సంప్రదాయాలను సూచించి భారతీయు లెంత మొత్తుకున్నా లాభంలేక పోయింది. భారత జాతీయవాదులు జర్మనీ యేజంట్లనీ, వెంటనే

వారందరినీ నిర్బంధించి అమెరికా యుద్ధంలో చేరిన తరువాత వారిని విచారించాలనీ అమెరికనులు ప్రచారం మొదలు పెట్టారు.

తటస్థవిధానాన్ని బలపరచటంవల్లనే విల్సన్ అమెరికా అధ్యక్షుడు కాగలిగాడని చెప్పాను. కాని అమెరికాలో నానాటికి యుద్ధోన్మాదం విజృంభించింది. 'లూసిటానియా'ను జర్మనులు ముంచివేయటం అగ్నిలో ఆజ్యం పోసినట్లైంది. మిత్ర రాజ్యాలు (బ్రిటను, ఫ్రాన్సు, రష్యాలు) ఓడిపోతే, ఆ దేశాల్లో అమెరికా పెట్టుబడి పెట్టిన ధనమంతా బూడిదలో పోసినట్లే. అదీగాక విల్సన్ మహాశయుడంటే మూర్తీభవించిన అమెరికా ఆదర్శవాదం! జర్మనీకి ఆహుతియైన బెల్జియం ఫ్రాన్సుపట్ల అతని ఆదర్శవాదం సానుభూతి వహించింది. ఐనప్పటికీ, అమెరికా వ్యాపార వర్గమంతా తటస్థ విధానానికే సుముఖంగా ఉంది. చివరకు జర్మన్ జలాంతర్గాములు వారి ఆయుధ వ్యాపారానికి హాని కలిగించటంతో, ఈ వ్యాపారవర్గ శాంతివాదమంతా మటుమాయమైంది. పైగా ఐరోపాలో అపాయంలో చిక్కుకున్న తమ శ్రేయస్సులను రక్షించుకోటానికి అమెరికా యుద్ధంలో దిగాలని వారు వాదింప సాగారు.

1917 లో జరిగిన మరొక సంఘటన అమెరికా రాజకీయ ఆదర్శవాదాన్ని మరింత బలపరిచింది. 'ప్రజాస్వామ్యానికి యోగ్యంగా ప్రపంచాన్ని రూపొందించటమే యుద్ధాశయమ'ని విల్సన్ నినాదము. కాని 1917 వరకు ప్రజాస్వామ్య దేశాలైన ఫ్రాన్సు, బ్రిటనులు నిరంకుశ రాచరికం అమలులోనున్న జారిస్టు రష్యాతో చేతులు కలిపి యుద్ధం చేస్తున్నై. ఈ రాజ్యాలకు సహాయం చేసినట్లయితే విల్సన్ నినాదంలో అర్థం ఉండదు. ప్రష్యా (జర్మనీ) అనుసరిస్తున్నది యుద్ధవిధానం; రష్యా అనుసరించేది ఆటవిక విధానం! ఈ రెంటికీ తేడాలేదు. అందుచేత రష్యా చేస్తున్న మారణహోమం రైనునది వరకు వ్యాపించితే - అంటే ఫ్రాన్సు వరకు ఉన్న జర్మనీని రష్యా జయింపగలిగితే - ఐరోపాలో ప్రజాస్వామ్యం క్షేమంగా ఉండగలదా అనే సందేహం అమెరికాను బాధించింది. 1917 ఫిబ్రవరిలో రష్యా ప్రజలు నిరంకుశ రాచరికాన్ని కూలద్రోసి లిబరల్ ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని (కెరన్స్కీ ప్రభుత్వం) స్థాపించడంతో పై సందేహాలు నివృత్తియైనవి. ఈ క్రొత్త ప్రభుత్వం కూడా జర్మను దురాక్రమణ సన్నాహాల నరికట్టలేక పోతోంది. ఇందులో వైపరీత్యమేమీ లేదు. రాజాస్థాన దురాచారాలతో, అవినీతితో అసమర్థమైన జారుప్రభుత్వంవల్ల ఏర్పడిన అరాచక పరిస్థితుల్లోనుండి ఉద్భవించటంచేతనే రష్యా క్రొత్త ప్రభుత్వం జర్మనీ చేతుల్లో ఓడిపోతోంది. మరి కొంత కాలానికి రష్యా యుద్ధంనుండి పూర్తిగా విరమించింది. ఈ పరిణామాలవలన మరొక క్రొత్త సమస్య యేర్పడింది. రష్యా యుద్ధంనుండి విరమించటంతో జర్మనీభారం చాలావరకు తగ్గింది. ఇక తన యావత్తు యుద్ధసరంజామును జర్మనీ పశ్చిమరంగంమీదనే అంటే ఫ్రాన్సు, బ్రిటనులమీదనే

కేంద్రీకరించటానికి వీలైంది. దీనితో మిత్రరాజ్యాలైన ఫ్రాన్సు బ్రిటనులు పూర్తిగా ఇరుకున పడిపోయినై.

హఠాత్తుగా ఏర్పడిన ఈ విపత్కర పరిస్థితులలో 'ప్రజాస్వామ్య భద్రత' అనే విల్సన్ నినాదాన్ని కార్యరూపంలో పెట్టవలసిన జరూరు కలిగింది. వ్యాపార శ్రేయస్సులను బలపరచిన రాజకీయ ఆదర్శవాదం ఇప్పుడు ప్రజాభిప్రాయాన్ని ప్రత్యక్షంగా యుద్ధోన్ముఖం చేసింది. అపాయంలో ఉన్న ప్రజాస్వామ్యాలను రక్షించటానికి అమెరికా తక్షణం యుద్ధంలో చేరాలి. జూన్ 7వ తారీఖున జర్మనీపై అమెరికా యుద్ధం ప్రకటించింది. 'యుద్ధాలను తుదముట్టించే ఈ యుద్ధాన్ని' అమెరికా శాసనసభలో (కాంగ్రెస్) ఏకైక స్త్రీకంఠం మాత్రమే వ్యతిరేకించింది. కాని లాభం లేకపోయింది.

ఈ సంఘటన అమెరికాలోని భారతీయులకు, జర్మను ప్రచారకులకు పిడుగుపాటైంది. అమెరికాలో 20 లక్షలమంది జర్మను లున్నారు; ఇంగ్లండు అంటే మండిపడే ఐరిషువారు ఉన్నారు. తమ పెంపుడు తల్లియైన అమెరికా జర్మనీపై యుద్ధం ప్రకటించినందుకు నిరసనగా, 20 లక్షలమంది జర్మనులు ఐరిషువారి సాయంతో తిరుగుబాటు చేస్తారని జర్మను ప్రచారకులు ఆశించారు. బ్రిటను పరాజయాన్ని, జర్మనీ అజేయసైనిక సంపత్తిని గురించి కలలుకంటున్న భారతీయులు గూడా తమ పోషకులైన జర్మనుల వలెనే ఊహిస్తూ ఉండేవారు. ట్యూటన్ జాతులు యుద్ధప్రియులు; ఆ జాతులకే చెందినవారు కావటంచేత అమెరికను జర్మనులలో గూడా యుద్ధోన్మాదం చెలరేగింది. వారు అమెరికాపట్ల పక్షపాతం వహించి, అందుకు వ్యతిరేకంగా ఊహించిన వారికి ఆశాభంగం కలిగించారు. సిద్ధాంతరీత్యా రక్తసంబంధం బలీయమైనదే; కాని వాస్తవిక జీవితపరిస్థితులలో అది బలహీనమైపోయింది. నూతన మాతృదేశంలో తమకున్న ప్రస్తుత శ్రేయస్సుల ముందు, పూర్వ మాతృదేశంపట్ల గల ఆవేశపూరితమైన ఆదరాభిమానాలు నిలువలేకపోయినై. ఋజు విశ్వాసానికి సరియైన పునాది యుక్తాయుక్త విచక్షణజ్ఞానమేగాని ఆవేశంకాదు.

అంతకుపూర్వం విదేశీ హక్కులనే తెరవెనుక, జర్మన్ ప్రచారక దళాధిపతులు భాగోతాన్ని ప్రారంభించారు. వారి ప్రతినిధులు, భారత విప్లవకారులు కలిసి ఇండియాకు ఆయుధాలు పంపే పథకం ఒకటి తయారు చేశారు. వారిలో కొంచెం బుద్ధి సూక్ష్మతగల వారికే యిది ఒక నాటకంగా తోచింది. అమెరికాలో జర్మన్ నౌకాదళాధికారియైన వాన్‌పాపెన్ ఇండియాకు ఆయుధాలు పంపే తాపత్రయంలో ఉన్నాడు. 'స్టార్ హంట్' (నక్షత్రాలను వేటాడువాడు - అని అర్థం) అనేవాడు ఆయుధసేకరణ నిమిత్తం, వాన్‌పాపెన్ దగ్గర చాలాధనం సంగ్రహించాడు. దక్షిణ కాలిఫోర్నియా రేవుపట్టణమైన శాన్‌డిగో నుండి బయలు

చేరింది, ఆయుధనౌక. 1914 లో ఇండియాకి ఆ వర్తమానం చేరింది. ఆ నౌకను స్వాగతమీయటానికే నేను జావా వెళ్ళింది. చివరకు 'ఆ పెన్నిధానం' తెస్తున్నది ఒక తుక్కు టాంకరు అనీ, దాన్ని ఆస్ట్రేలియా గస్తీనౌకలు పట్టుకొని సింగపూరుకు మరలించాయనీ తెలిసికొన్నాను. యుద్ధకాలంలో భారత విప్లవకారులకు జర్మను లిచ్చిన వాగ్దానాల స్వభావాన్ని ముందే వివరించాను. పై సంఘటనవల్లనే జర్మను వాగ్దానాలు వట్టి బూటకమనీ, ధనార్జనే ఆశయంగాగల స్వార్థపరులు భారతీయులను మోసం చేశారనీ తెలుస్తుంది. స్టార్ హంట్‌ను 1915 లో బటేవియాలో ఒక దివ్యమైన హోటల్లో చూచాను. విలాసంగా కాలక్షేపం చేస్తున్నాడు. అప్పటికి భారతదేశానికి జర్మనీ చేయగల గుప్త సహాయంలోనూ, జర్మను వాగ్దానాలలోనూ నాకున్న విశ్వాసం సడలలేదు. తిరిగి స్టార్ హంట్‌ను మెక్సికోలో కలుసుకున్నాను. అప్పుడు కూడా అతడేదో అటువంటి ఉద్యమంలోనే మునిగి తేలుతున్నాడు.

వైదేశిక హక్కులకు భంగకరంగా ప్రవర్తిస్తున్నాడనీ, తమ మిత్రరాజ్యాలకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమాలకు సహాయం చేస్తున్నాడనీ, అందుచేత వాన్ పాపెన్‌ను తొలగించవలసిందనీ, యుద్ధంలో చేరక పూర్వమే అమెరికా జర్మనీని కోరింది. జర్మనులు, వారి మిత్రులైన భారతీయులు చేస్తున్న చర్యలు అమెరికా రహస్య పరిశోధకశాఖకు తెలియనివి కావు. ఆ శాఖలోని కొందరు ఉద్యోగులు కూడా ఈ కుట్రలో ఉన్నారు. మరొక విశేషమేమంటే, ఉన్నత పదవుల్లో ఉన్న జర్మన్ ప్రతినిధులే మాతృదేశ విజయంపట్ల అశ్రద్ధ వహించి డబ్బు చేసికొనే ఆరాటంలో పడ్డారు. అట్టి వారిలో స్టార్ హంట్ ఒకడనటంలో సందేహం లేదు. అటువంటి వారినే మరిద్దరిని జావాలో చూచాను. 1917 లో నేను మెక్సికో వెళ్ళినప్పుడు వారక్కడ దర్జాగా కాలక్షేపం చేస్తున్నారు.

మొదట్లో తటస్థ చట్టానికి భంగం కలిగించే హిందూ - జర్మను కుట్రపై అమెరికా చర్య తీసికొనక పోవటానికి గల స్వల్పకారణాలను పైన వివరించాను. కాని అమెరికా యుద్ధంలో చేరిన వారం రోజులలోనే జర్మను యేజంట్లూ, భారత విప్లవకారులూ చాలామంది కాలిఫోర్నియా, న్యూయార్కు నగరాలలో నిర్బధింపబడ్డారు. దూరప్రాచ్య, ఆగ్నేయ ఆసియా రాజ్యాలలో శాఖలు స్థాపించి పని చేస్తున్న హిందూ జర్మను కుట్రను గురించిన సమాచారం పత్రికల్లో ప్రచురింపబడింది. ఒక రోజు సాయంత్రం కొలంబియా విశ్వవిద్యాలయంలో లజపతిరాయ్ ఉపన్యాసం విని వస్తుండగా నన్ను అరెస్టు చేశారు.

## అరెస్టు :

కొలంబియా విశ్వవిద్యాలయ * ఆవరణలో జరిగిన నా అరెస్టును తలుచుకుంటే ఏదో అపరాధ పరిశోధక నవలలోని ఒక అద్భుత సన్నివేశంగా తోస్తుంది. అరడజను మంది యోధులు చీకటిలో నాపై దూకారు. ఈ హైందవ విప్లవకారుడు కదిలే ఆయుధ కర్మాగారమని వారి ఉద్దేశ్యమై యుంటుంది. అజాగ్రత్త మంచిది కాదన్నట్లు రెండుపిస్తోళ్ళను నాపై బారుచేశారు. నాకు భయం, ఆశ్చర్యం, సంభ్రమమూ ఒక్కసారిగా కలిగినై. నా అరెస్టుకు కారణ మేమిటని వారి నడిగాను. నా ప్రశ్నకు సమాధానంగా 'త్వరగాపద' అంటూ నన్ను కొట్టారనటానికి వీల్లేదు గాని గట్టిగా కుదిపారు. దగ్గరలోఉన్న వాకిలిగుండా బైటనున్న కారులోకి లాక్కువెళ్ళారు. ఇది, ఇండియాకు వెలుపల మూడవదేశంలో పోలీసులతో నా అనుభవం. ముఖ్యంగా అమెరికా పోలీసులతో నాకు కల్గిన అనుభవం చాలా బాధాకరమైంది. వారు పట్టి మొండి శిఖండులు. ఇక జపానువారు హృదయంలో విషంవున్నా మాటలు మాత్రం మర్యాదగా ఉండేవి. చైనావాళ్ళు చైనా (నల్లమందు) వాళ్ళే. నన్ను తప్పుకు పోనిచ్చారు; అంటే నా మీద దయకొద్దీకాదు; పూర్తిగా అసమర్థులు కావటంచేతనే.

కొంతదూరంపోయి, కారొక పెద్దభవనంముందు ఆగింది. ఆ భవనం విషాదాచ్ఛాదితమైనట్లు కన్పించింది. మసక వెలుతురులో, పద్మవ్యూహంలాగా ఉన్న వరండాలగుండా నన్ను తీసుకువెళ్ళారు. మమ్మల్ని ఆవరించిన భయంకర నిశ్శబ్దం పోలీసులు తుపుక్కున ఉమ్మివేస్తున్న శబ్దంతో అప్పుడప్పుడు చెదరిపోతోంది. అమెరికా పోలీసులెప్పుడూ పొగాకు నములుతుంటారు. చుట్ట చివరలు వారి నోటి నుండి ఎప్పుడూ బైటపడేవి కావు. ఒక విశాలమైనగదిలో మా యాత్ర ముగిసింది. ఆ గది చక్కగా అలంకరింపబడి ఉంది. న్యూయార్కు జిల్లా అటార్నీ జనరలుకు నన్నప్పగించారు. అంతటితో పోలీసుల విధి పూర్తయింది.

అమెరికాలో జిల్లా అటార్నీ రెండు అధికారాలు నిర్వర్తిస్తాడు. ఒకవైపు పబ్లిక్ ప్రాసిక్యూటరు; మరొకవైపున పోలీసుల అధికారి. ఈ విషయంలో అమెరికా విధానం ఫ్రెంచివిధానానికి చాలా దగ్గర్లో ఉంటుంది. పోలీసు ఉద్యోగి హోదాలో నేరస్థులను కోర్టులో హాజరుపరచేముందు స్వయంగా విచారిస్తాడు అటార్నీ. ఇది చాలా అసభ్యమైన ఆచారం. అనుమానితుణ్ణి పూర్తిగా వినిగించి అతనిచేత పరస్పర విరుద్ధములైన వాంజాయిషీలు చెప్పించటమే దీని ప్రయోజనం. దీనితో నేరస్థుడు దొంకిపోవచ్చు. నేరస్థుడు తనంతటతానుగా సాక్ష్యంచెప్పుకోరాదని, ఆ సాక్ష్యాన్ని ఆధారంగా చేసుకొని నేరవిచారణ చేయరాదనీ ఉన్న ప్రజాస్వామ్య

* న్యూయార్కు నగరంలోనే ఉంది ఈ విశ్వవిద్యాలయము.

సూత్రాలకీ పద్ధతి విరుద్ధం. 'మిట్టమధ్యాహ్నం చీకటి' (Darkness at Noon) అనే తన గ్రంథంలో ఆర్థర్ కాస్లర్ నేరాలను ఒప్పుకొన చేయటానికి కమ్యూనిస్టు రష్యా ఉపయోగించే విధానాలను వర్ణించాడు. వాటికీ అమెరికాలోని పై పద్ధతికి వ్యత్యాసం లేదు.

శారీరకంగాగాని మానసికంగాగాని బాధ పెట్టకపోయినా పై విధాన మొక విచిత్రమైన అనుభవాన్నిచ్చింది. నాకింకా పాతిక సంవత్సరాలుకూడా నిండలేదు. ఐనా విప్లవచర్యలతో ముక్కాకలు తీరింది నా శరీరం. అటార్నీ జనరల్‌తో సమావేశం బాగానే ప్రారంభమైంది. గంట మ్రోగటంతో ఉల్లాసంగా నన్ను ఆహ్వానించాడు. ఉల్లాసము నేటి అమెరికావారికి సహజం! తను ఫలానా అనీ, నన్ను కొన్ని సంగతులు ప్రశ్నించబోతున్నాననీ, 'ప్రాచ్యవిజ్ఞాని' సత్యాన్ని దాచకుండా చెప్పగలడని ఆశిస్తున్నాననీ ప్రారంభించాడు. ఒక కుర్చీ చూపించి కూర్చోమన్నాడు. ఆ కుర్చీలో చర్మం పరచి ఉంది. కెరోనా చుట్ట ఒకటి అందించాడు. దర్పమే అమెరికాలో ప్రధాన లక్షణం; అక్కడ కెరోనా చుట్టలు అధికారానికీ, విలాసానికీ చిహ్నం; మరొక రకమైన చవకబారు చుట్టలుండేవి. అవి నీచుకంపు కొట్టేవి. అవి మోటుజాతి పురుషత్వానికి చిహ్నం. అమెరికా న్యాయస్థానాల్లో ఈ రెండు తరగతులకు చెందిన వ్యక్తులకు ప్రాతినిధ్యం ఉంది.

నన్ను హాజరు పెట్టిన న్యాయస్థానం ఒక 'భయంకరమైన సమాధి' అని గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. నగరమా ఆధునిక నాగరికతకు ఆలవాలమైన న్యూయార్కు; కారాగారమా మధ్యయుగాలకు లక్షణమైన భయంకరసమాధి! అందులో అటార్నీ జనరల్ దయాదాక్షిణ్యాలపై ఆధారపడి 'మూడవ డిగ్రీ' పుచ్చుకోటానికి సిద్ధంగా ఉన్న ఖైదీ లెందరో ఉన్నారు.

అటార్నీ చూపించిన ఈజీచైరులో కూర్చున్నాను. కాని 'కెరోనా' చుట్టను తిరస్కరించిన నా ప్రాచ్యసంస్కృతి అటార్నీని ఖంగారు పెట్టింది. గంభీరంగా ప్రారంభించాడు: 'ఈ దేశంలో ఎలా ప్రవేశించావు?' విషం గ్రక్కుతున్న నాగుబాము బుసలాగా వినిపించినై ఆ మాటలు.

కాని బ్రిటిష్ ఇండియాలో డెన్‌హాములు, టేగార్టులు మొదలైన సి. ఐ. డి. ప్రముఖుల ప్రశ్నపరంపరల కలవాటుపడిన నన్నామాట లేమీ కలవర పెట్టలేదు. 'సముద్రం మీదుగా' అన్నాను. పవిత్ర మత పీఠాధికారివంటి ఆ న్యాయాధికారికి నా సమాధానం కోపాన్ని కలిగించింది. 'జోనసుకో! ఎక్కడ దిగింది?' అని గద్దించాడు.

"పోలీసులకు సమాధానం చెప్పటానికి నేనేమీ వారి పెట్టుపోతల్లో లేను" అన్నాను. మరింత రెచ్చిపోయాడు అటార్నీ, "నాకన్నీ తెలుసు. నన్ను మోస గించాలను కుంటున్నావేమో! అటువంటి దురభిప్రాయం పెట్టుకోకు" అన్నాడు.

"ఐతే ఈ బాధంతా దేనికి? నేను మీ చేతుల్లో చిక్కాను. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చుగా! కాని ఒక్క విషయం. ఇప్పటివరకూ అమెరికా స్వేచ్ఛాభూమి అని మాత్రం దురభిప్రాయ పడ్డాను" అని సమాధాన మిచ్చాను.

ఈ నల్లవాని తలబిరుసుతనం అతణ్ణి తలక్రిందులు చేసింది. తన వెనుకనున్న వ్యక్తులవైపు చూచాడు. వారు తనకేమన్నా నైతిక బలాన్నిస్తారనో, లేకపోతే వారు ఉన్నారనే ధైర్యాన్ని చిక్కబట్టుకోటానికో మాత్రం తెలియదు. వారిద్దరూ అతనిక్రింది పోలీసు ఉద్యోగులై ఉంటారు. గారపట్టిన పళ్ళసందున నీచుకంపుకొట్టే చుట్టల నలాగే ఉంచి నాపై విషపునవ్వు ప్రసరిస్తూ 'వాణ్ణున్న చోటికే తీసుకు వెళ్ళు దామా?' అన్నారు. సమ్మతించినట్లు అటార్నీ తలత్రిప్పాడు.

ఎండ తీవ్రంగా కాస్తోంది; వరండాలు మండిపోతున్నై. వాటిగుండా తీసుకు వెళ్ళారు—సజీవుల సమాధిచెంతకు. ఆ రేచు కుక్కలు ఇనుప కటకటాలముందు నిలబడ్డారు. ఆ వెనుక ఒక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. అతనిస్థితి చూస్తే అతనిలో ప్రాణం ఉన్నదనిపించలేదు. నా వెంటనున్న ధర్మరక్షకులు నాతో "ఏయ్‌కుఱ్ఱాడా! అక్కడే ఉన్నాడు చూడు! అతడే 'జిడ్డువిప్లవకారుడు' (Greasy Revolutionary). వట్టి పిరికిపంద. మీ కథంతా మాకు చెప్పేశాడు. నీవిలా డాబుచేసి నందువల్ల వొరిగేదేమీ లేదు; మీ నాయకుడితోబాటు నువ్వూ చెప్పెయ్యి!" అన్నారు.

తిరిగి వెళ్ళేటప్పుడు పోలీసులు నాకొక సమాచారం చెప్పారు: "ఇంకా నల్లని, తెల్లని, పచ్చని పిట్టలన్నీ కూడా పట్టుబడినై. వారంతా ఇక్కడనే భద్రంగా ఉన్నారు." అని అంటూ "నీ గొయ్యి నీవెందుకు త్రవ్వు కుంటావోయ్ గవర్నర్" అన్నారు. అంత మర్యాదగా ఎందుకు సంబోధించారో నాకర్థం కాలేదు. ఎవరా విప్లవ నాయకుడు? అనే సందేహం పట్టుకుంది. అతడు నాకు చిరపరిచితుడేనని మరునాడుదయం తెలిసింది. నా ఆశ్చర్యానికి అంతులేకపోయింది.

మరునాడు దుర్భరదృశ్యాలతో నిండిన సజీవుల సమాధి వరండాలగుండా నడిచి జిల్లా అటార్నీ కార్యాలయం చేరాము. ఏదో రహస్య సాధనంద్వారా మా రాక తెలిసినట్లుంది; తలుపులు తెరువబడినై.

రాత్రి లాగానే అటార్నీ నాకు స్వాగత మిచ్చాడు. క్రౌర్యంవల్ల వంకర తిరిగిన పెదవులపై విషపు నవ్వుతో, ఈజీచైరులో కూర్చోమని సూచించి కుర్చీలో చేరగిల బడ్డాడు. కరోనా చుట్టను వ్రేళ్ళసందుల్లో పెట్టి ప్రారంభించాడు:

"ఫాదర్ మార్టిన్! మంచి క్రిష్టియనులాగా ప్రవర్తించు. ఇప్పటికే చాలా ఆలస్యమై పోయింది. నామీద దయచూపించు. నాకు పెళ్ళాం బిడ్డ లున్నారు. నీకు తెలియని దేముంది?" అన్నాడు వ్యంగ్యంగా.

పసిఫిక్ మహాసముద్రంమీద ప్రయాణం చేయటానికి సంపాదించిన ప్యాస్ పోర్టుమీద ఫాదర్ మార్టిన్ అనే పేరుంది. తాత్కాలికంగా సృష్టించిన ఆకథను, ఆపత్రాన్ని నామరూపాలులేకుండా చేసినా, ప్రయాణీకుల జాబితాలో ఆ పేరే చేర్చ బడినట్లు గుర్తుంది. అటార్నీ నోట ఆ మాట వినటంతో నాకాశ్చర్యం కలిగింది. ఐనా క్షణంలో తేరుకున్నాను. ఈలోగా అతని ముఖముల్ గ్లోవులు క్రిందపడి పోయినై. అందుచేత నా ఆశ్చర్యాన్ని అతడు బహుశా చూచి ఉండడు. నిటారుగా కూర్చుని బల్లమధ్య చేతిపై గడ్డాన్ని ఆనించి కఠోరమైన స్వరంతో :

"నీవు తొణకవని అనుకుంటూనే ఉన్నాను. ఐనా నీ వెక్కడున్నావో నీకు తెలుసు; నీ యిష్టం; సజీవసమాధి ఇచ్చే ఆతిథ్యమో స్వేచ్ఛావాతావరణమో నీవే నిర్ణయించుకోవాలి" అని హెచ్చరించాడు.

జుగుప్సాకరమైన ఈ పరీక్షను అంతటితో ఆపివేయాలనే ఉద్దేశ్యంతో అన్నాను : "మహాశయా! సమాధికంటె నేననుభవించిన జైలు జీవితం తీసిపోదు. అందుచేత మీరు నన్ను భయపెట్టి ప్రయోజనం లేదు. కాని నేను కోరేది స్వేచ్ఛ. నాకు జీవితంలో ఒక కర్తవ్యం ఉంది. (నా కర్తవ్యంలో ఇంకా నాకు విశ్వాసం తగ్గలేదు.) ఈ దేశానికి అణుమాత్రమైనా కీడు తలపెట్టటం లేదు. నా దేశానికి సేవచేయటమే నా ఆశయం. అందులోఉన్న తప్పేమిటో నా కర్థం కావటంలేదు."

అటార్నీ క్షణం ఆలోచించి స్నేహార్ద్రస్వరంతో అన్నాడు: "మా దేశం లోని సంచార చట్టాన్ని నీవు అతిక్రమించావు."

నాకు అవకాశం చిక్కింది. ఆ అవకాశాన్ని జారిపోకుండా ఉపయోగించు కోనటం వావంతు: "చీమల పుట్టను మహాపర్వతం చేస్తున్నారు. ఇది భావ్యం గాదు. త్వరలోనే మీ దేశం విడిచిపోతాను" అని చెప్పాను.

గంభీరంగా లేచి నా దగ్గరకు వచ్చి భుజం తట్టుతూ "ఇప్పటికి నిన్ను విడిచి పెట్టున్నాను. రేపు 11 గంటలకు గ్రాండ్ జ్యూరీ ఎదుట హాజరు కావాలి" అంటూ తన కాళ్ళకు జిక్కిన ఎరను చూచే రాబందులాగా చూస్తూ ఉల్లాసంగా, 'పారిపోవని నమ్ముతాను, గుడ్ మార్నింగ్' అని, తర్వాత వెనక్కు తిరిగి అక్కడున్న వారితో 'ఈ పెద్దమనిషిని టాక్సీ ఎక్కించండి. ఇంటికి వెళ్తాడు' అని ఆజ్ఞాపించాడు.

వరండాలో ఉన్న పోలీసులు అటార్నీ ఆజ్ఞలకు అసమ్మతిగా గొణిగారు. ఏమైనా ఆజ్ఞ ఆజ్ఞే; అనుల్లంఘనీయం. క్షణంలో చల్లనిగాలి నన్ను నిద్రమత్తులో

నుండి మేల్కొలిపింది. కాని ఆ అనుభూతి అంత ఉల్లాసకరంగా లేదు. విముక్తికి ఆస్కారమే లేని సజీవుల సమాధిలోనుండి ఇంత సులభంగా, ఇంత త్వరలో బైట పడటమా! అసంభవం అనే భయం పీడింపసాగింది.

టాక్సిలోనే నాటి సాయంత్రం జరిగిన సంఘటనలను నెమరవేయసాగాను. అంతా పీడకలగా కన్పించింది. ఆ కల అంతటితో ఆఖరు కావాలనే నా నిర్ణయం. భవిష్యత్తునుగూర్చి ఆలోచన మొదలుపెట్టాను. నగరంలో నేను ఉత్తరభాగంలో వుంటున్నాను. అక్కడికి వెళ్ళేసరికి అరుణోదయమైంది. అప్పటికే పత్రికలమ్మే పిల్లలు అరుస్తున్నారు: 'హిందూ జర్మను కుట్ర బైటపడింది', "శత్రు ప్రతినిధులు అరెస్టయినారు." చాలా పత్రికలు కొన్నాను. ఒక పత్రికలో "జిడ్డు విప్లవనాయకుడు సమాధిలో బంధింపబడ్డాడు" అని వుంది. మరునాడుదయం రోడ్డుమీదికి వెళ్ళినప్పుడు అనేక భారత విప్లవకారులు అరెస్టయినారనీ, అందులో డాక్టర్ చక్రవర్తి ఒకడనీ విన్నాను. బెర్లిన్‌లోని భారత విప్లవసంఘానికి ప్రతినిధినంటూ చెప్పుకునే వాడు డాక్టర్ చక్రవర్తి. దృష్టినాకర్షించే అవమానకరమైన ప్రధానశీర్షికలే చవకబారు పత్రికారచనలకు ప్రధాన లక్షణం. ఆ పత్రికారచనలోని విశేషాలను క్రమంగా వివరిస్తాను.

## గ్రాండ్ జ్యూరీ

మరునాడు నిర్ణయంప్రకారం గ్రాండ్ జ్యూరీ ముందు హాజరైనాను. అదొక పెద్దభవనం. ఆ ప్రాంతంలో జనసమ్మర్దం ఎక్కువగా ఉంది. సందుగొందులగుండా ప్రవహించిపోతున్న మహాజన సముద్రంలో టోపీల తరంగాలు ఊగుతూఉన్నై. విద్య, విజ్ఞానమూలేని ఈ పరదేశి ఆ సముద్రంలోఉన్న మహత్తునెలా గ్రహించ గలడు! కాని పాతిక సంవత్సరాలలో అనేక గుణపాఠాలను గ్రహించి చాలా అనుభవం సంపాదించిన తరువాత వెనుదిరిగి చూస్తే ఆ సమూహంలో ఒక విశేషాన్ని గుర్తింపగలుగుతున్నాను. అది వ్యక్తి విలక్షణాలతో కదులుతూన్న మహాసమూహం; ఈ 'మంద' విధానమే అమెరికా జీవితంలో అనుక్షణం కన్పించే ముఖ్యలక్షణం. ఆ అసంఖ్యాక జనసమూహంలో ఎవరి వ్యవహారం వారిదే. తన పొరుగువారికి ఏం జరుగుతున్నా ఎవరికీ పట్టదు. కాని ఎవరుకూడా 'మంద'లో నుండి బైటపడలేరు; ప్రతివాని జీవితం అందులో ఒక ముఖ్యభాగంగా గడిచిపోవాలి. సమూహంచేతనే అతనిజీవితం నిర్ణయించబడాలి. ప్రత్యక్షంగా సమూహంలోనే పరిపూర్ణత్వాన్ని సాధించటానికి వ్యక్తి వైలక్షణ్యాలు, భావాలు చేసే ప్రయత్నమే నేటి నాగరికతలోని వైపరీత్యం!

ఆ సమూహ సంచలనం నాకొక విచిత్రంగా, ఆకర్షణీయంగా కన్పించింది. కాని నేను మాత్రం భౌతికంగా ఆ సమూహానికి వెలుపలే ఉన్నాను. ఆ సమూహాన్ని కదలించే అవ్యక్త శక్తికి అబ్బురపడుతూ న్యాయదేవాలయ ద్వారంలో నిలబడ్డాను. వెనుకనుండి నా భుజంమీద ఎవరో చేయివేశారు క్రిందటి సాయంత్రం కొలంబియా విశ్వవిద్యాలయ ఆవరణలో కలిగిన అనుభవం చటుక్కున మనసులో మెరిసింది. మరల అరెస్టా? వెనుదిరిగి చూచాను. రాత్రి నన్ను వెంబడించిన రక్షకభటుల్లో ఒకడు పెద్దదవడలతో, చిరునవ్వుతో ప్రత్యక్షమైనాడు. టోపీ పైకెత్తి నోటిలో ఒక మూలనుండి మరొకమూలకు సిగరెట్టును (చెయ్యి ఉపయోగించకుండానే) జరిపి అన్నాడు: "వచ్చావన్నమాట. సత్యసంధుడంటే అలా ఉండాలి!"

అతణ్ణి అనుసరించి ఒక బారైనగదిలో ప్రవేశించాను. పైకప్పు అంటుతూ గ్యాలరీ ఉంది.

ఎదురుగా గోడదగ్గర మేజాముందు నిలబడ్డాను. అటార్నీ మూర్తీభవించిన దర్పంలా గ్యాలరీలో ఒక ప్రదేశాన్ని చూపిస్తూ "ఇదే గ్రాండ్ జ్యూరీ" అన్నాడు. ఆ గదిలో డాక్ లాంటి ప్రత్యేక ఏర్పాటులేమీ లేవు.

'భలే గ్రాండ్ జ్యూరీ' అన్నాను వినబడీ వినబడనట్లు.

నా అనుభవం ప్రకారం 'జ్యూరీ' అంటే బాధ్యత నెరిగి యుక్తాయుక్త విచక్షణజ్ఞానం కల ఐదారుగురు పెద్దమనుష్యులు. ఇండియాలో నన్ను విచారించి నపుడు జ్యూరీ ఉండేది కాదు. సామాన్య భారతీయులు అనుభవంగల న్యాయాధి కారులకు సలహా ఇవ్వలేరని బ్రిటిషు అధికారుల అభిప్రాయం.

## సొంత బాధ్యతపై విడుదల

ఆ గదిలో రెండువందలమంది సమావేశమై ఉన్నారు. అందులో ఒక్కరికీ నా కేసులో శ్రద్ధలేదు. అటువంటిది జ్యూరీ ఎలా అవుతుందా అని నా సందేహం. నా విమర్శ అటార్నీకి కోపం తెప్పించింది. కోర్టు ధిక్కార నేరానికి నన్ను శిక్షించక పోవటం నా అదృష్టమే! నావంక చురచుర చూస్తూ అన్నాడు: "సంచార చట్టాన్ని ధిక్కరించినట్టు నీమీద నేరం మోపుతున్నాను." ఒక్క సాక్ష్యాన్నిగూడ విచారించ లేదు. గ్రాండ్ జ్యూరీ ఎలా తన అనుమతిని తెలియజేసిందో అర్థంకాలేదు. స్వంత బాధ్యతమీద విచారణ జరిగేవరకూ నన్ను విడిచిపెట్టుతున్నట్లు అటార్నీ చెప్పాడు. నాచేత హామీపత్రాన్నికూడ సంతకం చేయించుకోలేదు. అంతా సాంప్రదాయం ప్రకారం జరిగిపోయింది. అటార్నీ తీర్పును చదివాడు: "వాయిదారోజున సకాలా నికి హాజరు కావాలి. తప్పించుకు పోవటానికి ప్రయత్నించవద్దని హెచ్చరిస్తున్నాను; వేయికళ్ళతో నిన్ను కనిపెట్టి ఉంటాం."

చాలకష్టంతో, ముఖంలో జుగుప్సను అణచి పెట్టుకున్నాను. అమెరికాలో జిల్లా అటార్నీ అంటే స్థానిక నియంత అని గ్రహించాను. అతనిలో కన్పించిన అహంభావం పోలీసుల కళ్ళల్లో దుమ్ము కొట్టడంలో ముక్కాకలు దీరిన నాలాంటి విప్లవకారులకు వినోదంగా ఉండటంలో ఆశ్చర్యం లేదు. జైలు జీవితం విప్లవ సుగుణంగా ఇంకా పరిగణింపబడటంలేదు. అదికూడా మంచికేనని నా అభిప్రాయం. గాంధేయ యుగానికి పూర్వం రాజకీయ నేరాలకు జరిగే కారాగారశిక్ష ప్రభుత్వ ఆతిథ్యం కాదు. నాడు జైలు నిర్బంధం సంవత్సరాల తరబడి కఠిన నరకమై, దేశ భక్తికి కఠోరపరీక్షగా ఉండేది. సాధ్యమైనంతవరకూ, ఆరోజుల్లో విప్లవకారులు ఉరిశిక్షకు కూడా భయపడక జైలునుండి తప్పించుకునేందుకు ప్రయత్నించేవారు. నామటుకు నేను ఐదు సంవత్సరాల జైలుశిక్షకంటె మరణశిక్ష మేలని భావించేవాణ్ణి. మొదటిమారు ఇండియాను వదలి వెళ్ళినపుడు 10,000 రూపాయిల జామీనుమీద జైలుశిక్ష తప్పించుకున్నాను. ఆ జామీనుకు సిద్ధపడకపోతే అజన్మ కారాగారం తప్పేది కాదు. అటువంటి శిక్షకు ఎంతో ధైర్యం కావాలి; విప్లవకారుల కామాత్రం ధైర్యం లేకపోలేదు గాని వారు కార్యశూరులు.

జర్మనీ వెళ్లుతూ అమెరికా వచ్చాను. జర్మనీనుండి గాని, బెర్లిన్‌లోని భారత విప్లవసంఘం నుండిగాని సహాయం రాదని తేలిపోయింది. ఇక వేరే ఉపాయాలను అన్వేషించాలి. సమీపంలో ఉన్న మెక్సికోదేశం విప్లవాలలో మునిగి తేలుతోంది. కొంతకాలంగా విప్లవం అంతర్జాతీయ సాంఘిక అవసరంగా పరిగణిస్తూ ఉండటంచేత నాదృష్టి కేవలం ఇండియామీదనే లేదు. అందుచేత మెక్సికో వాకొక ఆశాజ్యోతిగా కన్పించింది. మెక్సికోలో సాంఘిక విప్లవం జరుగుతున్నట్లు న్యూయార్కులోని సోషలిస్టులు చెప్పారు. యుకటాను రాష్ట్రంలో జనరల్ ఆల్వరోడో సోషలిస్టు ప్రభుత్వాన్ని స్థాపించాడని కూడా తెలిసింది. ఆ రాష్ట్రం 'మాయా' నాగరికతకు పుట్టినిల్లు. నాలో సోషలిస్టు భావాలింకా బలపడలేదు. అందుచేత ప్రాచీనకాలంలో భారతీయులే సముద్రాలు దాటి మెక్సికోలో వలస లేర్పరచుకొని ఈ నాగరికతను నిర్మించారనే దేశభక్తి నాలో చెలరేగింది. మెక్సికో వెళ్ళాలనే కాంక్షను ఆ దేశభక్తి బలపరచింది.

## మెక్సికోకు పలాయనం

హిందూ జర్మన్ కుట్ర బయల్పడక పూర్వముండే స్టాన్‌ఫర్డు యూనివర్సిటీ అధ్యక్షుడైన డేవిడ్ స్టార్ జోర్డాన్ వద్ద ఆల్వరోడోకు పరిచయలేఖను సంపాదించాను. ఆరోజుల్లో జోర్డాన్ అమెరికాలోని శాంతివాదుల్లో ప్రముఖుడు. నాకు అమెరికాను విడిచిపెట్టి వెళ్ళవలసిన గడియ సమీపించింది. నల్లవారు సులభంగా గుర్తింపబడే ఈ దేశంలో పోలీసులను తప్పించుకు తిరగటం చాలకష్టం. స్వదేశంలో పనికి

వచ్చిన ఉపాయాలు ఇక్కడ నిష్ప్రయోజనం. ఇక గ్రుడ్డిసాహసమే మార్గం. మొదట మకాం మార్చాలి. జనసమ్మర్దం ఎక్కువగా ఉండే ప్రదేశంలో ఉండటానికి నిర్ణయించాను: క్రొత్త బసకు మారేటప్పుడు పోలీసులు గమనించలేదనే నమ్మకం కలిగింది. ఐతే జిల్లా అటార్నీ మాటలన్నీ కోతలేనా! ఐనా నిజానిజాలు తేల్చటానికి ప్రయత్నించటం క్షేమంకాదు. పోలీసులు తాత్కాలికంగా దోవతప్పినా వేటకుక్కలవలె మరుక్షణంలో దారికి రావచ్చు. అందుచేత మరునాటి సాయంత్రమే క్రొత్త బసను విడిచి ఒక హోటల్ లో ప్రవేశించాను. భోజనానంతరం దొడ్డిదోవగుండా బైటపడి, ముందుపోతున్న టాక్సీ నాపి రైలుస్టేషను చేరాను. అప్పటికి చీకటి పడింది. సరిహద్దు నగరమైన శాన్ ఆంటోనియోకు రైలుందని ముందుగానే వాకబు చేశాను. నా రంగువల్ల ఆ బండిలో నాకు ఆటంకాలేమీ రాలేదు. మూడవనాటి మధ్యాహ్నం రైలు సరిహద్దు నగరం (శాన్ ఆంటోనియో) చేరింది. ఎండ బాగా కాస్తోంది. సాహసంతో చిన్నచిన్న ఆటంకాలను గడిచి రియోగ్రాండీ చేరాను. అమెరికా బడాయికి నాలో నేను విరగబడి నవ్వుకున్నాను.

(4)

# విప్లవభూమి మెక్సికో

## మెక్సికో చేరాను :

విప్లవాలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు మెక్సికో ఆటపట్టు. ఆ దేశంలో ప్రవేశించటానికి ప్యాస్‌పోర్టుకూడా అవసరంలేదని న్యూయార్కులోనే తెలిసికొన్నాను. అమెరికా మెక్సికో దేశాలమధ్య సరిహద్దురేఖ రియోగ్రాండి వంతెన మీదుగా పోతుంది. అక్కడే మెక్సికో సరిహద్దురక్షణోద్యోగి నన్ను అటకాయించినాడు. అతను నడివయస్సులో వున్నాడు. స్ఫురద్రూపి. చిరిగిపోయిన దుస్తులు, యెండుగడ్డిటోపీ ధరించాడు. వీపున తుపాకి వ్రేలాడుతూంది. అదే లేకపోతే అతడెవడో బిచ్చగాడని అభిప్రాయపడటంలో ఆశ్చర్యంలేదు. నిజానికి నేనలాగే అభిప్రాయపడి చిన్న నాణెంకోసం జేబులో చెయ్యిపెట్టాను.

‘పాస్‌పోర్టు ఉన్నదా?’’ అని నన్నతడు ప్రశ్నించటంతో ఆ ప్రయత్నం విరమించాను. ఈ రకమైన ఆటంకం వస్తుందని వూహించికూడ ఉండకపోవటముచేత నివ్వెరపోయాను. ‘మెక్సికోలో ప్రవేశించటానికి పాస్‌పోర్టు అక్కరలేదుగదా?’’ అని యింగ్లీషులో అడిగాను. కాని నామాట అతనికి అర్థంకాలేదు. అతడేదో స్పెయిన్ భాషలో మాట్లాడుతూ, నా చేష్టలవల్ల నాదగ్గిర తృప్తికరమైన పత్రాలేవీ లేవని గ్రహించాడు. తరువాత దగ్గిరలోఉన్న కారుచెంతకు తీసుకువెళ్ళి తుపాకి చివరతో సూచిస్తూ యేదో ఆజ్ఞాపించాడు. ఆ టాక్సీడ్రైవరు అమెరికా దేశస్థుడు. కారుత్రిప్పి ప్రయాణం ప్రారంభించాడు. ఒక క్షణంలో అమెరికాకు తిరిగివచ్చాము. కారాగారమో లేక ప్రవాసశిక్షో నాకోసం ఎదురు చూస్తున్నదనే భయం కలిగింది. భయంతోనే ‘ఎక్కడికి?’’ అని అడిగాను డ్రైవరును. ‘మెక్సికన్ కాన్సులేటుకు’ అని అన్నాడు. నాకు కొంత ఉపశాంతి కలిగింది. ‘ఎందుకు?’’ అని తిరిగి ప్రశ్నించాను. ‘కాన్సలేటులో 5 డాలర్లుపెట్టి ఒక పత్రం కొనుక్కోవాలి’ అన్నాడు. ‘ఈ సంగతి ముందే ఎందుకు చెప్పలేదు?’’ అన్నాను.

‘ఈ దేశంలోని జిడ్డు గ్రింగోరులను గురించి మీకు తెలుసుననుకున్నాను.’ అన్నాడు.

ఇంతలో మా కారు గమ్యస్థానం చేరింది. మెక్సికో పతాకం ప్రత్యక్ష మైంది. అది అమెరికా పోలీసుస్టేషను కాదని ధృవపరచుకొన్నాను. ఐనా పాన కంలో పుడకలాగ యిదేమిటని ఆదుర్దాగా వున్నది.

కార్యాలయంలో జనసంచారం లేదు. కాపలా కాస్తున్న నౌకరు మగత నిద్రలో ఉన్నాడు. కాన్సలు నిద్రపోతున్నాడనీ, ఐదుగంటలవరకు నిద్రాభంగము చేయరాదనీ చెప్పాడు. అంటే యింకా రెండుగంటల వ్యవధి ఉన్నదన్నమాట. ఈలోగా అమెరికన్ పోలీసులు నన్ను పట్టుకొంటారేమో! పారిపోవటానికి నే చేసిన ప్రయత్నం ఫలించకపోగా నన్ను అవహేళనకు గురిచేస్తుందేమోనని భయపడ్డాను. ఇంతలో ఒక ఉపాయంతోచింది. అల్వారాడోకు నన్ను పరిచయంచేస్తూ డా. జోర్డాన్ యిచ్చిన జాబు నా దగ్గర ఉన్నది. ఆ కవరుమీద స్టాన్‌ఫర్డు యూనివర్సిటీ ముద్ర చాలా అట్టహాసంగా ఉంది. ఏదో ప్రళయం ముంచుకువచ్చిన ధోరణిలో కవరును బయటకుతీసి నౌకరుకు చూపిస్తూ జనరల్ ఆల్వారాడోకు తక్షణమే ఒక ముఖ్యమైన సందేశం అందజేయాలని బిగ్గరగా అరచాను. నా మాటలు అతనికి అర్థంకాలేదు. కాని జనరల్ అనేమాట మాత్రం మంత్రంలాగ పనిచేసింది. నన్ను అభినందిస్తున్నట్లుగ లేచి మంత్రించిన కుందేలులాగ పరిగెత్తాడు. ఒక క్షణంలో అధికార ముద్రతో ఉన్న పత్రాన్ని తీసుకువచ్చాడు. నా దగ్గిర డబ్బేమీ పుచ్చుకోలేదు. వెంటనే బయటకు వెళ్ళి కారెక్కాను. డ్రైవరు నిద్రపోతున్నాడు. 5 గంటలదాకా రాడని అనుకున్నాడు. ఐనా వెంటనేలేచి, నా చేతిలో కాగితంచూచి 'ఎక్కువ సొమ్ము చెల్లించారా బాబుగారూ? తొందరపనిలో ఉన్నట్లున్నారు, పాపం!' అన్నాడు. కొన్ని నిమిషాలలోనే సరిహద్దును దాటాం. ఇక అమెరికా న్యాయరక్షణాధికారం నన్నేమీ చేయలేదు.

నూవాలోరిడో చేరాను. అది ఒక చిన్న సరిహద్దు పట్టణం. వీధులన్నీ ధూళితో నిండి ఉన్నాయి. జన సంచారం లేదు. ప్రజ లింకా నిద్ర పోతూనే ఉన్నారు. అక్కడికి మెక్సికో నగరం దక్షిణంగా వెయ్యి మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ పట్టణంనుండి మెక్సికోకు ఒక రైలుమార్గం ఉంది. కాని రైలుపోయే మార్గంలోనే చాల ప్రదేశాలు కరంజా ప్రభుత్వానికి వ్యతిరేకులైన విప్లవ సైన్యాల ఆక్రమణలో వున్నాయి. దారి పొడుగునా దోపిడిగాండ్ర భయంకూడ విపరీతంగా ఉంది. అయినా ఆ ప్రయాణాన్ని గురించి ఆలోచించవలసిన పనిలేదు. అమెరికా నుండి బయట పడ్డాను; అదే పదివేలు. ఇకముందు ప్రయాణాన్ని గురించి నిదానంగా ఆలోచించుకోవచ్చు, అనుకొంటూ ఒక హోటలుకు వెళ్ళాను. ఆ హోటలు యజమాని నాకు అవసరమైన సమాచారమంతా చెప్పాడు.

మెక్సికో నగరానికి రైలుబండ్లు వారానికి ఒకటి రెండు మాత్రమే ఉన్నాయి. వాటికికూడ వేళాపాళాలేదు. మెక్సికో చేరడానికి రెండు మూడు రోజులు పడుతుంది. బండ్లు రాత్రిళ్ళు ప్రయాణం చేయవు. పగటిపూట దారిపొడుగునా దోపిడి గాండ్రతో పోరాడుతూ ప్రయాణం చేస్తూ ఉంటాయి. బండ్ల నాపి దోపిడిగాండ్రు ప్రయాణీకులను దోచుకుంటూ ఉంటారు. రైలు కిటికీలగుండా తుపాకిగుండ్లు గర్జించుకుంటూ ఎప్పుడు వచ్చి పడతాయో ఎవ్వరికీ తెలియదు.

ఆవేశంతో కూడిన అనుభవంలాగా కన్పించింది. యుద్ధరంగానికి ఎన్నడూ వెళ్ళకపోయినా తుపాకి ప్రేల్చడంలో ఉపదేశం పొందాను. మెక్సికోలో ఏదో అంగడిలో పిస్తోలు కొనుక్కోవచ్చు. ఐనా ఆయుధాన్ని ధరించే వాంఛను అరికట్టివేశాను. ఆయుధధారణకు గల స్వేచ్ఛ చాలా ఉత్సాహకరమైనదే; కాని ఇక్కడ ఆ స్వాతంత్ర్యం కేవలం నిష్ప్రయోజన మని గ్రహించటంవల్ల ఆశ్చర్యం కలిగింది. విప్లవం అంటే సాయుధులైన వారితోనూ, బాంబులతోనూ సాధించేదనే భావం మనస్సులో నుండి జారిపోతోంది. ఆ స్థానాన్ని ఆక్రమిస్తున్న భావంలో కూడా విప్లవానికి - రక్తపాతానికి సంబంధం లేకపోలేదు. ఐనా, విప్లవాలను గురించిన ఈ క్రొత్త దృక్పథం ఘోరకృత్యాలు చేయించే విప్లవదీక్షకు వెనుక అస్పష్టంగా ఉన్న మానవత్వభావాలకు, ఆదర్శాలకు నిర్దుష్టమైన రూపాన్ని దిద్దటం ప్రారంభించింది.

మానసికంగా నేను పరిపక్వ దశకింకా రాలేదు. ఆ దశలో, ఆత్మరక్షణకు కూడా ఇతరుల నెందుకు చంపకూడదో వివరించేశక్తి లేదు. ముందున్న ప్రయాణాన్ని తలుచుకుంటే నిరాశ కలిగింది. ప్రతినిత్యమూ అనేకమంది ప్రాణాలు కోల్పోతున్నారు. ఆ దురదృష్టవంతుల్లో నేనూ చేరతానేమో!

నిద్రపోతున్నట్లున్న మానసిక వాతావరణం శారీరకంగా భారమనిపించింది. హోటలు గదిలో చాలసేపు నిద్రపోయాను. దూరంగా వాయిస్తున్న బ్యాండు మ్రోతతో మెలకువ వచ్చింది. చీకటి పడుతోంది. రైలు బయలుదేరే రోజువరకు నిద్రమత్తు కలిగించే ఆ యిరుకు గదిలో కాలక్షేపం చేయక తప్పదు; అందుకని షికారుకు బయలుదేరాను. మెక్సికో సాంఘిక జీవితంతో అదే నాకు ప్రథమ పరిచయం. జీవితంపట్ల మెక్సికనులు చాల నిర్లక్ష్యంగా ఉంటారు. దేశం అందమైనదే; ఐనా నాగరికత అంతగా లేదని చెప్పవలసివస్తుంది. అక్కడున్న కొద్ది రోజుల్లోనే మెక్సికోపట్ల నాకు గాఢమైన అభిమానం కలిగింది.

## మెక్సికన్ జాతీయత

స్పెయిను దేశపద్ధతి ననుసరించి మెక్సికోలోని ప్రతి నగరమూ ఒక ఉద్యానవనంచుట్టూ నిర్మింప బడింది. బహిరంగ ప్రదేశాలు వినోదకాలక్షేపానికి ఉపయోగపడేలాగా ఆ ఉద్యానవనం నగర సాంఘిక జీవితానికి కేంద్రమౌతుంది. హోటలు

నుండి బయలుదేరి ఆ దృశ్యంలో ప్రవేశించాను. ఉద్యానవనం మధ్య ఒక మంటపం, మంటపంపైన రంగురంగుల సైనిక దుస్తులు ధరించి పురుషులు కూచుని ఉన్నారు. మ్రోగుతున్న బ్యాండు స్థానిక సైనికదళానికి చెందింది; వారు మెక్సికో జాతీయ గీతం పాడుతున్నారు. దాని మొదటి చరణం (నేను తర్వాత తెలుసుకొన్న దానినిబట్టి): 'యుద్ధానికి ఆహూతులైన సైనికులారా!' అని ప్రారంభమౌతుంది. ప్రజలలో వీరావేశం కలిగించటమే దాని ఉద్దేశ్యం. ఆ పాట లయ ననుసరించి పిల్లలు సైనికుల ననుసరిస్తూ నడుస్తున్నారు. ప్రాచీన మెక్సికనులు సాధించిన విజయాలు, స్పానిషు పరిపాలకులపై మెక్సికనులు సాగించిన స్వాతంత్ర్య పోరాటం, వివరింపబడినై. మెక్సికో జాతీయగీతంలోని సంగీతమూ, కవిత్వమూ కూడా మెక్సికను జాతీయతను వ్యక్తం చేస్తున్నవని నా విశ్వాసం. ఇతర జాతులకంటే మెక్సికను లెక్కువ యుద్ధ ప్రియులుకాదు; బ్యాండు సంగీతంవల్ల పార్కులో చేరిన వారిలోగూడా వీరావేశం కలగలేదనే చెప్పవచ్చు. ఏ దేశంలోని ప్రజలైనా, కేవలం ఊహాకల్పితమైన జాతీయ భావానికి తమంతట తాముగా దాసోహ మంటారనేది అసత్యం!

ఉల్లాసకరమైన దుస్తులు ధరించిన బాలికలు, ఆకర్షణీయంగా యువకులు, వయ్యారం వలకబోసే యువతులు, నల్లని దుస్తులు ధరించిన మాతృమూర్తులు, పూర్తి సాంప్రదాయకమైన దుస్తుల్లోని వృద్ధులు - అందరూ ఆ ఖాళీ ప్రదేశంలో పచార్లు చేస్తున్న దృశ్యం చాల రమణీయంగా ఉంది. లాటిన్ దేశాల్లో ఇలాంటి షికారొక సాంప్రదాయం. వృద్ధులకు సాంప్రదాయాల్లో ఉన్న గౌరవాన్ని యువతీ యువకుల విలాసం హేళన చేస్తున్నట్లు కన్పించింది. దైవభక్తులను పిలిచే చర్చిగంటల మధ్య కులాసా నవ్వులు విన్పిస్తున్నై. సమ్మిళితమైన ఈ అనుభవాలతో మొదటి రోజు గడిచింది. మొదటి భోజనం కూడా అలాగే ఉంది. టర్కీ కోడి పలావు మెక్సికో జాతీయ భోజనం; అమెరికాలో 'మసాలా కోడిపిల్ల' జాతీయ భోజనం. అమెరికా భోజనం కంటె మెక్సికో కోడి పలావే రుచికరంగా ఉన్నదనటంతో హోటలు యజమాని ఆనందానికి మేర లేకపోయింది. టర్కీ కోడి పలావుతో బాటు సేవించ వలసిన స్పానిషు మద్యాలను తెచ్చియిచ్చాడు. మాంసాహారం అమెరికాలో అలవాటు చేసికొన్నాను గాని పానీయాలను గూర్చి నా చాదస్తమింకా వదలలేదు.

నా రాకతో 'నూవాలోరిడో' పట్టణంలో కొంత సంచలనం కలిగింది. నేను 'ఇండియన్' అని పరిచయం చేసికొన్నాను; మెక్సికోలోని ఆదిమనివాసులను కూడా ఇండియనులనే పిలుస్తారు. నేను మెక్సికో దేశస్థుణ్ణి కాకపోయినా వారు నన్ను సాదరంగా చూచారు. హోటలు యజమాని మంచి స్నేహపాత్రుడు. ప్రయాణం చాలా ప్రమాదకరమైనదనీ, నేను నా ప్రయత్నం విరమించటం మంచిదని బ్రతిమాలాడు. అదీగాక రైలులో చోటు సంపాదించటం చాలకష్టం. హోటలు

యజమాని నమ్మకస్తుడని గ్రహించిన తరువాత, ఆల్వారాడో కొక ముఖ్య సందేశాన్ని అందజేయడానికే నా ప్రయాణమని చెప్పాను. దానితో అతని దృష్టిలో నా అంతస్తు పెరిగి పోయింది. నా గొప్పదనంలో అతనికి పూర్తి విశ్వాసమూ కలిగింది. నిష్కల్మష మైన హృదయంతో చేసిన 'మోసం' బాగా పని చేసింది. మరునాడుదయమే స్థానిక సైనికదళాధిపతి (జెఫి) చెంతకు నన్ను తీసుకు వెళ్లాడు. జెఫి కూడా నన్ను గౌరవం గానూ, దయతోనూ ఆహ్వానించి వెంటనే స్టేషను మాస్టరుకు ఆర్డరు పంపాడు— రైలులో నాకొక 'ఫుల్ మన్' ప్రత్యేకించమని. 'ఫుల్ మన్' అంటే రైల్లో నిద్ర పోవటానికి వీలుగానుండే బల్ల (బెర్త్). అమెరికా సరిహద్దు దాటిన నాల్గు రోజులకు మెక్సికో నగరానికి వెళ్ళే రైలుబండి నెక్కాను.

## మెక్సికో నగరానికి ప్రయాణం :

'ఫుల్ మన్' ప్రత్యేక హక్కులకు, గౌరవానికి చిహ్నం. రాత్రిపూట రైలు ప్రయాణం చేయదు. కాబట్టి సాయంకాలం రైలు ఎక్కడ ఆగితే, ప్రయాణీకులంతా అక్కడే దిగాలి. పగటిపూట ప్రయాణీకులు కూర్చోటానికి వీలుగా 'ఫుల్ మ'నుల నేర్పాటు చేసేవారు. ఐనా ప్రత్యేక గౌరవ ప్రయాణికుడుగా నుండటంవల్ల చాలా లాభాలున్నై. రాత్రిపూట విశ్రమించటానికి హోటళ్ళలో మాకు గదులు ప్రత్యేకించబడి యుండేవి. మిగిలినవారు ఎవరియేర్పాట్లు వారు చేసుకో వలసిందే. రైలు ఆగే నగరాలు సైనికాధికారులతో కిటకిటలాడుతుండేవి. వీధు లన్నీ చిమ్మ చీకటిమయం. నగరంలోకి వెళ్ళటానికి బండ్లు దొరికినవికావు. అవన్నీ ఎవరి ప్రభుత్వమూ లేని అరాజక ప్రదేశాలు. ఏ సమయంలోనైనా విప్లవకారు లాక్ర మించుకోవచ్చు; బందిపోటులు దోచుకోవచ్చు.

ప్రయాణంలో మొదటిరాత్రి 'మాంటెరీ'లో ఆగాము. మెక్సికోలో 'మాంటెరీ' రెండవ పెద్దనగరం. గొప్ప పారిశ్రామిక కేంద్రం. మెక్సికో సింధు శాఖ పొడుగునా ఉన్న పెట్రోలుగనులకు, టాంపికో అనే ప్రధాన రేవుపట్టణానికి గూడా మాంటెరీనుండి రైలుమార్గాలున్నై. పెట్రోలు గనుల ప్రాంతంలో ఉండటం చేత నూవాలోరిడా—మెక్సికో రైలుమార్గం దేశానికి వెన్నెముకవంటిదిగా కలిగింది. అప్పుడు మాంటెరీనగరమూ, ఆ పరిసరాలూ 'కరంజా' సైనికుల స్వాధీనంలోఉన్నై. దీనికి పశ్చిమంగా ఆనుకొనియున్న 'చిహువాహువా' ప్రాంతాలలో దోపిడిముఠా నాయకుడైన 'పాంకోవిల్లా'మాట చెల్లుతుంది. పాంకోవిల్లా అధ్యక్షపదవికికూడా పోటీచేశాడు. రెండు సంవత్సరాలకు పూర్వం మెక్సికో నగరాన్నికూడా వశపరచు కున్నాడు. పెట్రోలుగనులు అతని దోపిడిముఠాలవశ్యం కాకుండా రక్షించే ఉద్దే శంతో విల్లా శత్రువులగు అమెరికా, బ్రిటనులు సహాయం చేసినై. మాంటెరీ పరిపాల కుడు, స్థానికంగానున్న పెట్రోలు వర్తక ప్రముఖుల ధనసహాయంమీద ఆధారపడాల్సి

ఉంటుంది. అందుచే అతడు అమెరికాను అనుసరింపక తప్పదు. గానీ, కరెంజా జర్మనీపట్ల అభిమానం వహిస్తున్నాడని అమెరికా అతణ్ణి పూర్తిగా విశ్వసించటంలేదు. ఈ అనుమానానికి కారణం లేకపోలేదు. అమెరికా యిరోపా యుద్ధంలో ప్రవేశించిన తరువాతకూడా పట్టుదలతో తటస్థంగా ఉన్నాడు కరెంజా. అందుచేత కరెంజా, మాంటెరీ ప్రభువులమధ్య స్నేహభావం ఉండనటానికి వీలులేదు. కొన్ని రోజుల తర్వాత కరెంజా మెక్సికోలో ఆర్థిక శ్రేయస్సులుగల రాజ్యాల సహాయంతో ఒక విప్లవాన్ని లేవదీశాడు. ఇందులోగూడా, భూమిని రైతుల పరం చేయటమే ప్రధానాశయం. మెక్సికోలో రాబిన్‌హుడ్ గౌరవాన్ని పొందిన పాంకోవిల్లా సమీప రాష్ట్రాలలో అదేవిధమైన సాంఘిక విప్లవాన్ని వాగ్దానం చేస్తున్నాడు. అతనికి గూడా అమెరికా సహాయం లభిస్తుందని అనుమానంగా ఉంది.

రెండవరోజున మా రైలు మధ్య మెక్సికో పీఠభూమి నెక్కటం ప్రారంభించింది. ఆ పీఠభూమిలో 'మాగీ' పొదలుతప్ప ఇంకేమీ కన్పించలేదు. మెక్సికో జాతీయపానీయమైన 'పల్' అనే సారాయిని 'మాగీ' నుండి తీస్తారు. 'పల్' లో మంచి పోషకపదార్థాలు లభిస్తై. సారాయి తీయగా మిగిలిన పిప్పినిగూడా కరువు కాటకాలలో బీదవారు తిని జీవించేవారు. ఇటీవల మెక్సికో ఒక ప్రధానపరిశ్రమకు కేంద్రమైంది. 'మాక్టెజూమా' రోజుల్లో 'మాగీ' ఆకులనుండి పీచుతీసి గుడ్డలు నేసి మెక్సికనులు ధరించేవారు. ఆ ప్రాచీన పరిశ్రమను, యుకటాను రాష్ట్రంలో అల్వారేడో ప్రభుత్వం పునరుద్ధరించింది. కాని ఇప్పుడు 'మాగీ' పీచును జనపనార, కాన్వాసులకు బదులుగా ఉపయోగిస్తున్నారు. నాటినుండి ఈ పరిశ్రమ బాగా విస్తరించింది. ఆర్థికంగానేగాక, జాతీయంగాకూడా, 'మాగీ' మెక్సికో చరిత్రలో ప్రత్యేక స్థానం సంపాదించింది. ముక్కులోని సర్పంతో 'మాగీ'మండలమీద నిలబడ్డ గ్రద్ద మెక్సికో పీఠభూమిలో తరచు కన్పించే దృశ్యం. అదే మెక్సికో జాతీయపతాకం పైని చిహ్నం!

సాయంకాలానికి, మా రైలుబండి 'సాన్‌లూయిపొటొసి' నగరాన్ని చేరింది. ఈ నగరం పీఠభూమికి మధ్యగా ఫెడరల్ జిల్లాలకు రక్షణకేంద్రంగా ఉంది. ఇంతవరకూ, దుస్సహమైన సంఘటనలేమీ జరగలేదు. అపాయకరమైన ప్రాంతాలను గూడా గడిచాం. ఐనా ఆ రోజుల్లో మెక్సికోలో ఏ ప్రాంతంకూడా సురక్షితంగా లేదు. దోపిడిగాండ్ర నాయకుడైన 'జపాటా' అనుచరులు ముఖ్యనగర ప్రాంతాలలోనే దాడులు జరుపుతుండేవారు. అందుచేతనే, కరంజా దళాల రక్షణలోనున్న సాన్‌లూయిపొటొసీ దగ్గర సాయంత్రం కాగానే రైలుఆగింది. ఈ నగరంలో మరికొంత చైతన్యం, స్వేచ్ఛాసంచారము కన్పించినై.

హోటలు చాలా హాయిగావుంది. భోజనంకూడా బాగానేఉంది. భోజనం కాగానే, తోటి ప్రయాణీకులలోని కొందరు ధైర్యస్తులతో షికారుకు వెళ్ళాం. మా బృందంలో—మెక్సికోనగరంలోని ఒక హోటలు యజమానికూడా ఉన్నాడు. అమెరికా సరిహద్దులనుండీ అతనితో పరిచయమైంది. బ్రిటిషు సార్వభౌమత్వంలో తనకున్న విశ్వాసంవల్ల, ఒక నిర్భాగ్య బ్రిటిషు భారతీయునకు రక్షణ నివ్వటం తన ధర్మమని భావించేవాడు. స్థానిక వర్తకులతో వ్యాపారంచేస్తూ మెక్సికోలో 25 సంవత్సరాలు గడిపాడు. ఐనా ఒక్క స్పానిషుముక్కకూడా మాట్లాడేవాడు కాదు. అతని భార్య మాత్రం నౌకర్లను తిట్టటంలో ధారాళంగా స్పానిషుభాష నుపయోగించేది. ఇతడే కాదు; మెక్సికోలోని ఆంగ్లో—అమెరికన్‌జాతుల వారెవ్వరికీ మెక్సికో దేశీయభాష నేర్చుకొనే ఆసక్తిలేదు. ఇతర ఐరోపాజాతులవారలాకాదు. బానిస దేశమైన ఇండియాలోనే ఆంగ్లేయుల ఆధిక్యతాభావము, మన జాతీయభావాన్ని అగౌరవపరచేది. స్వతంత్రదేశమైన మెక్సికోలోకూడా ఆంగ్లేయులకట్టి భావాలుండటం నాకాశ్చర్యమైంది. మెక్సికోలో అడుగుపెట్టినప్పటినుండీ అది నా పెంపుడుదేశమనేగౌరవ సానుభూతులు కలిగినై. జాతీయవాదాన్ని హేతుబద్ధం చేయమనీ, దానికి ఎఱ్ఱరంగువేసి సాంఘికంగా విప్లవాత్మకమైనదానినిగా చేయమనీ, నేను క్రొత్తగా అవలంబించిన సోషలిజం ప్రబోధింపసాగింది.

మూడవనాటి మధ్యాహ్నం రైలు మెక్సికోనగరం చేరింది. ఎక్కడికి వెళ్ళటం?

నా ప్రక్కనే నిలబడియున్న కేనడాదేశస్థు డడిగాడు: "క్రొత్తనగరంలో ఎక్కడ బసచేయటానికి నిశ్చయించారు?"

'ఏదో హోటల్లో' అన్నాను.

'ఐతే నాతోరండి; నాటుప్రదేశాలకు వెళ్ళవద్దు. అనారోగ్యంగాను, దగాకోరుగానూ ఉంటై' అని ఆహ్వానించాడు.

తన హోటల్లో నా కేర్పాటులు చేస్తానన్నాడు. అది చవకగానూ ఉండవచ్చు. అతని 'హోటలు జనీవా'కు కారులో వెళ్లాం. అక్కడే రెండు వారాలు గడిచినై. పనీపాటా లేని ఫ్రెంచి, స్పానిషు ధనవంతులు మెక్సికోలోని నిరంతర వసంత శోభ ననుభవించటానికి వస్తూంటారు. ఆ నగరం ఎన్నో మంచిరోజులను చూచింది.

## సుప్త శ్వేతసుందరీ నగరం

మెక్సికనులు యుద్ధప్రియులనే భావం ప్రపంచంలో ప్రబలంగా ఉంది. అందుకు మొదటి కారణం ఆ దేశానికి 'మెక్సిట్' అనే యుద్ధదేవత పేరు పెట్టటం. మెక్సికోను స్పానిషువారు ఆక్రమించటానికి పూర్వం, అనాహుయాకును పాలించిన

అజ్టేకుల యుద్ధదేవత పేరు 'మెక్సిట్'. అజ్టేకులామె నెక్కువగా ఆరాధిస్తూ ఉండేవారు. మెక్సికో లోయను 'అనాహుయాక్' అనే పేరుండేది. అంటే జల సమీప ప్రాంతము అని అర్థం. భౌగోళికంగా మెక్సికో లోయ చాల చిత్రమైంది. 600 సంవత్సరాలకు పూర్వం ఈ లోయ సముద్రమట్టానికి 8000 అడుగుల ఎత్తున ఉండే సరస్సుల సమూహంగా ఉండేది. అజ్టేకుల ముఖ్యపట్టణం ఆ సరస్సులోని లంకలపై నిర్మింపబడింది. అందులోని భవనాలు రాతితో నిర్మింపబడినై; 5 లక్షల ప్రజలు నివసిస్తూ వుండేవారు. ఆ మహానగరాన్ని స్పానిషువారు ధ్వంసం చేశారు; ఆ శిథిలాలపైనే నేటి మెక్సికో నగరాన్ని నిర్మించారు.

16 వ శతాబ్దమునుండి, చిత్రమైన భూగర్భ పరిణామం జరిగింది. సరస్సుల అడుగుభాగం క్రమంగా పైకి ఉబికి వచ్చింది, అదే లోయగా మారి అందులో అత్యంత సుందరమైన మెక్సికోనగరం వెలసింది. ఎండిపోయిన సరస్సుల నీరంతా క్సోచిమిల్కో, శాల్కో అనే రెండు సరస్సులలో పడుతోంది. మెక్సికో నగరానికి పదిమైళ్ళ దూరంలో ఉన్నై ఈ సరస్సులు. వీటినే 'తేలుతున్న వనాలు' (Floating Gardens) అంటారు; వీటికి మరొక పేరు 'లాస్ చినంపాలు'

## మెక్సికన్ సాంప్రదాయాలు

ఆదివారంనాడు, మిగతా సెలవ రోజుల్లోను కూడా లాస్-చినంపాలు పర దాగా ఉంటై; ట్రాంబండ్లలో క్రిక్కిరిసి కూర్చొని వేలాది పురజను లీ ప్రాంతానికి చేరుకుంటారు. పుష్కలంగా లభించే పూలను మాలలుగా కట్టి పడవలను అలంకరించే వారు; ఆ పడవలలో వినోదంగా ప్రొద్దుపుచ్చటమే వారి ఉద్దేశ్యం. మెక్సికో ఉష్ణ మండల దేశం కావటంవల్ల చెట్లు దట్టంగా పెరుగుతై. సరస్సులలో నీటిమీదకూడా దట్టమైన మొక్కలు పెరుగుతై. మధ్య మధ్య రంగురంగుల పూలమొక్కలతో సరస్సులు పచ్చని మైదానంలాగా అందంగా కన్పిస్తవి.

లాస్ చినంపాలపై షికార్లు మెక్సికోలో అద్భుత దృశ్యాలలో ఒకటి. నిష్కల్మషమైన స్నేహభావం తొణికిసలాడే హృదయాలతో, ఉల్లాసంగా విలాస దుస్తులు ధరించి, స్పానిషు పాటలు పాడే వయ్యారి యువతీమణులు, వారి వెనుకనే 'గైటారు' వాయిస్తూ తిరిగే యువకులు చూడముచ్చటగా ఉండేది. యువతీమణుల పాటలు విన్న ఆవేశంతో తన్మయులై బోటు బోల్తా కొట్టుందనే జ్ఞానం కూడా లేకుండా నాట్యానికి ఉపక్రమించేవారు యువక శిఖామణులు. అప్పుడప్పుడు పడవ నిజంగానే బోల్తా కొట్టేది; ఆగ్రహ పరవశులై, తడిసిన పిల్లిపిల్లల్లా ఉన్న స్నేహితు రాండ్రను సరస్సులో నుండి కేరింతలు కొడ్తూ బైటికి లాక్కొస్తూండేవారు.

లాస్ చినంపాలను క్రొత్తప్రపంచంలోని 'వెనిసు' అనేవారు; ఐనా వెనిసు నగరానికి వీటికి చాలా తేడా ఉంది. ప్రతి విషయంలోను సంప్రదాయాలకు కట్టుబడి ఉంటుంది వెనిసు; సహజ సౌందర్య మొలకపోస్తూ ఉంటై చినంపాలు. ఆ సరస్సుల్లోని మానవ వాతావరణం అంటే నాకు ఎంతో అభిమానం. అందుకనే చాలాసార్లా ప్రాంతాలకు వెళ్ళి ఆనందిస్తుండేవాణ్ణి. కాని ఆ వినోదాల్లో పాల్గొనే వాణ్ణికాను. స్వభావసిద్ధమైన ఈ నా అసమర్థతను చూచి నా మిత్రులు నన్ను 'భారతదేశ విషాద వేదాంతి' అని గేలిచేస్తూ ఉండేవారు.

మెక్సికనులను యుద్ధప్రియులనటానికి గల రెండవ కారణాన్ని కొన్నిరోజులకు గ్రహించగలిగాను. పసిపిల్లలకు ఆటవస్తువులయందెంత సరదా ఉంటుందో మెక్సికనులకు యుద్ధ దుస్తులు, ఆయుధాలు ధరించటమంటే అంత సరదా! ఏ సందర్భంలోనైనాసరే - అంటే భోజనాలదగ్గరే కానీయండి, లేదా డ్రాయింగు రూములో గానీయండి, రోడ్డు ప్రక్కన మిత్రులతో మాట్లాడుతున్నప్పుడే అనండి - సైనికోద్యోగి మాటిమాటికి పిస్టలును పైకి తీసి ప్రేలుస్తూ ఉంటాడు. ఎదటివాణ్ణి చంపటానికి కాదు; తన వాదనకు బలం చేకూర్చే నిమిత్తం!

మధ్య యుగ సాంప్రదాయమైన ద్వంద్వయుద్ధం ఇంకా మెక్సికోలో ఉంది. కాని ఇక్కడి ద్వంద్వయుద్ధ పద్ధతి చాల తమాషాగా ఉంటుంది. కక్షిదారులు తమ గౌరవరక్షణార్థం గాలిలోనికిగానీ, ఇంటికప్పలమీదికిగాని తమతమ తుపాకులు ప్రేల్చి, పరస్పరం గాఢాలింగనం చేసికొని, ముద్దు పెట్టుకొని మరీ విడిపోతారు! మెక్సికో నగర వీధులనిండా యూనిఫారం ధరించినవారే కన్పిస్తారు. పది సంవత్సరాలుగా అంతర్యుద్ధంలో మునిగి తేలుతున్న దేశం కాబట్టి అదేమంత ఆశ్చర్యకరమైన విషయం కాదు; కాని వారిలో చాలామంది మెక్సికో దేవతను ఆరాధించేవారు కారు. అజ్టేకులు అదృశ్యం కావటంతోనే, మెక్సికనులు యుద్ధదేవతను మరచిపోయినారు. కాని స్పానిషువారు రాకపూర్వం శాంతిదేవతయైన 'సుప్త శ్వేతసుందరి' మాత్రం ఇప్పటికీ చెక్కు చెదరక అలాగే నిలిచి ఉంది.

ప్రపంచంలోని ఎత్తైన నగరాలలో మెక్సికో రెండవది. సముద్రమట్టానికి 7400 అడుగుల ఎత్తున ఉంది. ఈ నగరాన్ని ఆవరించి సిర్రాడ గాడాలుపే, సిర్రా నెవాడా అనే పర్వతశ్రేణులున్నై. లోయకు ఆగ్నేయద్వారంలో ఉన్న గాడాలుపే ఎత్తు మెక్సికో నగరం ఎత్తుకంటె 1000 అడుగులు తక్కువ. ఆ పర్వత శిఖరం మీదనే మెక్సికోలోని కాథలిక్ మతస్థుల ఆరాధ్యదేవతయైన 'గౌటాలుపే' ఆలయం ఉంది. ఊహాశక్తికి కూడా అందని ప్రాచీనకాలంలో ప్రస్తుతం దేవాలయం ఉన్న చోటనే గాడాలుపే దేవత రాతిని పిండి నీటిని తెప్పించిందట! స్వదేశస్థులైన నిరుపేదల కొరకై ఇంతటి మహాద్భుతాన్ని చేయటంవల్ల ఆమెను వారు పూజిస్తున్నారు.

ఆజ్టేకుల ప్రకృతిమతానికి చెందిన మరొక దేవత మెక్సికో నగరాన్ని రక్షిస్తూ ఉంటుంది.

## సుప్త శ్వేతసుందరి

ఆగ్నేయదిక్కుగా, కొంచెందగ్గరగా, సిర్రాడగౌడాలు పేకంటే ఉన్నతమై హిమావృతమైన సిర్రానెవాడాశాఖ ఉంది. ఈ శాఖలోనే 'పోపోకాటిపీటల్' 'ఇక్టాసిచ్చి హుటాటల్' అనే అగ్నిపర్వతాలున్నై. ఇవి అనాహుయాక్ నగర సంరక్షణార్థం దైవనియుక్తులైన రక్షకభటుల్లాగ ఉంటై. ఇప్పుడు వీటి రూపురేఖలు మాసిపోయినై కాని 'పొగలు గ్రక్కు కొండ' అనే అర్థమిచ్చే 'పోపోకాటిపీటల్' అనే పేరే 600 సంవత్సరాలకు పూర్వమిది అగ్నిపర్వతమని స్పష్టం చేస్తున్నది. కథల్లోనూ, గాథల్లోనూకూడా ఈ పేరు ఆ పర్వతానికి సార్థకంగా చెప్పబడింది. ఇక రెండవశిఖరమైన 'ఇక్టాసిచ్చిహుటాటల్' ప్రజల ఆదరాభిమానాలకు, ఊహాగానాలకు, కవిత్వానికీ కారణమైంది. ఆ మాటకు 'సుప్త శ్వేతసుందరి' అని అర్థం. సుందరి అనేమాటకు ముందున్న విశేషణాల అర్థాన్ని గురించి పండితులలో తీవ్రమైన అభిప్రాయభేదముంది. ఈ విభేదాలు ఎన్నటికీ తీరకపోవచ్చు. అసలీమాట మొట్టమొదట బొమ్మలలిపిలో వ్రాయబడింది. అందులో స్త్రీ గుర్తు స్పష్టంగానే ఉంది; విశేషణాల కుపయోగింపబడిన గుర్తుమాత్రం ఊహాగానాలకు దారితీసింది. పండితుల అభిప్రాయం ఏమైనాకానీ, 'శ్వేత' అనే దాంట్లో సందర్భశుద్ధి ఉంది. రెండు విశేషణాలనూ కలిపి ఆలోచిస్తే, పూర్తి ఆకారాన్ని చిత్రించగలవు. ఎలాగనంటే మెక్సికోనగరంనుండి పరిశీలిస్తే ఆ శిఖరం వెల్లకిల పడున్న స్త్రీవలె కన్పిస్తుంది; అంత ప్రశాంతమైన ప్రదేశంలో పడుండటానికి గల కారణం నిద్రపోవటంతప్ప మరొకటి ఉండదు; ఇక సర్వకాల సర్వావస్థలలోనూ మంచుపడుతూ ఉంటుంది కాబట్టి తెల్లగా ఉండక తప్పదు. అందుచేత 'సుప్త శ్వేతసుందరి' అంటేనే నిండుగా ఉంటుంది. ఏది ఏమైనప్పటికీ, ఆ జంట శిఖరాలు శతాబ్దాల తరబడి కథలకు వస్తువును సమకూర్చినై; కవుల భావనాబలానికి వేగాన్ని చేకూర్చినై; మెక్సికోలోయ సౌందర్య వైభవానికి మెరుగులు పెట్టినై.

ఆదిమవాసులకు చెందిన ప్రకృతి మతదేవతకుగల కీర్తివల్ల గౌడాలుపే దేవత ఆలయం పూర్తిగా మరుగునపడి పోతోంది. ఉష్ణదేశంలో సర్వకాలాలలోనూ మంచు పడటం అద్భుతమైన విషయమే. అందుకు ఈ దేవత మాహాత్మ్యమే కారణమని ప్రజల విశ్వాసం. ఆధునిక మెక్సికోదేశ సంస్కృతి ఈ విషయాన్ని స్పష్టపరుస్తుంది. ఆదిమవాసుల ప్రకృతి మతంపై స్పానిషు విజేతలు తమ కాథలిక్ మతాన్ని దిగుమతి చేశారు. కాని అప్పుడప్పుడు స్థానిక ప్రకృతిమతం కాథలిక్ మతాన్ని సవాలుచేసి తనబలాన్ని నిలదొక్కుకుంటూ ఉంటూంది. మతగురువులైన హిడాల్గో, మోరెలాస్‌ల కాలం నుండి మతాధికారులను నిరసించటమే మెక్సికో విప్లవంలో ప్రధానాంశమైంది.

టయజ్ నియంత రోజుల్లో 'సిర్రా నెవాడా'ను మెక్సికో జాతీయ ఉద్యాన వనంగా తయారుచేశారు. ఐరోపానుండి ఎందరో ఆనందపిపాసువులు యాత్రార్థం వచ్చి ప్రకృతి సౌందర్యోపాసన చేస్తూ ఇచట ప్రొద్దుపుచ్చుతుంటారు. ఆ పర్వతం వరకూ, దారిపొడుగునా ప్రభుత్వ విశ్రాంతి శాలలున్నై. వర్తకులుకూడా ఫలహార, భోజనశాలలు నెలకొల్పారు. విప్లవం ప్రారంభమైనప్పటినుండి పరిస్థితులు పూర్తిగా మారిపోయినై; శ్వేతసుందరి ప్రశాంతంగా నిద్రపోతోంది. 'పొగపీల్చే' పర్వతం మాత్రం కాపలా కాస్తోంది. ప్రకృతిమతాభిమానులైన మెక్సికనుల కీపరిస్థితి నచ్చింది. తమ జాతీయ ఉద్యానవనాన్ని చూచి గర్వించినా, తమ దేవతల నివాసస్థలాలపట్ల మాత్రం గౌరవాన్ని కోల్పోలేదు. అందుచే, తమ పవిత్రదేవాలయాలను విదేశీయులు తమ భోగ విలాసాలతో అపవిత్రం చేయలేదని వారి సంతృప్తి. విప్లవం ఆమాత్రమైనా చేయగలిగిందని వారి భావం. నేను మెక్సికోలోఉన్న రోజులలో దేవాలయ మార్గాలను జపాటిస్టాలు కాపలాకాస్తుండేవారు. హిమావృతశిఖరాలకు వెళ్ళాలనేకోరిక నాకు తీవ్రంగా ఉండేది. ముఖ్యపట్టణానికి 20 మైళ్ళ దూరంలోనే ఉన్నా అవన్నీ దోపిడీ గాండ్రమయమనీ, అందుచే సాహసించి వెళ్ళవద్దనీ మిత్రులు సలహాఇచ్చారు. చాలసార్లు కొంతదూరం వెళ్లి ఆపైన ధైర్యంచాలక తిరిగివచ్చాను. స్వతహాగా నాకు ప్రకృతి మతంలో గల సానుభూతి 'సుప్త శ్వేతసుందరి'పై అభిమానంగా మారిపోయింది. ఆ సుప్తశ్వేత సుందరి పవిత్రమైన గంభీరమైన ప్రాచీన సంస్కృతీ సాంప్రదాయాలకు చిహ్నం; కాని ప్రస్తుత మదంతా ఒక మృత సంస్కృతి!

లోయలోని అన్ని ప్రాంతాలకు ఆ జంట శిఖరాలు స్పష్టంగా కనిపిస్తై. మెక్సికోలో నేను నివసించిన ఇంటి బాల్కనీకి అవి సూటిగా ఉండేవి. మెక్సికో అధ్యక్షుడు కూడా పాల్గొన్న అంతర్జాతీయ కుట్రల కార్యగృహమే కేంద్రం. రష్యన్ బోల్షివిక్ మొట్టమొదట నాకు పరిచయం జరిగిందా ఇంట్లోనే. విప్లవ సిద్ధాంతాల లోని నిగూఢ మర్మాలను నాకు బోధపరచిందతడే. ఆ ఇంట్లోనే రష్యాకు వెలుపల మొదటి కమ్యూనిస్టుపార్టీ పుట్టింది. ఆ ఇంటి బాల్కనీ నుండి 20 మైళ్ళదూరంలో ఉన్న 'సుప్తశ్వేతసుందరి'ని ఫొటో తీయాలని చాల ప్రయత్నాలు చేశాను; అవి నేను ఫొటోగ్రఫీ నేర్చుకొంటున్న రోజులు. చివరి కొక ప్రయత్నం ఫలించింది. అపురూప మైన ఆ ఫొటోను ఎన్‌లార్జిమెంటు తీయించాను: షేమన్‌లకు పేరు పొందిన 'అవెనీడా ఫ్రాన్సిస్కో మాడిరో'లో ఒక ఫొటోగ్రాఫరు స్టూడియో గోడను ఆ ఫొటో చాల కాలం అలంకరించింది.

సుప్తశ్వేతసుందరీ నగరస్మృతులు నాలో ఎంతగాఢంగాఉన్నవో పై వ్రాతలవల్ల అందరికీ స్పష్టమౌతుంది. నేను జాతీయవాదిని కాదు. మంచికిగానీ చెడుకుగానీ నాకు నా దేశ మెంతో ఏ దేశమైనా అంతే. ప్రపంచాన్ని పరిశీలించినకొలది, సంకుచిత

మనస్తత్వంలేని ప్రజ లున్నప్పుడే ప్రపంచం బాగుపడుతుందని గ్రహించాను. కాని నాకు మెక్సికోపట్ల యేర్పడిన గాఢాభిమానానికి కారణమిది యని స్పష్టంగా చెప్ప లేను. 'సుప్తశ్వేతసుందరి' యందు నాలో కలిగిన అభిమానం ద్వారా నేను పొందిన అనుభూతియే కావచ్చు!

నేను కవిని కాను; ఆమె సౌందర్యాన్ని అభినందిస్తూ ఒక్క ముక్క కూడా వ్రాయలేదు. కాని ఆమె సమక్షంలో ఉన్నప్పుడుతప్ప, నా జీవితంలో మరెప్పుడూ సౌందర్యమంటే నాకర్థం కాలేదు. ఊహల్లో అనుభవించి ఆరాధించ వలసిందేగాని, సౌందర్యం అర్థజ్ఞానానికి అతీతమైనదని చెబుతూ ఉంటారు. అదంతా నాకు అర్థం కాని గజిబిజి భాష. నన్ను 'సుప్తశ్వేత సుందరి' ఆకర్షించింది. ఇప్పటికీ ఆ నిరాడంబ రత్వము, ఆటవికత, దాక్షిణ్యంలోని కాఠిన్యం మొదలైన గుణాలతో మెక్సికో ప్రజలు నన్నాకర్షిస్తూనే ఉంటారు. గత ముప్పది సంవత్సరాలలో వారు పూర్తిగా మారి పోయి యుండవచ్చు. కాని వారిని గుర్తుపట్టటం నాకు అసాధ్యంకాదు. అందుచేత విదేశంలో జీవితం గడపవలసివస్తే నేను మెక్సికోకే వెడతాను. ఏది మారినా, 'సుప్త శ్వేతసుందరి' మాత్రం అక్కడ అలాగే ఉంటుంది; నన్ను జూచి అసూయపడటానికా పొగపీల్చే పర్వతంలో చైతన్యం లేదు!

## సంస్కృతికి పునాది

మెక్సికోపట్ల నాకుగల అభిమానాన్ని రక్తసంబంధంతో ముడిపెట్టి వ్యాఖ్యా నించటానికి వీల్లేదు. నాకప్పటికి పెద్దగా విద్యాగంధం లేకపోయినా, దిగ్విజయ యాత్రలో అర్జునుడు మెక్సికోకు వచ్చి, తన బ్రహ్మచర్య దీక్షకు తిలోదకాలిచ్చి ఈ దేశ జనాభాను వృద్ధి చేశాడనే కథ మాత్రం నాకు నచ్చలేదు. ఈ కాకమ్మ కథలను శ్రద్ధగా పరిశీలించవలసిన అవసరమూ లేదు. ఇక, ప్రాచీన భారతీయులు మెక్సికో దేశానికి వలస వెళ్ళారనే సిద్ధాంతం పైదానికంటె సబబైనదేగాని, నమ్మదగినది మాత్రం కాదు. ఒకానొకప్పుడు ఆసియా, అమెరికాలను కలుపుతూ పసిఫిక్ మహాసముద్రంలో భూభాగం ఉండేదని మరొక సిద్ధాంతం. ఈ తలతిక్క సిద్ధాంతా లన్నిటికీ ఏక ముఖోత్పత్తి సిద్ధాంతం (Monogenesis) ఆధారం - అంటే మానవజాతి అంతా ఒక ప్రాచీన దంపతుల సంతానమనే నమ్మకం. ఒకానొకప్పు డీ సిద్ధాంతాన్ని మానవజాతి శాస్త్రం (Anthropology) కూడా నమ్మింది. ఏక ముఖోత్పత్తి సిద్ధాంతానికి 'సృష్టి' యందు విశ్వాసమే ఆధారం. కాని సృష్టియందు మానవునకు గల విశ్వాసం సడలి దోగిసలాడుతూ ఉంది. ఆధునిక శాస్త్రవిజ్ఞానం 'సృష్టి' భావాన్ని తొలగించి, ప్రాచీన అజ్ఞాత విషయాలపై వెలుగును ప్రసరించింది. హేతుబద్ధమైన బహుముఖో త్పత్తి సిద్ధాంతం (Polygenesis) రూపొందింది. ప్రపంచంలో వివిధ ప్రాంతా ల్లో విలసిల్లిన నాగరికతలో పోలిక లుండటానికి ఒక ప్రదేశంనుండి మరొక

ప్రదేశానికి ప్రజలు వలస వెళ్ళటమే కారణం అనే ఊహకు తావు లేకుండా పోయింది. తాంత్రిక మతము, జీవత్వమతము (Animism), విగ్రహారాధన, బహుదేవతారాధన అనే సాంస్కృతిక పురోగమనంలోని దశలు ఆదిమ మానవునిలోని హేతుత్వ వికాసానికి తార్కాణం. హేతుత్వమే మానవజాతికి విలక్షణమైన శారీరక వార సత్వం. ఒకే వారసత్వంవల్ల వివిధ ప్రదేశాల్లోనున్న ఆదిమ మానవులు ఇంచుమించు ఒకే విధంగా ఆలోచించారు. అతని ప్రవర్తన అన్ని తావుల్లోనూ ఇంచుమించు ఒకే విధంగా ఉంది. చరిత్రను శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించినప్పుడు 'మానవ సంస్కృతికి పునాది ఒక్కటే' అనే సత్యాన్ని మనం గమనింపగలుగుతాము. అందు చేతనే 'ఏక ప్రపంచం' అనే స్వప్నం ఏనాటికైనా యదార్థం కాగలదనే ఆశ కలుగుతుంది.

## హోటల్ జినీవా

మెక్సికోను అర్థం చేసికొనటానికి నాకు కొంతకాలం పట్టింది. హోటల్ జినీవా చాల విచిత్రమైన ప్రదేశం. అక్కడికి నన్ను తీసుకువెళ్లిన కెనడా దేశస్థునకు నేను చాల కృతజ్ఞుణ్ణి. కాని ఆ హోటల్లో మెక్సికో జాతీయత యేమాత్రం కన్పించదు. స్వదేశీ 'దుర్గంధం' రాకుండటాని కది అవసరమే! అదొక చిన్న ఆంగ్లో అమెరికను వలస. అందులో నాకు కన్పించింది 'నన్ను ముట్టుకోకు' అనే కృత్రిమ వాతావరణం, నాకు చాల అసహ్యమనిపించింది. శత్రు పరివృత్తమైన కోటలో ఉన్నట్లు, లేదా భయంకరమైన వ్యాధి బారి పడకుండా కాపాడుకొనేందుకు తాపత్రయ పడేవారివలె ఉండేవారు అందులోని వారు. చిరకాలంనుండి మసుగుతున్న అంతర్యుద్ధంవల్ల వ్యాపించిన వ్యాధుల భయం వారిలో చాల ఎక్కువ. అందుచేతనే డయాజ్ 'సువర్ణ యుగం' పునరుద్ధరింపబడాలని వారంతా ఆశిస్తుండేవారు.

విదేశీయులు అభిమానిస్తున్న ఈ కృత్రిమ వాతావరణాన్ని మొదటి రోజునే గర్హించాను. కాని నాకు కావలసిన సౌకర్యాలు ముఖ్యంగా ఉష్ణోదక స్నానం, వెచ్చని గది అక్కడ లభించినై. ఎన్ని జీవిత సౌకర్యా లున్నప్పటికీ ఒక విదేశ ముఖ్యనగరంలో ఉన్నాననీ, ఆ దేశానికి విలక్షణమైన సంస్కృతీ సాంప్రదాయాలున్న వనీ మరచిపోవటం కష్టమైనపని. సాధారణంగా ఒక దేశం సంస్కృతి ఆ దేశంలోని వంటకాల్లో కన్పిస్తుందని నా విశ్వాసం. ఇప్పటికీ నాకదే నమ్మకం. నిరాడంబ రత్వంవల్ల, హేతుత్వంవల్ల నా భావాలు మారిపోయి యుండవచ్చు; అందుచేత 'ఏ దేశంలో ఉంటే ఆ దేశస్థుడుగానే ఉండాల'నే పద్ధతి ప్రస్తుతం నా విషయంలో వర్తించదు. కాని మెక్సికో వెళ్ళిన మొదట్లో ఆ దేశస్థుడుగానే ఉండాలని ప్రయ త్నించాను. మెక్సికో జాతీయ ఆహారపదార్థాలు మాత్రమే కావాలన్నప్పుడు న్యూవా లారెడో (సరిహద్దు పట్టణం) హోటలు యజమాని నా కోరికను మన్నించాడు.

మెక్సికో వంటకాలలో, 'టామలెస్' 'చిలీకాన్ కార్ని' అనేవి రెండు మాత్రమే నాకు తెలిసినవి. హోటల్ జినీవాలో అవి తెచ్చిపెట్టమని అడిగాను. ఆ నౌకరు మెక్సికో జాతీయుడే; నా వంక ఆశ్చర్యంగా చూచాడు. అమెరికానుండి దిగుమతి యైన డబ్బాలలో నుండి వాటిని తెస్తానన్నాడు. లిబ్బీ, హింజ్ అనే అమెరికా కంపెనీలు 57 రకాల వంటకాలకు పేరు పొందినై. మెక్సికోకు కూడా ఆ కంపెనీవే వంటకాలను సరఫరా చేస్తున్నై. నాకాశ్చర్యం కలిగి 'మెక్సికో వంటకాలు అమెరికానుండి రావట మేమిటి?' అని ప్రశ్నించాను.

"మా అతిథు లెవ్వరూ స్వదేశ భోజనం చేయరు" అని చెప్పాడు నౌకరు. ఆర్డరు మార్చి వేశాను.

## స్వతంత్ర మెక్సికో

1810-1820 ల మధ్య మెక్సికోదేశం స్పెయిన్‌పై స్వాతంత్ర్యయుద్ధం సాగించింది. నాటినుండి మెక్సికో చాల అల్లకల్లోలంగా ఉంది. చివరికాదేశంలోని భూస్వామ్యవర్గం సామ్రాజ్య శిథిలాలపై రిపబ్లిక్ ప్రభుత్వాన్ని స్థాపింపగలిగింది. నీరసించి పోయిన ఈ భూస్వాములుగూడా, తమలో స్పానిషు విజేతల రక్తమే ప్రవహిస్తుందని గర్వించేవారు; గౌరవప్రతిష్ఠలు కోల్పోయి, దివాలాతీసిన ఐరోపా రాచరికానికి కప్పం చెల్లించటం నీచమనే భావమే వీరిచేత స్పెయిన్‌పై తిరుగుబాటు చేయించింది. ఐనా సాంస్కృతికంగా వీరంతా ఐరోపావారే. సామ్రాజ్యాధిపతులవలె వీరుకూడా, మెక్సికోలోని ఆదిమనివాసులతో కలసిపోలేక పోయినారు. విజేతల (కాన్‌క్విస్టడోర్సు) సంతతివారమనే అహంభావమే అందుకు కారణం.

పూర్వం అధికారంలో ఉన్న కాథలిక్ రాచరికానికి బదులు, అహంభావ పూరితమైన ధనికస్వామ్యం మెక్సికోలో పరిపాలన నడుపుతోంది. అందుచేత ప్రస్తుత పరిపాలనలోకూడా, దేశీయులకు-అంటే మెక్సికోఆదిమవాసులకుస్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లభించలేదనే చెప్పాలి. కాబట్టి, 1811 లో హిడాల్గో, మోరిలాస్ అనే పూజారుల నాయకత్వాన ప్రారంభమైన స్వాతంత్ర్యపోరాటం ఇప్పటికీ సాగుతూనేఉంది. కాని ఈ పోరాటం మెక్సికోలో ఉన్న రెండుతెగలమధ్య జరుగుతోంది. అందులో ఒక తెగ కత్తీలేని (ఎఱ్ఱ) ఇండియన్లు, జాతి సాంకర్యవల్ల యేర్పడిన మధ్యతరగతివారు. రెండవతెగ స్పానిషు విజేతల సంతతివారమని గర్వించే ధనికవర్గం. ప్రస్తుత సంఘర్షణ ఈ తెగలమధ్యనే.

## మధ్యతరగతి ప్రజాస్వామ్యం

రక్తసాంకర్యాన్ని నివారించాలని విజేత లెంతప్రయత్నించినా, మెక్సికోలో ఒక పెద్దమిశ్రమజాతి తయారైంది. తామే స్వదేశస్థులమనే అభిమానంతో వీరు

ఆవేశపూరితులైన దేశభక్తులుగా తయారైనారు. 18వ శతాబ్దంనాటి యిరోపా సంస్కృతిని జీర్ణంచేసికొని, దాని లక్షణాలైన రాజకీయస్వాతంత్ర్యం, సాంఘిక న్యాయం అనే ఆశయప్రేరితులైనారు. స్పెయిన్‌వారి పాలన పతనమైన తరువాత కాథలిక్ పూజారుల సహాయంతో బలపడుతున్న ధనికస్వామ్యాన్ని వీరు ప్రతిఘటించారు. 18వ శతాబ్దంనాటి ఫ్రాన్సులోవలెనే మెక్సికోలోగూడా పూజారులు ప్రజాస్వామ్య శక్తుల దాడికి గురియైనారు. ఈ మహోద్యమానికి బెనిటోజారెజ్ నాయకుడు. ఇతడు నూటికి నూరుపాళ్ళు మెక్సికో దేశస్థుడు. ఈ అంతర్యుద్ధం జరుగుతున్న సమయంలోనే మెక్సికోకు, అమెరికాకు (USA) మధ్య టెక్సాసురాష్ట్రాన్ని గురించి యుద్ధం జరిగింది. ఐనప్పటికీ అంతర్యుద్ధంలో ప్రజాస్వామ్యశక్తులే గెలుపొందినై. మెక్సికో రిపబ్లిక్ అధ్యక్షుడుగా జారెజ్ ఎన్నికైనాడు.

టెక్సాసు, న్యూమెక్సికో, కాలిఫోర్నియా ప్రాంతాలను అమెరికాకిచ్చి మెక్సికో సంధిచేసుకొంది. కాని, ధనిక, పూజారి వర్గాలను పూర్తిగా అణచివేసి, తమ అధికారాన్ని గట్టిపరచుకునే అవకాశం ప్రజాస్వామ్యశక్తులకింకా లభించలేదు. మెక్సికోలో మొదటినుండి జరిగిన ఘోర అత్యాచారాలన్నిటికీ జారెజ్ ప్రభుత్వమే బాధ్యత వహించాలని ఫ్రాన్సు, బ్రిటన్, స్పెయిన్‌దేశాలు వాదింపసాగినై. ఆ నిమిత్తముగా నష్టపరిహారం కోరుతూ, ఆ దేశాలన్నీ ఉమ్మడిగా సైనికచర్య జరిపి మెక్సికోలో హాప్సుబర్గ (స్పెయిను) రాజవంశాన్ని పునఃప్రతిష్టచేశారు. మాక్సిమిలన్ అనే దురదృష్టవంతుడైన రాకుమారుడు మెక్సికో చక్రవర్తి అయినాడు. జారెజ్ ఈ చర్యలను ప్రతిఘటించి ధైర్యసాహసాలతో సంవత్సరాల తరబడి పోరాటం సాగించి, చివరకు 1867 లో మాక్సిమిలన్ రాకుమారుని దేశంనుండి తరిమివేశాడు.

## ధనికవర్గ నియంతృత్వం

మెక్సికో స్వతంత్రమైంది; జారెజ్ 1872 లో మరణించాడు. తిరిగి అంతర్యుద్ధం చెలరేగి పది సంవత్సరాలు సాగింది. చివరకు స్పానిషు విజేతల తాలూకువాడైన జనరల్ పాల్ఫిరో డయజ్, అమెరికా సాయంతో మెక్సికోలో నియంతృత్వాన్ని స్థాపించాడు.

డయజ్ సాగించిన 25 సంవత్సరాల నియంతృత్వం ఫలితంగా దేశంలో శాంతి భద్రతలు నెలకొల్పబడినై. బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికా పెట్టుబడులు దేశంలో ప్రవేశించినై. వాణిజ్యం విస్తరించటానికి ప్రశాంత పరిస్థితు లవసరం. కాబట్టి ప్రజాస్వామ్యశక్తుల అలజడినుండి డయజ్ నియంతృత్వాన్ని కాపాడవలసిందిగా విదేశ పెట్టుబడిదారులు తమ ప్రభుత్వాలను కోరారు. మరొక వైపున నియంతృత్వ పోషణలో ధనికవర్గం కోలుకొని, తన అధికారాన్ని, ప్రతిష్ఠను తిరిగి సంపాదించ సాగింది, జారెజ్ సాధించిన విప్లవం నామరూపాలు లేకుండా పోయింది. యిరోపా

లోని లాటిన్ దేశాలనుండి వచ్చే సోమరిపోతు ధనికులకు మెక్సికో క్రీడారంగమైంది. జమీందారుల భూములపై (హాసెయండాలు) రైతు బానిసలు చెమటోడ్చి ఉత్పత్తి చేసిన సంపద అంతా దుర్వినియోగంచేసి మెక్సికో నగరాన్ని, తత్పరిసరాలను విలాసాలకూ, ఆడంబరాలకు కేంద్రంగా, ఆకర్షణీయంగా తయారు చేశారు. ఇట్లా చెమటోడ్చేవారంతా దేశీయులు; వీరు జనాభాలో మూడింట రెండు వంతులుంటారు. ఇక మిశ్రమజాతి మధ్యతరగతివారి పరిస్థితి యేమంటే : వీరు విద్యావంతులు; ఆధునిక సంస్కృతి నవలంబించినవారు; ప్రగతిశీలమైన సాంఘిక రాజకీయ ఆశయాలు కలవారు; విప్లవ స్మృతులే తమ వారసత్వమని నమ్మి వానినే నెమరు వేసుకొంటూ ఉండేవారు. చివరకు 1911 లో మధ్యతరగతివారు ఫ్రాన్సిస్కో మెడెరో నాయకత్వం క్రింద తిరుగుబాటుచేసి, డయజ్ నియంతృత్వాన్ని కూలద్రోశారు. ఇదికూడా ఒక ప్రజాస్వామిక విప్లవమే వీరు భూసంస్కరణలతో కూడిన కార్యక్రమాన్ని అనుసరించటంవల్ల వీరికి గ్రామీణుల సహకారం లభించింది.

కాని డయజ్ కాలంలో బలపడిన జమీందారులు, విదేశీ పెట్టుబడిదారులు ఈ విప్లవంపై ధ్వజమెత్తారు. దేశంలో అరాజకం ప్రజ్వరిల్లుతుందనే సాకు చూపించి ప్రజలను భయపెట్టి జనరల్ హ్యూయెర్టా సహాయంతో విప్లవ ప్రతిఘటనోద్యమం ప్రారంభించారు. అమెరికా జోక్యం కలిగించుకొని సైన్యాలను మెక్సికోలోకి పంపుతుందనే భయంతోనూ, తిరిగి దేశాన్ని అంతర్యుద్ధంపాలు చేయటానికి ఇష్టంలేకనూ 1912 లో మెడెరో తన అధ్యక్షపదవికి రాజీనామాచేశాడు. అమెరికా జోక్యం తప్పినా, అంతర్యుద్ధాన్ని తప్పించటం సాధ్యం కాకపోయింది. హ్యూయెర్టా అనామకుడు; ధనికవర్గంచేతిలో కీలుబొమ్మ; అతనికి ప్రజల్లో పలుకుబడిగాని, సైనికబలంగాని లేదు. అందుచేత, అధికార వ్యామోహంతో అనేకులు మెక్సికో రాజకీయ రంగంమీద తయారైనారు. విప్లవపతాకనీడలో దుర్మార్గులు కొందరు దోపిడీలు ప్రారంభించారు. అట్టివారిలో ఎమిలియానో జపాటా, పాంకోవిల్లా అనేవారు ప్రముఖులై అధ్యక్షపదవికికూడా అఱ్ఱులు చాచారు.

## కరంజా ప్రభుత్వం

నేను మెక్సికోలో ప్రవేశించినప్పుడు దేశం అంతటా అంతర్యుద్ధం జరుగుతూనే ఉంది. జనరల్ వెనూస్టియానో కరంజావర్గం విజయంసాధించి, రాజధానిలో అధికారం స్థాపించి ఒక సంవత్సరమైంది. కొన్ని ప్రధాన నగరాలు అతని చేతిలో ఉన్నై. కొందరు రాష్ట్రగవర్నర్లు అతనికి అండగా ఉన్నారు. కరంజాకూడా స్పానిష్ జమీందారీ వంశస్థుడేకాని జారజ్, మెడెరోల విప్లవ సంప్రదాయాలలో తనకు పూర్తి విశ్వాసమున్నట్లు ప్రకటించాడు. అధికారంలోకి రాగానే ఒక రాజ్యాంగపరిషత్తును కూడా సమావేశపరచాడు; ఐతే మామూలు ప్రజాస్వామ్య సూత్రాల ననుసరించి

ఎన్నికలద్వారా రాజ్యాంగపరిషత్తు నేర్పాటుచేయడానికి దేశంలోని పరిస్థితులు అనుకూలంగాలేవు; ఐనప్పటికీ రాజ్యాంగపరిషత్తుచేసిన పనినిబట్టి అదొక ప్రజాస్వామ్య సభ యనే విషయం రుజువైంది. అందులోని సభ్యుల్లో చాలభాగం ఆదర్శవాదులు, సోషలిస్టులు, అనార్కిస్టులు. ఈ పరిషత్తులోనే తయారైంది 'క్వెరటారో' రాజ్యాంగం. దీన్ని ఒక అనార్కిస్టు తయారుచేశాడు. ఈ రాజ్యాంగాన్ని అనుసరించే క్రొత్త రిపబ్లిక్ ఏర్పాటు చేయబడింది. దేశంలోని సహజ సంపదలపై ఉమ్మడి యాజమాన్యం మొదలైన సాంఘిక న్యాయాలను చట్టబద్ధంచేసిన దీ రాజ్యాంగమే. కాని, ఊహావాదులచే తయారు చేయబడినది కావటంవల్ల ఈ క్వెరటారో రాజ్యాంగం ఆచరణకు అంతగా అనుకూలించలేదు.

రాజ్యాంగములోని 17వ నిబంధన (దేశసంపదను జాతిపరం చేసినట్టిది) మతాధికారులకు, జమీందారులకు, విదేశ పెట్టుబడిదారులకు సింహస్వప్నమైనది. మధ్యయుగంనాటి ఐరోపాలోవలె మెక్సికోలోని మతసంస్థలకు పెద్ద పెద్ద భూములుండేవి. ఇక విదేశ పెట్టుబడిదారులకు డయజ్ నియంతృత్వమే ఒక 'స్వర్ణయుగం'. ఆ రోజుల్లో, వారు మెక్సికోలోని పెట్రోలు గనుల్లోనేగాక, ఇతర గనులలో కూడా శాశ్వతమైన హక్కులు సంపాదించారు. అందుచేత దేశంలోని జమీందారీ ప్రతీపగామి శక్తులూ, విదేశ ఆర్థికాధికారులూ ఒకటిగా చేరి కరంజా ప్రభుత్వంమీద కత్తి దూశారు.

ఇది ఇలా ఉండగా, మరొక వైపున విల్లిస్టాలు, జపాటిస్టాలూ కరంజాపై యుద్ధం సాగిస్తూనే యున్నారు. కరంజా స్పానిషు జమీందారీ వంశస్థుడనే ప్రచారంతో వీరు గ్రామీణ ప్రజానీక సహకారాన్ని, సానుభూతిని పొందసాగారు. కరంజా ప్రభుత్వానికి ఈ విధంగా వెనుక నుయ్యి ముందు గొయ్యిగా వుంది. అట్టి అపాయకర పరిస్థితిలోనుండి కరంజా ప్రభుత్వాన్ని రక్షించగలగటం నా అదృష్టం. రాజకీయ కార్యరంగంలో విజయవంతమైన నా మొదటి అనుభవం అదే. కాని, కరంజా ప్రభుత్వాన్ని బలపరచి, తద్వారా మెక్సికో ప్రజాస్వామ్య విప్లవానికి నేను చేసిన సహాయంకంటె, ఈ కృషిలో నేను పొందిన లాభమే ఎక్కువ అని నా నమ్మకం!

అంతర్జాతీయంగా కరంజా ప్రభుత్వం చాల అననుకూల పరిస్థితుల్లో వుంది. క్వెరటారో రాజ్యాంగంవల్ల ఎక్కువగ నష్టపడినది బ్రిటీషువారు. ఐరోపాయుద్ధంలో మునిగి తేలుతూ ఉండటంవల్ల నిరసన తెలియజేయటం మినహా, ఏం చేయటానికి బ్రిటీషువారికి అవకాశం లేకపోయింది. లాటిన్ అమెరికా దేశాల సమస్యతో అమెరికా సతమతమై పోతున్నది. ఐనా 1916 లో మెక్సికో రేవు పట్టణమైన వెరాక్రూజ్‌ను ఆక్రమించటానికి అమెరికా తన నౌకాదళాన్ని పంపింది; కాని మరు సంవత్సరమే యుద్ధంలో చేరటంవల్ల మెక్సికోలో ఎక్కువగా జోక్యం చేసుకోలేక

పోయింది. ఈ పరిస్థితులవల్ల కరంజా ప్రభుత్వానికి మంచి వ్యవధి లభించింది. దీన్ని ఉపయోగించుకోటానికి దేశంలోని వివిధ శక్తుల మధ్య సంబంధాలు అనుకూలంగా లేవు. కరంజా ప్రభుత్వానికి నేను సహాయం చేయగలిగిందీ, రాజకీయ కార్యనిర్వహణలో అనుభవం సంపాదించ గలిగిందీ ఈ సందర్భంలోనే.

అతివాద ప్రజాస్వామ్య సిద్ధాంతాల్తో తయారైన రాజ్యాంగంతో నడుస్తున్నప్పటికీ, కరంజా ప్రభుత్వం రెండు బలవత్తరమైన అంతరంగిక శక్తులతో పోరాడవలసి వచ్చింది. ఈ శక్తులు స్వదేశ రక్తసంబంధమనే భావాన్ని, ప్రజల పేదరికాన్ని తమ ప్రచారానికి ఉపయోగించుకుంటున్నై. కొద్దిలో అధ్యక్ష పదవి తప్పి తన ప్రయత్నాలన్నీ విఫలమైన తర్వాత పూర్తి బందిపోటుగా దిగజారి పోయినాడు పాంకోవిల్లా. ఐనా రాబిన్‌హుడ్ పాత్రను (భాగ్యవంతులను దోచి బీదలకు పంచటం) ధరించటంచేత, ఉత్తర రాష్ట్రాలలో పాంకోవిల్లాకు మంచి పలుకుబడి ఉంది. కొద్దిమంది చేతుల్లో ధనం కేంద్రీకృతమై, ప్రజానీకం దుర్భర దారిద్ర్యంలో మ్రగ్గుతున్న దేశంలో రాబిన్‌హుడ్ పాత్రధారులకు గౌరవం ఉండటంలో ఆశ్చర్యం లేదు. పాంకోవిల్లాకు మరొక అవకాశం కూడా ఉంది. అతని వెనుకనే అమెరికా సరిహద్దు రక్షణ బలాలున్నై; వారిద్వారా తన గెరిల్లా దళాలకు ఆయుధాలు సంపాదించవచ్చు పాంకో. ఇతని దళాలను కరంజా సైన్యాలు తుదముట్టించలేక పోవటానికి గల కారణం కూడా అదే. అదీగాక ఈ దళాలు సరిహద్దులను దాటితే, అందుకు బాధ్యత అంతా కరంజాపై వేసేది అమెరికా. వీరి దోపిడీలను అణచివేసే సాకుతో అమెరికా సైన్యాలు మెక్సికో భూభాగం మీద కూడా దాడులు జరిపేవి.

ఇక రెండవవాడు జపాటా. ఇతడు కేవలం దోపిడిగాడు కాదు. ఇతని ఉద్యమానికి బలీయమైన సాంఘిక పునాదులున్నై. జర్మనీలో రైతుల తిరుగుబాటులో అనాబాప్టిస్టులనే మత ప్రచారకులు చేసినపనికి, ఇతని కార్యక్రమానికి చాలా పోలికలున్నై. కల్తీలేని దేశీయుడు కావటం ఇతనికి మరింత బలాన్నిచ్చింది. ఆ కారణంచేత కూడా అతని అధికారం అవినీతి పాలుకాలేదు. అతడు మధ్యయుగ వీరపురుష లక్షణాలను ఎన్నడూ విడిచిపెట్టలేదు. అందుచేత జమీందారుల దౌర్జన్యాలకు గురియైపోతున్న మెక్సికో రైతుల స్వాతంత్ర్యోద్యమ నాయకుడుగా జపాటాను విదేశస్థులు గూడా కీర్తించారు. జపాటా దళాలు జకాటెకాస్ రాష్ట్రాన్ని ఆక్రమించినై. ఆ ప్రాంతంలో ఒక రకమైన వ్యవసాయక సామ్యవాదాన్ని స్థాపించటానికి ప్రయత్నించాడు జపాటా. ఇతని ప్రయోగాలు అనార్కిస్టులనుకూడా ఆకర్షించినై. కెరటారో రాజ్యాంగ నిర్మాతయైన అనార్కిస్టు న్యాయవాదికూడా జపాటాతో చేరాడు. కాని కొంతకాలానికి, జపాటిస్టుల వ్యవసాయక కమ్యూన్ పద్ధతి కూడా అతనికి నచ్చలేదు; అందులో స్వేచ్ఛకంటె విశృంఖలత్వమూ,

సాంఘిక న్యాయంకంటె అనాగరిక క్రూరత్వమూ కన్పించినై. అందుచే అనార్కిస్టులు జపాటాను విడిచి పెట్టారు. తర్వాత ఆ అనార్కిస్టు న్యాయవాదితో నాకు మైత్రి కుదిరింది. అతడు పూర్తిగా నిరాశావాదియై పోయినాడు. నాలో చెలరేగుతున్న మహోన్నతమైన ఆశలన్నీ కేవలం భ్రమలంటూ నవ్వుతుండేవాడు!

పాంకోవిల్లా ఉత్తరదేశంలో రాబిన్‌హుడ్ పాత్రను నిర్వహిస్తుంటే, జపాటిస్టాలు మెక్సికోనగర పరిసరాల్లోనే బీదవారి సహకారంతో నిర్భయంగా తిరుగుతుండేవారు. వారివల్ల పెద్ద ప్రమాదమేమీలేదు. కాని, వారి ఉనికే అలజడికి కారణం. గ్రామాలపై దండెత్తి దోచుకునేవారు; కాని పట్టుబడితే మాత్రం వారికి మరణశిక్షే!

ఈ విషయాలన్నీ విన్న తర్వాత, జపాటిస్టాలను గురించి స్వయంగా తెలుసుకోవాలనే కోరిక కలిగింది. జపాటిస్టాలను కలుసుకోవద్దని వారించాడు అనార్కిస్టు న్యాయవాది. మాకు సమీపంలో ఉన్న లాస్‌యేంజల్ అనే పాడుబడిన మఠమే జపాటిస్టాలకు కేంద్రమని తెలిసింది. చివరకు న్యాయవాది నాతో ఆ మఠానికి రావటానికి అంగీకరించాడు. అక్కడ ప్రాణాలతో ఉన్న జపాటిస్టా ఒక్కడూ లేడు. రోడ్డు ప్రక్కన చెట్లకు శవాలు వ్రేలాడుతున్నై. సానుభూతి లేశంకూడా లేని నిర్లక్ష్యంతో గ్రామస్థులీవిధంగా చెప్పారు: రెండు రోజులక్రితం జపాటిస్టాలా ప్రాంతాలపై దాడి చేశారు. వారిలో కొందరిని కరంజస్టాలు పట్టుకొని ఉరితీశారు; మిగిలిన వారికి హెచ్చరికగా ఈ దేహాలను చెట్లకు వ్రేలాడదీశారు. ఈ ఆచారం ఇక్కడ మామూలే. జుగుప్సాకరమైన ఈ ఆచారం విస్తృతంగా ఉన్నదని తరువాత నాకు స్వానుభవంవల్ల తెలిసింది.

ఇంతవరకూ నా ఉనికికీ, నాలోని పరిణామాలకు కారణమైన క్రొత్త రంగస్థలానికి గల చారిత్రక నేపథ్యాన్ని మీ ముందు చిత్రించాను. ఇక, కథాక్రమానికి ఉపక్రమిస్తాను.

## మెక్సికో అభయ ప్రధానం

మెక్సికోలో అడుగుపెట్టేవరకు నాకు అక్కడ పరిచయస్థు లొక్కరూ లేరు; ఎవరితోనూ పరిచయం చేసికొనే ప్రయత్నమూ చేయలేదు. అసలు, నేను మెక్సికో వెళ్ళటం బుద్ధిపూర్వకంగా కాదుగదా! కఠినశిక్ష నెదురుచూస్తూ అమెరికా జైల్లో మ్రగ్గటం, ఆ తరువాత ఇండియాకు పంపబడటం ఇష్టంలేక, అమెరికానుండి బైట పడాలని సంకల్పించాను. అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ఐరోపాకు వెళ్ళాలని చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనై. ఇక మిగిలింది కెనడా, మెక్సికో దేశాలు మాత్రమే. ఐతే, కెనడాలో బ్రిటిష్ పోలీసులకు పట్టుబడే ప్రమాదం ఉంది.

అందుచే మెక్సికోకు పారిపోవటంకంటె గత్యంతరంలేదని గ్రహించి, తొందరగా మూటా ముల్లా సర్ది బైటపడ్డాను.

## క్రొత్త పంథా

క్రొత్త దేశమే ఐనా మెక్సికోపట్ల, మెక్సికన్లపట్ల అచిరకాలంలోనే నాకు అభిమానం కలిగింది. మెక్సికోలో స్వదేశంలో ఉన్నట్లే ఉండేది. మొట్టమొదటి రోజుల్లో కూడా, మెక్సికోలో పూర్తి నిస్సహాయంగా బాధపడలేదు. ఆ దేశ వాతావరణమే నాకొక క్రొత్త శక్తి నిచ్చినట్లైంది. అదీగాక జనరల్ ఆల్వరాడోకు నన్ను పరిచయంచేస్తూ నాదగ్గరనున్న లేఖయే నాకు మార్గదర్శకమైంది. ఆల్వరాడో యుకటాను రాష్ట్ర గవర్నర్. కాని మెక్సికో నగరానికి యుకటాను అందుబాటులో లేదు. అక్కడికి రైలుమార్గం కూడా లేదు. ఇక పెట్టమార్గాన వేయిమైళ్ళు ప్రయాణం చేయాలి; ఈ మార్గం పర్వతారణ్యమయమైన చాస్కో, షియపాస్ రాష్ట్రాలగుండా వెళుతుంది. సాధారణంగా ఇక్కడి వారంతా మెక్సికో సింధుశాఖ మీదుగా ప్రయాణం చేస్తారు. కాని నౌకలన్నీ అమెరికా వారివే! అవి, మెక్సికో రేవు పట్టణమైన వెరాక్రూజ్ నుండి బయలుదేరి ఏ అమెరికా రేవు పట్టణమో, హానొలూలూ నగరమో చేరుతూ ఉండేవి. అవి నేను వెళ్లటానికి తగిన ప్రదేశాలు కావు. కొన్ని మెక్సికో నౌకలు నేరుగా ప్రయాణం చేసేవే గాని అవి చిన్నవి కావటంచేత, ప్రయాణీకులు వాని నుపయోగించే వారు కారు. అందుచే యుకటాను వెళ్ళి అక్కడ ఆల్వరాడో చేస్తున్న సామ్యవాద ప్రయోగాలు చూచే ప్రయత్నం విరమించాను. ఇది ఒక విధంగా ఆశాభంగమే! నాటివరకు 'సాంఘిక న్యాయం'లో నాకు గట్టినమ్మకం యేర్పడలేదు; ఐనా ఆ సిద్ధాంతం నన్ను ఆకర్షిస్తూనే ఉంది. యుకటాను అమెరికాలోని భావోన్మాదుల 'స్వర్గభూమి'! అందుకనే వెళ్ళిచూడాలనే కోర్కె కలిగింది. కాని ఆల్వరాడో ప్రయోగాలు పరిశీలించి ఉన్నట్లయితే మరింత ఆశాభంగం కలిగి ఉండేది. అందుకు కారణం క్లుప్తంగా చెబుతాను: యుకటాన్ ఉత్పత్తు లన్నిటిలో పీచు, ఔషధాలు ప్రధానమైనవి. వీటి ఎగుమతి వర్తకం ప్రభుత్వపరం చేయటమే అచటి సామ్యవాదంలోని ముఖ్య లక్షణం. వాస్తవానికి ఈ పరిశ్రమలు కూడా అమెరికా పెట్టుబడిదారుల చేతుల్లోనే ఉండేవి. వారి మిరాసి హక్కులకు భంగం కలిగించ నంతవరకే అది ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానమైంది. ఇట్టి పద్ధతి విప్లవాత్మకం కాదనీ, చవకబారు సంస్కరణ విధానమనీ ఆ రోజుల్లో భావిస్తూ ఉండేవాణ్ణి.

నా భావాలకు కొంతవరకు కారణం రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవ ప్రతిధ్వనులే. నాటి వాతావరణమంతా ఏవో అస్పష్టమైన ఆశలతో నిండి ఉండేది.

వామపక్ష సోషలిస్టులకు హుషారు ఎక్కువైంది. వీరంతా భావి కమ్యూనిస్టులే! విద్యుత్ప్రేరితమైనట్లున్న ఆ వాతావరణంలో నేనూ మునిగి పోయినాను. ఐతే అది నా రక్తంలోని విప్లవ ఉష్ణోగ్రత హెచ్చటం మాత్రమే కాదు; నా రాజకీయ పరిణామంలో గోచరించిన నూతనపంథా. కరుడుగట్టిన జాతీయవాదిగానున్న నేను కమ్యూనిజానికి ఒక పెద్ద గంతు వేశాను. ఈ క్రొత్త మతావేశంలో సంస్కరణ విధానం నింద్యంగా కన్పించింది. ఐతే హఠాత్తుగా సాధించిన అభివృద్ధి కృత్రిమమైనదని క్రమంగా గుర్తించాను. ఇది అనుభవం ద్వారా కలిగిన భావమేగాని, అవకాశవాదంవల్ల కలిగింది కాదు!

నాటికి ఇంకా రష్యా వెళ్లాలనే కోరిక కలగలేదు; కాని నాలో విప్లవ విశ్వాసానికి మాత్రం కొదువలేదు. సాంస్కృతికంగా నేనింకా జాతీయవాదినే. సాంస్కృతిక జాతీయవాదం అంటే ఘనీభవించిన సంకుచితత్వమే! ఐతే సోషలిజం నన్ను ఆకర్షించటానికి కారణం అందులోని సామ్రాజ్యవాద వ్యతిరేకతయే. మా విప్లవ ఆవేశానికి మూలం 'ఆనందమఠం'; అందుచేత ఆదర్శవాదంగానీ, మానవవాదం గానీ నాకు క్రొత్తవి గావు; ఆదర్శప్రాయమైన జీవిత విలువలతో, జీవిత విధానంతో సాంఘిక న్యాయసూత్రాన్ని సంధించటం చాల సులభం. వామపక్ష సోషలిజంలోని సామ్రాజ్యవాద వ్యతిరేకత కమ్యూనిజంలో బాగా బలపడింది. అందుచేతనే, విప్లవాత్మకమై సామ్రాజ్యవాద వ్యతిరేకమైన జాతీయభావానికీ, కమ్యూనిజానికీ సాన్నిహిత్యం యేర్పడింది. ఈ పరిణామాలను గుర్తించగలిగింది నేనొక్కణ్ణే కాదు. చాలమంది ఈ మార్పుకు గురియై, చివరకు కమ్యూనిజం నైతికపతనానికి కారకులైనారు. నేను కూడా, ఆ బాటవెంట చాలదూరం ప్రయాణం చేశాను; కాని ముందున్న ప్రమాదాలను త్వరలోనే గుర్తించాను. నూతన మతంలోని లోపాలు బోధపడినై; అంతటితో, అంటే 25 సంవత్సరాల తరువాత నా ప్రయాణం ఆగిపోయింది. ఆ ప్రయాణం మెక్సికోలోనే ప్రారంభమైంది!

## యుద్ధమంత్రి హామీ

యుకటాన్ స్వర్ణభూమికి సంకల్పించిన యాత్రను విరమించిన తరువాత మెక్సికోలోని విశేషాలను పరిశీలించసాగాను. జనరల్ ఆల్వారాడోకు పరిచయ లేఖను పంపే ప్రయత్నంలో మెక్సికో రక్షణశాఖామంత్రిని కలుసుకున్నాను. ఇతడు రిపబ్లిక్ అధ్యక్షుడైన కరంజాకు అల్లుడు; కరంజాకు పుత్రులు లేరు; అందుచే అతని వారసుడు కూడా ఇతడే. ఇతనితో కలిగిన పరిచయంవల్ల, మెక్సికన్లలో ఎంతటి ప్రేమ వాత్సల్యాలు, ఆదరాభిమానాలు ఉన్నదీ గ్రహింపగలిగాను. నేనొక విదేశీయుణ్ణి; కార్యార్థిని; నాకున్న పని, అతనిక్రింది యుద్యోగియైన రాష్ట్రగవర్నర్‌తో.

ఐనప్పటికీ రక్షణమంత్రి నన్ను ఆహ్వానించి సత్కరించాడు. ఇట్టి సంఘటన మెక్సికోలో తప్ప మరెక్కడా సంభవం కాదు!

'మనిబూసి మారేడుకాయ చేసే' పద్ధతిలో మెక్సికన్లకు నమ్మకం లేదు. అందుకనే, మెక్సికోలో రక్షణశాఖను 'యుద్ధ శాఖ' అని స్పష్టంగా పిలుస్తారు. యుద్ధానికి సాధనమైన సైన్యాన్ని పోషించే ప్రభుత్వశాఖను 'యుద్ధశాఖ' అనటమే సమంజసంకదా! కాబట్టే మెక్సికన్లను యదార్థవాదులు అన్నాను. యుద్ధశాఖ కార్యాలయంలో ఆ శాఖకు తగిన హోదాలో రక్షణమంత్రి నాకు స్వాగతమిచ్చాడు. సర్వసైన్యాధికారి కూడా అతడే. బొద్దుగా, పొట్టిగా ఉన్నాడు; అతని పొడవుకు మించిన కత్తి తివాసీమీద జీరాడుతూ ఉంది. ఆ దర్పం చూస్తే నాకు కొంచెం భయం కలిగినమాట వాస్తవం! కాని మరుక్షణంలోనే, మందహాసంతో అత డిచ్చిన కరస్పర్శతో తేరుకున్నాను. శాటిన్ తొడుగు వేసిన గిల్టుకుర్చీలో కూచోబెట్టాడు. గది గోడలన్నీ నీలి, బంగారు రంగులతో మిరుమిట్లు గొలుపుతున్నై. సంభాషణ నుపక్రమించాను:

"జాబు నా దగ్గరే ఉంది; కాని సీలువేసి ఉంది. దాన్ని ఆల్వారాడోకు చేర్చాలి."

రక్షణమంత్రి జాబు తీసుకున్నాడు; ఏ మాత్రం సంకోచం లేకుండా చించి చూచాడు. తృప్తిగా మందహాసం చేస్తూ అన్నాడు:

"ఆల్వారాడో త్వరలోనే రాజధానికి రావాలి; రాగానే మీకు తెలియజేస్తాం."

సమావేశం పూర్తయిందని లేచాను; మంత్రిగారు కూడా లేచారు; అది స్పానిష్ మర్యాద. చాలా విషయాల్లో మెక్సికన్లు స్పానిష్ వారిని అనుకరిస్తారు. నన్ను కూచోమని కోరాడు రక్షణమంత్రి; మెక్సికోలో నాకేమాత్రం భయంలేదని నమ్మకం కలిగిస్తూ మాట్లాడాడు: "విదేశాంగశాఖకు మిమ్మ గురించిన సమాచారం అంతా చేరింది; అది విదేశనీతికి సంబంధించిన రహస్యం; ఐనా హైడాల్గో, జొరెజ్ ల కాలంనుండీ స్వాతంత్ర్య పోరాటం జరుపుతున్న దేశంలో మీరున్నారు; ఇక్కడ మీ స్వేచ్ఛకుగాని, ప్రాణాలకుగానీ అపాయం లేదని, మీకు నమ్మకం కలిగించటమే నా ఉద్దేశ్యం" అన్నాడు. తానే ముందుగా నిలబడి, మహారాజలక్షణమైన దర్పంతో, నాకంటె ముందు నడచి తలుపు తీసి, నమస్కరిస్తూ సాగనంపాడు.

ఇదంతా, హాస్య ప్రదర్శనంలోని దృశ్యంలాగా కన్పించింది. కాని మహత్తరమైన అనుభూతి; దాని ప్రాశస్త్యాన్ని నెమరువేసుకొంటూ బైట పడ్డాను. విదేశాంగశాఖల ద్వారా నా సమాచార మంతా వీరికి తెలిసింది! నా జీవితానికి

అంతర్జాతీయ ప్రాధాన్యత కలిగిందనే భావమూ, అంతకంటే మిత్రులమధ్య సురక్షితంగా ఉన్నాననే ధైర్యమూ కలిగినై.

క్రమక్రమంగా ఆంగ్లో-అమెరికన్ రహస్యశాఖ నన్ను తస్కరించటానికి చేసిన ప్రయత్నాలన్నీ తెలిసినై. బ్రిటిష్ ఇండియా సి. ఐ. డి. ప్రముఖుడు డన్‌హామ్ హిందూ జర్మన్ కుట్ర విచారణ నడపటానికై శాన్‌ఫ్రాన్‌సిస్కో వచ్చాడు. నన్ను వెదుకుతూ ఇండియానుండి బయలుదేరిన మిత్రుడొకడు షాంఘైలో పట్టుబడ్డాడు. దూరప్రాచ్యం అంతటా అల్లుకొన్న ఆ కుట్రకు నేనే నాయకత్వం వహిస్తున్నట్లాతడు సాక్ష్యం చెప్పాడట! ఆ విషయం పత్రికల్లో చదివినప్పుడు నేను పడ్డ బాధ అంతా యింతా కాదు. ఇండియాలో ఉన్నప్పుడతణ్ణి ఎంతగానో అభిమానించేవాణ్ణి. ఉభయులం కలిసి చాలా విప్లవ కార్యక్రమాలలో పనిచేశాం. కష్ట సమయాల్లో కూడా ఎంతో ఉల్లాసంగా, విశ్వసనీయంగా ఉండేవాడు. విప్లవసాహసం వలనా, కఠోరదీక్షల వలనా ఆతనిలో మానవత్వం యింకిపోలేదు. అటువంటి వాడింతటి ద్రోహిగా మారాడని నమ్మలేకపోయాను. కాని నేను చదివింది మాత్రం యదార్థమే! (15 సంవత్సరాల తర్వాత నేను ఇండియా వచ్చినప్పుడు, వృద్ధవిప్లవకారు లందరివలె అతడుకూడా సన్యాసులలో చేరినట్లు తెలిసింది; దరిమిలా చనిపోయాడు.) శాన్‌ఫ్రాన్ సిస్కోలో విచారణ పూర్తయింది; ప్రధాన కుట్రదారును పట్టుకొనే నిమిత్తం, డన్‌హామ్ అమెరికా (U. S. A.) లో ఉన్నాడని విశ్వసనీయంగా తెలిసింది. నన్ను ఎత్తుకు పోవటానికి జరిగిన ప్రయత్నాలన్నీ ఆతని ప్రోత్సాహంతోనే జరిగినై. డన్‌హామ్ మెక్సికో గూడ వచ్చాడట!

## "ఎల్ ప్యూబ్లో" పత్రికా పరిచయం

రక్షణమంత్రితో సమావేశం జరిగిన మరునాడే మెక్సికో నగరంలోని ఒక పత్రికా సంపాదకుని దగ్గరనుండి జాబు వచ్చింది. అది కరంజాకు అనధికార దిన పత్రిక. ఆ జాబులో సంపాదకుడు తన కార్యాలయానికి నన్ను ఆహ్వానించాడు. నేను బసచేస్తున్న ప్రాంతం యోగ్యమైనది కాకపోవటం వల్లనే తాను స్వయంగా వచ్చి ఆహ్వానింపలేక పోయినందుకు క్షమించవలసిందిగా అభ్యర్థిస్తూ వ్రాశాడా లేఖ.

ఈ ఆహ్వానం, నాకు ఆశ్చర్య కారణమైంది. మెక్సికో వచ్చి వారం రోజులు కూడా కాలేదు; ఏ ఒక్కరితో గూడా గాఢమైన పరిచయ మేర్పడలేదు. ఐనా ఉన్నతాధికారులకు ఆప్తుడననే భావం ప్రజలలో కలుగసాగింది. ఏదైనా కుట్ర బలపడి పరిస్థితి విషమిస్తున్నదా అనే భయం కలిగింది. ముందు ముందు ఎంతటి ఉద్రిక్త అనుభవాలున్నవో? నేను ఆజన్మ నాస్తికుణ్ణే కాకపోయినట్లయితే, ఈ సంఘటనతో నాలో భగవంతునియందు భక్తి విశ్వాసాలు పునరుజ్జీవించేవే!

అనుకొన్నట్లు పత్రికా కార్యాలయానికి వెళ్లాను; పత్రిక పేరు 'ఎల్ ప్యూబ్లో' (ప్రజలు). పత్రికా సంపాదకుడు ముదివయస్సులో ఉన్నాడు; ఆజానుబాహు విగ్రహం; అతనికి నా ఈడు మనుమడు ఉండవచ్చు! రక్షణమంత్రితో సమావేశంలోని ఆడంబరత్వానికి ప్రస్తుత సమావేశానికి పోలికేలేదు. అతడు రక్షణమంత్రి, సైన్యాధ్యక్షుడు. ఇతడో పత్రికా రచయిత మాత్రమే. వాస్తవానికి ప్రజాస్వామ్యంలో పత్రికా రచయితే చాలముఖ్యం. ఐనా అతడొక పత్రికా రచయితే! కాని ఈ సమావేశమే నా హృదయంలో బాగా హత్తుకు పోయింది.

మెక్సికనుల సాంప్రదాయం ప్రకారం కుశలప్రశ్నలైన తరువాత నన్ను స్వయంగా వచ్చి ఆహ్వానింపనందుకు తిరిగి క్షమాపణ కోరాడు. "మీరు మాకు అతిథులు; అతిథి సత్కారాలకు మా దేశం చాల ప్రసిద్ధి కెక్కింది; ఐనా మెక్సికో అనాగరిక దేశం అని అందరూ అంటారు" అన్నాడు వ్యంగ్య గర్భితమైన ద్వేషంతో. "మీరూ మేమూ ఒకే స్థితిలో ఉన్నాం. శ్వేత సామ్రాజ్యవాదుల అహంకారం వల్ల మా దేశం కూడా అవమాన భారంతో క్రుంగిపోతోంది" అన్నాను.

అతని సౌజన్యం నాలో ధైర్యాన్ని కలిగించింది; నాకు తెలియకుండానే, నా కథ నంతా గ్రహించి వేశాడు. కార్యాలయంనుండి బైటికి వస్తూండగా అన్నాడు:

"మనం తరచు కలుసుకొంటూ ఉందాం; కాని మీరు ఆ హోటలు విడిచిపెట్టాలి; అది మీకంత సురక్షితమైన ప్రదేశం కాదు."

ఆ మాటల్లో ఎంతో సానుభూతి, ఏదో నిగూఢార్థం ధ్వనించింది; ఆ సలహాకంటె అతని పితృవాత్సల్యం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. తన యింటికి భోజనానికి ఆహ్వానించాడు; ఈలోగా తగిన ఇల్లుకూడా చూస్తానని చెప్పాడు. ఇది జరిగిన కొన్ని రోజుల్లోనే 'కలోనియా రోమా'లో ఒక యింటికి మకాం మార్చాను; అది గౌరవ కుటుంబాలు నివసించే ప్రదేశం.

హోటల్లో ఉన్నప్పుడే, ఒక రోజు ఉదయం, ఎల్ ప్యూబ్లో సంపాదకుని దగ్గరనుండి జాబు తెచ్చాడొక యువకుడు. విలాస దుస్తుల్లో ఉన్నాడు; సంపాదకుని యింటి విందును గుర్తు చేయటానికై వచ్చాడట. ఈ యువకుడు విద్యావంతుడు, విశ్వాసపాత్రుడూ అనీ, అవసరమైతే నాకు ఆంతరంగిక కార్యదర్శిగా కూడా పనికి వస్తాడనీ ఆ జాబులో సంపాదకుడు వ్రాశాడు. నిన్న సాయంత్రం వరకూ రేపు ఉదయం భోజనం ఎలా లభ్యమౌతుందా అనే దిగులుతోనున్న నాకు కార్యదర్శి కూడానా? మెక్సికన్లు నాపై చూపే ఆదరాభిమానాలకు కారణం? మారువేషంలో ఉన్న భారత సంస్థానాధీశుడననే భావంకాదు గదా!

## లాముజేర్ మోడర్నా

ఆనాటి విందులో మెక్సికో సాంఘిక సాంప్రదాయాలతోనూ, గార్హస్థ్య జీవితంతోనూ పరిచయమైంది. నాతో బాటు మరి యిద్దరు అతిథులు కూడా వచ్చారు. వారిలో ఒకరు పురుషుడు; విచిత్రమైన వ్యక్తి. మరొకరు స్త్రీ; ఈమెవల్లనే ఆ సమావేశానికి ప్రాముఖ్యం వచ్చింది. నన్ను మొట్టమొదట యజమానురాలికి పరిచయం చేశారు. ఆమె పేరు 'డోనా'; ఆమె యెదుట మాతృమూర్తి సమక్షంలో ఉన్నట్లనిపించింది. నల్లని సిల్కు దుస్తులూ, ప్రాచీనకాలంలో స్పానిష్ వనితలు ధరించే లేసుటోపీ ధరించింది. బెరుకు బెరుకుగా నమస్కారం చేశాను. భర్త సూచన ననుసరించి స్పానిష్ భాషలో అన్నది: 'మేమంతా మీ సేవకులం; ఇది మీ స్వగృహమే.' అతిథి సత్కార మర్యాదల్లోని మాటలే. అంతేగాని ఆమె అన్నదే చాలునని మరునాడు ఉదయమే వారి యింటికి బస మారుస్తామా!

అతిథుల్లోని యువతి 'లాముజేర్ మోడర్నా' అనే పత్రికకు సంపాదకురాలు; ఆ మాటకు 'ఆధునిక మహిళ' అని అర్థం. మెక్సికోలో మహిళాజనానికి సంబంధించిన పత్రికల్లో అదే మొదటిది. మరొక పత్రిక కూడా అసలు లేదేమో! ఆమెలోని ఆధునికత అంతా ఆమె వాడుతున్న జుట్టు పిన్నులు, వాటికి తగిలించిన నల్లని సిగరెట్లు త్రాగటం మాత్రమే! ప్రెసిడెంటు కాకపూర్వం కరంజాకు ఆమె ఆంతరంగిక కార్యదర్శిగా ఉండేదట. కరంజాయే ఆమెను పైకి తీసుకువచ్చాడు. నిజానికి, సారస్వత పత్రిక నడిపే శక్తిసామర్థ్యాలు ఆమెకు లేవు; ఇక ఆమె పత్రికలో ఎక్కువభాగం లైంగిక విషయాలే! రచయితలుగా పేరు పొందాలని తాపత్రయపడే యువకులంతా ఆమె చుట్టూ మూగేవారు. కొందరు ఆమె మీదనే పద్యాలు (ప్రణయ గీతాలు) వ్రాసి, ఆమె పేరనే ప్రకటించ వలసిందిగా ప్రాధేయపడుతూ ఉండేవారు. అచిర కాలంలోనే ఆమెను గురించి ఎన్నో విషయాలు తెలిసినై. అవన్నీ ఇక్కడ అప్రస్తుతం.

ఆ యువకుడామె అంగరక్షకుడు! అతనికి సంఘంలో ఒక హోదా లేక పోలేదు. బ్యాంకులో ఉద్యోగి; విదేశాంగమంత్రికి సోదరుడు; టెన్నిస్ ఆటలో మెక్సికోలో ఛాంపియను. చాలా భాషలు మాట్లాడేవాడు. కాని వట్టి మందబుద్ధి. టెన్నిస్ ఆటంటే మొదట్లో ఆడవాళ్ళ ఆట అనే నా అభిప్రాయం; కాని అతనివద్ద టెన్నిస్ నేర్చుకొన్నాను; కొద్దిరోజుల్లోనే గురువుగారిని ముప్పతిప్పలు పెట్టాను. శిష్యుణ్ని చూచి గర్విస్తూ ఉండేవాడు. ముజేర్ మోడర్నాతో అతడు కాకతాళీయం కాదని ఆ మర్నాడే తెలిసిపోయింది; ఆమెపేరు [illegible]
ఆమెను ముజేర్ మోడర్నా అనే పిలిచేవాణ్ని; మిగిలినవారుకూడ
అందుకామె అభ్యంతరం చెప్పలేదు.

స్త్రీలలో ఎవ్వరికీ ఇంగ్లీషు రాకపోవటంవల్ల మా సంభాషణ కుంటుతూ సాగింది. డోనాకు మాత్రం కొద్దిగా ఫ్రెంచి వచ్చు; మెక్సికోలోని విద్యావంతులందరికీ ఫ్రెంచి యించుమించు మాతృభాష. ఐనా, ముజేర్ మోడర్నాకు ఫ్రెంచి కూడా రాదు. స్త్రీలకు అర్థంగాని సంభాషణ మర్యాద కాదనిపించింది. అక్కడ చేరిన పురుషులందరూ సాంప్రదాయ ప్రియులే! ఐనా స్త్రీలపై 'క్షమించాలి' అనే బ్రహ్మాస్త్రం ప్రయోగించి, వారిని పూర్తిగా నిర్లక్ష్యంచేసి నాతో మాట్లాడటం నాకు ఆశ్చర్యం కలిగించింది. విందు పూర్తయిన తరువాత, ముజేర్ మోడర్నా తన మిత్రునితో స్పానిష్‌లో మాట్లాడసాగింది. అతిథి మర్యాదకు లక్షణంకాదనే ఉద్దేశ్యంతో డోనా వారి సంభాషణను ఆపాలని ప్రయత్నించింది. కాని డోనాను నేనే వారించాను. గదిలో పచారుచేస్తూ, జుట్టుపిన్నులోని సిగరెట్టు నూపుతూ, ఏకధాటిగా మాట్లాడింది ముజేర్. నాకా భాష అర్థంకాకపోయినా ఆమె కంఠస్వర మాధుర్యం నాకు ఆనందాన్ని కలిగించింది.

## నాస్తికతకు పరీక్ష

ఇండియాలోని బ్రిటిష్ పరిపాలనను గురించి ఎల్ ప్యూబ్లోలో కొన్ని వ్యాసాలు వ్రాయవలసిందిగా కోరాడు గృహమేధి. "మీకు తెలియనిదేముంది? మెక్సికోకూడా ఒకప్పుడు వలసరాజ్యమే. మా తాతలు చేసిన తిరుగుబాటు ఫలించి స్పానిష్ పరిపాలననుండి మెక్సికన్లు విముక్తిపొందారు; కాని దురదృష్టవశాత్తు నూరు యేండ్లు గడచినా, మాకు వాస్తవ స్వాతంత్ర్యం లభింపలేదు. ఇంకా స్వాతంత్ర్య పోరాటం సాగిస్తూనే ఉన్నాం. అందుచేతనే భారతీయులంటే మెక్సికన్లకు ఎంతో సానుభూతి. మీ దేశాన్నిగురించీ, మీ స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి తెలిసికొనటం వల్ల మాకు లాభం ఉండవచ్చు; మేముకూడా ఇండియనులమే; అందులోనూ నేను స్వచ్ఛమైన ఇండియన్ జాతీయుణ్ణి. నాది కల్తీలేని రక్తం!" అన్నాడు. అప్రయత్నముగా అతనివంక చూచాను; నల్లగా, అందంగా భారతీయులలో ఉన్నతవర్గాలకు చెందినముఖం!

వ్యాసాలు వ్రాయటానికి సమ్మతించాను. కాని నాకు స్పానిష్‌భాషరాదు. ఆ యిబ్బంది త్వరలోనే తొలగిపోతుందని హామీయిచ్చారు. ఈలోగా, ఉదయం
దగ్గరకు వచ్చిన యువకుడు నా వ్యాసాలను తర్జుమాచేస్తాడు. ఆ విధంగా అతడు
తరంగిక కార్యదర్శియైనాడు! మరునాడుదయమే 'వ్యాసం సిద్ధంగాఉన్నదా?'
గానికి వచ్చాడు. లాటిన్ అమెరికాలోకెల్ల ప్రశస్తమైన 'అలివర్' అనే
న్నాడట. ఏదో అదృశ్యశక్తిపరిస్థితులను వేగంగా నడిపిస్తున్నదనే
రిగి భగవంతునిలో విశ్వాసం ముందుకుత్రోసుకు వచ్చింది. కాని

ఆ విశ్వాసాన్ని అదుపులో ఉంచి, జరుగనున్న సంఘటనలను పరిశీలించవలసిందిగా హెచ్చరిక చేసింది జాగ్రతి!

ఐనా భగవంతుడే నా భక్తివిశ్వాసాలను చూరగొనటానికి నిర్ణయించాడని పించే మరొక సంఘటన: పై సమావేశం జరిగిన మరునాటి మధ్యాహ్నం, విదేశాంగ మంత్రి సోదరుడు వచ్చాడు. అతని పేరు సెనార్ ఫెర్నాన్‌డెజ్. తమ బ్యాంకు ఖాతాదార్లు నాకు పదివేల 'పీసో'లు చెల్లించమని కోరారట! 'పీసో' మెక్సికన్ నాణెం. విలువకు అమెరికన్ డాలరులో సగం; నాడు మెక్సికన్ కరెన్సీ కట్టుదిట్టంగానే ఉండేది. కరంజా ప్రభుత్వం కాగితపు నోట్లను రద్దుచేసింది. ఐదు, పది, ఇరవై పీసో బంగారునాణాలు మాత్రమే చెలామణిలో ఉండేవి. ఈ విషయాలన్నీ ఆ క్రొత్త మిత్రుడే చెప్పాడు.

మరునాడుదయమే బ్యాంకునౌకరు ఒక సంచిపట్టుకువచ్చాడు; దానినిండా ఇరవై పీసోనాణాలే. ఒక చిన్న రశీదుముక్కతో ఆ సంచి నా వశమైంది. అయాచితంగా వచ్చి నా కళ్ళముందు తళతళలాడే బంగారురాశికూడా నాలో శిథిలమై పోతున్న విశ్వాసాన్ని పునరుద్ధరింపలేకపోయింది. ఐనా, భగవంతుడు మంచివాడేనేమో!

## ఇండో జర్మన్‌కుట్ర చరమాంకం

కెనడియన్ హోటల్‌నుండి మకాం మార్చబోయేముందు ఒక చిన్న సంఘట
నతో జర్మనులతో పాత స్నేహసంబంధాలు పునరుద్ధరింపబడినై. ఆ హోటల్లో బ·
చేస్తున్న వారందరూ రెండు ముఠాలుగా ఉండేవారు; భోజనశాలలు గూడా ?
ఉండేవి. వీరిలో దూర ప్రాచ్యంనుండి, సంయుక్తరాష్ట్రాల నుండి వచ్చిన
లుండేవారు. అసలు, వారిరాకతోనే హోటలు యుద్ధరంగంగా మారి
ఆంగ్లో - అమెరికన్ జాతులవారు ఆ హోటల్ తమదనీ, అందులో శ(
జర్మను లుండటం సహించమనీ అన్నారు. కాని మెక్సికో తటస్థదేశం;
లకు అవకాశమైంది. వారూ పట్టుదలగలవారే! హోటల్ య
దేశస్థుడు! అతడూ దేశభక్తుడే! కాని హోటల్ నుండి జర్మను
తద్వారా మెక్సికో ప్రభుత్వ జోక్యానికి అవకాశమిచ్చి, తన వ
లిచ్చుకోనేటంతటి దూరం పోలే దాతని దేశభక్తి! అందుచే
రెండుగా విభజించి శత్రువుల్లో ఉభయపక్షాలకు కేటాయిం
కాలు లభించవని మొదటి రోజే తెలియటంచేత, నా గదిలో
వాణ్ణి; హోటల్లోని డ్రాయింగ్ రూమునుగాని, ఇతర వి
వాణ్ణికాను. అందుచేత, హోటల్లో వాళ్ళంతా నాతో
క్రమంగా హోటల్ యజమాని కూడా నన్ను తప్పించు

ఆ రోజు మధ్యాహ్న భోజనమైంది; అందరూ 'సీస్టా' (షికారు)కు వెళ్ళే సమయం; నా గది తలుపు చప్పుడైంది. తలుపు తెరవటంతో నా ఆశ్చర్యం యినుమడించింది. ఆ వచ్చింది జర్మన్. "లోనికి రావచ్చునా?" అంటూ గొణుగుతూ, సమాధానం చెప్పేలోపునే గదిలో ప్రవేశించి క్షమాపణ చెప్పుకొన్నాడు. నాకొక ముఖ్యమైన సందేశం ఉన్నదట! మా సమావేశాన్ని ఎవ్వరూ చూడరాదట! అవి హృదయపూర్వకంగా చెప్పినమాట లనటంలో సందేహం లేదు.

ఈ జర్మన్ 'ఉడికిన గ్రుడ్లు' ద్వయంలో ఒకడు! ఆ హోటల్లోని జర్మన్ ప్రాంతంలో ఇద్దరు విచిత్రవ్యక్తు లుండేవారు. ఒకరిని ఒకరు విడిచిపెట్టేవారు కాదు; ఒకే రకమైన పొట్టి దుస్తులు, మృదువైన గుడ్డటోపీలు ధరించేవారు. ఆ టోపీలు ఉడకబెట్టిన గ్రుడ్లలాగా ఉండేవి. అందుచే వారికి 'ఉడికిన గ్రుడ్లు' అనే పేరు పెట్టాను. రెండవవాడు రాలేదేమా అని ఆశ్చర్యపడ్డాను; కాని, యితణ్ణి సాగనంపేటప్పుడు గమనించాను; రెండవవాడు వరండా చివర నిలబడ్డాడు కాపలా కాస్తూ!

ఈ సంఘటనతో, ఇండియాలోని విప్లవచర్యలన్నీ గుర్తుకు వచ్చినై. "జావాలో మీరు కలిసిన మిత్రు లిద్దరూ ప్రస్తుతం మెక్సికోలో ఉన్నారు; మిమ్ము సందర్శించాలని ఆశిస్తున్నారు; ప్రొద్దు వాలిన తరువాత, వీధి వెంట కొంతదూరం వెళ్ళగానే, ఒక మోటారు మిమ్ములను వారి దగ్గరకు తీసుకుపోతుంది" అనేదే అతడు తెచ్చిన సందేశం. అతను, ఆదుర్దాగా వెళ్ళిపోవటంవల్ల నేను ఏ సమాధానమూ చెప్పలేదు. ఐతే, ప్రస్తుతం అక్కడికి వెళ్ళవలసిన బాధ్యత లేదు; వెళ్లితే జరిగే హానీలేదు. మెక్సికోలో ..కు ప్రాణభయంలేదని రక్షణమంత్రి హామీ యిచ్చాడుగదా! కాని అది కేవలం సత్కార మర్యాద అయియుండవచ్చు. ఏమైనా భయపడవలసిన పని లేదనే కలిగింది. జావా మిత్రులను కలుసుకొనటానికే నిర్ణయించాను.

## కోయెనిగ్‌తో సమావేశం

సాయంత్రమే, నిర్ణీతస్థలానికి వెళ్లాను; అది గౌరవ కుటుంబీకులు నివ... పరిశుభ్రంగా, వీధుల కిరువైపులా బారులుదీర్చిన చెట్లతో అందంగా, ...ంది. సమీపంలో ఉన్న మంచుకొండలమీదినుండి ఉత్తేజకరమైన ...ది. ఉల్లాసంగా నడుస్తున్నానేగాని, ప్రాత అనుభవాలస్మృతితో ...ెందుతోంది. ఏ క్షణాన ఏంజరుగుతుందో! ఇంతలో ఒక పెద్ద ...చ్చి నా ప్రక్కనే ఆగింది; తలుపు తీయగానే ఎక్కి డ్రైవరు ... కారు కదిలింది; వెనుక ఎవరైనా ఉన్నారేమోనని చూచాను. ... మునిగిపోయి కూర్చున్నారు. ఎవ్వరూ నోరు మెదపలేదు. ఆగింది. డ్రైవరు దిగి సంజ్ఞచేశాడు; అతణ్ణి అనుస...త్రం కారులోనే ఉన్నారు.

ఆ భవనం వీధిమీదికి ఉన్నది. మా రాక ఎలా తెలిసిందో తలుపు తెరవబడింది; మరుక్షణమే బాగా అలంకృతమైన ఒక హాల్లో ఉన్నాం; డ్రైవరు విసరివేసిన కోటును, టోపీని నేర్పుగా అందుకున్నాడు నౌకరు. విశాలమైన భుజాలు, నెరుస్తూవున్న జుట్టు, నీలికండ్లు - మొత్తానికి బొద్దుగా ఆకర్షణీయంగా ఉన్నాడు డ్రైవరు. తలుపు తెరచి, సైనిక మర్యాదతో నూతన వ్యక్తికి స్వాగతం చెబుతున్న ధోరణిలో వంగాడు. ఒక గదిలో ప్రవేశించాను; చాల పొడవుగాసున్న గది; కప్పు మాత్రం క్రిందుగాఉంది; గోడలనిండా వార్నీషులతో మెరుస్తున్న కొయ్యదిమ్మలు, నేలమీద ఖరీదైన తివాచీలు.

మా రాకతో, గది చివరనున్న వ్యక్తులిద్దరూ లేచి నిలబడ్డారు. వారిని గుర్తించాను; ఇండియాకు ఆయుధాలు పంపేసిమిత్తం, జావా వెళ్ళిన జర్మన్లు వారే. వారిలో ఒకడు సైనికోద్యోగి - కెప్టెన్; రెండవవాడు వలసశాఖకు చెందిన ఉన్నత ఉద్యోగి. మొదటివాడు సామ్రాజ్య సాధారణ ఉద్యోగిబృందానికి చెందిన రాయబారి. ఇతణ్ణి హెల్ఫిరిచ్ సోదరు లెంతగానో గౌరవించేవారు. వీరు జర్మనీలో ధనికవర్గానికి చెందిన ఉన్నతాధికారులు. వీరిలో పెద్దవాడు కెయిజర్‌కు చివరి ఆర్థిక మంత్రిగానూ, శాచట్‌కు ముందు రీచ్ బ్యాంకుకు అధ్యక్షుడుగానూ పనిచేశాడు. దూర ప్రాచ్యంలోని జర్మన్ శ్రేయస్సు లన్నిటికీ హెల్ఫిరిచ్ సోదరులే అధిపతులు; మూడు నాళ్ళ ముచ్చటైన జర్మన్ సామ్రాజ్యానికి పునాదులు వేసినది వీరే! బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోసే ఆశయంతో, ఇండియాలో సాయుధవిప్లవాన్ని తెచ్చగొట్టటానికై ధనసహాయం చేసిందికూడా ఈ సోదరులే!

మరల ప్రశ్నలైన తరువాత, గృహమేధిని పరిచయం చేశారు. అతడు కోయెనిగ్! 'డ్యూష్లండ్' కమాండర్! ఆజానుబాహు విగ్రహం; ఆర్యజాతీయుడు! వారిముందు నాది తక్కువజాతి (అని వారి అభిప్రాయం); ఐనా గంభీరంగా వంగి నాకు నమస్కారం చేశాడు. అది యుద్ధకాలం; ప్రేమలోనూ, యుద్ధంలోనూ అంతా సమానులే!

డ్యూష్లండ్ ప్రఖ్యాత జర్మన్ జలంతర్గామి. రెండుమారులు బ్రిటిష్ రక్షణ శ్రేణులను ఛేదించుకొని, రంగు దినుసులతో అమెరికా చేరింది. అమెరికా యుద్ధంలో దిగటానికి కారణం అదే; డ్యూష్లండ్ పట్టుబడింది; నావికులు ఖైదీ ఐనారు; కెప్టెన్ మాత్రం తప్పించుకొని మెక్సికో చేరాడు.

మద్యపానీయాలతో కార్యక్రమం ప్రారంభమైంది. పానీయాలు త్రాగనని క్షమాపణ చెప్పుకొన్నాను. జావాలో కూడా అదే విధంగా ప్రవర్తించినట్లు, జావా మిత్రులు స్మరించారు. కాని, నాటికే, పానీయాలు నిరాకరించటం, నైతికాధిక్యతగా భావించటం మానివేశాను. ఇతర మూఢాభిప్రాయాలతో బాటు ఈ 'చాదస్తం'

కూడా సడలిపోసాగింది. ఐనా ఇంకా పానీయాలు తీసుకోనటంలేదు; అవసరా లెక్కువ లేకపోవటమే అందుకు కారణం.

మేము జావాలో విడిపోయి రెండు సంవత్సరాలైంది. నాటినుండి నేటి వరకూ మా చర్యలను వివరించుకొన్నాం; ఈ రెండేండ్లలోనూ, కెప్టెన్ తన చిరకాల వాంఛితమైన 'ఐరన్ క్రాస్' సంపాదించాడు. కోయెనిగ్ అన్నాడు:

"అమెరికాలోనూ, దూరప్రాచ్యంలోనూ, జర్మన్ విదేశాంగశాఖల రహస్య చర్యలను పరిశీలించటానికై, కెయిజర్ ప్రధాన సలహాదారైన గిహింరాట్, సంపూర్ణాధి కారాలతో మెక్సికో వస్తున్నాడు. బెర్లిన్ఉద్యోగులతో సంప్రదింపదలచిన మీ ప్రణా ళిక ఏమో చెప్పండి. దాన్ని ఆచరణలో పెట్టటానికి ఇది మంచి అవకాశం."

నా ప్రణాళికను వివరించాను; చైనాలోని ప్రతినిధి వర్గాలు నా ప్రణాళికా ప్రాముఖ్యాన్ని గుర్తించి కూడా, నేనడిగిన స్వల్పసహాయం చేయలేదని చెప్పాను; అందువు వారు చైనా ప్రతినిధివర్గంపై ఆగ్రహించారు. కాని ప్రస్తుతం, నా ప్రణా ళికలో నాకే శ్రద్ధ తగ్గిపోయింది! ఇది విని, జర్మన్ భాషలో ఆవేశంతో మాట్లాడు కొన్నారు. ఆ సంభాషణ నాకు అర్థంకాలేదు; అప్పటికి నాకు జర్మన్ రాదు. తరువాత కోయెనిగ్ అడిగాడు:

"ఐతే, మీరు బెర్లిన్ వెళ్ళలేదేం?"

"ఎట్లా వెళ్లటం!"

"డ్యూష్లండ్ మీద తీసుకు వెళ్ళేవాణ్ణి!"

ఆ మాటలతో, ఏదో పెన్నిధిని పోగొట్టుకొన్నంతటి బాధ కలిగింది. బెర్లిన్ వెళ్లే అవకాశం పోయిందని కాదు; బ్రిటిష్ రక్షణ శ్రేణులను రెండుమార్లు ఛేదించి అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటిన జలాంతర్గామిపై ప్రయాణంచేసే సాహసాను భూతిని కోల్పోయినానే అని నా బాధ!

"నేను మిమ్మల్ని కలుసుకోవటం?"

"రాయబారవర్గం ద్వారా"

ఆ ఉపాయం నాకు తోచలేదు; కోయెనిగ్, నాకా అవకాశాన్ని తప్పక యిచ్చి ఉండేవాడు. ఈ అవకాశం కోల్పోటానికి న్యూయార్కులోని 'జిడ్డు నాయకు'ని (చక్రవర్తి) నిర్లక్ష్యమే కారణం. నా ప్రణాళికను పూర్తిగా నేనాతనికి చెప్పని మాట వాస్తవమే. కాని బెర్లిన్ విప్లవ సంఘాని కొక ముఖ్య సందేశం అంద చేయటానికే ఇండియా నుండి నే బయలుదేరినట్లాతనికి తెలుసు; జర్మన్ రాయబార వర్గానికా విషయం తెలియజేయటం అతని ధర్మం. తన విద్యుక్తధర్మాన్ని చక్రవర్తి

నిర్వర్తింపలేక పోయినాడు. ఈ సంగతులన్నీ విదేశీయులకు వెల్లడింపకూడదు. విదేశీయుల్లో కూడా నాకు విశ్వాసం నశించింది!

చక్రవర్తి ద్రోహం నాకూ, మరి కొందరికీ కూడా మేలుగా పరిణమించింది. అందుకనే ఆతణ్ణి కృతజ్ఞతతో స్మరిస్తున్నాను. ఆ సంఘటనతోనే నా జీవితంలో నూతనాధ్యాయం ప్రారంభమైంది; జర్మన్ కుట్రలో తల దూర్చిన భారతీయులకు పట్టిన దుర్గతినుండి నన్ను తప్పించింది. కొన్ని రోజుల తర్వాత ఆ కుట్రదారులను బెర్లిన్‌లో కలుసుకొన్నాను. పాపం! వారందరూ, ప్రదర్శనశాలలోని చిత్రాలుగా నిలిచారు. అజేయమైన జర్మన్ సైన్యం విధ్వంసమై పోయింది. తన సామ్రాజ్య విచ్ఛిన్నం కన్నులారా జూచి, కెయిజర్ దేశంనుంచి పలాయనం చిత్తగించాడు; ప్రాత విధానాలన్నిటినీ విప్లవం తుడిచి పెట్టింది. తిండిలేక పస్తులుంటున్నది జర్మనీ! యుద్ధ గాయాలింకా నెత్తురోడుతూనే ఉన్నై; ఐనా, నూతన ఆశయాలతో, సాంస్కృతిక పునరుజ్జీవనంతో జర్మనీ చైతన్యవంతం కాసాగింది. కెయిజర్ సైనిక సహాయంతో, భారతదేశ విముక్తిని సాధించవచ్చుననే ఆశతో బెర్లిన్ వచ్చిన భారతీయులకీ నూతనోత్సాహం అగమ్యగోచరంగా తయారైంది. అది 1920వ సంవత్సరం; ఐరోపా నడిబొడ్డున ఉంటూ ఉన్నారు; తూర్పుగా ఎఱ్ఱసైన్యం ఫిరంగుల గర్జనలు వినవస్తున్నై. ఐనా, వృద్ధ భారతీయ విప్లవకారులు సోషలిజాన్ని అవహేళన చేయటం మానలేదు; రష్యా విప్లవాన్ని 'అర్ధాయుస్సు విప్లవం' అని తూలనాడుతూ ఉండేవారు. 'జిడ్డునాయకుడు' నన్ను మోసగింపనిచో చరిత్రచే బహిష్కరింపబడిన ఈ విచిత్ర మిత్రబృందంలో నేనుకూడా సభ్యుడనై యుండేవాణ్ని!

కాని అప్పట్లో, చక్రవర్తి మోసం తెలియగానే నాకు ఆగ్రహం కలిగింది. అందుకు ప్రతీకారంగా, బెర్లిన్ భారతీయ విప్లవసంఘం ప్రమేయంలేకుండా, జర్మన్ హైకమాండుతోనూ, దాని రహస్య కుట్రదారులతోనూ నేరుగా వ్యవహరించటానికి లభించిన ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసికోవాలని నిర్ణయించాను. కొద్ది రోజుల్లో జర్మన్ రాయబారి వస్తున్నాడు; నా ప్రణాళిక నాతడామోదించినంతనే చైనా వెళ్ళి ప్రయత్నాలు ప్రారంభించవచ్చు. చైనాను విడిచివచ్చి సంవత్సరంపైగా అయింది. ఈ లోగా పరిస్థితులేవిధంగా పరిణమించినవో? తిరిగి విప్లవ సంబంధాలను పునరుద్ధరింపవచ్చు. అవసరమైన ధనసహాయంకూడా సిద్ధంగాఉంది; నేనంగీకరించటమే తరువాయి. నా దగ్గరున్న డబ్బు మెక్సికో వచ్చిన వారంరోజుల్లోనే ఐపోయింది. ఈ పరిస్థితిలో జర్మన్ ప్రతినిధుల సూచన నాకెంతో సంతోషాన్ని కలిగించింది. తిరిగి కలుసుకుంధామని సమావేశం ముగించాం. తరచు సమావేశాలుకూడా అపాయకరమే! డ్రైవరు నేరుగా నన్ను నా బసకు తీసుకువచ్చేశాడు. నేను అడ్రస్ చెప్పనేలేదు! జర్మను లెంతటి సమర్థులు! కుట్రకు ఎంతటి హంగుఅవసరం! అనుభవం మీద కాని ఏదైనా బోధపడదు.

## మెక్సికోలో జర్మన్లు

ఎల్ ఫ్యూబ్లోద్వారా ఒకవైపు మెక్సికో రాజకీయాలతో సన్నిహితత్వం సాధిస్తూ మరొకవైపు జర్మన్ మిత్రులను చాలాసార్లు కలుసుకొన్నాను. విదేశాంగ ఉద్యోగి బృందంతోనే గాక, స్థానికంగా ఉన్న జర్మన్ రాజకీయ నాయకులందరితోనూ నాకు మంచి పరిచయం లభించింది. ఆంగ్లేయులవలెగాక, జర్మన్లు మెక్సికో ప్రజానీకంతో కలిసిమెలసి తిరుగుతూ ఉండేవారు. ఏ దేశంలో ఉన్నప్పటికీ ఆ దేశ భాషను అభ్యసించి తీరాలనే సదాచారాన్ని పాటించటంచేత మెక్సికోలోని జర్మనులు ఇంగ్లీషుతోబాటు స్పానిష్ భాషనుకూడా చక్కగా మాట్లాడేవారు.

## డాక్టర్ గ్రమాటస్కీ

నా జర్మన్ మిత్రుల్లో ఒకరు గొప్ప విద్వాంసుడు; పేరు డాక్టర్ గ్రమాటస్కీ; వయసు డెబ్బది సంవత్సరాలు పైగా ఉంటుంది; జపాను విశ్వవిద్యాలయంలో వేదాంతాచార్యుడుగా పని చేశాడు; ఇరవై సంవత్సరాలకు పైగా దూరప్రాచ్య దేశాల్లోనే గడిపాడు. వేదాంత బోధయే అతని జీవితాదర్శం కాదు. చైనా, జపాన్, జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లీషు - అనే ఐదు భాషలకు ఏకైక నిఘంటువు (Dictionary) తయారు చేయాలనే సంకల్పంతోనే అతను దూరప్రాచ్యం వచ్చాడు; ఇది పూర్తి కావటానికి ఇంకా కొన్ని సంవత్సరాలు పడుతుంది. ఇంతలో అతని జీవితాశయ పూర్తికి ఆటంకంగా యుద్ధం దాపురించింది అతనికి కలిగిన హృదయ వ్యథ యింతా అంతా కాదు. మిత్రరాజ్యాల తరపున జపాను యుద్ధంలో దిగింది గాని ఆంతరంగికంగా జర్మనీపట్ల జపానుకు సుహృద్భావమేనని జర్మనుల భావన. జర్మనీ జపానుల పూర్వమైత్రి అంత గాఢమైంది. ఐతే ప్రస్తుతం జపాను తప్పటడుగు వేసింది! ఐనా జపాను జర్మనీల మధ్య స్నేహ సంబంధాలు రహస్యంగా సాగుతూనే ఉన్నై.

ఏమైనా, గ్రమాటస్కీ మాత్రం, యుద్ధం పరిసమాప్తమై తాను జపాను వెళ్ళే శుభముహూర్తం కొరకు నిరీక్షిస్తున్నాడు. నేను దూరప్రాచ్యంలో తిరిగానని తెలిసికొన్నప్పుడు నాకా భాషలు వచ్చునేమోనని అడిగాడు. నాకా భాషలతో పరిచయం లేదు. 'చైనా భాష చాల కష్టమైనద'ని నా అజ్ఞానాన్ని సమర్థించుకొనటానికి ప్రయత్నించాను; కాని భాషలన్నిటిలో చైనా చాలా సులభమైనదని ఆ వృద్ధ భాషావేత్త నాకు ఆశ్చర్యాన్ని కలిగించాడు. అతని భాషాభిమానం నాకు ముచ్చట కలిగించింది. నాకు స్పానిష్, ఫ్రెంచి, జర్మనీ భాషలు బోధించమని కోరాను; అందుకు అంగీకరించాడు. చాల నేర్పుతో బోధించేవాడు. రెండు మూడు నెలల్లోనే స్పానిష్ నేర్చుకోగలిగాను. మొట్టమొదట నేను బహిరంగంగా ఉపన్యసించినది స్పానిష్ భాషలోనే! నా ప్రథమ గ్రంథ రచనకూడా స్పానిష్ భాషలోనే జరిగింది.

గ్రమాటస్కీ రాబడి తక్కువ; అందుచే యోగ్యమైన బస నేర్పాటుచేసికో లేక పోయినాడు; ఆ భార్యా భర్తలను నా బసలో నొక భాగంలో ఉండమని ఆహ్వానించాను, వారు అంగీకరించారు. గ్రమాటస్కీకంటె ఆతని గృహిణి ముప్పది సంవత్సరాలు చిన్న! గృహ నిర్వహణలో చాల సమర్థురాలు. అప్పుడప్పుడు నాకు గూడా సాయపడుతూ ఉండేది. కాని బాధఅంతా ఆ వృద్ధునితోనే! ఛాందసభావాలాతని వెన్నెముకవరకూ జీర్ణించిపోయినై. జర్మన్ సంస్కృతిని వంటపట్టించుకోననిదే జర్మన్‌భాష నేర్చుకోనటం అసాధ్యమని అతనివాదన. ఐతే, జర్మన్ భారతీయ సంస్కృతులమధ్య పొత్తు ఉండటంచేత అచిరకాలంలోనే నాకు జర్మన్ సంస్కృతి పట్ల అభిమానం యేర్పడగలదని హామీ యిచ్చాడు. నాటికింకా నేను సాంస్కృతిక జాతీయవాద పరిధులను దాటలేదు; అందుచే ఆచార్యుని ఉపన్యాసం నా ఉడుకు రక్తంలో సానుభూతినే కలిగించింది. కాని ఆ సంచలనం, మానసికంగా బాధాకరమైంది.

ఒకరోజున జర్మన్ సంస్కృతిని వ్యక్తీకరించే పద్యంచదివాడు గ్రమాటస్కీ; అదే నాకానాటి పాఠం; అది కెయిజర్‌మీద వ్రాయబడిన 'విషాదగీతం'. కెయిజరును సామ్రాజ్యవాద పీఠంగా నిందించే ప్రజాస్వామ్య ప్రపంచంపై శాపాల వర్షాన్ని కురిపించిందా గీతం. నాకు ఆ పద్యం తాత్పర్యం మాత్రమే గుర్తుంది: "ఛార్లిమేన్, ఆటోలకు వారసుడైన యుద్ధప్రభువు కెయిజర్ భయంకరచ్ఛాయ రక్తంతో తడిసి బీడువారిన ఎడారిపై పడుచున్నట్లు" భావకల్పన. ఆ పద్యాన్ని చదివేటప్పుడు వృద్ధుని ఆకారం భయంకరమై పోయింది. రక్తం ఎగజిమ్మి కన్నులు ఉబికినై; కణతలలోని రక్తనాళాలు చిట్లటానికి సిద్ధమైనై. 'ఎపాప్లెక్సి' వ్యాధి వచ్చిందా అనే భయం కలిగింది. ఆ క్లిష్ట సమయంలో పాప మా యిల్లాలు భర్తను చన్నీటి స్నానం చేయించింది. కెయిజర్‌ను విమర్శించినా, లేక ఆతని అభిమాన విషయాన్ని ఖండించినా ఆ వృద్ధునికి శివమెక్కుతుంది. మంచునీటి స్నానంతోగాని ఆ ఆవేశం తగ్గదు అని తరువాత తెలిసింది.

క్రమక్రమంగా ఈ వృద్ధాచార్యునితో కలిసి ఉండటం విషమ పరీక్షగా తయారైంది. కాని, ఉన్నట్లుండి వెళ్ళిపొమ్మనటానికీ మనస్కరించలేదు. ఇండో-జర్మన్ సంస్కృతికి నేను చేస్తున్న అపచారాన్ని అతడు గ్రహించిన కొలదీ మా మధ్య పోటులు కూడా సన్నగిల్లినై. చివరకు 1919 సం. మధ్యలో రష్యన్ బోల్షివిక్ ప్రతినిధికి సహాయం చేయవలసివచ్చింది. ఆ సమయంలో వృద్ధ దంపతులను వేరే బస చూచుకోవలసిందిగా చెప్పాను.

ఇతర జర్మనులతో నా పరిచయానుభూతి ఇంతటి బాధాకరమైంది కాదు. జర్మన్ కాలనీలోని గౌరవ కుటుంబాల స్త్రీలు నన్ను సింహాన్ని చూచినంతటి భయ

గౌరవాలతో చూచేవారు. అట్టి ప్రవర్తన దేశభక్తులుగా తమ విద్యుక్తధర్మమనే వారి భావన. నాకది కష్టమనిపించేది. అంతా కొత్త వాతావరణం కావటంచేత బెరుకు బెరుకుగా ఉండేవాణ్ణి. కాని గాంభీర్యంతో బెరుకుదనాన్ని కప్పిపుచ్చేవాణ్ణి. ఈ కృత్రిమ ప్రవర్తన మానసికంగా నాకు కవచమైంది. ఇటీవల ఒక పుస్తకంలో నాటి విషయాన్ని గురించి చదివాను. అది వ్రాసింది ఒక ఆంగ్లేయుడు; పూర్వాశ్రమంలో కమ్యూనిస్టు; 1920 ప్రాంతంలో మాస్కోలో అతనితో బాగా పరిచయమైంది. 'రాయ్ అంతటి అహంకారిని ఎన్నడూ చూడలేదు' అంటూ వ్రాశాడు. 'అంతటి భూషణకు తగుదునా' అని నా అనుమానం; నాలో 'అహంభావం' ఉందో లేదోగాని, గంభీరంగా మాత్రం ఉండేవాణ్ణి అనటం నిజం. నవీనభావాలతోనూ, అధునాతన సంస్కృతితోనూ కొత్తగా పరిచయమైన రోజుల్లో నా అల్పజ్ఞత్వానికి చిహ్నమే ఆ గాంభీర్యం! క్రమేణా, అనుభవమే నాకు సహనమూ, నమ్రత అలవరచింది. పరిపక్వంకాని నా వ్యక్తిత్వంలోని వికారాలను సరిచేసింది ఆ గుణాలే!

## వాన్‌షోయెన్ దంపతులతో పరిచయం

వాన్‌షోయెన్ యువదంపతులతో నా పరిచయం చాలా ఉల్లాసకరమైంది. ఫ్రీహర్ వాన్‌షోయెన్ మెక్సికోలోని జర్మన్ రాయబారికి సలహాదారు; అతని భార్య ఫ్రీఫ్రౌ వాన్‌షోయెన్. అతడు వాషింగ్టన్‌లో జర్మన్ రాయబారవర్గంలో కార్యదర్శిగా నున్నప్పుడు తొలిసారిగా కలుసుకొన్నారు. ఇద్దరూ సంస్కారవంతులు; వారి బసయే మెక్సికోలోని జర్మనులందరికీ సమావేశస్థలం. ఒక రోజున 'టీ'కి రావలసిందిగా నన్ను ఆహ్వానించటానికి ఉభయులూ వచ్చారు. గృహిణి స్వయంగా వచ్చి ఆహ్వానించటం అపురూపమైన గౌరవం. నన్ను నేనభినందించుకున్నాను. ఆ దంపతులంటే నాకు చాల అభిమానం. జర్మన్ యువకుని పెండ్లిచేసికొన్నదని స్థానిక ఆంగ్లో అమెరికన్ సమాజం ఆమెను బహిష్కరించింది. వారి క్రౌర్యకార్పణ్యాల నామె తీవ్రంగా నిరసించేది. వారి వివాహం అమెరికా యుద్ధంలో చేరకముందే జరిగిపోయింది. అంటే, ఆమె శత్రుదేశస్థుణ్ణి వివాహమాడిందనటం ఉచితం గాదు. "జర్మన్ జలాంతర్గామి అమెరికన్ నౌకను ముంచినంతమాత్రాన నేను నా భర్తకు విడాకు లివ్వాలనటం సమంజసమేనా? ఎంతటి నిర్దయ! కొన్ని రోజులు ముందుగా అమెరికా యుద్ధంలోకి దిగిందే అనుకోండి, నాకింతటి అవమానం జరిగేదా?" అని గట్టిగా వాదిస్తున్న ఆమె ముఖంలోకి కృతజ్ఞతతో చూచాడు వాన్‌షోయెన్. కాని మరుక్షణంలోనే ఆమె భావాలలో అనాలోచితంగా దొర్లిన అహంభావం గమనించాడు; అతని మందహాసం ఆగ్రహంగా మారిపోయింది. కనీసం చల్లనిమాటల్తో సానుభూతి కూడా చూపలేని ఈ క్రొత్త వ్యక్తిముందు, తన హృదయ వ్యథను ప్రద

ర్శించటంలో ఆమె ఆంతర్యమేమో గ్రహించలేకపోయాను. ఆ సంఘటన మాత్రం వికారంగా తయారైంది. చివరి కామె, భర్త చేతిని తన చేతిలోకి తీసుకొని, "నేను ప్రతీకారం చేస్తున్నాను; మెక్సికోలోని మంచి వారంతా మా ఇంట్లో సమావేశమౌతారు; మీరు కూడా రావాలని మా కోరిక" అంటూ ఆహ్వానించింది. 'అంగీకరించక తప్పదు' అన్నట్లు మందహాసం చేస్తూ బైటికి నడిచింది. అతడు నాతో కరస్పర్శ చేసి, భార్యను అనుసరించాడు. వాన్‌షోయెన్ జర్మన్ ధనిక వర్గానికి చెందిన యువకుడు; పై సంఘటన తనకు అవమానకరంగా భావిస్తూ ఉండేవాడు.

సాయంత్రం వారింటికి 'టీ'కి వెళ్ళాను. ఆ సందర్భంలో ఆతడు చేసిన మొదటి పని తన భార్య ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకొనటం. "అందులో క్షమాపణ చెప్పుకోవలసిన అవసరమేముంది? నన్నామె విశ్వాసపాత్రుడుగా గ్రహించింది. అది నాకెంతో గౌరవం" అన్నాను. ఆతని భారం తీరిపోయింది. ఇక, తనభార్యను శ్లాఘించటం ప్రారంభించాడు భావకవి ధోరణిలో: "తన సౌందర్యంతో, విద్యాబుద్ధులతో వాషింగ్టన్ సమాజానికే ఆమె వన్నె తెచ్చింది. కేవలం ధనమే కొలబద్దగా ఉండే అక్కడ సాంఘికంగా మానవ విలువలకు విజయం లభించటానికి ఆమే కారణం! డాలర్లతో హోదాలు కొనే నిమిత్తం, ధనవంతులైన ఐరోపాదేశ రాయబారుల్లో భర్తలను ఏరుకొనే నిమిత్తం, ధనికులైన అమెరికా అందగత్తెలు వాషింగ్టన్ నగరాని కెగబడేవారు. కాని భారతీయ సంస్కృతివలెనే జర్మన్ సంస్కృతికూడా కేవలం ఐహికం కాదు; రెండూ ఇండో - యూరోపియన్ సంస్కృతీ శాఖలేగదా! ధనికుడైన జర్మన్ యువకు డెవ్వడూ తనవర్గ గౌరవాన్ని అమ్ముకోటానికి సమ్మతించడు. వాస్తవానికి, నా హోదాకూ, గౌరవానికి మురిసిపోయి నన్నీమె పెండ్లాడలేదు. అమెరికా రాయబారవర్గాల్లో ఈమెకు మంచి పలుకుబడి ఉండేది. బ్రహ్మచారిగా నున్న ఏ రాయబారినైనా సులభంగా పెండ్లిచేసికొనేదే. కాని మా వివాహానికి కారణం పరస్పరం మాకు యేర్పడిన ప్రేమయే!"

మా యేకాంత ప్రసంగానికి ఆమె అంతరాయం కలిగించింది. చాల ఆకర్షణీయమైన రూపం అనటంలో అత్యుక్తిలేదు. అమెరికనులకు సహజమైన మాటకారితనమేగాక ఆమెలో ఒక దర్పమూ ప్రత్యేక వైలక్షణమూ ఉన్నై. బాగా చదువుకొన్నది. కాలక్షేపంకోసంగాక, ఏదో ఉద్యోగం చేయాలనే దీక్షతో, నాల్గు సంవత్సరాలపాటు కాలేజీలో శ్రద్ధగా విద్యాభ్యాసం చేసింది. ఐనా అందచందాలే జీవితంలో ఆమెకు సుఖప్రదమైన స్థానాన్ని ప్రసాదించినై. ఆ అందాన్ని పొందే అదృష్టానికే, ఏ జర్మన్ ధనికుడైనా తన హోదా నమ్ముకొని ఉండేవాడే. కాని ఇతనికి ఒక వ్యక్తిత్వం ఉంది. విచక్షణాజ్ఞానమూ, సంస్కారయుతమైన అభిరుచులూ, భావనాబలమూ గల ఆదర్శవాది! ఆమె ప్రదర్శించే అసహనం అతనిలోనూ స్పష్టంగా

కన్పించేది. ఆమెను అమెరికా సమాజం బహిష్కరించింది. జర్మన్లు ఆమెను అమెరికా గూఢచారిగా అనుమానిస్తూ ఉండేవారు. ఆ కుటుంబ మీ విధంగా బాధాకరమై, అవమానపూరితమైన పరిస్థితుల్లో ఉండేది. ఐనా, ఫ్రీహర్ చలించలేదు. అంతేగాదు, తన జర్మన్ సమాజం ఆమెకు చేసిన అవమానానికి ఎదురు దెబ్బతీయించాడు. క్రమక్రమంగా జర్మన్ కాలనీకి ఆమె 'మహారాణి' ఐంది.

"పొద్దున, పొగరుబోతుగా ప్రవర్తించాను........క్షమించాలి" అంటూ ఆవేశంతో క్షమాపణ చెప్పింది. నేను క్లిష్టపరిస్థితిలో పడ్డాను. ఆమె మాటలకు ఫ్రీహర్ కళ్ళ నీళ్ళ నాపుకోలేకపోయినాడు. నిష్కల్మషమైన ఉద్రేకాన్ని చూడటం నాకదే మొదటిసారి. ఆ అనుభూతిలోని ప్రాశస్త్యాన్ని గ్రహించటానికి అప్పటి కింకా చిన్నవాణ్ణే! 'మహారాణి' ఆజ్ఞ ప్రకారం అతిథుల నాహ్వానించటానికి నేను వారి వెంట వెళ్ళాను.

## మాస్ట్రో కాసోస్

ఫ్రీహర్ ఇంట్లోనే మాస్ట్రో కాసోస్‌తో పరిచయమైంది. అతడొక యూనివర్సిటీ అధ్యక్షుడు, వృత్తిరీత్యా న్యాయవాది. కాని విద్య, స్వభావాలనుబట్టి తత్త్వవేత్త. పూర్వం సార్బోన్ సంస్థలో పనిచేసినవాడు. మిత్రమండలి పట్లనే అతని అభిమానం; ఆ పత్యాన్ని ఎన్నడూ దాచిపెట్టేవాడు కాదు. ఐనప్పటికీ, ఫ్రీఫ్రౌ యింటి కాతడొక అమూల్యాలంకారం! సభ్యుల అభిప్రాయాలను లెక్కచేసేవాడు కాదు. నిర్భయంగా అంటూ ఉండేవాడు: "ప్రాచీన మురికి వేదాంతంలో కొట్టుకున్న జర్మన్ బుద్ధికి కాంట్ పండితుని పరతత్త్వవాదం అర్థం కాదు." ఇనుప వర్తకులూ, కాఫీహోటల్ యజమానులూ ఆ తత్త్వవేత్తతో విజ్ఞానవిషయాలపై వాదానికి దిగేవారు. నాకు వింతగా ఉండేది.

యూనివర్శిటీలో స్పానిష్ సారస్వతాచార్యుడు కూడా ఫ్రీహర్ మందిరానికి తరచువస్తూ ఉండేవాడు. అతడు స్పానిష్ జాతీయుడే. నా స్పానిష్ భాషాజ్ఞానాన్ని పెంపొందించుకొనే ఉద్దేశ్యంతో యూనివర్సిటీలో చేరాను. అందుచేత నేనతనికి శిష్యుణ్ణి. ఒక రోజున, క్లాసులో 'కిడ్' * గాథను వర్ణించే పురాణభాగాన్ని స్వరయుక్తంగా, ఆవేశంతో చదివాడు. తరువాత ఫ్రీహర్ ఇంట్లో కలుసుకొన్నప్పుడు కిడ్ గాథనూ, అతని పఠనా నైపుణ్యాన్ని అభినందించాను. అతడు భారతీయ దైవజ్ఞత్వాన్ని ప్రశంసించాడు. ఇంతలో కాసోస్ అందుకున్నాడు, "నిగూఢవాదానికి స్వస్తి చెప్పి, వోల్టేరు విజ్ఞానాన్ని గ్రహించటం భారతదేశానికి శ్రేయస్కరం."

---

* కిడ్ స్పెయిన్ దేశ ఇతిహాసము; వీరయుగానికి చెందిన (12 వ శతాబ్దము) పద్యకావ్యము.

ఉభయులూ విద్వాంసులు, ఉపాధ్యాయ వృత్తిలోనివారు. వాదనలోకి దిగారు. అదొక, బుద్ధిబలాల ద్వంద్వ యుద్ధంగా కన్పించింది. ఈ వాగ్వాదమే నన్ను ప్రోత్సహించి వోల్టేరు, సెర్వాంటిస్ ♦ మున్నగువారి రచనలను చదివించింది. అప్పటికి నాకా పేర్లు మాత్రమే తెలుసు నాటి నా అభిరుచులకు 'కిడ్' పూర్తిగా పాతపురాణం!

జర్మన్ కాలనీలో కెల్లా వృద్ధుడొక ఇనప వర్తకుడు. కాసోస్‌ను ఎత్తిపొడుస్తూ అన్నాడు: "విద్యాభిమానియైన ప్రష్యా రాజు ఫ్రెడరిక్ పోషణే లభించక పోతే వోల్టేరు ప్రతిభ లోకానికి తెలిసేదే కాదు" కాసోస్ తిరిగి అంటించాడు: "ఫ్రెడరిక్ నిర్మించిన శాన్‌సూసె' ఫ్రెంచి చక్రవర్తుల' వార్సెయిల్సు రాజప్రాసాదానికి చేతకాని అనుకరణ" వీరి వాదోపవాదాలవల్ల, ఐరోపా చరిత్రలోనూ, సంస్కృతిలోను నాకు ఆసక్తి హెచ్చింది. 'బిబ్లియోటికా నేసనాల్' చదవటం నేర్చుకొన్నాను. అనుక్షణం నా విద్యా విహీనతనూ, అల్పజ్ఞతనూ గురించి బాధపడేవాణ్ని!

## కళను గురించి ప్రథమ పాఠాలు

జర్మన్ ఇనుప వర్తకుడు గొప్ప ధనవంతుడు; ఆతనిభార్య మంచి కళోపాసకురాలు. నా రూపాన్ని స్వయంగా చిత్రీకరించాలని ఆమె కోరిక. ఆమెను సంతోషపరచటానికై, కొన్ని రోజులపాటు ప్రతి ఉదయం, ఆమె సాన్నిధ్యంలో రెండు గంటలపాటు 'మొద్దబ్బాయిలాగా' కూర్చోవాలి 'ఈ బాధ ఎందుకా' అనిపించి, ధైర్యంచేసి ఆమెనే అడిగాను. "మనం స్నేహితులమైనాం; ఎప్పుడో ఒకప్పుడు విడిపోక తప్పదు. కాబట్టి, జ్ఞాపకార్థంగా మీ చిత్రం ఉపకరిస్తుంది" అన్నదామె.

"ఫొటో సరిపోతుంది గదా!" అనేశాను.

ఫొటో, చిత్రలేఖనాలకు వ్యత్యాసం తెలియని నా అజ్ఞానం ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించింది. చిత్రం ఒక కళాఖండం. ఐతే, కళ అంటే యేమిటి? అనే విషయాన్ని గురించి, అప్పటికి క్లుప్తంగా వివరించి, ముందు ముందు వివరంగా బోధిస్తానని వాగ్దానం చేసింది. ఆమె కోరిక ప్రకారం 'మొద్దబ్బాయిని' కావటానికి సమ్మతించాను. ఒక ధనికురాలు నా చిత్రాన్ని స్వయంగా చిత్రించి తన గదిలో అలంకరించుకోనటం నాకు మాత్రం ఘనతకాదూ? ఐతే కేవలం విగ్రహంలాగా కూచోనివ్వక, ఆమె నాతో మాట్లాడుతూనే ఉండేది. అవి కళలను గురించిన ప్రసంగాలే. ఆ విషయంలో నా అభిప్రాయాలామెకు అవమానకరంగా తోచినై. జర్మన్ సమాజంలో ఘనంగా గౌరవింపబడుతున్న ఈ మోటు మనిషిని సంస్కరించటానికి ఆమె నడుం కట్టింది.

---

♦ ఈతని రచన 'డాన్ క్విక్సాట్'; మధ్యయుగ భూస్వామ్య సాంప్రదాయాలను హేళనచేస్తూ వ్రాయబడిన నవల.

సంగీత పాఠంతో ప్రయోగం ప్రారంభమైంది. పోలిష్ సంగీత నిపుణుడైన పాబ్లోకాజక్ అప్పుడు మెక్సికోలోనే ఉన్నాడు. 'కాజక్ బృందాన్ని కలుసుకొందాం' అన్నది. నేను మొదట సమ్మతింపలేదు. సంగీతం అంటే 'పరస్పరం సంబంధంలేని ధ్వనుల సమ్మేళనం' అని నా అభిప్రాయం. ఐతే గాత్రసంగీతంపట్ల మాత్రం కొంచెం సానుభూతి ఉండేది. కాజక్ భార్య మంచి గాయకురాలు. ఆమె పాట వినటానికి సమ్మతించాను. కాని సాంప్రదాయ దుస్తుల్లో నిటారుగా నిలబడి, స్వరంతో అనేక తమాషాలు చేసే ఆమె సంగీతం నాకంతగా రుచించలేదు. ఐతే పెల్లో వాయించటంలో కాజక్ ప్రదర్శించిన చాకచక్యం మాత్రం నా మూఢాభిప్రాయ కవచాన్ని సడలించింది; మరికొంత కాలానికి కాజక్ చెప్పిన సంగీతపాఠంతో గాని నాకు సంగీతంపట్ల సదభిప్రాయం కలగలేదని చెప్పాలి.

సంగీతాన్ని గురించి కాజక్ తో గూడా కొన్ని చర్చలు జరిగినై; ఒకరోజున అన్నాడు. "సంగీతాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నించవద్దు; మొదట్లో సంగీతాన్ని అనుభవించాల్సిందేగాని మానసికంగా ఆనందించలేము". తరువాత నాకతడు సంగీత పాఠం ప్రారంభించాడు. పియానో ముందు తన ప్రక్కన నన్ను కూర్చోబెట్టుకొనేవాడు; పదిప్రేళ్లూ పియానోపైచాచి వెఱ్ఱిగా శూన్యంలోనికి చూచేవాడు. ఉన్నట్లుండి ఏదో పెద్ద శబ్దం కలిగేది. దానితో ఆపాదమస్తకం నా నరాల్లో అలలు చెలరేగుతున్నట్లుండేది. ప్రేళ్ళు వేగంగా పరుగులు తీసేవి; జులపాలు ఆకాశంలో గంతులు పెట్టేవి. ఏదో స్వప్నావేశంలోనుండి బైట పడ్డట్లు ఆపివేసి అడిగేవాడు: 'ఎలా ఉంది?' సమాధానం చెప్పలేక పోయేవాణ్ణి. 'ఐతే, నీ అనుభూతియే నీకు తెలియదా?' అన్నాడు. నా తల బిరుసుతనం కరిగిపోయింది. శారీరకమైన ఉద్రేకం పొందానని ఒప్పుకున్నాను. 'అదే సంగీతం' అన్నాడు విజయగర్వంతో. నేను కలవరపడ్డాను. నా మూఢవిశ్వాసం పటాపంచలైంది. ఐనా సంగీతం అనుభవ యోగ్యమే కాని అర్థంకాక పోవటమేమిటో బోధపడలేదు. అదీ తర్వాత క్రమంగా అర్థమైంది.

టీపార్టీ పూర్తయేలోగా 'మహారాణి' ఆజ్ఞాపించింది: 'రేపు మా యింటికి భోజనానికి రావాలి.' ఫ్రీహర్ రహస్యంగా చెప్పాడు: 'జర్మన్ మంత్రి మిమ్మల్ని కలిసికోనాలను కుంటున్నాడు'. మహారాణి ఆహ్వానాన్ని అంగీకరించాను; ఇప్పుడిప్పుడే సాంఘిక మర్యాదలు నేర్చుకుంటున్నాను! ఐనా జర్మన్ మంత్రిని చూడాలని నాకూ ఆసక్తిగానే ఉంది. ఈ అవకాశం నాకెంతో సంతోషాన్నిచ్చింది. చైనాలో ఆయుధాలు కొనే పథకాన్ని పునరుద్ధరించటానికి జర్మను లింకా శ్రద్ధ వహిస్తున్నారా?

## నైతిక సమస్య

అది విందు పేరుతో జరుగుచున్న రహస్య కార్యాచరణ సమావేశం. జర్మన్ మంత్రితోబాటు నాకు చిరపరిచితులైన ఇద్దరు మిత్రులు కూడా హాజరైనారు. భోజనానంతరం, ఫ్రీహర్ మమ్మల్ని ఒక గదిలోకి తీసుకువెళ్ళాడు. చుట్టలు ముట్టించారు; నేనూ ఒక సిగరెట్ తీసుకున్నాను. అందరి చుట్టూ బ్రాంది ప్రదక్షిణం చేస్తోంది. జర్మన్‌మంత్రి సంభాషణ నుపక్రమించాడు :

"దూరప్రాచ్యంలో మీరు విడిచి వచ్చిన పని చాల ముఖ్యమైంది; అది ఏవిధంగా కొనసాగిస్తున్నారు ? ఎంతవరకు ఫలోన్ముఖమైంది ?"

"సంయుక్త రాష్ట్రాల్లో కొందరు భారతీయ విప్లవకారులను కలుసుకొన్నాను. సాధ్యమైనంత త్వరలో వారిలో కొందరు చైనా వెళ్ళాలి. రాస్‌బిహారీ సహాయంకోసం జపానుకూడా రాయబారిని పంపటానికి ఉద్దేశించాను."

"ఈ సందర్భంలోనే ఒక భారతీయ విప్లవకారుడు మీదగ్గిరికి వస్తాడు; ఐతే రాష్ట్రాల్లోనూ, మెక్సికోలోనూ ఉంటున్న చైనా విప్లవకారులతో మీకేమైనా పరిచయం ఉన్నదా ?"

"లేదు."

"ఐతే, మీకు తోడ్పడగలవారి పరిచయం చేస్తాను."

"కృతజ్ఞుణ్ణి" అన్నానేగాని, తగిన భారతీయుడు లభింపడనే అనుమానం దృఢంగానే ఉంది.

"చైనా వర్తకు డొకడు జపాను వెళుతున్నాడు; అతనికి మీరొక పరిచయ లేఖ నివ్వాలి."

"కాని రాస్‌బిహారి ఇందులో మన కేమాత్రం ఉపయోగింపడని నాకు గట్టి నమ్మకం; అందుచేత, యూనానురాష్ట్ర ప్రజలతోనే నేరుగా వ్యవహారం జరపటం ఉత్తమం."

"ఆ చైనా వర్తకునికి ఇండోచైనాలోగూడా వాణిజ్య సంబంధాలున్నై; అవసరమైతే, అక్కడికిగూడా వెళ్ళగలడు. అదే సమయంలో వలస ఉద్యోగియైన Dr. X, దూరప్రాచ్యానికి వెళ్లి చైనాలోని జర్మనులను ప్రోత్సహించి మన ఉద్యమానికి సహాయపడేటట్లు చేస్తాడు; జపానులోని మీ మిత్రునికూడా కలుసుకుంటాడు."

ఇదంతా నమ్మశక్యం గాకుండా ఉంది. యుద్ధకాలంలో జర్మనులు జపానులో ప్రవేశించటమా ? దొంగ ప్యాస్‌పోర్టుమీద మరొక దేశస్థుడుగా వెళ్ళవచ్చు.

ఈ పద్ధతి నాకేమీ క్రొత్త గాదు. అటువంటి దేమీ కాదు. అసలు రహస్యం జర్మన్ మంత్రి బైట పెట్టాడు. 'జపాను మన కసలు శత్రుదేశమే కాదు !'

క్రమంగా అంతర్జాతీయ కుట్ర విషయం బోధ పడింది. Dr. X సాధ్య మైనంత త్వరలో దూరప్రాచ్యం బయలుదేరాలి. ఆ దేశాలకు రాయబారులను పంపటానికై జర్మన్లు నా చేతుల్లో అపారంగా ధనం గ్రుమ్మరించారు. జావా వెళ్ళి నప్పటినుండి నేటివరకు జర్మనులలో ఇంతటి తెగువ నే నెన్నడూ చూడలేదు. వారి ప్రస్తుత ఔదార్యానికి కారణమేమైనా, నన్నొక నైతిక సమస్య బాధింపసాగింది. ఈ ధనం ఎందుకు? ఆ కార్యక్రమానికి అవసరమైన ధనం ఎంత? అంతమమించి ఎందు కిస్తున్నారు? వారు ఇచ్చినంతమాత్రాన అంగీకరించవచ్చునా? యుద్ధకాలంలో భారతీయ విప్లవకారులను జర్మనులు కొనివేస్తుండేవారనే సంగతి గుర్తుకు వచ్చింది. ముఖ్యంగా గదర్ పార్టీ వారిని. పిస్తోళ్ళు, డాలర్లు ఇచ్చి తిరుగుబాట్లు పురికొల్పే నిమిత్తం, బర్మా, మలయా సరిహద్దులకు పంపుతుండేవారు. ఈ అల్లరులను, బ్రిటిష్ సామ్రాజ్యంపై విప్లవాలుగా జర్మన్ వార్తాపత్రికల్లో ప్రచురించేవారు. జర్మన్ ప్రజానీకంలో నైతికబలం క్షీణించకుండా నిలబెట్టటమే ఈ హంగామా ఉద్దేశ్యం. అమాయికులైన భారతీయులు పెద్ద పెద్ద ఆశలతో బయలుదేరేవారు. అప్పుడింకా శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరంలో గదర్ పార్టీ కార్యాలయం పనిచేస్తూనే ఉంది. తమ సందేశం విని బ్రిటిష్ సామ్రాజ్య సరిహద్దుల్లోని సైన్యాలు తిరుగుబాటు చేయగలరని వారి ఆశ. కాని వీరిలో చాలకుంది, దారిలోనే పట్టుబడి, యుద్ధం ముగిసేవరకూ, కటకటాల వెనుక మ్రగ్గిపోయారు; కొంచెం సాహసవంతులు గమ్యస్థానం చేరారు; కాని పట్టుపడి ఉరికంబమెక్కారు. కొన్ని సందర్భాల్లో తిరుగుబాటు చేస్తారని నమ్మిన సైనికులే విప్లవకారులకు ద్రోహం చేశారు. జర్మన్ కుట్రలో ఈ విధంగా మోసపోయిన భారతీయుల చరిత్ర ఒక పెద్ద విషాదగాథ. అందలి చివరి అధ్యాయం శాన్‌ఫ్రాన్‌సిస్కో న్యాయస్థానంలో 'హిందూ జర్మన్ కుట్ర నేరం'గా ప్రదర్శింప బడింది. దూరప్రాచ్యంలో పట్టుబడ్డ భారతీయుల్లో ఒకరు, గదర్ పార్టీ నాయకుణ్ణి నా కాశ్రయంలోనే కాల్చి చంపాడు. అసంఖ్యాకుల దుర్మరణానికి ప్రతీకారంగా !

చైనాలో అనుభవమైన జర్మన్ నిర్లక్ష్యంవల్ల నాలో ఉత్సాహం చాలవరకు చల్లారింది. ఇండియా సరిహద్దుల్లోనే ఆయుధాలు కొనే సదవకాశం లభించినప్పుడు, ధన సహాయం చేయటానికి జర్మనులే నిరాకరించారు; ఇప్పుడు వారే స్వయంగా ధన సహాయం చేయటానికి ముందుకు వస్తున్నారు. ఏమిటి కర్తవ్యం? జర్మను లింతటి శ్రద్ధ వహిస్తున్నప్పుడే మరొక ప్రయత్నం చేద్దాం: లేదా; భవిష్యత్తులో ఆయుధాలు లభించినప్పు డీ ధనాన్ని వినియోగించవచ్చు. కాబట్టి ఈ సదవకాశాన్ని జారవిడువ కూడదు. డబ్బు నిమిత్తమై ఇండియాలో దోపిడీలు చేసేవాళ్ళం; అందులో అమాయ కులు ప్రాణాలు కోల్పోతూ ఉండేవారు. ఆశయం మంచిదై తేనేరి; సాధనం ఎటు

వంటిదైతే మాత్రమేమి? అనేదే నాటిభావం. విప్లవం, స్వేచ్ఛ - విజయం పొందటానికేగదా ఈ ధనం? ఆ ఆశయ పూర్తికేగదా నేను కృషి చేస్తున్నది? జర్మన్ సహాయం పొందటానికే నిర్ణయించాను.

వారం రోజుల లోగా 50,000 పీసోలు నా చేతికి వచ్చినై. అన్నీ బంగారు నాణాలే! ఆ రోజుల్లో నగరం వెలుపల నివసిస్తూ ఉండేవాణ్ణి. ఆ యింటినుండి హిమావృత పర్వత పాదాలవరకూ సుమారు ఇరవై మైళ్ళు, అన్నీ జొన్న చేలే. పర్వత సానువుల్లోని చిట్టడవుల్లో జపాటిస్టాలు నివాసా లేర్పరచుకొని, తరచుగా నగర పరిసరాలపై దాడులు జరుపుతూ ఉండేవారు. జొన్నచేలల్లో పలురకాల కార్మికులు పనిచేస్తుండేవారు. వారిలో ఎవరు రక్షకభటులో, ఎవరు జపాటిస్టా నాయకుని గూఢచారులో ఎవరికీ తెలియదు. ఐనప్పటికీ ఆ యిల్లంటే నాకెంతో అభిమానం; అందుకు కారణం అచటి ప్రకృతి సౌందర్యమే. ఈశాన్యంనుండి నైఋతి దిక్కు వరకు దిక్చక్రవాళమంతటిని పూర్తిగా అలంకరించి ఉంటుంది సుప్తశ్వేతసుందరి; ఆమె వల్లభుడా ప్రక్కనే శీవిగా కాపలా కాస్తూఉంటాడు!

నా ప్రయత్నం లేకుండానే నా దగ్గరనున్న పెన్నిధి దినదినాభివృద్ధి చెందసాగింది; దాని రక్షణకై కొంత జాగ్రత్త వహించవలసిన అవసరమేర్పడింది. ఒక మంచి రైఫులూ, రెండు మౌసర్ పిస్తోళ్ళు సంపాదించాను; అల్ సేషియన్ కుక్క నొకదాన్ని పెంచాను. ఉదారంగులో చాల అందంగా ఉండేది. మెక్సికన్ స్మృతులలో నొక విశిష్టమైనదీ కుక్క. నగ్న దిక్చక్రవాళంలో దాని భౌభౌరావాలు ప్రతిధ్వనించేవి. అది విని ప్రతిస్పర్థి సవాలనే ఉద్దేశ్యంతో మరింత బిగ్గరగా అరుస్తూ ఉండేది. వాకిలికి అడ్డంగా నా పడక ప్రక్కనే నేలమీద పరుండేది. సాహసించి ఎవడైనా దొంగ ఇంట్లో ప్రవేశించటమే తడవుగా చీల్చి పారవేయగలదనే ధైర్యంతో ఉండేవాణ్ణి. నేను ఆరడుగుల మనిషిని; ఐనప్పటికీ వెనుక కాళ్ళపై నిలబడి, ముందు కాళ్ళు నా రొమ్ములపైనుంచి నా ముఖం నాకేది. ఆ కుక్క, అకస్మాత్తుగా న్యూమోనియా వచ్చి చనిపోయింది. అప్పటికి దాని వయస్సొక సంవత్సరం మాత్రమే. దాని మృతితో నా జీవితంలో తీరని వెలితి యేర్పడినట్లైంది. మరే మృతికూడా నాకంతటి బాధాకరమైన భావాన్ని కలిగించలేదు. ఆ కుక్క శవాన్ని తీసుకువెళ్ళిన వెట్టి నా కా చర్మాన్ని పంపుతానన్నాడు; వలదని వారించాను. సజీవంగా నా ముందు మెలగిన ప్రియమిత్రుని మృతిచిత్రాన్ని కన్నులముందుంచుకొనే భావం కూడా దుస్సహమనిపించింది.

ఆరోజుల్లో నేను సంపాదించినవానిలో చాలవిచిత్రమైనది ఒక ఇనుపపెట్టె. దీని వలన భద్రతకంటె బాధ ఎక్కువైంది. అది అప్పుడే క్రొత్తగా తయారైంది; దానికి తాళంచెవితో పనిలేదు; ఒక పళ్ళెంమీద అంకెలుండేవి; పెట్టె తెరవటానికి, ఒక

గుబ్బను త్రిప్పుతూ ఆ అంకెలను కూర్చాలి; అదే దాని కీలకం. సంఖ్యలను మన ఇష్టం వచ్చినట్లు మార్చుకోవచ్చు. కాని దాన్ని మాత్రం గుర్తుంచుకోవాలి. వ్రాసి పెట్టుకుంటే, రహస్యం బైటపడే ప్రమాదం ఉందిగదా! నా కెప్పుడూ అంకెలు గుర్తుండేవి కావు. అందుచే నేను అంకెలను వ్రాసి జాగ్రత్త చేసుకొనేవాణ్ని; ఐతే, రోజుకొక అంకెచొప్పున మార్చేవాణ్ని. ఐనా ఈ బాధలన్నీ ఎక్కువరోజులు పడలేదు. అందుకు కారణం పెన్నిధి కరిగిపోవటమే! భారతీయ విప్లవ కారులలో కొందరికీ పెన్నిధిలో తమకుగూడా వాటా ఉన్నదంటూ నా భారం చాలవరకు తగ్గించారు. అదీగాక విప్లవాన్ని గురించిన నా అభిప్రాయాలు మారసాగినై. విప్లవమనేది ఏదో దూర దేశంలో సాధింపవలసిన అవసరంలేదనే భావం నాలో బలపడింది.

నా కృషిని విరమింపలేదనీ, ఆశలు పూర్తిగా అంతరింపలేదనీ, ఒక సందేశమూ, అందుకు నిదర్శనంగా కొంతడబ్బు ఇండియాలోని మిత్రులకు పంపాలని నిశ్చయించాను. ఇందుకు రాస్‌బిహారీ సహాయం అర్థించాను. జర్మనుమంత్రి పరిచయం చేసిన చైనా వర్తకుని ద్వారా 20,000 రూపాయలకు సమమైన మొత్తాన్ని పంపాను. అది రాస్‌బిహారీకి అందినట్లు జర్మనులు నమ్మకంగా చెప్పారు. కాని తర్వాత కొంతకాలానికి జర్మనులు చెప్పింది అసత్యమని తెలిసింది. ఆ ధనం ఏమైందో ఇప్పటికీ తెలియదు. తెలుసుకోవాలనే ఆసక్తికూడా ఇప్పుడులేదు.

చైనా వర్తకుని పూర్తిగా నమ్మలేక సంయుక్త రాష్ట్రాల్లో ఉంటున్న భారతీయులను కలుసుకొన్నాను. వారిలో ఒకడు స్వయంగా నాదగ్గరకు వచ్చాడు. పూర్వం చైనాలో పనిచేసిన గదర్‌పార్టీ సభ్యులు చైనా వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నారని చెప్పాడు. అంటే వారంతా విప్లవ స్వచ్ఛంద సేవకులన్నమాట! అటువంటివారిలో నా కెప్పుడూ నమ్మకం లేదు. రాష్ట్రాల్లో, కారాగారశిక్ష తప్పదనే భయంతో బైటపడటానికై వేసిన యెత్తుగా అనుమానం కలిగింది. నాదగ్గరికి వచ్చిన పెద్దమనిషి మాత్రం చైనా వెళ్ళటానికి అంగీకరించలేదు. అతని కొక బృహత్తర పథకం ఉంది. అదేమంటే: వాషింగ్టన్‌లోని ప్రముఖ వ్యక్తుల పరిచయం సంపాదించి, ఇండియాకు అనుకూలమైన మహోద్యమానికి సన్నాహాలు ప్రారంభించాలి. ఆ ఉద్యమానికి సహాయం చేయటమే, నా దగ్గరనున్న ధనానికి సక్రమ వినియోగమట! ఆ ఉద్యమం ఫలించటానికి వాషింగ్టన్‌లో నొక కార్యాలయం నెలకొల్పాలి; దానికి ఆకర్షణీయమైన భవనం నిర్మించాలి; సెనేటర్లకూ, విదేశాంగ శాఖోద్యోగులకు తరచు పార్టీ లివ్వాలి. తాను దేశమంతటా తిరిగి సాగించే ప్రచారానికి చాల ధనం కావాల్సి ఉంటుంది. ఈ ప్రణాళిక చాల సందేహాస్పదంగా తోచింది; అదీగాక నా దగ్గరనున్న ధనం ఒక ప్రత్యేక కార్యసాధనకు - ఆయుధాలు కొనే నిమిత్తం - ఉద్దేశింపబడింది. అందుచే అతనికి ధన సహాయం చేయలేక పోయినాను. నాపై

అతనికి చాల ఆగ్రహం కలిగింది. నేను దేశద్రోహి నంటూ ఇండియాకు వ్రాస్తానని బెదరించాడు. ఐతే, ఇతడు వృద్ధ విప్లవకారుల కోవలోని వాడుకాడు; వయసులో చిన్నవాడు. ఈ కార్యక్రమాలైన తరువాత, చదువు నిమిత్తం అమెరికా వెళ్ళి ఆగ్నస్‌స్మిడ్లీ సహాయంతో పెద్ద ఎత్తు రాజకీయాల్లో పాల్గొన్నాడు. స్మిడ్లీ 'బొహిమియా అరాచక వాదుల' రకం. న్యూయార్కులో లజపతిరాయ్‌కి కార్యదర్శిగా పని చేసింది. అక్కడే ఆమెను చూచాను. ఇండియా వ్యవహారాలలో చాల శ్రద్ధ చూపించేది. ఆమెను గురించి ఇంకా ముందు ముందు వ్రాస్తాను.

ఈ భారతీయ యువకుడు, మా పథకాని కే విధంగానూ తోడ్పడడు; ఐనా మెక్సికోలోనే ఉండమని కోరాను. అత డంగీకరించలేదు. వాషింగ్టన్ వెళ్ళి తన ఉద్యమాన్ని వెంటనే ప్రారంభించాలనీ, శాన్‌ఫ్రాన్సిస్కోగుండా ప్రయాణంచేసి, ఇద్దరు భారతీయులను చైనా పంపుతాననీ నాదగ్గర రెండు వేల డాలర్లు పుచ్చుకొన్నాడు. సరిహద్దు నగరంనుండి, నన్ను తిడుతూ పెద్ద జాబు వ్రాశాడు! శాన్‌ఫ్రాన్సిస్కోనుండి విప్లవ సందేశంతో ఎవ్వరూ చైనా వెళ్ళనేలేదు!

## కెయిజర్ ప్రధాని గిహింరాట్

కెయిజర్ ప్రధాని రాకకోసం చాల రోజులు ఎదురు చూచాం. ఆతడు మెక్సికో రాగానే కలుసుకున్నాను. పేరు గిహింరాట్; క్రొత్త తరహా జర్మన్. నాటివరకూ నాకు పరిచయమైన జర్మను లందరూ, ఏ ఉద్యోగంలో ఉన్నా సైనికులుగానే వ్యవహరించేవారు. చిన్నప్పుడు పొందిన నిర్బంధ సైనిక శిక్షణే వారిలోని సైనిక స్వభావానికి కారణం. ఇతడు మాత్రం సాధారణ పౌరస్వభావం గల విద్యావంతుడుగా కన్పించాడు; ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయంలోని ఆచార్యునితో పోల్చవచ్చు; ఆతని ప్రవర్తనలో ప్రత్యేక ఆడంబరాలుగాని, అహంభావంగానీ, ఆధిక్యతగాని కన్పించవేదు. ఆతని సమక్షంలో ఒక క్రొత్త వ్యక్తిముందు ఉన్నాననే భావమే కలగలేదు. ఆధిక్యత అహంభావాలతో కూడిన ప్రవర్తన నాకు చిరాకు కలిగిస్తూ ఉండేది.

మా మొదటి సమావేశంలో, గిహింరాట్, కేవలం జర్మనీ పరిస్థితిని గురించి మాత్రమే ప్రసంగించాడు. జర్మనులలో సర్వసాధారణంగా కన్పించే 'ధీమా' ఆ మాటల్లో కన్పించలేదు. ఏకాకిగా నిలబడి యావత్ప్రపంచంతో పోరాడుతున్నది జర్మనీ. అది సులభమైన విషయంకాదు. జర్మనీకిగల మిత్రులంతా నామమాత్రులే నంటూ నిందించాడు. అమెరికా యుద్ధంలో ప్రవేశించటం జర్మనీకి ప్రాణసంకటంగా పరిణమించేదేకాని, తూర్పురంగంలో జరిగిన అనుకూలమైన మార్పులవలన జర్మనీ నిలబడ గలిగింది. రష్యాలో జరిగిన ఫిబ్రవరి విప్లవంతో తూర్పు రంగం అంతరించిం దనే చెప్పవచ్చు. నైతికంగా దెబ్బతిన్న రష్యన్ సైన్యాన్ని కూడగట్టటానికై,

కెరెన్‌స్కీ చేస్తున్న ప్రయత్నాలు విఫలం కావటం తథ్యం; బోల్షివిక్ పక్షనాయకుడైన లెనిన్ సాగిస్తున్న శాంతి ప్రచారంతో రష్యాసైన్యం పూర్తిగా కూలిపోతుంది. అందుచే "జర్మనీ సజావుగా తూర్పుగా పురోగమించాలి" అని ఏనాడో బిస్మార్క్ చేసిన సూచనను కార్యరూపంలోనికి మార్చటానికి ఇప్పుడు సదవకాశం వచ్చింది. కాకసస్ పర్వతాలు చేరేవరకూ జర్మన్ సైన్యాలకు ప్రతిఘటన అంటూ ఉండదు. కాకసస్ ప్రాంతాలనుండి ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వంపై అజేయమైన జర్మన్ సేనావాహినులు పురోగమిస్తై" అంటూ ఉద్రేకం యేమాత్రం లేకుండా, నిదానంగా మాట్లాడాడు, మనోనేత్రంతో ఆధునిక అలెగ్జాండరు జైత్రయాత్రా పురోగతిని తిలకిస్తూ ఉన్నట్లు !

అర్ధనిమీలిత నేత్రాలతో నావైపు తిరిగి అన్నాడు : "మీ ప్రణాళికలో జర్మనీ ఎంతో శ్రద్ధ వహిస్తున్నది." అందుకు నే సమాధానం చెప్పేలోగా తిరిగి స్వగతం ప్రారంభించాడు: "మరి కొంతకాలంవరకూ, పశ్చిమ రంగంలో జర్మనీ నిలబడాలంటే, అమెరికా వెన్నులో పొడవాలి; అది సాధించటానికి తగిన రంగస్థలం మెక్సికో! మన్రో సిద్ధాంతాన్ని ప్రతిఘటిస్తూ లాటిన్ అమెరికా ప్రజా విప్లవాన్ని లేవదీయాలి: ఆ విప్లవానికి నాయకత్వం వహించేట్లు కరంజాను ప్రోత్సహించి అతనికవసరమైన సహాయం చేయాలి. సంయుక్త రాష్ట్రాలలోనూ, కెనడాలోనూ గూడా భారీయెత్తున విధ్వంసక చర్యలకు రెచ్చగొట్టాలి."

ఆమాటలతో మెక్సికోలో జర్మనులచర్యలకు అర్థం స్పష్టమైంది. యూరప్‌లో విజయాన్ని సాధించే ఎత్తుగడలో ఇండియాలో విప్లవమొక అంశం ! ప్రవాహంలో మునిగిపోతున్న వ్యక్తి గడ్డిపోచను పట్టుకొన్నట్లుంది జర్మనుల ధోరణి. జర్మన్ అజేయ శక్తిలో హైందవార్య (Indo-aryan) విశ్వాసం నాలో అంతరించింది; ఐనా, అంతర్జాతీయ కుట్రలో పాత్రధారివనే భావోద్రేకం మాత్రం మిగిలింది. ఇక, నా కార్యాచరణ రంగాన్ని నిర్ణయించుకోవాల్సిన తరుణం ఇదే. 'యాంకీ' సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటిస్తూ లాటిన్ అమెరికా కూటమిని నిర్మించటమనే భావం చాల ఆకర్షణీయంగా కన్పించింది. లాటిన్ అమెరికా ప్రజల మద్దతుతో, సంస్కరణావశ్యకతను ప్రభుత్వాలచే గుర్తింపచేయటానికిదే మంచి అవకాశం. ఆ ఉద్యమానికి మెక్సికోలోనే ప్రారంభోత్సవం జరగాలి !

మెక్సికోలో జరిగిన ప్రచార ఫలితంగా, లాటిన్ అమెరికా దేశాల్లో సోషలిజాన్ని గురించి మాట్లాడ్డం ఫాష్‌నైపోయింది. నాటివరకూ ఆ దేశాల్లోని వామ పక్షాలన్నీ అనార్కిస్టు సిండికలిస్టు ఉద్యమాలే. వారు జాతీయ స్వాతంత్ర్యానికి ప్రాధాన్యత నిచ్చేవారే కాదు. అందుచే తమ దేశ ఆర్థిక రాజకీయ విషయాల్లో అమెరికా జోక్యం కలిగించుకొనటంపట్ల నిర్లక్ష్యం వహించేవారు. అమెరికాది పెట్టు

బడిదారీ ప్రభుత్వం. తమదీ అంతే! ఏదయితేనేం అనేవారి వాదన. వీరి నిర్లక్ష్యం వల్ల, విదేశీయుల దౌర్జన్య చర్యలకు దేశీయ ప్రతిఘటనోద్యమం బలహీనమై పోయింది. సోషలిస్టు భావ ప్రచారంతో, ప్రజానీకం దేశరాజకీయ జీవితంలో ప్రవేశించటం అవసరమని గుర్తింపబడింది. మంచిగానీ చెడుగానీ, ఈ పరిణామానికి నేనే చాలవరకు బాధ్యుడనని సగర్వంగా చెప్పుకోవచ్చు*.

మరొక ప్రసంగంలో, గిహీంరాట్ ఇలా వివరించాడు: "చైనాలో ఆయుధాలు కొనే పథకంలో యేమాత్రం జాప్యం జరగకూడదు; ఒడంబడిక జరిగి కూడా సంవత్సరం పైగా గడిచింది. మీరు చైనా వెళ్ళినప్పు డక్కడ జర్మన్ రాయబారిగా నున్న అడ్మిరల్ వాన్‌హిట్జు, ఇప్పుడు జర్మన్ విదేశాంగమంత్రి యైనాడు. జర్మన్ తూర్పు ఆసియా బ్యాంకు (డ్యూషి ఆస్టేషియాషి)లో 'మురిగి పోయిన' నిల్వలను అమ్మివేయవలసిందిగా పీకింగ్‌లోని జర్మన్ రాయబారి కతడు ఉత్తర్వులు పంపాడు. కాబట్టి ఇప్పుడిక డబ్బు సమస్య కూడా లేదు. ఐనా, ఏది జరగటానికీ, మీరు రంగస్థలంమీద ఉండాలి. మీకు సహాయంగా, జర్మన్ సామ్రాజ్య ఉద్యోగిబృంద ప్రతినిధిగా హెర్ కెప్టెన్ Z కూడా దూరప్రాచ్యం వస్తాడు. (జావానుండి వచ్చిన మిత్రుల్లో ఒకడే ఈ కెప్టెన్ Z). చైనాలో డబ్బు చేతికందేలోగా అవసరమైన ఖర్చులకు ప్రస్తుతం మీకు 50 వేల డాలర్లు ఇస్తాం. మీరు వెంటనే బయలుదేరి చైనా వెళ్ళాలి. ప్రయాణంలో యెంతో జాగ్రత్తగా ఉండాలి. యెన్నో అపాయాల నెదుర్కొన వలసి ఉంటుంది." అంటూ ఆ అపాయాలను గురించి చాల ఆదుర్దాగా మాట్లాడాడు గిహీంరాట్. తిరిగి జీవితంలో మరొక సాహసం! ఆ భావమే ఉత్సాహాన్ని కలిగించి నన్ను పురికొల్పింది.

## కరెంజాతో సమావేశం

రాయబార కార్యాలయంలో జరిగిన అధికార విందులో, చివరిసారిగా గిహీంరాట్‌ను కలుసుకున్నాను. నా రాజకీయ జీవితంలో అది చాల ముఖ్యమైన సమావేశం! వాస్తవానికి, ఆ విందుకు నేను హాజరుకావటంలో అర్థంలేదు. విందుకు నన్ను తీసుకువెళ్ళటానికై శ్రీహర్ శ్రీమతి స్వయంగా వచ్చింది. ఇంతకు ముం దెన్నడూ ఒంటరిగా వచ్చేది కాదు. నా ఆశ్చర్యాన్ని ముందుగానే ఊహించినట్లు హుషారుగా మాట్లాడింది. "బెదిరిన కుందేలుపిల్లలా అలా వెర్రిగా చూస్తావేం. నేను అమెరికన్ గూఢచారి నేంకాదు; నిన్ను లేవదీసుకుపోవటానికి రాలేదు." మరుక్షణంలోనే గాంభీర్యాన్ని వహించి: "నిన్ను లిగేషన్‌కు తీసుకువెళ్ళటానికై వచ్చాను. మామూలు ఆహ్వాన పత్రిక రాలేదని కొంగమాట పడనక్కరలేదు;

* ఈ విషయాన్నిగురించి ముందు అధ్యాయంలో వివరిస్తాను.

నీవు ప్రత్యేక అతిథిహోదాలో హాజరవుతున్నావు. నీ వెంట వచ్చేవారినిబట్టియైనా ఆ మాత్రం ఊహించే ఉంటావు" అన్నది నవ్వుతూ.

కారు చాలా దర్జాగా ఉంది. లిగేషన్ ముందు దిగాం. మరుక్షణంలో, దేదీప్యమానంగా వెలిగిపోతున్న గదిలో ప్రవేశించాం. అంతా అపరాధ పరిశోధక కథగా వుంది. ఆశ్చర్యంనుండి తేరుకుంటూ ఉండగానే గిహీంరాట్ గదిలో ప్రవేశించాను. నన్ను వెంటబెట్టుకు వచ్చిన ప్రముఖ వ్యక్తిని (శ్రీహర్ సతీమణి) అభినందించాడు.

"వెళ్ళిపొమ్మంటారా? ఐతే వెళ్ళి డ్యాన్సులోనైనా చేరుతాను. నమస్కారాలు," అంటూ వెళ్ళిపోయింది, శ్రీమతి శ్రీహర్.

గిహీంరాట్, నా చేయి పుచ్చుకొని, "మిమ్మల్ని అధ్యక్షునికి పరిచయం చేస్తాను" అంటూ నడిచాడు. ఒక వరండా దాటి, అందంగా వున్న ద్వారం గుండా చక్కగా అలంకరింపబడిన ఒక గదిలో ప్రవేశించాం. మేము సమీపించగానే అక్కడనున్న వ్యక్తి లేచి నిలబడ్డాడు. ఠీవి మూర్తీభవించినదా అనిపించే విగ్రహం; నిడుపాటి తెల్లని గడ్డం; సంజదుస్తుల్లో (Evening dress) ఉన్నాడు. "హిజ్ ఎక్సలెన్సీ డాన్ వెనూస్టియానో కరెంజా- మెక్సికో రిపబ్లిక్ అధ్యక్షుడు." అంతా హఠాత్తుగా జరిగిపోయింది; నాకు అగమ్యగోచరమైంది. ఆ సందర్భానికి తగిన మాటలుకూడా ఊహించుకొని ఉండలేదు. అధ్యక్షుడే చేయిచాచి "గుడ్ ఈవెనింగ్" (బ్యూనెస్ నోషెస్) అన్నాడు, స్పానిష్ భాషాసాంప్రదాయంలో యుద్ధమంత్రీ, సెనోరిటా (లామజేర్ మోడార్నా) యిద్దరూ నన్నుగురించి అధ్యక్షునితో ఇదివరకే చెప్పారు. మెక్సికోలో కొంతకాలం గడపాలనే నా నిర్ణయం అతనికి ముదావహమైంది. మెక్సికనులపట్ల ఆదరాభిమానాలూ, సానుభూతీగల ఎవరికైనా మెక్సికో మాతృదేశమౌతుందని హామీ యిచ్చాడు. అప్పటికి, తగిన మాటల్లో నా కృతజ్ఞతను వెల్లడించాను. గిహీంరాట్ అన్నాడు:

"మీ కార్యక్రమమంతా హిజ్ ఎక్సలెన్సీకి తెలుసు. మీ ప్రయాణానికి తగిన యేర్పాట్లు చేస్తారు."

తిరిగి అధ్యక్షుడు కరస్పర్శచేస్తూ "అదృష్టవంతుడవి కావాలి" అంటూ దీవించాడు.

బైటికి వస్తూవుండగా వరండాలో గిహీంరాట్ అన్నాడు: "ఇక మనం కూడా సెలవు తీసుకొందాం. నేను రేపు బయలుదేరి, అర్జెంటైనాగుండా వెళుతున్నాను. మీకు విజయం చేకూరాలనే భగవంతుని ప్రార్థిస్తున్నాను."

## గమ్యం చేర్చని ప్రయాణం

సాహసోపేతమైన చైనా ప్రయాణానికి, కేవలం అపరిచిత వ్యక్తులే యేర్పాట్లు చేస్తున్నారు. నాలో తీవ్రమైన భావ సంఘర్షణ ప్రారంభమైంది. పూర్వపు అలవాటుప్రకారమే సన్నాహాలు జరుపుతున్నానుగాని, ఈ సాహసంలో హృదయపూర్వకంగా ప్రవేశించటంలేదు. యువక విప్లవకారుని ఊహాబలాన్ని రెచ్చగొట్టి, సంవత్సరన్నరపాటు ఎండమావులను వేటాడించిన ఆ కర్తవ్యంలో నా విశ్వాసం సడలిపోయింది. ఐనా, స్వాతంత్ర్యాన్ని గురించి నాలో నేర్పడిన నూతన దృక్పథానికి ఇంకా పూర్వవాసనలను ప్రతిఘటింపగల శక్తి లభింపలేదు. ఏమైనా నిర్ణయం జరిగిపోయింది. ఈ క్రొత్తయత్నం సఫలీకృతమైతే, స్వదేశంలోని మిత్రులకు ఆయుధాలేగాదు, స్వాతంత్ర్యాన్నిగురించి నూతన దృక్పథంకూడా లభిస్తుంది. ఈ దృక్పథం స్వదేశీయులకు సమ్మతమా నా కాదా అనే ఆలోచనే లేదు; వారికది అంగీకారం కాదని ఊహించటానికీ అవకాశంలేదు. మా అందరి ఆశయం ఒకటే. దారిద్ర్యంలో క్రుగ్గిపోతున్న ప్రజానీకాన్ని ఉద్ధరించటమే! బంకించటర్జీ 'ఆనంద మఠమే' మా అందరి కార్యోత్సాహానికీ మూలాధారం; ఆ గ్రంథంలోనే మా విప్లవ ఆదర్శం ప్రతిఫలించేది. ఆ నవలలోని ప్రధాన భూమికలను మాలో మేము పంచుకొన్నాం. వారందరూ బైరాగులే! వారి అడుగుజాడల్లో నడవటానికి శపథం చేశాం. బ్రహ్మపుత్రానదీలోయ ఎగువభాగంలో ఆనందమఠాన్ని స్థాపించి, ప్రజలలో మా ఆదర్శాలపట్ల ఆదర విశ్వాసాలు కలిగించి, వారికి ఆయుధాలిచ్చి, అజేయమైన స్వాతంత్ర్యసైన్యాన్ని దేశంలోకి నడిపించాలని ఊహించాం. ఇక, ప్రస్తుత కర్తవ్యం నెరవేరితే, ఆయుధాలతో నేగాక నూతన విప్లవసందేశంతో, మాతృదేశంలో ప్రవేశిస్తాను!

## దోపిడిగాండ్రతో

సంయుక్త రాష్ట్రాలగుండా ప్రయాణం ప్రమాదకరం. కాకపోతే, సముద్రం మీద ప్రయాణం తప్పదు. ఉన్నత తరగతి ప్రయాణీకుల జపాను నౌకలు నెల కొకమారు మాత్రమే మెక్సికోలో పసిఫిక్ తీరానికివస్తూ ఉండేవి. అందులో శాన్‌ఫ్రాన్‌సిస్కో రేవుకు వెళ్ళని నౌకనే జాగ్రత్తగా అందుకోవాలి. యోకహామాలోని మెక్సికన్ రాయబారికి (Consul General) పరిచయలేఖ ఉండటం వల్ల, జపానులోదిగి కొన్నిరోజు లుండటానికి ఇబ్బంది ఉండదు. ఒక జపాను బ్యాంకుద్వారా నా కాతడు ధనసహాయంకూడా చేయవలసిఉంది. ఇక, మెక్సికో పసిఫిక్ తీర రేవులన్నిటిలో మంజానిల్లో చేరటం కొంచెం తేలిక. నాటి పరిస్థితుల్లో మిగిలిన రేవులను చేరటం అసంభవమనే చెప్పవచ్చు. మంజానిల్లోకు రైలుమార్గం

ఉంది. కాని బందిపోటు దొంగలకు నిలయమైన పర్వతారణ్య ప్రాంతాలగుండా వెళుతుం దా రైలు మార్గం.

మెక్సికో నగరంనుండి పసిఫిక్ తీరంలోని గౌడల్ జారా నగరానికి ప్రతి రోజూ ఒక రైలుబండి ఉండేది. ఆ బండికి సైనిక రక్షణకూడా వుండేది. ఆ రెండు నగరాలమధ్య ఎంతో దూరంలేదు. ఐనా ఉదయం బయలుదేరిన బండి సాయంకాలానికి మాత్రమే గమ్యస్థానం చేరేది; అదీ, మార్గంలో ఏ దుస్సంఘటనా జరగనప్పుడే! నా ప్రయాణం చాలవరకు ప్రశాంతంగానే జరిగింది. మార్గమంతా ఆటవిక సౌందర్యంతో విలసిల్లుతూ ఉంది; పర్వత సానువులనిండా దట్టమైన అరణ్యాలు; గెరిల్లా యుద్ధానికి చాల అనుకూలమైన ప్రాంతం. ఈ అరణ్యాల్లోని జపాటిస్టాలను నిర్మూలించటం అసాధ్యం కావటంలో ఆశ్చర్యంలేదు.

సాయంత్రానికి మా రైలుబండి గౌడల్ జారా చేరింది. మిత్రుల సలహా ప్రకారం, మంచి హోటల్ కు వెళ్లాను. గౌడల్ జారా మెక్సికో దేశానికి మధ్యగా ఉంది; పశ్చిమ మెక్సికో కిదే ప్రధాన నగరమని అంటారు. అంతర్యుద్ధంజరిగే రోజుల్లో ఇక్కడికి రావటానికి విదేశీయు లెవ్వరూ సాహసించేవారుకారు. ఆ నగరంలో స్పానిష్ విజేతల పరిపాలనా చిహ్నంగా ఒక చర్చిమాత్రం మిగిలింది. వారి రక్తసంబంధాలు కూడా పూర్తిగా మాసిపోయినై. అంతర్యుద్ధ ప్రమాదాలనుండి తప్పించుకొని స్పానిష్ ధనికవర్గం పలాయనం చిత్తగించింది. ఈ ప్రాంతంలో నారింజ, జపోటా మొదలైన ఫలవృక్షజాతులు విరివిగా కన్పిస్తై; గౌడల్ జారా నగరంలోకూడా గుబురుగా పెరిగిన మామిడిచెట్లు బారులు తీర్చి ఉంటై. ఈ ప్రాంతాలకు 'మెక్సికో పండ్ల తోట' అని ప్రసిద్ధి.

గౌడల్ జారోనుండి సైనికబండిలో ప్రయాణంచేయాలి. ఐతే, స్థానిక కరెంజావర్గ నాయకులకు, నన్నుగురించిన వర్తమానం, ముందుగానే అందటంవల్ల, త్వరలోనే నా ప్రయాణానికి యేర్పాట్లు జరిగినై. రైలుమార్గంనుండి గెరిల్లాదళాలను తరిమివేయటానికై మిలిటరీబండ్లు వెళుతూవుండేవి. వీరు గెరిల్లాలతో నిజంగానే యుద్ధం చేస్తూఉండేవారు. నా ప్రయాణం ఆరుగంటలకు మించి ఉండదు; ఒక మిలిటరీబండిలో యేర్పాట్లు చేయబడినై.

అర్ధరాత్రి దాటిన తరువాత బండి బయలుదేరింది; దాన్ని రైలుబండి అనటానికే వీలులేదు. అందులో ఉన్నది ఒక ఇంజను, రెండు పెట్టెలుమాత్రమే. వానిలో ఒక పెట్టెనిండా సైనికులే. మాకంటె ముందుగా రెండు మిలిటరీబండ్లు వెళ్ళినై; రెండవ బండిని గెరిల్లాలు అటకాయించినట్లు తెలిసింది. సైనికులు గెరిల్లాలను తరిమికొట్టారు. కాబట్టి మా బండిపై గెరిల్లా దండయాత్ర జరగదని ఆశించాం కాని, నమ్మటానికి వీల్లేదు. అందులో, బండి వేగంగా వెళ్ళటానికి వీల్లేని పర్వత ప్రాంతం. దీపాలన్నీ ఆర్పివేశారు; కిటికీల అద్దాలు తీసివేశారు. తుపాకిగుండు దెబ్బకు

బద్ధలైన గాజుముక్కలు, తుపాకిగుండ్లకంటె ప్రమాదకరం! ఎవరికీ కంటిమీద కునుకు లేదు. మా అందరికీ సైనికాధికారి ఆజ్ఞ ఇచ్చాడు! తుపాకిమోత వినగానే క్రింద పడుకోవాలి! దొంగలు బండి ఎక్కినట్లయితే ఉపయోగించటానికి మాకు మోజర్ పిస్తోళ్ళు యిచ్చారు.

తూర్పుదిక్కున ఉదయకాంతులు ప్రసరించినై. రెండు, మూడుగంటల్లో గమ్యస్థానం చేరుకొంటామనే ఆశకలిగింది. ఇంతలో తుపాకి ప్రేలిన శబ్దం! ప్రభాత ప్రశాంతత చెదిరిపోయింది; ఒక్క కుదుపుతో బండి ఆగింది. సైనికులు క్రిందికిదూకి మా పెట్టె కిరువైపులా బారులుతీర్చి తుపాకులతో నిలబడ్డారు. నేనూ, నా మోజరుతో సిద్ధంగా ఉన్నాను. సేనాపతి ఆజ్ఞాపించటంతో, పర్వతసానువులపైకి రెండు బారులు ప్రేల్చబడినై; సమాధానంలేదు. శత్రువులు కాలికి బుద్ధిచెప్పి ఉంటారు. మసక వెలుగు ఉదయకాంతిగా మారింది. ముందు పసిఫిక్ మహాసముద్రం ప్రత్యక్షమైంది. రైలు బండి కొండ దిగటం ప్రారంభించింది. రెండు గంటల్లో మంజానిల్లో చేరుకొన్నాం.

మంజానిల్లో చాల చిన్న రేవు; ఇంచుమించు నిర్జనమనియే చెప్పవచ్చు; ఉష్ణమండల ప్రాంతం కావటంచే, పగలు ఉష్ణోగ్రత ఎక్కువ. సముద్రంమీద బెస్తల పడవలుతప్ప ఇతర సంరంభమేమీలేదు. దక్షిణ కాలిఫోర్నియాలోని శాన్‌డీగో రేవునుండి ప్రతివారం పెనామాకు వెళ్ళే నౌకలుతప్ప మంజానిల్లోకు ఇతరనౌకలేవీ రావు. జపాను - దక్షిణ అమెరికా మార్గానికి చెందిన వర్తకనౌక పోగాను తీసుకు వెళ్ళటానికి రేపోమాపో రావచ్చునని అనుకొంటున్నారు; అదీ ఎవ్వరూ నమ్మకంగా చెప్పటంలేదు. దక్షిణానికివెళ్ళే తీరనౌక వచ్చేగడువు ఇంకా రెండురోజులుంది; దానిపై 300 మైళ్ళు ప్రయాణంచేసి దక్షిణ మెక్సికో రేవుపట్టణమైన 'శలీనా క్రూజ్' చేరి అచ్చట జపాను నౌకను అందుకోవచ్చు. అందుచే సందేహాలతో, మంజానిల్లాలో నిరీక్షిస్తూ కాలం గడపటంకంటె శలీనాక్రూజ్ వెళ్ళటమే మంచిదని నిర్ణయించాను.

తీరంవెంట అమెరికానౌకలో ప్రయాణం చేశాను. చాల పెద్దనౌక; ప్రయాణీకులు ఎక్కువమంది లేరు. ప్రయాణం చాల ఆహ్లాదకరంగా ఉంది. రెండవరోజున నౌక 'ఆకాపుల్కో' రేవుపట్టణంలో గంటలతరబడి మకాంచేసింది. ప్రపంచంలోని ప్రకృతిసిద్ధ రేవుపట్టణాల్లో ఇదియొకటి; విశాలమై లోతైన అఖాతమూ, చుట్టూ ఎత్తైన పర్వతాలూ ఈ రేవుకు అందాన్ని చేకూర్చినై. హార్బరులోనికి ప్రవేశించే యిరుకుమార్గానికి ఎదురుగా, దూరంగా ఉన్న కొండపై తెల్లని పెద్ద చర్చి. నిర్జనమైన ఈ సముద్రప్రాంతంలో ఈ చర్చిలో ప్రార్థనచేసే దెవరా అనే సందేహం రావటం సహజం. ఒకానొకప్పుడు, నిందిత క్రైస్తవ భిక్షుణీలు, తమ పాపపరిహారార్థం ఈ చర్చిలో తపస్సుచేస్తూ ఉండేవారట! అందుకే ఉద్దేశింపబడిందా చర్చి. 1860

ప్రాంతంలో జొరిస్టాలు ఆ చర్చిని మూసివేశారు; అంతటితో అనేక వందల పతిత దేవ కన్యలకు బంధవిముక్తి లభించింది!

శెలినా క్రూజ్ చిన్నదైనా చాల ముఖ్యమైన రేవుపట్టణం. ఇక్కడినుండి 'టెహుయాన్‌టాపెక్' భూసంధిగుండా రైలుమార్గం ఉంది. ఈ భూసంధి పసిఫిక్ మహాసముద్రానికీ, మెక్సికో అఘాతానికీ మధ్యగా ఉంది; రైలుమార్గం పొడవు నూరు మైళ్ళు; పెనామా భూసంధి వెడల్పుగూడా అంతే. అసలు మొట్టమొదట, టెహుయాన్ టాపెక్ భూసంధినే అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రాలమధ్య జలమార్గముగా మార్చటానికి నిర్ణయం జరిగింది. కాని కొన్ని రాజకీయ కారణాలవల్ల ఆ సూచనను త్రోసివేసి దానికి దక్షిణంగానున్న పెనామా భూసంధిని నిర్ణయించారు. ఇందుకు ప్రతీకారంచేసి తన స్వాతంత్ర్యాన్ని రుజువు చేసుకోవాలని మెక్సికో ప్రభుత్వం సంకల్పించింది. అదేతరుణంలో పెనామాకాలువకు సమానాంతరంగా, టెహుయాన్ టాపెక్ భూసంధిగుండా కాలువ త్రవ్వటానికి ఒక జపానుకంపెనీ మెక్సికన్ ప్రభుత్వాన్ని అనుమతి కోరింది. కాని ఈ ప్రణాళిక నిలిచిపోవటానికి బహుశా వాషింగ్టన్ నుండి వచ్చిన వత్తిడియే కారణం.

భూసంధికి లోపలగానున్న ప్రదేశం చాల సారవంతమైంది; ఇచట ఉష్ణమండలపు తోటలు విశేషం. కాని తీరప్రాంతం మాత్రం ఇసుకఎడారి; రాత్రింబవళ్ళు భయంకరమైన గాడ్పులు వీస్తుంటై. ఆ ప్రాంతాల్లో నివసించే స్వదేశీయులు చాల అందంగా ఉంటారు.

శెలీనాక్రూజ్ రేవులో దిగింది నేనొక్కడనే. జపాను నౌకను గురించిన వర్తమానం ఇంకా అక్కడికి చేరలేదని తెలిసింది. అక్కడ ఎంతకాలం వేచి ఉండాలో తెలియదు. ఉండటానికి ఒక చిన్న హోటల్ ఉంది; హోటల్ చుట్టూ ఇసుకదిబ్బలు. అనంతంగా విస్తరించియున్న పసిఫిక్ మహాసముద్రతీరంలో రాత్రులు చాల అందంగా ఉండేవి. పగలంతా గాడ్పులు బొబ్బరిల్లుతూ ఉండేవి; ఇసుక కంకర మేఘాలు ఏర్పడేవి; ఇంటికప్పుకు వేసిన రేకులమీదా, కిటికీలమీదా కంకర ఒకటే మోత.

శెలీనాక్రూజ్ ఇంత నిర్జనంగా ఎన్నడూ లేదని హోటల్ యజమాని విన్నవించుకున్నాడు. అతని ఉద్దేశ్యంలో ఇప్పుడది పాడుబడినట్లే. డయజ్ పరిపాలనలో ఈ పట్టణం ఉచ్ఛస్థితిని చవిజూచింది. నాడు టెహుయాన్ టాపెక్ రైలు మార్గం పెనామా కాలువతో పోటీచేసేది. ఇప్పుడా మార్గంలో రోజుకు ఒక్క రైలు నడవడమే కష్టంగాఉంది. ఒక సంవత్సరానికి పూర్వం అదికూడా అసంభవముగా ఉండేది. మైళ్ళకుమైళ్ళు రైలుమార్గాన్ని దోపిడిగాండ్రు ధ్వంసంచేస్తుండేవారు. ప్రస్తుతం దేశంలో శాంతి నెలకొన్నది; కాని పర్వతారణ్యాలు, లోయలు దోపిడి

గాంగ్రడకు మంచి నివాసస్థావరాలైనై; టెహుయానసుల అమాయకత్వంకూడా వారికి తోడ్పడింది.

కొన్నిరోజుల తర్వాత, జపానునౌక చిలీనుండి సేరుగా హనొలూలూకు వెళ్లుతున్నదనీ, శెలీనాక్రూజ్‌కు రాదనీ వర్తమానం వచ్చింది. ఆ తర్వాత నెలరోజులకు గాని మరొకనౌక రాదు. ఇంతకాలం ఇక్కడ వేచియుండటం అసంభవ మనిపించింది. పోనీ, దక్షిణంగా వెళ్ళే బోటుమీద వాల్పరైజోవరకు వెళ్ళి తిరిగిరావచ్చుననుకొన్నాను. అది మంచిఉద్దేశ్యమేకాని అదికూడా ఆశాభంగంగానే పరిణమించింది. 'అంతా మనమేలుకే' అన్నట్లు ఈ ఆశాభంగాలమధ్య నాకొక భావం స్ఫురించింది. నిజానికి ఎండమావుల వేటను ఏనాడో విడిచిపెట్టానుగదా! తిరిగి దానికొరకు ప్రయత్నించటంలో అర్థంలేదు. మెక్సికోదేశం నన్ను పిలుస్తోంది; ఇక్కడనే క్రొత్తమిత్రు లేర్పడ్డారు. క్రొత్త శ్రేయస్సులకు రూపకల్పన చేశాను; క్రొత్త రాజకీయ జీవిత ప్రారంభానికి ప్రణాళికలు సిద్ధంచేశాను. మరొకవైపున ఈ ఆశాభంగాలతో ప్రాత సాహసోపేతమార్గం పూర్తిగా బంధింపబడినట్లైంది. ఈ విధంగా ముందుకు సాగటంలోగల ప్రమాదాలు, వెనుకకుమరలాలనే భావన, నాలో మెక్సికో వెళ్ళాలనే నిర్ణయాన్ని బలపరిచినై. వెనుకకు మరలాను; అందమైన టెహుయాన్‌టాపెక్‌గుండా దినదినగండంగా ప్రయాణం ప్రారంభించాను.

వందమైళ్ళ ప్రయాణం; పట్టపగలు; రోజుకు ఒకే బండి సాయుధబలాల రక్షణతో వెళుతుంది; అందులో రెండే ప్రయాణీకుల పెట్టెలు; మిగిలినవి గూడ్సు పెట్టెలే. గూడ్సుపెట్టెలను చివర తగిలించేవారు. ఇందులో ఒక ఆంతర్యముంది. దోపిడిగాండ్రకు కోరేది ధనమేగాని ప్రయాణీకుల ప్రాణాలు తీయటంగాదు. అందుచే రైలుచివర ఉన్నట్లయితే గూడ్సుపెట్టెలను సులభంగా తొలగించటానికి వీలవుతుంది. మధ్యాహ్నమైంది; లోతైన లోయగుండా వెళుతోంది రైలు; దట్టమైన వృక్షాలు లోయను కప్పుతున్నై; హఠాత్తుగా ముందర తుపాకిశబ్దం విన్పించింది; బండి ఆగింది. పొదలలోనుండి దొంగల గుంపులు బండిపై పడటానికి సిద్ధంగా నున్నారు. రక్షకదళం వారిని వెంబడించి తరిమి వేసింది. అదంతా ఒక అరగంటలో జరిగిపోయింది.

బండి సాగుతోంది. ఒకచోట చాల భీభత్సమైన దృశ్యం కంటబడింది. అప్పుడే చంపబడిన తొమ్మిది మానవ కళేబరాలు చెట్లనుండి టెలిగ్రాఫ్ స్తంభాల మీదికి వ్రేలాడుతున్నై! వారంతా దోపిడిగాళ్లే!

రైలుబండి ఒక స్టేషన్ చేరింది; ఆ నగరం ఆ ప్రాంతాలకు వాణిజ్య, పరిపాలనాకేంద్రం. అచట శాంతి, భద్రతలకు ప్రమాదం లేదు; పండ్ల వర్తకులతో ప్లాట్‌ఫారం క్రిక్కిరిసి నట్లుంది; అందరూ స్త్రీలే. ఆకర్షణీయమైన దుస్తులు ధరించారు; మంచి పొడవరులు. చాల అందంగా ఉన్నారు; ఎంతో జాగ్రత్తతో

మలచి చేసినట్లున్నవి వారి ముఖాలు. పురుషులు గూడా వారికి తగిన జోడాలే. సుందరరూపులజాతి, కాని క్రమంగా నశించి పోతోంది. అందుకు కారణం టెహు యానసుల గర్వమే! వీరు తమలో తక్కువజాతి రక్తం కలియటానికి సమ్మతింపరు; అంటే తమ జాతిలో మాత్రమే వివాహం చేసుకుంటారు; ఇట్టి అహంభావాన్ని ప్రకృతి శిక్షించి తీరుతుంది: టెహుయానసుల జనాభా నానాటికీ క్షీణించి పోతుంది; క్రమంగా ఈ జాతి నశించిపోక తప్పదు! టెహుయానసుల సౌందర్యంపై మృత్యుచ్ఛాయలు వ్యాపించినై; వారిపై నాకు జాలి కలిగింది.

## తుఫానులో

రైలుమార్గం రెండవ కొసను 'ప్యూర్టో మెక్సికో' ఉంది; ఈ రేవుపట్టణం అన్ని విధాలా శెలీనాక్రూజ్ కు వ్యతిరేకం. షియపాస్ పర్వత మధ్యప్రాంతాలనుండి ప్రవహిస్తున్న నదీ ముఖద్వారంలో ఉంది; జనసమ్మర్థంగల నగరం. అరటి, అనాస మొదలైన పండ్లను నదిపై పడవల్లో తీసికొనివచ్చి ఈ రేవులోని వర్తకులకు అమ్ముతుంటారు; ఇక్కడనుండి ఆ పండ్లు వెరాక్రూజ్ కు గాని అమెరికాకు గాని ఎగుమతి చేయబడతై. వెరాక్రూజ్ అరవై మైళ్ళకంటె ఎక్కువ లేదుగాని పండ్లబోటులో ప్రయాణం చేయాలి. సాయంత్రం ఒక పడవ బయలుదేరు తుందని విని తొందరగా వెళ్లాను. పడవలో చోటు సాధించాను. అది 200 టన్నుల శక్తిగల చిన్న పడవ; మురికిగా ఉంది; లోపల అంతా అరటిపండ్లు; పై భాగం (Deck) సముద్రమట్టానికి రెండడుగులు మాత్రమే ఉంది; కాని అదికూడ మనుష్యులతోనూ, సాధుజంతువుల తోనూ, పక్షిపంజరాలతోనూ క్రిక్కిరిసి పోయింది. మొదటి తరగతి ప్రయాణీకుణ్ణి కావటంచేత ఒక కుర్చీ సంపాదించాను; అదికూడా ఉయ్యాల లూగుచున్నది; కుర్చీ పట్టా చాలా అసహ్యంగా ఉంది. మరుక్షణంలో నా చుట్టూ మానవపర్వతాల గోడ లేర్పడినై. వివిధ రకాల పెట్టెలు, బరువులు, మోపులు, తట్టలు చేరినై; నా కాళ్ళముందొక కుక్క విశ్రమించింది; నా తలపైగా ఒక చిలుక 'కీ' మంటున్నది. అదొక ఘోరమైన పరీక్ష; నాలోని శక్తులన్నీ క్రుంగిపోతున్నవా అనిపించింది. కాని ఉదయానికే ఈ పరీక్ష ఐపోతుందనే ఆశతో కొంత ఉత్సాహం కలిగింది. పడవ కదటంతో, సముద్ర వాయువులు వీచి నా చుట్టూ ఆవరించిన దుర్గంధ మేఘాలు పటాపంచలు కాసాగినై.

అర్ధరాత్రి కావచ్చింది; మా పడవకున్న ముసలి ఇంజను తడబడటం ప్రారంభించింది. ఉన్నట్లుండి ఒక్కసారి జనాన్ని కుదిపి ఆగిపోయింది; ఇంతలో తుఫాను ప్రారంభమైంది. అటువంటి చిన్న పడవలు సముద్రంలోనికి పోవటానికి సాహసించవు. కాని తుఫాను వేగానికి తీరానికి కొట్టుకోటుందనే భయంతో కళాసు సాహసించి పడవను లోపలకు నడిపాడు. తుఫాను పెద్దది కాసాగింది. డెక్కుమీది గ్రుడ్డి

కిరోసిన్ దీపాలు ఆరిపోయినై. మేమందరం చీకటిలో మునిగి పోయినాం. పెద్ద పెద్ద తరంగాలు మా పడవను ఊయలలాగా ఊపుతున్నై; ఆ తరంగాల్లోని ఫాస్ఫరస్ ముక్కలు మండి అప్పుడప్పుడు వెలుగు నిస్తున్నై. స్త్రీలు భయంతో ఏడుస్తున్నారు; పురుషులు తిట్లు ప్రారంభించారు; నా కాళ్ళముందున్న కుక్క మొరుగుతోంది. అంతా మహా నరకంలాగా ఉంది. అలలు డెక్కు మీదికి పరవళ్లు ద్రొక్కుతున్నై; సముద్ర జ్వరం 'మహామారి'లా వ్యాపించింది; తుదకు, చిలుకను, కుక్కనుకూడా విడిచి పెట్ట లేదు. ఈ 'పాపిష్టి' పడవ ఏ క్షణాన్నైనా మునిగిపోవటం తప్పదనే ఊహించాను; ఆ భయమే కవచంలాగా నన్ను సముద్ర జ్వరంనుండి కాపాడి ఉంటుంది. వస్తుతా నౌకాయానంలో నాకు మంచి అనుభవం. భయంకరమైన చైనా సముద్రమే నా ఆరోగ్యానికి భంగం కలిగించలేకపోయింది. ఒక్కసారి మాత్రమే నాకు సముద్ర జ్వరం వచ్చింది. అదీ మధ్యధరా సముద్రంమీద; మధ్యధరా సముద్రమంటే నాకు ఆకు పచ్చని అద్దం ముక్క వలె కన్పించేది. ఈ పరీక్ష ఎంత కాలం జరిగిందో తెలియదు. గర్జిస్తున్న సముద్రఘోష, తుఫాను భీకరనినాదంతప్ప డెక్ మీద నిశ్శబ్దం ఆవరించింది. అది మృత్యు ప్రశాంతత మాత్రం కాదు; అది అలసటవల్ల యేర్పడ్డ ప్రశాంతత. ఉన్నట్లుండి తూర్పు ఆకాశాన మెలుతురు కన్పించింది. తుఫాను సద్దుమణిగింది; కాని యింకా సముద్రం భారంగానే ఉంది. మాది తుక్కుబోటే ఐనా, ఆరుగంటలపాటు తుఫాను భీభత్సానికి తట్టుకొని బైటబడింది. నమ్మటానికి కూడా శక్యంకాని విషయం!

అలసి నిద్రపోయిన ప్రయాణీకులను సూర్యకాంతి మేలుకొల్పింది. తమ్ము, తమ సామాన్లను లెక్కపెట్టుకొన సాగారు వారంతా. ప్రయాణీకు లెవరూ పోలేదు. కాని సామాన్లు చాల భాగం కొట్టుకు పోయినై. వెరాక్రూజ్‌కు ఎప్పటికి వెళ్ళగలమో కళాసుకు గూడా తెలియదు; దారితప్పి దూరంగా వెళ్లిపోయినట్లుంది మా పడవ. ఐనా సూర్యుడు కళాసుకు మార్గదర్శకుడైనాడు; వెరాక్రూజ్‌కు చాల దూరంగా తుఫాను పడవను తరిమివేసినట్లు మధ్యాహ్నానికి గుర్తించాడు. పడవ వెనుకకు మరలి, సాయంకాలానికి వెరాక్రూజ్ చేరింది.

వెరాక్రూజ్ మెక్సికోకు ప్రధాన రేవుపట్టణం. ఇక్కడికి రావటం ఇదే ప్రథమం. కాని ఇంతకుపూర్వమే మెక్సికోలో ఇట్టి అనుభవాలు చాలా పొందాను. సాధ్యమైనంత త్వరలో నాగరికతా జీవితంలో పడాలనే ఆరాటం కలిగింది. వేళ తప్పటం చేత, ఆ సాయంత్రం రైలు అందుకోలేదు. హోటలుకు వెళ్లాను; అది అంతర్జాతీయ హోదాగల హోటలు; స్నానంచేసి భోజనం ముగించాను. పరిశుభ్రమైన పరుపు, హాయిగా ఉంది. గాఢనిద్ర పట్టింది. ఉదయం నగరం చూద్దామని వెళ్లాను. తర్వాత చాలసార్లు వెరాక్రూజ్ నగరాన్ని దర్శించాను.

వెరాక్రూజ్ నుండి రాజధానికి వెళ్ళే రైలుమార్గం సురక్షితమైనదే. రైలు బండ్లు టైమ్‌టేబిల్ ప్రకారం క్రమంగా నడుస్తున్నై. ఆండీస్ పర్వతాలగుండా, అర్జెంటైనా, చిలీలమధ్య నున్న ఒక్క రైలుమార్గం మినహాయించితే, వెరాక్రూజ్ మెక్సికో నగరాల మధ్యగల రైలుమార్గం ప్రపంచంలో నెల్ల సుందరమైన దంటారు. సముద్రమట్టం నుండి ఎనిమిదివేల అడుగుల ఎత్తువరకూ వెళ్తుంది రైలు. ఉష్ణమండలంలో ప్రారంభించి శాశ్వతంగా హిమావృత కిరీటాలుగల పర్వతపాదం దగ్గిర ఆగిపోతుంది. రాత్రిపూట ప్రయాణం చేసేవారికి దృశ్యాలు కన్పించవు. ఐనా, నేను నిద్ర మేల్కొనే సరికి బండి మెక్సికో పీఠభూమిలో ప్రవేశించింది. శ్వేతసుందరి నిద్రపోతూనే ఉంది; ధూమ్ర పర్వతం అజ్‌టెక్కుల నాడున్నట్లే, కాపలా కాస్తోంది. నాకెంతో ఆనందమైంది; స్వగృహానికి వస్తున్నట్లనిపించింది.

## నూతన కార్యరంగంలో ప్రవేశం

నేను మెక్సికో నగరంలో లేనిరోజుల్లో సంయుక్తరాష్ట్రాలనుండి పెక్కుమంది భారతీయ విప్లవకారులు మెక్సికోవచ్చారు. నాదగ్గిర రెండువేల డాలర్లు గ్రహించి నన్ను దూషించిన యువకుడే, నా కొక బంగారుగని లభించునట్లు వీరందరిలో చెప్పాడనేది స్పష్టమైంది. వీరందరూ తమ రాకను జర్మన్ కాన్సలేటుకు విన్నవించుకొన్నారుగాని అక్కడ వారికేమీ సాయం లభించలేదు. నేను మెక్సికో చేరిన మరుక్షణమే వీరంతా ప్రత్యక్షమైనారు. పెన్నిధితోసహా నేను పరారీ యైనానని ఆగ్రహావేశులై యున్నట్లు కన్పించారు. కొన్ని 'బంగారు ఇటుకల'తో శాంతించారు. 'ఇరవై పీసో' నాణాన్ని 'బంగారు 'ఇటుక' అని వాడుతూ ఉండేవారు.

వీరిలో ఒక్కరుమాత్రం తనకు లభిస్తున్న వాటాతో తృప్తిపడటానికి నిరాకరించాడు. స్వయంగా గొప్పహోదాలో ఉన్నవాడే. అమెరికాలోనూ, దూరప్రాచ్యంలోనూ బెర్లిన్ విప్లవకమిటీకి ప్రతినిధిగా పనిచేశాడు. జపానులో తనకు మంచి పలుకుబడి ఉన్నట్లు, అచటి మిత్రులసాయంతో చైనాలో ఎంతటి పనినైనా సాధింపగలననీ మాట్లాడాడు. జపాను వెళ్ళటానికిగూడా సిద్ధమేనన్నాడు. నా పరోక్షంలో జర్మనులకే యీ సూచనలన్నీ చేశాడట. కాని జర్మను లాతణ్ని నాదగ్గిరికే పంపారు. అతని హడావిడిని తృప్తిపరచటానికై, ఆతని జపానుయాత్రకు సమ్మతించాను - ఆవిధంగానైనా నా గతచరిత్రను పూర్తిగా విస్మరించటానికి అవకాశం లభిస్తుందనే ఆశతో! ఊహించటానికిగూడా వీల్లేనంతటి మొత్తాన్ని కోరాడు. పదివేలడాలర్లు తక్షణం ఇస్తాననీ, జపాను వెళ్ళినతరువాత మరికొంత అందజేస్తానని వాగ్దానంచేశాను. ట్రక్కు త్రిప్పుకోటానికిగూడా వీల్లేకపోయింది. నా సూచనకు సమ్మతించాడు; కాని సంయుక్తరాష్ట్రాలవరకూ వెళ్ళి, తొందర్లోనే తిరిగివచ్చాడు. అంతకంటె ఆశ్చర్యకరం నేను వారిని మోసం చేస్తున్నట్లు జర్మన్లకు వర్తమానంపంపాడు! ఈ కార్యక్రమంలో

నిజానికి ఎవరు ఎవరిని మోసగిస్తున్నట్లు? ఏమైనా, మెక్సికోనుండి జర్మన్లు వెళ్ళి పోయారు. ఇక, వారిని నేనూ మోసగించలేను; వారూ నన్నూ మోసం చేయలేరు!

మెక్సికో వచ్చిన భారతీయులలో నా ప్రేమాభిమానాలను చూరగొన్నవాడు ఒక్కడుమాత్రమే. అతని వృత్తిమాత్రం విప్లవంకాదు; కాని విప్లవకారుల ముఠాలో చేరాడు. మెకానిక్ గా డెట్రాయిట్ లోని ఫోర్డుఫ్యాక్టరీలో మంచి జీతం సంపాదించుకుంటూ ఉండేవాడు; రాజకీయాలంటే అట్టేగిట్టేవికావు. మెక్సికన్లు మూర్ఖులని అతని అభిప్రాయం; నాలో క్రొత్తగాగలిగిన భావాలపట్లకూడా అతనికి సానుభూతి లేదు. నిజానికి రోజుకు ఐదుడాలర్లు సంపాదించుకొనేవానికి 'సోషలిజం' అర్థంలేని మాటే! కాని విప్లవకారులతోచేరి సోమరిపోతై తన ఉద్యోగం తిరిగి సంపాదించుకో లేక పోయినాడు. రాజకీయాలంటే గిట్టని ఆతడు నాకు చేయగల సహాయమేమీ లేదు. మెక్సికోలోనే స్థిరపడ్డాడు; విశ్రాంతికోసం వచ్చిన భారతీయ వర్తకుడుగా నాటకం ఆడేవాడు. వారంవారం కొన్ని 'బంగారు ఇటుక' లిస్తూ ఉండేవాణ్ని; ఆ నటనే అతనికి తృప్తి!

భారతదేశంనుండి రెండు సంవత్సరాలకు పూర్వం ఆయుధాలకొరకు బయలు దేరాను. ఆ ఆశయసాధనకు నే చేసిన చివరి ప్రయత్నం విఫలం కావటంతో, నా రాజకీయ జీవితంలో ఆ అధ్యాయం ముగిసింది. ఆసన్న భవిష్యత్తుల్లో, భారత దాస్య విముక్తికి నే చేయగలిందేమీ లేదనే నమ్మకం దృఢతరమైంది; అందుచేత విప్లవాత్మకమైన క్రొత్త కార్యరంగంలోకి హృదయ పూర్వకంగా ప్రవేశింప నిశ్చయించాను. ఇందులో వెంటనే విజయం లభింపకపోయినా; ఆత్మసంతృప్తియైనా దొరుకుతుందనే నా ఆశ!

## లాటిన్ అమెరికా స్థితి

నా ఆశకు, ఆశలకు అనుకూలంగా కన్పించింది లాటిన్ అమెరికా. అడుగడుగునా విప్లవాలూ, ఎడతెరిపిలేని అంతర్యుద్ధాలూ, అచటి దేశాలన్నిటినీ శాపం లాగా పట్టుకు పీడిస్తున్నై. వీని ఆర్థిక విధానాలకు విదేశీ శ్రేయస్సులు పాదుకొని యున్నై; దేశీయ ప్రభుత్వాలకు విదేశీశ్రేయస్సులకు చుక్కెదురుగా ఉంది. మెక్సికో రాజ్యాంగంలో సహజసంపదను జాతీయం చేయాలనే నిబంధన ఉంది. ఈ నిబంధనను ప్రతిఘటిస్తూ అమెరికా మెక్సికోను బెదరిస్తోంది. ఇట్టి పరిస్థితుల్లో దేశీయ ప్రభుత్వాలపై విప్లవాలనే పేరుతో రహస్య సైనిక తిరుగుబాట్లు చెలరేగి ప్రజానీకాన్ని అంతర్యుద్ధంలో ముంచెత్తుతున్నై. ఒక రాజకీయ సిద్ధాంతం కొరకుగానీ, సాంఘిక పునర్నిర్మాణ కార్యక్రమంతోగానీ జరిగినవి కాకపోవుటచే, ఈ విప్లవాలు కేవలం బందిపోటులుగా దిగజారిపోతున్నై. ఇట్టి విధ్వంసక సాహసకృత్యాలకు రాజకీయ కౌటిల్యులూ, సైనికులూ నాయకత్వం వహిస్తున్నారు. అదృష్టదేవత సంతృప్తికై వీరు

చేస్తున్న మారణయజ్ఞంలో, అజ్ఞాన దారిద్ర్యాల్లో క్రుంగుతున్న అమాయక గ్రామ ప్రజానీకం యజ్ఞపశువులౌతున్నారు.

విద్యాసంస్కృతులుకలిగి పట్టణాల్లో నివసిస్తున్న మధ్యతరగతివారికి విప్లవాల పట్ల అసహ్యం కలిగింది. వారు రహస్య సైనిక తిరుగుబాటులకూ, రాజకీయ కుట్రలకూ దూరంగానే ఉంటున్నారు. ఇక పారిశ్రామిక కార్మికుల విషయం ? సంఖ్యాబలంలో వీరిది చాల చిన్నవర్గం; అదీగాక వీరిపై అరాజక సిండికలిస్టు భావాలు బాగా పనిచేసినై. అందుచే వీరు రాజకీయాలను, వాటి నాయకులను గర్హించి రాజకీయంగా 'అస్త్ర సన్యాసం' చేశారు. కాబట్టి ఈ దేశాల్లో ఆరోగ్యకరమైన జాతీయ జీవనం యేర్పడి, విదేశ శ్రేయస్సుల కుట్రలనూ, దురాక్రమణనూ ప్రతిఘటించటానికి రెండు అంశాలు అవసరం: (1) మధ్యతరగతి ప్రజలు, తమపై గురుతరమైన సాంఘిక బాధ్యత గలదని గుర్తించేటట్లు చేయుటం, (2) శ్రామికులకు విశాలమైన విప్లవ దృక్పథాన్ని అలవరచటం. ఈ అంశాలుగల కార్యక్రమంతో దేశంలోని ప్రగతిశీల విప్లవ శక్తులను బలవత్తర రాజకీయశక్తిగా రూపొందించటంవల్లనే విదేశ జోక్యానికి జాతీయ ప్రతిఘటనను సంఘటితపరచటం సాధ్యమౌతుంది. అంతేగాదు; లాటిన్ అమెరికా దేశాల్లోని విప్లవాత్మక సాంఘిక శక్తులమధ్య సహకారం సాధించి, ఆ సహకారం ప్రాతిపదికగా జర్మనులు సూచించిన లాటిన్ అమెరికా రాజ్యకూటమిని నిర్మించవచ్చు. ఈ కూటమి, కబంధ హస్తాలను విస్తరించుతున్న సంయుక్తరాష్ట్రాల సామ్రాజ్యవాదాన్ని ఉమ్మడిగా ప్రతిఘటించే అంతర్జాతీయ సాధనంగా రూపొందుతుంది. ఇంతటి మహత్తర కార్యాచరణకు అవకాశంవున్న మెక్సికోలో ఉండటం నిజంగా నా అదృష్టమే. ఈ కార్యక్రమంలోనే - అంటే రాజకీయ స్వాతంత్ర్యాన్ని, సాంఘిక న్యాయాన్ని సాధించి విదేశీ దురాక్రమణను ప్రతిఘటించే ప్రయత్నాల్లోనే మెక్సికన్లకు నా శక్తికొలది సహాయంచేశాను. కార్యాచరణలోనే మెక్సికన్ సోషలిజం బాగా బలపడింది.

పై నిర్ణయంతోనే నూతన కార్యరంగంలో ప్రవేశించి, దాని స్వరూప స్వభావాలను గ్రహించాను; పూర్వ పరాజయాలనుగానీ, నిష్ఫలంగా పరిణమించిన గతాన్ని గురించిగానీ విచారించకుండా క్రొత్తమార్గంలో పురోగమించటానికి ప్రయత్నించాను. ఇటీవల నే చేసిన సాహసం ప్రభుత్వ రక్షణలోనే జరగటంవల్ల నేను తిరిగిరావటం అధ్యక్షునకు తెలిసేఉంటుంది. అందుచే సాధ్యమైనంత తొందర్లో కరంజాను చూడాలి. ఇప్పుడిక జర్మన్ మధ్యవర్తులు లేరు; లాముజేర్ మోడర్నా, ఎల్ ప్యూబ్లో సంపాదకుల సహాయంతోనే అధ్యక్షుని కలుసుకోవాలి. ఈ లోగా సోషలిస్టులను కలుసుకొని సాంఘిక విప్లవానికి అవసరమయిన సాధన సంపత్తిని గూర్చి చర్చించాలి.

## మెక్సికో సోషలిస్టులు

నేను మెక్సికో వెళ్ళినప్పుడు అక్కడ రాజకీయపక్షాలనేవి లేవు. చిన్న చిన్న ముఠాలు రాజకీయాధికారంకొరకు పోరాడుతూ ఉండేవి. వీనిలో చాలవరకు వ్యక్తులచుట్టూ, ముఖ్యంగా సేనానులచుట్టూ యేర్పడినవే. ఈ ముఠాల నాయకు లందరిలో 'మాడెరో' ఒక్కడే సాధారణపౌరుడు; 1911 లో విప్లవం నడపి, కొద్ది రోజులపాటు రిపబ్లిక్ అధ్యక్షపదవిగూడా ఆక్రమించాడు. ప్రతి నాయకుడూ, ఏదో ఒక కార్యక్రమంచూపి, తన జెండాక్రింద చేరవలసినదిగా ప్రజలను వేధించేవారు. ఈ కార్యక్రమాలన్నిటిలో భూమిసమస్యే ప్రధానాంశం. భూమి సక్రమంగా పంపిణీ జరగాలనే ఎవరు సూచించినా!

ప్రజల్లో నూరింట తొంబదిమంది భూమిమీద ఆధారపడినవారే; కాని దేశంలో మాత్రం భూస్వామ్య పరిస్థితులు తొలగిపోలేదు; వ్యవసాయకూలీల నిరుద్యోగం గ్రామప్రజల దారిద్ర్యంవల్ల సైనికవృత్తి ఆకర్షణీయమైంది. అందుచే ప్రభుత్వం మీది తిరుగుబాటులన్నీ సైనిక విప్లవాలుగానే పరిణమించేవి; ప్రతిపక్ష నాయకులూ సైనికోద్యోగులే; ప్రజలకు ఆకర్షణీయంగా ఉండాలని ప్రతి తిరుగుబాటుదారూ 'జనరల్' అను బిరుదు తగిలించుకొనేవాడు. ప్రజలలో అధిక సంఖ్యాకులు భూమిలేని రైతులు, వ్యవసాయకూలీలు నిరుద్యోగులు కావటంచేత వారికి భూమిపంపిణీ సంస్కరణే ఆకర్షణీయమైంది.

మెక్సికోలో అంతర్యుద్ధానికి అంతు అంటూ లేకపోయింది. అందులో తిరుగుబాటుదార్ల ప్రవర్తన బందిపోటు విధానంగా దిగజారిపోయింది. ఈ పరిస్థితిని మధ్యతరగతి వర్గాలు సహింపలేకపోయినారు. వీరు విద్యావంతులు, ప్రజాస్వామ్య వాదులు, అభివృద్ధికాముకులు; విప్లవాత్మకమైన భూమిసంస్కరణల ఆవశ్యకతను వీరూ గుర్తించారు; కాని రాజకీయ దురాశాపరులై, ఆధిపత్యం సాధించాలని సేనానులు జరిపే సాయుధపోరాటానికి దూరంగాఉన్నారు. 'విప్లవము', 'విప్లవాత్మకము' అనే మాటలు అర్థంలేనివిగా భావింపసాగారు. వీరి నిర్లక్ష్యంవల్లనే మెక్సికోలో కట్టుదిట్టమైన రాజకీయపక్షం తలెత్తలేకపోయింది. ఇక అధికార పోరాటంలో పాల్గొంటున్న ముఠాలను వారివారి నాయకుల పేర్లతోనే పిలిచేవారు. ప్రస్తుతం అధికారంలోఉన్న ముఠాను 'కరంజిస్టాలు' అనేవారు. తిరుగుబాటుదార్లలో ముఖ్యమైనవి 'జపటిస్టా', 'విల్లిస్టా' ముఠాలు ప్రతిముఠాలో సైనికులుగానీ, పితూరీ నాయకులుగానీ కార్యాచరణకు పూనుకునేవారు.

## కరంజా ప్రభుత్వం

1911 లో విప్లవం జరిగిన తరువాత దేశమంతటా గౌరవించబడి రాజ్యాంగ బద్ధమైన ప్రభుత్వాన్ని స్థాపించి చిరకాలము అధ్యక్షునిగా ఉండగలిగినవాడు కరంజా.

1916 లో రాజ్యాంగ పరిషత్తు తయారుచేసిన రాజ్యాంగాన్ని అనుసరించే రిపబ్లిక్ యేర్పడింది, తరువాత పార్లమెంటు తరచు సమావేశమై రాజ్యాంగబద్ధమైన శాసనాలు చేసేది; ప్రతినిధులసభ (Ecamber of Deputies) లో మతాలుండేవేగాని, వానిని పార్టీలు అనటానికి వీల్లేదు; వారిలో కరంజిస్టాలే అధిక సంఖ్యాకులు. దాని తర్వాత ముఖ్యమైన మతాలో లాయర్లు, ఉపాధ్యాయులు, డాక్టర్లు ఉన్నారు. వీరు సోషలిస్టులమని చెప్పుకొనేవారు; కాని వీరు ప్రతిపక్షవర్గంవారు కాదు. వీరిలో కొందరు కరంజిస్టాలమనికూడా చెప్పుకొనేవారు; అట్టివారిలోనివాడే స్పీకరైనాడు. మెక్సికో రాజ్యాంగంకూడా అమెరికా రాజ్యాంగం నమూనాలో ఉండేది. దాని ప్రకారం ప్రభుత్వం (కార్యనిర్వహణ) లో సభ్యులు పార్లమెంటు (శాసనసభ)లో ఉండటానికి వీల్లేదు. అందుచేత కార్యనిర్వహణశాఖ శాసనసభకు బాధ్యత వహించేదికాదు. ఈ పరిస్థితివలన పార్లమెంటులో కృత్రిమ వాతావరణం యేర్పడింది. ఏమైనా ప్రభుత్వానికి పూర్వంఉండే సైనిక స్వభావం తొలగిపోయింది. అందుకు నిదర్శనంగా సాధారణపౌరులే విద్య, ఆరోగ్య, ఆర్థిక, విదేశాంగశాఖల మంత్రులుగా నియమింపబడ్డారు.

మెక్సికోలో అతివాద రాజకీయాలుకూడా తాడూ, బొంగరం లేకుండా ఉండేవి. అతివాదుల్లో అరాచకవాదులు, సిండికలిస్టులు ప్రముఖులు; లాటిన్ అమెరికా రాజ్యాలన్నిటిలోనూ ఇంతే. పార్లమెంటులోని సోషలిస్టులకంటె భిన్నంగా మరొక సోషలిస్టుపార్టీ ఉండేది. దానికి నాయకుడు ఇగ్నేషియో శాంటిబానెజ్; బాగా చదువుకున్నవాడు, న్యాయవాది, వ్యక్తిగతంగా ప్రతినిధులసభ స్పీకర్ కు మిత్రుడు. ఒక రోజున - అంటే జర్మనులతో పరిచయం పునరుద్ధరింపబడక పూర్వమే సోషలిస్టుపార్టీ కార్యాలయానికి వెళ్ళాను; ఇగ్నేషియస్ బస పార్టీకార్యాలయంలోనే; సింహాన్ని దాని గుహలోనే పట్టేశాను! అక్కడక్కడ నెరసిన నల్లని పొడవైన గడ్డం - ఇగ్నేషియస్ సోషలిస్టు సిద్ధాంత ప్రవక్త అని చెప్పక చెబుతోంది. నేనొక విదేశీయుణ్ణిని, సాంఘిక విప్లవోద్యమంలో ఆసక్తిగలవాడననీ పరిచయం చేసికొన్నాను. 'ఎల్ ప్యూబ్లో'లో చక్కని వ్యాసాలు వ్రాసింది మీరేనా అని అడిగాడు. (పెద్దపెద్ద విశేషాలను వాడటం, స్పానిష్ భాషకు లక్షణం; వాటిని అక్షరాలా నమ్మనక్కరలేదు) నగరంలో అభివృద్ధికాముకులైన విద్యావంతులకు నన్ను పరిచయం చేయటానికి ఆ వ్యాసాలు ఉపకరించినట్లు గ్రహించాను.

## ఇండియాపై నా వ్యాసాలు

ఆ వ్యాసాలలో ఏమి వ్రాయాలనేది నాకొక పెద్ద చిక్కుసమస్య యైంది. ఈ సందర్భంలో లాలా లజపతిరాయ్ న్యూయార్కులో ఉపన్యసించిన సంఘటన గుర్తుకువచ్చింది. కాని మెక్సికో విద్యావంతులందరూ 'నిగూఢ ఇండియా'ను గురించి

తెలుసుకోవాలని కుతూహలంగా ఉన్నారు. అట్టివారికి ఇండియా, స్వప్న సౌందర్యాల దేశంగాదనీ దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం తాండవిస్తున్న దేశమనీ చెప్పటానికి ప్రయత్నించాను; ఎంతవరకు కృతకృత్యుణ్ణి ఐనానో అనుమానాస్పదం! నాటి వరకూ నాకు పరిచయమైన మధ్యతరగతి మెక్సికో విద్యావంతులందరూ లాముజేర్ మోడర్నా చుట్టూ మూగేవారే. వారినిబట్టి మెక్సికన్‌జాతి స్వభావాన్ని నిర్ణయించటం పొరబాటు. ఫ్రెంచి సాంస్కృతిక సాంప్రదాయాలపట్ల గల గౌరవంవల్ల విద్యావంతులు మిత్రమండలి దేశాలయందు అభిమానంగా ఉండేవారు. బ్రిటిష్ వ్యతిరేక భావాలపట్ల సానుభూతి చూపటం, తమ సాంస్కృతిక సాంప్రదాయాలకు ద్రోహము చేయటమేనని వీరిభావం. 'బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం, జర్మనులకు సహాయకారి' అనే వాదముతో లజపతిరాయికి తమ పత్రికల్లోనూ, వేదికలపైనా స్థానం నిరాకరించిన అమెరికా మితవాదుల ప్రవర్తనా ఇంతే. ఐతే మెక్సికోలో బ్రిటిష్ వ్యతిరేక ప్రచారానికి అర్థం లేదు. ధర్మం ఇండియాపట్లవున్నదని గ్రహించినప్పటికీ, మెక్సికన్లు ఇండియాకుసహాయం చేసేస్థితిలో లేరు. భారతీయులవలెనే మెక్సికన్లుకూడా దుర్భర దారిద్ర్యంలో మునిగి తేలుతున్నారు. భారతీయుల దారిద్ర్యాన్ని గురించీ అందుకు కారణమైన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దోపిడీ విధానాలనుగురించి మెక్సికన్లకు చెప్పటం 'మద్దెలతో రోలు మొరపెట్టుకొన్నట్లుం'టుంది. చైనాలో గ్రహింపలేకపోయిన నాకర్తవ్యాన్ని మెక్సికోలో గ్రహించాను. దేశప్రజల కష్టాలను గట్టెక్కించటానికి కేవలం జాతీయ స్వాతంత్ర్యమే సాధనం కాదు.

ఈ ఆలోచనాక్రమంవల్ల నా మనస్సులో ఒక ప్రశ్న జనించింది. 'గత వేయి సంవత్సరాలుగా ఇండియా తరచు విదేశ దండయాత్రలకు బలికావటానికి కారణమేమిటి?' ఈ ప్రశ్నకు సమాధానం పరిశీలించే ప్రయత్నంలో 'ఇండియా నిజస్వరూపాన్ని కనుగొనటం' జరిగింది. అప్పటికి, మార్క్సిజంతో నాకు బాగా పరిచయం లేదు. ఐనా పై పరిశోధనలో మార్క్సిజమే నాకు సహకరించింది. ఎల్ ఫ్యూబ్లో వ్యాసాల్లో ఇండియాచరిత్రను వర్గపోరాటం చరిత్రగా చిత్రించాను. బ్రిటిష్ సామ్రాజ్యవాదమూ, దేశీయ భూస్వామ్యము సాగిస్తున్న దోపిడీ విధానముయొక్క క్రూరఫలితమే భారతీయుల దారిద్ర్యం. కాబట్టి భారతీయ దాస్యవిముక్తికి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయటంతో సరిపోదు. విదేశ రాజకీయ పరిపాలనకు సాంఘిక పునాదియైన దేశీయ భూస్వామ్యపాలనా విధానాన్నికూడా నిర్మూలించాలి. తేలిన సారాంశం : ఇండియాలో కావలసినది, జాతీయ స్వాతంత్ర్యం మాత్రమేకాదు; సాంఘిక విప్లవం.

శాంటిబానెజ్‌కు తెలిసినంతవరకూ, ఇండియా నీ విధంగా మొట్టమొదట చిత్రించినది నేనే. అందుచే నా వ్యాసాల్లో అతనికి ఆసక్తి కలిగింది. ఇతర సోషలిస్టులు గూడా ఆ వ్యాసాలు చదివినట్లూ, తమపార్టీ సమావేశంలో ఉపన్యసించవలసిందిగా,

తనద్వారా నన్ను కోరినట్లు చెప్పాడు. వారి అభినందనలకు కృతజ్ఞత వెల్లడిస్తూ ఎల్ ప్యూబ్లో సంపాదకునిద్వారా నన్ను కలుసుకోవచ్చునని చెప్పాను. శాంటిబానెజ్ కది నచ్చలేదు. ఎల్ ప్యూబ్లో బూర్జువా పత్రిక; సోషలిస్టు ఐనవాడెవరూ బూర్జువాలనుండి సహాయం అర్థించగూడదనీ, నా వ్యాసాలు ఆ పత్రికలో ప్రచురించరాదనీ చెప్పాడు. పరిచయమైంది కాబట్టి తరచుగ కలుసుకొనటానికి నిర్ణయించాం. సాంఘిక విప్లవయోధులలోని అంతర్జాతీయైక్యత ఎన్నటికీ భగ్నంకాదు!

చొక్కాను కప్పుతున్న గడ్డం, మాసిన నల్లకోటు, కాలర్‌ను కాపాడుతున్న సెల్యూలాయిడ్ మెడపట్టీ, చిందరవందరగా ఉన్న పుస్తకాలూ, ఇతర వైజ్ఞానిక అవసరాలూ - వీటితో కూడిన ఆ వాతావరణం, గాలిమేడలు నిర్మిస్తున్న నా యువక ఆసక్తికీ, విశ్వాసానికీ మరింత దోహదం చేసినై. మార్క్సు సమక్షంలో ఉన్నట్లే భావించాను. నాలో నిజమైన సంచలనం కలిగింది. నాటికింకా కార్మికవర్గ చారిత్రక ప్రాశస్త్యంలోనూ, వారి అజేయశక్తిలోనూ నా విశ్వాసం ఊగిసలాడుతూనే ఉంది. మెక్సికోలో కారల్ మార్క్సు వ్యక్తిత్వ ప్రబోధంతో ఆ విశ్వాసం పునరుజ్జీవితమై బలపడింది.

'పార్లమెంటు స్పీకర్ సోషలిస్టుపార్టీ సభ్యుడేనా ?' అని అడిగాను. కార్మిక వాద పవిత్రతను సంరక్షకుడైన శాంటిబానెజ్ అదిరిపడ్డాడు.

'కాదు. మనది విప్లవపక్షం; పార్లమెంటరీ సంస్కరణ విధానంలో మనకు నమ్మకంలేదు.' అన్నాడు.

'కాని స్పీకరుతో మీకు పరిచయము ఉండవచ్చునుగా ?'

'ఒహో! డాన్ మాన్యూలా ? లేకపోటమేం ? పరిచయముంది; వృత్తిరీత్యా మే మిద్దరం సహచరులమే. బూర్జువారాజకీయవేత్తే; కాని మనిషి మంచివాడు. అతణ్ణి చూడాలనుకుంటున్నారా ?'

ఇంతకు ముందుగానే, నా విప్లవభావాలతో మంచి ప్రతిష్ఠ సంపాదించాను; ఇప్పుడు విప్లవ బాహ్యులైన రాజకీయవేత్తల మైత్రిపట్ల ఆసక్తితో నా ప్రతిష్ఠకు భంగం కలిగించుకొనటం మంచిదికాదు. ఐనా కార్మికవర్గ విప్లవ ప్రవక్త (కారల్ మార్క్సు) వలెనే, మెక్సికో మార్క్సులో గూడా అసహనమూ, ఈర్ష్యాద్వేషాదులూ లేవు. డాన్ మాన్యూలును తప్పక కలుసుకొమ్మనీ అందుకు తనే యేర్పాటుచేస్తాననీ చెప్పాడు.

## సోషలిస్టులతో తొలిసమావేశం

కొన్నిరోజులకు, సోషలిస్టుపార్టీలో 200 మంది సభ్యులు మాత్రమే ఉన్నారని తెలిసింది. వారిలో చాలమంది అరాజకవాదులే (Anarchists); శాంటిబానెజ్

పట్ల వారి కేమాత్రం సదభిప్రాయంలేదు. అతడు బూర్జువా అవకాశవాదుల నాయకుడనీ, పార్లమెంటులో ప్రవేశించాలనే ఆశతో రహస్య ప్రయత్నాలు చేస్తున్నాడనీ అనుమానించేవారు.

శాంటిబానెజ్‌తో సమావేశం జరిగిన రెండురోజులకు సోషలిస్టుపార్టీ కార్యవర్గ సమావేశానికి రమ్మని ఆహ్వానం వచ్చింది. ఉత్తరంలోని విషయాలకంటే, ఉత్తరం స్వరూపం చాల ముఖ్యంగా కన్పించింది. అది పాత టైపుమిషన్‌మీద ఎఱ్ఱ సిరాతో అచ్చువేయబడింది; సాంప్రదాయాలకు విరుద్ధంగా 'అభినందనలు-విప్లవం' అనే ముగింపు; నన్నభినందించిన వ్యక్తి సంతకం చదవటానికి ప్రయత్నించాను. పూజలతో చిత్రలేఖనా నైపుణ్యం మూర్తీభవించినట్లున్న ఆ సంతకాన్ని చదవటం సాధ్యం కాలేదు. అతి విచిత్రమైన ఈ సంతకంపద్ధతి మెక్సికోలో సర్వసాధారణం. మెలికలు, పూజలు లేనిదే ప్రముఖవ్యక్తి సంతకం కాదు! నా సంతకంలోని నిరాడంబరత తనకు చిన్నతనంగా ఉన్నట్లు చెబుతుండేవాడు నా కార్యదర్శి; నాకా పూజలు నేర్పటానికి ప్రయత్నించి విసిగిపోయాడు. 'నా సంతకంలోని లోపాన్ని నీ సంతకం భర్తీ చేస్తుంద'ని, అంటూ అతణ్ని సంతృప్తిపరుస్తూ ఉండేవాణ్ని.

సాయంత్రం శాంటిబానెజ్ వచ్చాడు. ఉభయులం కలసి సమావేశానికి వెళ్ళాం; సమావేశం పార్టీ కార్యదర్శియింట్లో జరిగింది. 'కలోనియా రోమా'కు దూరంగా నగరంలో ఒకమూల ఉన్నదాయిల్లు, నా దుస్తులను గురించి సందేహించాను. కార్మిక విప్లవనాయకులైన వీరు నన్నావరించిన బూర్జువా వాసనలను నిరసిస్తారేమో! దుస్తులను మార్చటం సాధ్యంకాలేదు గాని కలోనియా రోమాలో నన్ను పట్టుకున్న బూర్జువావాసన మాత్రం ఆ యింటిలోని కార్మికవాతావరణంలో పూర్తిగా మునిగిపోయింది. అన్ని నగరాల్లోవలెనే మెక్సికోలోగూడా మంచీ, చెడూ; అందం, వికారం; ఐశ్వర్యం, దారిద్ర్యం-అనే విభాగాలున్నై. మానవుడు సృష్టించిన దారిద్ర్య వికార స్వరూపం ప్రకృతి నవ్వుమోమును చూచి హేళన చేస్తున్నదా అన్నట్లు సహజముగా ఉన్న పరిసరాలవల్ల ఈ వ్యత్యాసాలు స్పష్టంగా కన్పిస్తై.

సోషలిస్టుపార్టీ కార్యదర్శి వృత్తిరీత్యా 'కూలిబానిస' (Wage slave) కాదు; అతడొక ముద్రణాలయాధికారి. తన యింట్లోనే ఒకగదిలో ఆ ముద్రణా యంత్రాన్ని పెట్టి నడిపిస్తాడు. ఆ గదిలో మేముగాక యింకా ఇద్దరు వ్యక్తులు హాజరైనారు. కార్యదర్శి వయస్సు నలుబది సంవత్సరాలు లోపుగా ఉంటుంది; దృఢకాయుడు; సహజగాంభీర్యంతో, నూతనవ్యక్తికి స్వాగతమిచ్చి, నాటి "లాలూషా" చేతికిచ్చాడు. అది నాలుగు పేజీల పార్టీపత్రిక; పూర్తిపేరు "లలూషా డి లాష్ క్లాసెస్" (వర్గపోరాటము). అందరి చేతుల్లోనూ పత్రికలున్నై. అప్పటికి సాధారణ సంభాషణల్లో పాల్గొనటానికి తగిన స్పానిష్ భాషాజ్ఞానంమాత్రమే సంపాదింపగల్గాను.

ఆ పరిజ్ఞానంతో ఈ పత్రిక చదవటానికి - డిక్షనరీ సాయంతో నే-కనీసం కొన్నిగంటలు పడుతుంది. ఐనా మర్యాదకోసం పత్రిక పేజీలు తిరగవేశాను!

నాఅవస్థ గ్రహించాడు కాబోలు శాంటిబానెజ్ ప్రసంగం ప్రారంభించాడు. ఆ వృద్ధునకు కొన్ని బూర్జువామర్యాదలు తెలుసు! నన్ను పరిచయంచేస్తూ ఒక సుదీర్ఘమైన ఉపన్యాసమిచ్చాడు. కాని నా ఆశయం అక్కడ చేరినవారిని గురించి తెలుసుకోవాలని. కార్యవర్గంలో మొత్తం తొమ్మిదిమంది సభ్యులు. వారిలో శాంటిబానెజ్, మరొక ఉపాధ్యాయుడూ వినా మిగిలినవారందరూ కల్తీలేని కార్మికులు. వారందరూ మెక్సికన్ రక్తసాంకర్యానికి మంచి ఉదాహరణలు. అది సాధారణ సమావేశం కాదనీ, నన్ను కలుసుకొనే నిమిత్తమే సమావేశమైనారనీ శాంటిబానెజ్ చెప్పాడు. నా కృతజ్ఞత వెల్లడిస్తూ విప్లవ సందర్భంలో నా శక్తికొలది సహాయం చేస్తానని వాగ్దానం చేశాను. ప్రొలిటేరియన్ దుస్తులు ధరింపనందులకు క్షమాపణ వేడుకొంటున్న సూచనగా నా దుస్తులవంక అప్రయత్నంగా చూచాను. వారిలో ఒక మధ్యవయస్కుడు లేచాడు. మనిషి హుషారుగావున్నా గిరజాలు తిరిగిన జుట్టువల్ల కొంచెం భయంకరంగావున్నాడు. నా దగ్గిరకువచ్చి భుజంమీద చెయ్యివేసిఅన్నాడు. "నీ దుస్తులనుచూచి నీవు సిగ్గుపడనక్కరలేదు. ఇలాంటివి ధరించాలనే మా అందరి కోరిక;" అందరూ నవ్వారు. బెరుకుగానున్న నాకు ఉల్లాసం కలిగించే ఉద్దేశ్యంతో అందరూ నాచుట్టూ చేరారు; నేను కూడా వారిలో కలిసి పోయాను.

సమావేశం పూర్తికాబోయే ముందు అడిగాను: "దగ్గిర హోటలుకు వెళ్ళి కాఫీ తీసుకొందాం?" వారందరూ నా ఆహ్వానాన్ని ఆమోదించారు; నాకు చాల సంతోషమైంది. 'ఎల్ చినో'కు వెళ్ళాం. అది చిన్న హోటలు. చైనావారిది. రష్యాకు వెలుపల మొట్టమొదటి కమ్యూనిస్టుపార్టీకి పుట్టినిల్లు ఈ హోటలే! అంటే ఒక సంవత్సరం తరువాత కమ్యూనిస్టుపార్టీ స్థాపించాలనే అభిప్రాయం 'ఎల్ చినో'లోనే కలిగింది; నా మార్క్సిజానికీ సోషలిస్టుపార్టీలోని అరాచకవాదుల విశ్వాసాలకూ, సిండికలిస్టుల విశ్వాసాలకూ మధ్య నెలల తరబడి తీవ్ర సంఘర్షణ జరిగింది. మా వాదనలు తెల్లవారే వరకూ జరిగేవి; వెంటనే 'ఎల్ చినో'కు వెళ్ళేవాళ్ళం. హోటల్ యజమాని నిద్రలేచి, ఆగ్రహం నటించేవాడు; కాని తప్పకుండా వేడివేడి రొట్టె కాఫీ యిస్తుండేవాడు.

మార్క్సిజానికి, అరాచక సిండికలిస్టు వాదానికి జరిగిన చిరస్మరణీయమైన ఆ యుద్ధం 'ఎల్ చినో'ను మొదట దర్శించిననాడే ప్రారంభమైంది. కాఫీ సేవిస్తున్న అతిథులలో కొందరు తీవ్రవాదనలో మునిగిపోయారు; ఒక వార్తాపత్రిక వారి చేతులు మారుతోంది. నాకు అర్థం కాలేదు. ఆ వివాదానికి కారణాన్ని వివరిస్తూ శాంటిబానెజ్ నాతో అన్నాడు: "క్వారటారో రాజ్యాంగంలోని 17వ నిబంధనపై

మెక్సికో, అమెరికాల మధ్య తగాదా వచ్చింది; ఈ నిబంధన ననుసరించే మెక్సికో ప్రభుత్వం భూగర్భసంపదను జాతీయం చేసింది; ఆ తగాదా శాంతియుతంగా పరిష్కారం కాగల అవకాశం నశించింది; పరిస్థితి విషమిస్తున్నది. అమెరికా సైనికంగా మెక్సికోలో జోక్యం కలిగించుకొనే ప్రమాదం సమీపించింది" అని ఆ పత్రికలో ప్రచురింపబడింది.

నేనడిగాను "ఆ ప్రమాదమే తటస్థించితే సోషలిస్టు లనుసరించే విధానం యేమిటి? దాన్ని నివారించటానికి సోషలిస్టులు చేయగలదేమిటి?"

కార్యదర్శి జోక్యం కలిగించుకొని తీవ్రంగా మాట్లాడాడు: "బూర్జువా ప్రభుత్వాల మధ్య పోరాటంలో కార్మికవర్గం చేయగలిగిన దేముంది? దానితో మాకే మాత్రం సంబంధం లేదు."

"సైనిక జోక్యం మెక్సికో స్వాతంత్ర్యానికే ముప్పు తెచ్చే యుద్ధంగా పరిణమించినప్పుడు కూడా సోషలిస్టులు నిర్లక్ష్యంగా ఉండగలరా?"

"ఔను" అని బిగ్గరగా అందరూ అరిచారు.

"ఇది సోషలిజమేనా?" అని నాకు ఆశ్చర్యం కలిగింది. కాని నేను వారితో యుద్ధానికి సిద్ధంగా లేను.

ఎక్కడి వారక్కడ వెళ్ళిపోయారు. దారిలో శాంటిబానెజ్ అన్నాడు: "అదే మాతో ఉన్న చిక్కు; వారంతా అరాచక సిండికలిస్టులు." ఆ వృద్ధుని కంఠంలో విషాదం, నిరాశా ధ్వనించినై. మాటల్తో అతన్ని సంతోషపరచలేక పోయాను. కాని సోషలిజంకోసం పోరాటం సాగించాలని మాత్రం నిర్ణయించాను.

## మెక్సికోలో అమెరికా అతివాదులు

శాంటిబానెజ్ ఇంట్లోనే, ఇద్దరు అమెరికన్ అతివాదయువకులు తటస్థపడ్డారు. యుద్ధంలో చేరగానే, అమెరికాలో నిర్బంధ సైనికశిక్షణ అమలు జరిపారు. ఆ ప్రమాదం తప్పించుకొనే ఉద్దేశ్యంతో, శాంతివాదులు, అరాజక సిండికలిస్టులు, వివిధ రకాల సోషలిస్టులు వందలకొలది మెక్సికోకు పారిపోయి వచ్చారు. తమ తమ భావాలకు, స్వభావాలకు అనుగుణంగా కొందరు జపాటిస్టాలతో చేరాలనీ, కొందరు 'యుకటాన్ భూతల స్వర్గాన్ని' చేరాలనీ ఆశించారు. కొందరు ఎక్కడో ఒకచోట తమ అదృష్టాన్ని పరీక్షించుకోటానికి నిశ్చయించారు. ఐనా అమెరికా అతివాద శరణార్థులలో చాలామంది ముఖ్యనగరంలోనే గుమిగూడారు. వీరిని 'బద్ధకస్తు' లంటూ నీచంగా పిలిచేవారు.

వీరిలో వీరికి, రాజకీయ సిద్ధాంతాలలోనూ సాంఘిక ఆశయాలలోనూ వ్యత్యాసాలున్నై. కాని వీరు అమెరికాలోని నామపక్ష పత్రికలకేగాక కళలకూ, సాహిత్యానికీ ప్రాతినిధ్యం వహించారు. వీరిలో మారిస్ బేకర్ కవి. వ్యంగ్య చిత్రకారుడు; ఇర్విన్ గ్రాన్‌విచ్ నవలారచయిత; ఇతడే తర్వాత మైకేల్ గోల్డ్ అనే పేరున ప్రసిద్ధి పొందాడు. హెన్రీగ్లిన్ టెన్‌కాంప్ చిత్రకారుడు; కారల్ బీల్సు పత్రికా రచయిత; తర్వాత మెక్సికో, స్పెయినులపై గ్రంథాలు వ్రాసి పేరు పొందాడు; ఇంకా సుప్రసిద్ధులెందరో ఉన్నారు. మాక్సు ఈస్ట్‌మన్ సంపాదకత్వం క్రింద వెలువడుతున్న 'The Masses' (ప్రజానీకం) అనే రాడికల్ పత్రికకు తరచు ఈ 'బద్ధకస్తులు' వ్రాస్తూ ఉండేవారు.

చార్లీ ఫిలిప్సు కూడా ఈ బద్ధకస్తులలోనివాడే. చార్లీని, శాంతిబా వెజ్ ఇంట్లోనే కలుసుకున్నాను. చార్లీ కొలంబియా విశ్వవిద్యాలయ ఆవరణలో శాంతి ప్రదర్శనాలు జరిపి, చాలా ప్రసిద్ధుడైనాడు. ఆ సందర్భంలోనే చార్లీ సహాధ్యాయినితో బాటు అరెస్టయినాడు; ఆమె విశ్వవిద్యాలయంలో ఒక వృద్ధ ఆచార్యుని కూతురు. ఇద్దరూ పారిపోయి మెక్సికో నగరంలో కలుసుకున్నారు. ఆ ఉద్రిక్త పరిస్థితులలోనే వారు వివాహంకూడా చేసుకున్నారు. అతని కీర్తికి తగినట్లే, చార్లీ పట్టి 'వాగుడుకాయ'; నన్ను గురించి న్యూయార్కు నగరంలోనే విన్నాడట. ఇక్కడ కలుసుకున్నందుకు చాల సంతోషం వెలిబుచ్చాడు. చార్లీ, నేను మిత్రుల మైనాం. మరుక్షణంనుండి అతని మిత్రులను, ముఖ్యంగా అతని భార్య ఎలినారును కలుసుకోవాలని తొందరించాడు. ఈలోగా, శాంతివాదానికి స్వస్తిచెప్పడమేగాక, చార్లీ వర్గపోరాట సిద్ధాంతాన్ని బలపరచసాగాడు. కాని ఈ రాజకీయ సిద్ధాంత పరిణామం జరుగుతుండగానే, ఎలినార్ అతణ్ణి విడిచి పెట్టింది. ఐనా, ఎలినార్ ప్రేమను తాను కోల్పోలేదంటూ ఉండేవాడు. బహుశా ప్రేమికుని హృదయంలోని గాయానికి ఈ భావనే మందుగా ఉపకరిస్తుందేమో!

చార్లీ, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు నాతో బాటు మెక్సికో ప్రతినిధిగా హాజరైనాడు. తరువాత మాన్యూల్ గోమెజ్ అనే పేరుతో అమెరికా (U. S. A.) కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖ పాత్రను నిర్వహించాడు.

చార్లీ ఆహ్వానంపై, ఇతర మిత్రులను ఒక హోటల్లో కలుసుకున్నాను. ఇర్విన్ గ్రాన్‌విచ్, మారిస్ బేకర్, హెన్రీగ్లిన్ టెన్‌కాంప్ హాజరైనారు. ఎలినార్ అతిథి సత్కార బాధ్యత వహించింది. ఎలినార్ అందానికి ఆమె గంభీరమైన, మనోజ్ఞమైన స్వరం మెరుగులు దిద్దేది. ఆమె కంఠస్వరం సన్నాకర్షించినట్లు చార్లీ గ్రహించాడు. తాను ముందు ఆమె కంఠస్వరాన్ని ప్రేమించి తరువాతనే ఆమెను

ప్రేమించాడట ! ఆకర్షణీయమైన ఆ స్వర గాంభీర్యంలో ఏవో నిగూఢ రహస్యా లున్నట్లు తోచేది. ఆమె చాల నిదానస్తురాలు. మంచి సంస్కారి. ఆమె ప్రేమకు చార్లీ తగడేమో ననిపించేది.

మొట్టమొదటి సమావేశంలోనే, అమెరికా అతివాదులందరిలో ఇర్విన్ గ్రీన్ విచ్ పట్ల నాకు అభిమానం యేర్పడింది. న్యూయార్కు నగరంలోని మురికిపేటల్లో నివసించే నిరుపేద యూదుకుటుంబంలో జన్మించాడు. చిన్నతనంలో అనుభవించిన పేదరికంవల్ల ఇర్విన్‌కు అరాజక సిండికలిస్టుల విధ్వంసకవాదం బాగా వంటబట్టింది. అమెరికాలో వీరిని ప్రపంచ పారిశ్రామిక కార్మికులు లేక 'వోబ్లీ' లు అనేవారు. నాటికే విప్లవాత్మక నవలా రచయితగా ఇర్విన్ మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించాడు. న్యూయార్కు మురికిపేటల్లోని దుర్భర జీవితాన్ని చిత్రిస్తూ గోర్కీ 'రాత్రి సదనం' (Night Lodging) ను పోలిన గొప్పనవల వ్రాయాలని అతని ఆశయం. నిరాశా వాదిగా ఆకర్షణీయమైన వ్యక్తిత్వం గలవాడు. క్రమంగా చాల సన్నిహితులమైనాం. మా గాఢమైత్రికి ఒక నిదర్శనం : ఇండియాలో నా బాల్యదశలో జరిగిన ఒక సంఘ టనను అతనికి చెప్పాను. అది ఆధారంగా ఇర్విన్ ఒక కథానిక వ్రాసి మా ఉభయుల పేర్లతో, అమెరికా సారస్వత పత్రికలో ప్రచురించాడు.

మారిస్ బేకర్ గర్విష్టి; కాని స్నేహపాత్రుడు. రాజకీయంగా అతివాద సోషలిస్టుభావాలు కలవాడు. 'బద్ధకస్తు'ల్లో చాలవరకు ఐరోపా యూదుజాతికి సంబంధించినవాడే. ఒక్క హెన్రీ గ్లిన్ టెన్ కాంప్ మాత్రం డచ్చిజాతివాడు. అత నిలో తక్కువజాతి రక్తంలేదు. ప్రథమ సమావేశంనుండీ ఎలినారును ఆకర్షించ టానికి ప్రయత్నించాడు. యూదు సంబంధాలనుండి ఆమెను ఉద్ధరించాలనే సంకల్పం కాబోలు ! చివరకు ప్రేమోద్రేకంకంటె రక్తసంబంధమే బలీయమైనదని స్పష్టమైంది! ఎలినార్ చార్లీని విడిచి హెన్రీని వివాహమాడింది.

అమెరికన్ అతివాదులతో కలిసి ఒక ఇటాలియన్ హోటల్లో భోజనంచేశాను. నేను 'సారాయిని' తిరస్కరించట వారందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. నా వాటా కూడా ఇర్విన్ ఖాళీచేశాడు. ఆసందర్భంలోనే మైకానికీ, ఉల్లాసానికీ గల తేడాను ఇర్విన్ వివరించి చెప్పాడు. అతని మాటల్లో నిజం ఉన్నదనిపించింది. నా ఛాందస భావాల కవచం పూర్తిగా విచ్ఛిన్నమైంది. ఐనా ఆ రోజున త్రాగలేకపోయాను; ముందుముందు త్రాగుతానని మాత్రం వాగ్దానం చేశాను.

## ఎల్ హెరాల్డో

ఆ విందులోనే చార్లీ మంచి వర్తమాన మొకటి చెప్పాడు. ఎవరో మెక్సికన్ జనరల్ ఒక దినపత్రికను ప్రచురించటానికి సంకల్పించాడు. ఆ పత్రిక ఇంగ్లీషు విభాగానికి సంపాదకుడు కావాలి. ఇంగ్లీషు పత్రికను నడిపే సామర్థ్యంగల మెక్సికన్

లభించటం సాధ్యం కాదు. మెక్సికనుల క్రింద పనిచేయటానికి ఇంగ్లీషువారు గాని, అమెరికన్లుగాని సమ్మతింపరు. అందుచే ఆ పదవిని చార్లీకి ఇస్తామనిఅన్నారు. చార్లీ ఆ పదవికి సమ్మతించటమా? మానటమా! ఆర్థికంగా 'బద్ధకస్తుల' కూటమి చాల ఇబ్బందుల్లో ఉంది. అందుచే ఈ ఉద్యోగం వారి పాలిటి పెన్నిధేనని చెప్పవచ్చు. కాని పొట్టకూటికై సిద్ధాంతాలకు స్వస్తి చెప్పకూడదన్న నా అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు. ఐతే పత్రికను స్థాపించే జనరలు ఎవరో, పత్రిక ఉద్దేశ్య మేమిటో స్పష్టంగా తెలుసుకోవాలని నిర్ణయించాం.

క్రమంగా పత్రికను స్థాపించేది జనరల్ ఆల్వరాడోఅని తెలిసింది. రాబోయే ఎన్నికల్లో అతడు అధ్యక్ష పదవికి పోటీ చేస్తున్నాడు. యుకటాన్ రాష్ట్రంలో సోషలిస్టు ప్రయోగాల్లో ఆల్వరాడో సాధించిన విజయాలను ప్రచారం చేసి, ప్రజాభిప్రాయాన్ని అతనికి సుముఖంగా మలచటమే పత్రిక ప్రధానలక్ష్యం. కాబట్టి పత్రికది సోషలిస్టు స్వభావమే. ఐతే మెక్సికో రాజకీయ జీవితంపై అమెరికను భావాల ప్రభావం ఎక్కువగానే ఉంటున్నది. మెక్సికోపట్ల అమెరికను అభిప్రాయాన్ని రూపొందించేవారు మెక్సికోలో నివసిస్తున్న అమెరికన్లే. అందుచే మెక్సికోలోని అమెరికన్లు సానుభూతితో ఆల్వరాడోను బలపరచేటట్లు చేయటానికే పత్రిక ఇంగ్లీషు విభాగం ఉద్దేశింపబడింది.

అమెరికా సానుభూతి సంపాదించటమే ఆశయంగా నెలకొన్పబడిన పత్రికా బాధ్యతను, అమెరికా పాలకవర్గనిరంకుశత్వంపై కత్తిగట్టిన అతివాదులు సహించటం సమంజసంకాదనీ, అది వారి సిద్ధాంతాలకే విరుద్ధమనీ చాలమంది భావించారు. ఈ సందర్భంలో, నేను రెండు విషయాలు సూచించాను. అందు మొదటిది: ఇంగ్లీషు విభాగం పత్రిక సోషలిస్టు ఆశయాలకు విరుద్ధంగా ఉండదనీ. రెండవది: ఇంగ్లీషు విభాగ సంపాదకునకు తగినంత స్వేచ్ఛ ఉండకపోదనీ. ఐనా జనరల్ ఆల్వరాడో ఆశయా లేమిటో స్పష్టంగా తెల్సుకొంటానని వారికి హామీ ఇచ్చాను. ఈలోగా చార్లీ తరపున నేనూ మరికొందరు మిత్రులు అతని ఉద్యోగానికి సమ్మతి తెలియజేయాలి.

నేను యుద్ధమంత్రిని కలుసుకొన్న కొద్దిరోజులకే, అనుకొన్నట్లుగా, ఆల్వరాడో రాజధానికి వచ్చాడు. అతణ్ణి కలుసుకొని డాక్టర్ జోర్డాన్ ఇచ్చిన పరిచయ లేఖను మంత్రి తీసుకొన్నట్లు చెప్పాను. ఆల్వరాడో హృదయంగమంగా నవ్వాడు: "తన క్రింది యుద్యోగికి అమెరికాలో ఎట్టి సంబంధాలున్నావో సర్వసైన్యాధ్యక్షుడు తెలుసుకోవాలని ప్రయత్నించాడు; ఆ జాబులో నాకు విరుద్ధమైనదేదీలేదు. ఆ జాబు మీకేకాదు, నాకూ ఉపయోగకారియే. నిజంగా శాంతివాదుల సిద్ధాంతాలకు జోహారు చేయాలి. మెక్సికోలో అమెరికా జోక్యాన్ని ప్రతిఘటిస్తారు. అందుచేతనే వారు మెక్సికో మిత్రులు" అన్నాడు ఆల్వరాడో. కరంజా మిత్రకోటిలోని వాడు

కాదని, అధ్యక్ష పదవికి అతడు పోటీచేయబోతున్నాడనీ తెలియటంతో కరంజా అల్వారాడోలమధ్య వైషమ్యాలు జనించినై. ఆ రోజుల్లో రాజకీయ కుట్రలను గురించి మెక్సికోలో బహిరంగంగానే మాట్లాడుకొనేవారు.

ఎల్ ప్యూబ్లో సంపాదకుని ద్వారా ఈ క్రింది సమాచారం సేకరించాను: అల్వారాడోతోబాటు అధ్యక్ష పదవికి పోటీచేయటానికి మరొక అభ్యర్థికూడా తయారైనాడు. అతడు జనరల్ ఓబ్రెగాన్; మెక్సికో ప్రముఖ రాజకీయ నాయకులలో ఇతనిది 'ఊరంతా ఒకదారి, ఉలిపికట్టె మరోదారి' అనే రకం. బహిరంగంగానే అమెరికా సహాయాన్ని పొందుతూ వుండేవాడు. 1920 లో సైనిక తిరుగుబాటు జరిపి తాత్కాలికంగా కరంజాను పల్టీ కొట్టించాడు. అందుచే తనకు ప్రత్యర్థి ఓబ్రెగాన్ అని అల్వారాడో అభిప్రాయం. ఇప్పుడీ పత్రిక స్థాపించటం ఓబ్రెగాన్‌పై దండయాత్రకే. సైనికవాదాన్ని ఖండించటం, సాధ్యమైనంత త్వరలో పౌరపాలనను పునరుద్ధరించాలని కోరటం పత్రిక ప్రధాన కార్యక్రమం. అంటే ఈ పత్రిక మితవాద ప్రజాస్వామ్య అభిప్రాయాలకు దర్పణంగా పనిచేస్తుంది; దీని పేరు 'ఎల్ హెరాల్డోద మెక్సికో'. ఓబ్రెగాన్‌పై యుద్ధం సాగిస్తుంది గాబట్టి ఎల్ హెరాల్డోకు అధ్యక్షుడు కరంజా సహాయంకూడా లభించవచ్చు. ఐతే ఇంగ్లీషు విభాగం మాత్రం మెక్సికో సమస్యల యదార్థ స్వభావాన్ని అమెరికా ప్రజలకు నచ్చజెప్పటం శ్రేయస్కరం.

అసలు విషయం తెలిసినమీదట, చార్లీ ఉద్యోగం అంగీకరించటానికి, అతివాద బద్ధకస్తుల కార్యనిర్వాహకవర్గం సమ్మతించింది. నేను మన్రో సిద్ధాంతంమీద కొన్ని వ్యాసాలు వ్రాయటానికి అంగీకరించాను. పేరుకు మాత్రమే చార్లీగాని, సమర్థులైన 'బద్ధకస్తు'లంతా కలిసి పనిచేయటంవల్ల 'ఎల్ హెరాల్డో' అచిరకాలంలోనే ప్రజాభిమానాన్ని చూరగొనగలిగింది. తెలివైన కార్టూనులు, పద్యాలు, కథానికలతో సర్వజనాదరణ పొందింది. సంపాదకీయాల్లో మాత్రం రాజకీయాభిప్రాయాలు వెల్లడింపబడేవి. మొదట్లో శాంతి వాదానికి ప్రచారం, తరువాత క్రమంగా అతివాద సిద్ధాంతాలు తేనెలో పొదిపిన చేదుమాత్రల్లాగా ప్రజలలో ప్రవేశపెట్టింది. మొదట్లో ప్రధాన సంపాదకుడు చార్లీ అతివాద ధోరణికి అధికారపూర్వకంగా అసమ్మతి తెలిపేవాడు. కాని క్రమంగా పత్రిక మొత్తం, ఇంగ్లీషు విభాగ విధానానికే తిరిగింది. ఎల్ హెరాల్డో అతివాద అభిప్రాయానికి ప్రచారక సాధనమైంది.

## లాటిన్ అమెరికా - మన్రోసిద్ధాంతం

### విప్లవకారుని కళాభిరుచులు : కాలక్షేపాలు

మెక్సికో వచ్చిన వెంటనే ఒక స్పానిష్ ఉపాధ్యాయుని కుదుర్చుకున్నాను. ఉపాధ్యాయుని ఎన్నుకోవటంలో ఎల్ ప్యూబ్లో సంపాదకుడు సహాయం చేశాడు.

నా గురువు వృద్ధుడు; ఎస్కులా నేసనల్ (విశ్వవిద్యాలయం) లో స్పానిష్ భాషను బోధిస్తూ ఉండేవాడు. ఇండియాలో ప్రొఫెసర్ హోదాకు సమానం అతనిహోదా. కాని మెక్సికోలో ఉన్నత పాఠశాలలనే కాలేజియోస్ అంటారు. వానిలోని ఉపాధ్యాయులే ప్రొఫెసర్లు. కాలేజీలను ఎస్కుయెలాస్ (Schools) అంటారు. వీరిలో వేరువేరు శాఖలకు అధిపతులను (Heads of departments) మాస్ట్రొస్ అనటం ఆచారం. కాబట్టి మా స్పానిష్ ఉపాధ్యాయుడు యూనివర్సిటీలో సీనియర్ లెక్చరర్ గా పనిచేస్తున్నా అతనిది పేరులేని హోదా. అతడు చాల నిరాడంబరుడు. ఆదాయంకూడ స్వల్పమే. కాని అభిప్రాయాలు మాత్రం పురాణకాలంనాటివి. సర్వదా డయజ్ కాలపు స్వర్ణయుగాన్ని గురించి గొప్పగా చెబుతూవుండేవాడు. విప్లవాలు చేసిన విధ్వంసాన్ని తెగనాడుతూ ఉండేవాడు. విప్లవనాయకులను నిరసించేవాడు. కాని రాజకీయాలంటే అతనికి శ్రద్ధలేదు. అతనిది వేదాంతులు చెప్పే 'తామరాకుమీది నీటిబొట్టు' లాంటి స్వభావం.

విప్లవాల ఫలితంగా దేశం సాంస్కృతికంగా దిగజారిపోయిందని బాధ పడుతూ ఉండేవాడు. అందుకు నిదర్శనంగా నిర్మాణం పూర్తిగాకుండా ఆగిన నాటకశాలను చూపించేవాడు. చలికాలంలో మెక్సికోనగరానికి ఐరోపా ధనికులు కాలక్షేపానికి వస్తూవుండేవారు. వారితోబాటు నాటక సమాజాలు, నాట్యబృందాలు వచ్చేవి. మెక్సికోనగర వైభవాన్ని ఇనుమడింపజేసే ఉద్దేశ్యంతో డయజ్ పది మిలియనుల పీసోల వ్యయంతో పాలరాతి ప్రదర్శనశాలను నిర్మించటానికి సంకల్పించాడు. ఐరోపాలోని సుప్రసిద్ధ ప్రదర్శనశాలకిది యే మాత్రం తీసిపోగూడదని అతని ఆశయం. వాస్తు ప్రవీణులను, పనివాండ్రనూ ఇటలీదేశంనుండి పిలిపించాడు. కాని, నిర్మాణం సగంకూడా పూర్తికాకపూర్వమే విప్లవం ప్రారంభమైంది. నగరం మధ్య ఉద్యానవనం అందులో ప్రదర్శనశాల గతించిన డయజ్ స్వర్ణయుగానికి చిహ్నంగా నేటికీ ఉన్నై. ప్రసిద్ధ నాటకసమాజాలుకానీ, నాట్యబృందాలుగానీ మెక్సికో రావటమే మానుకొన్నై.

ఎద్దు పోరాటం మెక్సికోలో జాతీయక్రీడ. దీనికై డయజ్ ప్రభుత్వం నిర్మించిన గుండ్రని స్టేడియం ప్రపంచమంతటిలో పెద్దది. అందులో 35 వేలమంది సులభంగా కూర్చోవచ్చు. ఎద్దుపోరాటం క్రూరమైనదనీ, అనాగరికమనీ కరంజా ప్రభుత్వం బహిష్కరించింది. ఈ ప్రదర్శనశాల నిర్మాణము పూర్తికాకపోవటం, సాంస్కృతిక తిరోగమనానికే నిదర్శనమైతే, ఎద్దుపోరాటం బహిష్కరణ ప్రగతిశీలమైన సంస్కరణ! ఐనా, ఈ సత్యాన్ని మా స్పానిష్గురువులాంటివారు గుర్తింపలేరు. సోమరి ధనికవర్గానికి చెందిన ప్రాతయుగప్రతిష్ఠలు మాసిపోతున్నవని వాపోయే ప్రబుద్ధులు ప్రజాస్వామ్య భవిష్యత్తును నిర్మించటానికై జరిగే కృషిని అభినందించగలరా? ఐనా, డయజ్ నియంతృత్వంతో బాటే మెక్సికో సంస్కృతికూడా అంతరింపలేదు అనటానికి 1918 ప్రారంభంలో ఒక సంఘటన జరిగింది. ఇటాలియన్ నాటక సమాజం, రష్యన్ నాట్య

బృందం మెక్సికో వచ్చారు. వారికోరకై ఉన్నట్లుండి, ప్రదర్శనశాల నిర్మాణం పూర్తిచేయటం సాధ్యంకానిపని. ఈ సదవకాశాన్ని ప్రజలు కోల్పోవటంకూడా ప్రభుత్వానికి సమ్మతం కాదు. అందుచేత, ఎద్దు పోరాటానికై నిర్మింపబడిన స్టేడియంలో ప్రదర్శనలకు ఏర్పాట్లు జరిగినై. స్టేడియం జనంతో కిటకిటలాడి పోయింది.

కార్మన్ ప్రదర్శించినప్పుడు బాలెట్‌ను మొదటిసారిగా చూచాను. ఈ స్టేడియంలో ప్రదర్శించటంవల్ల దానికొక ప్రత్యేకత గూడా వచ్చింది. బ్రహ్మాండమైన గ్రీకు ప్రదర్శనశాలలలో 30 వేలకు పైగానున్న ప్రేక్షకులకు తన పాటలతో తన్మయ పరిచాడు కారుసో; అది ఒక మహత్తరమైన అనుభూతి. ఇంతటి సామర్థ్యం మానవ కంఠస్వరానికి ఉన్నదని నే నెన్నడూ ఊహించలేదు. కారుసో కంఠస్వరదర్పం ముందు పావులోవా నృత్యమూ, ఇతర ప్రదర్శనలు దివిటీముందు దీపాలైనై. కళను గురించి నా అభిప్రాయాలు ఇంకా చాలా పురాతనమైనవే!

బలిష్ఠుడొకడు, సన్నని మొలగుడ్డతో రంగస్థలంమీద కుప్పిగంతులు వేయటంలో ఉండే కళ యేమిటో నాకు బోధపడలేదు. దీన్ని గారడీ నైపుణ్యం అనటమే సమంజసం. ఐతే సర్కస్‌లో ఇంతకంటె మంచి ప్రదర్శనలే చూడవచ్చుగదా? నిజానికి బాలెట్ విషయంలో నా కళాభిరుచులు సంస్కారాన్ని ప్రతిఘటించినై. రష్యన్ ప్రదర్శనల్లో మూడవ రంగంలోని బాలెట్‌ను మాత్రమే పూర్తిగా చూడగలిగేవాణ్ణి. అక్కడకూడా నన్ను ఆకర్షించింది నాట్యం కాదు; మునివ్రేళ్ళమీద స్త్రీలు చక్రభ్రమణం చేయటమే ఆ నాట్యం. ఉత్తేజకరమైన ధ్వనుల సమన్వయంతో ఏర్పడ్డ సంగీతమే ఆ రంగంలో నాకు బాగా నచ్చిన విషయం.

నా స్పానిష్ గురువుచదరంగంలో మెక్సికో నేషనల్ ఛాంపియన్. అతనితో పరిసమానమైన ఉజ్జీ డాన్ మాన్యూల్-ప్రజాప్రతినిధి, సభాధ్యక్షుడు. ఇండియాలో చదువుకొంటున్న రోజుల్లో చదరంగం ఆడుతూ ఉండేవాణ్ణి. ఇంట్లో కూర్చుని ఆడే ఆటలలో చదరంగమే ఉత్తమమైనదని నా ఉద్దేశం. పేకాట (Cards) వట్టి దండుగ. ఐతే మా గురువుగారు గర్విష్ఠికాదు. తాను నేషనల్ ఛాంపియన్ అయినా, నావంటి అజ్ఞానితో ఆడటం తనకు గౌరవభంగం అని భావించక పోవటం నాఅదృష్టం. స్పానిష్ చదువు పూర్తి అయిన తరువాతకూడా, మే మిద్దరం తరచుగ కలుసుకుంటూ ఉండేవాళ్ళం. అది మాకు సరదాగా ఉండేది. ఇలా కలుసుకొన్నప్పుడే చదరంగం చదువు ప్రారంభించాను. అప్పుడప్పుడు డాన్ మాన్యూలు కూడా వస్తూ ఉండేవాడు. ఆ మహారథు లిద్దరు తమ బుద్ధిబలాలతో కుస్తీపట్టటం చూస్తూ ఆట నేర్చుకొనటం నాకు లభించిన మహదావకాశం. వీరిద్దరిలో డాన్ మాన్యూలు మేధావి. ప్రపంచ ఛాంపియన్ కాసాబ్లాంకాను అనుకరిస్తూ ఎత్తులు వేసేవాడు. ఇక మా

గురువు ఒక పద్ధతిలో ఆట నడిపేవాడు; తన ఓర్పుతో ప్రత్యర్థి తెలివితేటలను విసిగించి చివరకు విజయం సాధించేవాడు. మొదటి ఎత్తులైన వెంటనే ప్రధానమైన పావులకు రక్షణ కల్పించుకొని ఉవ్వెత్తున దాడి జరపటానికి ప్రయత్నించేవాడు డాన్ మాన్యూలు; తన ప్రయత్నానికి ఏమాత్రం ఆటంకం జరిగినా ఉత్సాహం కోల్పోయేవాడు; ప్రత్యర్థిది పైచేయి అయ్యేది. మొదటి ఎత్తుకు మా గురువు నిబ్బరంగా ఉండేవాడు. అతనిదృష్టి అంతా ఒక గడిలో రాజుకు కోటగట్టటమే. ఈ ఆత్మ రక్షణ విధానంతో ఎదిరి ఎత్తులను నిష్ఫలంచేస్తూ ఉండేవాడు. అంతటితో ఆటరంగు తేలిపోయేది.

డాన్ మాన్యూలే ఎక్కువమారులు ఓడిపోతూఉండేవాడు. కాని అతని పద్ధతి నా స్వభావానికి బాగా నచ్చింది. అప్పుడప్పుడా పద్ధతి అనుసరించేవాణ్ణి. కాని నా ముఖ్యమైన పావులు కదపకముందే మా గురువుగారు ఆటకట్టించేవారు. ఒకరోజున అనుకోని సంఘటన జరిగింది. నా పావులన్నిటినీ బలిచేసి అయినా మా గురువు తన రాజుకు కోటగట్టకుండా చేయటానికి ప్రయత్నించాను. నా మొదటి ఎత్తులు సాంప్రదాయసిద్ధంగాలేవు. ఛాంపియన్ ఇది గమనించాడో లేదో; బహుశా నిర్లక్ష్యముగా ఎత్తులు వేస్తున్నానని భావించి ఉండవచ్చు. అందుచే తన రాజునుగురించి అతడు తొందరపడలేదు. నా మంత్రికి త్రోవచూపించటానికై ఒక బంటును బలి చేసుకొన్నాడు. ఇప్పటికి ఛాంపియన్ తనతప్పును గుర్తించాడు. 'ఐపోయింది!' అని నిదానంగా అతడనటం నాకు చాల ఆశ్చర్యాన్ని కల్గించింది. కాని విజయలక్ష్మి నన్నెలా వరిసిస్తుందో నాకు బోధపడలేదు. ఒకటిమాత్రం గుర్తించాను. నామంత్రి స్థావరం ఛాంపియన్ రాజుకు రక్షణలేకుండా చేసింది. ఐనా ఆట నా పక్షం ఎలా అవుతుందో తెలియటంలేదని ఒప్పుకొన్నాను. అంతటితో నా ఆటను ఛాంపియన్ ఆడి తన్నుతాను ఓడించుకొన్నాడు. అతని ఆటను నేను ఆడి అతణ్ణి రక్షించడానికి ప్రయత్నించాను. అంటే అతనికంటే నేను మొనగాణ్ని అని కాదు; ఆట నేర్చుకొనటమే నా ఉద్దేశం.

పరాజయాన్ని ఉల్లాసంగానే గ్రహించినా. ఛాంపియన్‌లో కొంత ఆందోళన కలిగినదనటం స్పష్టం. నా విజయం కేవలం యాదాలాపం కాదన్నాడు. కనీసం ఐదు ఎత్తులైనా ముందుగా ఆలోచించుకున్న ఎత్తులనీ, ఎదురు ఎత్తులన్నిటినీ జాగ్రత్తగా ఊహించి సాగించిన దాడిఅనీ అన్నాడు. "నీవు చదరంగంలో బాలుడివికాదు, నీవైనా ఆడి గెలిచేవాడివే. నీవుసాధించిన కీలకస్థానం అటువంటిది. ఈ పరిస్థితిలో ఏదో పెద్ద పొరపాటువస్తేగాని ఓడిపోవటంజరగదు. అట్టి పొరపాటు చేసేదశ దాటి పోయింది" అని ఛాంపియన్ అనటం నాకు ఉల్లాసాన్ని కలిగించింది. ఒకే గురువుగారినుండి స్పానిష్ భాషలోనూ, చదరంగంలోనూ యోగ్యతాపత్రాలు సంపాదించాను.

ఆ మర్నాడే డాన్‌మాన్యూలు నన్నభినందించాడు. ఛాంపియన్‌పై సాధించిన విజయానికి. సవినయంగా విన్నవించాను. అందులో నా ప్రయోజకత్వం లేదని. కాని అతని ఉత్సాహానికి పట్టపగ్గాలు లేకపోయినై. అదంతా నా విజయాన్ని గురించి కాదు; తన ప్రత్యర్థిపరాజయాన్ని గురించిమాత్రమే. డాన్‌మాన్యూలు సవాలుచేశాడు. నా ఎత్తులను తనపై ప్రయోగించమని, ఛాంపియన్ పర్యవేక్షణలో ఆట సాగించాం. నాకు భయంగానేవుంది. కానీ ఎత్తులు తిరిగి ఫలించినై! ఛాంపియన్‌కు సరియైన ప్రత్యర్థి లభించాడని డాన్‌మాన్యూలు సంతోషించాడు. కాని చివరంగం నా వృత్తి కాదు. ఐనా చాలాసార్లు ఛాంపియనూ నేను ఆడాం. అప్పుడప్పుడు విజయం సాధించాను. కాని ఛాంపియన్ నిజంగా ఛాంపియనే! అతనికి అనేకరకాల ఎత్తులు క్షుణ్ణంగా తెలుసు. వాటిని గ్రహించటానికి నాకు వ్యవధిగానీ, ఆసక్తిగాని లేవు. ఈ అనుభవంతోనే రెండుసంవత్సరాల అనంతరం అలేఖైన్‌తో ఆడాను. అప్పటికి అతడు ప్రపంచ ఛాంపియన్‌కాదు. ఆ మరుసటి సంవత్సరమే కాసాబ్లాంకా నోడించి అలేఖైన్ ప్రపంచ ఛాంపియన్ కాగలడని నేనూహించలేదు.

## గ్రంథరచనలో తొలిప్రయత్నం

ఇక నా స్పానిష్ చదువునుగురించి ముచ్చటిస్తాను. నాగురువు మంచిసమర్థుడు. కొన్ని వ్యాకరణపాఠాలు పూర్తికావటంతోనే అతని సహాయంతో 'సుస్థిరశాంతికి మార్గం' (The way to durable peace) అనే చిన్నగ్రంథాన్ని అనువదించాను. ఈ గ్రంథాన్ని సంయుక్తరాష్ట్రాలలో ఉన్నప్పుడే వ్రాశాను. మన్రోసిద్ధాంతం, గత శతాబ్దిలో దాని ఆచరణ మున్నగు అంశాలను గురించి మెక్సికోలో వ్రాసిన ఒక అధ్యాయాన్ని ఆ గ్రంథానికి చేర్చాను. ఈ గ్రంథరచనవలన అమెరికా స్వాతంత్ర్య యుద్ధం మొదలు నేటివరకు గల నవప్రపంచ చరిత్రను చదువవలసిన అవసరం కలిగింది. నా రాజకీయ సిద్ధాంతాల పరిణామానికీ సమకాలిక ప్రపంచ పరిస్థితులను అవగాహన చేసికొనటానికీ ఈ పరిశ్రమ ఎంతో ఉపకరించింది.

మన్రో సిద్ధాంతం 1823 లో ప్రకటింపబడింది. "విదేశాల వ్యవహారాలలో అమెరికా జోక్యం కలిగించుకోదు. ఐరోపా రాజ్యాలేవీ అమెరికా వ్యవహారాలలో తల దూర్చరాదు." అనేదే మన్రో సిద్ధాంత సారాంశం. ఈ విధంగా వ్యవహరించ వలసిందని అమెరికన్లను జార్జి వాషింగ్‌టనే ఆదేశించాడు. ఈ సిద్ధాంతకర్తయైన థామస్ మన్రో సంయుక్తరాష్ట్రాలకు ఐదవ అధ్యక్షుడు. కాంగ్రెసుకు ఈ విధంగా సందేశం ఇచ్చాడు. "అమెరికా ఖండాలు స్వతంత్రసిద్ధిని పొందినై. ఆ స్థితిని రక్షించుకొనటాని కవి సంసిద్ధం. కాబట్టి ఇకమీదట ఐరోపా రాజ్యాలేవీ వలస స్థాపనకు ఈ ఖండాల నుద్దేశింపకూడదు." ఈ ప్రకటన జరగటానికి (1823) 10, 15 సంవత్సరాల పూర్వమే మధ్య దక్షిణ అమెరికా రాజ్యాలు ఒకదాని తరువాత

మరొకటి స్పానిష్ పరిపాలనను తుదముట్టించినై. కాని 'పవిత్ర కూటమి' (Holy Alliance) ప్రోత్సాహంతో యిరోపాలోని ప్రతీపగామి శక్తులు బలపడసాగినై. అందుచే అమెరికాలోని తన వలసలను తిరిగి సంపాదించటానికి స్పెయిన్ ప్రయత్నించ వచ్చుననే భయం ప్రారంభమైంది. అట్టి పరిస్థితులలో "అమెరికానుండి వైదొలగాలి, అని యిరోపా సామ్రాజ్యవాదాన్ని హెచ్చరించింది మన్రో సిద్ధాంతం." ఒక శతాబ్దం వరకూ ఈ సిద్ధాంతమే అమెరికా విదేశాంగనీతికి ధృవతార అయింది. కాని ఇటీవల ఇది ఏకాకివాదం (Isolationism) గా పరిణమించి నానాజాతి సమితిలో అమెరికా చేరటాన్ని ప్రతిఘటించింది. ఐతే 1923లో మాత్రం డాస్ ప్రణాళిక, యంగ్ ప్రణాళికలద్వారా సంయుక్తరాష్ట్రాలు యిరోపా వ్యవహారాలలో జోక్యం కల్గించు కొని అభివృద్ధి నిరోధక శక్తులను ప్రోత్సహించింది. తద్వారా ఫాసిజం తలెత్తటానికి తగిన పరిస్థితులను సృష్టించింది.

గత శతాబ్ద కాలంలో మన్రో సిద్ధాంతంవల్ల నూతన ప్రపంచంపై సంయుక్త రాష్ట్రాల సంరక్షకత్వం స్థాపించబడింది అని చెప్పవచ్చు. యిరోపా వలసరాజ్య స్థాపనను ప్రతిఘటించడమనే సాకుతో మధ్య దక్షిణ అమెరికాలలో సంయుక్త రాష్ట్రాలు సైనికంగా జోక్యం కలిగించుకొనే సందర్భంలో పొరుగుదేశం కావటంచేత మెక్సికో ఇతర రాజ్యాలకంటె ఎక్కువ నష్టపడింది. స్థానిక సైనిక జోక్యాలేగాక సంయుక్తరాష్ట్రాలు మెక్సికోతో రెండు మారులు యుద్ధంచేసి టెక్సాస్, అరిజోనా, కాలిఫోర్నియా రాష్ట్ర ప్రాంతాల నన్నింటినీ ఆక్రమించింది.

19వ శతాబ్ది చివరివరకు, అమెరికా స్వదేశ సమస్యలతోనే సతమతమైంది. మరికొంతకాలం వరకూ అమెరికా ఋణగ్రస్తదేశమే. అమెరికా పారిశ్రామిక వికాసంలో విదేశీ పెట్టుబడులు - ముఖ్యంగా బ్రిటిష్ పెట్టుబడి - ఎంతగానో తోడ్ప డినై. ఆ రోజుల్లో సంయుక్తరాష్ట్రాలు మధ్యదక్షిణ అమెరికాల ఆర్థిక జీవితంలో జోక్యం కలిగించుకొనలేకపోయింది. రియోగ్రాండీకి ఉత్తరంగాఉన్న ఖండాన్నంతా ఆక్రమించటం 19వ శతాబ్ది చివరకు పూర్తయింది. అంతటితో, నవప్రపంచాన్ని ఆర్థికంగా జయించాలని సంకల్పించింది. మన్రో సిద్ధాంతంతో స్థాపించబడిన రాజ కీయ సంరక్షకత్వం, ఆర్థిక అధికార విస్తరణకు తోడ్పడింది. క్రమంగా సంయుక్త రాష్ట్రాలకు పొరుగునఉన్న చిన్న రాజ్యాల ఆర్థిక వ్యవహారాలను సంయుక్తరాష్ట్రాలు గుత్తకొన్నది. ఆ రాజ్యాల స్వాతంత్ర్యం నామమాత్రమైంది. సమయానుగుణంగా అంతర్యుద్ధాలు, విప్లవాలు ప్రోత్సహించటం అమెరికా విధానంలో ఒక ముఖ్యాంశం. 'అఖిల అమెరికా' సిద్ధాంతానికి, 'అఖిల జర్మనీ' సిద్ధాంతానికి వ్యత్యాసం లేదు. ఇటు వంటిదే జపానువారి "ఉమ్మడి అభివృద్ధి ప్రాంత (Co-prosperity sphere) సిద్ధాంతము."

నా పుస్తకంలో చివరి అధ్యాయంగా మన్రోసిద్ధాంతాన్ని గురించి వ్రాసినది, 'ఎల్ హెరాల్డో'లో వరుసగా ప్రకటింపబడింది. ఆ వ్యాసాలు మెక్సికన్ ఉన్నత వర్గాలలో సంచలనం కలిగించి నాకనేకమంది మిత్రులను సంపాదించి పెట్టినై. వానిని, డాన్ వెనూస్టియానో చాలా మెచ్చుకున్నాడని లామజేర్ మోడర్నా చెప్పింది. అవి కేవలం చారిత్రక విమర్శనయే కాదు; ఒక రాజకీయ నిర్ణయాన్ని కూడా సూచించినై. లాటిన్ అమెరికా ఉత్తర అమెరికా దాస్యానికి స్వస్తి చెప్పటం అవసరం. అందుకై సంయుక్తరాష్ట్రాల ప్రోత్సాహంతో జరుగుతున్న 'అఖిల అమెరికా మహాసభ'కు ప్రతిస్పర్ధిగా లాటిన్ అమెరికా కూటమిని స్థాపించాలి. ఈ నా సూచన ప్రెసిడెంట్ కరంజానుకూడ ఆకర్షించింది. ఇదంతా కెయిజర్ రహస్య రాయబారి రాకపూర్వమే జరిగింది. ఆతడుకూడా నా సూచనను బలపరిచాడు. బహుశా నా సూచనలవల్లనే కరంజాకు నాపట్ల అంతటి ఆదరాభిమాన మేర్పడి యుండవచ్చును.

## గ్రంథ ఆవిష్కరణ

నా ప్రథమ గ్రంథ ఆవిష్కరణ సందర్భంలో లామజేర్ మోడర్నా టీపార్టీ ఏర్పాటు చేసింది. దానికి ఆమె అభిమానులైన యువకరచయితలే కాక విద్యావంతులూ, ఉన్నతోద్యోగులు, సేనాపతులు, వామపక్ష రాజకీయ నాయకులుకూడా వచ్చారు. వారిలో యూనివర్సిటీ ప్రధానాచార్యులైన మాస్ట్రోకాసోస్, డాన్ మాన్యూల్ సుప్రసిద్ధులు. కాని లామజేర్ మోడార్నా యింట్లో తీవ్రవచర్చలకు అవకాశంలేదు; ప్రతి సమావేశానికీ తనే కేంద్రం కావాలని ఆమె దురాశ. అదృష్టవశాత్తు ఆమెతో పోటీ చేయగల మరొక యువతి లేదు. మెక్సికోలో యువతులు సాంఘిక సమావేశాలకు హాజరయేవారు కారు. బహుశా వారి విద్యావిజ్ఞానాలకవి తగినవి కావేమో!

పార్టీలో ఒక యువకవి ఉపన్యసించాడు. ఇతడు పద్యాలు వ్రాసి, లామజేర్ మోడార్నా పేరుతో ప్రచురిస్తూ ఉండేవాడు. గుర్తు ఉన్నంతవరకు ఆతని మాటల్లోనే ఆ ఉపన్యాస సారాంశం: "భారతదేశం అత్యద్భుత ప్రాచీన విజ్ఞాన నిలయం; అట్టి దేశంనుండి తన ప్రబోధంతో లాటిన్ ఇండియన్ ఆత్మనుద్ధరించటానికీ, మన ఆత్మశక్తిని ప్రజ్వలింపజేసి, ఉత్తర అమెరికా దాస్య తిమిరాన్ని పటాపంచలు చేయటానికీ, స్వేచ్ఛా సందేశమిచ్చిన మోరెలో, హిడాల్గో, ఔరెజ్‌ల మహోజ్జ్వల సాంప్రదాయాలను పునరుద్ధరించటానికీ వచ్చాడీ నిరాడంబర వేదాంతి."

ఆ ఉపన్యాసంలోని విషాదరేఖను, రూపకాలంకారాలను గుర్తుకు తెచ్చుకోవటం కష్టం. ఉద్రేకంలో ఆతని స్వరం కంపించి పోయింది. అతిథులందర్నీ ఆ ఉపన్యాసం ఉద్వేగాత లూపింది. సేనాపతుల ఒరల్లో కత్తులు గలగలలాడినై. మంత్రులు, విదేశ నీతివేత్తలు గంభీర వదనాలు ధరించారు. రాజకీయ వేత్తలు అంగీకారంతో తల లూపారు. మోడర్నా అతిథుల్లో కొందరు ఉపన్యాసకునిపట్ల

అసూయ ప్రదర్శించారు. కాని మాస్ట్రో కాసోస్ విశాలవదనంమీద, నల్లని ముంగురుల నీడలో అనంగీకార సూచకమైన మందహాసం స్పష్టంగా కన్పించింది. ఆ వాతావరణంలో నాకు నచ్చినదల్లా ఆ మందహాసమే !

ఉపన్యాసం పూర్తి కాగానే మోడర్నా తన కవితా భక్తుని సమీపించి కరస్పర్శ చేసి, హుషారు చేసింది. కృతజ్ఞతతో ఆ భక్తుడు తన దేవతకు మోకరిల్లి ప్రణామం చేశాడు. పాపం! అప్పటి కా యువకునికి పెండ్లి ఐపోయింది; పైగా కాథలిక్ చర్చి విడాకులను సమ్మతించేది కాదు !

లాముజేర్ మోడర్నా పూర్తిగా ఈలోకం వ్యక్తి. తన భక్తుడే వినా ప్రేక్షకుల హృదయాల నావిధంగా ఆకర్షించి, రంగస్థల కేంద్రపాత్రధారి కావటాన్ని ఆమె ఎంతో కాలం సహించదు. ఉపన్యాసకుని కరస్పర్శచేసి ప్రశంసించిన అనతి కాలంలో తన యథాస్థానాన్ని స్వీకరించింది; నల్లని సిగరెట్ తీసింది. ఒక అర డజనుమంది యువక భక్తులు పరుగులు తీశారా సిగరెట్‌ను ముట్టించటానికి; కాని ఆమె ప్రసన్నురాలు కాలేదు. వా రెవ్వరికీ ఆ సదవకాశం లభించలేదు. మోడర్నా ఉపన్యాసం ప్రారంభించింది. ముక్తసరిగా నాలుగు ముక్కల్లో ముగించింది : ఈ నూతన గ్రంథ రచయితను అధ్యక్షునికి పరిచయం చేయాలి. ఈలోగా గ్రంథప్రతిని రచయిత సంతకంతో డాన్ వెనూస్టియానోకు బహూకరించింది. ఆమె సూచనను అందరూ ఆమోదించారు. తిరిగి మాస్ట్రో కాసోస్ అసమ్మతిని సూచించాడు. అతిథులందరూ వెళ్ళిపోయే సందర్భంలో నా దగ్గరకు వచ్చి కాసోస్ అన్నాడు: "ఇదంతా అర్థంలేని ఉద్రేకం. విషయాలన్నీ నిర్ణయించేవారు ప్రజలు. ప్రజాభిప్రాయాన్ని రూపొందించేది వారేగదా! అందుచే మన మీ సమస్యను వారిముందే ఉంచాలి. ఈ విషయంమీద విశ్వవిద్యాలయంలో ఉపన్యాసా లీయటం మీకు సమ్మతమేనా ?"

## బహిరంగ ఉపన్యాసం

నన్ను నేను అభినందించుకొన్నాను. కాని ఉపన్యాసా లీయటమనే భావం నా నవనాడులను క్రుంగదీసింది. ఇంతవరకు నే నెక్కడా బహిరంగ సభలలో మాట్లాడలేదు. మా కుట్రలలో - విప్లవాల కార్యక్రమాలలో ఉపన్యాసా లుండేవి కావు. మాటలతో విప్లవాలు జరుగుతై. అనే విశ్వాసం మాకు లేదు. విప్లవాలకు కావలసింది శక్తివంతమైన ఆయుధాలే. క్రమంగా ఈ అంధవిశ్వాసం తొలగింది, కాని ఉపన్యాసకునిగా రాణింప లేకపోయాను. మెక్సికోలో కొన్ని ఉపన్యాసాలు చేశాను. కాని అవి అన్నీ కొద్దిమంది ప్రేక్షకులకే-పార్టీసమావేశాలలోను, శ్రామిక సంఘ సమావేశాలలోనూ. మొట్టమొదటిసారి పెద్ద బహిరంగసభలలో మాట్లాడింది రష్యా వెళ్ళిన తరువాతనే.

మాస్ట్రోకాసోస్ ఆహ్వానాన్ని అంగీకరించాను. మొత్తం ఐదు ఉపన్యాసా లిచ్చాను స్పానిష్ భాషలో. ఉపన్యాసాలను నా ఉపాధ్యాయుని సహాయంతో తయారుచేశాను. ఇటువంటివిద్యార్థి లభించినందులకు తన్నుతాను అభినందించుకొన్నాడు మా వృద్ధగురువు. మొదటి ఉపన్యాసాన్ని కేవలం చదివేశాను. యూనివర్శిటీ విద్యార్థులూ, ఉపాధ్యాయులూ అందరూ హాజరైనారు. అదే నా మొదటి బహిరంగ ఉపన్యాసం. మర్నాటికి కొంత ధైర్యం వచ్చింది. ఈ మారు చదవకుండా వ్రాసిన ఉపన్యాస సారాంశాన్ని వివరించాను. చివరిరోజున మాస్ట్రోకాసోస్ అధ్యక్షత వహించి ఉపన్యాసానంతరం తుదిపల్కులుగా సభికుల నుద్దేశించి అన్నాడు: 'మన అతిథి విద్వాంసుడనే విషయం చెప్పనక్కరలేదు. అమెరికాలో ఇటీవల జరిగిన చారిత్రక సంఘటనలను నూతనదృక్కోణంనుండి పరిశీలించి స్వతంత్రమైన కొన్ని నిర్ణయాలకు వచ్చాడు. అవి చాల సాహసోపేతమైన నిర్ణయాలు. ఆ నూతన విధానమూ, క్రొత్తనిర్ణయాలూ మీ ముందున్నై. మీరు - యూనివర్సిటీవిద్యార్థులూ, ఉపాధ్యాయులూ వానిని సవిమర్శకంగా పరిశీలించి, అందలి సత్యాసత్యాలను తేల్చాలి. మరొక విషయం. ఈ నూతననిర్ణయాలే సత్యాలు అని చెప్పటానికి సాహసించేవారు అందలి బాధ్యతలను పూర్తిగా గుర్తించాలి. లాటిన్ అమెరికా దాస్యవిముక్తికై పాటుబడినవారందరూ చిరస్మరణీయులే. కాని సమకాలిక ప్రపంచంలో జరిగే స్వేచ్ఛాపోరాటం క్రొత్త వెలుగుబాటలను వేయాలి'.

ఆ సూచనలో ఎంతో ప్రాధాన్యత గోచరించింది. ఉపాధ్యాయవృత్తిలో ఉండి అంతకు మించి స్పష్టంగా చెప్పటం భావ్యంకాదు. నా అనుమానాలన్నీ తొలగిపోయినై. మెక్సికోలోని విద్యావంతులకు నాయకు డనదగినకాసోస్ (విశ్వవిద్యాలయ అధిపతి) సాంఘిక విప్లవధంకా మ్రోగించాడు! ఆ విప్లవప్రారంభోత్సవం నా చేతుల మీదుగా జరుగుతున్నదనే భావం నాకెంతో సంతోషాన్ని చేకూర్చింది. నా జీవితంలో నూతనాధ్యాయాన్ని ప్రారంభిస్తూ మహదానందాన్ని చేకూర్చిన క్షణాల్లో అదొకటి.

## అమెరికా దౌర్జన్యానికి ప్రతిఘటన

1917 వ సం. చివరిలో మెక్సికో అమెరికాలమధ్య సంబంధాలు పూర్తిగా చెడినై. కెయిజర్ రహస్య రాయబారి రాకతో, మెక్సికోలో జర్మనుల పలుకుబడి పెరిగిపోయింది. జర్మన్ ఆర్థికసాయంతో ఒక పెద్ద రేడియోస్టేషన్ నిర్మింపబడినది. బెర్లిన్, మెక్సికో నగరాలమధ్య సన్నిహిత సంబంధమే ఆ రేడియోస్టేషన్ లక్ష్యం. జర్మనుల ప్రచారానికేగాక, కెనడా, సంయుక్తరాష్ట్రాలలో పెద్దయెత్తున కీలక విధ్వంసకచర్యల ప్రణాళికలకుకూడ మెక్సికోనగరమే కేంద్రమైంది. జర్మనుల పలుకుబడిని నిర్మూలించే ఉద్దేశ్యంతో అమెరికానుండి ఒత్తిడి ఎక్కువకాసాగింది. అంత యుద్ధం జరుగుతూనే ఉన్నా మెక్సికోలో పత్రికాస్వాతంత్ర్యం ఉంది. అందుచే

విదేశ శ్రేయస్సుల ఆర్థిక సహాయంతో నడుస్తున్న ప్రముఖ దినపత్రికల్లో కరంజా ప్రభుత్వంమీద దండయాత్రలసంరంభం ఇనుమడించింది. యుద్ధంలో మెక్సికో తాటస్థ్యం జర్మనీపట్ల అభిమానంగా నిందిస్తూ మిత్రరాజ్యకూటమిలో గౌరవప్రపస్థానాన్ని సాధించటానికి తన ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయవలసిందిగా ప్రజాస్వామ్య అభిప్రాయాన్ని పత్రికలు రెచ్చగొట్టసాగినై. మిత్రరాజ్యాలకు అనుకూలమైన ఈ ప్రచారానికి నాయకత్వం వహించిన పత్రికారచయిత ఒక ఇటాలియన్; కాని మెక్సికో పౌరుడు. వీరందరూ కరంజా ప్రభుత్వంపై సాయుధవిప్లవానికి ఓబ్రెగాన్ చేస్తున్న ప్రయత్నాలను ప్రోత్సహిస్తున్నారు. ఈ ప్రయత్నాలు బహిరంగంగానే సాగుతున్నై.

మెక్సికో క్రొత్త రాజ్యాంగంలోని జాతీయకరణను (Nationalization) గురించిన సూత్రంపై, మెక్సికో సంయుక్తరాష్ట్రాల మధ్యగల విభేదాలు తీవ్రతరమైనై. ఇది చాల ప్రధానమైన సమస్య. 'ఖనిజ నిక్షేపాలను - ముఖ్యంగా పెట్రోలియం నిక్షేపాలను త్రవ్వితీయటంలో విదేశసంస్థలకు, నాటి మెక్సికో ప్రభుత్వ మిచ్చిన సౌకర్యాలు క్రొత్త రాజ్యాంగంతో రద్దయినవి' అని మెక్సికో ప్రభుత్వ వాదం. విదేశీయులు 'తమ శ్రేయస్సులను మెక్సికో ప్రభుత్వం పొట్టన బెట్టుకొంటున్న'దంటూ గగ్గోలు లేవదీసి, రాజ్యాంగమే న్యాయబద్ధంగావని వాదింపసాగారు. అంటే విదేశీయులు మెక్సికో ప్రజల సర్వసత్తాక అధికారాన్నే (Sovereignty) సవాలు చేశారు. ఐనప్పటికీ, మెక్సికో రాజీకి సిద్ధపడి 'డయజ్ ప్రభుత్వం ఇచ్చిన సౌకర్యాలు క్రొత్త రాజ్యాంగంతో రద్దయినై; కాని క్రొత్తప్రభుత్వం పాత విదేశీసంస్థలకే తిరిగి ఆ సౌకర్యాల నిస్తుంది'; అని ప్రకటించింది. ఇందుకు ఉభయపక్షాలు అంగీకరిస్తే, రాజీ కుదిరేది. కాని విదేశీయు లంగీకరించలేదు. దానితో పెట్రోలియం ప్రభుత్వ ఆస్తి కాబట్టి, పెట్రోలియం ఎగుమతిని నిషేధించటానికి మెక్సికో ప్రభుత్వం సంకల్పించింది. జర్మనీమద్దత్తువల్లనే మెక్సికోకు ఇంత ధైర్యం వచ్చిందని అమెరికన్లవాదం. ఏమైనా మెక్సికో చర్యలు న్యాయబద్ధమైన వనటంలో సందేహంలేదు. అమెరికాతో పోలిస్తే, మెక్సికో చాల బలహీనమైన దేశం. అందుకనే మెక్సికో రాజీకి సిద్ధపడింది. అయినా తన రాజ్యాంగాన్ని ధిక్కరించటం మెక్సికో సహించలేకపోయింది.

ఈ సమస్య మెక్సికో సుప్రీంకోర్టుముందుకు వెళ్ళింది. కాని మెక్సికో సుప్రీంకోర్టు మెక్సికో రాజ్యాంగాన్ని నిరసిస్తుందా అనే అనుమానంతో మెక్సికో సింధుశాఖపై గల రేవుల్లో వాణిజ్యరక్షణకు సైన్యాలను పంపుతానని అమెరికా బెదరించింది. 'పెట్రోలియంగనులు వ్యక్తిఆస్తి కాబట్టి పెట్రోలు ఎగుమతిని నిషేధించటం ఆ గనులను ప్రభుత్వం స్వాధీనపరచుకొన్నట్టులే', అని అమెరికావాదం. మెక్సికో దోపిడిగాండ్రు తమ భూభాగములలో ప్రవేశింపకుండ చర్యలు తీసికొనేమిషతో, ఉత్తరసరిహద్దుల నతిక్రమించి అమెరికాసైన్యాలు రానేవస్తున్నై.

మెక్సికోనగరం ఉద్రిక్తం కావటంలోనూ, అమెరికాపట్ల ఆగ్రహద్వేషాలు మిన్నుముట్టటంలోనూ వింతలేదు. ఈ వాతావరణంలో నగరంలోని అమెరికన్లపై మెక్సికన్లు చెయిచేసుకొనే ప్రమాదంఉంది. మిత్రరాజ్యపక్ష పత్రికలు మరింత ఉద్రేకాన్ని రెచ్చగొట్టినై. 'జర్మన్ కుట్రదారులచేతి కీలుబొమ్మగా వ్యవహరిస్తున్న మెక్సికో ప్రభుత్వ దౌర్జన్యవిధానాలను విదేశకంపెనీలు ధిక్కరించటం సమంజసమే'నని ఆ పత్రికల ప్రచారం. ఆ ఉద్రిక్త వాతావరణంలో అమెరికన్లపట్ల వ్యతిరేకతను ప్రశాంతంగా ప్రదర్శించిన ఒక సంఘటన ఎన్నటికీ మరచిపోలేను.

సుప్రసిద్ధ నీగ్రోమల్లుడైన (Boxer) జాక్ జాక్సను శ్వేతజాతి యువతిని పెండ్లిచేసుకొన్నాడు. అందుచే అతడు అమెరికానుండి పారిపోవలసి వచ్చింది. మెక్సికో శరణుజొచ్చాడు. ఇక్కడ ప్రభుత్వం సహాయంతో నీగ్రోలకొక వ్యవసాయ క్షేత్రం స్థాపించాలని అతని సంకల్పం. కాని సైనికులకు మల్లయుద్ధం నేర్పటానికై, మెక్సికో ప్రభుత్వం జాక్‌ను సైన్యంలో ఉద్యోగిగా నియమించింది.

మెక్సికోనగరంలో 'అవెనీడా దమాడెరో' అనే ప్రాంతం ఫ్యాషన్లకు కేంద్రం. ఇక్కడే శాన్‌బోరన్ మందులషాపుఉంది; అది అమెరికావారిది. అందులో మందులతోబాటు ఫ్యాన్సీసామాన్లు, టాయిలెట్ వస్తువులు, రంగురంగుల సోడాలు కూడా అమ్మేవారు. అందులోనే 'టీస్టాలు'కూడా ఉంది. శాన్‌బోరన్ ఐస్‌క్రీమ్ చాలా ప్రసిద్ధిచెందింది. కాఫీకూడా చాల బాగుండేది. మెక్సికోలో తయారయ్యే 'ఒరిజాబా' కాఫీ ప్రపంచంలోకెల్లా సుప్రసిద్ధమైనది. వీటి రుచిమరిగి ఒంటరిగానూ, బద్ధకస్తులతోనూ తరచు 'శాన్‌బోరన్'కు వెళ్ళేవాడ్ని. అప్పుడప్పుడు శాన్‌బోరన్‌లో కూర్చుని వర్ణరో ప్రపంచవాసుల వింతప్రవర్తనను పరికించటం సరదాగా ఉండేది.

ఒకనాటి సాయంత్రం శాన్‌బోరన్‌లో ఒంటరిగా కూర్చున్నాను. అదే సమయములో పొడవుగా దర్శనీయంగా ఉన్న నీగ్రోయువకుడు, అతనిభార్య శ్వేతజాతి యువతీ అక్కడికి వచ్చారు. చుట్టూ కలియజూచి, గదిలో వెనుకనున్న ఖాళీ టేబుల్ దగ్గరికి వెళ్లి కూర్చున్నారు. ఇంతలో శాన్‌బోరన్ నిండిపోయింది. ఏదో తమాషా జరగబోతోందనే భావంతో నేనక్కడే ఉండి ఆ దంపతులను పరిశీలింపసాగాను. వాళ్ళు చాలసేపు కూర్చున్నారు. వారికి ఏం కావాలో అడిగినవారు లేరు. ఆ అవమానంవల్ల ఆ యువతి ఆగ్రహావేశురాలై ఒక స్త్రీ నౌకరును పిలిచి గట్టిగామాట్లాడింది. ఆ నౌకరు బుజాలు ఎగురవేసి మెదలకుండా వెళ్ళిపోయింది. ఆ యువకుడు లేచి ఆమె చేతిని చేతిలోనికి తీసికొని నిర్లిప్తంగా బయటకు నడిచాడు. అమెరికా హోటళ్ళలో నీగ్రో అవసరాలను మన్నింపరని నాకు తెలుసు. తెల్లవారి మంగలిషాపుల్లో గూడ నీగ్రోలకు ప్రవేశం లేదు. కాని ఇది అమెరికా గాదు. మెక్సికనుల కింతటి జాతి పట్టింపులు లేవు. వారిది కూడా సంకర రక్తమే. ఈ నీగ్రో దంపతు లెవరో

అంతవరకు నాకు తెలియదు. జాక్ జాక్సన్ అపుడు మెక్సికోలో ఉన్నాడని నేను ఊహించలేదు. ఏమైనా అమర్యాదకు గురియైన వారిపట్ల నాకు సానుభూతి కలిగింది. నాచుట్టూ పరిహాసాలు, ఈసడింపులు వినబడి నా సానుభూతి ఆగ్రహంగా మారింది. ఇకపై శాన్‌బోరన్‌కు రాకూడదనే నిర్ణయంతో లేవబోతున్నాను. ఇంతలో యూని ఫారములు ధరించిన కొందరు యువకులు నీగ్రోను వెంటబెట్టుకొని షాపులో ప్రవేశించారు. వారు రావటంతో హోటలులో ఉన్న తెల్లవారంతా నిర్గమింపసాగారు. వచ్చినవారు నౌకరును పిలచి కొన్ని టేబుల్స్ వేయించి కూర్చుని యజమానిని పిలవ మన్నారు. రంగంమీదికి ఒక వ్యక్తి ప్రవేశించాడు. కండ్లల్లో పిరికితనం స్ఫుటంగా కనిపిస్తోంది. కాని ఠీవి ప్రదర్శించటానికి ప్రయత్నిస్తున్నాడు. యూనిఫారాల వ్యక్తులు ఉల్లాసంగా ఏక కంఠంతో బిగ్గరగా అరిచారు: 'జాక్ నీకేం కావాలో Mr. శాన్‌బోరన్‌తో చెప్పు' అప్పుడు తెలిసింది. అతడు ప్రసిద్ధ జాక్ జాక్సన్ అని; శాన్‌బోరన్‌కు కోపంగా ఉంది. కాని భయపడ్డాడు. నౌకరులను పిలచి వారికి కావలసినవి తెమ్మని పురమాయించాడు. కాని యూనిఫారాల పార్టీనాయకుడు ఆజ్ఞాపించాడు: "మాక్కావలసినవి ఆ అమ్మాయిలు తెస్తారు. కాని నీవు చేసిన అవమానానికి శిక్షగా నీవే స్వయంగా జాక్ కోరినవి తెచ్చి ఇవ్వాలి" యజమాని తటపటాయించాడు. యూనిఫారములు అతనికి గుర్తుచేసినై: "నీవు ఉంటున్నది మెక్సికోలో; మెక్సికోలో నల్లవారూ తెల్లవారూ సమానమే. మెక్సికోలో బేరం చేసుకొని బ్రతకాలని ఉంటే మెక్సికో న్యాయాన్ని శిరసా వహించాల్సిందే" నని హెచ్చరించారు. పళ్ళు కొరుకుతూ ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకొని ఒక ట్రే పట్టుకు వచ్చి జాక్ ముందుంచాడు: జాక్ లేచి నిలబడ్డాడు. అతని నిష్కల్మష మయిన మందహాసం శాన్‌బోరన్‌కు సిగ్గు తెప్పించి ఉండాలి. శాన్‌బోరన్‌తో కర స్పర్శచేస్తూ అన్నాడు: "Mr. శాన్‌బోరన్, మీకీ కష్టం కల్గించినందుకు క్షమించండి" యూనీఫారం మూతా బయటికి వెళ్లింది. బయట ఒక గుంపు జయజయధ్వానాలు చేస్తూంది. ఇందులో అమెరికా వ్యతిరేక ప్రదర్శనంగానీ, జాతీయభావ విజృంభణము గానీ లేవు. ఆ జయజయధ్వానాలు కేవలం నీగ్రోల నుద్దేశించినవే. ఆ గుంపు జాక్‌ను భుజాలమీద మోసుకు వెళ్ళారు. అది కేవలం స్వయంపట్ల తమకుగల అభిమానాన్ని ప్రదర్శించటమే. ఒక వ్యక్తి శరీరం రంగు నల్లన. అది కారణంగా అతడు అవమానింపబడ్డాడు. ఈ అన్యాయాన్ని సహించక మానవుని హక్కును, విశిష్టతను ప్రతిష్ఠించాలని మెక్సికన్లలోని ఔదార్యం సంకల్పించింది.

జాక్ జాక్సన్‌ను తిరిగి ఒక్కసారే కలుసుకున్నాను. సోవియట్ రాజ్యాంగాన్ని స్పానిష్ భాషలోనికి తర్జుమా చేసి ప్రచురించాలనే సంకల్పంతో చందా వసూలు చేస్తున్నాం. ఒకరోజు బజారులో ఇర్విన్ గ్రీన్‌విచ్, నేనూ జాక్‌ను కలుసుకోటం తటస్థించింది. అతడ్ని ఆపి ఇర్విన్ అడిగాడు: "జాక్, బోల్షివిక్కు

లంటే నీకు ఇష్టమా? కాదా?" ఆ ప్రశ్నకు కలవరపడ్డాడు జాక్. 'నాకేం తెలియదే' అన్నాడు. మా ప్రణాళికను వివరించి చందా ఇమ్మన్నాడు ఇర్విన్. విశాలమైన మందహాసంతో బోర్లివిమ్కలను దీవిస్తూ పది డాలర్లనోటు చందా ఇచ్చాడు.

మెక్సికన్ సాంఘిక జీవితం పైకి ప్రశాంతంగానే సాగుతోంది. కాని దాని అడుగున అమెరికా వ్యతిరేకభావం బడబాగ్నిలా పేరుకొంటోంది. ప్రభుత్వం చాల తికమకల్లో పడింది. మధ్యతరగతి వారిది చాల సందిగ్ధ విధానం: అమెరికా దురాక్రమణ సన్నాహాలను వారు నిరసిస్తారు; కాని తమ దేశంలో విదేశీయుల సాయుధ బలాలు జోక్యం కల్గించుకొనటం తమకేమీ పట్టనట్టు వ్యవహరిస్తారు. ఈ ప్రమాదాన్ని ఎదుర్కొనటానికి ప్రభుత్వానికి సైన్యం వినా మరొక సాధనం లేదు. కాని సైన్యం ఎంతవరకు విశ్వాసపాత్రమో నమ్మకం లేదు. సైనికోద్యోగులలో చాల మంది ఓబ్రెగాన్ అభిమానులని వదంతి. లక్ష్యశుద్ధిలేని అంతర్యుద్ధాలవలన సైనికులలో అవినీతి పెరిగిపోయింది. వారికి ధనం వినా మరొక లక్ష్యంలేదు; ఓబ్రెగాన్ ఆయుధాగారంలో వెండి తుపాకిగుండ్లకు కొదువలేదు!

ఇట్టి నిస్సహాయ పరిస్థితులలో మెక్సికోప్రభుత్వం మిత్రులకోసం వెదకసాగింది. లామజేర్ మోడార్నా ఇంట్లో జరిగిన టీపార్టీకి నాకుగూడ ఆహ్వానం వచ్చింది. అది సాధారణ టీపార్టీ కాదు. అధికార హోదాలో జరుగుతున్న పార్టీ, విదేశాంగమంత్రి, ఎగువ సభాధ్యక్షుడైన (Chamber of Deputies) డాన్ మాన్యూలుకూడ హాజరైనారు. ఫెర్నాండే తన అన్నగారికి (విదేశాంగమంత్రికి) నన్ను పరిచయంచేశాడు. మంత్రిగారుమాత్రం నాతో పూర్వపరిచయం ఉన్నట్లుగానే మాట్లాడాడు. ప్రక్కకు తీసికొనివెళ్ళి నాతో అన్నాడు:

"ఇంకా జోన్సచేలల్లోనే ఉంటున్నారా?" అంటూ రాజనీతి ఉట్టిపడే మందహాసంతో "మిమ్మగురించి రకరకాలవ్యక్తులు విచారణచేస్తున్నారు. జాగ్రత్తగా మసలుకోనడం మంచిది." అని హెచ్చరికచేశాడు. మరుక్షణంలోనే "వినా మరేం భయంలేదు; ఆ యిల్లు భద్రమైనదే. దానిపై ఒక కన్ను ఉంచవలసిందిగా పోలీసులను ప్రత్యేకంగా ఆజ్ఞాపించాం." అని హామీకూడా ఇచ్చాడు.

డాన్‌మాన్యూలు నన్నుగురించి శాంటిబానెజ్ ద్వారా వినియున్నాడు. మెక్సికో సోషలిస్టుపార్టీ భవిష్యత్తునుగురించి నాతో చర్చించాలని అతని ఆందోళన. అతనిది సూటిగా, ముక్తసరిగా మాట్లాడే స్వభావం. మా ప్రథమ సంభాషణ—

"నాలాగా మెక్సికోలో సాధారణవృత్తి ఉద్యోగాలలో ఉన్నవారందరూ సోషలిస్టులే. కాని ఈ పెటీబూర్జువా విజ్ఞానుల నాయకత్వంలో శ్రామికులకు విశ్వాసంలేదు. వీరి తప్పుడుత్రోవకు సిండికలిస్టుల అరాజకవాద ప్రభావమే కారణం.

సోషలిజం బలపడటానికి శ్రామిక, పెటీబూర్జువా వర్గాలమధ్య సహకారం చాల అవసరం.” అన్నాడు. అతని భావాలతో నే నేకీభవించాను.

ఐనా అడిగాను. “మీరూ, మీ అనుయాయులు సోషలిస్టుపార్టీలో చేరని కారణం?”

అతడు ఎదురుప్రశ్న వేశాడు; “బుద్ధిమంతులకూ, సిండికలిస్టు అరాజక వాద ఉన్మాదులకూ పొత్తుకుదరటం సాధ్యమా?”

“ఐతే, శాంటిబానెజ్ సంగతి?”

“అతనిదొక ప్రత్యేక స్వభావం”.

సోషలిస్టుపార్టీ పునర్నిర్మాణం అవసరమని ఉభయులం గుర్తించాం. అందుకు తిరిగి కలుసుకుందామని నిర్ణయించాం. ఆతరువాత నేనొక సూచన చేశాను. “అమెరికా జోక్యాన్ని ప్రతిఘటించటానికై శ్రామికవర్గాన్ని ఎందుకు సంఘటిత పరచగూడదు?”

ఆలోచించి అన్నాడు డాన్ మాన్యూల్ : “అది ఎలా సాధ్యం?”

“రాజధాని నగరంలో కార్మిక ప్రదర్శనలు జరిపి, తరువాత సమ్మె జరిపించి నట్లయితే పెట్రోల్ పరిశ్రమ స్థంభించి పోతుంది” అన్నాను.

నిస్సహాయంగా తల త్రిప్పుతూ అన్నాడు: “అరాజక సిండికలిస్టులు మన ప్రభుత్వంతో ఏమాత్రం సహకరింపరు. వారి దృష్టిలో ఒక ప్రభుత్వానికీ మరొక ప్రభుత్వానికీ వ్యత్యాసం లేదు”

నేనొక సమాధానం సూచించాను : “కార్మికుల ఆర్థిక సంబంధమైన కోర్కెలను ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తే అరాజక సిండికలిస్టులు ప్రభావంనుండి కార్మికులను తప్పించవచ్చునుకదా?”

ఈ చర్చ ఫలితంగా రెండు నిర్ణయాలు రూపొందినై: శాంటిబానెజ్‌తోను, ఇతర సోషలిస్టు ప్రముఖులతోను మంతనాలు జరపాలి; నేను అధ్యక్షుని కలుసుకొని ప్రభుత్వ కార్మికవిధానానికి కొన్ని సూచనలు చేయాలి.

మా చర్చలకు అధికారముద్ర వేయటానికో అన్నట్లు విదేశాంగ మంత్రిగూడ పాల్గొన్నాడు. అమెరికా దౌర్జన్యానికి ప్రజాప్రతిఘటన సంఘటితపరచే నా ప్రణాళికను గురించి డాన్ మాన్యూలు అతనితో చెప్పాడు. విదేశాంగమంత్రి స్వభావం లోను, సంస్కృతిలోను స్పానిష్ వారికంటె ఫ్రెంచివారిని పోలి ఉంటాడు. నా ప్రణాళిక ఎంతవరకు హేతుబద్ధమో పరిశీలించాలి అన్నాడు. అతడు సోషలిస్టు కాదు. కాని ప్రజాస్వామ్యము, సాంఘిక న్యాయములలో విశ్వాస మున్నవాడు.

నాడు నేను ఉద్రేకంతో కమ్యూనిజంవైపు పురోగమిస్తూ గాలిమేడలు కడుతున్న మార్క్సిస్టును. అందుచే నాకు విదేశాంగమంత్రి హేతువాదం కేవలం బూర్జువా సిద్ధాంతంగా తోచింది. అది చాల తొందరపాటు నిర్ణయమే. కాని అంతటి ప్రముఖ వ్యక్తులు నా సూచనలను శ్రద్ధగా పరిశీలించటంతో, నేనుగూడ ఒక ప్రముఖ వ్యక్తినైనానని నే భావం కలిగింది. ఈ భావమే నాలోని విప్లవ జ్వాలలను కొంతవరకు అదుపులో పెట్టింది.

మరునాడే 'బద్ధకస్తు'ల మిత్రబృందంలోని ప్రముఖులైన, ఇంగ్లీషు 'ఎల్ హెరాల్డో' సంపాదకవర్గంతో చర్చించాను. మేమందరం మెక్సికోలో తలదాచుకొంటున్నాం కాబట్టి మెక్సికోకు సహాయపడటం మా ధర్మం. కాని అమెరికను మిత్రులందరూ కేవలం 'ఎజ్ఞ విప్లవవాదులు'; పెట్రోలు రాజులతో రాజీపడటం వారికి సమ్మతం కాదు; కాని ఏదైనా ఒక బూర్జువా ప్రభుత్వానికి సహాయం చెయ్యటానికి వారు సమ్మతింపరు. వారు కోరేది సాంఘిక విప్లవం. అందుచేత కరంజా ప్రభుత్వానికి వ్యతిరేకంగా అల్వరడోను బలపరచటానికి గూడా వెనుదీయరు. వారితో అన్నాను: "మెక్సికో ప్రస్తుత సమస్య యే వ్యక్తిని బలపరచాలి అనేది కాదు. విదేశ సామ్రాజ్యవాదమా, లేక మెక్సికో జాతీయ స్వాతంత్ర్యమా అనేదే సమస్య." అందుకు వారి సమాధానం: "శ్రామికులకు మాతృభూమి అంటూ లేదు కాబట్టి అంతర్జాతీయ విప్లవవాదులు ఒక శ్రామికవిరోధిని కాదని మరొకనికి సాయంచేయటంలో అర్థం లేదు." సిద్ధాంతరీత్యా వారివాదన సబబైనదే; కాని "అధికారాన్ని హస్తగతం చేసుకోటానికి నాందిగా శ్రామికవర్గం దేశ రాజకీయ జీవితంలో పటిష్ఠంగా రూపొందాలి; అట్టి సదవకాశం మెక్సికో శ్రామికవర్గానికి ఇప్పుడు లభించింది" అని నా ప్రతివాదన.

చార్లీ శాంతివాది; విప్లవ రాజకీయాలంటే చాల ఉద్రేకపడతాడు. కాని సిద్ధాంతాలతో తల బ్రద్దలు కొట్టుకోడు. మేము పొందుతున్న అతిథి సత్కారాలకు కృతజ్ఞతగా విదేశ దుర్మార్గులనుండి మెక్సికో రక్షణకు తోడ్పడాలి అనే భావం అతనికి నచ్చింది. సహజమైన ఉద్రేకంతో తన నిర్ణయాన్ని ప్రకటించాడు: "మనమందరం సోషలిస్టుపార్టీలో చేరి దానిని ప్రజా సంస్థగా రూపొందించాలి." హృదయపూర్వకంగా అయినా కాకపోయినా మొత్తానికి అందరూ సమ్మతించారు. జేకర్, గ్లిన్ కెన్ కాంప్‌లకు రాజకీయాలలో పెద్దగా శ్రద్ధలేదు. ఇర్విన్ గ్రాన్‌విచ్ కమ్యూనిస్టులలో అరాజకవాది. ఆతనికి సాంఘిక విప్లవంలోనేగాని, రాజ్యంలోగాని, రాజకీయ వ్యవస్థలోగాని విశ్వాసం లేదు. ఈ సిద్ధాంత విభేదాలన్నీ క్రమంగా చర్చించి తేల్చుకోవలసినవి. ప్రతివారు వారిమార్గంలో దోపిడీకి గురియగుచున్న నిరుపేదల నుద్ధరించటానికి పూనుకొన్నవారే. అందుచేత ప్రస్తుతానికి సైనికుల్లాగ కలిసి పని చేయాలి. మెక్సికోలో ఉంటున్నాం కాబట్టి మెక్సికో శ్రామికవర్గం శ్రేయస్సుల కొరకు పోరాడాలి. వారి సంస్థలలో, వారి విప్లవ కార్యక్రమాలలో పని చేయాలి.

సోషలిస్టుపార్టీలో చేరటానికి నిర్ణయించిన తరువాత మేము శాంటిబానెజ్ ని కలుసుకున్నాం. అతని ఆనందానికి మేర లేకపోయింది. మేము చేరటంతో "మెక్సికో సోషలిస్టుపార్టీ పెద్ద అంతర్జాతీయ సంస్థగా మారిపోతుంది. అది పార్టీ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగినరోజు. పెద్ద బహిరంగసభ జరిపి మహోత్సవంగా చేయదగిన సంఘటన" అని అన్నాడు శాంటిబానెజ్. ముందుగా పార్టీ కార్యవర్గం సమావేశమై మమ్ములను సభ్యులుగా చేర్చుకోవాలి అనీ, తరువాత బహిరంగసభద్వారా పార్టీలో మా సభ్యత్వాన్ని ప్రకటించవచ్చుననీ సూచించాను. ఇదే సదవకాశమనీ సోషలిస్టుపార్టీ విశాలదృక్పథాన్ని అలవరచుకొన్నచో డాన్ మాన్యూలు మున్నగువారు కూడ అందులో చేరే అవకాశం ఉన్నదనీ వివరించాను. శాంటిబానెజ్ అందుకు సమ్మతించలేదు, "అవకాశవాదులైన పార్లమెంటేరియన్లకూ, బూర్జువా విజ్ఞానులకూ కార్మిక వర్గమంటే ద్వేషంతప్ప వాత్సల్యం లేదు." అన్నాడు. తన వర్గ శ్రేయస్సుల రక్షణ భారాన్ని వహిస్తున్నట్లు అంత తొందర తగదని, వారితో చర్చించి వారి సహకారం పొందగల్గినట్లయితే పార్టీ గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడింపగలవనీ వాదించాను. ఆసన్న క్లిష్టపరిస్థితులలో ప్రముఖపాత్రను నిర్వహింపగలిగితే సోషలిస్టుపార్టీ దేశరాజకీయాలలో పటిష్టమౌతుంది. అప్పుడు యే ప్రభుత్వంకూడ ఆ పార్టీని నిర్లక్ష్యం చేయటానికి సాహసించదు. ధైర్యం చేసి మరొక విషయంకూడ హెచ్చరించాను. ఈ కార్యక్రమంలో సోషలిస్టుపార్టీకి ప్రభుత్వమే సహాయం చేయవచ్చు.

శాంటిబానెజ్ చాలా చురుకైన లాయరు. నా హెచ్చరికలోని ప్రాధాన్యతను పసికట్టాడు. "డాన్ మాన్యూలును కలుసుకొన్నారా?" అని అడిగాడు. "ఇతరులనకూడ కలుసుకొన్నాను" అని ఒప్పుకొన్నాను. "మాస్ట్రొ కాసోస్‌ను గురించి డాన్ మాన్యూలు ఏమన్నా చెప్పాడా?" అన్నాడు. నాకాశ్చర్యం కలిగింది. కాసోస్ యూనివర్సిటీ ప్రధాన పాలకుడు. అతడూ సోషలిస్టే. నేను బుకాయించాను: "వారందరి విషయం నేను చూచుకొంటాను. పార్టీ కార్యవర్గం సంకుచిత విధానానికి స్వస్తి చెబితే వారందరూ పార్టీలో చేరతారు. ప్రభుత్వం కూడా శ్రామికుల కోరికలపట్ల సానుభూతి వహిస్తుంది. అరాజక సిండికలిస్టుల లక్ష్యంకూడా అదే కాబట్టి వారిని మనవేపు త్రిప్పుకొనటం కష్టం కాదు." శాంటిబానెజ్ కండ్లలో కాంతిరేఖలు మెరిసినై. మెక్సికో కారల్ మార్క్సుగా చెలామణి అవుతున్న ఇతడు తన జీవితం వృథా కాలేదని తృప్తి పొందినట్లు కన్పించాడు.

## మెక్సికో సోషలిస్టుపార్టీ పునర్నిర్మాణం

ఇంగ్లీషు 'ఎల్ హెరాల్డో' ప్రచురణ సందర్భంలోనే, సోషలిస్టుపార్టీ కార్యక్రమాలలో తల దూర్చవలసివచ్చింది. అందులో మొట్టమొదట చేసినపని పార్టీ పత్రికైన 'లాలూకా'ను ఎనిమిది పేజీల వారపత్రికగా మార్చటం; అందుకు అవసర

మైన డబ్బు నాదగ్గర ఉండనేఉంది. పార్టీ కార్యదర్శినుండి ప్రెస్ (Press) కొని, క్రొత్తయంత్రాలూ, అచ్చులూ తెప్పించాం. ప్రెస్ పార్టీఆస్తియైంది. ఎలాగైతే నేం, పరిస్థితుల్లో చైతన్యం కలిగిందని వృద్ధుడు శాంటిబానెజ్ సంతోషించాడు.

సోషలిస్టుపార్టీ ప్రధానకార్యకర్తల్లో మార్క్సిజాన్ని గురించి తీవ్రవాదోప వాదాలు జరుగుతోనే ఉన్నై. పార్టీకి వెలుపలగూడా మార్క్సిజాన్ని గురించిన చర్చలు జరపటం అవసరమని భావించాను. అందుచే మా చర్చలలోని ప్రధానాంశా లపై ఐదారు కరపత్రాలువ్రాసి ప్రచురించాను. ఈవిధంగా ప్రెస్‌లో పెట్టిన డబ్బు సార్థకమైంది. తరువాత సోషలిస్టు పార్టీకి ఒక సూచన చేశాను: "దేశవ్యాప్తమైన కార్మికవర్గ పక్షాన్ని స్థాపించే ఆశయంతో ఒక మహాసభను (Conference) జరపా లనీ, దానికి ముందుగా సోషలిస్టుపార్టీ మానిఫెస్టోను ప్రచురించాలని ఆ సూచన. అది 1918 సం. మధ్యకాలం. అప్పటికే మెక్సికోకు రష్యా బోల్షివిక్ విప్లవ సమాచారం చేరింది. శ్రామికవర్గం రాజకీయాధికారాన్ని హస్తగతం చేసికోవాటాన్ని గురించి సోష లిస్టులు కలలుగంటున్నారు. నా సూచనతో వారి భావోద్రేకానికి అంతులేకపోయింది. శ్రామికవర్గమనేది గాలిమేడలు కావని స్పష్టమైంది. అందుచేత అధికారం వశపరచు కొనే ఆశయంతో శ్రామికవర్గపక్షాన్ని స్థాపించటం అర్థంలేని సూచనగా త్రోసిపుచ్చ లేక పోయినారు. అధికారం కైవసం చేసికొనటం సాధ్యమనేభావం కలగటంవల్ల అరాజక సిండికలిస్టుల దృక్పథంకూడా మారింది. రాజ్యము, ప్రభుత్వముపై సిద్ధాంత రీత్యా వారికిగల నిరసనభావం సడలింది. 'లాలూకా'లో ప్రచురింపబడిన మానిఫెస్టో ప్రజలను విశేషంగా ఆకర్షించింది. అదే పత్రికాప్రతిని మూడుసార్లు అచ్చువేయవలసి వచ్చింది. అమెరికా సంయుక్త రాష్ట్రాలనుండి పెక్కుమంది మహాసభలో పాల్గొం టామని ఉత్తరాలుకూడా వ్రాశారు.

మహాసభ ఏర్పాట్లనుగురించి చర్చించటానికై సోషలిస్టుపార్టీ కార్యవర్గం సమావేశమైంది. కార్యవర్గ సభ్యులలో చాలామందికి పరిణామాలు ఆశ్చర్యకరంగా తోచినై. మోయలేని భారాన్ని తలకెత్తుకుంటున్నట్లు భావించారు కొందరు. ఏమైనా మహాసభకు పెద్దఎత్తున సన్నాహం జరగాలి. అది మాటలతో జరిగేపనికాదు. సభ్యు లను బాధించిన ప్రథమ సమస్య ధనసమస్య! ధనాన్ని గురించినబెంగ అవసరంలేదని వారికి హామీ ఇచ్చాను. ఇది ప్రజానీకాన్ని ఉద్ధరించటానికి జరిగే ప్రయత్నం; కాబట్టి ధనంసేకరించటం కష్టంకాదు; కాని కొందరపడి ప్రయోజనంలేదు. ఈ మహా సభ విజయంతో మెక్సికోలోనేగాక లాటిన్ అమెరికా దేశాలన్నిటి రాజకీయ జీవిత ములో శ్రామికవర్గం మహత్తరశక్తిగా రూపొందాలి. అందుచే మహాసభను గూర్చిన ప్రతి చిన్న విషయాన్ని శ్రద్ధగా ఆలోచించాలి. వివిధ దేశాలనుండి మహాసభకు హాజరుకాగల ప్రతినిధులతో సంప్రదింపులు జరపాలి. మహాసభను గురించి ప్రచారం జోరుగా సాగించాలి; అందు చర్చించే నిర్ణయాలను జాగ్రత్తగా తయారుచేయాలి.

ప్రతివానిలో ఏదో అస్పష్టమైన ఉత్సాహం, ఉద్రేకం వెల్లివిరిసింది. కాని ఈ బృహన్నాటకంలో! ఎవరిపాత్ర ఏమిటో ఎవరికీ తెలియదు.

పార్టీ కార్యవర్గం నాకు క్రొత్తబాధ్యతలను అంటగట్టింది. పార్టీ పత్రికా సంపాదకుడుగా, పార్టీ ప్రచారానికి డైరక్టరుగా నన్ను నియమించింది. నేను ఉత్సాహంతో సమ్మతించాను. లాటిన్ అమెరికా దేశాలనుండి మహాసభకు ప్రతినిధులను రప్పించే బాధ్యతగూడా నాకు అప్పగించారు. అప్పటికే 'బద్ధకస్తులు' సంయుక్త రాష్ట్రాలకు ప్రాతినిధ్యం వహిస్తామంటూ ముందుకువచ్చారు.

## కరంజాతో విందు

అంతర్జాతీయ సోషలిస్టు మహాసభకు సన్నాహాలు ముమ్మరంగా సాగుతున్నై. ఒకరోజున డాన్‌మాన్యూలు ఒక ముఖ్య సందేశంతో వచ్చాడు : 'సోషలిస్టుపార్టీని పునర్నిర్మించటంలో నీవు చేస్తున్న ప్రయత్నాలన్నీ ప్రెసిడెంట్ కరంజా శ్రద్ధగాపరికిస్తున్నాడు. వాటి ఫలితాలపట్ల ఆసక్తి చూపుతున్నాడు. ముఖ్యంగా లాటిన్ అమెరికా, రష్యా ప్రతినిధులు సభకు హాజరుకావటంవల్ల కరంజా ఎంతో శ్రద్ధవహిస్తున్నాడు; అవసరమైతే, ఆయా రాజ్యాలలోని మెక్సికో రాయబారుల సహాయంకూడా సోషలిస్టు పార్టీకి లభించవచ్చు. కాబట్టి కరంజా నీతో కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడాలి. అందుకై తన భవనానికి నిన్ను విందుకు ఆహ్వానించాడు. ఆ విందుకు ప్రముఖ ప్రభుత్వోద్యోగులుకూడా హాజరవుతారు.' కరంజాతో సమావేశంవల్ల లాభంఉండగలదనే విశ్వాసంతో ఆహ్వానాన్ని అంగీకరించాను.

మెక్సికో అధ్యక్షుడు 'చాపుల్‌టాపెక్' ప్రాసాదంలో నివసించేవాడు. ఇది మెక్సికోనగరానికి ఐదుమైళ్ళదూరంలో కొండమీద నిర్మింపబడింది. చుట్టూ అందమైన ఉద్యానవనం; నగరానికీ, ప్రాసాదానికి మధ్యగల రోడ్డు చాల విశాలమైంది. ప్రతిరోజూ నవనాగరికులైన యువకులూ బాటవెంట స్వారిచేస్తూ ఉండేవారు. ఉద్యానవనంలో అందమైన అంగళ్ళుఉండేవి. మాక్సిమిలియన్, చార్లెట్టీ, రాజదంపతుల కాలంనుండీ (క్రీ. శ. 1864) కూడా, చాపుల్ టాపెక్ రాజవీధిగుండా ఉత్తమాశ్వాలు దౌడుతీస్తూఉండేవి. ఐరోపాలో ప్రముఖ రాజకుమారులందరూ ఎప్పుడో ఒకప్పుడిక్కడ కొంతకాలం గడిపే ఉంటారు.

మెక్సికోలో గుఱ్ఱాని దొక ప్రత్యేకస్థానం. మెక్సికోలో గుఱ్ఱాన్ని ప్రవేశపెట్టినవారు స్పానిష్ విజేతలు. మెక్సికో దేశానికేగాదు అమెరికా ఖండానికే గుఱ్ఱం విదేశీజంతువు. మెక్సికో ఆదిమవాసులైన అజ్‌టెక్కులపై స్పానియార్డుల విజయానికి గుఱ్ఱం చాలవరకు కారణం. అజ్‌టెక్కులు మూఢ విశ్వాసాలు కలవారు. తమకంటె బలవంతులై, మృగాలపై స్వారీచేస్తూ కన్పించిన స్పానియార్డులను కేవలం స్వర్గంనుండి ఊడిపడ్డ గంధర్వులుగా భావించారు. అదే వారి పరాజయానికి దారితీసింది.

బేరింగ్ జలసంధిగుండా అమెరికాకు వలస వచ్చిన భారతీయుల సంతతివారే అజ్టెక్కులని ఒక సిద్ధాంతం. ఇందులో సత్యం ఉన్నా లేకపోయినా, మెక్సికో గుఱ్ఱానికి జన్మస్థలం ఆసియా ఖండమనటంలో సందేహం లేదు. సారసీన్ వర్తకులు అరేబియా గుఱ్ఱాలను స్పెయిన్‌లో దిగుమతి చేసేవారు. వాటి సంతతి స్పానిష్ విజేతలతోబాటు మెక్సికోలో ప్రవేశించినై. ప్రస్తుతం మెక్సికో గుఱ్ఱాలు అరేబియా గుఱ్ఱాలకంటె పరిమాణంలో చిన్నవి. కాని గుణానికి మాత్రం శ్రేష్ఠమైనవే. మెక్సికనులందరూ గుఱ్ఱపు స్వారీలో ఆరితేరినవారే.

మెక్సికో నాకు రెండవ మాతృదేశమైంది. అందుచేతనచటి జాతీయ క్రీడయైన గుఱ్ఱపుస్వారీ నేర్చుకోవలసి వచ్చింది. చిన్నప్పటినుండీ గుఱ్ఱపుస్వారీ అంటే నాకు సరదాగా ఉండేది. కాని ఎన్నడూ మంచి అవకాశం లభించలేదు. ఇండియాను విడిచి పెట్టటానికి ముందు కొన్ని రోజులు కలకత్తా మైదానంమీద కొంత సాధన చేసాను. అవి కుట్రదారుగా, పోలీసులను తప్పించుకు తిరుగుతున్న రోజులు. నిర్జనమైన మైదానంమీద వేకువనే పోలీసులు తటస్థపడరని నా ఆశ. కాని నేను పొరబడ్డాను; నాల్గవ రోజు అనుకుంటాను, మైదానంమీద స్వారీచేస్తూ డెన్‌హామ్ కన్పించాడు. అప్పుడాతడు సి. ఐ. డి. ప్రత్యేక శాఖకు అధిపతి. అంతటితో ఇండియాలో గుఱ్ఱపు స్వారీ సాధనకు స్వస్తి చెప్పాను.

తిరిగి మెక్సికోలో గుఱ్ఱపుస్వారీలో తర్ఫీదుపొందటానికి అవకాశం లభించింది. కాని చాపుల్ టాపెక్ రాజమార్గంలో నవనాగరిక రౌతులలో చేరేవాణ్ణికాదు. పొలాలకు అడ్డంబడి స్వారీ చేయటం నాకు సరదాగా ఉండేది. మెక్సికన్లు స్పానిష్ పద్ధతిలో స్వారీ చేసేవారు. అంటే పొడవైన Stirrups లో కాళ్ళు బారజాచి స్వారీ చేసేవారు. ఇది ఇంగ్లీషు పద్ధతికంటె హాయిగా ఉంటుంది. మెక్సికన్ జీను కూడా చాల సుఖంగా ఉండేది. కళ్ళేలను గూడ తగిలించటానికి వీలుగా వుండేదా జీను. కొంచెం అనుభవం గల రౌతు. కళ్ళేలను జీనుకు తగిలించి ఖాళీచేతులతో స్వారీ చేయవచ్చు. నేను 'వెండి రాజు' (Silver King) అనే శ్వేతాశ్వాన్ని అద్దెకు తీసుకుంటూ ఉండేవాణ్ణి. ప్రతి ఉదయం దానిమీద మైళ్ళకొలది స్వారీచేసేవాణ్ణి. ఆల్సేషియన్ (కుక్క) నా వెంబడే పరుగు తీస్తుండేది. సిఱ్ఱావెవాడా పర్వత పాదాల వరకు గల పరిసరాలను పరిశోధిస్తూ - పెక్కుమంది గ్రామీణులతో స్నేహం చేశాను.

అప్పటికే మెక్సికోలో ప్రాచీనవైభవం మాసిపోసాగింది. చాపుల్ టాపెక్ రాజమార్గంలో గుఱ్ఱాలకు బదులు మోటారుకార్లు ప్రత్యక్షమైనై. ఐనా, మెక్సికో నగరంలో లెక్కలోనికి వచ్చే ఏ యువకుడూ ఈ సాయం వినోదాన్ని వదలుకోలేదు. చివరకు, మెక్సికో అధ్యక్షుడు కూడా ప్రతి సాయంకాలం తన నల్లని లినోసీన్ కారులో, దారి పొడుగునా సోషలిస్టు మిత్రులకు అభివందనలు చేస్తూ నగరానికి వెళ్ళి వస్తూ ఉండేవాడు.

అధ్యక్షునితో రేపు సమావేశ మనగా, డాన్ మాన్యూల్ వచ్చి అందుకు తగిన సాంప్రదాయ దుస్తులు సంపాదించాలనీ, తనకు తెలిసిన దర్జీ, 24 గంటల్లో తయారు చేసి ఇవ్వగలడనీ అన్నాడు. ఉదయం, సాయంత్రం, భోజన సమయాల్లో, అధికార సమావేశాల్లో వేరు వేరు దుస్తులు ధరించటం పాశ్చాత్య సాంప్రదాయం; నాకు అన్ని రకాల దుస్తులు లేవు; అంతేగాక దుస్తుల విషయంలో సాంప్రదాయాలను అంతగా గౌరవించటం కూడా నాకు ఇష్టం లేదు. రంగస్థలం పైకి రాబోయే నటుడు-గ్రీన్ రూములో వేషధారణ చేసినట్లు ఒక ప్రత్యేక సన్నివేశానికి అవసరమైన దుస్తుల్ని పని మీరా దర్జీదగ్గిరికి వెళ్ళి కుట్టించటమనే ఉద్దేశ్యమే హాస్యాస్పదంగా కన్పించింది. మార్నింగ్ కోటుగానీ, డిన్నర్ జాకెట్‌గానీ తొడుక్కొని ఎరగను. కొందరు నిటారుగా నిలబడే కాలర్ ధరిస్తారు. అదంటే నాకు పరమ అసహ్యం. ఇక డిన్నర్ జాకెట్ సంగతి చెప్పనే అక్కర్లేదు; పొడుగ్గా వ్రేలాడే బొందు ఉండే జాకెట్ ఆ రోజుల్లో ఫ్యాషన్. అది ధరించిన మనుషులు కోతుల్లాగా ఉండేవారు. తమ తోకల్ని ఊపుతూ నాట్యం చేస్తుండేవారిని చూడటం చాల వినోదంగా ఉండేది.

అమెరికాలో ఉండగా, లేమితో బాధపడిన మాట వాస్తవమే. కాని మెక్సికో వచ్చిన తరువాత నాకు డబ్బుసమస్య తీరిపోయింది. పరిశుభ్రమైన దుస్తులనే ధరించేవాణ్ణి. నా ఊదారంగు ఫ్లానెల్ సూట్లు ఐరోపాలోని నా మిత్రులందరికీ చిరపరిచయమే. అవే హాయైన దుస్తులని ఇప్పటికీ నా విశ్వాసం.

దుస్తులను గురించిన నా అభిరుచులను డాన్ మాన్యూలు మెచ్చుకోకపోలేదు. ఆ రోజుల్లో రష్యన్ బోల్షివిక్కులంటే సాంప్రదాయ విధ్వంసకులనే భావం బలంగా ఉండేది. అందుకని పరిహాసంగా అన్నాడు: "నీవు అజ్ఞాతవాసంలో ఉన్న రష్యన్ బోల్షివిక్కువి కాదుగదా! ఎప్పుడో ఒకప్పుడు పొడవైన గడ్డంతో, పండ్లమధ్య నెత్తురోడ్చే కత్తితో ప్రత్యక్షమయ్యేటట్లున్నావు." తర్వాత నిదానంగా అన్నాడు: "మనము హాజరవుతున్నది చాలముఖ్యమైన సమావేశం. డాన్ వెనూస్టియానో స్పానిష్ ధనికవర్గీయుడు, సాంప్రదాయాలపట్ల పట్టుదలగలవాడు కాబట్టి ఈ స్వల్పవిషయంలో మనం జాగ్రత్తబడటం మంచిది". అవి అనుభవంతో చెప్పినమాటలు. నా ఉద్రేకానికి నొచ్చుకొని, డాన్ మాన్యూలును క్షమార్పణ కోరాను.

## నా సూచనలు

లాముజేర్ మోడర్నా ఇచ్చిన టీపార్టీలో, విదేశాంగమంత్రికి నేను చేసిన సూచనల ఫలితంగానే ఈ సమావేశం జరుగుతోంది. ఇందులో శ్రామికవర్గంలో ప్రభుత్వంపట్ల విశ్వాసం కలిగించగల నిర్దుష్ట కార్యక్రమాన్ని సూచించాలి. ప్రస్తుతం అధ్యక్షుడు కోరేదికూడా అదేనని డాన్ మాన్యూలు చెప్పాడు. ముందుగానే నాసూచనలను తెలిసికోవాలనే ఆసక్తి డాన్ మాన్యూలులో కన్పించింది. మా సంభాషణలో

ఈ క్రిందికార్యక్రమాన్ని వివరించాను :“మెక్సికోలో అమెరికా జోక్యాన్ని నిరసిస్తూ సోషలిస్టుపార్టీ బహిరంగసభజరపాలి; అందులో జరిపిన నిర్ణయంద్వారా, శ్రామికవర్గం అమెరికాను ఖండిస్తూ గొప్పప్రదర్శన నేర్పాటుచేస్తుంది; దేశస్వాతంత్ర్యాన్నీ, రాజ్యాంగాన్నీ రక్షించుకొనే మహత్కార్యంలో, ప్రజాస్వామ్యవాదులైన మధ్యతరగతిప్రజలు శ్రామికవర్గంతో సహకరించేటట్లు ప్రోత్సహించాలి; డాన్ మాన్యూయెలువంటి ప్రజాస్వామ్య నాయకుని ఉద్యమాన్ని పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ బలపరచటం అవసరం. విద్యార్థులూ, ఉపాధ్యాయులూ ప్రదర్శనలో పాల్గొనాలి. పోలీసులుగానీ, సైనికులుగానీ, ప్రదర్శనలో జోక్యం కలిగించుకోకూడదు. రాజధానిలో ప్రదర్శన జరిగిన అనంతరం, విదేశ పెట్టుబడిదారులు రాజ్యాంగాన్ని ధిక్కరించినచో, సోషలిస్టుపార్టీ పెట్రోలు పరిశ్రమలో పెద్ద ఎత్తున సమ్మె జరిపిస్తుంది. పెట్రోలు త్రవ్వి, పరిశుభ్రపరిచే కార్యక్రమాలు స్థంభించిపోతై. ఈ విధంగా విదేశ జోక్యానికి ప్రజాప్రతిఘటనను సమాయత్త పరుస్తూ శ్రామికవర్గం ప్రభుత్వానికి అండగా నిలబడుతుంది; ప్రభుత్వం నిర్భయంగా పటిష్టమైన విధానాన్ని అనుసరించటానికి అవకాశం లభిస్తుంది. ఇందుకు ప్రతిఫలంగా శ్రామికవర్గ ఆర్థిక వాంఛలను బలపరుస్తూ, వారికి ప్రోత్సాహకరంగా ప్రభుత్వం ప్రవర్తించాలి.”

ప్రెసిడెంట్ కరంజాకు నా ప్రణాళిక నచ్చగలదని డాన్ మాన్యులు విశ్వాసం. కేవలం కరంజా ప్రగతిశీలమైన భావాల కనుగుణంగా ఉండటమేగాక, నాప్రణాళిక ప్రస్తుత రాజకీయాలలో కరంజాకు తోడ్పడుతుంది. కరంజాకు ప్రధాన ఆశయం విదేశీయుల జోక్యానికి, ప్రజాస్వామ్య ప్రతిఘటనను సమాయత్త పరచటంకాదు; ఓబ్రెగాన్ మొదలైన ప్రత్యర్థులకు పోటీగా తన ప్రభుత్వానికి ప్రజాదరణను సాధించి తన పదవిని పటిష్టం చేసుకోవటమే కరంజా ఉద్దేశ్యం. ఓబ్రెగాన్ అమెరికా సహాయాన్ని పొందుతున్నాడనీ, అతడే అధ్యక్షుడు కాగలిగినప్పుడు పెట్రోలియం చట్టాన్ని రద్దుచేసే ప్రమాదం ఉన్నదనీ ప్రజల దృష్టికి గొనితెచ్చి ఆతనిని ప్రజలనుండి దూరం చేయటమే కరంజాకు ముఖ్యం. నాడు ఓబ్రెగాన్, సొనోరా రాష్ట్రానికి గవర్నర్. సొనోరా చాల ఐశ్వర్యవంతమైన రాష్ట్రం; సొనోరాకు, సంయుక్త రాష్ట్రాలకు మధ్య కొన్ని వందలమైళ్ళ సమాన సరిహద్దు రేఖ ఉంది. ఆధునిక పద్ధతులపై నడిచే పెద్ద వ్యవసాయ క్షేత్రాలు సొనోరాలో చాలా ఉన్నై. ఇవి అన్నీ అమెరికావారి చేతుల్లోనే ఉన్నై. అంతేగాక రాష్ట్రంలోని ఖనిజ సంపదను త్రవ్వి తీయటానికి గూడా అమెరికనులు అధికారాలు సంపాదించారు. ‘టెక్సాసు చమురు చక్రవర్తి’ డహోనీ నాయకత్వాన నడుస్తున్న ప్రసిద్ధ అమెరికా వాణిజ్య సంస్థతో గవర్నర్ ఓబ్రెగానుకు సన్నిహిత సంబంధం ఉండేది. ఓబ్రెగానుకు గల ఈ అవకాశాలన్నీ తొలగించాలనే ప్రెసిడెంట్ కరంజా తాపత్రయం, కాని కరంజాకు అంతటి సాహసం లేదు. అమెరికా సహాయంతో ఓబ్రెగాన్ సాయుధ విప్లవాన్ని

తచ్చగొట్టి, దేశాన్ని తిరిగి అంతర్యుద్ధంలో ముంచెత్తుతాడని కరంజా భయం. ఈ పరిస్థితుల్లో అమెరికా వ్యతిరేక ప్రజాఉద్యమమే శరణ్యం. కాబట్టి ఆ ఉద్యమానికి రహస్యంగా ఫెడరల్ ప్రభుత్వం పూర్తి సహాయం చేస్తుంది.

డాన్ మాన్యూల్ మరొక విశేషంకూడా చెప్పాడు. "సానోరా రాష్ట్రంలో ప్లూటార్కో ఎలియస్ కాలెస్ అనే ఒక ఉపాధ్యాయుడున్నాడు. తాను సోషలిస్టునని చెప్పుకుంటూ రాజకీయంగా ఉన్నతాశయాలను పెంచుకొంటున్నాడు. అమెరికా వ్యవసాయక్షేత్రాల్లో సమ్మెలు జరిపించి ప్రజాదరణను పొందటమేగాక గవర్నరు ఆగ్రహానికి కూడా గురియైనాడు. భూస్వామియైన కరంజాకు కూడా కాలెస్ చర్యలు సహజంగా ఆగ్రహం కల్గించాల్సినదే. కాని రాజకీయపు ఎత్తులలోని వైరుధ్యాల వలన అలా జరుగదు. ప్రజల అభ్యర్థిగా, ఓబ్రెగాన్‌తో పోటీచేయటానికి కాలెస్‌ను కరంజా ప్రోత్సహించవచ్చు. ప్రజాసంస్థగా రూపొందిన సోషలిస్టుపార్టీ ద్వారానే కాలెస్‌ను బలపరచటం సమంజసంగా ఉంటుంది." కాలెస్ పేరు వినటంతోనే నాకు గుర్తు వచ్చింది. సానోరా రాష్ట్రం నుండి పెద్ద ప్రతినిధివర్గంతో సోషలిస్టుపార్టీ మహాసభలకు హాజరౌతానని వ్రాశాడు. ఈ ఉపాధ్యాయుడే క్రమంగా రాష్ట్ర గవర్నరై, ఓబ్రెగాన్ తరువాత మెక్సికోకు అధ్యక్షుడు కూడా ఐనాడు. కొంతకాలం, కరంజా ప్రభుత్వంలో కార్మికమంత్రిగా పని చేశాడు. మెక్సికో రాజకీయాల్లో చాల విచిత్రమైన వ్యక్తి కాలెస్. ఇతణ్ణి గురించి ముందు ముందు కొంత వివరంగా వ్రాస్తాను. చివరిసారిగా కాలెస్‌ను 1925 లో పారిస్‌లో కలుసుకొన్నాను. అప్పుడాతడు మెక్సికో అధ్యక్షుడుగా ఐరోపాలో పర్యటిస్తున్నాడు. మెక్సికోలో మా చర్యలను స్మరణకు తెచ్చుకొన్న సందర్భంలో సోషలిస్టుపార్టీ కార్యదర్శిగా నా సంతకంతో ఉన్న పార్టీ సభ్యత్వం చీటీ ఇంకా తన దగ్గర భద్రంగా ఉన్నదని చెప్పాడు.

డాన్ మాన్యూల్, ప్రభుత్వంలోని శాసన విభాగ అధ్యక్షుని హోదాలో, నా వెంటరాగా, చాపుల్ టాపెక్ ప్రాసాదంలోని అతిథి మందిరంలో ప్రవేశించాను. స్పానిష్ రాజప్రతినిధుల చిత్రపటాలు బంగారు చట్రాల్లో గోడలనలంకరించియున్నై. కొన్ని శతాబ్దాల కాలం వారీ 'బంగారు భూమి'ని పరిపాలించారు. ఆ గదిలో ప్రవేశించిన మరుక్షణాన నా మనస్సులో ఒక ఆలోచన మెరిసింది. గర్విష్ఠి ధనిక వర్గీయ పాలక జాతికి వారసుడు కరంజా; అతడిప్పుడు నిస్సహాయస్థితిలో ఉన్నాడు. అతనికి నిరుపేదల సహాయ సహకారాలు లభింపజేసే ఉద్దేశ్యంతో వారి ప్రతినిధిగా వచ్చాను. ఈ పరిస్థితిలో గౌరవమర్యాదల చిహ్నాలను ధరింపకుండా సాధారణ పౌర దుస్తుల్లోనే వచ్చినందుకు నన్ను నేను అభినందించుకొన్నాను. ఈ ఆలోచన వెనుక మరొక ఆలోచన. నా అదృష్ట రథచక్రాలు మరొక త్రోవను పట్టి యుండినట్లయితే

ఈ సమయానికి బెర్లిన్‌లో కెయిజర్ దయాధర్మాలకై యాచిస్తూ ఉండేవాణ్ణి. ఒక సంవత్సరానికి పూర్వం అట్టి అదృష్టమే నా జీవిత సర్వస్వంగా భావించాను. కాని ప్రస్తుతం ఎందరో ధనికవర్గీయుల భూతాలు ఆవేశించియున్న ఈ మందిరంలో, నిలబడిన ఈ క్షణంలో, ప్రజాస్వామ్య మార్గాన్ని ఎన్నుకొన్నందుకు ఎంతో ఆనందం కలిగింది. నన్నిక్కడికి ఆహ్వానించినది ఒక గొప్ప భూస్వామి. కాని ఉద్యోగ హోదాలో ప్రజలచేత ఎన్నుకోబడిన ప్రజాస్వామ్య రాజ్యాధినేత, ప్రజల సహాయసానుభూతులను పొందాలనే తాపత్రయంలో ఉన్నాడు. ప్రజాస్వామ్యానికి ఇది మహత్తరమైన సదవకాశం. ఇది జారిపోయిందంటే ఆ తప్పిదం అంతా ప్రజానాయకులదే. ఆ తప్పిదంలో నాకూ కొంత వాటా ఉందని ఒప్పుకుంటాను. ఆ రోజుల్లో ప్రజాస్వామ్యంలో నాకు విశ్వాసం లేదు. నా కృషి ఫలోన్ముఖం కాకపూర్వమే నేను మెక్సికో విడిచిపెట్టి వెళ్ళవలసివచ్చింది. ఆ వాతావరణంలో, ఇతరులైతే, తమ ప్రయత్నాలను కొనసాగించి ఉండేవారేమో! కరంజా ప్రభుత్వం కూలిపోయింది. ఆ పరిస్థితుల నుద్ధరించటానికి నాడు ప్రజాస్వామ్య శక్తులకు బలం చాలినంతగా లేదు. అదే అవకాశం ఇప్పుడు లభిస్తే, మరొక విధంగా ప్రవర్తిస్తాను; ఈ మధ్య కాలంలో రాజకీయాలలో నాకు కలిగిన అనుభవమే అందుకు కారణం.

ఆ మందిరం నుండి మరొక పెద్ద గదిలోనికి వెళ్ళాం. అచటికి పార్కులో చెట్ల చిటారుకొమ్మలు మాత్రం కనిపిస్తున్నై. డాన్ మాన్యూలు నన్ను అధ్యక్షునికి, మంత్రులకు పరిచయం చేశాడు. మంత్రులు ఒకరిద్దరు తప్ప అందరూ సైనికదుస్తుల్లో ఉన్నారు. అధ్యక్షుడు చారల ట్రౌజరు, మార్నింగు కోటూ ధరించాడు. పానీయాలు అంటే ద్రాక్షసారాయి మాత్రమే వచ్చినై; డాన్ వెనూస్టియానో సంభాషణ నుపక్రమించాడు, గది కిటికీదగ్గర నిలబడిసారాయి త్రాగుతూ. అప్పటికి నేనుకూడా ఆ విలాస వస్తువును సేవించటం నేర్చుకున్నాను. పశ్చిమ, దక్షిణరాష్ట్రాలగుండా నా ప్రయాణాన్ని గురించి, దారిదోపిడిగాండ్ర విషయాన్ని గురించి ప్రస్తావించాడు. మంచిరోడ్లు గాని, రైలుమార్గాలుగానీ లేని పర్వతప్రాంతాలలో శాంతి నెలకొల్పటం కష్టసాధ్యమనీ, క్రమక్రమంగా దుష్టశక్తులను నిర్మూలించగల విశ్వాసం తనకున్నదనీ పేర్కొన్నాడు. ఐతే తమ వ్యవహారాల్లో, సంయుక్తరాష్ట్రాలు జోక్యం కలిగించుకొనకుండా ఉండాలిగదా!

చాల తెలివిగా, మా సంభాషణను అమెరికా జోక్యంవైపు మరలించాడు డాన్ వెనూస్టియానో; ఆ విషయం రావటంతో అతిథులందరూ ఆగ్రహపరవశులైనారు. మెక్సికన్ ప్రజలపట్ల సానుభూతి చూపుతూ వారు తమ గౌరవాన్ని, స్వాతంత్ర్యాన్నీ రక్షించుకోగలరనీ నాకుగల విశ్వాసం వెల్లడించాను. “మెక్సికో నాకు పెంపుడుతల్లి వంటిది. ఇక్కడ నేను పొందిన ఆతిథ్యం, రక్షణలకు కృతజ్ఞతతో నా పెంపుడుతల్లి రక్షణకై శక్తికొలది ప్రయత్నించటం నాధర్మం”అని చెప్పాను. తాము

కూడా మెక్సికనులే అనే సత్యాన్ని సోషలిస్టులు గుర్తించి తమ మాతృదేశంపట్ల తమ ధర్మాన్ని నిర్వర్తించేట్లు వారిని పురికొల్పటంలోనే సాధించిన విజయానికి అధ్యక్షుడు నన్ను అభినందించాడు. వీరందరూ నా సేవను గుర్తించినందుకు కృతజ్ఞత వెల్లడిస్తూ సాహసించి అన్నాను : "ఇది మా మాతృదేశం అనే భావంలేని ప్రజలలో దేశభక్తి కలిగించటం కష్టం; మెక్సికోలోనే కాదు ఏ దేశంలోనైనా అంతే" దానికి సమాధానంగా "బానిసలకు భూమిని పంచి యివ్వటమే మెక్సికో విప్లవ ఆశయం" అన్నాడు అధ్యక్షుడు. ధనిక వర్గీయుడైనా, ఔదార్యాన్ని అలవరచుకొంటున్నవాడు. మరల అన్నాడు : "ఐతే సంయుక్తరాష్ట్రాలు జోక్యం కలిగించుకొని ప్రోత్సహిస్తున్న అంతర్యుద్ధంవల్ల మా వ్యవసాయ సంస్కరణలు అడుగునపడి పోతున్నై."

డాన్ మాన్యూలు, శ్రామిక శాసనాలను గురించి అస్పష్టంగా సూచించాడు. న్యాయసమ్మతమైన శాసనాలు జరిగేటట్లు చూడటం శాసనసభాధ్యక్షుని ధర్మమని హెచ్చరించాడు అధ్యక్షుడు. తరువాత నావైపు తిరిగి "కార్మికమంత్రిని నియమించాలని ఆలోచిస్తున్నాం. సోషలిస్టుల్లో ఆ పదవికి అర్హులెవరన్నా ఉన్నారా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్న నాకు ముదావహమైంది. దానికి సమాధానం చెప్పటానికి డాన్ మాన్యూలే సమర్థుడని భావించాను. ఆ సంవత్సరమే, ఫెడరల్ మంత్రివర్గంలో కార్మికమంత్రిగా ప్లూటార్కో ఎలియస్ కాలెస్ చేరాడు.

డాన్ మాన్యూల్, విదేశాంగమంత్రి మినహా మిగిలిన వారందరూ నిర్గమించారు. ఇంతలో బట్లర్ వచ్చి భోజనం తయారైందని చెప్పాడు. మేము నలుగురం భోజనశాలలోకి నడిచాం. భోజనాలముందు మా కార్యక్రమాన్ని గురించి చర్చ జరిగింది. డాన్ మాన్యూలు బలపరచిన నా ప్రణాళికను ప్రెసిడెంట్ ఆమోదించాడు. విదేశాంగమంత్రి మాత్రం చాల ముందుచూపు గలవాడు. మా ప్రసంగంలో అప్పుడప్పుడూ విదేశసంబంధాల్లో రాగల అవాంతరాలను గురించి హెచ్చరిస్తూ ఉండేవాడు. లాటిన్ అమెరికా కూటమి నిర్మాణాన్ని గురించి కూడా చర్చ జరిగింది. "సమర్థుడైన వ్యక్తి లాటిన్ అమెరికా రాజ్యాలలో పర్యటించి ఆ రాజ్యాలతో మెక్సికోకు సన్నిహిత సంబంధాన్ని నెలకొల్పాలి; అందుకు మీరే తగిన వారనుకుంటాను" అని ప్రెసిడెంట్ కరంజా సూచించాడు. ఆ సూచన చాల బాగుంది. "కాని సోషలిస్టుపార్టీ మహాసభలు పూర్తయేవరకూ నేనేమీ చెప్పలేనని" అన్నాను. లాటిన్ అమెరికా కూటమిని కేవలం అధికార సంస్థగా రూపొందించాలని కరంజా ఉద్దేశ్యం కాదు; అది చాల సంతోషకరమైన విషయం. కొంచెం సాహసంతో అడిగాను : "మధ్య దక్షిణ అమెరికా రాజ్యాల్లోని మెక్సికో రాయబారవర్గాలు ఆయా రాజ్యాలలోని సోషలిస్టులను, సోషలిస్టు మహాసభకు ఆహ్వానించటంలో తోడ్పడగలవా?" సమ్మతిని సూచిస్తూ, విదేశాంగమంత్రి మందహాసం చేశాడు. ఈ సందర్భంలో అతనితో ప్రత్యేకంగా సంప్రతించాలి.

సమావేశం మూడు గంటలపాటు జరిగింది; నేను ఆశించిన దానికంటె ఎక్కువ ఫలప్రదమైంది. అంతా సవ్యంగానే జరిగిపోగలదని డాన్ మాన్యూలు ధైర్యం చెప్పాడు. ద్విగుణీకృత ఉత్సాహంతో మా కార్యక్రమం సాగించాలి. డాన్ వెనూస్టియానో మాకు అన్నివిధాలా సహాయం చేస్తాడు.

కారులో తిరిగి వస్తూండగా డాన్ మాన్యూలును అడిగాను: "ఈ అనామక విదేశీయునిపట్ల మీ కింతటి శ్రద్ధాసక్తులు, విశ్వాసమూ ఎలా కలిగినై?"

"నిజానికి మీరు విదేశీయులు కాబట్టే. అవసరమైతే విదేశాంగనీతికి మిమ్మల్నే బలిచేయవచ్చు. మీ చర్యలకు, కార్యక్రమాలకు బాధ్యత అంతా మీదే ననీ, మా ప్రభుత్వాని కేమీ సంబంధం లేదని తప్పుకొనే అవకాశం ఉందిగదా!" నేను అప్రతిభుణ్ణి అయ్యాను. ఇంటిదగ్గిర నన్ను దిగబెట్టి, డాన్ మాన్యూలు నాకు హామీ యిచ్చాడు:

"డాన్ వెనూస్టియానో నీ కెన్నడూ అన్యాయం చేయడు. ఆ భయం నీకక్కర్లేదు. నీకు తెలియని దేముంది? ధనికవర్గీయ ఔదార్యమే అంత. ఇప్పటికే నిన్ను తమకు అప్పగించవలసినదిగా ఆంగ్లో అమెరికన్ ముఠా తెచ్చిన ఒత్తిడిని ముమ్మారు ప్రతిఘటించి నిన్ను రక్షించాడు."

## స్థానిక సోషలిస్టు అంతర్జాతీయత

మెక్సికో సోషలిస్టుపార్టీ మహాసభ 1918 డిసెంబర్‌లో జరిగింది. రాష్ట్రాల నుండి వందలకొలది ప్రతినిధులు హాజరైనారు. వారేగాక లాటిన్ అమెరికా కూటమి నిర్మాణాన్ని గురించీ, అందుకొక స్థాయీసంఘం యేర్పాటు చేయటాన్ని గురించీ చర్చించటానికై మధ్య దక్షిణ అమెరికా దేశాలనుండీ కూడా పలువురు ప్రతినిధులు వచ్చారు. వీరిలో న్యాయవాదులు, ఉపాధ్యాయులు, కవులు, రచయితలు, పత్రికాధిపతులే అధికంగా ఉన్నారు. వీరందరూ శ్రామికవర్గ దాస్యవిముక్తి కొరకై మహోత్సాహంతో పనిచేస్తున్నారు. కాని ఈ ప్రతినిధి వర్గాలలో పారిశ్రామిక కార్మికుడు గాని, రైతు (భూదేవి పుత్రుడు) గాని లేడు. ఈ విషయం నన్ను ఆకర్షించకపోలేదు గానీ, నాడు దాని ప్రాధాన్యతను నేనంతగా గుర్తించలేదు. మెక్సికో ప్రతినిధి వర్గంలో రైతు శ్రామికవర్గ సభ్యు లధికం గావటం ఆ లోపాన్ని కప్పిపుచ్చి ఇతర ప్రతినిధి వర్గాలలోని లోపాన్ని మనస్సు అడుగుకు నెట్టివేసి ఉండవచ్చు. ఈలాగా పొందిన అనుభవాలతో మనస్సు పరిపక్వమై, నూతనమతోదయంనాటి మంచుతెరలు తొలగి, ఇప్పుడా లోపాలన్ని పునశ్చరణకు వస్తున్నై.

మెక్సికో ప్రతినిధులలో నూనెగనుల పనివాండ్రు, బట్టలమిల్లుల్లో పనిచేసే స్త్రీ పురుషులు, గని కార్మికులు, రేవు రైల్వే పనివాండ్రు, మోటారు డ్రైవర్లు ఉన్నారు. ఇంకా కొందరు రైతులు, పెద్ద వ్యవసాయ క్షేత్రాలలోని ఓవర్‌శీర్లు,

రాజధానిలోని ఉపాధ్యాయులు, వైద్యులు, న్యాయవాదులు, రచయితలు, కళోపాసకులు మున్నగు విద్యావంతులు, ఉద్యోగులు కూడా ప్రతినిధుల్లో ఉన్నారు. కాని వీరిలో సోషలిస్టు సిద్ధాంతం పూర్తిగా తెలిసినవారొక్కరూ లేరు. పారిశ్రామిక కార్మికులలో ఎక్కువమంది అరాజక సిండికలిస్టులు; వారిలో మామూలు విద్యా ప్రమాణం చాల తక్కువ. కాని అందరూ ఆదర్శవాదులే. సాంఘిక విప్లవంలో గాఢవిశ్వాసం కలవారే. కారల్ మార్క్సుతో బాటు బకునిన్, క్రోపోట్కిన్‌లను గూడా ఆరాధించేవారు. కాని, నవసమాజమనే స్వప్నలోకాన్ని నిర్మించిన లెనిన్ పట్ల వీరికి ఇప్పుడిప్పుడే అభిమానం కలుగుతూ ఉంది. నాటికి అక్టోబర్ విప్లవం జరిగి సంవత్సరమైంది. ఆ విప్లవ నాయకుడైన లెనిన్ చిత్రాన్ని ఒక అమెరికా ప్రతినిధి సంపాదించాడు. అరాజకవాద, సిండికలిస్టువాద, సామాజకవాద సిద్ధాంతకర్తలతో బాటు లెనిన్ చిత్రానికి గౌరవప్రదమైన స్థానమీయ బడింది. జాన్‌రీడ్ అప్పుడే న్యూయార్కుకు తిరిగి వచ్చాడు. అక్టోబరు విప్లవాన్ని గురించి "ప్రపంచాన్ని ఉత్పాతలూగించిన పది రోజులు" (Ten days that shook the world) అనే ఉద్రేకపూరితమైన గ్రంథాన్ని రచించిన దీతడే. మెక్సికోలోని 'అతివాద బద్ధకస్తు'లకు పెద్దన్నలాంటివాడు. లెనిన్ చిత్రంతో బాటు, విప్లవానికి సన్నద్ధమవుచున్న మెక్సికో శ్రామిక వర్గానికొక సందేశం జాన్‌రీడ్ పంపించాడు.

మహోత్సాహంతో, మహాసభ ప్రారంభమైంది. కవి - చారిత్రకుని (జాన్ రీడ్) ద్వారా అక్టోబర్ విప్లవం పంపిన సందేశాన్ని విని కత్తులు దూయటానికి మెక్సికో శ్రామికవర్గం అక్కడ లేదు. ఉక్రోషంతో ఒక అరాజక సిండికలిస్టు ప్రతినిధి అన్నట్లు, 'ఆ సభలోని ఆసనాలన్నీ బూర్జువా రాజకీయ వాదులకొరకేర్పాటు చేసినవే.' ఈ లోపానికి ఆహ్వానసంఘం సమాధానం ఇలా చెప్పింది: "ఇండియన్ కామ్రేడు ఈ మహాసభాసమావేశానికి కారకుడు; అతని సలహాపైనే ఆహ్వానాలు పంపాం. ప్రగతిశీలమైన ప్రజాస్వామ్య భావాలుగలవారందరూ పాల్గొని, మనతో సహకరించితే సోషలిస్టుపార్టీ రాజకీయహోదా పెరగటమే గాక లాటిన్ అమెరికా కూటమి ప్రణాళికకుకూడా బలం చేకూరుతుందనే ఇండియన్ కామ్రేడ్ ఉద్దేశ్యం". ఈ విధంగా ఆహ్వానితులైనవారిలో ముఖ్యులు శాసనసభాధ్యక్షులు; కొందరు పార్లమెంటు సభ్యులు, ప్రముఖ పత్రికా సంపాదకులు, మరికొందరు రచయితలు. వర్గ సహకారంలో సోషలిస్టులకు విశ్వాసం లేదు. కాని బూర్జువావర్గ సానుభూతితో నిండిన వాతావరణంలో విప్లవ కార్మికమహాసభ జరపటం సాహసంతో కూడినపని. లాముజేర్ మోడర్నాను మాత్రం ఆహ్వానింపలేదు. ఆమే వచ్చివున్నట్లయితే పరిస్థితి విషమించేదనటంలో అతిశయోక్తి లేదు. సాంఘిక విప్లవం అని వెఱ్ఱికేకలు వేసే వారిలోకూడా, స్త్రీలపట్ల మధ్యయుగాలనాటి భావాలే పాతుకొనివున్నై. పెటీబూర్జువాలీ అసభ్యవర్తనను నిరసించటానికి బదులు పోషిస్తున్నారు.

మొత్తానికి సిండికలిస్టుల ఉద్రేకాన్ని శాంతింపజేశాం. ఆహ్వానితులై హాజరైన ప్రముఖవ్యక్తుల వలన మహాసభ ప్రాధాన్యత వెల్లడౌతుందనే తృప్తితో "దరిద్ర నారాయణులు" సంతోషించారు. ఎంత కాకలుదీరిన విప్లవకారుడైనా పొగడ్తను లొంగకపోడు. ఉన్నతరాజకీయాల్లో నే చేసిన ప్రథమప్రయత్నం ఈ విధంగా విజయవంతమైనదనే భావంతో నాకుగూడా మహదానందం కలిగింది.

మహాసభా కార్యక్రమానికి ఉపక్రమించబోతుండగా హాలువెలుపల జయ జయ ధ్వానాలు విన్పించినై. కర్ణుడులేని మహాభారతం లేదు! అదేవిధంగా శ్రామిక వర్గంలేని సోషలిస్టు మహాసభలో అర్థంలేదు. అమెరికా బద్ధకస్తు లీవిషయాన్ని ఆలోచించి రంగస్థల అవసరాలను చాల జాగ్రత్తగా సమకూర్చారు. హాలుకు వెలుపల రోడ్లమీద కార్మిక ప్రదర్శనాన్ని యేర్పాటుచేశారు. కార్మికులకు తగినస్థానమదే! విప్లవాలు జరిగేది వీధుల్లోనే గాని గదుల్లో కాదుగదా!

ఈ ప్రదర్శనాన్ని ఏర్పాటు చేసినవారు చార్లీఫిలిప్సు, ఇర్విన్ గ్రాన్‌విచ్. వీరిని సగౌరవంగా ఆహ్వానించటానికి ప్రతినిధులు హాలునుండి బైటికివచ్చారు. లెనిన్ పటం చాల పెద్దదే; దానివెనుక ఎఱ్ఱజెండాల మహారణ్యం; నినాదాలు వ్రాయబడిన అట్టలు! "యాంకీ సామ్రాజ్యవాదం నశించాలి"; "పెట్రోలియం మెక్సికో ప్రజలది," "లాటిన్ అమెరికా రాజ్యాల విప్లవపోరాటమి వర్ధిల్లాలి"; "మెక్సికో సోవియట్ రిపబ్లిక్‌కీ జై"-ఇవన్నీ స్పానిష్‌భాషలోనే వ్రాయబడినై. ఉత్సాహం చార్లీని చాల దూరం తీసుకువెళ్ళిందనుకున్నాను. ఐనా అరాజక సిండికలిస్టుల ప్రదర్శనాన్ని ఈ నినాదాలకు సమ్మతింపజేయటం గర్వింపదగిన ఘనకార్యమే!

మా ప్రణాళిక ప్రకారం సోషలిస్టు కార్యకర్తలు మెక్సికో నగరంలోని మురికిపేటలలో నివసించే 'దరిద్రనారాయణుల' ముఠాలను ప్రదర్శనలో చేర్చే యేర్పాట్లుచేశారు. నగరం మధ్యలోనున్న 'ప్లాజా' అనే మైదానం ఈ ప్రదర్శనకు కేంద్రం. ప్లాజాకు ఉత్తరంగా బ్రహ్మాండమైన కెథెడ్రల్ (మఠం) భవనాలున్నై. క్రైస్తవమత విజయానికి చిహ్నంగా, మెక్సికో బానిసలశ్రమతో నిర్మింపబడిందా కెథెడ్రల్. తూర్పున విశృతమైన 'పెలేషియా నేషనల్' భవనం. ఇది ఒకప్పుడు కనులకు మిరిమిట్లు కొల్పుతూ ఉండేది; ఈ "జాతీయ ప్రాసాదం"లో విజేతలైన స్పానిష్ రాజప్రతినిధులు నివసించేవారు. ప్రస్తుతం అది రిపబ్లిక్ ప్రభుత్వ కార్యస్థానం. ప్లాజా బహిరంగసభలో చాలామంది మాట్లాడారు, చార్లీ ఫిలిప్సు బాగా ఆరితేరిన వక్త. చార్లీ అమెరికన్‌గదా! అతడే "యాంకీ సామ్రాజ్యవాదం నశించాలి" అని నినాదం చేయటంతో, దేశభక్తితో మహాసభ ఉప్పెనలాగా పొంగిపోయింది. తరువాత కార్మికుల శ్రేయోభివృద్ధికి తగిన చర్యలు తీసికొని, వారి సహకారంతో విప్లవాత్మకమైన, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను పటిష్ఠం చేయాలని

చార్లీ, ప్రెసిడెంట్ కరంజానుకోరాడు మహాసభాముఖంగా. మా ఏర్పాటు ప్రకారం పెలేషియో నేషనల్ బాల్కనీలోకి వచ్చి మహాసభను దర్శించి కరంజా ఒక ప్రకటన చేశాడు: "ప్రజాభిప్రాయాన్ని మేము శిరసావహిస్తాం; ప్రజల ఇచ్ఛయే దైవేచ్ఛ". కథెడ్రల్ సమీపంలో కరంజా చేసిన వాగ్దానం మతాభిమానంగల విప్లవ ప్రజానీకానికి ఎంతో తృప్తినిచ్చింది. ప్లాజానుండి నగర రాజవీధిగుండా మహాసభభవనానికి ప్రదర్శనం నడిచింది; అచట సమావేశమైన ప్రతినిధులకు, "శ్రామికశక్తి గెలిచింది," అనే సందేశాన్ని అందజేయటమే వారి ఉద్దేశ్యం.

ఆరోజు కార్యక్రమానికి నాయకుడు ఛార్లీఫిలిప్స్. ప్రతినిధు లతణ్ని హాల్లోకి బుజాలమీద మోసుకు వెళ్ళారు. అతన్నే ప్రథమ సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. ఉపన్యాసానికి ఉపక్రమిస్తూ, ఛార్లీ సభాసదుల్ని లేచి నిలబడమని కోరాడు. రష్యాలో కెరెన్స్కీ బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోసి, కర్షక కార్మిక వర్గాన్ని దాస్యశృంఖలాలనుండి విముక్తిచేసిన అక్టోబర్ మహావిప్లవ సందేశాన్ని చదవబోతున్నాడు. వీరపూజావిధానంలోని మానసిక దౌర్బల్యం చార్లీలో ప్రస్ఫుటంగా కనిపించింది. ఒక సంవత్సరానికిపూర్వం - నేనింకా సంయుక్తరాష్ట్రాలలో ఉన్న రోజుల్లో - అచటి అతివాదుల్లో కెరెన్స్కీపట్ల అభిమానం మిన్నుముట్టుతూ ఉండేది. ఈ అతివాదులంతా వాషింగ్టన్ స్క్వేర్‌లో చెబుతూ ఉండేవారు; వాషింగ్టన్ స్క్వేర్ న్యూయార్కు నగరానికి 'బొహిమియా'వంటిది-అంటే అతివాద విప్లవకారులకు కేంద్రం. నాటివరకూ పూజించిన భక్తులే కెరెన్స్కీని పూజాపీఠంనుండి క్రిందికి లాగేశారు. ప్రస్తుతం వారి ఆరాధ్యదైవం లెనిన్. వీరు నిన్న మొన్నటివరకు లెనిన్ పేరే వినలేదు. వీరికి అతడొక "నల్లగుఱ్ఱం". జర్మన్‌యేజంటనీ, ఫిన్‌లాండ్ సరిహద్దులో గడ్డివాముల్లో దూరి దాక్కున్న దుర్మార్గుడనీ లెనిన్‌ను గురించి నీచంగా మాట్లాడినవారే ఈనాటి లెనిన్ భక్తులంతా!

కార్మికవర్గ ప్రతినిధులూ, బూర్జువా అతిథులూ, పెట్రోగ్రాడ్ సందేశాన్ని శ్రద్ధతో ఆలకించారు. వాస్తవానికది పెట్రోగ్రాడ్‌నుండి వచ్చిందిగాదు. న్యూయార్కునందు జాన్‌రీడ్ తయారుచేసి పంపిందే! చదవటం పూర్తికావటంతో కరతాళధ్వనుల మధ్య మిన్నుముట్టిన "అక్టోబర్ మహావిప్లవం వర్ధిల్లాలి." అనే నినాదంతో హాలు దద్దరిల్లిపోయింది. ఒక దేవునిలో, ఒక క్రొత్తమతంలో విప్లవాత్మక శ్రామికవర్గ విశ్వాసం కేంద్రీకృతమైంది. "స్వర్గసీమ"ను అన్వేషిస్తూ నేనుకూడా ఆ భక్తసమాజంలో చేరాను.

ఉద్రిక్తవాతావరణం కార్యాచరణకు అనుకూలంకాదు. అందుచే అధ్యక్షోపన్యాసం తరువాత సభ వాయిదాపడింది. రెండవసమావేశంలో విదేశ ప్రతినిధులు ఉపన్యసించారు. అర్జంటైనానుండి ఒక న్యాయవాది, పెరూనుండి ఒక

యువకవి, కొలంబియానుండి ఒక ఆచార్యుడు మొదలుగా ఉపన్యసించారు. మెక్సికో అతిథు లందరి తరఫున స్వేచ్ఛ, సాంఘిక న్యాయాల్లో తమ విశ్వాసాన్ని ఉద్ఘాటించ టానికో అన్నట్లుగా శాసనసభాధ్యక్షుడు మాట్లాడాడు. ఆతడూ సోషలిస్టేకదా! అతని భావాలను బలపరుస్తున్నట్లు రెక్టార్ కాసోస్ తల ఆడించటం గమనిస్తూనే ఉన్నాను. ఆ క్షణం వరకూ అనుమానపు చీకట్లు దోబూచు లాడుతున్న శ్రామిక సభాముఖంలో చిరునవ్వు వెలుగులు సాక్షాత్కరించినై.

ఇంతలో రాష్ట్ర ప్రతినిధుల్లో ఒకడు సభావేదికమీద ప్రత్యక్షమైనాడు. నిండైన విగ్రహం, దుస్తులపట్ల అంత శ్రద్ధ వహించినట్లు లేదు. అధ్యక్షుని అనుమతి కోసం నిరీక్షించకుండానే ఉపన్యాసం ప్రారంభించాడు. కంచుగంటలాంటి గొంతు: "బూర్జువా సామాజిక వ్యవస్థ, తూటు పడిన పడవ అవస్థలో ఉంది; అది నేడో రేపో మునిగిపోవడం తథ్యం; దానిని విడిచి తుపానులు రేగే విప్లవ మహాసముద్రంలో దుమికి, శ్రామికవర్గంతో చేతులు కలపటానికి మా అతిథులు సముచితమైన నిర్ణయం చేశారు; ఇది చారిత్రాత్మకమైన నిర్ణయం, వారికి నా అభివందనలు" అంటూ తిరిగి సభ్య మహాసముద్రంలో కలిసి పోయాడు. ఇటువంటి సంఘటనలు మెక్సికోలో సర్వసామాన్యం. మరుక్షణంలో శాసనసభాధ్యక్షుడైన డాన్ మాన్యూలూ, ఆ ఉప న్యాసకుడూ ఆలింగనం చేసుకుంటూ కన్పించారు. సభాభవనమంతా ఉద్రేకంతో ఉట్టూతలూగిపోయింది. కరడుగట్టిన వర్గచైతన్యం కట్టలు తెంచుకొన్న సుహృద్భా వంగా ప్రవహించింది. ఎక్కడ చూచినా పరస్పరాలింగనాలే! కరస్పర్శలే! 'ఇంటర్నేషనల్' పాడాలని ఛార్లీ సూచించటంతో ఉద్రేకం తారస్థాయి నందు కొన్నది. వస్తుతా మెక్సికనులు సంగీతాభిమానులు. సభ అంతా కలిసి ఇంటర్నేషనల్ పాట పాడ సాగింది. పాశ్చాత్య సంగీతంలో స్వరం, సాహిత్యం వేటికవే స్వతంత్రంగా ఉంటై; సాహిత్య పరిచయం లేకుండానే స్వరం వాయించటానికి వీలుంది. ఆ మహాసభ అంతటికీ నేనొక్కడనే సంగీతం రాని వాణ్ణి. ఎన్ని సంవత్సరాలు గడిచినా 'ఇంటర్నేషనల్' పాడటంలో కలవలేకపోయేవాణ్ణి!

ఆ దృశ్యాన్ని సృష్టించిన రాష్ట్రప్రతినిధి ప్లూటార్కో ఎలియస్ కాల్లెస్, సొనోరా రాష్ట్రంలో ఒక ఉపాధ్యాయుడు. తారాజువ్వలాగా రాజకీయాల్లో పైకి వచ్చిన అతని జీవితం, ఈ సభలో ఉపన్యాసంతోనే ప్రారంభమైందని చెప్పవచ్చు. ఆందోళన లేవదీయటంలో చాల సమర్థుడు. ఐనా నాయకత్వానికి అవసరమైన విద్య, విచక్షణా, సమర్థతా కలవాడు; ఇంతకు పూర్వమే అతనితో ఉత్తర ప్రత్యుత్త రాలు జరిపాను. ఇప్పుడు పరిచయం చేసుకోవటం జరిగింది.

కార్యనిర్వాహకవర్గాన్ని అధ్యక్షు, కార్యదర్శులనూ ఎన్నుకోవటంతో మహాసభ కార్యక్రమం పూర్తయింది. మెక్సికో సోషలిస్టుపార్టీ రాజధానికే పరిమితమైన

చిన్న సంస్థకాదు. జాతీయ సంస్థగా రూపొందింది. ఐనా అరాజక సిండికలిస్టు సిద్ధాంత భూతం మాత్రం ఇంకా సోషలిస్టుపార్టీని విడిచి పెట్టలేదు. క్రొత్త రాజ్యాంగంప్రకారం 'మెక్సికో సోషలిస్టుపార్టీ' అనే పేరు పెట్టబడింది. (Elpartido Socialistade Mexico). కాని జాతీయాభిమానాన్ని సూచించే ఈ పేరును శ్రామికవర్గ అంతరాత్మ సహించలేక పోయింది. 'సోషలిజం అంతర్జాతీయ సిద్ధాంతం; దానికి జాతీయ, దేశీయ పరిధులుండకూడదు' అని తీవ్రమైన వాదోపవాదాలు జరిగి చివరకు రాజీమార్గంగా మరొక పేరు సూచించబడింది. అది : 'మెక్సికో స్థానిక సోషలిస్టుపార్టీ'. 'స్థానిక' అనే మాట భౌగోళికమైంది కావటంచేత సోషలిస్టుపార్టీ అంతర్జాతీయతకు భంగం రాదని వారి ఉద్దేశ్యం. ఈ అంతర్జాతీయ స్వభావానికి నిదర్శనంగా పరదేశినైన నన్ను క్రొత్త పార్టీ జనరల్ సెక్రటరీగా ఏకగ్రీవంగా ఎన్నుకొన్నారు.

స్థానిక అంతర్జాతీయ మహాసభను సమావేశపరచాలని కూడా నిర్ణయం జరిగింది. లాటిన్ అమెరికా కూటమి నిర్మాణమే స్థానిక మహాసభ లక్ష్యం. ఆ సభను ఏర్పాట్లు చేయటానికై ఒక కమిటీ నియమింపబడింది. అందులో మెక్సికన్లూ, మధ్య దక్షిణ అమెరికా ప్రతినిధులు సభ్యులుగా ఎన్నుకొనబడ్డారు. ఈ కమిటీ కార్యస్థానం కూడా మెక్సికో. సోషలిస్టుపార్టీ కార్యదర్శినైన నన్నే ఈ కమిటీ కార్యదర్శిగా ఎన్నుకున్నారు. దీని ప్రథమ సమావేశంలోనే జరగబోయే మహాసభను గురించీ, లాటిన్ అమెరికా కూటమి నిర్మాణాన్ని గురించి తీవ్ర అభిప్రాయ భేదాలు కలిగినై. స్థానిక అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ అవసరమేనని అధిక సంఖ్యాకులు అంగీకరించారు. యాంకీ సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించి, స్వేచ్ఛ ప్రజాస్వామ్యాలను రక్షించే కృషిలో సోషలిస్టులు కానివారి సహకారం లభించగలదని కూడా అంగీకరించారు. కాని, నాయకత్వం శ్రామికవర్గం చేతుల్లో లేనిచో అవకాశవాదుల కుతంత్రాలకు మా ప్రణాళికలు బలికాగలవని వారి భయం. ఈ సమావేశంలో ఒకే ఒక నిర్ణయం జరిగింది. ఈ దేశాలలో పర్యటన జరిపి మా ప్రణాళికలకు గల అవకాశాలను పరిశీలించాలి. ఈలోగా ప్రతినిధులు తమ తమ దేశాల్లో స్థానిక సంఘాలు స్థాపించి మా ప్రణాళికలకు జనాదరణ సాధించాలి. అన్నిటికంటె ముందు మెక్సికో సోషలిస్టు పార్టీ పునర్నిర్మాణం జరగాలి.

రాష్ట్రాల్లో పార్టీ కార్యాలయాలను స్థాపించే ప్రణాళికను గురించి, కార్యవర్గం రాష్ట్ర ప్రతినిధులతో సంప్రదించింది. ఈ సమావేశంలో ప్రతినిధు లందరిలో కాలెస్ అగ్రగణ్యుడుగా రాణించాడు. సానోరాలో సోషలిస్టుపార్టీ సాయుధ తిరుగుపాటు జరిపి, ఓబ్రెగాన్ ప్రభుత్వాన్ని కూలద్రోయాలనే కాలెస్ సూచనతో పార్టీ కార్యవర్గం దిగ్భ్రాంతి చెందిందనే చెప్పవచ్చు. ఓబ్రెగాన్‌కు అపారమైన సైనికబలం ఉందనీ, అమెరికానుండి సహాయం కూడా లభించగలదనీ అతని దృష్టికి తెచ్చారు. అందుకు సమాధానంగా కాలెస్ ఉద్రేకంతో అన్నాడు: "సరిగా

ఆ కారణాల వల్లనే ఓబ్రెగాన్‌కు వ్యతిరేకంగా నేను నడిపే ఉద్యమంలో నాతో రహస్యంగా ఫెడరల్ ప్రభుత్వం సహకరించాలి.'' ఇవి కేవలం లౌకిక జ్ఞానం లేకుండా అన్న మాటలు.

సాయుధ విప్లవం అనేది నోరూరించే సూచనే. కాని బాల్యదశ గడవని మా పార్టీ అందుకు సిద్ధంగా ఉన్నదా? అనేదే సమస్య. ప్రస్తుత పరిస్థితిలో, కాలెస్ సూచన పార్టీకి మ్రింగుడు పడేది కాదు. కాలెస్ నన్ను సంబోధిస్తూ అన్నాడు: ''కామ్రేడ్ జనరల్ శక్రటరీ! మెక్సికోలో వ్యవహారాలన్నీ ఇదే విధంగా ఉంటై. ఈ విషయాన్ని గురించిన వివరాలు మీతో మాట్లాడాలి.'' అతనితో సంభాషణలు జరపటానికి కార్యవర్గం నన్ను అనుమతించింది. ఆ సాయంత్రమే గ్రామ ఉపాధ్యాయునితో సన్నిహిత పరిచయం ఏర్పడింది. అతని ప్రణాళికా వివరాలను గ్రహించాను. నాల్గు సంవత్సరాల్లో మెక్సికో అధ్యక్షుడు కాబోతున్నాడు కాలెస్!

## విప్లవానికి సన్నాహాలు

ఆ రాత్రి కాలెస్‌ను భోజనానికి ఆహ్వానించాను. నా బస ఉన్నతోద్యోగులు నివసించే 'కలోనియా రోమాలో'; నేనుండే ఇల్లు రెండంతస్తుల మేడ; ఎనిమిది విశాలమైన గదులు; గదులనిండా పదునైదవ లూయీ చక్రవర్తి కాలంనాటి సామాగ్రి. కుర్చీలకు ఆకుపచ్చని శాటిన్ తొడుగులు, కాని ఈ కుర్చీలుగానీ, శాటిన్ తొడుగులుగాని నేను కొన్నవి కాదు. వాటితోనే ఇంటిని అద్దెకు పుచ్చుకొన్నాను. మేరియా అనే మెక్సికన్ యువతి పనిమనిషిగా ఉండేది. గదులన్నీ శుభ్రంగా ఉంచేది. వంట చేయటంలో మంచి సమర్థురాలు. ఒక కుఱ్ఱవాడి సాయంతో (ముచాచో) కావలసిన బజారు వెచ్చాలన్నీ స్వయంగా తెచ్చుకొనేది. ఇట్టి నా జీవితవిధానంలో శ్రామికవర్గ వాసనలేమీ లేవు. కాని కాలెస్‌తో రహస్యంగా సంప్రతించటానికి నా జిహకంటే అనుకూలమైన తావు కన్పించలేదు.

మేరియాతో చెప్పాను. ''సెనోరా రాష్ట్రంనుండి ఒక పెద్ద మనిషి భోజనానికి వస్తున్నాడు; మంచి వంటకాలు తయారు చేయాలి'' అని. గొప్ప గొప్ప పదార్థాలు చేసింది; కాని అతిథి మెక్సికో దేశస్థుడే కావటం ఆమెకు ఆశాభంగాన్ని కలిగించింది; నా అమెరికా మిత్రులను గురించి ఆమె గర్విస్తూ ఉండేది. అప్పుడప్పుడూ వారామెతో పోట్లాడుతూండేవారు. నేను మధ్యవర్తిత్వం చేయాల్సి వస్తుండేది. కాలెస్, వంటకాలన్నిటినీ, ముఖ్యంగా బాగా కారంగా ఉన్న వాటిని చాలా మెచ్చుకున్నాడు. మొక్కజొన్నపిండి రొట్టెలు (టార్టిల్లాలు) కూడా అతని ప్రశంసను పొందినై.

ఆ క్రిందటి రోజే పార్టీ సమావేశంలో విదేశీయుణ్ణి కావటంచేత నాకు మెక్సికో సాంప్రదాయాలేమీ తెలియవని కోపించాడు కాలెస్. అతని మాటలు కార్యవర్గసభ్యులకు కోపం తెప్పించినై. వారి ముఖాలు చూచి తన పొరబాటు నప్పుడే గ్రహించాడు కాలెస్. నేను కూడా అతని మాటలను లక్ష్యం చేయలేదు. కానిపక్షంలో 'ఇండియన్ కామ్రేడ్' పట్ల విశ్వాస తీర్మానం చేయవలసి వచ్చేది. కాలెస్ ఇరుకునబడి పోయేవాడు. తన అభిప్రాయాన్ని గట్టిగా చెప్పాలనే గానీ అతనికి కూడా నన్ను అవమానపరచే ఉద్దేశ్యం లేదు. ఆ సంఘటన గుర్తుకు రాకుండా కాలెస్‌ను ఉల్లాసంగా ఉంచటానికే నే చేసిన ప్రయత్నం.

భోజనానంతరం కార్యక్రమానికి ఉపక్రమించాం. కాలెస్ చేసిన మొదటి పని క్రితంరోజు తన 'క్షమింపరాని ప్రవర్తనకు (అత డుపయోగించినమాటలే) క్షమాపణ కోరటం. తరువాత తన ప్రణాళికను వివరించాడు. అందులో సాహసంతో బాటు మోసంకూడా లేకపోలేదు. ఆ ప్రణాళిక ఆచరణయోగ్యం కాకపోనూ లేదు. 'జనరల్ ఓబ్రెగాన్ అధ్యక్షపదవికి పోటీచేయటమనేది తథ్యం; కరంజా విదేశ విధానంఅంటే ఇష్టంలేని అమెరికన్లు ఓబ్రెగాన్‌కు తప్పక సహాయంచేస్తారు. సొనోరా అమెరికా సరిహద్దున ఉండటం, ఓబ్రెగాన్‌కు చాల అనుకూలం; అమెరికాసాయంతో కరంజాకు వ్యతిరేకంగా అతడొక సైన్యాన్నికూడా తయారుచేయవచ్చు. కాబట్టి సొనోరానుండి ఓబ్రెగాన్‌ను తొలగించటం కరంజాకు చాలముఖ్యం' అని కాలెస్ చెప్పాడు. "ఈ విషయంలో సోషలిస్టుపార్టీ చేయగలదేముంది?" అని అడిగాను. "మీరు అధ్యక్షుని రహస్య సలహాదారులుగదా! అందుకనేగా మిమ్ములను సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా ఎన్నుకొన్నది!" అన్నాడు. మెక్సికోలో రాజకీయ బుద్ధుల నైశిత్యానికి నాకు చాల ఆశ్చర్యం కలిగింది. వాస్తవానికి క్రిందటిరోజు నన్ను గురించి కాలెస్ చేసిన విమర్శనలో నిజం లేకపోలేదేమో ననిపించింది. అతని బుఱ్ఱనిండా ఆలోచనలూ, కార్యక్రమాలు. వాటి నెంతో ఆత్మవిశ్వాసంతో వివరించాడు. నేను మాత్రం వింటూ కూర్చున్నాను. మాట్లాడటానికి నాకు అవకాశం కూడా ఇవ్వ లేదు కాలెస్.

ఓబ్రెగాన్ అధ్యక్ష పదవికి పోటీచేయ నిర్ణయించాడు కాబట్టి ఎన్నికల ప్రచారానికి వీలు కలిగించే సాకుతో అతణ్ణి గవర్నరు, సేనాధిపతి పదవులనుండి విరమింప జేయాలి. అట్టి పరిస్థితుల్లో మెక్సికో సాంప్రదాయం సాయుధతిరుగుబాటు అంటే ఓబ్రెగాన్, కరంజాపై సైనిక తిరుగుబాటు చేస్తాడు. ఐతే ఓబ్రెగాన్‌కు వ్యతిరేకంగా బలవత్తరమైన తిరుగుబాటు కాలెస్ తీసుకు రాగలడు. అందుకు ఫెడరల్ (కరంజా) ప్రభుత్వం కాలెస్‌కు మద్దతుగా నిలబడాలి. అంటే సొనోరా రాష్ట్రానికి కాలెస్‌ను గవర్నరుగా నియమించాలి. ఈ ప్రణాళిక ప్రెసిడెంటుకు

నివేదించటానికి పూర్వం నేను సొనోరా రాష్ట్రంలో పర్యటించి పరిస్థితులే విధంగా కాలెస్‌కు అనుకూలమో స్వయంగా పరిశీలించాలి.

కాలెస్ ప్రణాళిక నాలో గూడా ఉత్సాహాన్నీ, సాహసాన్ని పురికొల్పింది. కానీ ఇది నా తలకు మించిన పనేమో అనే అనుమానం కూడా లేకపోలేదు. ఈ సాహసం విఫలమైతే పోయేదేమీ లేదు. ఇండియాలో ఇటువంటి సాహసాలను గురించే కలలు కన్నాము. వాటిలో కొంత అనుభవాన్నైనా పొందవచ్చు. పోనీ, విఫలమైతే మెక్సికో నుండి పారిపోవాలి. తలదాచుకోవటానికి మరొక దేశాన్ని వెదుక్కోవాలి. అంతే. అందుచే కాలెస్ ప్రణాళికకు సమ్మతించాను. రెండు రోజుల్లో కాలెస్ సొనోరాకు ప్రయాణం కట్టాడు. నేను కూడా ప్రయాణం కావాలి.

పార్టీ కార్యవర్గంలో కాలెస్ ప్రణాళికను వివరించినప్పుడు, సభ్యులు యుద్ధాశ్వాలలాగా ముందు కురికారు. ప్రస్తుతం సోషలిస్టుపార్టీ చిన్న ప్రచారకుల సమాజం కాదు. అనతికాలంలో సాయుధ విప్లవాన్ని నడపనున్న మహోద్యమం! తమ పార్టీ సభ్యుడొక రాష్ట్రానికి గవర్నరు కాబోతున్నాడు. ఆ రాష్ట్రములోనే నవసమాజ నిర్మాణానికి ప్రారంభోత్సవం జరుగుతుందనటంలో సందేహం లేదు. పార్టీ కార్యకర్తలలో ఉత్సాహవంతులిద్దరు నాతోబాటు సొనోరాకు రావటానికి సిద్ధమైనారు. నా భద్రత విషయమై వారెక్కువ ఆదుర్దా వెల్లడించారు. శ్రామికవర్గీయ వాత్సల్యాన్ని అణచుకోలేకపోయినారు. విప్లవం కేవలం స్వప్నంగా పరిణమించవచ్చు; కాని విశ్వాసపాత్రులైన మిత్రులను మాత్రం సంపాదించుకో గలిగాను.

ఓబ్రెగాన్ ముఠాకు అనుమానం కలుగకుండా ఒక ప్రకటన చేశాం: 'మహాసభ నిర్ణయం ప్రకారం సోషలిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి మెక్సికో రిపబ్లిక్ అంతటా పర్యటన చేస్తాడు' అని. పర్యటన కార్యక్రమంలో ఒరిజాబా, వేరాక్రూజ్, మెక్సికో అఖాతతీరంలోని పెట్రోలుగనులూ చేర్చబడినై. ఒరిజాబా నూలు పరిశ్రమ కేంద్రం. వేరాక్రూజ్ ప్రధాననౌకాశ్రయం. ఈ ప్రదేశాలన్నీ సొనోరాకు దూరంగానే ఉన్నై; కాకతాళీయంగా మాత్రమే సొనోరా పర్యటన జరుగుతుందనే అభిప్రాయం కలిగించే ఉద్దేశ్యంతోనే కార్యక్రమం తయారు చేయబడింది.

సొనోరా ప్రయాణం ప్రమాదభూయిష్టమైంది. నేరుగా వెళ్ళే రైలు మార్గం లేదు. సంయుక్తరాష్ట్రాలగుండా ప్రయాణం చేయాలి. లేదా పసిఫిక్ తీరం వెంబడి సముద్రయానం సాగించాలి. మొదటిది దగ్గర మార్గమేగాక భద్రమైన మార్గం. కాని ఆ మార్గాన ప్రయాణం చేసే ప్రాప్తం నాకు లేదు. ఇంతకుముందు పోర్టో మెక్సికో నుండి వేరాక్రూజ్‌కు తీరనౌకలో ప్రయాణం చేశాను. అది చాల భయంకరమైన అనుభవం. అందుచే పసిఫిక్ తీరంలో ఆ అనుభవాలను పునశ్చరణ చేయటం నాకిష్టం

లేదు. ఇక మూడవ మార్గం సైనికుల బండ్లలో నేల మార్గాన ప్రయాణం చేయటం. కాని సొనోరాకు బయలుదేరేముందు ముఖ్యమైనవారితో కాలెస్ ప్రణాళికను గురించి సంప్రదించాలి. అధ్యక్షుని అనుమతి కూడా పొందాలి. నేనూహించినట్లుగాక, సులభంగానే అధ్యక్షుని అనుమతి లభించింది. ముఖ్యంగా సైనికోద్యోగులు, మా ప్రణాళికను చాల సుముఖంగా ఉన్నారు. ఓబ్రెగాన్ ప్రమాదకరంగా పరిణమిస్తున్నాడు. ఇక ఎంతమాత్రం సహించకూడదు. సొనోరానుండి అతణ్ణి వెంటనే తొలగించాలి. లేనిచో టెక్సాస్ ఆయిల్ కంపెనీ చేస్తున్న ధనసహాయంతో పెద్ద సైన్యాన్ని తయారు చేయవచ్చు, అని వారి ఉద్దేశ్యం. ఇక మా ప్రణాళికలోని రాజకీయ విశేషాలను డాన్ వెనూస్టియానోతో చర్చించాలి.

సోషలిస్టుపార్టీ మహాసభల ఫలితాలను లాటిన్ అమెరికా కూటమి నిర్మాణ కార్యక్రమాలను గురించి విన్నవించేనిమిత్తమై ప్రెసిడెంటు కరంజాను కలుసుకొనే ఏర్పాటు వుండనేవుంది. ఆ సందర్భంలోనే కాలెస్ ప్రణాళికను నివేదించవచ్చు. నిజానికి ఈ ప్రణాళికే పైవాటికంటె ప్రస్తుతమైనదీ, ముఖ్యమైనదీ. తరచుగా ప్రెసిడెంటును కలుసుకొంటూండటంచేత నా విషయంలో మామూలు సాంప్రదాయాల హంగామా పాటించలేదు. అందుచే డాన్ మాన్యూలు ఇంట్లో భోజనాలసందర్భంలో కరంజాను కలుసుకొన్నాను.

లాటిన్అమెరికా కూటమి కార్యక్రమం ముందరికొడిగా సాగుతున్నదని నివేదించాను. ఆ కార్యక్రమంలోకంటె, కాలెస్ ప్రణాళికలోనే డాన్ వెనూస్టియానో ఎక్కువ శ్రద్ధచూపించాడు. ప్రెసిడెంటు అంత బహిరంగంగా బలపరచటానికి అవకాశంలేదు. రాజ్యాంగరీత్యా అతడు దేశాధిపతి. ఓబ్రెగాన్ అతనిక్రింద ఉద్యోగి. తనక్రింది ఉద్యోగిపై సైనికవిప్లవాన్ని రాజ్యాంగరీత్యా ప్రెసిడెంటు ఎలా సమర్థించగలడు? 'ఓబ్రెగాన్ పరిపాలనా దక్షతవల్లనే సొనోరాలో ప్రశాంతపరిస్థితులు నెలకొనినై, అందుకతణ్ణి అభినందించాలి. రాజ్యాంగరీత్యా ఎన్నికలు జరపటానికీ, అందులో స్వేచ్ఛగా ప్రజలుపాల్గొనటానికీ తగినచర్యలు తీసికొనవలసినదిగా ఫెడరల్ ప్రభుత్వం ఓబ్రెగాన్‌కు ఉత్తర్వులు పంపుతుంది' అన్నాడు కరంజా. ఈ మాటలతో కరంజా మా కార్యక్రమానికి తోడ్పడతాడనేది స్పష్టమైంది. కరంజా రాజ్యాంగ విధేయత, ఓబ్రెగాన్ వ్యతిరేకఉద్యమ పురోగతికి వచ్చెండా! మెక్సికో రాజకీయాలిప్పుడిప్పుడే అర్థంకాసాగినై.

ఓబ్రెగాన్ అధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలబడుతున్నాడు. ఆ కాలంలో అతడు ఎన్నికలప్రచారం చేసుకొనేందుకు వీలుగా అతనికిగల బాధ్యతలు తొలగించాలి. అందుచేత, సొనోరా రాష్ట్ర గవర్నర్ ఎన్నిక వెంటనే జరపాలని ఫెడరల్ ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. వెంటనే సోషలిష్టుపార్టీ సొనోరా ఎన్నికల్లో పోటీచేయటానికి

తగిన అభ్యర్థిని నిర్ణయించి ఎన్నికల ప్రచారం ప్రారంభించటానికై పార్టీ ప్రధాన కార్య దర్శిని, మరి ఇద్దరు కార్యవర్గ సభ్యులను సానోరా రాష్ట్రానికి పంపటానికి నిర్ణయించినట్లు ప్రకటించింది. దీనివలన దేశపర్యటన సందర్భంలో కాకతాళీయంగా సానోరా సందర్శించటమనే దాగుడుమూతలతో అవసరం తప్పింది. ఇనప్పటికీ సరిహద్దులను సమీపంలోఉన్న నౌకాశ్రయాలనుగానీ, నగరాలనుగానీ వెళ్ళవలదని ఫెడరల్ ప్రభుత్వం నన్ను హెచ్చరించింది. అక్కడ నా భద్రతను వారేమాత్రం పూచీ వహించలేరు. కారణం? నా పూర్వ విరోధులు ఇప్పటికీ నన్ను తప్పించే ప్రయత్నాలను కొనసాగిస్తూనే ఉన్నారట.

సానోరాను స్థానిక సైనికాధికారుల రక్షణలో నేలమార్గాన ప్రయాణం చేయటానికి నిశ్చయించాను. మధ్య మెక్సికోలోని అగుయాస్కాలీన్‌టెస్, డ్యురాంగో అనే ఐశ్వర్యవంతమైన రాష్ట్రాలగుండా ప్రయాణం చేయాలి. మెక్సికో వెండిగనులీ ప్రాంతాలలోనే ఉన్నై. తరువాత సియెర్రామాండ్రీ పర్వతశ్రేణుల ప్రక్కగా పోతుంది మా మార్గం. ఇవి చాల ఎత్తైన, గంభీరమైన పర్వతశ్రేణులు. వీటిని 'మెక్సికో వెన్నెముక' అని వర్ణిస్తుంటారు. ఇవి విస్తరించి ఉత్తరరాష్ట్రాలైన సానోరా, చిహువాహువాలను సరిహద్దుగా ఏర్పడినై. చిహువాహువా రాష్ట్రం ఇంకా బందిపోటు నాయకుడైన పాంకోవిల్లా చేతుల్లోనే ఉంది. ఈ రాష్ట్రంలో పెద్దపెద్ద సీసం, తుత్తునాగం, వెండిగనులూ, నూనెశుద్ధి కర్మాగారాలు, పశుపాలనా కేంద్రాలు (Cattle Ranches) ఉన్నై. ఇవన్నీ అమెరికావారి స్వాధీనమే. వారి ఉదార ధనసహాయంతోనే పాంకోవిల్లా ఆ రాష్ట్రాన్ని దుర్భేద్యమైన కోటగా చేసికొని యేలుతున్నాడు. సియెర్రామాండ్రీ పంక్తుల దక్షిణపుటంచుల్లో ఉన్నది అగుయాస్కాలీంటెస్. ఈ మాటకు 'వేడినీటి బుగ్గలు' అని అర్థం. రాష్ట్రం నిండా ఉన్న వేడి నీటిబుగ్గల వలననే ఆ పేరు ఆ రాష్ట్రానికి సార్థకమైనది. వలసపాలన యుగంలో స్పెయిన్ దేశం నుండి వ్యాధిగ్రస్తులైన ధనికులీ ప్రాంతాలను చేరుతూవుండేవారు. డయస్ కాలంలో క్రొత్త ప్రపంచంలోని విలాసకేంద్రాలుగా ఈ ప్రాంతాలు రూపొందించబడినై.

ఐదు సంవత్సరాలు భయంకరంగా చెలరేగిన అంతర్యుద్ధంలో నీ రాష్ట్రాలు స్మశానాలుగా మారిపోయినై. విదేశీ యజమానులు ప్రాణాలతో బయటపడ్డారు. వారివారి ప్రభుత్వాలుకూడా వారికి రక్షణ నీయలేకపోయినై. వారి ఆస్తిని దోపిడి గాండ్రు దోచుకున్నారు. అంతర్యుద్ధంవల్ల మెక్సికోలో ఏర్పడ్డ అరాజక పరిస్థితులలో బాగుపడినది దోపిడీగాండ్రే. ఫెడరల్ సైనికస్థావరాలేర్పడటంవల్ల ఇప్పుడిపుడే పరిస్థితులు మెరుగవుతున్నై. నూనెశుద్ధి కర్మాగారాలు ఇంకా పనిచేయడంలేదు. కాని కొన్ని గనుల్లో త్రవ్వకం ప్రారంభమైంది. ఆ ప్రాంతాల్లో నిరుద్యోగసమస్యగూడా మెల్లగా పరిష్కారమౌతోంది.

ఈ రాష్ట్రాల్లో శ్రామికుల కేమాత్రం రక్షణ లేదు. వారిని గురించిన సాను భూతితో నా మిత్రుల శ్రామికహృదయాలు, నిండిపోయినై. ఇక్కడ ఆగి సభలు, సమావేశాలూ జరపాలనీ, కార్మిక సంఘాలు స్థాపించాలనీ సోషలిస్టుపార్టీ శాఖను నెలకొల్పాలనీ, నా మిత్రులు పట్టుబట్టారు; అట్టి విప్లవాత్మక చర్యలకు స్థానిక సైన్యాధి పతులు, సమ్మతిస్తారో లేదో అనుమానం. ఏమైనా శ్రామికవర్గవిముక్తికై స్వచ్ఛందో ద్యోగులైన వారి ధర్మనిర్వహణను కాదనటం సాధ్యం కాలేదు. నిష్కల్మషమైన మనస్సులతో స్వధర్మంలో అచంచల విశ్వాసం గలవారు విప్లవాత్మకమైన రాజకీయ కుట్రకు అవసరమైన రహస్య సంప్రదాయాలను గమనింపలేరు. చాల ప్రయాసతో కూడిన ప్రయాణంలో కొన్ని రోజుల విశ్రాంతి కూడా మంచిదే. మా మిత్రులు స్వధర్మ నిర్వహణలో మునిగి పోయారు. నేను విశ్రాంతి తీసుకొన్నాను.

గ్రామాలన్నీ ఎడారి సమానంగా ఉన్నై. గనులలో గడ్డి మొలిచింది. నూనెశుద్ధి కర్మాగారయంత్రాలు త్రుప్పు పడుతున్నై. ఫ్యాక్టరీల గోడలు కూడా కూలి పోతున్నై; చుట్టూ లోయ. దట్టమైన అడవులతో నిండిన కొండవాళ్ళు; అక్కడక్కడ పొంగివచ్చే వేడినీటిబుగ్గలూ. ఆ ప్రాంతంలో దోపిడిగాండ్రు లేరని స్థానిక సైన్యాధికారి హామీ యిచ్చాడు. ప్రయాణం సాగించినకొద్దీ ముందు ముందు వారి ఘాతుకచర్యలను గురించి తెలియవచ్చింది.

స్థానిక సైనికాధికారిని 'జెఫె' అంటారు. ఇండియన్ జాతికి చెందినవాడు. వయస్సు నలభై ఐదు సంవత్సరాలుంటై. మంచి హుషారుగా వుంటాడు. మెక్సికో సాంప్రదాయం ప్రకారం, నన్ను సోదరుడుగా, విప్లవంకోసం పోరాడుతున్న తోటి సైనికుడుగా, ఆహ్వానించాడు. విప్లవంలో విశ్వాసం వెల్లడించటంచేత అతనితో రాజకీయాలను గురించి ముచ్చటించాను. మా మిత్రుల కార్యక్రమాల కాతని కేమాత్రం అభ్యంతరం లేదుగదా అని అడిగాను. అతని ఉద్యోగ ధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తించటం మా ఉద్దేశ్యం కాదని కూడా వివరించాను. క్షమాపణ ధ్వనించే నా మాటలను గంభీరంగా మధ్యలోనే ఆపి, అన్నాడు: 'నేనెందుకు భయపడాలి? మనం అందరం బోల్షివిక్కులమే'. అజ్ఞానాన్ని నటించి, నా ఆశ్చర్యాన్ని కప్పి పుచ్చాను. 'నేను కేవలం సోషలిస్టుని, బోల్షివిజం అంటే ఏమిటి?' అని ప్రశ్నిం చాను. అతని సమాధానం మరింత ఆశ్చర్యకరం. "నాకు సోషలిజం అంటే ఏమిటో తెలియదు; దేశభక్తులైన మెక్సికను లందరిలాగా, నేను కూడా బోల్షివిక్కునే" నా అవస్థను గ్రహించి నట్లున్నాడా అజ్ఞాత లెనిన్ భక్తుడు; తన మాటలను వ్యాఖ్యా నించాడు: "యాంకీలకు బోల్షివిక్కులంటే పడదు; యాంకీలు మనకు విరోధులు; కాబట్టి బోల్షివిక్కులు మనకు మిత్రులై తీరాలి; మనం వారి మిత్రులం. అంతే. మన మంతా బోల్షివిక్కులం!" అన్నాడు.

చిరస్మరణీయమైన ఆ సంభాషణ జరిగిన సంవత్సరానికి అసలైన రష్యన్ బోల్షివిక్కును కలుసుకున్నాను. మా సంభాషణ అతనితో చెప్పాను. తనకంటే ముందుగనే తమ విప్లవ సిద్ధాంత ప్రతిధ్వనులు మెక్సికో కారడవులకు కూడా వ్యాపించ గలిగినై అని సంతోషించాడు. నా మనస్సులో మాత్రం అస్పష్టమైన అలజడి కలిగింది. విప్లవాత్మకమైన అంతర్జాతీయ సమైక్యతను, అర్థంలేని ఉద్రేకాల సమీకరణస్థాయికి దిగలాగటమా? చాలా సంవత్సరాల అనుభవం, ఆలోచన ఫలితంగా విప్లవ విశ్వాసంతో సిద్ధాంతంకంటె ఉద్రేకం పాలే ఎక్కువ అనే సత్యాన్ని గ్రహించాను.

## భావి మెక్సికో అధ్యక్షుడు

మెక్సికో రిపబ్లిక్‌లో పెద్ద రాష్ట్రాలలో రెండవది సానోరా. సానోరా ఉత్తర సరిహద్దులు సంయుక్తరాష్ట్రాలలోని అరిజోనా, న్యూమెక్సికోల సరిహద్దులుగ సుమారు నాల్గువందలమైళ్ళు కలిసి ఉన్నై. ఆ సరిహద్దు ఎడారి ప్రాంతం కావటం చేత స్పష్టంగా గుర్తించటానికిగానీ, గస్తీ ఏర్పాట్లు చేయటానికిగానీ సాధ్యం కాదు. అందువల్ల ఈ ప్రాంతంలో ఉభయదేశాల్లోనూ అనేక వస్తువుల్లో దొంగ వ్యాపారం ముమ్మరంగా సాగుతోంది.

విల్సన్ యొక్క కార్యదర్శి (Secretary of State)యైన జెన్నింగ్ బ్రియన్, ఫండమెంటలిస్టు, క్రిస్టియన్; అతని ప్రోత్సాహంతో, 1918లో సంయుక్త రాష్ట్రాల్లో మద్యనిషేధం అమలు జరిగింది. కాని టెక్సాస్, న్యూమెక్సికో, అరిజోనా రాష్ట్రాలలోని, రాంచీలలోనూ, గనుల ప్రాంతాలలోనూ, నిషేధ వస్తు ఆసక్తి ఎక్కువయింది. అందుచే సానోరా ఉత్తర సరిహద్దుల్లో, అపారంగా దొంగ వ్యాపారం సాగుతుండేది. కాలిఫోర్నియా, సింధుశాఖపైనున్న చిన్న రేవు పట్టణాలద్వారా ఎంతో సారాయి సంయుక్త రాష్ట్రాలకు చేరేది. మెక్సికోలో ఇది నిషేధ వస్తువు గాకపోవటంతో, సింధుశాఖమీద నున్న ముఖ్యరేవు పట్టణమైన 'గేమాస్' నుండి సరిహద్దు నగరమైన నొగేల్సు వరకు నిరాటంకంగా రైలుమీద ప్రయాణం చేసేది సారాయి. రైలు మార్గం సానోరా రాజధానియైన హార్మోసిల్లా గుండా వెళ్లేది. వ్యాపారస్థులు చైనా, జపాన్, మెక్సికో దేశాల వారేయైనా, వ్యాపారానికి పెట్టుబడి పెట్టుతున్నది అమెరికన్లే. మెక్సికోలో అమెరికా సైనికజోక్యం కలిగించుకొనటానికి దొంగ వ్యాపారమే కారణం. కాలెస్ రాజకీయ జీవితాభ్యుదయానికి తోడ్పడిన దీ పరిస్థితులే.

సానోరా పర్యటనలో చెప్పుకోదగిన విశేషాలేమీ జరగలేదు. రాష్ట్రంలో జనాభా ఎక్కువలేదు. ముఖ్యపట్టణం హార్మోసిల్లా. ఒక పెద్దగ్రామం, ప్రముఖ మెక్సికన్లలో చాలభాగం సరిహద్దునగరమైన నొగేల్సులో నివసిస్తూ ఉండేవారు. ఈ

పరిస్థితియే తన ప్రణాళికా విజయానికి అనుకూలమని కాలెస్ వివరించాడు. రాష్ట్రం దక్షిణ ప్రాంతమంతా ఇంచుమించు పర్వతమయం. సారవంతమైన లోయల ప్రాంతాల్లో ఆదిమవాసులు నివసిస్తున్నారు. వారికి రాజకీయాలక్కర లేదు. తమ జోలికి ఎవ్వరూ రాకూడదనే వారి ఆశయం. రాష్ట్రంలో అపారమైన ఖనిజసంపద వుంది. గనులన్నీ డయజ్ కాలంలోనే అమెరికావారు కొనుక్కు తీసుకున్నారు. అవి ఇంకా వారి చేతుల్లోనే ఉన్నై. దొంగవ్యాపారం తరువాత చెప్పుకోతగ్గవృత్తి పశుపాలన. కాని పెద్ద పెద్ద రాంచీలుకూడా అమెరికన్లే యజమానులు. అమెరికావారు మెక్సికో దేశానికి తామే ప్రభువులమనే భావాన్ని ప్రదర్శిస్తూ ఉండేవారు.

సానోరా ఉత్తరసరిహద్దు ప్రాంతాలకు వెళ్ళవలదని మెక్సికో నగరంలోనే నన్ను హెచ్చరించారుగదా! సానోరా ముఖ్యపట్టణం చేరుకోటానికి రాష్ట్రంలో చాలా దూరం ప్రయాణం చేశాం. ముఖ్యపట్టణంలో ఒక బహిరంగసభ ఏర్పాటైంది. అందులో సోషలిస్టుపార్టీ శాఖ నచ్చట స్థాపింపబడినట్లు ప్రకటించాం. సోషలిస్టు నాయకుడైన కాలెస్ మహోపన్యాసం చేశాడు. దాని సారాంశం: క్వారటారో రాజ్యాంగం ప్రకారం ఖనిజసంపద, వ్యవసాయక్షేత్రాలు జాతీయం చేయాలి; సైనిక పరిపాలనకు స్వస్తిచెప్పి, సివిల్ ప్రభుత్వాన్ని స్థాపించాలి; ఉపన్యాసం చివర తనను రాష్ట్ర గవర్నరుగా ఎన్నిక చేస్తే, సత్వరం వ్యవసాయంలో విప్లవాత్మక సంస్కరణలు గావించి, బానిసలకు విముక్తి ప్రసాదిస్తానని వాగ్దానం చేశాడు. సభికుల కరతాళధ్వనులతో దిక్కులు పిక్కటిల్లినై.

ఎన్నికలలో ప్రజలకు ఉత్సాహం వున్నట్టే కన్పించలేదు. కాలెస్‌తో ఆ విషయం హెచ్చరించాను. సమాధానంగా కాలెస్ తన విశ్వాసాన్ని వెల్లడించాడు. 'ఈ ప్రాంతంలో మరొక పార్టీ లేదు. అందుచే నాకు పోటీవుండదు. ఈ విశ్వాసంతోనే రాజ్యాంగవిధానాన్ని సూచించాను.'

సానోరాలో గ్రామీణప్రజానీకానికి ఇంకా కాథలిక్ మతాధికారుల వాక్కులే వేదవాక్కులు. సేనాపతుల ప్రోత్సాహంతో సైనికులు విచ్చలవిడిగా చర్చిలను, మఠాలను, దోచుకోనడంతో మతాధికారులు సైనికపరిపాలనను గర్హిస్తున్నారు. ఇది ఇలావుండగా మెక్సికో విప్లవకారులు మతాధికారులపై దండయాత్రలు సాగించారు. వీరిప్రభావం మారుమూల గ్రామాలకుగూడా వ్యాపించింది. ముఖ్యంగా 1850 ప్రాంతంలో, సానోరా రాష్ట్రంలో సామ్రాజ్యవాదులకు, జీరిస్టాలకు జరిగిన తీవ్రపోరాటానికి సానోరా రంగస్థలం కావటంవల్ల ప్రజల్లో విప్లవభావాలు, మతాధికారుల పట్ల నిరసన ఎక్కువగా ప్రచారమైనై. ఈ ఉద్యమానికి నాయకులు గ్రామీణ ఉపాధ్యాయులు. వారి నాయకుడు కాలెస్. కాబట్టి గ్రామంలో ఉపాధ్యాయుడు, పూజారి ప్రత్యర్థులైనారు. ఎన్నికల్లో పూజార్లు ప్రజాస్వామ్య

మతవిరోధులైన సోషలిస్టులకు వోటుచేయరు. కాని
అభ్యర్థికి 'ఓటు' చేస్తారు కాని
వేరే అభ్యర్థిలేని పక్షంలో కాలెస్ విజయం తథ్యం. ఐతే కాలెస్‌కు పోటీ ఉండదని
విశ్వసించటం ఎలా? నాటివరకు పరిపాలనాయంత్రాంగము అంతా సైనికాధికారుల
పరమైంది. వారు ఓబ్రెగాన్ ప్రత్యర్థుల సులభ విజయాన్ని సహిస్తారా?

ఆ మరునాడు జరిగిన సంఘటనతో నా భయాలు, అనుమానాలూ పూర్తిగా
తొలగిపోయినై. కాలెస్ ఆహ్వానంపై కొందరు స్థానిక సైనికాధికారులు నన్ను
కలుసుకొన్నారు. వారంతా ఓబ్రెగాన్ క్రింద ఉద్యోగులే; కాని వారంతా బోల్షి
విక్కులు! యాంకీ సామ్రాజ్యవాదాన్ని తుదముట్టించటానికై మెక్సికో బోల్షివిక్కు
పార్టీ స్థాపించబడినదని కాలెస్ వారితో చెప్పాడు. క్రొత్త పార్టీ అభ్యర్థినే విప్లవ
సైనికాధికారులు బలపరచాలి. ఇదే వారి ప్రతిజ్ఞ. అగాస్కాలీన్‌టెస్ రాష్ట్రంలో
'జెఫె'తో జరిగిన సంభాషణ ఇంకా మనస్సులో మెదలుతూనే వుంది. మారు
మాటాడకుండా మెక్సికో బోల్షివిక్ పార్టీ (?) తరఫున కృతజ్ఞతతో సైనికాధికారుల
వాగ్దానాన్ని స్వీకరించాను.

రాజధానికి తిరిగి వచ్చిన అనతి కాలంలోనే కాలెస్, కేవలం గాలిమేడల్లో
విహరించటం లేదని తెలిసింది. 'ఎన్నికే జరిగితే' అని పదే పదే కాలెస్ అన్న
మాటల్లోని అంతరార్థం బోధపడింది. తన పదవినుండి తొలగించటానికి కీ విధంగా
కుట్ర జరుగుతూ ఉండగానే ఓబ్రెగాన్ స్వయంగా రాజీనామా నిచ్చి తన సైనిక
కార్యస్థానాన్ని మెక్సికో నగరానికి మార్చేశాడు. ఇది చాల గొప్ప ఎత్తు. జనరల్
ఓబ్రెగానును కలుసుకొనేందుకై 'ఎల్ హెరాల్డ్' పత్రికా విలేఖరిని పంపాం.
ఓబ్రెగాన్ సూటిగా, స్పష్టంగా వివరించాడు. అధికార బాధ్యతలను తొలగించి
స్వేచ్ఛగా ఎన్నిక ప్రచారం సాగించుకొనటానికి అవకాశం కల్పించినందుకు డాన్
వెనూస్టియానోకు కృతజ్ఞత వెల్లడించాడు. అతని కార్యక్రమాన్ని గురించిన ప్రశ్నలకు
సమాధానం చెప్పాడు. అంతరంగికంగా వ్యవసాయ సంస్కరణలు, విదేశాలతో
మైత్రి అతని కార్యక్రమంలో ప్రధానాంశాలు .......యుద్ధంలో జర్మనీ గెలుస్తుందని
అతనికి విశ్వాసం లేదు....రష్యాలో ఏమి జరుగుతున్నదో అతనికి తెలియదు....అందుచే
తక్షణ కార్యక్రమం విదేశ పర్యటన. విదేశ పరిస్థితులను స్వయంగా చూచి రావాలి.
తమ భావి పురోభివృద్ధికై మెక్సికో ప్రజలు తనపట్ల విశ్వాసం ప్రకటించితే అందుకు
సర్వదా తాను సమర్థుడ ననిపించుకోవాలి. చాల తెలివిగా, అస్పష్టంగా ఉండేటట్లు
ఇచ్చిన ప్రకటన; అనేక ఊహలకు, అపోహలకు, వ్యాఖ్యానాలకు కారణమైందీ ప్రకటన.

తెర వెనుక అనేక పరిణామాలు జరిగినై. సొనోరాకు గవర్నరుగా కాలెస్‌ను
నియమించ వలసిందని ఓబ్రెగాన్ స్వయంగా కరంజాకు సూచించాడు. పోటీ
ఎలాగూ ఉండదు. కాబట్టి ఎన్నిక హంగామా అనవసరమని అతని వాదన. అంటే

ఓబ్రెగాన్ స్వయంగా పదవిని త్యజిస్తున్నాడన్నమాట. కాని అందుకు ప్రతిగా ఓబ్రెగాన్ ప్రెసిడెంటును కోరాడు; వాషింగ్టన్‌లో తనను రాయబారిగా నియమించాలి. అందువల్ల మెక్సికోకు జరిగే మేలును వివరించాడు: "యుద్ధంలో ఏ పక్షంవారు గెలిచినా సంయుక్తరాష్ట్రాలు ప్రపంచంలో అగ్రరాజ్యమై తీరుతుంది. బలిష్ఠమై సన్నిహితమై యున్న అమెరికాతో మెక్సికో మైత్రి వహించటం సముచితం. ఇప్పటికీ డాన్ వెనూస్టియానోపట్ల, తప్పో, ఒప్పో, వాషింగ్టన్, ఆగ్రహం వహించి ఉంది. మెక్సికోలోని ప్రముఖు లందరూ వెనూస్టియానో అనుయాయులనే భావం అమెరికాలో ప్రబలంగా ఉంది. కాబట్టి వెనూస్టియానో విదేశాంగనీతితో ఏకీభవించని వ్యక్తిని వాషింగ్టన్‌లో రాయబారిగా నియమించటంవల్ల దేశానికి మేలుజరగవచ్చు. ఆతడు అమెరికా మైత్రిని, విశ్వాసాన్ని తిరిగి సంపాదించే అవకాశం ఉంటుంది."

ఇంతటి ముఖ్య సమస్యకు పరిష్కారం వెంటనే నిర్ణయించటం కరంజాకు సాధ్యం కాకపోవచ్చు. అందుచే కొంతకాలం రాజకీయరంగంనుండి తప్పుకొంటాననీ, అధ్యక్షుడు అనుమతిస్తే, విశ్రాంతి, ఔషధ సేవల నిమిత్తం విదేశ పర్యటన చేస్తాననీ కూడా ఓబ్రెగాన్ చెప్పాడు. అంటే, తన ప్రత్యర్థిపట్ల, ఎంతో ఔదార్యం ప్రకటించాడు ఓబ్రెగాన్!

కరంజా ఓబ్రెగానుల భేటీని గ్రీక్, యూదుజాతీయుల భేటీతో పోల్చవచ్చు. ఒకరినొకరు మరొకరు టోపీ పెట్టటానికి చేసిన ప్రయత్నం! మెక్సికన్ రాజకీయాల్లో దొంగచాటుగా ప్రత్యర్థి వీపున పొడిచే పద్ధతికిది చక్కని నిదర్శనం. స్వదేశంలో పరాజయంపొంది విదేశాల్లో తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు ఓబ్రెగాన్. ఇక ప్రత్యర్థిని విదేశాలకు పంపినచో స్వదేశంలో తన పరిస్థితిని పటిష్టం చేసికొనే అవకాశం లభిస్తుందని కరంజా ఆశయం. "వర్తమానంలో జాగ్రత్తపడు; భవిష్యత్తు దాని జాగ్రత్త అది వహిస్తుంది." అనేదే కరంజా సిద్ధాంతం. ధనికవర్గ నిర్లక్ష్య స్వభావంలో జన్మించి, విప్లవలక్ష్యాన్ని గురించిన నా ప్రచారంతో బలపడిన సిద్ధాంతం. చివరకు కరంజా పరాజయంపొందాడు, నేను మెక్సికోను విడిచిపెట్టిన రెండుసంవత్సరాల తరువాత. ఆతని పతనానికి నేను కారణంకాదు. అతడే స్వయముగా నిర్ణయించి అనుసరించినమార్గం. మెక్సికోలో ఉండటమే తటస్థించివుంటే, చివరిదాకా కరంజాకు సహాయం చేసేవాణ్ణే. చిట్టచివరకు దేశంవిడచి పారిపోయి శరణార్థిగాఉన్నరోజుల్లో కరంజాను హత్యచేశారు.

జనరల్ ఓబ్రెగాన్ రాజీనామాను అంగీకరించి విదేశాల్లో విశ్రాంతి తీసుకొనేందుకు అతనికి ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ప్లూటార్కో ఎలియస్ కాలెస్‌ను సొనోరా రాష్ట్రగవర్నరుగా నియమించింది. అతనికి పోటీలేకపోవటంవల్ల ఎన్నికలు జరపటం అనవసరంఅనికూడా ప్రభుత్వం ప్రకటించింది. ఇది, సోషలిస్టుపార్టీ ప్రథమ

విజయం. 'ఎల్ హెరాల్డో' ప్రత్యేకసంచికలో పెద్దపెద్ద అక్షరాలతో ప్రచురించాం. సోషలిస్టుపార్టీ ప్రప్రథమ విజయానికొక మహోత్సవం జరిపింది. కాలెస్ సాహసము, సమర్థతే ఈ విజయానికి కారణం. విజయగౌరవం నిజానికి అతనిదే; కాని, సిద్ధాంత కర్తలు ఇది అరాజక సిండికలిస్టుల ఆదర్శవాదంపై, మార్క్సిస్టు యదార్థవాదంయొక్క విజయంగా ఉత్సవం జరిపారు. వారిదే యదార్థదృష్టియైతే, విజయగౌరవం నాకు దక్కాలి. కాని అందులో నా ప్రయోజకత్వం ఏమీలేదు. క్రొత్తగా పుచ్చుకొన్న మార్క్సిస్టుమతం ప్రకారం అంతా చరిత్ర నిర్ణయించిన ప్రకారం జరుగుతుందనీ, పరిస్థితుల మహిమకు తిరుగులేదనీ విశ్వసించాను. మన ఇష్టాఇష్టాలతో ప్రమేయంలేకుండా నడిచిపోయే చరిత్రగతిలో, నా ప్రయోజకత్వంఏమిటి ? నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి!

అనామకులుగా ఉండి హటాత్తుగా సేనాపతులుగా, రాజకీయనాయకులుగా పైకిరావటం మెక్సికోలో వింతగానీ, విశేషంగానీ కాదు. కాని ఉపాధ్యాయుడుగా నుండి, తారాజువ్వలా రాష్ట్రగవర్నరు కావటం, అందులో సోషలిస్టు గవర్నర్ కావటం ఒక క్రొత్తవిశేషమే. సానోరా పెద్దరాష్ట్రాలలో ఒకటే గాక దేశరక్షణలో కీలకస్థానం వహించిన రాష్ట్రం. ఇందులో అమెరికన్లకుగల శ్రేయస్సులు అసంఖ్యాకం. గనుల కౌలుదార్లు, రాంచీయజమానులు, దొంగసారా వర్తకులు. వీరందరికి కాలెస్ గవర్నర్ కావటం బెదురుగొడ్డుకు ఎఱ్ఱజెండా చూపటమైనది. పాశ్చాత్య అనాగరిక మానుష స్వభావానికి అనుగుణంగా కాలెస్‌పై పశుల పటపటలాడించారు; అతనిపై దుమ్మెత్తిపోశారు. కాని అతడే స్వయంగా రెచ్చగొడితేగాని వారేం చేయలేరు. కాలెస్‌కూడా గాలిదుమారం లేపే స్వభావం కలవాడే! ఒక ఘనకార్యం సాధించి, తన ఎన్నికను సమర్థించుకోవాలనే ఆరాటం అతనిలో ఎక్కువైంది. యాంకీ వ్యతిరేక విధానమే జనాదరణ పొందుతుందనేది కాలెస్ విశ్వాసం. అందుచే గవర్నరైన నాలుగైదు మాసాలలోనే తన పదవికి కారకుడైన కరంజాను చిక్కుతెచ్చిపెట్టాడు. ఒకవైపు అమెరికా సైనిక జోక్యానికి స్వయంగా కారణం కల్పించటం; మరొకవైపు అంతర్జాతీయ ప్రాధాన్యతగల సంఘర్షణలో దిగజారిపోయి, తలబిరుసుతనంతో ప్రతిష్టను గంగలో కలపటం; ఈ రెండు సమస్యలమధ్య నలిగిపోయింది కరంజాప్రభుత్వం. కాలెస్ చర్యలే ఈ సమస్యకు కారణం.

సంయుక్త రాష్ట్రాల్లో, మద్యనిషేధం అమలు జరగటంవల్ల మెక్సికో ఉత్తర సరిహద్దు పొడుగునా, అసంఖ్యాకంగా, పానశాలలూ (Bars) వాటిసరసన వ్యభిచార గృహాలు వెలిసినై. ప్రతి సాయంత్రం అరిజోనా, న్యూమెక్సికో రాష్ట్రాలలోని గనుల ప్రాంతాలనుండీ, రాంచీలనుండి పురుషపుంగవుల ముఠాలీ పానశాలలకు, వ్యభిచార గృహాలకు మూగేవారు. అందువల్ల ఆప్రాంతాల్లో సభ్యత నశించి, అశాంతి పెచ్చురేగిపోయింది. త్రాగుబోతుల కలహాలు తరచు ఖూనీలతో పరిసమాప్తమా

తుండేవి. ఏ నాగరిక ప్రభుత్వమూ సహించరాని పరిస్థితు లేర్పడినై. కాని, వీనిపై ఏ చర్య తీసికొన్నా ప్రభుత్వం దొంగ సారా వ్యాపారంలో ధనం ఆర్జిస్తున్నవర్గం క్రోధానికి గురికాక తప్పదు. ఈ వ్యాపారం అంతా సొనోరా రాష్ట్రంనుండే జరిగేది. దీన్ని అదుపులో నుంచటంగానీ, నిషేధించటంగానీ సొనోరా రాష్ట్రప్రభుత్వ బాధ్యతయే. అందుచే కాలెస్ ఒక ఉత్తర్వు జారీచేశాడు: "సరిహద్దుల కావల చట్టధిక్కారాన్ని ప్రోత్సహిస్తున్న సరిహద్దు పానశాలలకు సారా సరఫరా నిషేధింపబడింది" నైతికంగా తనచర్య సమర్థనీయం కాబట్టి, దీన్ని సమీప రాజ్య స్నేహభావానికి నిదర్శనంగా, అమెరికా ఆమోదిస్తుందని కాలెస్ ఊహించాడు.

దొంగ వ్యాపారంలో 'పాపిష్టి' ధనం ఆర్జిస్తున్నవారి ఆగ్రహానికి మేరలేకపోయింది. వర్తక స్వేచ్ఛను నేలరాస్తున్న నిరంకుశ ప్రభుత్వ చర్యలను తీవ్రమైన నిరసన ప్రకటించారు. "న్యాయం, ధర్మంలేని మెక్సికో రాజ్యంలో ధర్మసమ్మతమైన తమ హక్కులను రక్షించమని తమ ప్రభుత్వానికి విన్నపం జేసుకొన్నారు. ఇటీవల తరచుగా లభిస్తుండటంచేత ఈ మారు కూడా తమకు తమ ప్రభుత్వ రక్షణ లభించగలదని దొంగ వ్యాపారస్థులు ఆశించారు. అంతటితో ఆ మద్యనిషేధాన్ని బహిరంగంగా ధిక్కరించారు. చైనా, మెక్సికో ఉద్యోగులను తొలగించి, యజమానులు స్వయంగా 'గ్రైమాస్'నుండి అమెరికా సరిహద్దులకు సారాయి జేరవేసుకొనసాగారు. సారాయిని జేరవేసే రైలుబండి కూడా ఒక అమెరికా కంపెనీదే. ఈ రైల్వే ఉద్యోగులు, దొంగవ్యాపారస్థులు పరస్పరసహకారంతో కాలెస్ శాసనాన్ని ధిక్కరించారు. మెక్సికో శాసనాలను గౌరవించ నక్కరలేదనీ, ఆ హక్కు తమకు ఉన్నదనీ నిరూపించే ధోరణి ప్రదర్శించారు అమెరికన్లు.

పరిస్థితి కొరకరాని కొయ్యగా తయారైంది. తన తాహతుకు మించిన కార్యాచరణకు పూనుకున్నాడు కొత్త గవర్నరు. ఫెడరల్ ప్రభుత్వంగానీ, సోషలిస్టుపార్టీగానీ, అతనికేమీ సహాయం చేయలేకపోయినై. ప్రభుత్వం వాషింగ్టన్‌కు నిరసనపత్రం పంపింది. అంతర్జాతీయ కార్మిక ఐక్యతను ముచ్చటిస్తూ తమ దేశ పెట్టుబడిదారుల దురాశపై, సామ్రాజ్యవాద అహంకారంపై పెద్ద ఎత్తున తిరుగుబాటు చేయవలసిందిగా సోషలిస్టుపార్టీ అమెరికా కార్మికులను అభ్యర్థించింది. దీనివలన జరిగిన ఫలితం శూన్యం! కాని, కాలెస్‌కు అనుకోని సహాయం లభించింది. నాటివరకు జనరల్ ఓబ్రెగాన్ అధికారంలో ఉన్న సైన్యం, ఉన్నట్లుండి యాంకీ సామ్రాజ్యవాదులకు గుణపాఠం చెప్పే ఉద్దేశ్యంతో కాలెస్ పక్షం వహించింది. గవర్నర్ కాలెస్, జనరల్ కాలెస్ అయినాడు. జనరల్ కాలెస్ సైన్యాన్ని ఆజ్ఞాపించాడు: "సారాయి ఎక్కడ కన్పించినా వశపరచుకోవాలి; సారా దుకాణాల యజమానులను, శాసనాలను ధిక్కరించిన వారినీ, ప్రతిఘటించిన వారినీ నిర్బం

ధించాలి." పరిస్థితులు సైన్యం చేతిలోనికి పోయినై. అది చిరకాల విరోధిపై జరిగిన చిన్న యుద్ధం! సైనికోద్యోగులు, తమ దేశభక్తికి బహుమతిగా కావలసినన్ని సారా బుడ్లను పొందారు. అమెరికా వ్యాపారులు అసంఖ్యాకంగా నిర్బంధింపబడ్డారు. కొందరు మరణించి వుండవచ్చు. కాని వారందరు సాయుధులే! 'మెక్సికోలో దారుణ హత్యలు జరుగుతున్నై' అని సరిహద్దు కావలి పత్రికలు దుష్ప్రచారం చేసినై.

ఇప్పటికి, కాలెస్ అగ్నిలో ఆజ్యం పోశాడు. తిరిగి అమెరికా సైనిక జోక్య భయం, నీలిమేఘాల్లాగా మెక్సికో నావరించింది. అమెరికా జోక్యాన్ని విజయవంతంగా ప్రతిఘటించేశక్తి మెక్సికోకు లేదు. కాని దేశప్రతిష్ఠకు భంగంరానీయకూడదు. లేనిచో ఫెడరల్ ప్రభుత్వ బలహీనత వెల్లడై దేశంలో మరల తిరుగుబాట్లు చెలరేగే ప్రమాదం ఉంది. కరంజా రాజనీతి ఈ క్లిష్టపరిస్థితినుండీ దేశాన్ని రక్షించింది. గవర్నరుగా ఉన్న స్వల్పకాలంలో, కాలెస్ చేసిన దేశసేవను గుర్తించి; అతనిని ఫెడరల్ మంత్రివర్గంలో కార్మికమంత్రిగా చేరవలసిందని కరంజా ఆహ్వానించాడు. తిరిగి సానోరా రాష్ట్ర గవర్నరుగా పరిస్థితులను చక్కబరచవలసినదని ఒబ్రెగానును కోరాడు.

## తెరవెనుక అధికారం

కాలెస్ ఫెడరల్ మంత్రిపదవి నధిష్ఠించటం ప్రజల్లో ఎవరికీ ఆశ్చర్యాన్ని కలిగించలేదు. ఇటువంటి సంఘటనలు మెక్సికో రాజకీయాల్లో తరచు జరుగుతూ ఉండేవి. సాంఘికవిప్లవంవల్ల ఏర్పడిన అరాజకపరిస్థితుల్లో ఒక్కొక్కమారు అనామకులు పెద్దపెద్ద పదవులను పొందవచ్చు. అప్పుడప్పుడు అసమర్థులకు కూడా అదృష్టం పట్టవచ్చు. కాని అసమర్థతను పోషించటానికి ప్రజాదరణపొందిన రాజకీయపార్టీలు లేనపుడు ఆ అదృష్టం ఎంతోకాలం నిలవదు. విప్లవం తన బిడ్డల్ని తానే మ్రింగివేయవచ్చు; కాని విప్లవం సమర్థనాశక్తినీ, అధికార ధిక్కారాన్ని పెంచుతుంది. కాలెస్ కూడా విప్లవం కన్నబిడ్డయే. కాని అతని అజ్ఞాతపరిస్థితికి అసమర్థత తోడుకాలేదు. అతని జనాదరణ కాతని దీనస్థితి కారణంకాదు. అతడు గొప్పవాడుకావటానికీ, కాకపోవటానికీ నాటిసంఘటనలే కారణమైనై. సంఘటనల సమన్వయమే చరిత్ర!

వ్యక్తి ఘనతకు అతడు సాధించిన విజయమే కొలబద్ద. కాని ప్రజాదరణ కోల్పోవటానికైనా సమ్మతించి, విజయసాధనకై ముందడుగు వేయనివారిలో కూడా ఎందరో ఘనులున్నారు. కాలెస్‌లో ఎన్నో సుగుణాలున్నై. కాని అనుకూలపరిస్థితుల సహాయం లేకపోయినట్లైతే ఆ సుగుణాలున్నా అతడు ఘనుడయ్యేవాడు కాదని చెప్పవచ్చు. చరిత్రను నిర్మిస్తున్నామని కొన్ని భావోన్మాదులా పరిస్థితులను సృష్టించారు. వారిలో నేనూ ఒకణ్ణినని నా తప్పిదం ఒప్పుకొంటున్నాను. ఆరోజుల్లో విప్లవకారుడనని చెప్పుకొంటూకూడా, భావోన్మాదులను తీవ్రంగా ద్వేషించేవాణ్ణి. నిజమైన

విప్లవకారుడు, భావోన్మాదియేనని అపుడు గ్రహించలేదు. విప్లవం అంటే భావోన్మాదంతో కూడిన సాహసమే!

మెక్సికో రాజకీయ వాతావరణంలో గాలిదుమారంలా కాలెస్ ప్రవేశించటానికి డాన్ మాన్యూల్ తోడ్పడ్డాడు. నేను సూచించిన రాజకీయ ప్రయోగాన్ని ప్రోత్సహించవలసిందిగా కరంజాను నూరిపోశాడు. కరంజాను మొదటిసారి కలుసుకొన్నపుడు సోషలిస్టులలో కార్మికమంత్రి పదవికి తగినవారున్నారా అని అడిగినట్లు పైనచెప్పానుగదా. తద్వారా సోషలిస్టుపార్టీపై అధికారముద్ర వేసి, దేశరాజకీయాల్లో దానిస్థాయిని పెంచటమే అతని ఉద్దేశ్యం. కానిపక్షంలో ఉద్రేకంలో అసభ్యంగా ప్రవర్తించిన అజ్ఞాని, ఉపాధ్యాయుని లక్ష్యంచేసేవాడేకాదు. అంతేగాక కాలెస్ గవర్నరై, అమెరికా శ్రేయస్సులను భంగపరచి, మెక్సికోను అమెరికా ఆగ్రహానికి గురిచేశాడు. అందుచే ఓబ్రెగాను పునరుద్ధరణ తప్పనిసరైంది. కరంజాకు కూడా అమెరికా అంటే గిట్టదు, కాని అతడు స్పానిష్ ధనికవర్గీయుడు. సాంఘిక విప్లవంలో అతనికి హృదయపూర్వకమైన సానుభూతి లేకపోవచ్చు. అదీగాక అతనికిది రాజకీయాల్లో పెద్దఎత్తున జూదమాడే స్వభావంకాదు. అతడొక అవకాశవాది. అతని అవకాశవాదమే లెనినిస్టు విప్లవపు ఎత్తుల్లో ప్రయోగంచేసే సదవకాశాన్ని నాకు కలిగించింది.

కరంజాతో పరిచయం నాకొక గొప్ప అనుభూతి. వయస్సులో వ్యత్యాసం. సాంఘికవాదాలలోని తారతమ్యంవల్ల మా ఇద్దరిమధ్య మైత్రికిగానీ, సన్నిహితత్వానికిగానీ అవకాశంలేదు. ఐనా వ్యక్తిగతంగా సన్నిహితులం కాకపోయినా, మాలో పరస్పర విశ్వాసం ఏర్పడింది. మెక్సికోలో పర్యటిస్తున్న రోజుల్లో కరంజాను తరచు కలుసుకొనేవాణ్ణి. సోషలిస్టుపార్టీ అప్పటికి గౌరవనీయసంస్థగా పరిగణింపబడలేదు. నేను ప్రధాన కార్యదర్శిని, కరంజా బూర్జువా అధ్యక్షుడు. మా సమావేశాల్లో ఈ తారతమ్యాన్ని పాటిస్తూనే ఉండేవాణ్ణి. కరంజాలో సహజమైన ఠీవి, దర్పం మూర్తీభవించి ఉండేవి. ఐనా, నాతో చనువుగానే మాట్లాడేవాడు.

మా స్నేహం ఒక విశేషమే. బాగా ఆలోచించిన తరువాత ఒకవిషయం గ్రహించాను. మాఉభయుల సాంస్కృతిక సాంప్రదాయాలమధ్యగల సాన్నిహిత్యమే మా విడ్డూరమైన మైత్రికి కారణమైంది. మధ్యయుగాలనాటి యిరోపా క్రైస్తవ సంస్కృతికి అపరావతారం కరంజా. వైజ్ఞానికంగా ఉన్నతవర్గానికి చెందిన బ్రాహ్మణ సంప్రదాయాలు నాలో జీర్ణించిఉన్నై. అందుచేతనే కరంజా నన్ను ఆకర్షించగలిగాడు. కామ్రేడ్ల సమక్షంలోకంటే, జమీందారీ ధనికవర్గీయుడైన కరంజా సమక్షంలోనే నాకు హాయిగా ఉండేదనటం సత్యం! కానీ ఈ సత్యాన్ని గుర్తించటానికి నా సోషలిస్టుఅంతరాత్మ బాధపడుతూ వుండేది. ఇది కేవలం బూర్జువా అహంభావంకాదు. అహంభావం అంటేనే నాకు పరమఅసహ్యం. మెక్సికోలో

మధ్యతరగతివారు బూర్జువా సాంస్కృతిక సాంప్రదాయాలను ఎంతో శ్రద్ధగా పాటిస్తారు. వారి ప్రవర్తన నిర్జీవంగా, కృత్రిమంగా, హాస్యాస్పదంగా ఉండేది. ఐనా వారే సమాజానికి ఆదర్శంఅనే భావం వ్యాపించింది. బూర్జువావర్గ విరోధులు కూడా గ్రుడ్డిగా మధ్యతరగతివారినే అనుకరిస్తూ వుండేవారు!

లాముజేర్ మోడర్నా బహిరంగంగా నల్లసిగరెట్లు కాల్చేదని చెప్పాను గదా! ఇతరేతరమైన స్వేచ్ఛాప్రవర్తనకు గూడా అలవాటుపడిందని రహస్యంగా అనుకొంటూ వుండేవారు. కాని ఆమెను ఒక దేవతగా ఆరాధించేవారు! ఆమె పురుషుల్ని కరస్పర్శ చేయనిచ్చేదికాదు. కాని ముద్దు పెట్టుకోనిచ్చేది! అసభ్యమైన పద్యాలు వ్రాసి బూర్జువా సంస్కృతిని దుమ్మెత్తిపోసే 'వంట ఇంటి విప్లవకారు' లామె చేతివ్రేళ్ళను ముద్దుపెట్టుకోవటానికై ఎంతో ఆరాటపడుతూ ఉండేవారు. జీవితంలో ఎదురుదెబ్బతిని, బైటవిజ్ఞానవేత్తలుగా చలామణీ అయ్యేవారూ, ఎలుగెత్తి అరాజకవాదాన్ని తీవ్రంగా ప్రచారం చేసేవారూ, అందరూ కూడా, మర్యాదకు లక్షణమైన సెల్యులాయిడ్ కాలర్‌ను మాత్రం ఎంత మాసిపోయినా విడిచిపెట్టేవారు కాదు. వీరు మతాన్ని ఖండించేవారు. వీరి భార్యలు మాత్రం కాథలిక్ మతస్థులు. ఆదివారం ఉదయం తమ మతవ్యతిరేకతను తాత్కాలికంగా సమాధిచేసి, భార్యల వెంట చర్చిలో హాజరయ్యేవారు. ఆ సందర్భాల్లో గీరల 'పాంట్లు', ముడికిపట్టిన మార్నింగ్ కోట్లు, పొడుగు టోపీలు, ధరించటంలో శ్రద్ధ వహించేవారు. నల్లని బూట్లపై తెల్లని లేసులు, పచ్చని గ్లోవులతో వారి సాంప్రదాయసిద్ధమైన ఆయుధ సరంజామా పూర్తి అయ్యేది. వీరంతా మారువేషాల్లో ఉన్న విప్లవవీరులే! చివరకు శాంటిబానెజ్, మార్క్సిస్టు గడ్డం క్రింద కూడా మాసిపోయిన చొక్కా ప్రత్యక్ష మౌతుండేది! బూర్జువా సమాజంలో గౌరవ చిహ్నాలుగా చలామణి ఐన సాంప్రదాయాలు శ్రామికవర్గానికి కూడా వ్యాపించినై. సోషలిస్టుపార్టీ కార్యవర్గసభ్యులు, పార్టీ సమావేశాలకు కూడా ఆదివారం దుస్తుల్లో వచ్చేవారు. ఇక వారి సాంఘిక సమావేశాల సంగతి చెప్పనే అక్కర్లేదు.

ఇటువంటి చింతలూ విశేషాలు అనుభూతిలోకి రావటంవల్లనే, క్రొత్తమతం పట్లకూడా నాలో విమర్శన బయలుదేరింది. కాని క్రొత్త మతంలోని మూఢవిశ్వాసం నా అంతరాత్మను శాంతింపజేసి, సందేహాల నోరుమూసింది. ఏమైనా ఆ మతంలో కేవలం ఛాందసుడుగా ఉండలేకపోయాను. మెక్సికోలో ప్రయోగాలు చేసిన రోజుల్లో కూడా నూతన సిద్ధాంతాన్ని యథాతథంగా ఆచరించినవాణ్ణి కాదు. అవి దివ్యవాఙ్మయంతో పూర్తి పరిచయం లేకపోవటంవల్ల జరిగిన పొరపాట్లని సమర్థించ వచ్చు. సాంఘిక న్యాయమనే ఆదర్శం ఆకర్షణీయమైనదని అందరూ అంగీకరించినదే; అందుచే సాంఘిక విప్లవాన్ని ప్రచారంచేసే ప్రతివాడూ మార్క్సిజాన్ని సేవింప నవసరం లేదు. మార్క్సిజాన్ని తాత్త్వికదృష్టితోనే పరిశీలించానుగాని, రాజకీయంగా

గానీ, ఆర్థికంగాగానీ దృష్టింపలేదు. కొన్ని సంవత్సరాల తరువాత ఒక రష్యన్ సిద్ధాంతవేత్తతో ఆర్థిక నియతివాదంలోని సత్యాన్ని గురించీ, సంస్కృతికీ, వర్గాలకు వర్గసంఘర్షణకూ మధ్య గల సంబంధాన్ని గురించీ సంభాషణ జరిగింది. ఆ సంభాషణలో అతడీవిధంగా అన్నాడు: "ప్లెఖనావ్, లెనిన్‌లు తప్ప మార్క్సిజం తాత్విక వికాసానికి తోడ్పడినవారు లేరు. మార్క్సిజం తాత్వికంగానే అభివృద్ధి పొందవలసి ఉన్నది!"

శ్రామికవర్గ విప్లవకారులు, సాంప్రదాయసిద్ధమైన మర్యాదలను అలవరచుకోవడం చాల విచిత్రమైన పరిణామం. ఇది ఒక మెక్సికోలోనే కాదు. ఐరోపాలో వర్గచైతన్యం, ప్రాథమికమైన ఉద్రేకాలపైగాక, మానసిక వికాసంపై ఆధారపడినదని అనేవారు. కాని ఆ దేశాలలో గూడా పైన పేర్కొన్న పరిణామాలు జరగటం విశేషం. దేశంలోని పాలకవర్గమే, సాంస్కృతిక పద్ధతులకు ఆదర్శమైతే, శ్రామిక వర్గం కూడా, సాంస్కృతికంగా బూర్జువా కావాలి! ఇదే సత్యం ఐనప్పుడు, శ్రామిక వర్గం అధికారంలోకి వచ్చినా క్రొత్త సంస్కృతి గానీ, క్రొత్త మానవసంబంధాలు గానీ, క్రొత్త నైతిక ఆదర్శాలుగానీ ఏర్పడగల అవకాశం కల్పించలేదు. ఈ ఆలోచనా పరంపరలు నాలో ఒక నిర్ణయానికి కారణమైనై: "పురాతనమై, సహజమై, పూర్తి సంప్రదాయ బద్ధముకాని సంస్కృతియే, బూర్జువా సాంఘిక వ్యవస్థలోని కృత్రిమతను, అసభ్యతను నిర్మూలించి, వర్గద్వేషాలతో కల్మషంగాక ఉన్నత ఆదర్శాలు గల మానవ సంస్కృతిని రూపొందించగలదు. మానసికంగా, వర్గవైమనస్యాలనుండి విముక్తి పొందిన ధనికవర్గీయుడే, వర్గాలకు అతీతంగా వ్యవహరించగలుగుతాడు. అందుచేత, వర్గచైతన్యం గల కార్మిక నాయకునికంటె, అట్టి ధనికవర్గీయుడే, సాంఘిక విప్లవ వీరుడౌతాడు. మానసిక వికాసమనేది మానవజాతి ఉమ్మడి వారసత్వం. అందుచే, మానసికంగా ఉత్తమ తరగతికి చెందినవాడే, ప్రగతిశీలమైన నవసాంఘిక వ్యవస్థకు దృఢమైన పునాదులు వేయగలడు."

సాంప్రదాయ విరుద్ధమూలైన ఈ భావాలు నాలో వికసించటానికి చాలకాలం పట్టింది. ఈలోగా నా రాజకీయ కార్యక్రమం అంతా క్రొత్తమత సిద్ధాంతానికి అనుగుణంగానే ఉన్నై. అందరివలెనే, నేనూ కరడుగట్టిన సోషలిస్టును. రోజు రోజుకు ఎక్కువగా తయారైనాను; కాని, సాంఘిక సంబంధాలలోను, మిత్రులతోను నా క్రొత్త భావాల ప్రకారం వర్తించేవాణ్ణి. మెక్సికోలో విశాలదృక్పథం గల యువక మిత్రబృందం ఒకటి తయారయింది. అందులో అందరూ స్వేచ్ఛాప్రియులే. తర్వాత ఐరోపాలో ఉన్నప్పుడు అక్కడి మిత్రుల బూర్జువా అలవాట్లను విమర్శించినప్పుడు, 'ఐరోపా వాస్తవ్యులకంటె నీలోనే ఎక్కువ ఐరోపా సంస్కృతి ఉంది' అని వారు నన్ను హేళనచేస్తూ ఉండేవారు. ఐరోపా సంస్కృతి 18వ శతాబ్దంలో పరాకాష్ట

నందుకొన్నది. వైజ్ఞానికంగా ఉన్నతవర్గం రూపొందిన యుగంకూడా అదే. వైజ్ఞానిక, ఉన్నతవర్గమే నాటినుండి జరిగిన విప్లవాలన్నిటికీ నాయకత్వం వహించి నడిపింది. 19 వ శతాబ్దం బూర్జువా యుగం. కారల్ మార్క్సు బూర్జువా; ఆతని శిష్యులు, అనుయాయులు బూర్జువాలే!

మెక్సికో సోషలిస్టుపార్టీ కార్యవర్గం కూడా బూర్జువా పద్ధతి ప్రకారం, కాలెస్ గౌరవార్థం ఒక విందు ఏర్పాటు చేసింది. ఇది సోషలిస్టుపార్టీ సాంఘిక కార్యక్రమమైనా దీని అంతరార్థం రాజకీయాలే కాబట్టి ఈ విందుకు బూర్జువా రిపబ్లిక్ అధ్యక్షుణ్ణి ఆహ్వానించటానికి నేను అసమ్మతి సూచించాను. ఈ ఆరు మాసాల్లోను పార్టీకి అనుకూలంగా జరిగిన సంఘటనలతో కొందరు యువక సభ్యుల బుద్ధులు తిరిగి పోయినై. నిన్న మొన్నటిదాకా అజ్ఞాతవాసంలో, సంఘబాహ్యులుగా, అనామకంగా నున్న కుట్రదారులు, అలజడీరాయుళ్ళు ఇప్పుడు మహానాయకులైనారు. వీరిలో కొందరు తమ పార్టీపట్ల కరంజాకు సద్భావం ఉన్నదని ఋజువుగా కరంజాను పార్టీలో చేరమని అడగటానికి సిద్ధమైనారు. శాంటిబానెజ్, డాన్ మాన్యూలుల సహకారంతో, వారి ఉద్రేకాన్ని అదుపులో పెట్టగలిగాను.

సోషలిస్టుపార్టీ విందుకు అధ్యక్షుని ప్రతినిధిగా డాన్ మాన్యూలు అధికార హోదాలో హాజరైనాడు. భోజనానంతరం డాన్ మాన్యూలు ఉపన్యసించాడు. అందులో కాలెస్ స్వశక్తిసామర్థ్యాల వల్లగానీ, రాష్ట్రగవర్నరుగా పనిచేసినందువల్ల గానీ మంత్రిపదవికిరాలేదనీ, (యం.యన్.రాయ్) నా సలహాపైనే అధ్యక్షుడు కాలెస్‌ను మంత్రివర్గంలోనికి తీసికొన్నాడని చెప్పాడు. ఆ పరిస్థితుల్లో నాకు జోక్యం కలిగించుకొనక తప్పిందికాదు. కాలెస్ నియామకంలో నా ప్రసక్తి ఏమీలేదనీ, కాలెస్ ఆ పదవికి సమర్థుడు కాబట్టే, అధ్యక్షు డాతణ్ణి నియమించాడనీ చెప్పాను. ఆ సభలో నా వినయాన్ని ఎవ్వరూ విశ్వసించినట్లు కన్పడలేదు. ఏమైనా మంత్రి ఐంది కాలెస్ గానీ నేను కాదుగదా!

విదేశ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ దోపిడీవిధానంనుండి మెక్సికో కార్మికులను రక్షించటానికై శాసనసభాధ్యక్షునితో సంప్రదించి కాలెస్ శాసన నిర్మాణ కార్యక్రమాన్ని తయారుచేశాడు. అందులోని ప్రధానాంశాలను అధ్యక్షుడు, మంత్రి మండలి సమ్మతించారు. సోషలిస్టు నాయకులతోను, కార్మిక సంఘనాయకులతోను సంప్రతించి ముసాయిదా శాసనాలను తయారుచేయవలసిందిగా నన్ను కోరారు. చివరకు బిల్లులను ప్రభుత్వన్యాయశాస్త్ర ప్రవీణులు తనిఖీచేయాలనేది సాంప్రదాయం. నేను సూచించిన విషయాల్లో ముఖ్యమైంది సమ్మెహక్కును చట్టబద్ధంచేయటం. ఈ విషయం ఎలాబైటికి పొక్కిందో చెప్పలేను. పారిశ్రామిక కేంద్రాలలో, అనేక రకాల కోర్కెలతో ఉవ్వెత్తుగా సమ్మెలు చెలరేగినై. అదీ నాటి మెక్సికోస్వరూపం.

పెట్రోలియంగనుల్లోను, పెట్రోలియం ఎగుమతిచేసే రేవుల్లోను సమ్మెలు ప్రారంభమైతే పరిస్థితులు విషమింపకతప్పదు. ఐరోపాలో యుద్ధం చివరిదశలోపడ్డది. రష్యాలో బోల్షివిక్కులు, అధికారంలోకి రావటంతో తూర్పురంగం ఖాళీఐంది. ఫ్రాన్సు రక్షణశ్రేణులను భేదించటానికి జర్మనులు తమ యావచ్ఛక్తిని కేంద్రీకరించారు. ఈక్లిష్టపరిస్థితుల్లో అట్లాంటిక్ మహాసముద్రంమీదుగా మిత్రమండలికి హాజరగుచున్న సరఫరాకు ఏమాత్రం ఆటంకంకలిగినా, పరిస్థితి తారుమారౌతుంది. కాబట్టి మెక్సికోనుండి పెట్రోలియం ఎగుమతికి ఎట్టి అభ్యంతరం కలిగినా అమెరికా నౌకాబలం చర్యతీసుకొంటుంది. టాంపికో, వెరాక్రుజ్ రేవులకు దూరంగా సంచరిస్తూ అమెరికానౌకలు కన్పించినై. ఇది ఉద్రేకానికి, తొందరపాటుకు సమయం కాదు. పరిస్థితి విషమిస్తే అమెరికానౌకలు పెట్రోలు గనులను ఆక్రమించకుండా ప్రతిఘటించటానికి మెక్సికోకు తగిన బలంలేదు. మెక్సికోప్రభుత్వం అప్రతిష్ఠ పాలవుతుంది!

ఇది రాజనీతితో వ్యవహరించవలసిన సమయం. దేశప్రతిష్ఠకు భంగం రాకుండా, క్లిష్టపరిస్థితినుండి బైటపడాలి. ప్రెసిడెంటుకు సూచించాను. కార్మిక మంత్రికి, అత్యధిక అధికారాలిచ్చి, పెట్రోలియం ప్రాంతాలకు పంపి అతడే పరిస్థితిని అదుపులోవుంచే ఏర్పాట్లు చేయాలి. శ్రామికవర్గ శ్రేయోరక్షకుడైన కాలెస్‌ను పంపడానికి కరంజా జంకాడు. 'మొరగటం వినా కరవగూడదనే విషయాన్ని, కాలెస్ విస్మరించవచ్చునని కరంజాభయం' కరంజాకు హామీ ఇచ్చాను : 'కాలెస్ వెంట నేను ఉంటాను. సోషలిస్టుపార్టీ కార్యక్రమం ప్రకారం కార్మికుల భద్రతకుగానీ, దేశ స్వాతంత్ర్యానికీ, ప్రతిష్ఠకూగాని భంగం రాని విధంగా ప్రయత్నిస్తాను.' కార్మిక మంత్రికి అత్యధిక అధికారాలనిచ్చే శాసనంపై ప్రెసిడెంట్ సంతకం చేశాడు. నేను, కాలెస్ బయలుదేరాము. త్రోవలో ఒక విచిత్రసంఘటన జరిగింది.

మేము ఒరిజాబా రాష్ట్రంగుండా వెళ్ళాలి. ఒరిజాబా నూలు పరిశ్రమకు కేంద్రం. ఈ పరిశ్రమను నడుపుచున్నది ఫ్రెంచ్ పెట్టుబడిదారులు. ఇక్కడ 12,000 కార్మికులకు పైగా సమ్మె చేస్తున్నారు. అర్ధరాత్రి మాబండి ఒరిజాబా దగ్గర ఆగింది. మరునాడుదయం స్థానిక కార్మిక సంఘనాయకులను కలుసుకోటానికై పార్టీ కార్యాలయానికి వెళ్లాను. ఇక్కడి పరిస్థితిని మెక్సికో నగరంలోని ప్రధాన కార్యస్థానానికి నివేదించటం నా ధర్మం. కార్యాలయం దగ్గర తెలియవచ్చింది : "కార్మిక మంత్రి రైలులో ప్రయాణం చేస్తున్నాడని తెలిసి అతనిని కలుసుకునేందుకై కార్మిక సంఘనాయకులు స్టేషన్‌కు వెళ్ళారు" వెంటనే స్టేషన్‌కు తిరిగి వచ్చాను. మంత్రిగారి సెలూన్ చుట్టూ ఒక గుంపు చేరింది. వాకిట్లో నిలబడి కాలెస్ ఉద్రేకంతో ఉపన్యాసం ఇస్తున్నాడు. ఫ్యాక్టరీ యజమానులకోసం కబురు పంపాననీ కార్మిక రక్షణకై ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమం వారికి వివరించి హెచ్చరించాననీ,

కార్మికులకు వాగ్దానం చేస్తున్నాడు. కొన్ని నిముషాలలో సెలూన్‌లోనికి ఇద్దరు వ్యక్తులు వచ్చారు. పరిశుభ్రమైన దుస్తుల్లో ఉన్నారు. వారి ముఖాల్లో భయం ద్యోతకమౌతున్నది గాని దాని వెనుక నిర్లక్ష్యభావం కూడా లేకపోలేదు. కాలెన్ భయంకర రూపాన్ని ధరించాడు. ఆగంతుకుల ముందు నిలబడి ఒక కాలు కుర్చీలో ఉంచి అరచినట్లుగా మాట్లాడాడు. "మెక్సికో సంయుక్తరాష్ట్రాలు, తన కార్మికులను విదేశ పెట్టుబడిదారులు దోపిడీ చేయటం ఎంతమాత్రం సహించదు. కార్మికులకు సంతృప్తికరంగానుండే పద్ధతిలో మీ తగాదాను పరిష్కరించుకో వలసిందిగా మిమ్ము హెచ్చరిస్తున్నాను". యజమానులు గొణిగారు. "కార్మికుల కోర్కెలు చాలవిపరీతంగా ఉన్నై. అవి న్యాయసమ్మత మయినవికావు; ఈ కోర్కెను తీర్చటంకంటె మిల్లులను మూసివేయడమే మాకు లాభం." మంత్రిగారు వారిని బెదరించారు. "ఐతే మిల్లులను ప్రభుత్వమే వశపరచుకొని నడుపుతుంది" సమావేశం ముగిసింది. యజమానులు వెళ్ళిపోయినారు. సంభాషణ జరుగుతుండగా కాలెన్ ఒరలోనుండి పిస్టల్ తీసి టేబుల్‌మీద పెట్టాడు. ఆ పిస్టల్ పిడి మణిఖచితం!

కాలెస్ ఆగ్రహానికి బలి కాబోతున్న యజమానులను ప్లాట్‌ఫారంమీద కలుసుకున్నాను. వారిని రాజీకి సమ్మతింప జేయటం అంత కష్టం కాలేదు. వారి సమక్షంలోనే సమ్మెదారుల ప్రతినిధులతో వివరించాను. "తాత్కాలికంగా యజమానులు, కార్మికుల కోర్కెలకు సమ్మతించారు; కాబట్టి వెంటనే సమ్మెను విరమించాలి; అంతిమ పరిష్కారానికై సోషలిస్టుపార్టీ సంప్రదింపులు జరుపుతుంది" ప్రేక్షకులు, అంటే సమ్మెదారుల ప్రతినిధులు కరతాళధ్వనులు చేశారు. యజమానులు ఎంతో బరువు భారం తీరినట్లు కరస్పర్శచేసి నిర్గమించారు.

తాను చేసిన ఘనకార్యానికి కాలెస్ చాల మురిసి పోయినాడు. వాళ్ళను హడలగొట్టి దిక్కుతోచకుండా చేశాననీ అందుచేతనే వాళ్ళను నేను రాజీకి ఒప్పించగలిగానని అన్నాడు. కాని ఇంతకంటె బలవంతులైన ప్రత్యర్థుల విషయంలో ఈ ఎత్తులు ఫలించునా అని నా అనుమానం. టామ్‌పికో చేరిన తరువాత జరిగిన మొట్టమొదట బహిరంగసభలో ఒరిజాబో సంఘటనను గోరంతలు కొండంతలుగా చేసి చెప్పాడు కాలెస్. ప్రేక్షకులకు ఉల్లాసం కలిగించటాని కది చిట్కాగా పని చేసింది. ఆ ప్రాంతంలో ఇంకా సమ్మె సన్నాహాలేమీ జరగలేదు. అందుచేత వెంటనే స్థానిక కార్మికనాయకుల సమావేశం జరిపి అందులో, తొందరపడి సమ్మెచేస్తే రాగల ప్రమాదాలను వివరించాను. నా హెచ్చరికలోని సత్యాన్ని వారు గుర్తించారు. ఐనా ఈ ప్రాంతంలో సమ్మె జరపవలసిన అవసరం లేదు. కార్మికులకు చెప్పుకోదగిన ఇబ్బందులు లేవు. ఇతర ప్రాంతాలకంటె ఇక్కడ వేతనాలు కూడా ఎక్కువే. ఇంకా వారితో అన్నాను: "విప్లవాత్మక శ్రామికవర్గ ప్రతినిధియే అధికారంలో ఉన్నాడు; అతనికి ఇబ్బంది కలిగించే చర్యలకు పూనుకొనటం శ్రేయస్కరం కాదు.

మనం ఇంకా ప్రారంభదశలోనే ఉన్నాము. భవిష్యత్తుతో జూదం ఆడకూడదు." కార్మికులు సంతృప్తితో తల ఊపారు. కరంజా ప్రభుత్వం ఒక క్లిష్టపరిస్థితినుండి సురక్షితంగా బైట పడింది; సమర్థమైన నాయకత్వం గల పార్టీ అని సోషలిస్టుపార్టీ ప్రతిష్ఠ పెరిగింది.

## 'ఎల్జి' నామకరణోత్సవం

జౌరెజ్ కాలంనుండి పూజారుల దౌర్జన్యాన్ని తుదముట్టించటం ప్రధాన రాజకీయ సమస్యల్లో ఒకటి. ఐనా ఇంకా కాథలిక్ చర్చి అధికార ప్రాబల్యాలు సడలలేదు. ప్రజల గార్హస్థ్య జీవితం ఇంచు మించు కాథలిక్ చర్చి గుప్పిట్లోనే ఉన్న దని చెప్పవచ్చు. అరాజకవాదులు, సిండికలిస్టులు మున్నగు విప్లవవాదుల భార్యలు మాత్రం పూర్వాచారపరాయణలైన కాథలిక్ క్రిస్టియన్లే. చర్చిలో జరిగే పూజా పునస్కారాలన్నిటికీ శ్రద్ధగా హాజరయ్యేవారు. పూజా పీఠంనుండి చెప్పే నీతి పాఠాలకు విరుద్ధంగా వాస్తవ జీవితంలో వ్యవహరించవచ్చు; కాని ఆ పీఠంనుండి పూజారి ఉచ్చరించే ప్రతి మాటా ఆగ్రహ పూరితుడైన దేవునినోట వెలువడిన శాపమే! పశ్చాత్తప్తయైన పాపి తన గార్హస్థ్యజీవితశాంతి యేమైనాసరే పూజారి ఆజ్ఞలను శిరసా వహించవలసినదే. భర్త గౌరవప్రతిష్ఠలకు భంగం కలిగినా, ఛాందసమైన అర్థంలేని మూఢాచారాలను ఆచరింప చేయవలసినదే. అప్పుడప్పుడు ఈ మత సాంప్రదాయాలను పూజార్లు రాజకీయ ప్రయోజనాలకొరకై వినియోగించేవారు.

క్వారెటారో రాజ్యాంగం వయోజను లందరికీ ఓటు హక్కును ప్రసాదించింది. కాని ఇంతవరకు ఆ రాజ్యాంగాన్ని అనుసరించి ఎన్నికలు జరగలేదు. ఎన్నికలు జరిగే ఉన్నట్లయితే స్త్రీల ఓట్లతో ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని, చర్చి ప్రభావం కూలద్రోసి ఉండేది. అంటే తమకు ఓటు హక్కు నిచ్చిన ప్రభుత్వాన్ని భస్మాసుర హస్తంలాగా ఆ ఓటు హక్కుతోనే స్త్రీలు నిర్మూలించేవారే! సరిగా ఇటువంటిది, 12 సం. ల తరువాత స్పెయిన్‌లో జరిగింది; ఐరోపాలోని కాథలిక్ రాజ్యాలలో స్త్రీలకు ఓటు హక్కు నిచ్చిన మొట్టమొదటిది మూన్నాళ్ళ ముచ్చటైన స్పానిష్ రిపబ్లిక్ ప్రభుత్వం. తరువాత జరిగిన ఎన్నికల్లో, రాచరిక పునరుద్ధరణకై స్త్రీలు ఓటు చేశారు. స్పానిష్ స్త్రీ ఓటర్లకు అప్పటికింకా రాజకీయ చైతన్యం లేదు. రాజకీయ నిర్ణయాలు స్వయంగా చేసే స్థితిలో లేరు. బలి పీఠాల నుండి పూజార్లు చేసిన రహస్య బోధనల ఫలితంగానే వారలా చేశారు.

మెక్సికోలో ప్రజాస్వామ్య విధానంపై అటువంటి ఎదురు దాడులు జరగలేదు. 1920 లో ఓబ్రెగాన్ చేతులలో కరంజా ఓడిపోవటం కాథలిక్ చర్చికి తాత్కాలికంగా ఆశాజనకమైంది. క్వారెటారో రాజ్యాంగం ప్రకారం చర్చి ఆస్తుల స్వాధీనం చేసుకోవటం(?)

క్రమాలు కరంజా ఓటమితో నిలిచిపోయినై. కాని 1922 లో కాలెస్ అధ్యక్షు డైనాడు. స్పానిష్ ఆక్రమణకాలంనుండి పురోగతికి ఆటంకంగావున్న కాథలిక్ చర్చిపై కాలెస్ దండయాత్ర సాగించాడు.

కరంజా కాలంలోకూడా న్యాయసమ్మతమైన కొన్ని హక్కులను అనుభ విస్తూ, బాల్యదశలో ఉన్న ప్రజాస్వామ్యానికి ప్రతిబంధకంగా తయారైంది కాథలిక్ చర్చి. పాపపరిహార సంప్రదాయాలను ఆధారంగా తీసికొని పూజార్లు అమాయిక స్త్రీలను వారి భర్తలమీదికి ఉసిగొల్పుతుండేవారు. సోషలిస్టుపార్టీ సభ్యు లలో చాలమంది పూజార్లు తయారుచేసిన పాపులజాబితాలో చేరారు. గోముఖ వ్యాఘ్రాలవంటి వంటింటి విప్లవకారులు కొంద రుండేవారు. సమాజంలో మర్యాద కోసం కొన్ని ఆచారాలను పాటిస్తూ వుండేవారు. పూజారుల జాబితాలోని పాపులు వీరినైనా అనుకరించేవారు కాదు. కార్మికులలోనే అధిక సంఖ్యాకులు అజ్ఞానులూ, విద్యావిహీనులూ; ఇక వారి భార్యల సంగతి వేరుగా చెప్పనక్కరలేదు. మూఢ విశ్వాసాలకు, ఆచారాలకు వీరు పెట్టినది పేరు. పూజారుల ప్రోత్సాహంతో వీరు భర్తలను వేధించేవా రనడంలో వింతలేదు. పూజారుల జోక్యంతో ఒక చక్కని కుటుంబంలో అశాంతి ఎలా ప్రజ్వరిల్లిందో ఈ క్రింది సంఘటనలవల్ల తెలుసుకోవచ్చు. ఇదొక తమాషా అనుభూతి.

జువాన్ బాప్టిస్టా ఫ్లోరెస్, సోషలిస్టు కార్యవర్గసభ్యుడు. చెప్పులు కుట్టటం అతని వృత్తి. మెక్సికో ఆదిమవాసిలాగా నిరాశతో కుమిలిపోయే రకం కాదు. మధ్యయుగ ఐరోపా సాంప్రదాయాల కనుగుణంగా ఉల్లాసంగా వుండే ఆశాజీవి. మంచి పొడవరి. నల్లగా ఉన్నా ముఖం అందంగా కళకళలాడు తుండేది. అతని పురు త్వాన్ని ద్విగుణీకృతం చేస్తున్నట్లు కన్పించేవి అతని బొద్దుమీసాలు. అతని సామాజిక పరిసరాల్లోని స్త్రీ లోకాని కాత డొక నవమన్మధుడే (డాన్‌జువాన్). వైవాహిక జీవి తానికి వెలుపల అతని విజయాలెలాఉన్నా అతని పౌరుషం, అందం, అతని భార్య దగ్గర మాత్రం కొరగాక పోయినై. ఆమె సంకరజాతి పట్టణవాసి. విద్యాగంధం లేని అజ్ఞానురాలు. నల్లని శరీరచ్ఛాయ, ముఖకవళికలు ఆమె 'స్వదేశీ' అని స్పష్టం చేస్తై. కాని చర్చిపట్ల ఉండే మూఢవిశ్వాసం - ఆమెలో స్పానిష్ రక్తంలేక పోలే దనే అనుమానాన్ని కలిగిస్తుంది. ఇంటి దగ్గర ఉండే కాలంకంటే మేరీ దేవాల యంలో పూజాపునస్కారాలు చేస్తూ గడిపే కాలమే ఎక్కువ. ఇక నాస్తికుడైన భర్త జీవితంలో శాంతి సుఖా లెలా ఉంటై? "భర్త ప్రాణాలు తోడేయ మని పూజారు లామెను ఆదేశించారు." అని ఫ్లోరెస్ అనుకుంటూ వుండేవాడు. అతని మిత్రు లాతనితో ఏకీభవించేవారు. కాథలిక్ మెక్సికోలో విప్లవకారు లందరి అను భవమూ ఒకటే. ఇక ఫ్లోరెస్ ఎవరితో మొర పెట్టుకుంటాడు? ఉన్నట్లుండి ఆ మహా సాధ్వి ఒక క్లిష్టపరిస్థితి తెచ్చి పెట్టింది.

ఈ దంపతులకు అప్పటికే ఇద్దరు ముగ్గురు పిల్ల లున్నారు. వారి కుటుంబం లోకి మరొకడు ప్రవేశించటానికి సిద్ధమైనాడు. కుటుంబ కలహాలను తప్పించుకునే ఉద్దేశంతో, తనకు నమ్మకం లేకపోయినా పై పిల్లల నామకరణం, భార్య ప్రోద్బలం వల్ల చర్చిలోనే జరిపాడు. ఆ చర్చిలోని తంతులో ఏం ఇంద్రజాలం ఉందోగానీ ఆ క్షణం మొదలు పిల్లలు గూడా చర్చిపట్ల విశ్వాసపాత్రులై పూజారికి ఆ జన్మ బానిసలై పోయారు అని అంటూ వుండేవాడు. తన భార్య ద్వారా పూజార్లు తనపై సాగిస్తున్న నిరంకుశత్వానికి ప్రతీకారంగా కడసారి పిల్లవాణ్ణి తన వాణ్ణిలా చేసుకోవాలని, సాంఘిక విప్లవానికి, మానవస్వేచ్ఛకు అంకితంచేయ సంకల్పించినట్లు చెప్పాడు.

పిల్లవాడు పుట్టాడు. నామకరణ మహోత్సవం సమీపించింది. ఫ్లోరెన్ కు ధైర్యం చాలినట్లు లేదు. తన నాస్తిక ఉద్దేశాన్ని భక్తురాలైన భార్యకు చెప్పటానికి జంకుతున్నాడు. నా సహాయం కోరాడు. అతని నిర్ణయం సానుకూల పడాలి. "నా బిడ్డను ఏ గోతిలోనో పారేస్తాను. కానీ నరకద్వారంలో ఉంచటానికి సమ్మతించను. నా బిడ్డను మేరీ పాదాలముందుంచి చచ్చేంతవరకు ఉపవాసం చేస్తాను." అన్నదామె. (విద్యావిహీనులైన కాథలిక్ ప్రజానీకానికి మేరీకన్యయే ఆదిదేవత. క్రీస్తు ఆమె కుమారుడు. అందుచేత ఆమెకంటె తక్కువే) ఈ ప్రమాదాన్ని తప్పించటానికి ఒకటే మార్గం ఉంది. ఫ్లోరెన్ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. అతడు తన పట్టు వీడదలుచుకోలేదు. "ఈ అవమానం భరిస్తూ బ్రతకటంకంటె చావటం మేలు" అని సిద్ధపడ్డాడు. ఈ క్లిష్టపరిస్థితినుండి ఆ కుటుంబాన్ని కాపాడటానికి ప్రయత్నించాలి.

అమెరికా అతివాద మిత్రుల్లో కొందరు ప్రముఖులు, సోషలిస్టుపార్టీ కార్యవర్గసభ్యుల్లో కొందరు కలిసి 'యుద్ధ సంఘం'గా ఏర్పడి చర్చి నిరంకుశత్వంపై దాడి చేసే సన్నాహాలను గురించి చర్చించాం. అందులో సాహసికులైన యోధుల సలహా. "పూజారుల ఇంద్రజాలంనుంచి పసిబిడ్డను రక్షించటానికై ఆ పాపను దాచి వెయ్యటమే మార్గం" ఈ పద్ధతిలో బిడ్డ ఆత్మను రక్షించ వచ్చుగానీ బిడ్డ దేహపోషణ బాధ్యత వహించగల వారెవరు? అనే సమస్యకు పరిష్కారం సూచించలేకపోయారు. సుదీర్ఘమైన చర్చ తరువాత ఒక నిర్ణయానికి వచ్చాం. అది నామకరణోత్సవ నాటకం ఆడటం. అమెరికా అతివాదమిత్రుల్లో మంచి కళానైపుణ్యం ఉంది. పై నిర్ణయం అప్పుడే కొందరి కవితాశక్తికి రెక్కలు తొడిగింది. వేషధారులు పోటీ పడసాగారు. కాని ఇంకా అసలు సమస్య పరిష్కారం కాలేదు. క్రొత్త ప్రదేశంలో నామకరణం చేయటానికి ఆ సాధ్వీమతల్లిని ఒప్పించటం ఎలా? ఆ దుష్కర కార్యసాధనకు సోషలిస్టుపార్టీ పితామహుడైన శాంటిబానెజ్ పూనుకొన్నాడు.

నేను నివసిస్తున్న ఇంట్లో అతిథి మందిరంలో నామకరణ నాటకం ఆడాలని మా ప్రణాళిక. రంగస్థలనిర్మాణం, ఇతర వివరాలు చాల జాగ్రత్తగా ఆలోచించి

తయారు చేయాలి. ఈలోగా శాంటిబానెజ్ తనవంతు కార్యాన్ని సులభంగా సాధించాడు. పాపం! శాంటిబానెజ్ కల్పించిన కథను ఆమె అమాయకురాలు పూర్తిగా నమ్మింది. "నిరుపేదల నుద్ధరించి మోక్షం ప్రసాదించటానికి ప్రారంభమైన ఉద్యమమే సోషలిజం. అందుచేతనే 'పోప్' సోషలిజాన్ని ఆశీర్వదించాడు. ప్రముఖ సోషలిస్టు కుమారుడైన మీ బిడ్డకు నామకరణోత్సవం జరపవలసిందిగా కలోనియా రోమాలో నివసించే ఒక పూజారిని పోపు ఆదేశించాడు. భగవంతుని స్వర్గరాజ్యం పేదలు, విధేయులు, విశ్వాసపాత్రులదేనని కలోనియారోమాలో నివసించే గర్విష్ఠి ధనిక వర్గాని కొక హెచ్చరికగా ఈ ఉత్సవం అక్కడ జరుగుతుంది."

చిన్న పూజామందిరంగా ఉపయోగించటానికి తగిన హంగులన్నీ ఉన్నై ఆ గదికి. పొడవైనగది, రోడ్డుమీదికి ఎత్తైన కిటికీలు, గోడలనిండా ఎఱ్ఱరంగు. పదునైదవ లూయీ బల్లను గోడకానించి 'మేక్' పూజాపీఠంగా చేశాం. అమెరికా అతివాద మిత్రులు, తమ ఊహాశక్తినంతా ఉపయోగించారు. వెలిగే వత్తులు రెప రెప లాడసాగినై. అగరుధూపం గుప్పున క్రమ్ముకొంటూంది. ఒక టేమిటి? కాథలిక్ చర్చిదృశ్యానికి అవసరమైన హంగులన్నీ ఏర్పాటుచేశారు. పూజాపీఠంమీద బైబిల్ స్థానంలో ఎఱ్ఱసిల్కులో జాగ్రత్తగా చుట్టబడిన 'కాపిటల్'.

రంగస్థలానికీ, నాటక ప్రదర్శనకూ దర్శకుడు చార్లీ. అతడే పూజారిపాత్ర కూడా ధరించాడు. నల్లనిదుస్తులు ధరించి ఆలయానికి ప్రక్కగా నిలబడ్డాడు. అతనికి జాతికి చిహ్నమైనముక్కును మినహాయిస్తే నిజానికి పతితులనుద్ధరించటానికై భగవదాజ్ఞ పొందివచ్చినప్రవక్తవలె కన్పించాడు. సోషలిస్టుపార్టీ సభ్యులంతా భార్యలతోసహా నల్లనిదుస్తులుధరించి బారులుతీర్చి కూర్చున్నారు. మా వంటమనిషి మేరీయా, సెనోరాను వెంటబెట్టుకొనివచ్చింది. సెనోరాచేతుల్లో పసిపాప. అంతా గంభీరంగాజరిగిపోతోంది. కాని మేరియా ముఖంలో హేళనను సూచించే మందస్మితం. ఆమె మెక్సికో దేశస్థురాలు. ప్రతి ఆదివారం చర్చికి తప్పక వెళ్ళినా ఆమె విశ్వాసాలూ, ఆచారాలూ ప్రాచీన మతానికి చెందినవే. 'పాపపరిహార కర్మకు' మాత్రం వెళ్ళేదికాదు. పశ్చాత్తప్తులైన యువతీమణులను చూచి పూజార్లు చిత్తచాంచల్యంపొంది విచ్చలవిడిగా విహరిస్తారని ఆమె అనుమానం. అసలు ఆమె మనస్సులో 'పాపం' అనే భావంలేదు. అది ఆమె ఆ ప్రాచీనమత ప్రభావం.

చార్లీ చాల నేర్పుతో నటించాడు. సాంఘికవిప్లవం బైబిలుతో పాప నుదురు స్పృశించాడు. యూదుభాషలో ఏదో పద్యం వల్లించాడు. అది లాటిన్ భాషలో ఆశీర్వాదం అని భ్రమపడిఉంటుంది, ఆ తల్లి పాపం!

ఆ పాప ఆత్మ సంరక్షింపబడింది. ఇక నామకరణం చేయాలి. అక్కడ తిరిగి తగాదా. రవీంద్రనాథఠాగూర్ పేరు పెట్టాలని తండ్రి! సభికుల్లో కొందరు

లెనిన్ - ట్రాట్స్కీ పేర్లు; అనేకసంఖ్యాకులు మానవేంద్రనాథ్ పేరు సూచించారు. ఎవరెన్ని చెప్పినా, పూజారికి దైవవాక్కు. కాని ఈ పూజారికి తెరవెనుక వాక్కు. పాప తలపై చేయి ఉంచి గంభీరస్వరంతో చార్లీ ఉచ్చరించాడు. నేను కారల్ మార్క్స్ ఫ్లోరెస్ అని నామకరణం జరుపుతున్నాను. హాలంతా సంతృప్తితో నిండి పోయింది. పూర్తిగా మోసపోయిన ఆతల్లి మనస్సులో చెలరేగే భావా లెవరికి పట్టినై? మిగిలినవారి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. పూజారి ఉచ్చరించే 'ఆమెన్' (Amen) అనేది, 'సాంఘిక విప్లవం వర్ధిల్లాలి' అనే నినాదంతో మునిగి పోయింది.

అప్పటికే ఇంటిముందొక పెద్ద గుంపు తయారైంది. కయోనియాకోపా లో ఇది ఎల్లప్పుడు కన్పించని దృశ్యం. కాని మా యింటిని గురించి అనేక పుకార్లు లేక పోలేదు. ఉన్నత రాజకీయాలకు, అంతర్జాతీయ కుట్రలకు, రహస్య రాజ్యాంగానికీ, ఇంకా ఏవో నిగూఢచర్యలకు కేంద్రమని అనుకొనేవారు. లోపలి ఉత్సవం ముగిసింది. ఫ్లోరెస్, సగర్వంగా భార్యా బిడ్డలతో ఇంటికి బయలుదేరాడు. వారితో గుంపు కూడా వెళ్లిపోయింది. ఫ్లోరెస్ ఎంతో గర్వించాడు, తన రక్తమాంసాలను చర్చి దౌర్జన్యానికి బలిచేయలేదని.

మా 'నాటక సమాజం' మాత్రం మరి కొంత కాలక్షేపం జరిగిన తర్వాతగానీ కదల్లేదు. గ్రానిచ్ 'చియాన్టి' సారాబుడ్లు తెస్తూ 'ఇప్పుడు కమ్యూనియన్' చేసు కొందాం. ఇదిగో జీసస్ రక్తం. 'మేరియా! నీవు మాంసం తీసుకురా!' అన్నాడు. వంట ఇంట్లోనుండి తయారుచేసి ఉంచిన రొట్టెముక్కలు, జున్ను తెచ్చింది మేరియా! తర్వాత సంగీతం నాట్యంలో సాయంకాలం గడిచింది. రాత్రి భోజనానంతరం నాటక సమాజం ఇళ్లకు మరలింది. 'ఎట్టి నామకరణం' గురించి ఎవరో ఎల్ హెరాల్డ్‌లో పద్యాలు వ్రాశారు.

## మెక్సికో కమ్యూనిస్టు పార్టీ

### మెక్సికోలో మాయ మనిషి

1918 డిసెంబర్‌లో అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా, ఉద్రిక్తమైన వార్తలు రాసాగినై. కేంద్రరాజ్యాలు (జర్మనీ, ఆస్ట్రియా మొ.) యుద్ధంలో ఓడి పోయినై. జర్మనీలో జరిగిన విప్లవంలో కెయిజర్ పదచ్యుతుడై దేశం విడిచి పారి పోయినాడు. పరాజయంతో జర్మన్ సైన్యం ఛిన్నాభిన్నమైంది; చివికిపోయిన ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యం కూలింది. ఇతర రాజరికాలతో బాటు బహు పురాతనమైన హోహెన్‌సుబర్గు (జర్మనీ) రాజరికం అంతరించింది. బిస్మార్క్ జర్మన్ సమైక్యతను సాధించిన తరువాత కూడా జర్మన్ సామ్రాజ్యంలోని రాష్ట్రాలలో (States) ప్రాచీన రాజవంశాలు అధికారం చలాయిస్తూనే ఉండేవి. అవి అన్నీ

ఈ విప్లవంతో తుడుచుపెట్టుకు పోయినై. కాని అన్నిటిలో ప్రధానమైన సంఘటన జర్మన్ విప్లవమే. జర్మన్ కమ్యూనిస్టులను ఆ రోజుల్లో 'స్పార్టాకిస్టులు' అనేవారు. వీరు 1918 అక్టోబరులో అధికారాన్ని వశపరచుకొని, రష్యా నమూనాలో శ్రామిక వర్గ నియంతృత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నించారు. కాని రాచరికవాదులు మొదలు సోషల్ డెమోక్రాట్ల వరకు అన్ని పార్టీలు ఏకమై స్పార్టాకిస్టులకు ప్రతిఘటించారు. రాచరికం స్థానంలో ప్రజాస్వామ్య గణతంత్రాన్ని (Democratic Republic) స్థాపించటంకంటె విప్లవం ముందుకు పోరాదని సోషల్ డెమోక్రాట్ల ఆశయం. తమంతట తామే విప్లవాన్ని సాధించే శక్తి సామర్థ్యాలు కమ్యూనిస్టులకు లేవు. వారికి సహాయంచేసే స్థితిలో లేదు రష్యా. విప్లవం ఇంకా పురోగమించి ఉన్నట్లయితే, హంగేరీలో జరిగినట్లు, మిత్రమండలి సైన్యాలు జోక్యం కలిగించుకొనేవి. స్పార్టాకిస్టు నాయకులైన రోసాలక్సెంబర్గ, కారల్ లీబ్నెక్టులను ప్రష్యన్ సైనికోద్యోగులే దారుణంగా వధించారు. స్థానికంగా జరిగిన తిరుగుబాటులు నిర్దాక్షిణ్యంగా అణచి వేయబడినై.

మ్యూనిచ్ నగరంలో మాత్రం కమ్యూనిస్టు విప్లవం కొన్ని రోజులపాటు సాగింది; చివరకు కాథలిక్కులైన బవేరియా రైతులు ధాన్యాల సరఫరా ఆపుజేసి మ్యూనిచ్ విప్లవాన్ని హతమార్చారు. మధ్య, తూర్పు ఐరోపా రాజ్యాలన్నిటిలో కమ్యూనిస్టు నాయకులు పెట్రోగ్రాడ్‌ను అనుకరించి 'ప్రపంచపు పునాదులు కదల్చిన పది రోజుల'లో జరిగిన సంఘటనలను పునరుక్తం చేయాలని ప్రయత్నించారు. బుడాపెస్టులో సోవియట్ రిపబ్లిక్ స్థాపింపబడింది; కాని ఎన్నో రోజులు జీవించలేకపోయింది.

మధ్యఐరోపాలో విప్లవజ్వాలలు చల్లారినై; యుద్ధంలో తగిలిన గాయాలకు ఔషధసేవ చేసికొనటానికి శాంతిలభించింది. జర్మనీ, ఆస్ట్రియాలలో ప్రాచీన రాజవంశాల స్థానంలో రిపబ్లిక్‌లు స్థాపింపబడినై. వాటి ప్రభుత్వాల అధ్యక్షులు సోషల్ డెమోక్రాటిక్ పార్టీవారే. జర్మన్ రిపబ్లిక్ రాజ్యాంగాన్ని తయారు చేయటానికై 'వీమార్'లో రాజ్యాంగపరిషత్తు సమావేశమయింది. 'యుద్ధాలకు అంతరింపచేయాలి. ప్రపంచాన్ని ప్రజాస్వామానికి సురక్షితం చేయాలి అనే సత్సంకల్పాల' తోనే యుద్ధం జరిగింది. కాబట్టి ప్రజాస్వామ్యరాజ్యాలన్నిటికీ ఆదర్శంగా వీమార్ రాజ్యాంగం తయారు చేయబడింది. లిబరల్ రాజకీయ న్యాయానికి, సామ్యవాద ఆలోచనా విధానానికి, మకుటంగా వీమార్ రాజ్యాంగం రూపొందించినమాట వాస్తవమే. కాని కేవలం రాజ్యాంగంతో ప్రజాస్వామ్యం పటిష్టంకాదు; జాతీయ సామాజికవ్యవస్థను గానీ, జాతి మనస్తత్వాన్ని గానీ, రాజ్యాంగచట్టంలోని సూత్రాలు పునర్నిర్మించలేవు అనేది అనుభవంలో రుజువైంది. పారిశ్రామిక అధిపతుల అధికారాన్ని తగ్గించలేకపోయింది సోషల్ డెమోక్రటిక్ రిపబ్లిక్. తాత్కాలికంగా పెద్దసైన్యం లేకపోయినా

ప్రష్యన్ సైనికకులం (Military Caste) బలంగానేవుంది. ప్రాచీనవ్యవస్థకు రక్షణ శ్రేణులైన ఈ రెండువర్గాలకు, మిత్రమండలిరాజ్యాల (Entente Powers) పోషణ లభించింది. ఈ వర్గాలే ఐరోపాలో విప్లవ పురోగతిని అటకాయించగలవని మిత్ర మండలి ఆశయం. కూలిపోయిన హాప్సుబర్గు, రోమన్ సామ్రాజ్య శిథిలాలతో బాల్టిక్ సముద్రంనుండి, నల్లసముద్రంవరకూ జాతీయరాజ్యశ్రేణిని తయారుచేసింది వార్సైయిల్సు శాంతిమహాసభ. ఇది, బోల్షివిక్ రష్యాకూ, ఐరోపాకూ మధ్య నిర్మింపబడిన దుర్భేద్యమైన రక్షణశ్రేణి !

వేసవిలో ఒకనాటి సాయంత్రం గదిలో విశ్రాంతి తీసుకుంటూ ఉండగా ఛార్లీ, ఇర్విన్ వచ్చారు. నాటికి ఐరోపాలో విప్లవపు వరదలు తగ్గుముఖం పట్టినై. కాని ఆ వరదల ఉధృతం మెక్సికోకూడా రుచిచూచింది. చార్లీ, ఇర్విన్‌లు చాల ఉద్రేకంలో ఉన్నారు. 'ఒక రష్యా బోల్షివిక్ నాయకుడు రహస్యంగా మెక్సికో వచ్చాడు; ఆతడు రావటం నేరుగా ప్రోలిటేరియన్ విప్లవ మాతృభూమినుండే.' అంటూ చెప్పారు. ఆ వర్తమానం నాలోకూడా ఉత్సాహాన్ని కలిగించింది. కాని ఒక కొంటెప్రశ్నతో వారిని రెచ్చగొట్టాను. "ఆతడు నిజమైన బోల్షివిక్ అని ఎలా గుర్తించారు? గడ్డంఉందా? పళ్ళసందున కత్తి?" నా పరిహాసం వారికి కొంచెం కోపం తెప్పించింది. అతడు శుభ్రంగా గడ్డంచేసుకొన్నాడు. మంచి సూటు ధరించాడు. చేతిలో 'వాకింగ్ స్టిక్' మాత్రమే ఉంది. ఐతే అతణ్ణి బోల్షివిక్‌గా గుర్తించటం ఎలా? నాలో దౌర్జన్యవాద రక్తం ఉరకలు వేయసాగింది. ప్రతిక్రొత్త వ్యక్తిని అనుమానించవలసిందే! ఈతడు బ్రిటిష్ లేక అమెరికా సామ్రాజ్యవాదుల గూఢచారి ఎందుకు కాకూడదూ? ఏవో కల్లబొల్లి కబుర్లు చెప్పి మన గుట్టుమట్టులు తెలిసికోటానికి ప్రయత్నిస్తున్నాడేమో !

పాపం! ఆ వర్తమానంతో ఎగిరి గంతేసి వారితోబాటు మంచం చుట్టూ నాట్యం చేస్తానని ఆశించారు. నా అనుమానాలతో వారి ఉత్సాహం చాలవరకు చల్లారింది. ఐనా నాకూ మనస్సులో ఉత్సుకతగానే ఉంది; ఆ వ్యక్తి ఎవరో, అతణ్ణి ఎలా కలుసుకున్నారో వివరించవలసిందనీ తరువాత కర్తవ్యాన్ని నిర్ణయించవచ్చుననీ చెప్పాను. ఛార్లీ, ఇర్విన్‌లు స్థిమితపడి ఉపక్రమించారు.

"ఆ వచ్చిన వ్యక్తి పూర్తిగా యువకుడు కాదు; మంచి దుస్తుల్లో ఠీవిగా ఉన్నాడు; 'ఎల్ హెరాల్డో' కార్యాలయానికి వచ్చాడు. విదేశీయుడే; కొంచెం నలుపురంగే గాని భారతీయుడు మాత్రం కాదు; అమెరికన్ ఉచ్చారణతో చక్కని ఇంగ్లీషు మాట్లాడాడు. ఐనా, వాలకం అంతా ఐరోపాదే; సంయుక్త రాష్ట్రాల నుండి అత్యవసరమైన పనిమీద రెండు రోజుల క్రితమే మెక్సికో వచ్చాడట; సోషలిస్టుపార్టీ జనరల్ శెక్రటరీగా ఉన్న హిందువును కలుసుకోవాలని అన్నాడు.

(అమెరికన్లు సాధారణంగా 'హిందు' పదమే వాడుతుంటారు). నగరంలో దిగువగా ఉన్న హోటల్లో బస చేస్తున్నాడట. పేరు బ్రౌన్‌ట్వీన్; అంతకుమించి చెప్పటానికి నిరాకరించాడు."

ఛార్లీ, ఇర్విన్‌ల కా పేరు సుపరిచితమైనట్లు ధ్వనించింది; అసలే వారివి యూదు చెవులు! వీరు ఆగంతకుణ్ణి ప్రశ్నించారట :

"యమ్. యన్. రాయ్‌ని గురించి తెలిసికోవటానికి ఎల్ హెరాల్డో పత్రికా కార్యాలయానికి రావట మెందుకు?"

ఆత డొక తమాషా సమాధానం చెప్పాడు.

"సోషలిస్టుపార్టీ పత్రికను వెదకుతూ, ఎల్ హెరాల్డోను గురించి విన్నాను. నాకు స్పానిష్ భాష రాదు. కాని హెరాల్డో ఇంగ్లీషులో కూడా వెలువడు తోందని తెలిసికొన్నాను; ఈ పత్రికా సంపాదకుడు ఎవరైనా సోషలిస్టు సానుభూతి పరుడై యుండాలి. ఆతనికి సోషలిస్టుపార్టీ కార్యదర్శితో పరిచయ ముంటుందికదా అని వచ్చాను. నేను చేసినది సరియైనదంటారా? కాదా?" అంటూ పృచ్ఛకుల కళ్ళల్లోకి సూటిగా చూచాడు. లేచి వెళ్ళబోతూ రహస్యంగా అన్నాడు :

"మీరేం ఖంగారు పడనక్కరలేదు. నేను మీ మిత్రకోటిలోని వాణ్ణే. రష్యానుండి వస్తున్నాను. సాధ్యమైనంత త్వరలో రాయ్‌కి ఈ వర్తమానం అంద చేయండి; రేపుదయం ఇదే సమయానికి వస్తాను" అని వెళ్ళిపోయాడు.

ఇర్విన్ అన్నాడు "ఆత డేదో ఒక పాములవాడు లాగున్నాడు." ఎలా గైనా ఇర్విన్ ఒక కవి: ఈ యువకు లిద్దరూ ఆ విధంగా భావించటంలో ఆశ్చర్యం లేదు. వారికి రష్యా అనేది విప్లవ స్వర్గం. ప్రతి బోల్షివిక్ ఒక దేవుడు! క్రొత్త ప్రపంచంలో బోల్షివిక్కును మొట్టమొదటిసారిగా కలుసుకోవటం ఎంత అదృష్టం! మరి పొంగివచ్చే ఉత్సాహంలో భాగం నేనూ పంచుకొన్నాను; కాని వారిలో ఉబికే భక్తిప్రపత్తులు మాత్రం నాలో కలగలేదు. బోల్షివిక్‌ను కలుసుకొనటం, ఆతనిద్వారా రష్యాలో ఏం జరుగుతున్నదీ తెలిసికొనటం చాల అపూర్వమైన అను భవమే. కాని ఆతడు మెక్సికో రావటం దేనికి? ఇక్కడ ప్రజ అందరిలో నన్నే ఎందుకు కలుసుకోవాలి? నన్ను గురించి ఆతని కెలా తెలుసు? అంతా ఇంద్రజాలం వలె కన్పించింది. ఐనా అతణ్ణి కలుసుకొనటంలో ప్రమాదం లేదు. నాకు 'పాముల వార'ంటే భయం లేదు. కారణం వారి మంత్రశక్తిలో నాకు విశ్వాసం లేదు. ఐనా నన్ను తప్పించాలని యింకా ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయని వార్తలు రావటంచేత కొంచెం జాగ్రత్తగా ఉండటమే శ్రేయస్కరం. మరునాటి సాయంత్రం బ్రౌన్‌ట్వీను హోటల్లో కలుసుకోటానికి నిర్ణయించాను. ఉదయం బ్రౌన్‌ట్వీన్

పత్రికా కార్యాలయానికి వచ్చినప్పు డతని కా విషయం చెప్పాలి. ఆ సమయానికి రోడ్డుమీద దూరంగా ఉండి, అత డెలా ఉంటాడో చూస్తాను. కవి ఇర్విన్ పరిహసించాడు: 'ఎలా ఉంటాడా? నీవే ఆడపిల్లవైయుంటే వెంటనే ప్రేమించేస్తావు' ఛార్లీ అప్పటికే సగం బోల్షివిక్. నా అనుమానాలనూ, ఇర్విన్ పరిహాసాన్ని అతడు నిరసించాడు. ఛార్లీతో అన్నాను: "ఈ దేశంలో ఆతని పని యేమైనా, అతడు మారువేషంలో వచ్చాడు; కాబట్టి అతను నిజంగా పెద్ద మనిషో, మారువేషంలో ఉన్న బోల్షివిక్కో పూర్తిగా తెలుసుకోవాలనే నా ఉద్దేశ్యం." ఈ ప్రాచ్యుని మనస్సులో ఇంకా ఊగిసలాడుతున్న ప్రతీపగామి భావాలు వారికి కోప కారణమైనై. ఏమైనా రాబోయే పరిణామాలను ఎవరికి తోచినట్లు ఊహించుకుంటూ మా చర్చను ముగించాం.

మరునా డుదయం బ్రాన్‌ట్వీన్ పత్రికా కార్యాలయానికి వచ్చాడు. నా సమాచారం విని సంతోషించాడు. ఈలోగా మరొక సంఘటన జరిగింది. నాటి మధ్యాహ్నం ఛార్లీ నా బసకు వచ్చాడు. చాల గంభీరంగా కన్పించాడు. క్రిందటి రోజే మా చర్చ ముగిసిన తర్వాత బ్రాన్‌ట్వీన్‌ను హోటల్లో కలిసికొన్నాడట! అంతవరకూ ఆతని విప్లవ ఆత్మకు శాంతి కలగలేదట! నగరంలోనే ఉంటున్న బోల్షివిక్ విప్లవకారుని సహచర్య భాగ్యాన్ని ఎలా వదులుకోగలడు? బ్రాన్‌ట్వీన్‌లో ప్రాచ్యగాంభీర్యం గానీ, కుట్రదారుల కుతంత్రాలుగానీ ఛార్లీకి కన్పించలేదట! సాఫీ మనిషి; తోటి విప్లవకారుని కనిపెట్టగల నిశితబుద్ధి మాత్రం లేకపోలేదు. తరువాత విజయగర్వంతో ఛార్లీ అన్నాడు: "బ్రాన్‌ట్వీన్, లెనిన్ అంతరంగిక మిత్రుడు. లెనిన్ రాయబారిగా అమెరికాకు వచ్చాడట!"

నేను అడిగాను: "ఐతే బ్రాన్‌ట్వీన్ ఒక క్రొత్త వ్యక్తిని ఎలా విశ్వసించి తన కథను చెప్పాడు? ఆతని కేమైనా రక్తసంబంధీకులను తెలిసికొనగల దివ్యజ్ఞానం ఉందా?"

ఛార్లీ నా ప్రశ్నను నిర్లక్ష్యంచేసి తన కథను వివరించటంలో మునిగి పోయినాడు.

బ్రాన్‌ట్వీనును కలిసికొని అతణ్ణి ఛార్లీ భోజనానికి ఆహ్వానించాడు; బ్రాన్‌ట్వీన్ బస చేసిన హోటల్లో రద్దీ యెక్కువ. అందుచే మా ఇటాలియన్ హోటలుకు తీసుకువెళ్లాడట. 'చియాంటీ' త్రాగి కులాసాగా కాలక్షేపం చేశారు. బ్రాన్‌ట్వీన్ సుస్ఫురద్రూపి. చాలా విశేషాల నెరిగినవాడు; ఆహార పానీయాలు, నాటకాలు, సంగీతం, చిత్రలేఖనం మొదలైన ఎన్నో విషయాలపై నిశ్చితాభిప్రాయాలు గలవాడు. ఆతనితో మాట్లాడటమే ఒక మహదనుభం జీవితమంతా సంయుక్త రాష్ట్రాలలో గడిపినవారికంటె గూడా ఎక్కువ విశేషా లా దేశాన్ని గురించి గ్రహించాడు,

"ఐతే రష్యా విప్లవాన్ని గురించి మాట్లాడలేదా?"

"దాన్ని గురించి అంతబహిరంగంగా మాట్లాడటాని కాతడు సమ్మతింపలేదు."

"ఐతే లెనిన్ మిత్రుడని ఎలా తెలిసింది?"

"తన గతజీవితాన్ని, విప్లవ చర్యలను, మిత్రులను గురించీ చెప్పాడు. దాన్ని బట్టి ఆత డొక ప్రముఖ బోల్షివిక్ విప్లవకారుడనీ, లెనిన్ సహచరుడనీ ఎవరైనా గ్రహించవచ్చు."

ఛార్లీ నమ్మకానికి నాకు నవ్వు వచ్చింది. కాని ఆతని విశ్వాసం, ఉత్సాహం చెడగొట్టడం మంచిది కాదని నేనిక మాట్లాడలేదు. ఐనా ఈ ఆగంతకుని కలుసుకోవాలనే ఉత్సాహం నాలో కూడా ఎక్కువైంది. ఇంకా కొన్ని క్షణాల్లో ఈ 'మాయ'ను దర్శించబోతున్నాను. కాని నన్ను చూడాలనే ఆరాటం అతనికెందుకు? రష్యానుండి మెక్సికోకు రావటం ఇందుకేనా? ఆ విధంగా ఊహించటం వల్ల నా అహంభావం తృప్తి పడవచ్చు. కాని అది అర్థంలేని ఊహ!

"నన్ను గురించిన ప్రస్తావన రాలేదా" అని అడిగాను ఛార్లీని.

"విదేశంలో ఎంతో గౌరవప్రతిష్ఠలను సంపాదించ గల్గిన హిందూయువకుణ్ణి చాల మెచ్చుకొన్నాడు. కాని నీతో ఉన్న పనేమో నాకు చెప్పకూడదన్నాడు. కాని ఈ హిందూ యువకుడు రష్యా వెళ్ళాలి. 'ఇతనియందు లెనిన్‌కు కూడా చాల అభిమానం' అని మాత్రం చెప్పాడు."

ఛార్లీ మాటలను నమ్మకపోయినప్పటికీ నా మనస్సు స్వాభిమానంతో నిండిపోయింది. రష్యా వెళ్ళటం, ఘనుడైన లెనిన్ అభిమానం పొందటం, అనే ఊహలు నాకు మత్తెక్కించినవి.

సాయంత్రం ఎప్పు డౌతుందా అనే ఆరాటం; ఏదో జ్వరంలాగా నా శరీరాన్నంతా ఆవేశించినట్లైంది. ప్రథమ బోల్షివిక్కులలో ఒకర్ని కలుసుకోబోతున్నాననే ఉత్సాహంతో నా నరాల్లో రక్తం వేగంగా ప్రవహింప సాగింది. ఇతడు రష్యన్ బోల్షివిక్ కానేమో అనే అనుమానం నా మనస్సు నుండి మాయమైంది; అందుకు కారణం చెప్పలేను. నన్నాతడు కలుసుకోవాలని ఉబలాట పడటం స్పష్టం. మెక్సికో రావటం ఇందుకే ఐనా, కాకపోయినా నాతో ఆతనికి పని ఉన్నది.

బ్రాన్ట్వేన్ సాయంత్రం కార్యాలయం నుండి బైటికి వస్తుండగా చూచాను. భోజనం వేళ దాకా ఆతణ్ణి వెంటాడాను. నగరవీథుల్లో పనిలేకుండా తిరిగినట్లుగా తిరిగాడు. దుకాణాలవైపు చూచేవాడు కాదు. మనుష్యుల్ని మాత్రం పరకాయించి చూచేవాడు. ఆకర్షణీయమై హుందాతనం కల వ్యక్తి లాగానే కనిపించాడు. కాని

ముఖంలో ఏదో విషాదరేఖ. ముఖ్యంగా పోస్టాఫీసులో తనకేమీ జాబులు రాలేదని తెలిసికొన్నప్పుడు చాల నిరుత్సాహపడినట్లు కన్పించాడు. నలభై సంవత్సరాలు కూడా నిండని మధ్యవయస్కుడు. అప్పుడప్పుడు 'వాకింగ్ స్టిక్'పై ఆనుకొనేవాడు. దగ్గరకు వెళ్ళి 'ఒంట్లో కులాసాగా లేదా?' అని అడగాలని అనిపించేది. తిరిగి అది అంత మంచిది కాదని అనిపించేది. మానేశేవాణ్ని. సాయంకాలం వరకు వేచి ఉండాలి. షెర్లాక్ హోమ్సును అనుకరిస్తూ జరిపిన పరిశోధకయాత్రను ముగించి ఇంటికి చేరాను. ఈలోగా ఆ నూతన వ్యక్తి స్నేహం చేయాలి అనే వాంఛ నాలో గాఢతరమైంది; ఆత డేదో ఇబ్బందిలో నున్నాడని, అది తీరటానికి నా సహాయం అవసరమైనదనీ భావింపసాగాను. ఆత డాశించిన సాయ మెటువంటిదో నా ఊహకు అందలేదు. ఆ రోజుల్లో మెక్సికో దేశంలో మంచి కారణానికి ఎంతటి సాయమైనా చేయగల స్థితిలో ఉన్నాను. చివరికి తేలిన సారాంశం: అతనికి కావలసినది ఆర్థిక సహాయం. విప్లవ విశ్వాసానికే రష్యా రూబుల్సు బహుమతిగా లభిస్తే అనేకట్టు కథలు వ్యాప్తిలో ఉండేవి; ఆ బహుమతులు పొందటానికి బదులు బోల్షివిక్కులకే నేను ఆర్థిక సహాయం చేయవలసి వచ్చింది. అట్టి ఆర్థిక సహాయం ద్వారానే బోల్షివిక్కులతో నా పరిచయం ప్రారంభమైంది.

## "ఇంటర్ నేషనల్"♦ రాయబారి

మాయ మనిషితో నే జరిపిన సంభాషణను గురించి అమెరికా మిత్రులు ఆదుర్దాగా ఉన్నారు; వారికి నామీద అసూయగా కూడా ఉంది. ఆ గౌరవమంతా నాకే ఎందుకు దక్కాలి? వారి నెందుకు ఆహ్వానించలేదు. ఆతడు వచ్చింది వారి దేశమేగదా! వారు కూడా చాలా సంవత్సరాలుగా సాంఘిక విప్లవాన్ని గూర్చి కలలు కంటున్నవారేగదా! మరునాటి ఉదయమే వారితో చెప్పాను: "నిన్న సాయంత్రమంతా బ్రాన్ట్వీన్‌తో గడిపాను; కాని అత డీ దేశం ఎందుకు వచ్చాడో మాత్రం బోధపడలేదు."మిత్రులు నా మాటలు నమ్మలేదు. ఏదో నిగూఢరహస్యాన్ని దాచిపెడుతున్నాననే వారి భావం. వారికి నమ్మకం కలిగించే ఉద్దేశ్యంతో అన్నాను "క్రొత్త వ్యక్తి ఎవరైనా మీరు నాకు చిరకాలమిత్రులు; కాబట్టి ఆతణ్ణి గురించిన రహస్యాలు మీదగ్గర దాచ నవసరం లేదు." వీరంతా విప్లవవాదులు. ఐనా వారితో కలియక, క్రొత్త వ్యక్తి గోప్యంగా ఉండటానికి చేసేప్రయత్నం వారి విమర్శలకు గురియైనది. వారి అంతరాంతరాల్లో ఆతనిపట్ల ప్రతీకారభావం పనిచేస్తోంది. అందుచే నా మాటలను కొంతవరకు విశ్వసించారు. జన్మతః కార్మికుడైన ఇర్విన్ అనేశాడు: "వీడు పట్టిబూర్జువా రకం. బోల్షివిక్‌కు ఉండవలసిన లక్షణాలే లేవు; వీడి పద్ధతి అపసవ్యధోరణిలో పడింది."

---

♦ 'ఇంటర్ నేషనల్' అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ పేరు.

కవిగారి ఘాటైన విమర్శ మాకందరికి సరదా కలిగింది. "ఏమైనప్పటికీ బ్రాన్‌ట్వీన్ ఇబ్బందిలో ఉన్నాడు; ఆతనికి మన మైత్రీ సహకారాలు అవసరం. అతడు 'నమ్మకస్తుడు కాదు' అని రుజువయే వరకూ మనం సహకారాన్ని నిరాకరించ కూడదు. ఇంత జాగ్రత్త వహించటానికి బహుశా అత డేదో ప్రమాదకర పరిస్థితిలో చిక్కుపడి యుండవచ్చు. ఆతడు సోవియట్ రష్యా రాయబారి అని ప్రజలకు తెలిస్తే మరింత ప్రమాద మేర్పడవచ్చు. మనల నాతడు విశ్వసించాడు. పూర్తి వ్యవహారం బైటపడేవరకూ ఆతని రహస్యాన్ని గుప్తంగా ఉంచటమే శ్రేయస్కరం. అంతవరకు ఓర్పు వహించి జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండాలి." అని అన్నాను, ముఖ్యంగా ఛార్లీ నుద్దేశించి. చార్లీ నోట్లో నువ్వుగింజ నానదు. మంచి మాటకారి. అందులో ఇది ప్రపంచాన్నే కదలించివేసే వర్తమానం. కనీసం ముఖ్య స్నేహితుల కైనా చెప్పకుండా ఉండలేడు. నా ఉద్దేశ్యాన్ని గ్రహించి చార్లీ ప్రతిజ్ఞ చేశాడు. ఈ రహస్యాన్ని వెల్లడించనని చార్లీ సత్ప్రవర్తనకు బహుమతిగానూ, చార్లీ, ఇర్విన్‌ల అసూయను తొలగించటానికి ఆ సాయంత్రం 9 గంటలకు బ్రాన్‌ట్వీనును కలుసు కోటానికి నా బసకు రమ్మని ఆహ్వానించాను. అసలు బ్రాన్‌ట్వీన్ 7 గంటలకే నా బసకు వస్తానన్నాడు. ఈ రెండు గంటల్లోనూ మరి కొంత సమాచారం గ్రహించవచ్చు.

బాగా చీకటిపడిన తర్వాతగానీ బ్రాన్‌ట్వీన్ రాలేదు. దీపాల కాంతితో కలోనియారోమా ఎప్పుడూ పట్టపగలుగా ఉంటుంది; అందుచే ఇక్కడ కుట్రదారుల జాగ్రత్తకు రహస్యప్రవర్తనలకు అర్థమేలేదు. ఐనా చిరకాలంనుండి ఏర్పడ్డ అల వాట్లు వాటిత్రోవను అవి పోవలసిందేనని అనుభవంద్వారా గ్రహించిన సత్యం. ఈ రోజు బ్రాన్‌ట్వీన్ మరొకపద్ధతి అవలంబించాడు. నాగది కిటికీగుండా చూస్తూనే ఉన్నాను. టాక్సీ ఆగీ ఆగకముందే బైటికిదూకాడు. పొడవైన కోటు; హేటు ముఖంమీద పడేటట్లు ముందుకులాగాడు. పరిగెత్తినట్లు, మరుక్షణంలో వాకిలిముందు ప్రత్యక్షమైనాడు. నేను వాకిట్లోనే నిలబడిఉన్నాను. కోటు విప్పుతూ అన్నాడు: 'ఎంత జన సంకీర్ణమైన ప్రదేశం! ఇతరులకంట బడకుండా ఇక్కడికి రావటం చాల కష్టం.' నే నాతనికి హామీయిచ్చాను.

"మరేం ఫరవాలేదు. ఈ యింటికి ఎవరువచ్చినా వారికి తగిన రక్షణ ఉంటుంది." నా మాటల్లోని నిగూఢతకు కొంచెం తబ్బిబ్బుచెందాడు, వాని అర్థం గ్రహించాలనే ఉత్సాహాన్ని అణచిపెట్టాడు.

టాక్సీ ఇంకా వాకిట్లోనే ఉండడంచూచి అవసరమేమోనని అడిగాను. దీపాల వెలుగులో డబ్బు లెక్కబెడుతూ నిలబడటం మంచిదికాదని వచ్చేశాడట; నౌకరు ద్వారా డబ్బుపంపటానికి నాకేం అభ్యంతరం ఉండదుకదా, అని అడిగాడు. మేరి యాను పిలిచి డబ్బుపంపించాం. డ్రైవరుతో మేరియాగట్టిగా మాట్లాడటం విని

బ్రాన్‌ట్విన్ ఆదుర్దాపడ్డాడు. చుట్టుప్రక్కల జనం మూగుతారేమోనని ఆతనిభయం. అసలుబాడుగకంటె డ్రైవర్ ఎక్కువ కోరుతున్నాడనీ అందుకని మేరియా గట్టిగా మాట్లాడుతోందని చెప్పాను; టాక్సీ వెళ్ళిపోయింది.

"ఇది మీ స్వగృహమే అనుకోండి" అంటూ స్పానిష్. అతిథిమర్యాదలను ఎత్తిపొడుస్తున్న ధోరణిలో బ్రాన్‌ట్వీనును కూర్చోమన్నాను.

"ఐతే ఆధునిక నాగరితా సాంప్రదాయాల అసంబద్ధాలలో మీకు నమ్మకం లేదన్నమాట ?" అన్నాడు.

రెండవ సమావేశారంభంనుండి ఈ 'మాయమనిషి' పట్ల నాలో ఆత్మీయత కలిగింది. బ్రాన్‌ట్వీన్ ఇంకా కూర్చోలేదు. గది నలువైపులా పరికించి చూస్తున్నాడు. విమర్శనాత్మకంగా ఆ చూపుల అడుగున ప్రశంస స్పష్టంగా కన్పిస్తున్నది. ఇంకా 'వాకింగ్ స్టిక్' పట్టుకునేఉన్నాడు; అది అంత సభ్యతగా లేదనిపించింది. ఆ కఱ్ఱతో శాటిన్ తొడిగిన కుర్చీవైపు చూపిస్తూ "ఇది శ్రామికవర్గీయుని గృహంగా లేదే" అని నన్ను రెచ్చగొట్టాడు. "అని ఎవరు చెప్పారు ?" నిందాగర్భితంగానే అంటూ, వివరించాను :

"ఇది మెక్సికో రిపబ్లిక్ ప్రెసిడెంటుకు అనధికార సలహాదారుగా గౌరవింపబడే వ్యక్తి నివసించే ఇల్లు."

శ్రామికవర్గ సాంప్రదాయాల ప్రమాణాలను నిర్ణయించే విమర్శనకు యదార్థం బోధపడింది. నన్ను అభినందిస్తూ "ఓహో ! సోషలిస్టుపార్టీ జనరల్ సెక్రటరీ పదవే గాక ఆ పదవి కూడా నిర్వహిస్తున్నారన్నమాట ! చాల సంతోషం. ఇంత పిన్న వయస్సులో దూరదేశంలో ఇంతటి గౌరవాన్ని పొందటం గర్వింపదగిన విశేషమే."

పోటీ ప్రారంభంలో, పరస్పరం మల్లులొకరి బలాన్ని మరొకరు తూకం వేసే పద్ధతిలో ప్రారంభమైంది మా సంభాషణ. పానీయాలతో స్థిమితపడ్డాం; వాతావరణం కొంచెం చల్లబడింది; బ్రాన్‌ట్వీన్ ధోరణికూడా మారింది. సహజ ధోరణిలో, "హోటల్ మార్చేయాలి; పనిలేకుండా విదేశీయుడు ఇంత కాలం హోటల్లో ఉండటం అనుమానాలకు కారణం కావచ్చు. అందులో విదేశీజోక్యం అనే భయం ఆవరించి ఉన్న ఈ వాతావరణంలో; ఆ హోటల్ కూడా అంత శుభ్రమైందిగాదు; ఛార్జీలు కూడా చాల ఎక్కువ. అసలు హోటల్లోకంటె గృహస్థుల యిండ్లలో ఉండటమే మంచిది. ఈలోగా ఒక సాహసం చేయాలి" అన్నాడు.

ఇదే మంచి సమయం. ఎద్దుకు గంత కట్టటానికి. నా బసలోనే ఉండటానికి ఈ మాయమనిషిని ఆహ్వానించవచ్చు. సమ్మతిస్తే ఈతణ్ణి గురించి విశేషాలను గ్రహించనూ వచ్చు. నా ఆహ్వానాన్ని అంగీకరించాడు బ్రాన్‌ట్వీన్; నాకు ఆశ్చర్యం

కలిగింది. సాధారణంగా ఆహ్వానాన్ని అంత సులభంగా అంగీకరించేవాడు కాదు; పైన చెప్పినట్లు అత డేదో ప్రమాదంలో ఉన్నాడు. నన్ను విశ్వసించి కష్టసుఖాలు చెప్పుకోవచ్చునసే నమ్మకం అతనికి కుదిరింది.

మెక్సికో నగరం చేరేసరికి, ట్రాన్‌ట్వీన్ చేతిలో చిల్లిగవ్వకూడా లేదు. ఇంకెంతకాలం అలా ఉండవలసి వస్తుందో అతనికే తెలియదు. తన దుస్థితిని వెల్లడించటానికి ఎంతో బాధ పడ్డాడు. కాని వెంటనే భారం తీరినట్లు విషాదంగా నవ్వాడు. ఆతని సరదా అంతా బాధలు మరచిపోవటానికి చేసే ప్రయత్నమేనని గ్రహించాను. ఐనా ఆతణ్ణి అంతటితో విడిచిపెట్టకూడదు; నా గదిని గురించి అతని విమర్శను వెటకారంగా అన్నాను! "మీరు బసచేయటానికి ఈ ఇల్లు అంత యోగ్యం కాకపోతే, మరొక హోటలే చూద్దాం, స్నేహానికి యోగ్యులని భావించి మీకు ఆతిథ్యమీయటానికి సిద్ధపడ్డాను. నేను పొరబడి ఉన్నట్లయితే, యోగ్యతలేని అతిథిని బైటికి నడపటానికి నే నెప్పుడూ వెనుకాడను." ట్రాన్‌ట్వీన్ హృదయ పూర్వకంగా నవ్వుతూ అన్నాడు: "మనం సరి ఉజ్జీలం-మార్క్సిస్టు పదార్థవాది, హిందూ ఆధ్యాత్మికవాది. ప్రాచ్యదేశాల గురించి నాకేం అనుభవం లేదు. కాని సంయుక్త రాష్ట్రాల్లో ఉండగా, హిందువులు ఆధ్యాత్మికజాతి అని చాలా విన్నాను" అన్నాడు.

సంభాషణ కావిధంగా అతడే అవకాశాన్ని కలిగించాడు. "అమెరికాలో ఎన్నాళ్ళున్నారు? మీ ఉచ్చారణనుబట్టి అమెరికాలో చాలాకాలం ఉన్నట్లు తోస్తుంది!" అన్నాను. "అమెరికాలో చాలాకాలం వున్నమాట వాస్తవమేగాని అమెరికన్లలాగా ముక్కుతో మాట్లాడి రాజభాషను (King's English) ఖూనీ చేయను." అంటూ తన జీవితచరిత్రలో ఒక అధ్యాయాన్ని గురించి చెప్పాడు. "రష్యాలో 1905 విప్లవం విఫలంకావటంతో అమెరికా పారిపోయి వచ్చాను. 1917 లో అమెరికానుండి తిరిగి రష్యా వెళ్ళాను." ప్రస్తుతం అంతకుమించి అడగటం భావ్యంకాదనీ నన్నుగురించి ఆతని ఆసక్తిని, తృప్తికలిగించటం మైత్రికి లక్షణమనీ మెక్సికో ప్రభుత్వంతో నాకుగల సాన్నిహిత్యాన్ని గురించి కొద్దిగా వివరించాను. విప్లవ కార్యక్రమాలకై సేకరించబడిన నిధి నా దగ్గర ఉన్నదనీ, డబ్బునుగురించి బాధపడనక్కరలేదనీ హామీఇచ్చాను. నా మాటలవల్ల ఆతనిమనస్సులో ఎన్నో ప్రశ్నలు సహజంగా ఉదయించి ఉంటై. కాని అతడేమీ అడగలేదు.

ఇంతలో డోర్ బెల్ మ్రోగింది. ట్రాన్‌ట్వీన్ ఆదుర్దాపడ్డాడు. "వచ్చినవారు ఎల్ హెరాల్డో పత్రికనుంచి వచ్చినమిత్రులే. వీరు సాంఘికవిప్లవ కార్యక్రమాలలో తలపెరిసినవారు. అందుచే లెనిన్ మిత్రుని స్నేహాన్ని కేవలం నేనే గుత్తకొనటం భావ్యంకాదనే ఉద్దేశ్యంతో వారిని భోజనానికి ఆహ్వానించాను." అన్నాను అతణ్ణి సమాధానపరచటానికీ, ఛార్లీ చెప్పిన వార్తను రుజువుచేసుకోటానికి. "ఐతే ఛార్లీ

వాగేస్తున్నాడన్న మాట." అన్నాడు బ్రాన్‌ట్వీన్. ఆ వాక్యంతో నాకు అనుమానం కలిగింది; బ్రాన్‌ట్వీన్ చెప్పేది కేవలం డాబులేనా? ఏమైనా, నిజం నిలకడమీద తేలక పోతుందా అని సమాధానపరచుకొన్నాను. ఇర్విన్, ఛార్లీలు గదిలో ప్రవేశించారు. బ్రాన్‌ట్వీన్ పాతధోరణిలో వారి నడిగాడు:

"శ్రామిక విప్లవకారులకు బూర్జువా సెలూనులో పనేమిటి?" ఇర్విన్ నిశ్శబ్దంగా గ్లాసులో సారా పోసుకుంటూ-

"సారాయికి వర్గవిభేదం లేదు" అన్నాడు. మరుక్షణంలోనే, ఛార్లీ ఆతణ్ణి సమర్థిస్తున్నట్లు కేవలం సందర్భశుద్ధిలేకుండా "జర్మనీ ధనంతో విప్లవం నడిపినవారిలో మొదటివాడు లెనిన్ కాదు; లెనిన్‌కు పూర్వమే ఆ కార్యక్రమాన్ని రాయ్ ప్రారంభించాడు" అన్నాడు. "సంభాషణ కట్టిపెట్టి భోజనానికి లేవండి" అన్నాను.

చెప్పినప్రకారం సాంప్రదాయసిద్ధమైన మెక్సికోవంటకాలు తయారుచేసింది మేరియా. నే నెరిగినంతవరకు వంటలో మేరియాను మించగలవారు మెక్సికోలో లేరనవచ్చు. గొప్పవారు అతిథులుగా వస్తున్నారని చెప్పటంతో వంటపట్లనేగాక తన ఆకారం, దుస్తుల విషయంలోకూడ ఎంతో శ్రద్ధవహించింది. తరువాత బ్రాన్‌ట్వీన్ నాతో అన్నాడు: "వడ్డన ఐంది రావచ్చున"ని ఆమె అన్నప్పుడు మేరియా పిలుస్తున్నది భోజనానికా? ఆలింగనానికా? అనే అనుమానం కలిగిందట! భోజనం ఐరోపావారికి కొంచెం వెగటుగానే ఉండవచ్చు. కాని బ్రాన్‌ట్వీన్‌తో చెప్పాను. "ఈ వంటకాలకు అలవాటు పడకపోతే యిక్కడ పస్తులుండవలసిందే; మేరియాదగ్గర మన పప్పులుడకవు" అని హెచ్చరించాను.

"మేరియా చేతిమీదుగా పెట్టిన విషమైనా ఆనందంగా తింటాను"అన్నాడు ఉల్లాసంగా.

భోజనానంతరం తిరిగి సమావేశమైనప్పుడు ఛార్లీ అసూయ ఉండబట్టలేక నాతో అన్నాడు. "ఇంకేం పెద్దచేపనే పట్టావ్"; ఆతణ్ణి తృప్తిపరచేందుకు సానునయంగా అన్నాను. "నీవు చూపించిన చేపేగదా! ఐనా మా బెంగాలు సాంప్రదాయం ప్రకారం తల నీది; మొండెం నాది అన్నాను." మా భాగాల పంపిణీలపట్ల మా మధ్యపడ్డ చేపకు బాధకలిగినట్లులేదు. మాటల సందర్భంలో బ్రాన్‌ట్వీన్ రష్యాలోని పరిస్థితులను ముచ్చటించాడు. వివరాలను గురించి అడిగితే ఇప్పుడుకాదని తప్పుకున్నాడు. అప్పటికే ప్రొద్దుపోయింది. మేరియా 'టాక్సీ' కోసం 'ఫోను' చేసింది. ఛార్లీ, ఇర్విన్‌లు హోటల్ దాకా బ్రాన్‌ట్వీన్‌తో వెళ్ళటానికి సమ్మతించారు. మరునాడు బ్రాన్‌ట్వీనును కలుసుకుంటానని హోటలునుండి మారటానికి సిద్ధంగా ఉండమనీ చెప్పాను.

మరునాడు హోటలుకు వెళ్ళాను. రెండు పెద్ద ట్రంకుపెట్టెలు, కొన్ని సూట్‌కేస్‌లతో సిద్ధంగా ఉన్నాడు ట్రాన్‌ట్వీన్. కుట్రదారుకు ఉండవలసిన దాని కంటె చాల ఎక్కువ సామాన్లున్నై. క్షమాపణ చెప్పుకుంటున్న ధోరణిలో, తన ప్రయాణం చాల రహస్యంగా ఉంచాలనీ అందుకే ఈ హంగామా అనీ చెప్పాడు. కాని క్రమక్రమంగా నేను గ్రహించినదానినిబట్టి, కుట్రనెపంతో, బూర్జువా విలాసాలను అనుభవించటమనేది రష్యన్ బోల్షివిక్కులందరిలోనున్న సామాన్య దౌర్బల్యమే. తమ అల్పత్వభావాన్ని కప్పిపుచ్చుకొనటానికై, జీవిత ప్రమాణాల్లో బూర్జువాలకేవిధంగానూ తీసిపోము అని లోకానికి చాటటమే వారి ఆశయమై ఉంటుంది.

హోటల్‌బిల్లునడిగి నైకం చెల్లించాను. సామాన్లు క్రిందికి చేరవేశారు. మా టాక్సీ కదులుతూ ఉండగా మరొక టాక్సీలో ఛార్లీ కన్పించాడు. మా వెంటనే వస్తున్నాడు. నాకేదో ప్రమాదం జరగబోతోందని నా రక్షణకై వచ్చాడట! అతని విశ్వాసమూ, వాత్సల్యమూ అటువంటివి! కొంతదూరం వచ్చి ప్రమాదమేమీ లేదని గ్రహించి తెలివిగా వెనుకకు మరలాడు. ఇల్లు చేరాం; సామాన్లు పైన సర్దుతూ ఉండగా ట్రాన్‌ట్వీన్ అడిగాడు: "విదేశీయులు మెక్సికోలో రిజిస్టర్ చేయించుకోవలసిన అవసరం ఉందా? ఐతే నా పేరు గ్యూజెన్‌బర్గు; నేనొక ఆస్ట్రియన్ న్యాయవాదిని. చాలా సంవత్సరాలుగా సంయుక్తరాష్ట్రాల్లో నివశిస్తున్నాను" అన్నాడు.

"మా యింట్లో బసచేసేవారెవ్వరూ రిజిస్టర్ చేయించుకోనక్కరలేదు. వారిని గురించి పోలీసులు ఎటువంటి దర్యాప్తులూ చెయ్యరు". అని హామీ యిచ్చిన మరుక్షణంలో అతడన్నాడు:

"ఏమైనా ట్రాన్‌ట్వీనును ఇక మరచిపోవలసిందే; పోలీసురిజస్ట్రేషన్ అక్కరలేని పక్షంలో నాపేరు మైకేల్ బొరొడిన్. క్రొత్తగా స్థాపింపబడిన అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ (Communist International) ప్రతినిధిగా అమెరికాకువచ్చాను." నా ఆశ్చర్యానికి మేరలేదు.

చైనాలో అపఖ్యాతిపాలైన బొరొడిన్‌తో నా పరిచయం ఈ విధముగా ప్రారంభమైంది. నాడు మొదలు 1929 లో రష్యాను విడిచిపెట్టేవరకు బొరొడిన్ నా ఆప్తమిత్రుల్లో ఒకడు. రాజకీయంగా మా మధ్య అభిప్రాయభేదాలు వస్తూ ఉండేవి. అందులో చైనాలో వచ్చిన విభేదం చాల తీవ్రమైంది. కాని మామైత్రికి మాత్రం భంగం కలగలేదు. ఈ మైత్రివల్ల మొదట్లో నేనే చాలా లాభంపొందాను. మార్క్సిజానికి కీలకమైన హెగెలియన్ గతితార్కికాలలోని క్లిష్ట విశేషాలతో నాకు పరిచయం కలిగించింది బొరొడినే. ఐరోపా సాంస్కృతిక చరిత్రను గ్రహించటంతో భారతీయ ప్రత్యేక విశిష్టత అని నాలో ఊగిసలాడుతున్న విశ్వాసం పూర్తిగా నశించింది.

## జారు ఆభరణాల గాథ

మా యింటికి బస మార్చిన మరుమాడే, బొరొడిన్ తన జీవితాన్ని గురించి, ఈ పరిస్థితుల్లో తాను మెక్సికోకు రావడంలోని అంతర్యాన్ని గురించి వివరించాడు. 1905 విప్లవం తరువాత సంయుక్త రాష్ట్రాలకు వచ్చి 1918 వరకూ ఉండి స్వదేశానికి తిరిగి వెళ్లాడు. అమెరికాలో న్యాయ, తత్త్వశాస్త్రాలను అధ్యయనించి మరి కొంత కాలం ఏదో ఒక విశ్వవిద్యాలయంలో ఉపన్యాసకుడుగా పని చేశాడు. అంతకంటె స్పష్టంగా వివరించటాని కాతడు సమ్మతించలేదు. నేనూ అతని రహస్యాలను గురించి గుచ్చి గుచ్చి అడగలేదు. రష్యా బోల్షివిక్ లంతా యింతే. అవసరమైన దానికంటె ఎక్కువ గోప్యంగా ఉండటం వారి అలవాటు. స్వదేశంలోనూ, విదేశాలలో నూ కుట్రలు సాగిస్తున్న రోజుల్లో ఇట్టి ప్రవర్తన సమర్థనీయమే ఐంది. కాని ఆ తరువాత ఈ 'గోప్యం' విప్లవ సద్గుణంగా పెంపొందించుకున్నారు. బహుశా ఇతరుల సమక్షంలో తమ తమ ప్రాముఖ్యతను సూచించే ఉద్దేశ్యమే ఈ ప్రవర్తనకు కారణం! బుద్ధిసూక్ష్మత, విద్య, విజ్ఞానాలు, మంచి సంస్కారం ఎంత ఉన్నా మా అతిథి కేవలం 'డాబుసరి రాయుడ'ని గ్రహించటానికి ఎంతో కాలం పట్టలేదు. మా మైత్రి పెరిగిన కొలదీ, అప్పుడప్పుడూ ఆతని చర్యలను, మనస్తత్వాన్నీ విమర్శిస్తూ ఉండేవాణ్ణి. 'ఇది వయసుకు మించిన వేదాంతం' అంటూ ఉండేవాడు.

అమెరికాలో ఉండగా బొరొడిన్ వివాహం చేసికొన్నాడు; భార్యా, ఇద్దరు పిల్లలూ చికాగో నగరంలో ఉంటున్నారు. చాల బాధతో చెప్పాడీ విషయాలు. సంవత్సరం క్రితం తాను రష్యా కెళ్ళినప్పటినుండీ, భార్యా బిడ్డ లెలా ఉంటున్నదీ అతనికి తెలియలేదు. అమెరికా వచ్చిన వెంటనే భార్యా బిడ్డల్ని కలుసుకుందామని సంకల్పించాడు. ఆ మాట లంటూ బొరొడిన్ గతుక్కుమన్నాడు. తన విప్లవ వీరగుణాలీ గార్హస్థ్య జీవిత మమకారంలో మరుగునపడి పోయినట్లు! ఐనా అంతకంటె ఎక్కువ ముఖ్యమైన కర్తవ్య నిర్వహణలో ఇంతవరకు చికాగో వెళ్ళ లేదని తన 'దౌర్బల్యాన్ని' కప్పిపుచ్చాడు. అమెరికాకు అమూల్య వస్తుసముదాయంతో వచ్చాడట! అదేమిటో మాత్రం అప్పట్లో చెప్పలేదు. ఇంకా రహస్యమే. వాని నాతడు స్వయంగా తీసుకురావటానికి వీల్లేకపోయింది. వానిని చికాగోలోని గ్యూజెన్ బర్గు సతికి చేర్పవలసిందిగా ఒక నౌకరుకు అప్పగించాడట.

ఇప్పటికే అనుకున్న దానికంటె ఎక్కువగా చెప్పినట్లు బాధపడి ఈ వివరాలెవ్వరితోను ముచ్చటించవలదని కోరాడు. అమెరికాలో తన పేరు మైకేల్ గ్యూజెన్‌బర్గ అనీ తానొక హీబ్రూ పూజారి కుటుంబంలో పుట్టినట్లు చెప్పుకొన్నాడట. లెనిన్‌కు గూడా తాను ఆ పేరుతోనే పరిచయమట! పరిచయం పెరుగుతున్నకొద్దీ, యూదు జాతి వారసత్వం, బొరొడిన్ మనస్తత్వంలో పూర్తిగా తిష్టవేసినట్లు గ్రహింపసాగను.

యూదు 'రబ్బీ'గా ఉండటానికే అతను జన్మించాడు. అంటే జిత్తులమారి కర్మ వాది! తన విశ్వాసాలలో, సిద్ధాంతాలలో మొండిపట్టుదలతోపాటు నీతినియమాలంటే పూర్తి నిర్లక్ష్యం గల వ్యక్తి. ప్రస్తుతం బోల్షివిజమే బొరొడిన్ మతం! జాగ్రత్తగా కష్టపడి సాధించిన బుద్ధి సూక్ష్మతవల్ల అతనిలో అనుమానం, నిరాశ ఎక్కువైనై; కాని యూదుజాతికి సహజమైన ఉద్రేకం పూర్తిగా పోలేదు. ఉద్రేకానికి కళ్లెం వేసి బిగబట్టినా అప్పుడప్పుడు కుప్పకూలిపోయేవాడు. అట్టి ఉద్రేకపూరితమైన సన్నివేశాలు, నాకు తెలిసినంతవరకు చాల స్వల్పమే. కాని అవి నాలోని నిరాశను, అతనిలోని విషాదాన్ని తొలగించి మా స్నేహానికి మెరుగులుదిద్దినై. ఆ సన్నివేశాలను స్మరించినప్పుడు ఎంతో హాయిగా ఉంటుంది.

బొరొడిన్ న్యూయార్కులో దిగీదిగటంతోటే అత డొక ఉపద్రవకరమైన విదేశీయుడని అమెరికా గూఢచారిదళం పసికట్టింది. వెంటనే అతను చికాగో వెళ్ళి ఉన్నట్లయితే, ఆతని కుటుంబంమీద పోలీసులు కన్నువేసి ఉంచేవారు; అమూల్య వస్తువులు తెచ్చే నౌకరు పట్టుబడేవాడు. అందుచే బొరొడిన్ న్యూయార్కులోనే కొంతకాలం గడిపి, భార్యకు జాబు వ్రాసి ఎలాగో తప్పించుకు బైటపడ్డాడు. బొరొడిన్ మెక్సికోకు వచ్చినట్లు ఆమెకు తెలుసు. నౌకరు వచ్చిన వెంటనే ఆమె బొరొడిన్‌కు జాబు వ్రాయాలి. ఆ జాబు కొరకే ఆతడు ప్రతి రోజూ పోస్టాఫీసుకు వెళ్ళి వస్తున్నాడు. ఈ కథతో మొదటిరోజు పోస్టాఫీసు దగ్గర బొరొడిన్ ముఖంలోని విషాదరేఖకు కారణం అర్థమైంది. అంతకు రెండు రోజుల క్రితం బొరొడిన్ భార్య ఒక జాబు వ్రాసింది. అదొక విషాదగాథ; ఆతడు రష్యా వెళ్ళినప్పటినుండి ఆ కుటుంబం డబ్బులేక ముప్పతిప్పలు పడుతోందట!

ఇప్పటికిక చాలు! బొరొడిన్ సహజంగా గంభీరమైన వ్యక్తి. కాని చాలా బాధాకరమైన అనుభవాలలో మునిగితేలుతున్నాడు. గార్హస్థ్య విధులను కాలరాచే బాధ్యతలు, విప్లవధర్మాలు ఆతనికున్నట్లు ఊహించాను. ఇంకా అవి ఏమిటో తెలియదు. ప్రస్తుతానికి భార్యాబిడ్డలకు ధైర్యం చెబుతూ వ్రాయాలని చెప్పాడు. బోల్షివిక్కులు కూడా తరచు మానవసహజమైన దౌర్బల్యాలకు లోనాతూ ఉండేవారు! అంతటితో సంభాషణ నాపి భోజనానికి లేచాం. మరునాడు పోస్టాఫీసుకు వెళ్లాం. గ్యూజెన్‌బర్గు సతీమణికి ఐదువందల డాలర్లు పంపాం. బొరొడిన్ వారించటానికి ప్రయత్నించాడు. చివరికి అన్నాడు: 'నీవొక నియంతవు!'

మరునాడు సాయంత్రం తిరిగి తన కథను ప్రారంభిస్తూ "నాకున్న బాధల్లో నిన్న నీవు తీర్చింది చాలా స్వల్పమైంది" అన్నాడు బొరొడిన్. కృతజ్ఞతను వెల్లడిస్తూ తనకు అపారమైన బాధ్యతలున్నవనీ, అమూల్యవస్తువులతో నౌకరు ప్రత్యక్షమైతేగాని అతనిభారం తీరదని చెప్పాడు. వాని వివరాలు చెప్పదగినవైనపక్షంలో, తెలియ

జేస్తే, నా శక్తి కొలది సహాయం చేస్తానని హామీ ఇచ్చాను. ఆ వివరాలు విప్లవానికి సంబంధించినవనే భావం నాలో కలిగింది. అదే నిజమైతే విప్లవంలో ఎంతటి అత్యల్ప మైనదైనా, కొంత బాధ్యతను నిర్వహించాననే తృప్తి కలుగుతుందని నా ఆశ. నా శక్తి సామర్థ్యాలపట్ల బొరొడిన్‌కి అనుమానం ఉండటం అసహజంకాదు. కాని హృదయపూర్వకంగా వాగ్దానం చేసిన నా సహకారాన్ని త్రోసిపుచ్చటం నన్ను అవమానపరచట మౌతుందనే భయమూ ఉండ దతనిలో. ఇకనన్ను విశ్వసించటమే అతనికి తప్పనిసరైంది.

1918 మధ్యలో రష్యా, బోల్షివిక్ ప్రభుత్వం, వాషింగ్టన్‌కు ఒక వర్తక సంఘాన్ని (Trade delgation) పంపింది. అంతకుపూర్వమే అధ్యక్షుడు విల్సన్, స్వంతబాధ్యతపై రష్యాకు పంపిన విలియం బుల్లిట్, రష్యాకు అనుకూలమైన నివేదిక సమర్పించాడు; దాన్ననుసరించి, సోవియట్ వర్తక ప్రతినిధి సంఘాన్ని ఆమోదించాడు విల్సన్. అనతికాలంలోనే రష్యాలో అంతర్యుద్ధం ప్రారంభమైంది; మిత్రరాజ్యాలు విప్లవ విరోధులకు పూర్తి మద్దతు నిస్తున్నై; సోవియట్ రష్యాపై దిగ్బంధం విధింప బడింది. అందుచే ఇతర దేశాల్లోని ప్రతినిధివర్గాలవలెనే వాషింగ్టన్‌లోని సోవియట్ వర్తక ప్రతినిధివర్గానికికూడా మాస్కోతో సంబంధాలు తెగిపోయినై. కొంతకాలం అమెరికాలోని మిత్రులు, సానుభూతిపరుల ధనసహాయంతోనే కాలక్షేపం చేశారా ప్రతినిధులు. కాని అలా ఎంతకాలం గడుస్తుంది? ప్రతినిధివర్గం బాధపడక తప్పలేదు.

ఈ విచారకర వర్తమానం మాస్కోకు అందింది. ఇది గౌరవప్రతిష్ఠలకు సంబంధించిన సమస్య. అమెరికా ప్రభుత్వ ఆమోదం ఉన్నంతవరకు ప్రతినిధివర్గం వాషింగ్టన్‌లోనే ఉండాలి; అందుకు ప్రతినిధివర్గానికి డబ్బు పంపాలి. కాని డబ్బు పంపటం ఎలా? బోల్షివిక్ ప్రభుత్వానికి అంతర్జాతీయ బాంకింగ్ సౌకర్యాలింకా లభింపలేదు. రాజకీయవార్తాహరుల సౌకర్యంకూడాలేదు. ఇక దొంగచాటుగా డబ్బుపంపటమే మార్గం. అమెరికాలో అనేక సంవత్సరాలు నివసించిన బొరొడిన్ ఒక్కడే ఈ సాహసానికి తగినవాడని నిర్ణయింపబడింది. చక్రవర్తుల ఆభరణాల నాతడు అమెరికాకు చేర్చాలి; రహస్యంగా ఆ నగలను అమ్మివేయాలి. వచ్చినధనంతో వర్తక ప్రతినిధుల ఇక్కట్టులను గట్టెక్కించి, మిగిలినధనంతో అమెరికాలోని కమ్యూనిస్టు ఉద్యమానికి సహాయం చేయాలి. అంతా సవ్యంగానే నడిచిందిగానీ చివరిదశలో ఈ ప్రణాళిక త్రోవతప్పింది. వాషింగ్టన్‌లో కొందరు వ్యక్తుల దగ్గర ఆభరణాలను వదలి బొరొడిన్ తప్పించుకొనవలసివచ్చింది. వారిని విడుదలచేయటానికి ప్రస్తుతం బొరొడిన్‌కు కొంత ధనం అవసరం.

"ఎంత మొత్తం కావాలి?" అనే ప్రశ్న బొరొడిన్‌ను చకితుణ్ణి చేసింది. చెప్పిందాకా నేనతణ్ణి విడిచి పెట్టలేదు. బోల్షివిక్ విప్లవానికి సహాయపడగల

పదవకాశం లభించింది; బొరొడిన్‌తో అన్నాను. "నీవు చెప్పిన మరుక్షణంలో, పోస్టుద్వారా ఎంత త్వరలో ప్రయాణం చేయగలదో, అంత త్వరలో ఆ మొత్తం వాషింగ్టన్ చేరుకుంటుంది." మరునాడే 5000 డాలర్లు పోస్టు చేశాం. అది చేరినట్లు రశీదు రాగానే మరొక 5000 డాలర్లు పంపగలమనే వర్తమానం కూడా పంపాం; మెక్సికో రాయబార కార్యాలయం ద్వారా వ్యవహారం నడపటంవల్ల ప్రయాసలేకుండా పోయింది. పదిరోజుల కాలంలో బోల్షివిక్ విప్లవానికి నా తొలిసేవ పూర్తయింది!

బోల్షివిక్కులు అధికారంలోనికి వచ్చిన నాటినుండీ రష్యన్ బంగారం ప్రపంచం నలుమూలలను ప్రవహించింది కమ్యూనిస్టు ఉద్యమక్షేత్రాలను సారవంతం చేసే ఉద్దేశ్యంతో. కాని ఒకచోట మాత్రం ఈ ప్రవాహం ఎదురు నడిచింది! అది బొరొడిన్ చేతుల్లోనుండి జారిపోయిన చక్రవర్తి ఆభరణాలను పునరుద్ధరించటానికే!

పై అనుభవంతో ఈ దూరదేశంలో నా పరిచయం చేసికొన్నందుకు తన అదృష్టాన్ని అభినందించుకొన్నాడు బొరొడిన్. వాస్తవానికిది మునిగిపోతున్న వ్యక్తి గడ్డిపరకను పట్టుకొన్నట్లే! కాని అది తన గతితార్కికాల ఫలితమేనని బొరొడిన్ వాదన! ఇటువంటి విషయాలను గురించి చర్చించటంలో చాల మార్గంగా ఉండే వాడు. ఒకసారి అతణ్ణి మెరిడిత్ ఇగోయిస్టుతో పోల్చాను. భావాల్లోనూ, అభిరుచుల్లోనూ కూడా ఎపి క్యూరియన్ కావటంచేత, ఈ పోలికను సహింపలేక పోయినాడు. క్రమంగా తన రహస్యవర్తనను మాని బొరొడిన్ నాతో అన్ని విషయాలు చెప్పసాగాడు. ఆభరణాలను తిరిగి సంపాదించే, ప్రయత్నం చేయటానికై, అవి ఏవిధంగా చేయిజారినవో నాతో వివరించాడు.

ఆ రోజుల్లో సోవియట్ విదేశాంగశాఖ, కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ రెండూ కలిసి పనిచేస్తూ ఉండేవి. విదేశాంగశాఖ ఉపమంత్రి (Vice Cominissar) జి. కారఖాన్; కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ కార్యదర్శి అంజెలికా బలబనోవా; వీరిద్దరూ బొరొడిన్ మిత్రులు. మిలియన్ రూబుల్స్ ఖరీదుచేసే చక్రవర్తి ఆభరణాలను రహస్యంగా అమెరికాకు చేరవేసే బాధ్యతను తగినవాడు బొరొడిన్ అని నిర్ణయించినది వారే. (నాటివిలువ ప్రకారం వాని ఖరీదు 500,000 డాలర్లు); మణులు, వజ్రాలు రెండు తోలుసూట్ కేసుల్లో పోశారు; వాటితో బొరొడిన్ ఐరోపాగుండా మారుపేర్లతో, దొంగ ప్యాస్‌పోర్టులతో ప్రయాణం చేశాడు. మొదట హాలెండు వెళ్లాడు. కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ పశ్చిమ ఐరోపా రహస్య శాఖ హాలెండులోనే ఉంది. అందులో ఎందరో ప్రముఖులు సభ్యులుగా ఉండే వారు. హెన్రీటారోలెండ్ హోల్స్ గొప్ప కవయిత్రి; రట్‌గర్స్ చాల పేరున్న ఇంజనీర్; విజిన్‌కూప్ ప్రఖ్యాత న్యాయవాది; పార్లమెంటు సభ్యుడు. ఖగోళ శాస్త్రజ్ఞుడైన అంటోన్ పానెకోక్ - ప్రముఖ రచయిత, హెర్మన్ గోర్టర్ - వీరుభ

యులు నాటి మార్క్సిస్టు తత్వవేత్తలలో సుప్రసిద్ధులు. వీరందరూ హాలెండ్‌లో మంచి పలుకుబడిగలవారు. వీరి సాయంతో, విదేశ వాణిజ్యశాఖోద్యోగుల తనిఖీని తప్పించుకొని డచ్చినౌకలో అట్లాంటిక్ మహాసముద్రంమీద బొరొడిన్ ప్రయాణానికి యేర్పాట్లు జరిగినై.

వియన్నాలో, ధనికవర్గీయుడైన యువకునితో బొరొడిన్‌కు పరిచయం కలిగింది. ఆతడు యుద్ధంలో ఓడిపోయిన ఆస్ట్రియా సైనికోద్యోగి. పరాజయం వల్ల ఆతనిలో నిరాశ, నిస్పృహలు తాండవిస్తున్నై. యిరోపా వినాశనం తప్పదనే భావంతోనూ, దక్షిణ అమెరికాలో ఏదో మారుమూల పల్లెలో శాంతి లభిస్తుందనే ఆశతోనూ బయలుదేరాడు. అట్లాంటిక్ మీద, డచ్చినౌకలో బొరొడిన్ తోడి ప్రయాణీకుడైనాడు. అది పశ్చిమ ఇండియా దీవుల్లోని కురకావా నుండి హాలెండుకు 'గిన్' సారాయి దిగుమతిచేసే నౌక. దారిలో హైటీవద్ద అమెరికా వాణిజ్యశాఖ ఉద్యోగులా నౌకను ఆపి తనిఖీచేశారు. బొరొడిన్, ఆతని సహచరుడు ప్రమాదకరమైన విదేశీయులనే ఆరోపణతో విచారణ నిమిత్తం 'కస్టడీ'లో ఉంచారు. కొన్ని రోజులైన తరువాత బందోబస్తు కొంతసడలటంతో, బొరొడిన్ తప్పించుకొని ఒక చిన్న పడవలో జమైకాచేరి, అచ్చట న్యూయార్కు వెళ్ళే నౌక యెక్కాడు. ఈ విధంగా చేయటంలో, ఉద్యోగులు తననే అనుమానించి తననే వెంటాడగలరనీ, ఆస్ట్రియా ఉద్యోగి నిరపరాధి అని ఆతణ్ని విడుదల చేయగలరనీ,బొరొడిన్ ఉద్దేశ్యం. విడుదలైన తరువాత గ్యూజెన్‌బర్గ సతీమణికి అందజేయవలసిందిగా సూట్‌కేసుల నాతనిదగ్గిరే విడిచిపెట్టాడు.

న్యూయార్కు చేరగానే, ఆభరణాల అమ్మకానికి తగిన యేర్పాట్లు చేయాలని బొరొడిన్ సంకల్పం; అక్కడాతనికి పాతస్నేహితు లున్నారు. న్యూయార్కు నగర తూర్పుప్రాంతంలో యూదులు నివసిస్తున్నారు; అది సోషలిస్టుపార్టి సాంఘిక సమావేశాలకు కేంద్రం; అచట 'కిల్లీ'దుకాణదారుల సహాయంతో, వజ్రాలను ఆమ్‌స్టర్‌డామ్‌కు పంపి, కోయించి పారిస్ మార్కెటులో అమ్మించాలని ప్రణాళిక వేశాడు బొరొడిన్. కాని న్యూయార్కు చేరిన వెంటనే బొరొడిన్‌ను అరెస్టుచేశారు. సోషలిస్టుపార్టీకి న్యూయార్కుయూదుల్లో అట్లాంటిక్ మీదుగా దొంగవ్యాపారంలో సహాయంచేసే కిల్లీ దుకాణాదారులేగాక, న్యాయవాదులుకూడ మిత్రులుగానున్నారు. వారే జామీనుమీద బొరొడిన్ విడుదలకు యేర్పాటుచేశారు; అనంతరం, న్యాయవాద మిత్రులు, రాజకీయమిత్రులు మెక్సికో సురక్షిత ప్రాంతమని సలహాయిచ్చి ఇక్కడికి పంపేశారు. వారెవ్వరికీ బొరొడిన్ తాను ఏ పనిమీద అమెరికావచ్చిందీ వివరించలేదు. హైటీనుండి న్యూయార్కుకు ఆతడు ప్రయాణంచేసిన పరిస్థితులే, చిల్లిగవ్వయినా లేకుండా మెక్సికోకు రావటానికి కారణం.

చాల చిత్రమైనగాథే. 'విప్లవ ఆస్తిని' తిరిగి సంపాదించటానికి ఇంకా ఎన్ని సాహసాలు చేయవలసిఉంటుందో! వెంటనే హెయిటీకి ఒక విశ్వాసపాత్రుణ్ని పంపి, ఆస్ట్రియా ఉద్యోగి విడుదల ఐనదీ లేనిదీ తెలిసికోవాలనీ, విడుదలకానిపక్షంలో అతడు సమ్మతించినా, సమ్మతించకపోయినా సూట్ కేసుల నక్కడనుంచి తప్పించాలనీ బోరోడిన్ తొందరపడుతున్నాడు. పశ్చిమ ఇండియాదీవులకు వెళ్ళే మెక్సికన్ నౌకలో పార్టీసభ్యుడొకడు ఉద్యోగిగా ఉన్నట్లు తెలిసింది. మరికొందరు పార్టీ సభ్యులద్వారా, ఆ నౌకాధిపతి అరాజకవాది అనీ, ఇటువంటి సాహసకృత్యాలంటే సుముఖుడేననీ తెలిసింది. ఆతనిద్వారా రెండుమాసాలలో మరొక వర్తమానం అందినది. 'ఆస్ట్రియా ఉద్యోగి యింకా హెయిటీలోనే ఉన్నాడు; కాని పోలీసు బందోబస్తులో లేడు. సముద్రం ఒడ్డున కుటీరం నిర్మించుకొని యోగిలాగా కాలక్షేపం చేస్తున్నాడు.' ఈ వర్తమానంతో బోరోడిన్‌కి వెఱ్ఱియెత్తినంత పనైంది. అతడు చికాగో వెళ్ళి తనభార్యకా పెట్టెలు ఎందుకు ఇవ్వలేదు? అందులో ఏమున్నదో అతనికి తెలియదు, కాబట్టి అతడా ఆభరణాలను అపహరించి ఉంటాడనుకొనటానికి అవకాశంలేదు. అంతా అయోమయంగా ఉంది. అందుచే మరొకరిని హెయిటీకి పంపి పెట్టెలగతి యేమైందో తెలుసుకోవాలి. కొన్ని నెలల తర్వాత తెలిసింది. విడుదలైనప్పుడు ఆస్ట్రియా ఉద్యోగి ఆ పెట్టెలను అక్కడే విడిచిపెట్టాడట, 'మునివృత్తి నవలంబించబోయే తనకు వానివలన ప్రయోజనం శూన్యం అనే ఉద్దేశ్యంతో.' ఇది వినటంతోనే బోరోడిన్ తల్లక్రిందులైపోయినాడు. ఈలోగా పెద్దపెద్ద రాజకీయపుటెత్తులు వేశాం! అందుకు నాదగ్గిర ఉన్నధనంలో చాలభాగం ఖర్చుచేశాను. క్రొత్త ప్రపంచంలో బాల్యదశలో ఉన్న విప్లవోద్యమానికి నా ధనం వినియోగపడింది! కొంతవరకు బోరోడిన్ శాంతించాడు; ప్రపంచ విప్లవ రాజధాని (మాస్కో)కి వెళ్ళినంతనే తానొక పెద్దనివేదిక సమర్పించే అవకాశం కలదని ఆతని తృప్తి; ఆ నివేదికలో ఒకభాగం యమ్. యన్. రాయ్.

ఆభరణాలు తిరిగి సంపాదించటానికి చేసిన సాహసాలు అంత త్వరగా ఫలించలేదు; ఐనా బోరోడిన్ విశ్వసించిన వ్యక్తి నమ్మకద్రోహి కాదు. ఒకనాడాతడే స్వయంగా ఆభరణాలతో ప్రత్యక్షమైనాడు. అతడు బోరోడిన్‌తో కొన్ని వారాలపాటు ప్రయాణం చేశాడు. బోరోడిన్ భావాలనూ, చర్యలనూ పసికట్టాడు. ఆంతర్యాలను గ్రహించలేనంతటి మందబుద్ధిగాడు. అదీగాక ఆస్ట్రో - జర్మన్ సైన్యంలోని ఉద్యోగుల్లో చాలామంది మిత్రమండలిపట్ల ప్రతీకారవాంఛతో ఉన్నారు. బిస్మార్కు సూచించినట్లు ఆ దేశాల సైన్యాలలో రష్యాపట్లనే అభిమానం ఎక్కువ. కమ్యూనిజమో, గిమ్యూనిజమో, వారికి దానితో ప్రమేయమే లేదు. వారంతా 'జాతీయ బోల్షివిక్కులు', తమ పరాజయానికి అవమానానికి కారణమైన శత్రువులను నిర్మూలించటానికై పిశాచాలతోనైనా

చేతుల్ని కలపటానికి వారు సిద్ధం! ఆ పెట్టెలకోసం మేము పదేపదే చేస్తున్న దర్యాప్తులూ, ఎంత ఖర్చైనా వాటిని తిరిగి పొందటానికి చేసే సాహస ప్రయత్నాలూ, ఆతణ్ణి కలవరపరచినై. అవి మాకెంతో ముఖ్యమైనవనే భావం ఆతనికి కలిగింది. అప్పటికే రష్యా చక్రవర్తుల ఆభరణాలు అమ్మటానికై దొంగతనంగా యితర దేశాలకు జేరవేశారనే వార్త ఐరోపా దేశాల్లో పాక్కిపోయింది. ఈ పరిస్థితుల్లో ఆస్ట్రియా ధనికవర్గీయుడు సాహసికుడైన మిత్రునిపట్ల తన విశ్వాసాన్ని రుజువుచేయ నిశ్చయించాడు. అప్పటికే హెయిటీలోని అమెరికా పోలీసు లతణ్ణి 'వెఱ్ఱివాడి' క్రింద జమకట్టారు. ఆతడు స్థానిక నీగ్రోల ఆదరాభిమానాల్ని సంపాదించి వారిద్వారా తనను నిర్బంధించినచోటనే సూటుకేసు లున్నవనీ, వానికి కాపలా లేదనీ తెలుసుకున్నాడు. పెద్ద పెద్ద జీతాల ననుభవిస్తున్న అమెరికా వాణిజ్యశాఖోద్యోగు లీతుక్కుపెట్టెలను గురించి ఆలోచించనే లేదు. వారి క్రిందనున్న నీగ్రోల సాయంతో ఆస్ట్రియా ఉద్యోగి ఆ పెట్టెలను సంపాదించి వెంటనే అమెరికాకు వెళ్ళేనౌక నెక్కాడు. పిచ్చివాడి చర్యలను అధికారులు పట్టించుకోలేదు.

ఆభరణాలు మాకు చేరకపూర్వమే నేనూ బొరొడినూ రష్యా వెళ్ళటం జరిగింది. నగలు అపహరించాడని బొరొడిన్‌పై మాస్కోలో భయంకరమైన అభియోగం తెచ్చారు. ఆ రోజుల్లో 'విప్లవ న్యాయం' చురుకుగానూ, క్రూరంగానూ ఉండేది. కాని నా సాక్ష్యంపై బొరొడిన్ క్షమింపబడ్డాడు. విప్లవానికి నే చేయగలిగిన రెండవ సేవ బొరొడిన్ ప్రాణరక్షణ! ఇది జరిగిన కొన్ని రోజులకు గ్యూజెన్‌బర్గ్ సతీమణి దగ్గరనుండి వర్తమానం చేరింది. ఆస్ట్రియా యువకుడు పెట్టెలు తెచ్చి యిచ్చాడని. ఆమెను వెంటనే పెట్టెలతోసహా మాస్కో రావలసిందిగా వ్రాశాను. ఆభరణాలు చెక్కు చెదరలేదు. అసంఖ్యాకంగా రాలిన అమాయిక శిరస్సులలో బొరొడిన్ తలకూడా చేరిఉండేది; అమాయకుడైన బొరొడిన్ నెత్తురుకోసం పరితపించిన వ్యక్తికి నామీద కసిగా ఉండేది; అనూహ్యమైన ఆతని ఆనందానికి భంగం కలిగించటమే నా నేరం! కొన్నిసంవత్సరాల కాతడు తగినశిక్ష ననుభవించాడు! స్టాలిన్ జినోవీవుల మధ్య జరిగిన అధికారపోరాటంలో, జినోవీవుపక్షం వహించాడని ఆతణ్ణి కాల్చి చంపివేశారు. నిజాని కాతడు కరడుగట్టిన స్టాలినిస్టు; స్టాలినిస్టులలో నెల్ల క్షుద్రుడు!

## రష్యా వెలుపల మొదటి కమ్యూనిస్టుపార్టీ

బొరొడిన్ రాకను రహస్యంగా ఉంచటం చాలకష్టమైంది; వార్తాపత్రికల్లో మాత్ర మీ విషయాన్ని ప్రచురింపలేదు. విప్లవ ఆభరణాలను తిరిగి సంపాదించటంలో కొందరు పార్టీసభ్యుల సహకారం అవసరం; అందుచే వారికిమాత్రం చెప్పక తప్పలేదు. కాని సోషలిస్టుపార్టీ జనరల్ సెక్రటరీ అతిథిగా బోల్షివిక్ రాయబారి ఈ దేశంలో

ఉన్నాడనేది అసాధారణవిషయం. ఆనోటా ఆనోటా పార్టీసభ్యులందరికీ తెలిసిపోయింది. పార్టీ అత్యవసర సమావేశం జరపాలనీ, రష్యావిప్లవంపట్ల, అంతర్జాతీయ సంబంధాలపట్ల పార్టీవిధానాన్ని రూపొందించాలనీ సభ్యులు కోరారు

ముందుగా కార్యవర్గసమావేశం జరిపి సభ్యులకు బొరొడిన్‌ను పరిచయం చేశాను. అందులో మాట్లాడటానికి నిరాకరించాడు బొరొడిన్. ఆతని తరఫున ఆతనిలోని ఉద్దేశ్యాన్ని నేనే వివరించాను. "మూడవ ఇంటర్ నేషనల్ స్థాపనను గురించి ఇచటి విప్లవకారులకు తెలియజేయటానికీ, ఇచ్చటి పరిస్థితులు ఎంతవరకు విప్లవ పురోగమనానికి అనుకూలంగా ఉన్నవో పరిశీలించటానికీ, బొరొడిన్ అమెరికా వచ్చాడు. రెండవ ఇంటర్ నేషనల్‌లో సోషల్ డెమొక్రాట్ల ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. వారు విప్లవకారులుగా కన్పించేవారేగాని, నిజానికి సంస్కరణవాదులే. అందుచేత మూడవ ఇంటర్ నేషనల్ విప్లవస్వభావాన్ని స్పష్టంగా తెలియజేయటానికై మొదట మార్క్స్, ఏంగెల్సులు ఉపయోగించిన 'కమ్యూనిస్టు' పదమే ఉపయోగింపబడింది. ఇప్పటి సంస్థపేరు 'మూడవ కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్'. దీని ప్రథమ సమావేశం 1918-19 చలికాలం మాస్కోలో జరిగింది; రష్యన్ బోల్షివిక్ పార్టీసభ్యులే గాక, ఐరోపాదేశాల్లోని సోషల్ డెమొక్రాటిక్ పార్టీల వామపక్ష ముఠాల ప్రతినిధులు గూడా హాజరైనారు; వీరిలో జర్మన్ స్పార్టాకిస్టులు చాలా ముఖ్యులు; ప్రపంచ దేశాలన్నిటిలో కమ్యూనిస్టు పార్టీలను స్థాపించాలని ఈ మహాసభ నిర్ణయించింది. కాని యింతవరకు అంటే 1919 మధ్యకాలంవరకూ ఎక్కడా కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడలేదు. మెక్సికో విప్లవసాంప్రదాయాలకు ప్రసిద్ధికెక్కినదేశం; వానికనుకుణంగా మెక్సికో ముందంజ వేయాలి." ఈ నా సూచనను సభ్యులు మహోత్సాహంతో స్వీకరించారు. అనంతరం సోషలిస్టుపార్టీ, ఇతర సానుభూతిసంస్థల సంయుక్త సమావేశం జరిపి, కమ్యూనిస్టుపార్టీ స్థాపనను గురించి చర్చించాలని ప్రతిపాదించాను. హర్షధ్వానాలతో సభ్యులు అంగీకరించారు.

బొరొడిన్ చాల ఆనందించాడు. తాను అమెరికా వచ్చిన ఆశయం ఫలోన్ముఖమైనదనీ ఈ వర్తమానం మాస్కోకు అందజేయాలని అన్నాడు. కాని మెక్సికో ప్రభుత్వసహాయంలేనిదే మాస్కోకు సమాచారంచేరదు. ఆ రోజుల్లో రష్యాకు విదేశాలతో పోస్టల్ సంబంధాలుకూడాలేవు. ఇక ఒక్కటేమార్గం ఉంది. అది స్కాండినేవియా దేశాల్లోవున్న మెక్సికో రాయబార కార్యాలయాలద్వారా పంపటమే. కాని ఈ మార్గాన్ని రిపబ్లిక్ అధ్యక్షుని అనుమతిలేనిదే మా విప్లవ కార్యక్రమానికి ఉపయోగించటానికి వీల్లేదు. రాజకీయ అవకాశవాదమూ, వర్గాభిమానమూ కరంజాను జర్మనీ పక్షపాతి గావించినై; కాని మిత్రమండలి రాజ్యాలపైగల ద్వేషం

వల్ల కరంజా, బోల్షివిక్కులకు సహాయం చేయగలడనేది అనుమానం. జన్మతః అతడు వలసరాజ్యాల ధనికవర్గానికి చెందినవాడు! ఐనా ప్రయత్నిద్దామని సంకల్పించాను.

జర్మనీ ఓడిపోవటంతో కరంజా ఇరుకున పడ్డాడు. బలవంతమైన అమెరికాకు వ్యతిరేకంగా ఆతనితో మైత్రి వహించగల రాజ్యం లేదు. అమెరికాతో వైరం మాని స్నేహం చేయటానికి తరుణం మించిపోయింది. "చేతులు కాలిన తరువాత ఆకుల ప్రయోజనం" శూన్యంగదా! 'ఏం జరుగుతుందో చూద్దాం' అనే ధోరణిలో ఉన్నాడు. అమెరికా సహాయంతో ఓబ్రెగాన్ బహిరంగంగా యుద్ధానికి సిద్ధమాతున్నాడు. ఈ నిస్సహాయ పరిస్థితిలో రష్యా క్రొత్త ప్రభుత్వంతో మైత్రి నాతడు కాంక్షించవచ్చు. రష్యా ఆతనికి చేయగల సహాయం? బొరొడిన్ అనుమతితో బొరొడిన్ కరంజాల సమావేశానికి ఒక విందు నేర్పాటు చేశాను. డాన్ మాన్యూలు, మాస్ట్రోకాసో, విదేశాంగమంత్రి మొదలైన ప్రముఖులను కూడ ఆహ్వానించాను.

ఆ సన్నివేశానికి అనుగుణంగా ప్రవర్తించి బొరొడిన్ కరంజా మున్నగు ప్రముఖుల అభిమానాన్ని చూరగొనగలిగాడు. అంతటి సంస్కారంగల వ్యక్తి తాను బోల్షివిక్కునని చెప్పుకొనటం వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ విందులో బొరొడిన్ ప్రకటించాడు: "సామ్రాజ్యవాదంపై సాగిస్తున్న పోరాటంలో లాటిన్ అమెరికా ప్రజలపట్ల రష్యా క్రొత్త ప్రభుత్వం సానుభూతి వహిస్తుంది. తన శక్తివంచన లేకుండా వారికి సహాయం చేయాలనే రష్యా ఆరాటం. అందుకై కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లాటిన్ అమెరికా శాఖను మెక్సికోలో స్థాపించటం అవసరం. ఈ కేంద్రానికి డైరెక్టరుగా యం. యన్. రాయ్, అమెరికా సామ్రాజ్యవాదానికి లాటిన్ అమెరికా ప్రతిఘటనను సంఘటిత పరుస్తాడు. ఐతే ఈ కేంద్రస్థాపనకు మెక్సికో అధ్యక్షుని అనుమతి అవసరం."

లాటిన్ అమెరికా కూటమి అనే తన స్వప్నం మరొక విధంగా ఫలించబోతోందని కరంజా ఆశించాడు. ఈ అవకాశాన్ని జారవిడువరాదను అనే ఉద్దేశ్యంతో రష్యా క్రొత్త ప్రభుత్వాధినేతకు తన అభివందనలు తెలియజేయవలసిందిగా కరంజా బొరొడిన్‌ను కోరాడు. విదేశాంగమంత్రి, శాసనసభాధ్యక్షుల సమక్షంలో మెక్సికో అధ్యక్షుడా విధంగా కోరటం, రష్యా క్రొత్త ప్రభుత్వాన్ని అధికారరీత్యా ఆమోదించినట్లేనని భావించవచ్చు. అదే ఉద్దేశ్యాన్ని విదేశాంగమంత్రి, శాసనసభాధ్యక్షుడు మరొక సమావేశంలో సూచించారు.

విదేశాంగనీతిలో నిది తాను సాధించిన విజయమనీ దీనివలన మాస్కోలో తన గౌరవప్రతిష్ఠలు ఇనుమడింప గలవనీ బొరొడిన్ ఆశించాడు. విందు సందర్భంలో అధ్యక్షుడు రష్యాపట్ల చేసిన సద్భావప్రకటన విదేశాంగమంత్రికి సూచనగా పని

చేసింది. హాలెండులోని మెక్సికో రాయబార కార్యాలయంద్వారా కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ పాశ్చాత్యశాఖతో సంప్రదించే సౌకర్యాన్ని బొరొడిన్‌కు కలిగించాడు. మెక్సికో ప్రభుత్వసహకారంతోనే స్కాండినేవియాద్వారా మాస్కోతో నేరుగా సంప్రదించే సౌకర్యంకూడా లభించింది. ఆ రోజుల్లో ఒక స్కాండినేవియా దేశానికి మాత్రమే రష్యా ప్రభుత్వంతో రాజకీయ సంబంధా లుండేవి. బొరొడిన్ తన విజయాన్ని గురించి మాస్కోకు తెలియపరిచాడు. కాని తన ప్రథమ కర్తవ్యం నెరవేరలేదని, పోయిన వస్తువును సంపాదించటానికై తగుప్రయత్నాలు జరుగుచున్నవనీ, ఇంతలో అత్యవసరమైన ధనం స్థానికమైన ఆధారాలనుండి లభ్యమైందనీ వివరంగా మాస్కోకు నివేదించాడు.

ఈ నివేదికలు తయారుచేసే సందర్భంలో, తిరిగి యథాప్రకారం ప్రతివిషయం గోప్యంగా ఉంచేవాడు; ఆ నివేదికలు నా చేతుల మీదుగా వెళ్ళవలసినవే. కాని అందలి విషయాలు నాకు తెలియనిచ్చేవాడు కాడు; వానిని గురించి నాతో చర్చించేవాడు గాదు; కాని చాల హుషారుగా కన్పించేవాడు. తన విజయపరంపరలను గురించి మాస్కోలోని తన మిత్రు లెంతగానో సంబరపడతారు అంటూ ఉండేవాడు. కాగా "లెనిన్ మెక్సికోలో నన్ను యం. యన్. రాయ్‌ని గురించి పరిశీలించవలసినదిగా కారఖానును పురమాయిస్తాడు; లేదా భారతీయ మార్క్సిస్టును మాస్కోకు ఆహ్వానించ వలసిదిగా బలశనోవాను ఆజ్ఞాపిస్తాడు. ఇది తథ్యం" అని మాత్రం చెప్పాడు.

'నీకు సమ్మతమేనా?' అని అడిగాడు బొరొడిన్. చాల ఆకర్షణీయమే. కాని పుండుకాటుకు చెప్పుదెబ్బ అన్నట్లు నా అభిప్రాయాన్ని గురించి బొరొడిన్‌ను సందేహంలో ముంచెత్తే అవకాశం నాకు లభించింది. బొరొడిన్‌తో అన్నాను: "ప్రస్తుతం నేను మాస్కోకు వెళ్ళటంవల్ల ప్రయోజనం శూన్యం. అక్కడ నే చేయగలిగింది లేదు; మెక్సికోలోనే ఉండి విప్లవానికి ఎక్కువ సేవ చేయగల అవకాశం ఉంది; విప్లవాన్ని ఇక్కడ ప్రారంభించాం; అది కొనసాగేటట్లు చేయాలి. అందుకు కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ లాటిన్ అమెరికా శాఖ చాల ఉపయోగపడుతుంది; అమెరికా సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటించగల మహత్తర ఆయుధంగా దాన్ని రూపొందించవచ్చు; ఇటువంటి కార్యక్రమానికి సహకారం ఇచ్చేటట్లు కరంజాను ప్రోత్సహించటం జరిగింది. ఇంతవరకు వచ్చిన తరువాత ఈ కార్యక్రమాన్ని విడిచిపెట్టటం యుక్తంకాదు; ఉదారబుద్ధితో ఆతిథ్యాన్నిచ్చిన దేశానికి విశ్వాసపాత్రుడుగా ఉండటమే నా ధర్మం. ఐరోపాలో యుద్ధం పూర్తయింది. మన్రో సిద్ధాంతం ఆసరాగా నవప్రపంచ (అమెరికా ఖండ) ఆధిపత్యాన్ని సాధించాలనే తన ప్రయత్నాలను ప్రతిఘటించిన మెక్సికో అంతు తేల్చటానికి సంయుక్త రాష్ట్రాలు కాలు దువ్వు

తున్నది. కరంజా కేర్పడిన ఈ విషమపరిస్థితికి నేనూ కొంతవరకు కారణమే. కొద్ది రోజుల్లో తన దేశస్వాతంత్ర్యంకోసం, కేవలం తన ప్రాణరక్షణకోసం, కరంజా పోరాడవలసిన అవసర మేర్పడుతునది. ఆ పోరాటంలో కరంజాకు వెన్నండగా నిలబడవలసిన బాధ్యత నాకుంది. ఇంతవరకు నేనే స్వయంగా వ్యవహరించేవాణ్ణి. ఇకముందు కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ సూచనల ప్రకారం వ్యవహరిస్తాను."

ఐతే సోషలిస్టు పార్టీనే కమ్యూనిస్టుపార్టీగా మార్చటానికేమీ అవకాశాలు కన్పించలేదు. అందుకు ప్రముఖసభ్యులే ప్రతిఘటిస్తారు. ఉదాహరణకు కాలెస్ విషయమే తీసుకోవచ్చు. 'కమ్యూనిస్టు' అని చెప్పుకొంటే కరంజా తరువాత మెక్సికో అధ్యక్షుడయ్యే అవకాశాలు పోతై అని ఆతని భయం. అందుకాత డేమాత్రం సమ్మతించడు. కమ్యూనిస్టుపార్టీని కరంజా బహిరంగంగా బలపరిస్తే ఈ భయాలన్నీ అంతర్ధానమైపోతై. కాని అలా స్పష్టం చేయుమని కరంజాను కోరటం కేవలం ఆత్మహత్యా సదృశ్యమౌతుంది. జర్మనీపట్ల అభిమానంగల మెక్సికోప్రభుత్వాన్ని ఏదో రకంగా సహించారు అమెరికన్లు. వారికి సోవియట్ రష్యాపట్ల సానుభూతిగల ప్రభుత్వమంటే బెదురుగొడ్డుకు ఎఱ్ఱజెండా చూపటమే. ఐరోపాలో యుద్ధం సమాప్తమైంది కాబట్టి ఏమాత్రం అవకాశం లభించినా మెక్సికోలో జోక్యం కలిగించుకోటానికి సిద్ధంగాఉంది అమెరికా. కాబట్టి సోషలిస్టుపార్టీకి లభించినంత మాత్రమైనా ప్రభుత్వ ఆదరాభిమానాలు కమ్యూనిస్టుపార్టీకి లభింపవు. అదీగాక కమ్యూనిస్టుపార్టీ స్థాపన మిషతో సోషలిస్టుల్లో చీలికలు రావటంకూడా మంచిదికాదు. ప్రస్తుత దేశపరిస్థితుల్లో కమ్యూనిస్టులైన సోషలిస్టులకంటె విప్లవాత్మక విధానాన్ని అనుసరింపగలవారు మరెవ్వరూ లేరు. అందుచేత విచ్ఛిన్నం గాకుండా సమైక్యతతో తన విధానాలను కార్యరూపంలో సాధించేటట్టు సోషలిస్టుపార్టీకి బలాన్ని చేకూర్చగలిగితే, రష్యా వెలుపల ప్రథమకమ్యూనిస్టుపార్టీ స్థాపన సార్థకమౌతుంది. మెక్సికో ప్రజాస్వామ్య ప్రభుత్వం బహిరంగంగా సహాయంచేసినా, చేయకపోయినా, సోషలిస్టుపార్టీ ఆధ్వర్యాన స్థాపింపబడిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లాటిన్ అమెరికాశాఖ, మహత్తర కార్యాన్ని సాధింపగలుగుతుంది. క్రొత్తప్రపంచంలో జాతీయ స్వాతంత్ర్యాన్నీ, సాంఘిక న్యాయాన్నీ రక్షించేందుకు స్పానిష్‌భాషాప్రజలను సంఘటితపరుస్తుంది. అదే ప్రపంచ కార్మిక విప్లవ విజయానికి బ్రహ్మాస్త్రమౌతుంది. ప్రపంచవిప్లవానికి ప్రబలశత్రువు అమెరికా సామ్రాజ్యవాదమే. కాబట్టి ప్రాత ప్రపంచంలోకూడా కమ్యూనిజం విజయవంతం కావటానికి అమెరికా సామ్రాజ్యవాదాన్ని కూకటివ్రేళ్ళతో పెకిలించి వేయాలి.

ఈ విషయాలను కొన్నిరోజులపాటు నేనూ, బొరొడిన్ చర్చించాము. బొరొడిన్ సంభాషణలో చతురుడు. వాదనలో గూడా మంచి సమర్థుడు. ఐనా, నా వాదన

లోని వివేచనకు ఆశ్చర్యపోతూ నన్నభినందించేవాడు. ఇన్నాళ్ళూ తన రహస్య ప్రవర్తనకు నొచ్చుకున్నాడు. నన్ను పూర్తిగా విశ్వసించవచ్చుననే అభిప్రాయానికి వచ్చాడు. తన నివేదికకు మాస్కోనుండి వచ్చిన సమాధానం కూడా అంతవరకు నాకు తెలియనీయలేదు. అతని మాటల ధోరణిని బట్టి మాస్కోకు రమ్మని నాకు ఆహ్వానం వచ్చినట్లు పసికట్టాను. ఆ విషయం తేల్చుకుందామనే మెక్సికోలోనే ఉండటానికి నిర్ణయించి నట్లాతనితో చెప్పాను. ఇంతకంటె ఉద్రేకపూరితమైన కార్యాచరణకు మాస్కోలో అవకాశం ఉంటుందనే ఆశ చూపిస్తాడని నా భావం. మేము బయలుదేరేలోపల మెక్సికోలో ప్రారంభించిన కార్యక్రమం పూర్తి చేయటమే యుక్తమని సూచించాడు. అందులో స్వార్థం లేకపోలేదు. అతడు అమెరికాకు వచ్చిన పని విఫలమైంది; అందుకు బదులుగా రాజకీయ విజయాలు సాధించినట్లు తన పార్టీ నాయకులకు నివేదించి వారి అభిమానాన్ని పొందవచ్చునని అతని ఆశ! ఈ సమాధానానికి వచ్చిన అనంతరం కమ్యూనిస్టుపార్టీ స్థాపనపై దృష్టిని మరల్చాం. విదేశంలో ఉంటున్న బోల్షివిక్కుకు ఇదికూడా ఒక ఘనవిజయమే. అతని కిరీటానికి అది కలికితురాయి ఔతుంది.

ముందుగా డాన్ మాన్యూలుతోనూ, విదేశాంగమంత్రితోనూ సంప్రతించాను; తమ విప్లవ చర్యద్వారా, మెక్సికో, అమెరికా ప్రభుత్వాలమధ్య గల విదేశాంగ సంబంధాలకు భంగం కలిగించనంతవరకు కమ్యూనిస్టుపార్టీని తమప్రభుత్వం సహిస్తుందని హామీ ఇచ్చారు; మేము ఉద్దేశిస్తున్న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, లాటిన్ అమెరికా శాఖ మాత్రం 'లాటిన్ అమెరికా కూటమి'ని బలపరచి, దానిద్వారా వ్యవహరించాలని కూడా సూచించారు. తన సానుభూతిపరులను వివేచనతో వ్యవహరించ వలసిన దిగా రష్యా ఆదేశించినచో రష్యా మెక్సికోలమధ్య సహకారానికి అవకాశం ఉంది. క్రమంగా ఉభయదేశాలమధ్య సాధారణ విదేశాంగ సంబంధాలు నెలకొనవచ్చును, అని వారి సూచనలవలన స్పష్టమైంది. మరొక విశేషం. నాడు సోషలిస్టుపార్టీలో రెండురకాల వ్యక్తులుండేవారు. కాలెస్ వంటి అవకాశవాదులు, తమ స్వార్థంకోసం వ్యక్తిగత శ్రేయస్సులకు, ఆశయాలకు సాధించే నిమిత్తమే వారు సోషలిజాన్ని ఆరాధిస్తారు. వారి సోషలిజం వ్యక్తిగత శ్రేయస్సుకమించి పైకిపోదు. ఇక రెండవ రకంవారు, నికార్సైన కార్మికవర్గీయులు. కరుడుగట్టిన అరాజక సిండికలిస్టులు. సోషలిస్టుపార్టీ:విచ్ఛిన్నం తప్పదనీ అది వెంటనే జరిగితీరాలనీ వీరి పట్టుదల; కమ్యూనిస్టు పార్టీ కేవలం ప్రచారకముఠాగాకాక దేశరాజకీయాలలో శక్తివంతమైన పార్టీగా రూపొందించటమే మా ఆశయం. ఐతే సాంఘికన్యాయం అనే విలువను విశ్వసించి బలపరచే వారందరి సానుభూతీ, సహకారమూ పొందటానికి ప్రయత్నించాలి. వీరు కమ్యూనిస్టుల హింసాయుత విప్లవ సిద్ధాంతాన్ని అంగీకరింపకపోవచ్చు. ఈ వర్గానికి

నాయకుడు డాన్ మాన్యూల్. వీరి సానుభూతిని కోల్పోవటం నాకేమాత్రం సమ్మతం కాదు. కుట్రలూ, అంతర్యుద్ధమూ కార్యక్రమంగా పనిచేసే పార్టీలో చేరనంతమాత్రంచేత వీరి స్వభావాన్ని పెటీబూర్జువా అవకాశవాదమనీ, విప్లవ విద్రోహమనీ భావించటం పొరపాటు. ఈ సందిగ్ధ పరిస్థితినుండి డాన్‌మాన్యూలే నన్ను రక్షించాడు. సోషలిస్టుపార్టీ ప్రముఖులతో సంప్రతించి, డాన్ వెనూస్టియానో అనుమతితో సోషలిస్టుపార్టీ కమ్యూనిస్టుపార్టీగా రూపొందటానికీ, క్రొత్తగా స్థాపింపబడిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరటానికీ, తగిన ప్రయత్నం చేస్తానని హామీ ఇచ్చాడు! ఐతే క్రొత్తపార్టీ మాటల్లో నిప్పులుగ్రక్కినా, కొంతకాలం ప్రాతవిధానాలనే అనుసరించాల్సి ఉంటుంది.

సోషలిస్టుపార్టీ అత్యవసర సమావేశం ఏర్పాటు చేయబడింది. మెక్సికోలో గడిపిన ఈ రెండున్నర సంవత్సరాలు తెరవెనుకనే ఉన్నానుగాని వెలుగులోకిరాలేదు. ఇప్పుడు అందరి కోరికను మన్నించి సమావేశ అధ్యక్షపదవికి అంగీకరించాను. అధ్యక్షుడుగా చాలా క్లిష్టమైన బాధ్యతను నిర్వహించాల్సివుంది. ఒకవైపున వామపక్షంలోని 'చిచ్చుబుడ్డులు' ప్రేలకుండా చూడాలి. మరొకవైపున పార్టీనిర్ణయాలు ఎంత విప్లవాత్మకంగా ధ్వనించినా పూర్వవిధానలకు భంగం ఉండదనీ, విప్లవాత్మక సోషలిస్టు సహాయాత్రికుల సహకారం మామూలుగానే ఉంటుందనీ ప్రభుత్వానికి నచ్చచెప్పాలి.

కార్యక్రమంలో మొదటి అంశం: కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రథమ ప్రపంచ మహాసభ జారీచేసిన మానిఫెస్టోను చర్చించటం. ఇది మార్క్సు, ఏంగెల్సులు తమ మొదటి మానిఫెస్టోలో ప్రపంచ కార్మికుల నుద్దేశించి చేసిన శంఖారావాన్ని గుర్తుకు తెచ్చింది. 'సాంఘిక విప్లవంకొరకు పోరాడే మార్క్సిస్టు ఎవ్వడూ ఆ మానిఫెస్టోను కాదనలేడు,' అనే నా విశ్వాసం. అందుచేతనే విప్లవ కార్యక్రమంతో కృషిచేసే మెక్సికో సోషలిస్టుపార్టీ 'ఈ క్రొత్తకమ్యూనిస్టు మానిఫెస్టోను' తప్పనిసరిగా అంగీకరించాలి. ఆవిధంగా అంగీకరించినపుడు పార్టీ పేరు మార్చాలనే నిర్ణయంలో వైపరీత్యంలేదు. ఈ రెండు నిర్ణయాలూ ఏకగ్రీవంగా ఆమోదించబడినై. జరిగిన మార్పు పేరులోనేగాని, విధానాలలో కాదు; నిర్జీవమైన సోషలిస్టుపార్టీయొక్క విప్లవాత్మక ప్రజాస్వామ్య కార్యక్రమాన్నే కమ్యూనిస్టుపార్టీ అనుసరిస్తుంది.

అవకాశవాదులూ, పెటీబూర్జువా సంస్కరణవాదులూ ప్రతిఘటిస్తారని భయపడ్డాం. తెలివిగా వ్యవహరించి వారి వ్యతిరేకతకు అవకాశంలేకుండా చేయగలిగాం. మంత్రిత్వబాధ్యతా నిర్వహణ మిషపై కాలెస్‌ను రాజధానినుండి దూరంగా పంపే ఏర్పాటు జరిగింది. సభ అంతా కార్మికవర్గ ఉత్సాహంతో నిండిపోయింది. ఆ వాతావరణంలో సభకు 'మర్యాదస్థులు' హాజరు కాలేదనే విషయాన్నెవరూ

గుర్తింపలేదు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంనుండి వచ్చిన సందేశం సభలో చదవబడింది. ఆ సందేశం బోరొడినూ, నేనూ తయారుచేసిందే! అందులో పరాధీన ప్రజానీకం సామ్రాజ్యవాదంమీద సాగిస్తున్న పోరాటానికి కమ్యూనిజం చేసే సహాయాన్ని గురించి వివరించబడింది. ఇందులోని అంశాలే ఒక సంవత్సరం తరువాత కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచమహాసభకు జాతీయ, వలసరాజ్య సమస్యలపై సమర్పించిన నివేదికలో విపులీకరించాను. వీనిని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆమోదించింది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా పని చేయటానికి మెక్సికో కమ్యూనిస్టుపార్టీ నిర్ణయించింది; అందుచే మాస్కోలో సమావేశం కాబోతున్న రెండవ ప్రపంచ మహాసభకు ప్రతినిధివర్గాన్ని పంపవలసిన అవసరం కలిగింది. ప్రతినిధివర్గసభ్యులను మాత్రం ప్రకటించటానికి వీల్లేదు. ఆ రోజుల్లో బహిరంగంగా రష్యాకు ప్రయాణంచేసే అవకాశం లేదు. బోరొడిన్ పట్టుదలవల్ల పార్టీ కార్యవర్గ సభ్యులు ఆ ప్రతినిధి వర్గనాయకుడుగా నన్ను నిర్ణయించారు. అందుచేత పార్టీ జనరల్ కార్యదర్శిగా ఉండటానికి వీల్లేదు. కాబట్టి తాత్కాలిక కార్యదర్శి నొకనిని ఎన్నుకున్నారు. కాని దేశం విడిచి వెళ్ళేవరకూ కార్యదర్శిగా వ్యవహారం జరపటానికి సమ్మతించాను.

మహాసభ జరిగిన తరువాత కొన్ని రోజులవరకు బోరొడిన్ తన గదిలో రహస్యంగా ఏదో గంటల తరబడి టైపు చేశాడు. దాన్ని గురించి నేనాందోళన చెందటం సహజం. చివరకు చెప్పాడు. "మెక్సికోలో నీవు సృష్టించిన చరిత్రను గురించే వ్రాస్తున్నాను. మాస్కోకు తన నివేదిక పంపిన రోజున నన్ను 'టీ'కి ఆహ్వానించాడు. కాని ఆ సన్నివేశానికి తగినంత హుషారుగా లేడు. కారణం అడిగాను. మహాసభ జరగటానికి వారం రోజుల పూర్వమే మాస్కోనుండి ఆదేశాలు వచ్చినై. బోరొడిన్ వెంటనే బయలుదేరి వెళ్ళాలి. అతని వెనకనే, నేను ఐరోపా బయలుదేరాలి. ఈ విషయాన్ని ఇన్ని రోజులపాటు రహస్యంగా ఉంచటానికి కారణం ఊహించలేక పోయాను. బోరొడిన్‌తో అన్నాను.

"పైన చెప్పిన కారణాలవల్ల నేనిప్పుడు రావటానికి వీల్లేదు" అన్నాడు బోరొడిన్ నవ్వుతూ

"బోల్షివిక్కులు వాదించరు. ఆజ్ఞలు శిరసావహిస్తారు. అదే వారి క్రమశిక్షణ" అంటూ గంభీరంగా హెచ్చరించాడు.

"నీ మాతృదేశాన్ని విస్మరించబోకు; మాస్కో ఆ దారిలోనే ఉంది" నా మనోనేత్రం ముందు క్రొత్త వెలుగు ప్రత్యక్షమైంది. జీవితంలో క్రొత్త అధ్యాయాన్ని గురించినదే ఆ వెలుగు!

# రష్యా ప్రయాణం

## మెక్సికో యాత్ర పరిసమాప్తి

మూడు సంవత్సరాలకు పైగా, చైనాను విడిచి పెట్టినప్పటినుండి, ఇండియాకూ నాకూ సంబంధం లేనట్లే. సంయుక్త రాష్ట్రాల్లో ఉన్న కొద్దిరోజులు కూడా భారతీయులతోనే గడిపాను. ఏ ఆశయంతో ఇండియానుండి బయలుదేరానో ఆ ఆశయాన్ని గురించే కలలు గన్నాను. కాని పైన వివరించినట్లుగా ఆ సంబంధాలు ఫలవంతం కాకపోగా బాధాకరంగా ఉండేవి. మెక్సికోకు వచ్చినప్పటినుండీ, ఇండియాతో సంబంధమే లేకుండా పోయింది. రెండు సంవత్సరాలు వార్తలే రాలేదు. ఇండియాలో ఏం జరుగుతున్నదో తెలిసేది కాదు. కాని అందుకు నేనెక్కువగా బాధ పడలేదు. కారణం నాటి నా దృక్పథం చాల సంకుచితమైన పరిజ్ఞానమే. ఏమైనా, గతాన్ని గురించిగానీ, దేశభక్తుడుగా నా ధర్మాన్ని నెరవేర్చలేకపోయినా నని గానీ విచారించటం నిష్ప్రయోజనం. ప్రస్తుతం వినూత్న విప్లవ ఆదర్శంతో విశాలమైన రంగస్థలాలమీదికి వచ్చాను. అచట చాలా సంతృప్తికరమైన అనుభవం లభించింది.

1919 వేసంగిలో నా జన్మభూమినుండి బైటపడినట్లుగానే, మెక్సికోనుండి నిర్గమించాల్సిన సమయం వచ్చిందని నిర్ణయించాను. ఇది కేవలం క్రొత్త సాహసాల ఆకర్షణతో, ఆటకాయితనంగా చేసిన నిర్ణయం కాదు. సాహసాలకు మెక్సికోలో కొదవలేదు. అచటి పరిస్థితులు లోక క్రొత్త అంతర్యుద్ధానికి దారితీస్తున్నై. కరంజా ప్రభుత్వానికి శత్రువు లెక్కువైనారు. కరంజాకు ఏమాత్రం సహాయం చేయగల్గినా, మెక్సికోలోనే ఉండేవాణ్ణి. నేను చేయగలిగింది ఎక్కడున్నా చేయగలను. ఈ రెండు సంవత్సరాల కృషి ఫలితంగా ప్రజాస్వామ్య మధ్యవర్గమూ, పారిశ్రామిక కార్మికవర్గమూ, దేశరాజకీయాలపట్ల శ్రద్ధవహించేటట్లు చేయగలిగాను. అంటే ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గానీ మెక్సికోలో విదేశజోక్యాన్ని ప్రతిఘటించటానికి తగినట్లుగా ప్రజాభిప్రాయాన్ని సమాయత్తపరచగలిగాను. కరంజా ప్రభుత్వాన్ని వ్యతిరేకిస్తున్న ఓబ్రెగానుకు అమెరికా స్వార్థపరుల పోషణ సహకారం లభిస్తున్నదని ప్రజ లందరికీ తెలుసు. అందుచే ఫ్రాన్సిస్కో మాడెరో ప్రభుత్వం (1911) తరువాత, ఏ ఇతర ప్రభుత్వానికీ లభించని ప్రజాదరణ కరంజాకు లభిస్తుంది. విచక్షణాజ్ఞానం గల ప్రతిదేశభక్తుడు కరంజానే బలపరుస్తాడు. దేశంలో ఈ పరిణామాలు జరగటానికి సోషలిస్టుపార్టీ అవలంబించిన విధానాలే కారణం. ఐనా ప్రజాభిప్రాయంలో కరంజాపట్ల అభిమానంకంటె, అమెరికా పట్ల విరోధమే బలీయం; అదీగాక అధికారంకోసం జరిగే సాయుధ సంఘర్షణలో ప్రజాభిప్రాయం తాత్కా-

లికంగానైనా నిష్ప్రయోజనం. అందుచేతనే ఓబ్రెగాన్ కరంజా నోడించి అధికారాన్ని కైవశం చేసికోగలడు. కాని అమెరికా సహాయసంపత్తి ఎంతగా లభించినా అతని ప్రభుత్వం మూడునాళ్ళ ముచ్చటైంది. ఓబ్రెగాను నోడించి సోషలిస్టు రివల్యూషనరీపార్టీ నాయకుడుగా కాలెస్ మెక్సికో అధ్యక్షుడైనాడు. పేరులో మార్పేగాని, సోషలిస్టు రివల్యూషనరీపార్టీ సోషలిస్టు కమ్యూనిస్టుపార్టీల వామపక్ష ప్రజాస్వామ్య కార్యక్రమాన్నే అనుసరించింది. ఓబ్రెగాన్ సైనిక నియంతృత్వంతో బాటు చిరకాలంగా దేశాన్ని పీడిస్తున్న అరాజకాన్ని తుదముట్టించి చట్టబద్ధమైన ప్రభుత్వాన్ని కాలెస్ నెలకొల్పాడు. ప్రజల నీ పరిణామాలకు సమాయత్త పరచిన తరువాత మెక్సికోలో స్వయంగా చేయగలిగింది లేదు. బొరొడిన్ సలహా ప్రకారం రష్యా వెళ్ళితేనే అంతర్జాతీయంగా కరంజా ప్రభుత్వ ప్రతిష్టను ఇనుమడింప చేయడానికి అవకాశం ఉంది. వ్యక్తిగతంగా నాకు గూడా విప్లవ కార్యాచరణలో క్రొత్త అనుభవాలు లభిస్తై. తిరిగి ఇండియాకు ప్రయాణం కట్టటమనే భావంకూడా నాకు ఉత్సాహాన్ని కలిగించింది. ఇప్పుడు ఆయుధాలతో నేకాక ఆయుధాలను సార్థకం చేయగల విప్లవ కార్యక్రమంతో ఇండియాలో ప్రవేశిస్తాను. త్రోవలో శ్రామిక విప్లవ జన్మస్థలమైన రష్యాను సందర్శించి ఆ దేశంలో రాబోతున్న అంతర్యుద్ధంలో పాల్గొనటంకూడా ఒక మహదవకాశమే.

“బోల్షివిక్కులు వాదించరు. క్రమశిక్షణకు విధేయులై ఉంటారు” అన్న బొరొడిన్ మాటలు నా మనస్సులో కొంత అలజడికి కారణమైనై. ఇది గమనించి, అవి కేవలం పరిహాసానికి అన్న మాటలే అనే భావాన్ని కలిగించటానికి ప్రయత్నించాడు బొరొడిన్. కాని తన మాటలను స్పష్టంగా వ్యాఖ్యానించమని సూటిగా అడగడంతో బోల్షివిక్ అసలు రంగు బైటపడింది. బోల్షివిక్కుల విశ్వాసాలను సమర్థించాడు బొరొడిన్. పార్టీ అధికారం నిరంకుశం. దాన్ని సవాలుచేసే తాహతు సభ్యులకు లేదు. నిరుత్తరంగా పార్టీ క్రమశిక్షణకు సభ్యులు తలనొగ్గవలసిందే. అదే విప్లవధర్మం. బొరొడిన్ సమర్థించిన ఈ బోల్షివిక్కు విప్లవ విశ్వాసంలో మతోద్రేకం ప్రతిఫలించింది. దీనికీ (బోల్షివిజానికి పునాదియైన) పదార్థవాద తత్వానికీ ఏవిధంగా పొత్తు కుదురుతుందో అర్థం కాలేదు. ఔదార్యం ఉట్టిపడేటట్లు మందహాసం చేశాడు నాకు బోల్షివిజంలో ‘ఓనమాలు’ దిద్దిన గురువుగారు! ఈ క్రొత్త విద్యార్థికి విప్లవ విశ్వాసంలోని మర్మాలనూ దాని వెనుకనున్న తాత్విక క్లిష్టతల పద్మవ్యూహాన్ని భేదించే ఉపాయాన్ని బోధించటానికి సమ్మతించాడు. ఇది నా బ్రాహ్మణ వారసత్వ సాంప్రదాయాలకూ, నా మెదడు పొరల్లో ఎక్కడో ఇంకా అణగి కరడుగట్టిన, సాంస్కృతిక జాతీయవాదానికీ పెద్ద సవాలు! కాని విప్లవవాదిని కావటంవల్ల గురుశుశ్రూష చేయటానికి సమ్మతించాను. ఐనా నేనొక మానవుణ్ణి. నాలో హేతుతత్వం ఉంది. స్వతంత్రంగా ఆలోచించాలనే కాంక్ష ఉంది. అదీగాక జన్మతః నేనొక

తిరుగుబాటుదారుణ్ణి! అందుచేత పదార్థవాదముగానీ, నాస్తికత్వముగాని, ఒక క్రొత్త విశ్వాసాన్ని గ్రుడ్డిగా అంగీకరించలేను. 'సూదిబెజ్జంగూడా ఒంటె దూరటం' బైబిల్ కథలో సాధ్యమైందిగాని క్రొత్త విశ్వాసాన్ని అంగీకరించటం నా విషయంలో మాత్రం సాధ్యంకాదు! ఇదే మార్క్సిజానికి చివరి ప్రతిఘటన!

జారు ఆభరణాల పరిశోధన నిదానంగా సాగుతోంది. మెక్సికోలో కమ్యూనిస్టుపార్టీ స్థాపన సమాచారం అమెరికాలో పెద్ద సంచలనాన్ని కలిగించక పోవటం మాకు ఆశ్చర్య కారణమైంది. ఏవో కొన్ని చవకబారు పత్రికలు మాత్రమే పెద్ద అక్షరాలతో ప్రచురించినై. మెక్సికో ప్రజాభిప్రాయం అనుకూలంగానే ఉంది. ఓబ్రెగానిస్టు పత్రికలు గూడా దీన్ని అవకాశంగా గ్రహించి 'బోల్షివిక్కు ప్రమాద' మంటూ ప్రచారం చేయలేదు. మెక్సికోలో ప్రతి విప్లవానికీ 'భూ సంస్కరణలే' నినాదం. కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలో గూడా ప్రథమస్థానం భూ సంస్కరణలదే. పార్టీ పత్రికను ప్రకటించటం, అప్పుడప్పుడు బహిరంగసభలు జరపటంతప్ప నాకు వేరే పని లేదు. అందుచే కమ్యూనిస్టు సిద్ధాంతం కార్యక్రమాలను గురించి బొరొడిన్‌తో చర్చించటానికి మంచి అవకాశం దొరికింది. ఈ చర్చల్లో మరికొందరు మిత్రులుకూడా పాల్గొనేవారు. భోజనానంతరం ప్రారంభమై రాత్రి ప్రొద్దుపోయేంత వరకు చర్చలు సాగేవి. ఇవి నా జీవితంలో చిరస్మరణీయమైన రోజులు. నా భావి మానసిక వికాసానికి పునాదులు వేసినై.

అప్పుడప్పుడు మా చర్చలను ఆపి మధ్యఆసియా పరిస్థితులనుగురించి ఊహిస్తూ ఉండేవాళ్ళం. మధ్యఆసియాను గురించి తన అజ్ఞానాన్ని వెల్లడించాడు బొరొడిన్. యూరల్ పర్వతాలకూ, యూరల్ నదికీ తూర్పున ఏమున్నదీ తన కేమాత్రం తెలియ దనేవాడు. విప్లవానంతరం జారుల మధ్యఆసియా సామ్రాజ్యానికీ, మాతృదేశ రష్యాకు సంబంధాలు తెగిపోయినై. కాని ఆ ప్రాంతాలకు గూడా విప్లవం విస్తరిల్లాలి. ఐనచో విప్లవం ఇండియా సరిహద్దులను సమీపిస్తుంది. కాబట్టి 1915 లో ఇండియా నుండి, ఏ కార్యభారంతో బయలుదేరానో దాన్ని కొనసాగించటానికి ఇప్పుడొక నూతన దృక్పథం ప్రత్యక్షం కాసాగింది. 1915 లో బయలుదేరినప్పుడు ఈశాన్య సరిహద్దుల గుండా ఇండియాలో ప్రవేశించాలనే సంకల్పం! కాని ఇప్పుడు వాయువ్య సరిహద్దుల గుండా ప్రవేశిస్తాను. ఈ శుభవార్తను భారతీయ మిత్రులకు అందజేయాలనే ఆరాటం ఎక్కువైంది. కాని అందుకు సాధనం కన్పించలేదు. ఐనా వారిలో ఇంకెందరు సజీవులుగా నున్నారు? ఏం చేస్తున్నారు? అనే విషాదకరమైన ప్రశ్నలుదయించినై.

కొంతకాలం వరకూ నా దుఃఖాన్ని దిగమ్రింగినా ఊహలను అదుపులో ఉంచవలసివచ్చింది. ఈలోగా మరికొన్ని సమస్యల్ని పరిష్కరించాలి. ప్రస్తుతం మెక్సికోపట్ల నా ధర్మాన్ని విస్మరించకూడదు. అంతర్జాతీయ సంబంధాలను పటిష్టం

చేసి అమెరికా విరోధాన్ని ప్రతిఘటింపగల సామర్థ్యం మెక్సికోకు చేకూర్చాలి. అది మొదటి సమస్య. ఇక రెండవది. అట్లాంటిక్ మహాసముద్రాన్ని దాటి ఐరోపా చేరటం; ఆ రోజుల్లో మెక్సికో ఐరోపాలమధ్య నేరుగా ప్రయాణంచేసే ప్రయాణీకుల నౌకలు లేవు. సాధారణంగా న్యూయార్కు వెళ్ళి అక్కడనుండి ప్రయాణం చేయటం అలవాటు. నాకా మార్గం అవకాశంలేదు. ఈ గండం గడచిన తరువాత మిత్రమండలి సైన్యాల ఆక్రమణలో నున్న పశ్చిమ, మధ్యఐరోపా రాజ్యాలగుండా ప్రయాణం చేయాలి. అనంతరం మిత్రమండలి దిగ్బంధాన్ని ఛేదించుకొని మాస్కో చేరాలి. కేవలం విశ్వాసమూ, ఉత్సాహమూ ఉన్నంతమాత్రం సరిపోదు. విప్లవ భూప్రదక్షిణాన్ని గురించి జాగ్రత్తగా ఆలోచించాలి!

1919 శీతకాలంలో స్కాండినేవియా, హాలెండుల ద్వారా వర్తమానం వచ్చింది. సాధ్యమైనంత త్వరలో బొరొడిన్‌ను మాస్కో రమ్మని, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు మెక్సికో కమ్యూనిస్టుపార్టీని ప్రతినిధివర్గాన్ని పంపమనీ ఆ సందేశం. నాకొరకు బొరొడిన్ బెర్లిన్‌లో వేచి ఉండాలి. రెండవ ప్రపంచ మహాసభ 1920 లో జరుగుతుంది. మహాసభలో పాల్గొనటానికి వీలుగా 1919 ఆసాంతానికి మెక్సికోలో బయలు దేరాలి. రహస్యంగా పట్టుబడకుండా చేసే ప్రయాణం త్వరగా సాగదు. మహాసభకు హాజరయ్యే ప్రతినిధు లందరూ 1920 జనవరిలో బెర్లిన్‌లో రహస్యంగా సమావేశమై అక్కడినుండి ఏదో రహస్యమార్గాన మాస్కో చేరాలి.

బొరొడిన్‌ను సులభంగానే పంపి వేయగలిగాను. జబ్బుగా ఉన్నదనే నెపంతో కొన్ని రోజు లతడు ఇల్లు విడిచి బయటికి రాలేదు. రోగిని చూచేనిమిత్తం రోజూ ఒక డాక్టర్ వస్తూ ఉండేవాడు. ఈలోగా మెక్సికన్ పాస్‌పోర్టు సాధించి సరిహద్దులు దాటి సంయుక్త రాష్ట్రాల్లో ప్రవేశించాడు. ముందుగానే ఒక వ్యక్తి న్యూయార్కు వెళ్ళి నార్వే నౌకలో బొరొడిన్ ప్రయాణానికి ఏర్పాటు చేశాడు. బోల్షివిక్ ప్రతినిధి అంతర్ధానమైనాడని మెక్సికోలో మిత్రులు గ్రహించే సరికి బొరొడిన్ అట్లాంటిక్ సముద్రంమీద ప్రయాణం చేస్తూ ఉంటాడు. అతడు బయలు దేరటానికి ముందుగా మెక్సికో విదేశాంగమంత్రితో సమావేశం జరిగింది. మెక్సికో రష్యాల మధ్య మామూలు విదేశాంగ సంబంధాలు నెలకొనే ప్రయత్నం త్వరలో జరుపుతాననీ కొలది రోజుల్లోనే నవరష్యా అధికార రాయబారి మెక్సికో రావాలనీ విదేశాంగమంత్రి తన కోర్కెను వెల్లడించాడు. మూడు వారాల తరువాత బొరొడిన్ క్షేమంగా రాటర్‌డామ్ చేరినట్లు కేబుల్ వచ్చింది.

మెక్సికోనుండి బయలు దేరవలసిన రోజు సమీపిస్తున్న కొలది ఏదో పోగొట్టుకుంటున్నాననే బాధ ఎక్కువ కాసాగింది. నేను మెక్సికోలో ఉన్నది

రెండున్నర సంవత్సరాలే. కాని బాల్యం మొదలు అక్కడే ఉన్నాననే భావం నన్నావరించింది. మెక్సికోలో వ్యక్తిగతంగా నాకు స్నేహితు లెక్కువమంది లేరు. మెక్సికోలోని ఆడంబరత్వం, సాంప్రదాయ ప్రియత్వం నా స్వభావానికి కేవలం విరుద్ధం. కాని ప్రజలు, ప్రభుత్వం చూపిన ఔదార్యానికి నా హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. వానితో పోల్చిచూస్తే నేనా దేశానికి చేసినసేవ చాలస్వల్పం. ఎందరో మెక్సికన్లు నన్ను ఆదరంతో, వాత్సల్యంతో, బంధుప్రేమతో చూచారు. అది మహత్తరమైన అనుభూతి. వాస్తవానికి నేను పునర్జన్మపొందిన దేశం మెక్సికో. మెక్సికోకు రాకపూర్వమే అప్పటి నా ఆదర్శాలపట్ల తీవ్రమైన అసంతృప్తి కలిగిన మాట వాస్తవమే; కాని మెక్సికోలో ఉండగానే నూతన దృక్పథం ఏర్పడింది. మానసిక విప్లవం జరిగింది. అది అనంతమైన తాత్విక విప్లవం!

ఈ నూతన దృక్పథంవల్లనే నా పునర్జన్మకు కారణమైన మెక్సికోకు గల సంబంధంలోని ఉద్వేగాన్ని జయింపగలిగాను. నూతన స్వేచ్ఛాఆదర్శాన్ని, జాతీయ పరిహద్దుల్లోగానీ, భౌగోళిక పరిహద్దుల్లోగాని సాధింపలేము. ఆ ఆదర్శంకోసం ప్రపంచం అన్ని ప్రాంతాల్లోను పోరాటం జరగాలి; నాగరక మానవజాతి సమస్తమూ ఆ పోరాటంలో పాల్గొనాలి. మెక్సికోలోనే ఉండటంవల్ల నే సాధింపగలిగేదేమీ లేదు. ఇచటి కార్యాచరణకు గల పరిధులు చాల సంకుచితమైనవి. ఎక్కువ అవకాశాలున్న విస్తృతరంగస్థలంపై పాత్రధారినైనప్పుడు మెక్సికోకు గూడా ఇతోధికంగా సహాయం చేయవచ్చు. స్వదేశంనుండి బహిష్కరింపబడిన నాకు ఆతిథ్యమిచ్చిన మెక్సికో ప్రభుత్వానికి సర్వదా కృతజ్ఞుణ్ణే!

కరంజాను కలుసుకున్నాను ఆతని అనుమతికోసం. యథాప్రకారం నా కోర్కెలపట్ల సానుభూతి వెల్లడిస్తూ నా స్వదేశానికి సేవచేయగల భాగ్యం లభించాలని దీవించాడు. వ్యక్తిగతంగా ఆతనియందు విశ్వాసాన్ని, భవిష్యత్తులో గూడా మెక్సికోను సేవించాలనే నా సంకల్పాన్ని వివరించాను. స్పార్టన్ క్రమశిక్షణను గుర్తుకు తెచ్చే ధనికవర్గీయుడు కరంజా; కాని ఆ క్షణంలో అతని మాటల్లో నైరాశ్యం విషాదం ప్రతిధ్వనించినై; బహుశా తానాడుతున్న రాజకీయ చదరంగంలో పరాజయం తథ్యమని కరంజా గ్రహించి యుండవచ్చు. ఎంత విషాదకరమైనా పోటీ చివరిదాకా చూచే స్వభావం కరంజాది. అది కరంజాకు విషాదకరంగానే పరిణమించింది. మెక్సికోలో నా స్వల్పకృషి కరంజాను రక్షింపలేకపోయింది. కాని అంతర్యుద్ధంనుండి దేశాన్ని విముక్తిచేయగల సాంఘిక శక్తులను మాత్రం పటిష్టం చేయగలిగింది. నా విశ్వాసంలోను, విదేశాల్లో నా విజయాల్లోను తనకు పూర్తి నమ్మకం ఉన్నదన్నాడు కరంజా. అధ్యక్షుడు సొంత బాధ్యతపై పంపే రాయబారిగా, ఐరోపాకు నా ప్రయాణానికి యేర్పాట్లు చేశాడు. బెర్లిన్‌లోని మెక్సికో రాయబారి

కరంజా పక్షపాతి. అతనిని కలుసుకొని మెక్సికో రష్యాలమధ్య స్నేహ సంబంధాల పునరుద్ధణను గూర్చి చర్చించమని కోరాడు. విదేశాంగశాఖ నా ప్రయాణానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేస్తుంది. స్పెయిన్‌గుండా ప్రయాణం చేయాలి. అక్కడి మిత్రులు అపాయం లేకుండా జర్మనీచేరే యేర్పాట్లు చేస్తారు. చివరకు కరంజా నా భుజంమీద చెయ్యివేసి ఉద్రేకాన్ని ఆపుకొంటూ గాద్గదికంగా అన్నాడు! "నీవు చాల చిన్నవాడివి; భవిష్యత్తుతో జూదం ఆడవద్దు; విజయవంతంగా చిరకాలం వర్థిల్లాలని ఆశీర్వదిస్తున్నాను." అంటూ వెంటనే వెనుదిరిగి వెళ్ళిపోయినాడు.

కొన్ని రోజుల తర్వాత విదేశాంగమంత్రి నాతో చెప్పాడు. "డిశంబరు మొదటి వారంలో వెరాక్రూజ్ నుండి ఒకస్పానిష్ నౌక బయలుదేరుతుంది. అందులో నీకొక 'కాబిన్' రిజర్వు చేయబడింది. మరొక పేరుతో విదేశాంగశాఖ ప్యాస్‌పోర్టు కూడా సిద్ధంచేయబడింది. ఐతే రెండు వారాలు ముందుగానే మెక్సికో నగరంనుండి బయలుదేరి నౌక బయలుదేరే రోజునే వెరాక్రూజ్ చేరాలి. మిగిలిన యేర్పాట్లను ఒకరిద్దరు విశ్వాసపాత్రులైన పార్టీసభ్యులను నియమించాలి" పార్టీ తాత్కాలిక కార్యదర్శి చాల నమ్మకస్తుడు. నా దగ్గరున్న డబ్బులో చాల పెద్ద మొత్తాన్ని అప్పగించి ఒక సంవత్సరంపాటు పార్టీ కార్యక్రమం నడపవలసిందిగా ఏర్పాటు చేశాను. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లాటిన్ అమెరికాశాఖను స్థాపించటానికై ఈలోగా ఎవరో ఒకరు మాస్కోనుండి వస్తారు.

ఐదు సంవత్సరాలకు పూర్వం ఆయుధాలను వెతుక్కుంటూ ఇండియాలో బయలుదేరాను. నాకు విప్లవాన్ని గురించీ, అంతర్జాతీయ సంబంధాలను గురించీ, ఏవో అస్పష్టమైన భావాలుండేవి. ఆ సందర్భంలో లభించిన అనుభవంతో నా గాలిమేడలు చాలవరకు కూలిపోయినై. సంయుక్తరాష్ట్రాల్లో గడిపిన స్వల్పకాలంలోను నా అజ్ఞానాన్ని గురించి చాల బాధ పడ్డాను. ఇండియాలోని మొదటి విప్లవోద్యమం బంకిం చటర్జీ రచించిన ఆనందమఠంతో ప్రారంభమైంది. ఆ విప్లవోద్యమం ప్రోత్సహించిన సాంఘిక ఆదర్శానికీ, సాంస్కృతిక జాతీయభావానికీ మధ్యనుండే అగాధమైన వైరుధ్యాన్ని గుర్తించకుండా చేసింది ఆ అజ్ఞానమే. జాతీయభావం - విప్లవాత్మకమైనా, చట్టబద్ధమైనా, సాంస్కృతికమైనా, రాజకీయమైనా - మానసికంగా దుర్బలమైన భావం కావటంవల్ల కేవలం ఉద్రేకాలమీదనే ఆధారపడినదని స్పష్టమైంది. స్వదేశంలోగానీ, విదేశంలోగానీ జాతీయభావ ప్రభావం పనిచేసేది హృదయంమీదనే గాని మనస్సుమీద కాదు. అది హృదయాన్ని స్పందింపచేస్తుందే గాని మనస్సును తృప్తి పరచలేదు. న్యూయార్కులో నుండగా, సమకాలిక, రాజకీయ, ఆర్థిక సమస్యలను గురించిన పరిజ్ఞానాన్ని సంపాదించాను. దాని ఫలితంగానే సోషలిజాన్ని స్వీకరించాను. కాని జీవితంమీది దృక్పథంలో మార్పురాలేదు. ఈ

విషయం బొరొడిన్‌తో జరిపిన చర్చలవలన స్పష్టమైంది. సాంస్కృతిక జాతీయవాది దృక్పథంనుండి మార్క్సిజాన్ని ప్రతిఘటించాను. బొరొడిన్ మానసిక శాస్త్రవేత్త. కేవలం వాదనకోరకై విశ్వసించని సిద్ధాంతాలను సమర్థిస్తున్నానని సులభంగా గ్రహించాడు; అది కేవలం శల్యగతమైన మూఢవిశ్వాసమే గాని మరొకటి కాదని స్పష్టం చేశాడు.

నా పునర్జనన భూమిలో మానసికంగా స్వేచ్ఛాజీవిని కాగలిగాను. కాని ఇప్పుడూ నాకొక సిద్ధాంతం, విశ్వాసం లేకపోలేదు. ఐతే, ఆ సిద్ధాంతంలోనే విశ్వాసానికి విరుగుడైన తాత్విక ఔషధం కూడా గర్భితమై ఉంది. ఇప్పుడు ఆర్థిక స్వాతంత్ర్యం, సాంఘికన్యాయంలేని రాజకీయ స్వాతంత్ర్యంలో విశ్వాసం నశించింది; సాంఘికోద్ధరణకై జరిపే పోరాటం ఫలప్రదం కావటానికి మానసిక స్వాతంత్ర్యం అవసరం. అధికార భయంనుండి విముక్తి పొందటమే మానసిక స్వాతంత్ర్యం. అచిర కాలంలో ఇండియాలోని విప్లవకారులను ఆయుధాల ద్వారా సహాయం చేయగలను; కాని ఇండియానుండి బయలుదేరినప్పుడు నాకున్న ఆదర్శంలో నాకిప్పుడు విశ్వాసం లేదు. సాయుధ విప్లవ సిద్ధాంతాన్ని ఇప్పటికీ నమ్ముతున్నాను. కాని 'విప్లవం' అంటే ఏమిటో విప్లవకారులు స్పష్టంగా అర్థం చేసికోవటం చాల ముఖ్యమని భావిస్తున్నాను. ఆయుధాలకంటె విప్లవభావప్రచారమే ఎక్కువ ముఖ్యం. ఆ విశ్వాసంతోనే భూప్రదక్షిణంచేస్తూ ఇండియాకు బయలుదేరాను!

# ఐరోపాలో

## బ్రదికి చెడిన దేశంలో

### అట్లాంటిక్ మహాసముద్రంమీద

1919 నవంబర్ మొదటి వారంలో వెరాక్రూజ్ చెంత స్పానిష్ నౌక
ఆల్ ఫెన్‌జో XIII నెక్కాను. పాస్‌పోర్టు రాబర్ట్ ఆవెనీ విల్లా గార్షియా అనే వ్యక్తి
కీయబడింది. పేరునుబట్టి, అత డొక ప్రముఖ వ్యక్తి అని తేలిపోయింది. ఆ పేరు
నెన్నుకొన్నది కేవలం ధ్వన్యాడంబరం కోసమేకాక, కాగితాలు చూచిన తక్షణం
అటువంటి వ్యక్తి యదార్థం అనే అభిప్రాయాన్ని కలిగించటం కోసమే. ఆ పేరు,
నా స్థానంలో మెక్సికో కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా ఎన్నుకోబడిన ఆతని సోదరు
నిది. తల్లి దండ్రుల విజాతీయత వలన అతని కా పేరు లభించింది. తండ్రి ఆంగ్లేయుడు,
తల్లి మెక్సికో ధనికవర్గానికి చెందిన యువతి. ఈ 'సంకర వివాహం' స్పానిష్
భాషలో నాకు పాండిత్యం లేకపోవటానికి సాకుగా అనుకూలించింది. "అందాన్ని,
ఆ స్త్రీని ప్రేమించి మెక్సికన్ యువతిని పెండ్లి చేసికొన్నాడా ఆంగ్లేయుడు; కాని
రంగుజాతి భాషను మాట్లాడటానికి ఆతని ఆభిజాత్యం అడ్డుపడింది. కాబట్టి ఇంట్లో
ఫ్రెంచి భాషను మాట్లాడేవారు." అని అప్పటికి నా కథ నల్లుకున్నాము.

సుమారు నాల్గు సంవత్సరాలకు పూర్వం పసిఫిక్ మహాసముద్రంమీద ప్రయా
ణం చేశాను. ఆ అనుభవానికీ ప్రస్తుత అట్లాంటిక్ ప్రయాణానికీ, ఒక్క మొదటి
మజిలీ మినహాయించి పోలికే లేదు. ఆ రోజుల్లో ఎంత పెద్ద నౌకలైనా, నిదానంగానే
ప్రయాణం చేసేవి. స్పానిష్ వర్తక నౌకావళానికి గర్వకారణంగా ఉండే ఆల్
ఫెన్‌జో XIII కైనా అట్లాంటిక్ సముద్రాన్ని దాటటానికి సాధారణంగా పది
రోజులు పట్టేది. కాని హవానా హార్బరులోని కూలీల సమ్మెతో మా ప్రయాణం
మరి రెండు రోజులు ఆలస్యమైంది. మామూలుగా ప్రయాణీకులు దిగి ఎక్కటానికి
వీలుగా, హవానాలో, మా నౌక కొన్ని గంటలు మాత్రమే ఆగవలసి ఉంది. కాని
ఈ కాలవ్యవధి కూడా నా ప్రయాణంలో ఒక గడ్డు సమస్య. అందుకనే నా ప్రయా
ణాన్ని గురించి ముందుగా జాగ్రత్త వహించాల్సి వచ్చింది.

మెక్సికోలో ఉన్న రోజుల్లో ఆంగ్లో - అమెరికన్ రహస్య పోలీసు సిబ్బంది
నన్ను అపహరించటానికి విఫల ప్రయత్నాలు చేశారు. ఇండియాలో రౌలట్
నివేదికలో నే నొక ప్రముఖ నేరస్థుణ్ణి; సంయుక్త రాష్ట్రాల్లో శిక్ష తప్పించుకు పారి

పోయిన మోసగాణ్ణి. అందుచే వారు నాకోసం ప్రయత్నించటం మానలేదు. ఇప్పుడు క్యూబా ఇంచుమించు అమెరికా రక్షణలోనున్న రాజ్యం. తటస్థ రాజ్యాల నౌకలను తనిఖీచేసే యుద్ధకాలపు ఆచారం ఇంకా అమలులోనే ఉంది. కాబట్టి హవానాలో ఆగే నౌకలో నేను ప్రయాణం చేస్తున్న వార్త బైటికి పొక్కితే నేను బైట బడటం తథ్యం; ఆ భయంతోనే వెరాక్రూజ్ హార్బరు ఉద్యోగులు నౌకాధికారితో సంప్రదించారు. నౌక హవానాలో ఉన్నంతకాలం, నాకు బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా దాచివేస్తానని నౌకాధికారి అభయమిచ్చాడు.

కాని హవానాలో కార్మికుల సమ్మె వల్ల ఇతర నౌకలవలెనే మా నౌకగూడా అవ్యవధికంగా నిలబడిపోగల ప్రమాదం యేర్పడింది. డెక్ పైకి రాకుండా ఎంత కాలమని గుప్త ప్రదేశంలో ఉండగలం? రెండవ రోజున ఒక సాహసానికి పూనుకున్నాను. క్యూబా లేబర్ ఫెడరేషన్ కార్యదర్శి సోషలిస్టు; నేను మెక్సికోలో ఉండగా అనేక పర్యాయాలు మెక్సికో వచ్చాడు. అతనితో మాట్లాడటానికి ప్రయత్నించాను. దారిలో కూలీల పికెటింగ్ ఏర్పాటు చేయబడింది. వారిలో ఒకరిని పిలిచి మాట్లాడాను. సమ్మెదారులపట్ల నా సానుభూతి వెల్లడించటంతో అతని విశ్వాసాన్ని పొందగలిగాను; అతనిద్వారా లేబర్ ఫెడరేషన్ కార్యదర్శికి "అతని మిత్రుడొకడు అల్ ఫెంజో XIII లో ప్రయాణం చేస్తున్నాడ"నే వర్తమానం పంపాను. సాయంకాలానికి, కార్యదర్శి మా నౌకమీదికి వచ్చాడు. మెక్సికో కామ్రేడ్లు ఏమాత్రం ముందుగా తెలియబరచినా, యాంకీ సామ్రాజ్యవాదుల ప్రమాదానికి నేను గురి గాకుండా యేర్పాటు జరిగి ఉండేవని ఆగ్రహించాడు. మరునాడుదయమే, నౌకాధికారి ఎంత త్వరగా బయలుదేర గలిగితే అంత త్వరగా మా నౌక బయలుదేరుతుందని వాగ్దాన మిచ్చాడు. "ఆల్ఫెంజో XIII ప్రయాణీకుల నౌక; అమాయకులైన ప్రయాణీకులను బాధించటం సమ్మెదార్ల ఆశయం కాదు." అనే నెపంతో మా నౌకకు అవసరమైన సౌకర్యాలు జరిగినై; నౌకాధికారి హార్బర్ ఉద్యోగులను కలిసికొని మామూలు వ్యవహారాలు పూర్తి చేశాడు; ఉదయం కాకపూర్వమే మా నౌక బయలు దేరింది.

నౌకలో ఉన్న వారందరికీ ఆశ్చర్యమైంది. "లాటిన్ అమెరికా కూలీలందరూ అరాజక సిండికలిస్టు భావాలు కలవారు; వీరు బూర్జువా ప్రయాణీకులపట్ల ఇంత ఔదార్యం వహించటమా?" అని వారి అనుమానం. నౌకాధికారి కొకడికే అసలు రహస్యం తెలుసు. అతడు కూడా ఎవ్వరికీ చెప్పేరకం కాదు. ఐనా ఇద్దరు ప్రయాణీకులు మాత్రం రహస్యాన్ని పసికట్టారు. అందులో ఒకవ్యక్తి నేను ఒంటరిగా ఉన్న సమయం చూచి ప్రయాణీకులందరి తరపున నన్ను అభినందించటానికి వచ్చాడు. అతడు మెక్సికోలోని జర్మన్ స్కూల్ హెడ్‌మాస్టర్. యుద్ధానంతరం సెలవుమీద స్వదేశానికి వెళ్ళుతున్నాడు. రెండవ వ్యక్తి మెక్సికో విదేశశాఖోద్యోగి; వియన్నా

వెళుతున్నాడు. అతని భార్య ఫ్రెంచి దేశీయురాలు. అతణ్ణి నేనెప్పుడూ చూచిన గుర్తులేదు. కాని నన్ను గురించి, నేను ఐరోపా వెళ్ళుతున్న కార్యభారాన్ని గురించీ అతనికి తెలుసు. నాకంటె వయసులో చాల పెద్ద, ఐనా అధ్యక్షుని స్వంత రాయబారి హోదాలో ప్రయాణం చేస్తున్న నాపట్ల, సాంప్రదాయాను గుణమైన మర్యాదతో ప్రవర్తించాడు. కాని రెండు రోజుల్లో ఆ మర్యాదలు అంతరించి భార్యతో సహా సరదాగా కాలక్షేపం ప్రారంభించాడు.

నాల్గు సంవత్సరాల క్రితం కాథలిక్ విద్యార్థి వేషంలో పసిఫిక్ మహా సముద్రంమీద ప్రయాణం చేశాను. అది నాకొక గొప్ప పరీక్ష. ఈ మధ్యకాలంలో నా జీవితంలో రెండు శతాబ్దాల సాంస్కృతిక చరిత్ర నడిచింది. అమెరికాలో దిగి నప్పుడు ఆ దేశసాంప్రదాయాలన్నీ నాకు క్రొత్తలే. ఐరోపాకు గూడా నేను క్రొత్త వాణ్ణే. కాని సాంస్కృతికంగా ఐరోపా నాకు క్రొత్త దేశం కాదు. ఒక ఆశయానికి సాధనంగానే అమెరికా ప్రయాణం సాగించాను; ఆ దేశంలో నాకేమాత్రం శ్రద్ధ లేదు; బుద్ధిపూర్వకంగా అక్కడ ఉండలేదు. సాధ్యమైనంత అల్పవ్యవధిలో ఆ దేశం నుండి బైట పడ్డాను. ఐనా ఆ దేశమంటే నాకు అయిష్టంగానీ, విరోధంగాని లేదు. తాత్వికంగా నేను వేరే ప్రపంచంలో జీవిస్తున్నాను. ఆ ప్రపంచమే అమెరికా కంటె ఉత్తమమైనదనే విశ్వాసం బలంగా ఉండటంచేత, అమెరికాలోని క్రొత్త వాతారణంవల్ల లాభం పొందలేకపోయాను. ప్రస్తుతం క్రొత్త దృక్పథంతో ఐరోపాకు ప్రయాణం కట్టాను. అందుచే అట్లాంటిక్ మీది ప్రయాణం ఉత్సాహంగా ఉంది. ఆసియానుండి అమెరికాకు ప్రయాణం, వెలుగునుండి చీకటిలోకి ప్రయాణంలాగా బాధాకరమైంది; కాని నేడిది ఒక మహత్తర యాత్ర. మార్గమధ్యంలో పెట్టుబడి దారీ ఐరోపా కూలిపోవటం దర్శిస్తాను; శ్రామికవర్గం విజృంభించి, ఆ శిథిలాలపై నూతన ప్రపంచాన్ని నిర్మించే ప్రయత్నాలను దర్శించే భాగ్యం నాకు లభిస్తుంది.

అట్లాంటిక్ మీద ప్రయాణం చేస్తున్న మా చిన్న సమాజంలో మెక్సికన్లు, స్పానియార్డులు, జర్మనులు ఉన్నారు. మెక్సికో రాయబారశాఖోద్యోగి భార్య (ఫ్రెంచి వనిత) మాత్రమే మిత్రమండలి రాజ్యాల ఏకైక ప్రతినిధి. వివాహంవల్ల మెక్సికో పౌరసత్వం పొందినా, ఆమె ఎక్కువకాలం పారిస్‌లోనే గడిపింది. ఇంతకు ముందుకూడా ఆమె భర్తకు పారిస్‌లోనే ఉద్యోగం. కాబట్టి మా సమాజంలోని వ్యక్తు లందరివలె ఆమె జర్మనీపట్ల సానుభూతి చూపేది కాదు. జర్మన్ పక్షపాతం మా అందరిలోను, ముఖ్యంగా స్పానియార్డులలో ఎక్కువగా ఉండేది. జర్మనీ యుద్ధంలో ఓడిపోయిందే కాని, మిత్రుల సానుభూతి, అభిమానాలూ కోల్పోలేదు!

ఏమైనా, స్పానియార్డులు ఉదార స్వభావులు; జర్మనుల సమక్షంలో కూడా ఫ్రెంచి యువతి కేమాత్రంకూడా ఇబ్బంది కలిగించేవారు కాదు. జర్మనులలో చాలా

మంది ఈ నాల్గు సంవత్సరాలూ, ఇంచుమించు దేశబహిష్కరణ ననుభవించి తిరిగి స్వదేశానికి వెళ్ళేవారే. మిత్రమండలి ఆక్రమణలోనున్న జర్మనీనుండి వారికింతవరకూ బంధువుల క్షేమసమాచారాలు అందటంలేదు. తమ దేశంలో ఎట్టి విషాదకర పరిస్థితుల నెదుర్కొనవలసివస్తుందో వారిలో చాలామందికి తెలియదు. ఐనా చాల సరదాగా కాలక్షేపంచేస్తూ ఉండేవారు.

అందరిలోనూ ఉపాధ్యాయుడు చాల ఉల్లాసంగా ఉండేవాడు. నాతో స్నేహం చేశాడు. నేనెక్కడికి వెళుతున్నదీ, ఏ మార్గాన వెళుతున్నదీ ఆరాలు అడిగేవాడు. ఫ్రాన్సుగుండా ప్రయాణం చాల ప్రమాదమట! పారిస్ నుంచి జర్మనీ వెళ్లే రైలుబండ్లన్నీ బ్రిటిష్ సైనికుల ఆక్రమణలో ఉన్న సరిహద్దు స్టేషన్లగుండానే వెళ్లేవి. ఈ విషయాలన్నీ నాకు ముందుగానే తెలుసు. ఐనా, నా క్షేమంలో అంత శ్రద్ధ వహించిన ఆతనియందు కృతజ్ఞత చూపటం నా ధర్మం. ఇంకా జర్మనులలో భారతీయులు తమ పోషణలో ఉన్నవారనే భావం పోలేదు. వారిలో ఎవరికీ తమ దేశ సైనికబలం విచ్ఛిన్నమైనదనే పరిజ్ఞానమే లేదు. అది అసంభవమని వారి విశ్వాసం. యూదు ధనికులు, సోషల్ డెమోక్రాటిక్ రాజకీయ నాయకులు మిత్రమండలి రాజ్యాలకు అమ్ముడుపోయి జర్మనీకి ద్రోహం చేశారని వారిపై మండిపడుతున్నారు. ప్రపంచ విఖ్యాత సైనికనాయకుడైన హిండెన్‌బర్గు, సైనిక వ్యూహరచనలో సిద్ధహస్తుడైన లూడెన్‌డార్ఫ్ ఇంకా జర్మనీలోనే ఉన్నారు. అచిరకాలంలోనే కెయిజర్ కూడా బెర్లిన్‌లో ప్రత్యక్ష మౌతాడు. ప్రతీకారంతో ఎదురు దెబ్బతీయటానికై అజేయమైన జర్మన్ సైన్యం రహస్యంగా సమాయత్తమౌతోంది. వార్సెయిల్స్ సంధిపై సంతకాలు చేసిన సోషల్ డెమోక్రాటిక్ పిరికిపందలూ, యూదు దేశద్రోహులూ, జర్మన్ దేశభక్తుల క్రోధాగ్నిలో నశింపక తప్పదు!

ఇటువంటి భావాలతోనే, నౌకలోని 'బార్', 'స్మోకింగ్ రూము'లు రాత్రి ప్రొద్దుపోయేంతవరకూ ప్రతిధ్వనిస్తూ ఉండేవి. అది కేవలం, నిరాశా నిస్పృహల వేదనాస్వరం; కాని అందులో రానున్న మహోపద్రవచ్ఛాయలు లీలగా గోచరించినై. జర్మన్ ప్రయాణీకులలో చాలమంది పెద్దపెద్ద భూస్వాములు, లక్షాధికారులైన వర్తకులు; వారి ప్రవర్తన ఆడంబరంగా ఉన్నా, నియమబద్ధంగానే ఉండేది. పగటి పూట మాత్రం స్పానిష్ సారాయి త్రాగినా వారి నెత్తురు వేడెక్కేదికాదు. వీరందరిలో ప్రధానోపాధ్యాయు డొక్కడే చదువు సంధ్యలున్నవాడు. పి. హెచ్. డి. డిగ్రీ మాత్రమేగాక విశ్వవిద్యాలయంలో చదివిన చిహ్నంగా బుగ్గమీద మచ్చకూడా ఉంది. హీడెల్‌బర్గ్ వంటి ప్రాచీన విద్యాకేంద్రాలలో విద్యార్థులు బాకులతో ద్వంద్వ యుద్ధాలు చేసేవారు; ఈ సాంప్రదాయం ఇరవయ్యో శతాబ్ద ప్రారంభం వరకూ ఉంది. అందుచే జర్మనీలో ముఖంమీద 'కత్తిగాటు' విద్యావంతునికి చిహ్నమైంది. లోకంలో ఈ మచ్చలను గురించి ఒక ప్రథకూడా వ్యాపించింది. ఈ ద్వంద్వ

యుద్ధాలు, కల్లు అంగడి పోరాటాలలాగా ప్రమాదకరమైనవి కావనీ, మచ్చలు మాత్రం విద్యార్థులు కృత్రిమంగా ముఖాలమీద చెక్కుకొనే వారనీ చాలమంది అభిప్రాయం. ఇందులో సత్యం లేకపోలేదు. ప్రష్యన్ సైన్యంలోని ప్రతి ఉద్యోగి ముఖంమీదా కన్పించే మచ్చ, నిజంగా విద్యావంతుల ముఖాలమీద కన్పించకపోవటమే అందుకు నిదర్శనము.

బెర్లిన్‌లో బొరొడిన్‌ను కలుసుకొనేవరకూ ఒక జర్మన్‌మిత్రు డుండటం అవసరమనే అభిప్రాయంతో ఉన్నతోపాధ్యాయునితో స్నేహం చేసికొన్నాను. జర్మనులు, స్పెయిన్ ఇటలీ స్విట్జర్లాండులగుండా స్వదేశానికి ప్రయాణం చేస్తున్నారు; నా మార్గంకూడా అదే; కాని నేను ఒంటరిగా ప్రయాణం చేయాలి. అందుచే ఆ ఉపాధ్యాయుని బెర్లిన్‌లోనే కలుసుకునే యేర్పాటు చేసికొన్నాను. నేను లాకొరూనాలో దిగాలి. లాకొరూనా, ఐబీరియా ద్వీపకల్పం వాయువ్య భాగంలో ఉన్న చిన్న రేవుపట్టణం; ఇక్కడదిగిన ప్రయాణీకులు రైలుమీద మాడ్రిడ్ (స్పెయిన్ రాజధాని) వెళ్లాలి. మెక్సికో రాయబారశాఖోద్యోగీ, అతనిభార్య, నేరుగా పారిస్ వెళుతున్నారు. వారు శాన్‌తాన్‌డెర్ రేవులో దిగుతారు; ఇది ఫ్రెంచి సరిహద్దులకు సమీపంలో ఉన్న స్పానిష్ రేవుపట్టణం; స్పెయిన్‌లో సముద్రతీర విలాసకేంద్రా లన్నిటిలో ముఖ్యమైంది. నా గమ్యస్థానం మాడ్రిడ్; కాని నేరుగా వెళ్ళే మార్గం తప్పించి, అంటే లాకొరూనాలో దిగక, శాన్‌తాన్‌డెర్‌లో దిగ నిశ్చయించాను. ఐరోపాలో ప్రథమంగా దర్శించిన పట్టణ మీ విలాసకేంద్రమే.

అట్లాంటిక్ యాత్ర చివరి రెండురోజుల్లో నౌకలో ఉన్నది ముగ్గురం ప్రయాణీకులమే! నేనూ, మెక్సికో ఉద్యోగి, అతని ఫ్రెంచిభార్య. ఈ రెండురోజులూ స్వేచ్ఛగా మాట్లాడుకొనే అవకాశం లభించింది. నేను జర్మన్ అభిమానిని కాదని తెలిసి వా రుభయులూ ఆశ్చర్యపోయినారు. అతనడిగాడు: "మీరు వెళుతున్నది బెర్లినేగదా?" నేను బెర్లిన్‌దాటి పైకిపోతున్న సంగతిగానీ, నాలక్ష్యసాధనకు జర్మన్ సహాయ మొక సాధనంకాదనీ అతనికి తెలియదు. అతనితో అన్నాను: "నాకూ మొదట జర్మన్ ప్రభుత్వలక్ష్యంలో ఆశలుండేవి; క్రమంగా జర్మనులతో సహచర్యం హెచ్చినకొలదీ ఆ ఆశలు నశించినై; ఉదాహరణకి మన ప్రయాణంలో జర్మనులు అప్పుడప్పుడు ప్రదర్శించిన మొరటు దేశభక్తి ఎంతవరకు సమర్థనీయం? సామ్రాజ్యవాద ప్రభుత్వం కూలిపోయినందుకు నాకు చాల సంతోషం; ప్రష్యన్ సైనికవాదం నుండి విముక్తిపొంది కవిత్వానికీ, సంగీతానికీ, విజ్ఞానతత్వశాస్త్రాలకు పట్టుగొమ్మగా, నవజర్మనీ పునరుజ్జీవనం పొందటాన్ని చూడాలనే నా కాంక్ష."

ఇన్నిరోజులకుగాను ఫ్రెంచివనిత ఉల్లాసంగా ఉండటం నేడే చూచాను. ఇన్నాళ్ళూ తెచ్చిపెట్టుకొన్న సరదాతో ఉంటూఉండేది. జర్మనుల కామె ఉనికి

ఎంతో కష్టంగా ఉండేది. నేను పారిస్ వెళ్ళటంలేదని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది. పారిస్ అంటే ఐరోపా సాంస్కృతికరాజధాని. పారిస్‌దగ్గరికి వచ్చి, చూడకుండా వెనకకు మరలటమా? పారిస్‌లో ముఖ్యప్రాంతాలకు స్వయంగా తీసుకువెళతాననీ పారిస్ నాకు అభిమానపాత్రం కాగలదనీ హామీ ఇచ్చింది. తరువాత కొన్ని సంవత్స రాలకు పారిస్ చూచినప్పుడు, ఆమె పొరపాటుపడ్డట్లు గ్రహించాను; నాకు పారిస్ అంటే అభిమానం కలగనేలేదు!

నౌక లాకొరూనారేవు చేరింది. నగరంలో తనకు తెలిసిన హోటల్లో భోజనంచేసి వద్దామని మెక్సికన్ ఉద్యోగి సూచించాడు. ఒక తుక్కు టాక్సీలో బయలుదేరాం; ఆ టాక్సీకూడా వెళ్ళలేని యిరుకుగొందిలో ఉంది హోటల్. భోజనం మాత్రం పరిశుభ్రంగానే ఉంది. తరువాత నగరంలోని ముఖ్యమైన బజార్లు తిరిగాం. వీధులవెంట సరిగా లైట్లులేవు. రోడ్లమీదగాక, మా టాక్సీ కంకరరాళ్ళమీదుగా నడుస్తున్నదా అనిపించింది. తరచు మా టాక్సీ ఒకవైపునుండి మరియొకవైపుకు పూర్తిగా వంగిపోయేది. మొదటిసారిగా ఐరోపా వచ్చినవారు ప్రథమంగా దర్శించ టానికి యోగ్యమైనదిగాదు లాకొరూనా; తిరిగి హార్బర్ చేరుకున్నాం. మెక్సికన్ ఉద్యోగి నావైపు తిరిగి అన్నాడు; "నాభార్య మీకు ఇంచుమించు పారిస్‌నగరాన్ని చూపించినట్లే." ఆమె, కోపంతో ఉడికిపోయింది; అవి కేవలం ఈర్ష్యాద్వేషాలతో అన్నమాటలే అంది. కాని ఎవరిమాటలు యదార్థమో అప్పటికి నాకు తెలియదు.

లాకొరూనాతో పోలిస్తే శాన్‌తాన్‌డేర్ రేవుపట్టణం "మరోప్రపంచం". మెక్సికో మధ్యయుగంనుండి వస్తున్న నాకు శాన్‌తాన్‌డేర్ రేవులోని విలాస ప్రదర్శ నలు కళ్ళకు మిరుమిట్లు గొల్పినై; ఐరోపా జీవితంలోని అసభ్యత, పచ్చి శృంగారం అంతా ఇక్కడే మూర్తీభవించిందా అనిపించింది. ఇచ్చట 'బీచ్' చాల విశాలమైంది. పగలంతా ఆ ఇసుకమైదానం బంగారువన్నెతో అందాలు చిందుతూ ఉండేది. దానిపై రంగురంగుల పెద్దగొడుగులు; వానిక్రింద అర్ధనగ్నంగా దొరలుతున్న "అందాల రాణులు"; పురుషులు కూడా ఇంచుమించు వస్త్రవిహీనులే. వారి నగ్నదేహాలు స్వల్పసౌందర్యజ్ఞానమున్న ఏ స్త్రీకైనా జుగుప్స కలిగించేటట్లు ఉండేవి. ఐతే ఆ విధంగా ఎందుకు తిరుగుతారో అర్థంకాదు. ఇక రాత్రులు : వెన్నెలలుకురిసే ఉద్యానవనాలు, రాజప్రాసాదాలను మరపించే హోటళ్ళు, జిగేలుమనే నాట్య మందిరాలూ, 'చేయి జారినతరువాత పశ్చాత్తాపంపొందే బదులు జీవితానందాన్నంతా ఈ క్షణంలోనే త్రాగివేద్దామ'నే ఆరాటంతో ఉల్లాసంగా తిరిగే యువతీ యువకుల గుంపులూ! అంతా మరోప్రపంచమే!

మార్క్ ట్వేన్ నవలలోని "విదేశంలో అమాయకు"నికి వలె నాకు చాల ఆశ్చర్యంకలిగింది; నేనంతటి అమాయకుణ్ణిగాదు; కాని ఇది చాలా బాధాకరమైన అను భవం; ఐరోపాలోని ప్రాచీన (స్పానిష్) రాజవంశానికి, తీర రాజధాని శాన్‌తాన్‌డేర్.

ఇక్కడికి ఆకర్షింపబడేది కేవలం 'ధనికయౌవనం', అంటే ఐరోపా సమాజంలో క్రొత్తగా పేరుకొన్న మాలిన్యం! దాన్ని ప్రక్షాళనం చేయటానికే సంవత్సరములో కొన్నిమాసాలపాటు స్పానిష్ న్యాయస్థానం ఇక్కడ సమావేశమౌతూ ఉంటుంది. అంటే క్షీణరాచరికంతో, విచ్ఛిన్న ప్రభువర్గంతో బూర్జువా అసభ్యతకు ఇక్కడే సంఘర్షణ జరుగుతుంది.

ఐరోపాతో పరిచయం నాకీవిధంగా ఏర్పడింది. శాన్ తాన్ డేర్‌లో మూడు రోజులు గడిపిన తర్వాత బయలుదేరాను. మెక్సికో ఉద్యోగి భార్య, జీవితంలో ఉత్సాహంనుండి తప్పించుకు పారిపోయే నాతొందరపాటును సహింపలేకపోయింది. కాని నా గమ్యస్థానం చేరేవరకు నాకు విశ్రాంతి ఉండదు; త్రోవలో మాడ్రిడ్ నగరంలో కొంత పని ఉంది.

## స్పానిష్ సోషలిస్టులు

పారిస్ - లిస్బన్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణంచేసి ఉదయానికి మాడ్రిడ్ నగరం చేరాను; ఆ రాత్రి డైనింగ్ కారులో అద్భుతమైన భోజనం పెట్టారు; నాలుగు సంవత్సరాల భీకరయుద్ధ ఫలితంగా దారిద్ర్యం తాండవిస్తున్న ఐరోపాలో నేదా, స్పెయిన్? అనిపించింది. ఒకప్పుడు గొప్ప విదేశ సామ్రాజ్యానికేగాక, ఐరోపా అంతటిపైనా స్పెయిన్ ఆధిపత్యం నెరపింది. అంటే స్పెయిన్ గతచరిత్ర మహోజ్జ్వలమైనది. కాని వర్తమానం అనుమానాస్పదం; భవిష్యత్తు అంత ఆశాజనకం కాదు. ఐరోపాలో సర్వత్రా కిరీటాలు దొర్లిపోతున్న 1919 లో కూడా స్పెయిన్ ప్రాచీన సింహాసనంమీద మధ్యయుగ కాథలిక్ రాజవంశస్థుడే పరిపాలిస్తున్నాడు. రోమనావ్ (రష్యా), హాప్సుబర్గు (ఆస్ట్రియా), హోహెన్ జోలరన్ (జర్మనీ) రాజవంశాలు అంతరించిన తరువాత ఈ బూర్బను రాజవంశం ఎంతకాలం నిలుస్తుంది? స్పానియార్డుల కీ ఆలోచనలే పట్టినట్లు లేదు. రాజవంశ భవితవ్యంతో దేశభవిత్యం ముడిపడియున్నరోజులు అంతరించినై!

మాడ్రిడ్ నేను దర్శించిన ఐరోపా రాజధాని నగరాల్లో మొదటిది. చాల ఉల్లాసంగా ఉండే నగరం. 'కార్నివాల్' అనే వసంతోత్సవం సమీపిస్తుండటంచేత నేను వెళ్ళినప్పుడు మరింత ఉల్లాసంగా ఉంది. దక్షిణ ఐరోపా కాథలిక్ రాజ్యాలలో ఈ ఉత్సవం విశేషంగా చేస్తుంటారు. యుద్ధకాలంలో స్పానిష్ పారిశ్రామికులు, వర్తకులు విశేషధనాన్ని ఆర్జించారు; అందుచే నిర్లక్ష్యంగా విచ్చలవిడిగా డబ్బు ఖర్చుచేస్తున్నారు. మాడ్రిడ్ నగరరాజవీథిని 'ప్యూర్టా డెల్ సోల్' అంటారు. ఆ వీథి నిండా కాఫీ దుకాణాలే; విలాసవంతమైన రెస్టారెంట్లే. వాటిలో నిజానికి పాలు ప్రవహిస్తున్నై. తేనెకు బదులు 'చక్కెర బిళ్ళలు'. (Sugar Cubes) దొర్లుతున్నై. కప్పు కాఫీకి ఆర్డరిస్తే, ఒక కెటిల్ పాలూ, మరొక కెటిల్ డికాక్షన్

తెస్తాడు. కప్పులో పడిన దానికి రెండింతలు కాఫీ, టేబుల్ మీదా క్రిందా ఒలికి పోయేది; మరొక వెయిటర్ ఐదారు చక్కెర బిళ్ళలు తెచ్చేవాడు; అందులో ఏ ఒకటో రెండో మాత్రమే అతిథి వినియోగిస్తాడు; మిగిలినవానిని క్రిందికి చిమ్మేస్తారు. మిగిలిన తినుబండారాలలో కూడా ఇదే విధమైన దుర్వ్యయం కనిపిస్తుంది. విలాస పురుషులు ఎఱ్ఱని సోఫాలలో త్రాగుతూ, సిగరెట్లు కాలుస్తూ, డబ్బుతో 'డామినో' ఆడుతూ కాలక్షేపం చేస్తుంటారు. ఆ పొగచుట్టివేసి గందరగోళంగా ఉండే ఆ హోటళ్ళలో ఎంతోకాలం నిలబడలేం. ఆ దృశ్యం ఎంత వింతగా ఉంటుందో అంత జుగుప్సాకరం. ఐరోపా నగరం నడిబొడ్డున, ప్రాచ్యనగరాలకు లక్షణమైన రాజవీధి ఉండటం విలక్షణమే! మాడ్రిడ్‌లో ఉన్న కొద్దిరోజుల్లో వీలు చిక్కినప్పుడల్లా ఏదో 'కేఫ్' కు వెళ్ళి కాలంగడిపేవాణ్ణి.

స్పెయిన్ చాలవరకు ప్రాచ్యదేశమే! భౌగోళికంగా ఆలోచిస్తే ఐరోపాతో ఎంతసంబంధమున్నదో స్పెయినుకు ఆఫ్రికాతోనూ అంత సంబంధమున్నది. వాస్తవానికి జిబ్రాల్టర్ జలసంధికంటే పిరనీస్ పర్వతాలే పెద్ద ఆటంకం! మధ్యయుగ ఐరోపాలోని కాథలిక్ రాజ్యాలలో స్పెయిన్ సుప్రసిద్ధమైనదే; కాని క్రీ. శ. 13వ శతాబ్ది వరకూ అరబ్ సామ్రాజ్య భాగంగానే ఉంది. ఆధునికయుగారంభంలో స్పెయిన్ రాజవంశం, క్రొత్త ప్రపంచ (అమెరికా) ఐశ్వర్యాన్ని దోచుకొని ఐరోపాలోని అభివృద్ధినిరోధకశక్తులకు నాయకత్వం వహించారు. కాని, నిజానికి అరబ్ సామ్రాజ్యంలో ఉన్నరోజులే, స్పెయిన్ చరిత్రలో స్వర్ణయుగం! నాడు ఆధునిక ఐరోపా నాగరికతకు పునాదులువేసిన విద్యాసంస్కృతులకు కేంద్రంగా ఉండేది స్పెయిన్. గ్రీకు వారసత్వంపై వర్ధిల్లిన అరబ్ సంస్కృతీ వికాసానికి కోర్డోవా విశ్వవిద్యాలయం పట్టుగొమ్మ. ఐరోపా సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమ నాయకులకు ఆధారమైనది కూడా ఆ వారసత్వమే. ఆవిధంగా ప్రాక్పశ్చిమాల కూడలి కాగలిగింది స్పెయిన్. క్రమంగా, క్రైస్తవ మతోన్మాద ప్రభావంవల్ల ప్రాచీన సాంస్కృతిక సాంప్రదాయ జ్యోతి కొడిగట్టింది. స్పెయిన్ రాజవంశం క్రొత్తప్రపంచ (అమెరికా) ఐశ్వర్యాన్ని దోచుకొని ఐరోపాలోని అభివృద్ధి నిరోధకశక్తులకు నాయకత్వం వహించింది. ఐనా ఈ నిరంకుశ ప్రభువుల ఆరంభశూరత్వంగా పరిణమించింది. క్రమంగా ఆధునిక ఐరోపాలో స్పెయిన్ వెనుకబడి, 20వ శతాబ్దంవరకూ ఆ మురికికూపంలోనే మ్రగ్గిపోయింది. తరువాత చివికి, చివికి బూర్బన్ రాజవంశం కూలి రిపబ్లిక్ స్థాపింపబడింది. రిపబ్లిక్ జీవితంకూడా మూడునాళ్ళ ముచ్చటై, సైనిక నియంతృత్వం స్థాపింపబడింది. ఆధునిక ఐరోపాలోని ఇతర నియంతృత్వాలకంటె స్పెయిన్‌లో నియంతృత్వం ఎక్కువ రోజులు వర్ధిల్లగలిగింది.

ప్రాచీన స్పెయిన్‌చరిత్రలోగల అభిమానం, నా యాత్ర కేమాత్రం ఆటంకం కలిగించలేదు: నా యాత్ర రష్యాదేశానికి, రష్యాఅంటే విప్లవాత్మక జీవితాన్ని గడుపు

తున్న వర్తమానం; సర్వసమృద్ధమై, పరిపూర్ణమైన జీవితాన్ని వాగ్దానంచేస్తున్నదేశం! ఐనా, మహోన్నతమైన ప్రపంచ విప్లవ కార్యాచరణలో పాత్రధారిని కావటానికి నిర్ణయించిన నాకు, స్పెయిన్‌లోకూడా కొంచెం పనిలేకపోలేదు!

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ జరిపిన ప్రథమ ప్రపంచ మహాసభ పేరుకు మాత్రమే ప్రపంచ మహాసభ! కారణం, ఒక్క జర్మన్ స్పార్టాకిస్టుల ముఠా మినహాయించి, మరే సంస్థకూడా సక్రమంగా ఎన్నుకొన్న ప్రతినిధుల నా సభకు పంపలేదు. అందుచేత ఆ మహాసభలో రష్యన్ బోల్షివిక్కులే ప్రపంచ కమ్యూనిస్టు వ్యవస్థను స్థాపించాలని నిర్ణయించి, ప్రపంచ కార్మికులకు 'రెండవ కమ్యూనిస్టు మానిఫెస్టోను' అందించారు. కాని విప్లవం జరిగిన తరువాత కూడా రష్యా కమ్యూనిస్టులను సోషల్ డెమొక్రాటిక్ పార్టీ లోని 'బోల్షివిక్ ముఠా' అనే వ్యవహరిస్తూ ఉండేవారు! వీరు అందించినదే రెండవ కమ్యూనిస్టు మానిఫెస్టో! యుద్ధకాలంలో "సోషల్ డెమొక్రాట్లు, కార్మికవర్గాన్ని పురికొల్పి సమ్మె చేయించి తద్వారా యుద్ధాన్ని నిలుపు చేయాలి" అని రెండవ ఇంటర్నేషనల్ నిర్ణయించింది. కాని ఈ నిర్ణయానికి విరుద్ధంగా, తమ తమ దేశరక్షణకు సోషల్ డెమొక్రాటిక్ పార్టీలు నిర్ణయించినై. అందుచేత రెండవ ఇంటర్ నేషనల్ నశించిందని దేశాంతరాల్లో తలదాచుకొంటున్న రష్యన్ బోల్షివిక్కులు వాదించారు. వీరి ప్రోత్సాహంతోనే, ఐరోపా రాజ్యాల లోని వామపక్షీయ సోషల్ డెమొక్రాట్లు, రెండు అంతర్జాతీయ సమావేశాలు జరిపారు; "శ్రామికవర్గం రక్షించటానికి, వారి కొక మాతృదేశం అంటూ లేదు; వారు కోల్పోగలది శృంఖలాలే; జయించగలది ప్రపంచం" అని ప్రథమ కమ్యూనిస్టు మానిఫెస్టో చాటిన సిద్ధాంతానికి వత్యిరేకంగా ప్రవర్తించి, శ్రామికవర్గానికి ద్రోహం చేసిన మితవాద (Right wing) సోషల్ డెమొక్రాట్లను ఈ సమావేశాలలో ఖండించారు. ప్రస్తుతం, రష్యన్ బోల్షివిక్కులు తమ దేశంలో అధికారాన్ని వశపరచుకొన్నారు. అందుచే, స్వచ్ఛమైన శ్రామిక అంతర్జాతీయతను పునరుద్ధరించటమే వారి ధర్మం. ఇక ఇంటర్ నేషనల్ కేవలం నిర్ణయాలుచేస్తూ కూర్చో నక్కరలేదు. అపారమైన రష్యా సాధనసంపత్తి సమస్తమూ ఇంటర్ నేషనల్ అధీనమైంది. దానితో, ప్రపంచవ్యాప్తమై, శక్తివంతమైన అంతర్జాతీయ వ్యవస్థను నిర్మించగలదు. "ప్రపంచ విప్లవం వర్ధిల్లటానికై రష్యా శ్రామికవర్గం త్యాగాలు చేయటానికి సిద్ధమే" నని లెనిన్ మహోత్సాహంతో ప్రకటించాడు. ప్రపంచ విప్లవం జరగనిచో ఒక రాజ్యంలో అధికారాన్ని వశపరచుకొనటం వల్ల కలిగే ప్రయోజనం శూన్యం!

మొదటి ప్రపంచ మహాసభ, "కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్‌ను స్థాపించాలని" నిర్ణయించింది; తరువాత సంవత్సరం ఆరు మాసాలకు సమావేశం కావలసిన రెండవ మహాసభ "కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్"కు ప్రారంభోత్సవం జరుపుతుంది. కాబట్టి ఈ రెండవ మహాసభ చరిత్రాత్మకమైన సంఘటన; నిరుపేదల సముద్ధరణకై

చిరకాలంగా జరుగుచున్న పోరాటం చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింప దగిన సంఘటన! అందులో పాల్గొనటమే ఒక మహదవకాశం, గొప్ప గౌరవం. ఐనప్పుడు, "కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్" వ్యవస్థనూ, కార్యక్రమాలనూ, సిద్ధాంతాల స్వరూపాన్నీ నిర్ణయించటంలో భాగస్వామినైన నేనెంతో అదృష్టవంతుణ్ణి!

జారుప్రభుత్వ పతనంతో మితవాత ప్రజాస్వామ్య ప్రపంచం విద్యుత్ప్రేరిత మైనట్లైంది; నిరంకుశత్వ నిర్మూలనంలో సహజమైన పరిణామంగా అక్టోబరు విప్లవానికి జేజేల నర్పించారు; కార్మికవర్గ నియంతృత్వం అనేది సిద్ధాంతంలోనే ఉండిపోయింది గానీ, విప్లవ రష్యాలో గూడా ఆచరణలోనికి రాలేదు. సుమారు సంవత్సరం న్నర వరకూ బోల్షివిక్ రష్యాలో పూర్తి వ్యక్తి స్వాతంత్ర్యం ఈయబడింది. బోల్షివిక్కులు శాంతిని కోరారు. "శాంతి, ఆహారం, భూమి" అనే నినాదాలతోనే వారు అధికారాన్ని కైవసం చేసుకొన్నారు; అందుచే వారిని యుద్ధంలోకి లాగవలసిందేగాని తమకుతామై వారు యుద్ధాన్ని ప్రేరేపించరు. తమ దేశ గౌరవ ప్రతిష్ఠలకు భంగకరమైనప్పటికీ, జర్మన్ రాక్షససైనికవాదం శాసించిన బ్రెస్ట్‌లిటోవ్‌స్క్ సంధికి బోల్షివిక్కులు సమ్మతించటానికి కారణం, వారి శాంతి కాముకత్వమే. తమ కార్యక్రమంలో మిగిలిన రెండు అంశాలను అమలు జరపటానికి వారికి శాంతి అవసరం. కాని రష్యాలోని పాత పాలకవర్గం వారు తమకు లభించిన స్వేచ్ఛను దుర్వినియోగపరిచారు; వారికి, రాయబారవర్గాలద్వారా విదేశ ప్రభుత్వాల రక్షణ లభించ సాగింది. ఈ దుర్వినియోగం లెనిన్ హత్యాప్రయత్నం దాకా పోయింది. అప్పుడే శ్రామిక నియంతృత్వ సిద్ధాంతం, 'అరుణ రక్తపాతం' (Red Terror) గా మారింది; నూతన వ్యవస్థను కూల్చటానికి ప్రయత్నించే విదేశీజోక్యాన్ని ప్రతిఘటించటానికై 'ఎఱ్ఱ రక్షక దళం' (Red Guards) సైన్యంగా రూపొందింది.

'అరుణ రక్తపాతాన్ని' సమర్థించవచ్చు; దానికి కారణాలు కూడా లేక పోలేదు. కాని దానితో ప్రజాస్వామ్య మితవాద ప్రపంచం అక్టోబర్ విప్లవంపట్ల వైముఖ్యం వహించింది. సిద్ధాంతరీత్యా మార్క్సిజాన్ని ఆరాధించినా ఐరోపాలోని సోషల్ డెమోక్రాటిక్ పార్టీలన్నీ మితవాద సిద్ధాంత (Liberalism) సాంప్రదాయాల్లో పుట్టిపెరిగినవే. అందుచేత ఆ పార్టీలు మార్క్సిస్టు సిద్ధాంత ఆచరణను నిరసించి, అక్టోబర్ విప్లవ పరిణామాలు కేవలం రష్యా నిరంకుశత్వం వేసిన వెఱ్ఱితలలే నని ఖండించారు. వాస్తవానికి ఇది హేతుబద్ధమైన విమర్శన కాదు. అందుచేత బోల్షివిక్ రష్యా నాయకత్వంలో పునర్నిర్మింపబడే అంతర్జాతీయ శ్రామిక వ్యవస్థలో సోషల్ డెమోక్రాట్లకు స్థానం లేదు. మరొక విషయం: సాయుధ విప్లవ సిద్ధాంతంలో అంతరిస్తున్న విశ్వాసాన్ని పునరుద్ధరించింది అక్టోబర్ విప్లవం; బోల్షివిక్కులు అల్పసంఖ్యాకులే; కాని పట్టుదల, ఆత్మవిశ్వాసం గలవారు; వారు నడిపిన సాయుధ తిరుగుబాటే అక్టోబర్ విప్లవం. అందుచే ఐరోపా శ్రామికోద్యమంలో ఒక విభా

గానికి విజయాన్ని చేకూర్చిన లెనిన్, ఆతని విప్లవ కారులయుతా, ప్రపంచానికి ఆదర్శ ప్రాయులైనారు. అందుచే ఐరోపాలోని సోషల్ డెమోక్రాటిక్ పార్టీలను, ఉద్యమాలను చీలపేసి వానిలోని విప్లవాత్మక వామపక్షవర్గాలను వేరేపార్టీలుగా రూపొందించటం, క్రొత్తకమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ కార్యక్రమంలో ప్రధానాంశమైంది.

రెండవ ప్రపంచ మహాసభకు పెక్కు దేశాలనుండి ప్రతినిధులు రాగలరను కొంటున్నారు. రెండవ ఇంటర్ నేషనల్‌లో ప్రముఖపాత్ర వహించిన జర్మన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ, యుద్ధాంతానికి రెండుగా చీలిపోయింది. అందలి వామపక్షీయులు 'స్వతంత్ర డెమోక్రాటిక్ పార్టీ' స్థాపించారు; వీరు రెండవ మహాసభకు ప్రతినిధివర్గాన్ని పంపటానికి అంగీకరించారు. ఇతర దేశాలలోని ప్రముఖ సోషలిస్టు నాయకులు కూడా హాజరు కాగలరని అనుకొంటున్నారు. ఫ్రెంచి సోషలిస్టులైన మార్సెల్, కాషిన్-పాల్, ఫ్రాస్సార్డ్; ఇటాలియన్ సోషలిస్టు సెర్రాటి వారిలో అగ్రగణ్యులు. ఇక స్పెయిన్ సోషలిస్టుపార్టీ చిన్నదైనా, దేశవ్యవహారాలలో ఎక్కువ పలుకుబడి లేకపోయినా, అంతర్జాతీయంగా మంచి ప్రతిష్ఠ నార్జించింది. అందుకు కారణం పార్టీనాయకుడైన ఇగ్లీషియస్; సోషలిస్టే ఐనా ఇగ్లీషియస్ ఐరోపా మితవాద ప్రజాస్వామ్య తత్వవేత్తగా కూడా పేరు పొందినవాడు. (లిబరలిజం అనే మాట స్పెయిన్‌లో జన్మించినదే) ఇగ్లీషియస్‌ను కలుసుకొని ప్రపంచ మహాసభకు హాజరయ్యేటట్లు చేయటమే స్పెయిన్‌లో నే నిర్వహించవలసిన విధి. మాస్కోలో జన్మించే మూడవ కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్‌ను ఇగ్లీషియస్ ఆశీర్వదించితే, అక్టోబర్ విప్లవంపట్ల ప్రజాస్వామ్యదేశాల్లో ఉన్న వైరుధ్యం తొలగిపోతుంది. కాని, నా యువక ఉత్సాహానికి ఇగ్లీషియసు 'కొరకరాని కొయ్య'గా కన్పించాడు. ఆతడు ప్రాచీన హేతువాద మహాపర్వతం. నేను క్రొత్తగా మతం పుచ్చుకొన్న యువకోత్సాహం. నా విశ్వాసం ఆ పర్వతాన్ని కదలింపలేక అది కేవలం హేతువాద బురఖా వేసిన అభివృద్ధి నిరోధకశక్తి అని భ్రాంతి చెందింది. నా ధోరణి ఇగ్లీషియస్‌కు ఆశ్చర్యాన్ని కలిగించింది. ప్రాచీన విజ్ఞాననిధియైన భారతదేశంలో జన్మించిన యువకుడు, బోల్షివిక్ రక్తపాత సిద్ధాంతాన్ని సమర్థించటమా? ఇది, ఒక వింత పరిణామం అన్నాడు; కాలం గడిచినకొలదీ గ్రహించాను. "మంచి స్వభావంతో కూడిన అనుమానమే, ప్రతి మితవాదిలోనూ కన్పిస్తుంది; విశ్వాసంవల్ల జరిగేదేమీ లేదు." జాలీ, విషాదమూ కూడిన మందస్మితంతో నూతన సిద్ధాంతోన్మాదానికి బలియైన నన్ను సాగనంపాడు ఇగ్లీషియస్; కోపం పట్టలేక పోయాను. వృద్ధాప్యంతో ఇగ్లీషియస్ బుద్ధి చలించి పోయింది అనుకొన్నాను; చాల పెద్ద పొరపాటు!

హేతువాదంలో స్థితప్రజ్ఞుడైన ఇగ్లీషియస్‌ను నూతన విప్లవమతంలోకి మార్చ లేకపోవటంతో నాకు నిరుత్సాహం కలగలేదు. నా పొదిలో బాణాలు చాలా ఉన్నై. స్పెయిన్ నుండి ప్రపంచ మహాసభకు ప్రతినిధులను తీసుకు పోగలననే విశ్వాసం చెదర

లేదు. అరాజక సిండికలిస్టులకు కేంద్రమైన బార్సిలోనాకు వెళ్లితే నా ఆశయం ఫలిస్తుంది. కాని బార్సిలోనాకు వెళ్ళేముందు మాడ్రిడ్‌లోనే వామపక్ష సోషలిస్టులను కలిసికొని వారిని ప్రోత్సహించాలి. మెక్సికోలో ఉన్న రోజుల్లోనే వీరి నాయకులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాణ్ణి. వీరే స్వయంగా, రష్యా వెలుపల స్థాపింపబడిన ప్రథమ కమ్యూనిస్టుపార్టీని అభినందిస్తూ శుభాకాంక్షలు పంపారు. కాని ముందుగా ఇగ్లీషియస్‌ను చూచినందుకు వారికి నాపై కోపంగా ఉంది. వారి దృష్టిలో ఇగ్లీషియస్ మూర్తీభవించిన వృద్ధ ప్రతీపగామి; నన్నాతడు స్పానిష్ పోలీసులకు పట్టించి, జిబ్రాల్టర్ పంపి అక్కడ బ్రిటిష్ అధికారులకు అప్పగించవచ్చు! నేనూ పాత కుట్రదారునే, కాని వారి అనుమానాలు నాకెంతో వింతగా తోచినై. చివరకు వారిలో కొందర్ని రహస్యంగా కలుసుకున్నాను. వారంవరూ శ్రామికవర్గానికి చెందినవారే. సోషలిస్టుపార్టీలో ఇగ్లీషియస్‌కు పలుకుబడి లేదనీ, సోషలిస్టులలో చాలమంది తమతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మహాసభకు హాజరు కాగలరనీ నాకు హామీ ఇచ్చారు.

స్పెయిన్‌లో పని పూర్తయింది: కాని మాడ్రిడ్‌లో కొన్ని రోజు లుండవలసి వచ్చింది. మెక్సికో గుండా బొరొడిన్ దగ్గరనుంచి ఒక వర్తమానం రావాలి. ఆ జాబు సంకేతాక్షరాల్లో ఉంటుంది. చివరకు జాబు వచ్చింది; అనుకొన్న ప్రకారం సున్నాల్లో వ్రాయబడింది; ఆ జాబు అడుగున మెక్సికో కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి సంతకంతో షరా ఒకటి వ్రాయబడింది :

"మొదటి సాంకేతికాల వివరణ పోవటంవల్ల, క్రొత్త సాంకేతికాలలో జాబు వ్రాయవలసి వచ్చింది; దీనికి వివరణ ఇందులోనే పంపబడింది". నాలో నేనవ్వుకొని కోపాన్ని అణచి వాకింగ్‌స్టిక్ కొనటానికై బజారుకు ప్రయాణమైనాను.

వాకింగ్‌స్టిక్ కొనటం అంత సులభంగా నెరవేరలేదు; నా ఎత్తుకు తగిన పొడవైన వాకింగ్‌స్టిక్ లభించటానికి ప్యూర్టా డెల్‌సోల్ చివరిదాకా నడవవలసి వచ్చింది. స్పానియార్డులు యుద్ధవీరులజాతి; ఈ నాటికి గూడా గుఱ్ఱపు స్వారిలో వారిదే అందెవేసిన చేయి. కాని నాకు గలిగిన అనుభవాన్నిబట్టి గ్రహించగలిగిందేమంటే స్పానిష్ ఉన్నతవర్గీయులైన పురుషుల్లో ఆరడుగులు మించిన ఎత్తున్నవారే లేరు. చివరకు రాయల్ పాలెస్ (రాజ అంతఃపురము) సమీపంలోనున్న షాపులలో నాకు కావలసిన వస్తువు లభించింది. వెంటనే 'టాక్సీ' తీసుకొని హోటలుకు తిరిగి వెళ్ళాను. టాక్సీ డ్రైవరుకు డబ్బుచెల్లిద్దామని జేబుచూచాను; సంచి (Wallet) లేదు. పిడుగు పడ్డట్లైంది. నాదగ్గిరున్న పైకం అంతా అందులోనే ఉంది; ఐనా మెక్సికో బ్యాంకుకు వ్రాసి క్రొత్త చెక్కుపుస్తకానికి యేర్పాటుచేసి కోవచ్చు; కాని దానికి చాలకాలం పట్టవచ్చు; బెర్లిన్ చేరటం ఆలస్యమై పోతుంది. ధనరూపంలో కొంద్ఘు

వేల డాలర్లు కూడా ఆ సంచిలోనే ఉన్నై. మాడ్రిడ్‌లో పూర్తిగా చిక్కుబడిపోయి నట్లే. అది అలాఉంచి అన్నిటికంటె ముఖ్యమైన 'ప్యాస్ పోర్టు' ఆ సంచిలోనే ఉంది. నన్ను ఋజువుచేయగల ఇతరపత్రాలేమీ లేకపోవటంవల్ల, మాడ్రిడ్‌లోని మెక్సికో రాయబార కార్యాలయంనుండి మరొక ప్యాస్‌పోర్టు సాధించటం దుర్లభం. ఇక్కడ క్రొత్తగా లభించిన మిత్రుల దగ్గిర అప్పుగా కొంత డబ్బు సాధించవచ్చు గాని ప్యాస్‌పోర్టు లేనిదే క్షణం గడవటం కష్టం. ఆ రోజుల్లో విదేశీయులు వారం వారం పోలీసుల దగ్గిర రిజిస్టర్ చేయించుకొనవలసిన అవసరం ఉండేది.

వాకింగ్ స్టిక్ కొన్న షాపులోనే సంచి పోయిఉండాలి; సంచి టాక్సీలో లేదు; టాక్సీదిగి షాపులోనికి వెళ్ళేలోపల ఎంతసేపని జేబుదొంగైనా దాన్ని సంగ్రహించలేడు. అందుచే షాపు కౌంటర్‌లోనే సంచి మరచి ఉంటాననటాని కేమాత్రం అనుమానం లేదు; కాని ఇంతవరకూ అక్కడఉంటుందా? అనేనా అనుమానం. ఎవరో ఒకరు సంగ్రహించి ఉండవచ్చు. ఐనా మీనమేషాలు లెక్కిం చటం వల్ల ప్రయోజనంలేదు. టాక్సీ ఎక్కి నేరుగా షాపుకు వెళ్ళాను. షాపులో ప్రవేశించానోలేదో యజమాని సంచి నా ముందుంచాడు. ఆమర్దాగా తీసికొని ప్యాస్ పోర్టు ఉందోలేదో చూస్తున్నాను. షాపు యజమాని నవ్వుతూ నాముందు నిలబడి ఉన్నాడు, కృతజ్ఞతాభివందనలు ఆశిస్తూ. నా ఖంగారులో కృతజ్ఞత చెప్పటం మర చాను; యజమాని బాధపడ్డాడు. అతని ముఖంలో నవ్వు మాయమై గాంభీర్యం అలముకొన్నది. ఘనీభవించిన ఉక్కునుకూడా కోసివేయగల స్వరంలో అన్నాడు; "మీ డబ్బును జాగ్రత్తగా లెక్కపెట్టుకోండి; స్పానియార్డులు దొంగలుకాదు". క్షమాపణకోరుతూ అవమానకరమైన నా ప్రవర్తనకు పంజాయిషీ చెప్పుకొన్నాను. కాని నా మాట లాతని కేమాత్రం సంతృప్తిపరచినట్లులేదు. అప్పటి నా పరిస్థితి ఎవరికీ అర్థంకాదు. రెండువేల డాలర్లకంటె ఒక కాగితంముక్క విలువైనదని ఎవ రైనా విశ్వసించగలరా?

రెండురోజుల తర్వాత మాడ్రిడ్‌నుండి బార్సిలోనా వెళ్ళాను. అక్కడినుండి జినోవాకు నౌకలో ప్రయాణంజేయాలి. ఇప్పటికి మిలాన్, జూరిచ్‌లగుండా బెర్లిన్ చేరటమే నాలక్ష్యం.

## జర్మనీలో

### బెర్లిన్ చేరాను

నాలుగుసంవత్సరాలకు పూర్వం బెర్లిన్‌యాత్ర ప్రారంభించాను; ఈలోగా బెర్లిన్‌నగరమే నా గమ్యంకాదని తేలిపోయింది; ఐనా 1919 చివర్లో బెర్లిన్‌చేరాను. ఆయుధాలకొరకు మాత్రంకాదు. U. S. A. మెక్సికోలలోని అనుభవాలవల్ల, విప్ల

వాన్ని గురించిన నా భావాలే విప్లవాత్మకం కాగలిగినై. ఇంతలో ఇండియా తిరిగి వెళ్ళాలనే కోరికకూడా లేదు.

"విప్లవాలు, అవసర పరిస్థితుల ఫలితంగానే జరుగుతై; అందు వ్యక్తుల ప్రమేయం లేదు." అనేదే నా క్రొత్త విశ్వాసం. నూతన సాంఘిక శక్తుల సంఘర్షణ వల్లనే విప్లవాలు జరుగుతై, సాంఘికశక్తుల వికాసమే విప్లవానికి కారణం. ఆ ప్రాథమిక పరిస్థితి ఉత్పన్నం కాకముందు జరిపే సాయుధతిరుగుబాట్లు విఫలం కాక తప్పదు. ప్రస్తుత సాంఘిక వ్యవస్థకు విరుద్ధమైన సాంఘికశక్తులను, రాజకీయంగా సంఘటిత పరచి, తద్వారా విప్లవ సైన్యంగా రూపొందిన తరువాతనే ఆయుధాల అవసర మేర్పడుతుంది.

పూర్వం, అంటే ఇండియాలో ఉన్న రోజుల్లో, మాదంతా తలక్రిందుల వ్యవహారం; నాటి విప్లవ భావాలు, ఆయుధాలకే అత్యంత ప్రాధాన్యత నిచ్చేవి; 'ఆయుధాలు లభిస్తే విప్లవం జరిగినట్లే' అని మా ఉద్దేశ్యం; కాని ఆయుధాలను ప్రయోగించగల సైనికులను సమకూర్చి, వారికి శిక్షణనీయాలనే ఆవశ్యకతను గుర్తించ లేదు; రహస్య సంఘాలలోని కొద్దిమంది సభ్యులు బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోయ టానికి సమర్థులా? అని కూడా ఆలోచించలేదు.

నూతన దృక్పథంతో విప్లవాన్ని గురించి ఆలోచించినకొలదీ తొందరపడి ఇండియాకు వెళ్లటంలో అర్థం లేదనిపించింది. ఇండియానుండి వస్తున్న స్వల్పవార్తలను బట్టి కొన్ని విషయాలను గ్రహించ గలిగాను. యుద్ధంవరకూ బ్రిటిష్ వ్యతిరేక జాతీయోద్యమం కేవలం రాజకీయంగా నడిచేది. యుద్ధంవల్ల యేర్పడిన ఆర్థిక మానసిక పరిస్థితులవలన సాంఘిక రాజకీయోద్యమం వెనుక సాంఘిక అసంతృప్తి పెచ్చుపెరగ సాగింది. అంటే మార్క్సు సిద్ధాంతంప్రకారం, యుద్ధకాలంలో ఆర్థిక దోపిడికి గురియైన గ్రామప్రాంతాలలో వర్గసంఘర్షణ ప్రారంభమైంది. విప్లవాత్మకమైన రాజకీయ చైతన్యంతో సాంఘిక అసంతృప్తి తీవ్రతరమౌతుంది. యుద్ధానంతరం నిరుద్యోగులై, విదేశాలలో గడించిన అనుభవాలతో ఇండ్లకు మరలిన సైనికుల ప్రభావంవల్ల సమాజం లోని అసంతృప్తి మరింత రెచ్చిపోతుంది. ఈ విధంగా మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించిన ఇండియాలోని విప్లవ పరిణామాలను, ప్రగతినీ గురించి రెండు సంవత్స రాల తరువాత 'India in transition' అనే గ్రంథం వ్రాశాను.

కాలం గడచినకొలదీ ఇండియాలో నిద్రాణమైయున్న అసంతృప్తి ఘనీభవించి విప్లవశక్తిగా రూపొందగలదని, మెక్సికోలో ఉన్నప్పుడే భావిస్తూ ఉండేవాణ్ణి. అది ఎవ్వరూ ఆపలేని పరిణామం. యుద్ధానంతర ఆర్థిక వికాసంవల్ల త్వరలో ఆ పరిణామం జరిగి తీరుతుంది. అంతేగాని తొందరపాటుతో జరిపిన విప్లవాత్మక రాజకీయ చర్యలు ఆ పరిణామానికి ఆటంకం కావచ్చు. సంకుచితమైన కేవల రాజకీయ జాతీయ

వాదంలో నాకు శ్రద్ధ నశించింది; ప్రజా ఉద్యమ సహకారం లేనిదే, మధ్యతరగతి జరిపే ఆందోళన నిష్ప్రయోజనమనే విశ్వాసం, అంటే ఇండియాలో సాంఘిక విప్లవం తప్పనిసరి అనే విశ్వాసం కలిగింది. సాంఘిక విప్లవవికాసంలో ఒక దశయే జాతీయ స్వాతంత్ర్యం! ఇండియాలో ఇటువంటి అనుకూల పరిస్థితులు లేర్పడేలోగా మెక్సికో సాంఘిక విప్లవంలో పాల్గొనే మహదవకాశం లభించింది. దానివల్ల సమయం వచ్చినపుడు భారతీయ విప్లవంలో నా పాత్రను సంతృప్తికరంగా నిర్వహించే తాహతు నాకు గలిగింది.

జన్మభూమిని అభిమానించటం నైతిక ధర్మమనే మూఢవిశ్వాసం ఎప్పుడో అంతరించింది. వాస్తవానికి ఒకటే దేశంలో జన్మించటమనేది మన ఇష్టానిష్టాలతో ప్రమేయం లేని సంఘటనేగదా! విప్లవ పవిత్రదేశాన్ని దర్శించాలనే అభిలాష జనించనట్లయితే, మెక్సికోలోనే ఉండిపోయేవాణ్ణేమో! మార్గమధ్యంలో బెర్లిన్ వచ్చాను. ఇక్కడికి రావాలని మూడు సంవత్సరాలక్రితం చాల ఆరాటపడ్డాను. అప్పుడు నా యాత్రకు గమ్యం బెర్లిన్ నగరమే! ఈనాడు, భారతీయ విప్లవకారుల కిది మక్కా (పుణ్యతీర్థం) కాదు. నాటి కార్యక్రమంలో విశ్వాసం నశించినా, బెర్లిన్ రావటంలో నా కేమాత్రం ఆశాభంగం కలగలేదు.

1918 చివర్లో పశ్చిమరంగంపై జర్మన్ ప్రధాన సైన్యం విరిగిపోవటంతో లూడెన్ డార్ఫ్ 'లావొక్కింతయు లేదు' అన్నాడు; శాంతి సంప్రదింపులు ప్రారంభించవలసినదిగా కెయిజర్‌కు హిండెన్‌బర్గు సలహా యిచ్చాడు. నాటివరకూ అజేయం అని ప్రపంచం విశ్వసించిన జర్మన్ సైనికబలం, పరాజయంతో విచ్ఛిన్నమైంది. ఐరోపాను గడగడలాడించిన యుద్ధోన్మాది కెయిజర్ ప్రాణభీతితో చేజిక్కిన ధనాన్ని ప్రోగుచేసికొని తటస్థరాజ్యమైన హాలెండు పారిపోయినాడు. యుద్ధకాలంలో జలాంతర్గాములు వినా, మిగిలిన జర్మన్ నౌకాబలమంతా 'కేల్ హార్బర్'లో సురక్షితంగా ఉంది. 1918 అక్టోబర్‌లో జర్మన్ సైన్యం పశ్చిమరంగాన్ని రక్షించటం సాధ్యం కాదని లూడెన్ డార్ఫ ప్రకటించటంతో, జర్మన్ నౌకాదళోద్యోగులు బ్రిటిష్ నౌకాదళంతో 'ఆ మరణాంతం పోరాడి' తమ దేశప్రతిష్ఠను కాపాడ నిర్ణయించారు. కాని ఈ గౌరవ మరణానికి సమ్మతించని నావికులు తిరుగుబాటొనర్చి 'మారణ నౌక' (The death cruise)ను నిలిపి వేశారు. పతాక నౌకమీద ఎఱ్ఱబావుటా ప్రతిష్ఠించబడింది. నవంబర్ 9వ తారీఖున నావిక తిరుగుబాటుదారులు నౌకలను వీడి కార్మికులతో కలసి బ్రహ్మాండమైన ప్రదర్శనం జరిపారు. ఆ విధంగా ప్రారంభమైన విప్లవం, కార్చిచ్చులాగా ఉత్తరరేవు పట్టణాలకూ, పారిశ్రామిక కేంద్రాలకూ విస్తరించింది. అదే రోజున బెర్లిన్‌లో సైనికులు కాల్పులు జరపటానికి నిరాకరించి ప్రజాప్రదర్శనలో పాల్గొన్నారు. సాయంత్రం, కార్మికులు, సైనికులు, నావికులు - కలిసిన ప్రజాసమూహం చక్రవర్తి ప్రాసాదం ముందు చేరారు. అత్యంత విశ్వాసపాత్రులైన

సైనికదళం ప్రాసాదానికి కాపలా కాస్తున్నది. కాని మరుక్షణంలో వారు కూడా అస్త్రసన్యాసం చేసి ప్రదర్శనలో, ఎఱ్ఱజెండాల మహారణ్యంలో కలిసి పోయారు. ఆ క్షణంలోనే కెయిజర్ రాజ్యత్యాగమూ, పలాయనమూ ప్రకటింపబడినై.

విచ్ఛిన్న ప్రభుత్వ భారాన్ని తాత్కాలికంగా వహించటానికి సోషల్ డెమోక్రాటిక్ పార్టీ సన్నద్ధమౌతున్నది; ఈ పార్టీ నాయకులు ఫ్రిట్జ్ ఈబర్ట్, ఫిలిప్ షీడ్‌మన్. ఈబర్ట్ ఒకప్పుడు జీనులు కుట్టేవాడు; జారు ప్రభుత్వంలోని మితవాద సభ్యులు, సోషల్ డెమోక్రాటిక్ పార్టీని బలపరుస్తున్నారు. ఈ పరిస్థితిలో స్పార్టాకిస్టు నాయకుడైన కారల్ లీబ్నిట్ జైలునుండి విడుదలై, చక్రవర్తి ప్రాసాదం బాల్కనీనుండి రష్యా నమూనాలో సోవియట్ రిపబ్లిక్ స్థాపనను ప్రకటించాడు. ప్రాసాదంక్రింద చేరిన అపూర్వ ప్రజాసమూహం, ఆ ప్రకటనకు జయజయ ధ్వానాలు చేసింది. అంతఃపుర రక్షకభటు డొకడు చక్రవర్తి ఎఱ్ఱశాలువాను తన ఈటెకు చుట్టి బాల్కనీపై ఎఱ్ఱజెండా ఎగుర వేశాడు!

అదే సమయంలో రీచ్‌స్టాగ్ భవనంలో ప్రధాని మాక్స్‌మాన్ బేడెన్, అధికారాన్ని ఈబర్ట్‌కు దత్తం చేస్తున్నాడు, యువరాజు నాయకత్వాన సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వాన్ని స్థాపించే నిమిత్తమె. కాని ఆ కార్యక్రమం పూర్తిగాక పూర్వమే సాయుధులైన శ్రామికులు కొంద రా భవనంలో ప్రవేశించి షీడ్‌మనును బైటికి లాక్కొని వచ్చి ప్రజాసమూహంతో మాట్లాడ వలసినదిగా ఆదేశించారు. సోషల్ డెమోక్రాట్లు హింసా, నిరంకుశత్వాలకు వ్యతిరేకులు; కాని స్పార్టాకిస్టులు బోల్షివిక్ ప్రభుత్వాన్ని ప్రకటించారు. అందుకు ప్రతిచర్య చేస్తేగాని తన పార్టీకి భవిష్యత్తు లేదు; ఈబర్ట్ రాజ్యాంగబద్ధమైన రాచరికంతో తన పార్టీని రాజీ పరుస్తున్నాడు. ప్రజలు అందుకు వ్యతిరేకులు షీడ్‌మన్‌కు గత్యంతరం లేకపోయింది. ధైర్యంగా ప్రకటించాడు: "జర్మన్ రాచరికం నశించింది. రిపబ్లిక్ స్థాపింపబడింది. జర్మన్ రిపబ్లిక్ జిందాబాద్!"

ఇంకా, అరుణ విప్లవ తరంగాలు రాజధానిని ముంచెత్తటం మానలేదు. వాటి ధాటికి సోషల్ డెమోక్రాటిక్ నాయకులు భయభ్రాంతు లౌతున్నారు. తమ ప్రభుత్వ కార్యస్థానాన్ని బెర్లిన్‌నుండి 'కాసెల్'కు మార్చాలని సంకల్పించారు. అక్కడే పరాజయం పొందిన జర్మన్ సామ్రాజ్య సైనిక కార్యాలయముండేది. లూడెన్‌డార్ఫ్ మాత్రం మ్యూనిచ్ చేరాడు. అతడు వృద్ధ జంబుకం; విప్లవంపై పైశాచిక పు ఎత్తులన్నీ ఆలోచిస్తున్నాడు. హిండెన్‌బర్గ్ మాత్రం సైనికోద్యోగులను చుట్టూ చేర్చుకొని. బెర్లిన్‌లోని పరిణామాలను శ్రద్ధగా తిలకిస్తూ కాసెల్‌లోనే ఉన్నాడు.

1919 సంవత్సరం పొడుగునా జర్మనీలో శాంతి మృగ్యమైంది - విప్లవము, దాని తరువాత భయంకరమైన అంతర్యుద్ధం, నేను బెర్లిన్ చేరేటప్పటికి వార్సాయిల్స

సంధిపై సంతకాలు జరిగి, వీమూర్ రాజ్యాంగం ఆధారంగా శాంతి నెలకొల్పబడింది; కాని శాంతిభద్రతలకు అపాయాలు పూర్తిగా తొలగిపోలేదు. చార్లిమేన్, ఫ్రెడరిక్ మున్నగు మధ్యయుగ విజేతల ప్రసిద్ధ సాంప్రదాయాలకు వారసుడై, రోమన్ సీజర్ల కీర్తికి అర్రులుచాచిన కెయిజర్ విలియం చక్రవర్తి స్థానంలో జీనుకుట్టిన ఈబర్ట్, రిపబ్లిక్ అధ్యక్షుడైనాడు! బిస్మార్కు ప్రభువు స్థానంలో మధ్యతరగతి విజ్ఞానియైన ఫిలిప్ షీడ్‌మన్ జర్మనీ ప్రధానియైనాడు. వీరందరిపైన వార్సెయిల్స్ సంధి ప్రకారం, నిరాయుధీకరణ షరతును అమలు పరచటానికై యేర్పడిన మిత్రమండలి కమీషన్ ఒకటి; దీని కార్యాలయం బెర్లిన్‌లోనే నెలకొల్పబడింది; ఇది చలాయించే అధికారానికి అంతు లేకుండేది.

ఈ పరిస్థితులలో, నిరాశా నిస్పృహలు; పరాభవంవల్ల కల్గిన క్రోధద్వేషాలు, ప్రతీకార వాంఛలతో జర్మన్ మనస్తత్వం నిండియుండటం సహజం. ఒకవైపు అత్యవసర వస్తువులు లభింపక దుర్భర దారిద్ర్యంతో బాధపడే ప్రజానీకం; మరొక వైపు షాపుల్లో అద్దాల బీరువాలలో నుండి తొంగిచూచే విలాసవస్తుసామగ్రి; పరిసరాల్లో గుట్టలుగా పడిఉన్న చెత్త చెదారం; బద్దలైన కిటికీలు, తుపాకీ గుండ్లతో బొక్కలు పడ్డ గోడలు, గోతులతో నిండిన వీధులు, చప్పుడుచేస్తూ నడిచే తుక్కు టాంకర్లు. వీటి నన్నిటినీ మించిన దృశ్యం: మిలటరీ దుస్తుల్లో కాళ్ళూ చేతులూ పోయి, వికృతాకారాలతో బజార్లవెంట తిరిగే బిచ్చగాండ్రు; వీరిలో చాలమందికి 'షెల్ షాక్' తగిలిందని వారి పటుత్వం లేని నరాలే చెబుతున్నై. అంగవైకల్యం వల్లనో, భిక్షావృత్తి అవమానభారంవల్లనో పలువురు మాట్లాడలేక పోతున్నారు. క్రూరయుద్ధానుభవానికి నిలిపిన చిహ్నాలుగా నిశ్శబ్దంగా వీధులవెంట బారులు తీర్చి కూర్చున్నారు. కవుల, చరిత్రకారుల భావాలకు, రచనలకు, ఉత్సాహాన్నిచ్చి, ఆధునిక సైనికవాదాన్ని రెచ్చగొట్టిన మధ్యయుగ ట్యుటానిక్ యుద్ధవీరుల విగ్రహాలిరువైపులూ నిలిచిన సుప్రసిద్ధ సీగెస్సాలెక్ (విజయ రాజమార్గం) కీ, ఈ దృశ్యానికీ ఎంత వ్యత్యాసం! వాస్తవానికి ఈ దృశ్యంలోని అమానుషత్వాన్ని దూషిస్తున్నట్లున్నై, ఇతర వీధుల జుగుప్సాకర దృశ్యాలు! వికలమైన అంగాలతో చెదిరిన మనస్సులతో వీధులవెంట తిరుగు వీరే భావికమ్యూనిస్టులు! 'పితృభూమికై నేను పోరాడాను.' అనే వ్రాతలున్న అట్టలను మెడల్లో ధరించారు కొందరు ధైర్యవంతులు. కొందరు పెనిసిళ్లు, లేసులు మొదలైన వస్తువులు అమ్ముతున్నట్లు నటిస్తున్నారు. కారణం జర్మనీలో బహిరంగ భిక్షాటనం నిషిద్ధం!

బెర్లిన్ చేరేసరికి సాయంత్రమైంది; లైట్లు గ్రుడ్డిగా వెలుగుతున్నై. నగరం మీద మంచు దుప్పటికప్పినట్లుంది. వీధులనిండా చెత్త, మురుగునీటి కన్నాలను కప్పివేసింది. బోరోడిన్‌తో చేసుకొన్న యేర్పాటు ప్రకారం 'హోటల్ ఫ్యూర్ స్టెన్ హాఫ్'కు వెళ్ళాలి. అది నగరంలోని రాకపోకల రద్దీకి కీలకమైన పోట్స్ డామర్

ప్లాట్జ్‌లోని పెద్ద హోటల్ ఒకటి. స్టేషన్ చాల పెద్దది; మసక మసకగా ఉంది; స్టేషన్‌నిండా జర్మన్, మిత్రమండలి సైనికోద్యోగులే; పరాజయ అవమానంతో జర్మన్ సైనికులు తలదించుకుని తయారైనారు; మిత్రమండలి సైనికోద్యోగులు పచార్లు చేస్తూ పోతున్నారు. అంతర్జాతీయ సైనిక కులంలో పరస్పరం, గౌరవ మర్యాదలతో వ్యవహరించటం సాధారణ ఆచారం.

స్టేషన్ బైటనున్న కొంటి టాక్సీ లన్నిటినీ సైనికోద్యోగులే ఆక్రమించారు; బంగారు పతకాలూ, రిబ్బన్లు ధరించిన ఉన్నతోద్యోగులది పైచేయి. బెర్లిన్ ఇంకా సైనికాధికారుల స్వర్గంగానే ఉంది. నేనొక సాధారణ వ్యక్తిని; అనామక విదేశీయుణ్ణి; నాకు లభించినది ఒక జట్కాబండి; సీలల పటుత్వం తప్ప ఊగిసలాడుతున్న బండి; చివికిన ఎముకలపై రోమాల్లేని చర్మాన్ని కప్పుకున్న గుర్రం; ఆ గుర్రం ఎంత సేపు స్వయంగా కాళ్ళమీద నిలబడగలదో అనుమానం. దగ్గిర సామాన్లేమీ లేక, హోటలుకు త్రోవ తెలిసిఉంటే నడిచి వెళ్ళటమే శ్రేయస్కరం. కాని ఆ బండిని మాట్లాడక తప్పలేదు. నిర్దాక్షిణ్యమైన కొరడా దెబ్బల ధాటికి తట్టుకోలేక, అంతకంటె, నడవటమే హాయి అని గుర్రం కుంట సాగింది. మా అందరి అదృష్టం బాగుంది; హోటల్ అరమైలుకు లోపుగానే ఉంది; పావుగంటలో నా సామాన్లతో బాటు నన్నా హోటల్ ముందు కూలేసింది.

ఆ హోటల్ నాలుగంతస్థుల భవనం; గాజు తలుపులోగుండా వరండా (లాబీ) కన్పిస్తున్నది; దాన్నిండా సైనికోద్యోగులు ముసిరియున్నారు. కొంచెం తటపటాయించి నౌకర్ని నా సంచులు తీసికొమ్మని అడిగాను. సాధారణ పౌరుణ్ణి, సీలమండలదాకా బురదతో నిండి 'న్యుమోనియా' వస్తుందనే భయంకూడా లేకుండా బయట నిలబడ్డాను. నామీద అతనికేం గౌరవం? 'హోటల్లో ఖాళీ లేదు' అంటూ తల త్రిప్పుకున్నాడు. నాకు కోపం వచ్చింది; వాడూ సైనికుడే; వాణ్ణి ప్రక్కకు నెట్టి లోపల ప్రవేశించాను; మానేజరు కౌంటర్ దగ్గిరికి వెళ్ళి ఫ్రెంచి భాషలో బిగ్గరగా అడిగాను: "నేనొక తటస్థరాజ్య పౌరుణ్ణి; ఇప్పుడే బెర్లిన్ వస్తున్నాను; నాకీ హోటల్లో ఒక గది కావాలి." అక్కడున్న పెద్ద మనుష్యుల్లో కొందరు "ఎవరా ఈ పౌరుబోతు" అన్నట్లు చూచారు. అందులో ఒకరు నన్ను సమీపించి నా జాతీయతను గురించి ప్రశ్నించాడు. 'మెక్సికన్' అని ఒకే ఒక మాటలో సమాధానం చెబుతూ ప్యాస్‌పోర్ట్ గుమాస్తా ముందుంచాను; దాంతో తలతిరిగి, సైనికోద్యోగి గుమస్తాతో అన్నాడు: "ఈ పెద్దమనిషికి ఎలాగో యేర్పాటుచెయ్". గుమాస్తా ధోరణికూడా మారింది, మర్యాదగా ఆ రాత్రికి సాధ్యం కాదని క్షమాపణ చెప్పకున్నాడు. మరునాటి ఉదయానికి ఒక గది ఖాళీచేసి యిస్తానని వాగ్దానం చేశాడు. హాలు నౌకరును పిలిచి ఆ రాత్రికి జాగా చూడమని చెప్పాడు.

హోటలు నౌకరే ఆ రాత్రికి నా సంరక్షకుడు! మధ్యవయస్సులో చాల లావుగా ఉన్నాడు. ఫ్రాక్ కోటు తొడుక్కున్నాడు; ఆ కోటు అంచులకు బంగారురిబ్బన్లు. దయతో, మర్యాదతో మాట్లాడుతూ కౌంటర్ దగ్గరకు తీసికొని వెళ్ళి—

"నీవు భారతీయుడవా!" అని అడిగాడు.

"ఔను; మెక్సికోనుండి వస్తున్నాను" అంతటి మిత్రవాత్సల్యంతో ప్రశ్నించిన అతనితో అబద్ధం చెప్పలేకపోయాను.

"మనం మిత్రులం; జర్మనీ అజేయం!" అంటూ గొణిగాడు.

నా సామాన్లు జాగ్రత్త చేయమని తన నౌకరుని ఆజ్ఞాపించాడు. చిన్న చేతి సంచితో నేను దగ్గిరలోనున్న భోజనశాలలో ఆరాత్రి గడపాలి. అక్కడ గది దొరుకుతుంది. ఆ హోటలే నా స్వర్గం! ఈ నౌకరే నా పాలిటికి సెయింట్ పీటర్. గాయపడిన తన హృదయాన్ని విప్పి చూపించాడా సెయింట్ పీటర్; అతని రక్త నేత్రాలలో భయంకర విద్వేషం బుసలు కొడుతోంది. నాతో అన్నాడు: "మిత్ర మండలి కంట్రోల్ కమిషన్ కార్యాలయం ఈ హోటల్లోనే నెలకొల్పారు. ఈ విదేశ పిశాచాలు తామే అధిపతులమనే ధోరణిలో వ్యవహరిస్తున్నారు; హోటల్లో గదు లన్నిటిమీదా వారికి హక్కు ఉంది. (Lien); వారెప్పుడు కోరితే అప్పుడు యివ్వ టానికి వీలుగా చాలా గదులు ఖాళీగా ఉంచాలి; అందుచే మానేజర్ సాధారణంగా సుప్రసిద్ధ వ్యక్తి ఐతే గాని పౌర అతిథులకు గదులివ్వడు. ఐనా మీకు తప్పక గది కేటాయిస్తాడు; గుమస్తాకు కొంచెం సొమ్మియిచ్చి పొండి; పాపం బీదవాడు!" అతని ఆంతర్యం బోధపడింది; వారిద్దరు పంచుకొనటానికి వీలుగా ఐదు డాలర్లనోటు చేతిలో ఉంచాను. "డాలర్లా!" గుమస్తా కండ్లలోని చిరునవ్వు ఆనందాన్ని ప్రకటించింది. నన్ను నౌకరుకు అప్పగించారు; ఉన్నవాటిలో మంచిగదిని ఈ సుప్రసిద్ధ భారతీయ అతిథికి ఈయవలసిందిగా భోజనశాల యజమానురాలిని ఆజ్ఞాపించారు. నగరవీథులనుండి ప్రాచీనవైభవం అంతర్థానమైంది; కాని జర్మనుల హృదయాలలో ఇంకా పీఠంవేసికొనే ఉన్నది!

భోజనశాల యజమానురాలొక వృద్ధవనిత; దయాదాక్షిణ్యాలు గలదే. అందలి మంచి గది అంటే, అపరిశుభ్రతకు మారుపేరు; వృద్ధురాలు తనశక్తిసామర్థ్యా లన్నీ ఉపయోగించి పరిశుభ్రంగా కన్పించేటట్లు చేయగలిగింది. గోడమీద యింకా మసిపోయిన కైజర్ ఫొటో వ్రేలాడుతూనే ఉంది. కన్నీటితో ఆ ఫొటో వైపు చూస్తూ ఎంతో వైభవం అనుభవించిన జర్మనీకి పట్టిన దుర్గతి, అవమానాలను గురించి బాధ పడింది. నాకు చాల చలిగా ఉంది; ఫైర్ ప్లేస్ వంక చూచాను; నా ఉద్దే శ్యాన్ని గ్రహించింది. చాల సంవత్సరాలుగా దాన్ని వెలిగించలేదు; బొగ్గు దుర్లభం.

పాపం ! కెయిజర్ పరిపాలనలోనే జర్మనీకి ఈగతి పట్టినదని వృద్ధురాలికేం తెలుసు? కనీసం ముఖం కడుక్కోటానికైనా చెంబెడు వేడినీళ్ళు దొరకవని చెప్పింది. కాని కొంచెం కాఫీ, చిన్న రొట్టెముక్క తెస్తానన్నది; వెన్న వాసనచూచి ఎన్నో ఏండ్లయింది! ఆమె తెచ్చిన కాఫీకి వాసనా, రుచి అంటూ యేమీ లేవు; చక్కెరకు బదులు ఒక శాఖరిన్ బిళ్ళ; పాల ప్రసక్తి లేనేలేదు. ఇక రొట్టె, ఒక సన్నని మట్టి పెళ్ళ. ఆ నల్లని ద్రావకం బాగా వేడిగా మాత్రం ఉంది. గొంతులో పోశాను. అప్పటికే కొయ్యబారి ఉన్న అవయవాలకు కొంచెం వేడి వచ్చింది. ఇదీ, బెర్లిన్ నగరంలో నా మొదటి భోజనం. జర్మనీలో అధికసంఖ్యాకుల భోజనమదే. సగర్వంగా బ్రతికినజాతికి ఎంతటి దుర్దశ !

## అరుణ విప్లవం తప్పటడుగులు

శ్రామికవర్గం ప్రథమంగా రష్యాలో అధికారాన్ని వశపరచుకొన్నది; కాని మార్క్స్ వ్రాసిన జాతకం ప్రకారం ఆ గౌరవం జర్మనీకి దక్కాల్సింది. ఐతే బ్రిటన్ మొట్టమొదటి పారిశ్రామికదేశం. బ్రిటన్, సోషలిస్టు ఆర్థిక సిద్ధాంతానికి గూడా బ్రిటనే జన్మభూమి. కారల్ మార్క్స్ 'మానస పుత్రుడు' జన్మించినది బ్రిటిష్ మ్యూజియంలోనే. సోషలిజంలోని రాజకీయ ఆదర్శాలకు, మానవత్వానికీ, నైతికోత్సాహానికీ ఫ్రెంచి విప్లవ సాంప్రదాయాలు మూలం. ఐనా ఆధునిక సోషలిస్టు సిద్ధాంతం పూర్తి వికాసం పొందింది జర్మనీలోనే. క్రమబద్ధమైన సోషలిస్టు ఉద్యమం కూడా ప్రారంభమైంది జర్మనీలోనే. కారల్ మార్క్స్ తాత్విక విధానానికి మొట్టమొదట మెరుగులు దిద్దిన బెరన్ స్టీన్, కాట్ స్కీ, హిల్ ఫెర్డింగ్ అనువారందరూ జర్మనులే; వర్గచైతన్య సిద్ధాంతంలో గాఢవిశ్వాసం కలిగిన పారిశ్రామికుల సంఖ్య ఇతర దేశాలలో కంటె జర్మనీలోనే అధికం. మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమైనపుడు జర్మన్ పార్లమెంటులో నూటపదకొండుమంది సోషలిస్టు సభ్యులున్నారు; అందుచేతనే జర్మన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీయే రెండవ ఇంటర్నేషనల్ నాయకత్వం వహించింది.

ఇక, కమ్యూనిజం అంటే, శాస్త్రీయమైన మార్క్సిస్టు సోషలిజం; కమ్యూనిజానికి గూడా జర్మనీ దేశమే జన్మభూమి! రెండవ ఇంటర్నేషనల్ అనేకమార్లు యుద్ధాన్ని ఖండించింది. యుద్ధంలో పాల్గొంటున్న దేశాల్లో శ్రామికుల సమ్మెలను చేయించి యుద్ధాన్ని ప్రతిఘటించటానికి నిర్ణయించింది. "ప్రపంచ కార్మికులారా! ఏకం కండి; శృంఖలాలు తప్ప మీరు పోయేదేమీ లేదు." అనేదే రెండవ ఇంటర్నేషనల్ నినాదం. కాని యుద్ధం ప్రారంభించటంతో రెండవ ఇంటర్నేషనల్ విచ్ఛిన్నమైంది. సోషలిస్టుపార్టీలు తమ తమ ప్రభుత్వాలను బలపరిచినై; యుద్ధాన్ని వ్యతిరేకించిన ఫ్రెంచి సోషలిస్టు నాయకుడైన జొరెస్ (Jaures) ను హత్య చేశారు.

రష్యా డ్యూమాలో పదముగ్గురు సోషలిస్టు సభ్యు లుండేవారు; వీరిలో ఆరుగురు బోల్షివిక్కులు; 'పరాజయవాదు' (Defeatists) లనే నేరంపై వీరిని అరెస్టు చేసి ప్రవాస శిక్ష విధించి సైబీరియా పంపారు. జర్మన్ రీచ్‌స్టాగ్‌లోని నూట పదకొండుమంది సోషల్ డెమోక్రాట్లలో 14 మంది ప్రభుత్వ యుద్ధ ఋణాలకు మాత్రం వ్యతిరేకంగా వోటు చేయటానికి నిర్ణయించారు. వీరందరిలో ఒక్క కారల్ లీబ్నిట్ మాత్రం అంతర్జాతీయ సోషలిస్టు సూత్రానికి అనుగుణంగా పార్టీ కొరడాను ప్రతిఘటించాడు; అతణ్ణి అరెస్టు చేశారు; కాని అతని ధైర్యం యుద్ధ వ్యతిరేక ప్రజాఉద్యమానికి నైతికబలాన్ని చేకూర్చింది; ఈ ఉద్యమానికి స్పార్టకస్ కూటమికి కారకులైన రోజా లక్సెంబర్గ్, ఫ్రాన్జ్ మెహ్రింగ్, క్లారా జెట్కిన్ అనువారు నాయకత్వం వహించారు. స్పార్టకస్ కూటమియే జర్మన్ కమ్యూనిస్టుపార్టీగా మారిపోయింది.

1915 లో యుద్ధప్రతిఘటనోద్యమం బాగా బలపడింది. ముఖ్యంగా సోషల్ డెమోక్రాటిక్ పార్టీలోని యువకసభ్యులు, పార్టీనాయకుల దేశభక్తి విధానాన్ని నిశితంగా విమర్శింపసాగారు. "పితృభూమి రక్షణ" విధానానికి సవాలుగా వారీ ప్రశ్నను అడిగారు: శాస్త్రీయ సామ్యవాదం (Marx) శ్రామికులకు దేశమే లేదని ఉద్ఘాటించలేదా? జర్మన్ కమ్యూనిజానికి వీరే పురోగాములు. వీరి ప్రోత్సాహంతోనే ప్రజలు యుద్ధవ్యతిరేక చర్యలను పూనుకొన్నారు.

1916 లో, ఈ కమ్యూనిస్టు పురోగాములు, అంతర్జాతీయకూటమి (International group) అనే పేరుతో ఒక మానిఫెస్టో యిచ్చారు; దానిపేరు; "ప్రధాన శత్రువు మనదేశంలోనే ఉన్నాడు." నాటికి యింకా లెనిన్ పేరూ, ఊరూలేని ప్రవాసిగా స్విట్జర్లాండులోనే ఉన్నాడు. ఇది కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలోనే చాల ప్రధానమైన సంఘటన.

జర్మన్ యుద్ధవ్యతిరేక ఉద్యమం, ఐరోపా సోషలిజంలోని అంతర్జాతీయ వామపక్షానికి బలాన్ని చేకూర్చింది. అంతర్జాతీయవాదులు స్విట్జర్లాండులో 1915 లో జిమ్మర్‌వాల్డు చెంతా, 1916 లో కింథాల్ లో రెండు సమావేశాలుజరిపారు. దేశభక్తి పేరుతో పతనం పొందకుండా సోషలిజాన్ని రక్షించటమే ఈ సమావేశాల ఉద్దేశ్యం. లెనిన్ అనుయాయు లీ రెండు సమావేశాల్లోనూ అల్పసంఖ్యాకులే. సోషలిస్టుపార్టీల సంఘటిత చర్యద్వారా యుద్ధాన్ని నిలుపుదల చేయాలని అధికసంఖ్యాకులు సూచించిన విధానం; కాని యుద్ధానికి 'విప్లవాత్మక ప్రతిఘటన'ను సూచించాడు లెనిన్. అంటే సోషల్ డెమోక్రసీనుండి పూర్తిగా విడిపోయి మార్క్సిజాన్ని అనుసరించడమే. అంతేగాక, "పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసే స్వచ్ఛంద ప్రజాఉద్యమం కొరకు వేచియుండటానికి బదులు, సుసంఘటితమైన విప్లవకారుల పార్టీని నిర్మించి, దాని ద్వారా శ్రామికవర్గం తరపున అధికారాన్ని హస్తగతం చేసుకోవాలి." అనే సిద్ధాం

తాన్ని కూడా లెనిన్ వివరించాడు. లెనిన్ సిద్ధాంతం, బ్లాంక్ (లూయీ బ్లాంక్ ఫ్రెంచ్ సోషలిస్టు) సాంప్రదాయాలపై నాధారపడినదని, జర్మన్ కమ్యూనిజం నాయకురాలు రోసా లక్సెంబర్గ్ తిరస్కరించింది. అందుచే రష్యాలో బోల్షివిక్కులు అధికారం కైవసం చేసికొనేవరకూ, జర్మనీలోని యుద్ధవ్యతిరేక ప్రజాఉద్యమంపై లెనిన్ ప్రభావంలేదనే చెప్పవచ్చు; కారల్ రాడెక్ వంటి కొద్దిమంది విద్యావంతులు మాత్రం లెనిన్ సిద్ధాంతాన్ని ఆమోదించారు.

నిర్బంధ సైనిక శిక్షణ చట్టంక్రింద 1916 లో లీబ్క్నెట్ కూడా సైన్యంలో చేరాడు; సైనిక దుస్తుల్లో మే 1 వ తేదీనాడు, పోట్సుడామ్ ప్లాజ్ రైల్వేస్టేషన్ ముందు యుద్ధరంగానికి తరలే సైనికుల నుద్దేశించి ఉపన్యాసం ప్రారంభించాడు: "సామ్రాజ్య యుద్ధవాదాన్ని నిలిపి వేయాలి! సైన్యంలోనుండి బయటకు వచ్చేయండి; సోషలిజం వర్ధిల్లాలి!" ఒకే ఒక వ్యక్తి నిలబడి అజేయమైన జర్మన్ సైన్య అధికారాన్ని ధిక్కరించిన ఈ దృశ్యం మరుపరానిది! దేశంలోని వాతావరణం ఉద్రిక్తమై పోయింది; యుద్ధవ్యతిరేకోద్యమం నానాటికి బలీయమైంది. ఉద్యమ నాయకులందర్నీ ప్రభుత్వం నిర్బంధించింది. కాని ప్రజా బాహుళ్యంలో నానాటికీ విజృంభిస్తున్న అసంతృప్తి ప్రభుత్వ దమననీతితో చల్లారదు; ప్రతి పారిశ్రామిక కేంద్రంలోనూ రహస్య శ్రామికసంఘాలు వెలసినై; సైనికులలోనూ, నావికులలోనూ కూడా ఉద్యమం వ్యాపించి జర్మనీ సైన్య నైతిక పతనానికీ, తద్వారా జర్మనీ పరాజయానికీ కారణమైంది.

1917 ప్రారంభంనుండీ రష్యాలో ముఖ్యమైన పరిణామాలు జరుగసాగినై. పరాజయంతో రష్యా సైన్యంలో నైతికబలం నశించింది. అందుచే జారు ప్రభుత్వం జర్మనీతో ప్రత్యేక సంధికి సమ్మతిస్తుందేమోనని మిత్రరాజ్యాలు భయపడినై. మిత్రమండలి అనకూలురైన రాజకీయ నాయకులు, సింహాసన త్యాగం చేయవలసిందిగా జారును ఒత్తిడి చేశారు; మరింత శక్తిసామర్థ్యాలతో యుద్ధం సాగించటమే వారి ఉద్దేశ్యం. కాని వారి చర్యలవల్ల విప్లవమార్గం సుగమమైంది. బోల్షివిక్కులు గూడా 'పరాజయ వాదులే'; తన మతాలో జర్మనీద్వారా రష్యాచేరి యుద్ధవిరమణ ప్రచారం సాగించటానికై లెనిన్కు అనుమతి లభించింది. జారు తరువాత ప్రభుత్వాన్ని నడపిన మిత్రమండలి పక్ష రష్యా నాయకులు, లెనిన్ను జర్మనీ ఏజంటని దుయ్యబట్టారు. మొదట్లో బోల్షివిక్కులు గూడా లెనిన్ను ఖండించారు; కాని రష్యా పరిస్థితులు లెనిన్కు అనుకూలంగా ఉన్నై. యుద్ధంతో దేశం పూర్తిగా అలసిపోయింది; 'శాంతి, శాంతి' అని ప్రజలు ఆక్రోశిస్తున్నారు. మార్చి 27 వ తేదీన సమావేశమైన పెట్రోగ్రాడ్ శ్రామిక - సైనిక - కర్షక ప్రతినిధుల పంచాయితీ (Petrcgred Soviet of worker's, Soldier's and Peasants daputies) శాంతిస్థాపనకై సమైక్యకృషి చేయవలసిందిగా ఐరోపా ప్రజలను ప్రార్థించింది.

జారు ప్రభుత్వ పతనంతో రష్యాలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం జరిగింది. "చారిత్రకంగా అది అవసరం కాబట్టి శ్రామికవర్గం ఆ విప్లవాన్ని బలపరచాలి. పారిశ్రామికంగా వెనుకబడియున్న దేశంలో శ్రామికవర్గం అధికారం కొరకు ప్రయత్నించటం తెలివితక్కువ" అనేది మార్క్సిస్టు సనాతనవాదం. (Gthodose Marxisttview) దీని ప్రకారం బోల్షివిక్ పార్టీ కేంద్రకమిటీ, లెనిన్ చేసిన సాయుధ తిరుగుబాటు సూచనను త్రోసిపోసింది. కాని లెనిన్ పట్టుదలతో: "రష్యా ప్రజానీకానికి శాంతి అత్యవసరం; అదే ప్రజాభీష్టం; ప్రజాభీష్టమే నెగ్గాలి; రాజ్యాధికారాన్ని వశపరచుకొంటేగాని బోల్షివిక్ పార్టీ ప్రజాభిప్రాయాన్ని అమలు జరుపలేదు." అని లెనిన్ వాదించాడు. "రష్యా వెనుకబడియున్న దేశం; ఇక్కడ ఏం జరిగినా ఫరవాలేదు; జర్మనీలో మాత్రం శ్రామికవిప్లవం జరుగుతోంది; ఆ విప్లవ సహాయంతో బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వం క్రింద, పెట్టుబడిదారీ విధాన వికాసంతో ప్రమేయం లేకుండానే, రష్యాలో శ్రామిక విప్లవం విజయవంతం కాగలదు," అనే ఆశయే లెనిన్ వాదానికి ఆధారమైంది.

శాంతికై ప్రజలు స్వచ్ఛందంగా చేస్తున్న ఆందోళన; యుద్ధరంగం నుండి అసంఖ్యాకంగా అస్త్రసన్యాసంచేసి గృహోన్ముఖులైన సైనికులతో తీవ్రరూపం ధరించింది; పరిస్థితి గమనించి బోల్షివిక్కులు లెనిన్ వైపు మొగ్గసాగారు; ప్రజాభిమానాన్ని చూరగొనటానికిదే మంచి సమయం; ఈ అవకాశం జారవిడిస్తే; రాజకీయ రంగంనుండి తామిక విరమించ వలసివస్తుంది; ప్రజాభిప్రాయానికి అనుగుణంగా వ్యవహరిస్తే అధికారం హస్తగతం చేసికొనగలుగుతారు. జర్మన్ విప్లవంలోని విశ్వాసం బోల్షివిక్కుల నిర్ణయాన్ని బలపరచి, వారిని కార్యోన్ముఖులను చేసింది. శాంతి ప్రచారంతో జర్మన్ సైన్యాన్ని విచ్ఛిన్నం చేయటమే లెనిన్ కార్యక్రమం; రష్యా యుద్ధరంగంనుండి నిర్గమిస్తే, మిత్రరాజ్యాలలోని శ్రామికవర్గాలు తమ తమ ప్రభుత్వాలను ఒత్తిడిచేసి సోవియట్ సూచనలపై శాంతికి సమ్మతింప జేయవచ్చును. ఆక్రమణలుగాని, నష్టపరిహారాలుగాని లేకుండా ప్రజల స్వయంనిర్ణయ హక్కుపై శాంతిస్థాపనే సోవియట్ ప్రణాళిక. కార్మికవర్గానికిగల చారిత్రక ధర్మం (Historical Mission) లో గల విశ్వాసమే రష్యా విప్లవానికి ఆధారం!

క్రమశిక్షణతో కూడిన పార్టీ, సాయుధవిప్లవం అనే రెండు సూత్రాలనూ ప్రత్యేకంగా అనుసరించినప్పటికీ లూయీ బ్లాంక్, బకునిన్‌లవలె లెనిన్‌కూడా మార్క్సిస్టు సనాతనవాదియే! ప్రవక్త వ్రాసిన ప్రపంచ విప్లవ జాతకంలో లెనిన్‌కుగల విశ్వాసం అపారం. అందుచేతనే ప్రపంచ శ్రామిక విప్లవానికి కేంద్రం జర్మనీయేనని రష్యావంటి వెనుకబడిన దేశంలో కొద్దికాలంకూడా శ్రామికవర్గం అధికారంలో నిలబడలేదనీ నమ్మాడు. కాని చాల సాహసంతో రష్యా విప్లవాన్ని నడుపటానికి నడుం కట్టాడు. రష్యావిప్లవం, జర్మనీవిప్లవానికి వెన్నుదగా ఉండగలదనీ, తరువాత

రష్యాలో బోల్షివిక్కు విప్లవం పటిష్ఠంకావటానికి జర్మనీ సహాయపడగలదనీ లెనిన్ ఆశ; ఐనా నాయకత్వం జర్మన్ శ్రామికవర్గానికే దక్కుతుంది; కమ్యూనిస్టు ప్రపంచ రాజధాని మాస్కోనుండి బెర్లిన్‌కు మారుతుంది!

ప్రతికూల పరిస్థితులలోనైనా వెంటనే రష్యాలో అధికార ఆక్రమణను సమర్థిస్తూ లెనిన్ ఉద్ఘాటించాడు: "కారల్ లీబ్నెట్ విజయంతథ్యం; ఆతడు మనకు సహాయం చేస్తాడు; జర్మన్ విప్లవం అంతర్జాతీయబాధలనుండి మనలను విముక్తిగావించి విప్లవ రక్షణకోసం యుద్ధం చేయవలసిన అవసరాన్ని తప్పిస్తుంది; కాని జర్మన్‌విప్లవానికి కొంత కాలవ్యవధి అవసరం; ప్రచారంద్వారా, కందకాల్లో (సైనికులమధ్య) మైత్రిద్వారా జర్మనీవిప్లవాన్ని వికసింపజేయాలి." అందుచే సోవియట్ ప్రభుత్వం చేసిన మొదటిపని జర్మన్‌సైనికుల్లో ప్రచారం సాగించటానికి యేర్పాట్లుచేయటం. ప్రతిరోజూ రైలుబండ్లకొలదిగా కరపత్రాలు, పుస్తకాలు మొదలైనవి యుద్ధరంగానికి సరఫరా అయ్యేవి; లీబ్నిట్ పేరున ఆయుధవిసర్జన చేయవలసిందిగా జర్మన్ సైనికుల నుద్బోధించేవారు. ఐనా బోల్షివిక్కుల శాంతిసూచనలను మొట్టమొదట అంగీకరించినది జర్మనీయే; కాని అది బోల్షివిక్కులపట్ల జర్మనీకిగల ప్రేమకు చిహ్నంమాత్రం కాదు! అప్పటికే అమెరికా యుద్ధంలో ప్రవేశించింది; అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా అసంఖ్యాకంగా (అమెరికన్) సైనికులు వస్తున్నారు; వస్తుసామగ్రి అపారముగా సరఫరా అవుతోంది; పశ్చిమరంగంమీద యుద్ధం భయంకరరూపం ధరించ సాగింది. ఇక తూర్పురంగంలో రష్యన్‌సైన్యం పూర్తిగా విచ్ఛిన్నమైంది; బోల్షివిక్కుల శాంతిప్రచారం మోసం అనుకున్నా, త్వరలో సైన్యాన్ని నిర్మించటం క్రొత్త ప్రభుత్వానికంత సాధ్యంకాదు. అందుచే తూర్పురంగంనుండి అత్యంత ప్రధానమైన పశ్చిమరంగానికి సైన్యాన్ని తరలించే అవకాశం జర్మనీకి లభించింది. ఐనా, శాంతి సమావేశంగా జర్మన్ సేనాధిపతులు బోల్షివిక్ ప్రతినిధులపట్ల కఠినంగానే, విజేతల స్వభావంతోనే వ్యవహరించారు. జారు సామ్రాజ్యంలోని అల్పసంఖ్యాక జాతులను, రష్యానుండి విడిపోయే హక్కును సోవియట్ ప్రభుత్వం ప్రకటించింది. ఇది అవకాశంగా తీసికొని, బాల్టిక్ రాజ్యాలూ, పోలెండూ, ఉక్రేయినూ, స్వతంత్ర రాజ్యాలుగా రష్యా గుర్తించాలనీ, అదే శాంతి సంధికి ప్రధాన షరతుగా జర్మన్ సేనాపతులు కోరారు. ఈ ప్రాంతాలన్నీ జర్మన్ సేన లాక్రమించి ఉన్నై. వాని స్వాతంత్ర్యాన్ని రష్యా గుర్తించటమంటే, అవి జర్మన్ రక్షణలోని ప్రాంతాలై పోతై; లేదా వానిని జర్మనీ తన సామ్రాజ్యంలో కలుపుకొనే ప్రమాదం ఉంది. ఈ షరతులకు సమాధానంగా సోవియట్ ప్రతినిధియైన 'ట్రాట్‌స్కీ' అందరినీ ఉద్దేశించి '(To All)' ఉద్రేకపూరితమైన ఉపన్యాసం చేసి, "యుద్ధం చేస్తున్న రాజ్యాలు వెంటనే శాంతి సంధి చేసికొని పక్షంలో, అంతర్జాతీయంగా, ప్రజా విప్లవం చెలరేగగల"దని బెదరించాడు.

జర్మన్ సేనాపతులు అహంకారంతో సూచించిన అవమానకరమైన షరతులను బోల్షివిక్ పార్టీ తిరస్కరించింది. పార్టీ కేంద్ర సంఘంలో అధిక సంఖ్యాకులు బుఖారిన్, రాడెక్‌ల నాయకత్వం క్రింద, జర్మన్ శ్రామికవర్గం తిరుగుబాటు చేసే వరకు జర్మనీతో రష్యా 'విప్లవ యుద్ధాన్ని' సాగించాలని సూచించారు. పార్టీలో లెనిన్ పక్షం అల్పసంఖ్యాకులైనారు; ఐనా, లెనిన్ "ఏమైనా, శాంతి అవసరం" అనే వాదాన్ని విడిచి పెట్టలేదు; యుద్ధం సాగించటానికి రష్యా సైన్యం అంటూ లేదని నచ్చజెప్పాడు; 'బుఖారిన్, రాడెక్‌ల ముఠా వాదం ప్రజాభిప్రాయానికి విరుద్ధం; ప్రజలు శాంతికి 'వోటు' చేశారు; బోల్షివిక్కులు ప్రజాభిప్రాయాన్ని మన్నించి శాంతి సంధిపై సంతకాలు చేయాలి' అని కోరాడు. "ప్రజలు శాంతిని కోరారని లెనిన్‌కు ఎలా తెలుసు?" అని ఎదురు ప్రశ్న; దానికి లెనిన్ సమాధానం: "యుద్ధరంగాన్ని పరిశీలించండి; సైనిక దుస్తుల్లో ఉన్న రైతులు తుపాకులను పారవేసి గృహోన్ముఖంగా దౌడు తీస్తున్నారు. ఎందుకు? విప్లవం తమకు ప్రసాదించిన పొలాలను దున్ని పండించు కోటానికి!" అధిక సంఖ్యాకులు లెనిన్ వాస్తవిక దృక్పథాన్ని గమనించలేక పోయినారు; తుపాకులూ, కమ్యూనిస్టు మానిఫెస్టో, ఆయుధాలుగా విప్లవాత్మక యుద్ధం సాగించటమే వారి వాదం. పార్టీసభ్యుల సమావేశంలో లెనిన్ వాదం వీగిపోయింది. మరొక ముఠా ట్రాట్‌స్కీ సిద్ధాంతాన్ని బలపరిచారు; 'యుద్ధం లేదు; శాంతీ లేదు'; అనేదే ట్రాట్‌స్కీ సిద్ధాంతం. లెనిన్, ట్రాట్‌స్కీలకు సమాన సంఖ్యాబలం ఉంది.

తమ షరతులను అంగీకరింప చేయాలనే ఉద్దేశ్యంతో జర్మనులు ఉక్రేయిన్ ఆక్రమించారు; "శాంతి సంప్రదింపులను భగ్నం చేసి, బోల్షివిక్ రష్యా, జర్మనీతో యుద్ధం చేయదు" అని ప్రకటించారు. జర్మను లిది సమ్మతింపక, తమ షరతులను 48 గంటలలో రష్యా అంగీకరింపని పక్షములో జర్మనులు యుద్ధచర్యలు ప్రారంభిస్తారని శ్రీముఖం పంపారు. బోల్షివిక్ పార్టీ కేంద్రకమిటీకి లెనిన్ సలహా వినా గత్యంతరం లేకపోయింది. సంధి సంతకాలు జరిగినై; ఐనా జర్మన్ సైన్యం తూర్పుగా పురోగమించి కాకసస్ పర్వత పాదంవరకూ ఆక్రమించింది. జర్మనుల మిత్రులైన తురుష్కులు ఆర్మీనియా ఆక్రమించారు. పెట్రోగ్రాడుపై జర్మన్ సైన్యం నడువ సాగింది. పెట్రోగ్రాడునుండి సోవియట్ ప్రభుత్వ కార్యస్థానం మాస్కోకు మరలించబడింది. కాని అనతికాలంలోనే మాస్కోను కూడా శత్రువులు ముట్టడించారు. ఒక వైపున జర్మన్ రాక్షసులు మరొక వైపున మిత్రమండలి రాజ్యాల ప్రోత్సాహంతో రష్యా విప్లవ ప్రతిఘటన సైన్యాలు- లెనిన్ ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి సిద్ధమైనారు.

ఈ క్లిష్టసమయంలో, బోల్షివిక్ పార్టీ ఏడవమహాసభ జరిగింది. "అవమానకరమైన సంధికి సమ్మతించినా బోల్షివిక్ ప్రభుత్వానికి ప్రమాదం తప్పలేదని" వామ

పక్షీయులు లెనిన్‌విధానాన్ని విమర్శించారు. లెనిన్ చలించలేదు. "ఆ సంధితప్ప బోల్షి విక్కులకు మరి గత్యంతరంలేదు. జర్మన్ రాక్షసులను ఆపలేకపోయినాం. నిజమే; కాని బోల్షివిక్కులకు విశ్రాంతి లభించింది." అని సమాధానం చెప్పుకొన్నాడు. కాని విషమపరిస్థితులు లెనిన్‌లోని ఆశాజ్యోతినికూడ చలింపజేసినై. "బాధాకరమైన పరాజయాలు తప్పవని లెనిన్ అంగీకరించాడు." ఏమైనా బోల్షివిక్కులు ఓర్పుతో, సహనంతో నిలబడాలి. కాలం మన కనుకూలంగాఉంది. జర్మన్ విప్లవం ఎంతో దూరంలో లేదు. ఒక జర్మనీయేకాదు; ఐరోపా విప్లవప్రళయంవైపు పురోగమిస్తున్నది. విప్లవప్రళయం తప్పదు. సర్వత్రా ప్రతికూలంగా ఉన్న నాటి విషమ పరిస్థితులలో, మార్క్సు తత్వంలోని ఈ 'తప్పనిసరి' (Inevitability) మంత్రమే లెనిన్‌ధైర్యాన్ని కాపాడింది.

## జర్మన్ విప్లవపరాజయం

బోల్షివిక్కుల విశ్వాసం కేవలం అర్థరహితమైంది కాదని 1918 లో జరిగిన జర్మన్‌విప్లవం రుజువుచేసింది. శత్రువులమధ్య చిక్కుబడి వారు ప్రదర్శించిన వీరోచిత ధైర్యసాహసాలకు విశ్వాసమే ఆధారం. కాని ఆ విప్లవాన్నిగురించిన వారి ఆశలన్నీ పగటికలలైనై; జర్మన్‌విప్లవం పరాజయం పొందింది.

జర్మన్ శ్రామికవిప్లవ పరాజయానికి సోషల్ డెమోక్రాటిక్ నాయకులే కారణమని కమ్యూనిస్టులు; వారి సానుభూతిపరులూ నిందిస్తూఉంటారు. కాని నిష్పక్షపాతమైన చారిత్రకదృష్టికి అది సత్యంకాదని బోధపడుతుంది. సోషల్ డెమోక్రాట్లుకూడా మార్క్సు శిష్యులే. వారుకూడా సాంఘికవిప్లవం 'తప్పనిసరి' అని నమ్మినవారే; పెట్టుబడిదారీ దోపిడీ విధానమునుండి శ్రామికవర్గాన్ని విముక్తిచేయ సంకల్పించినవారే. కాని 1918 నాటి గడ్డురోజుల్లో వారి చర్యలకు, మార్క్సిజానికి తమ వ్యాఖ్యానమే సరియైనదనేవారి విశ్వాసమే కారణం. కమ్యూనిస్టు పురోగాముల సిద్ధాంతాలూ, చర్యలూ మార్క్సు సిద్ధాంతాలకు అనుగుణంగా లేవని వారి వాదన. అందుచే శ్రామిక విప్లవానికి సోషల్ డెమోక్రాట్లు ద్రోహం చేశారనటం పొరబాటు.

ఫ్రెంచి విప్లవసంఘటనలదృష్ట్యా, బూర్జువాప్రభుత్వం, సాయుధ శ్రామిక తిరుగుబాటులో కూలిపోగలదని మార్క్సు, ఆతని శిష్యగణంలోని సనాతనులూ ఊహించారు. 18వ శతాబ్దంనాటికి రాచరికాలు పూర్తిగా క్షీణించిపోయి, బాడుగ సైన్యాలమీద ఆధారపడియుండేవి. అట్టి రాచరికాలను ప్రజావిప్లవాలు సులభంగా కూల్చివేయగలిగినై; వానితో పోల్చిచూస్తే నేటి రాజ్యాల సైనికబలం అపారం. జారుసైన్యం అనామకం గావటంచేతనే చిన్న విప్లవదళం ప్రభుత్వాన్ని వశపరచుకొనగలిగింది. జారు ప్రభుత్వానికీ, మధ్యయుగ రాచరికానికి వ్యత్యాసమేలేదు. అవినీతి, అసమర్థత, మూఢాచారాలతో నానాటికీ దుర్బలమైపోయింది; అందుచే ఇంచుమించు

ఫ్రెంచివిప్లవం నమూనాలోనే రష్యావిప్లవం జరిగింది. కాని జర్మనీలోని పరిస్థితులు పూర్తిగా విరుద్ధం. రాచరికం పరాజయంపొంది పతనమైందిగాని, సైన్యం విచ్ఛిన్నం కాలేదు; అందుచే 1918-19 లో దేశరాజకీయాల్లో సైన్యం ప్రముఖపాత్రను నిర్వహించింది. అందలి సైనికులవృత్తి యుద్ధం; రాజకీయాల్లో శ్రద్ధవహించిన సైనిక కులంలోని సభ్యులే సేనాపతులు; నిర్బంధసైనికుల్లోమాత్రమే కమ్యూనిస్టుల యుద్ధ వ్యతిరేకతకు సానుభూతి లభించింది; కాని సేనాపతులీ సానుభూతిని నిర్దాక్షిణ్యంగా శిక్షించేవారు.

'శ్రామిక సైనికసంఘం' బెర్లిన్‌లో నెలకొల్పబడినదనే వార్త జర్మనీలోనూ ఆస్ట్రో-హంగెరీ సామ్రాజ్యంలోనూ వ్యాపించింది; మరికొన్ని నగరాల్లోనూ, పట్టణాల్లోనూకూడా అటువంటి సంఘాలు స్థాపింపబడినై; బోల్షివిక్ విప్లవంలోవలెనే, ప్రభుత్వ భవనాలూ, రైల్వేస్టేషన్‌లూ, తంతితపాలు కేంద్రాలూ, వార్తాపత్రికా కార్యాలయాలూ తిరుగుబాటుదార్లు వశపరచుకొని 'సోషలిస్టు రిపబ్లిక్' స్థాపనను ప్రకటించారు. ఇది సోషల్ డెమోక్రాటునాయకుల కొక సవాలు! వీరు తమ శక్తికొలది దేశంలో యేర్పడిన రాజకీయ శూన్యతను తొలగించటానికి ప్రయత్నిస్తున్నారు. తాత్కాలిక ప్రభుత్వం ద్వారా బెర్లిన్ మున్నగు నగరాల్లో శాంతిభద్రతలను పునరుద్ధరించి, రాజ్యాంగపరిషత్తును నెలకొల్పి తద్వారా ప్రజాస్వామ్య ప్రభుత్వమును స్థాపించవలెనని వీరి సంకల్పం. తిరుగుబాటుదార్లను తృప్తిపరచటానికై తాత్కాలిక ప్రభుత్వ నాయకుడైన ఈబర్ట్ తన మంత్రివర్గంలోనికి లీబ్నెట్‌ను ఆహ్వానించాడు; లీబ్నెట్ తిరస్కరించాడు; ప్రజాస్వామ్య భద్రతను గురించిన భయంతో ఈబర్ట్ చేసిన నిర్ణయం జర్మన్ కమ్యూనిస్టు విప్లవానికి పిడుగు పాటైంది.

బెర్లిన్ మున్నగు ముఖ్య నగరాల్లో జరుగుచున్న పరిణామాలను మ్యూనిచ్ నుండి సైన్యాధికారులు పరిశీలిస్తూనే ఉన్నారు; లూడెన్ డార్ఫ్ స్థానంలో గ్రాయ్‌నర్ వచ్చాడు. దేశంలో శాంతిభద్రతలను పునరుద్ధరించటంలో తనకు తోడ్పడవలసిందిగా గ్రాయ్‌నర్‌కు ఈబర్ట్ వర్తమానం పంపాడు; గ్రాయ్‌నరే స్వయంగా తన సహకారాన్ని సూచించాడనీ, ఈబర్ట్ అందుకు సమ్మతించాడనీ మరొక వాదం. ఏమైనా, సైన్యం రాజకీయాల్లో ప్రవేశించింది. జర్మనీని తిరిగి సైనిక రాజ్యంగా మార్చగల అవకాశం విప్లవంవల్ల కలిగిందని సైనికోద్యోగులు భావించారు; ఈ పరిస్థితిలో మిత్రమండలి జర్మనీని పూర్తి నిరాయుధం చేయక పోవచ్చునని కూడా ఆశింపబడింది. కాబట్టి జర్మన్ విప్లవాన్ని ప్రతిఘటించటానికై విజేత, పరాజిత పెట్టుబడిదారీ రాజ్యాలు రెండూ ఏకమైనె. పుట్టిన దాది జర్మన్ విప్లవం వీరి కూటమిని ఎదుర్కొనవలసి వచ్చింది. అందుచే రష్యాలోవలె జర్మనీలో విప్లవం విజయవంతం కాలేకపోయింది.

జర్మన్ సైన్యం ఐరోపా అన్ని ప్రాంతాలలో చిందరవందరగా ఉంది. వారందరినీ స్వదేశానికి చేర్చటం సామాన్యమైన విషయం కాదు; అందుకు తగిన సాధన సామగ్రి తాత్కాలిక ప్రభుత్వానికి లేదు. అందుచే ఈ బాధ్యత వహించ వలసిందిగా ప్రభుత్వం సైనికోద్యోగి సిబ్బందిని కోరింది. వారందుకు సంతోషంతో సమ్మతించారు; సైనికులలో క్రమశిక్షణను వారిపై తమ అధికారాన్ని పునరుద్ధరించ టానికిది మంచి అవకాశం. ఒక రహస్య ఉత్తర్వు ప్రకారం దేశంలో నలుమూలల శాంతిభద్రతల రక్షణకై, అంటె విప్లవాన్ని అణచి వేయటానికై 'ఫ్రీకోర్' అనే సైనిక కూటాలు నెలకొల్పబడినై; ఇందలి సభ్యులు మాజీ సైనికోద్యోగులే. ఒక ఫ్రీకోర్ దళం బెర్లిన్ నగరవీధులలో దాడి (March) జరిపింది; శ్రామిక సైనిక సంఘ సభ్యులలో ప్రముఖులు అరెస్టయినారు; ప్రదర్శనలు జరుపు కార్మికులపై కాల్పులు జరిగినై. శ్రామిక సైనిక సంఘాన్ని తుదముట్టించాలనీ, లీబ్నెట్‌ను హత్య చేయా లనీ కరపత్రాలు వెదజల్లబడినై; "శ్రామికులారా! పౌరులారా! మన పితృభూమి సర్వనాశనం కాబోతోంది. దాన్ని రక్షించాలి. శత్రువు లెక్కడో లేరు. స్పార్టా కిస్టులే మన పితృభూమికి గర్భశత్రువులు. వారి నాయకులను హతమార్చండి. లీబ్నెట్‌ను చంపండి. యూదులను కాల్చి వేయండి. మీకు శాంతి సౌఖ్యాలు లభిస్తై." అనే కాగితాలు గోడలనిండా అంటించబడినై. రక్తపిపాసతో కూడిన ఈ నినాదాలపై సంతకాలు చేసింది. 'యుద్ధరంగం నుండి మరలివచ్చే సైనికులు.'

దేశం నలుమూలల చెలరేగిన భయవిద్వేషాలు, దారుణహింసాకాండల వలన ప్రజా ఉద్యమం క్షీణించింది. శ్రామిక సైనిక సంఘ ప్రథమ జాతీయ మహాసభకు లక్సెంబర్గ్, లీబ్నెట్‌లను హాజరు కానీయలేదు. పరిస్థితులు మారినై; మహాసభ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ నాయకుల వశమైంది. తాత్కాలిక ప్రభుత్వం సైన్య సహ కారాన్ని బడయటాన్ని గురించి తీవ్రవిమర్శలు జరిగినై; దేశ సరిహద్దుల రక్షణకు శాంతి భద్రతల రక్షణకు అదిఅవసరమని ఈబర్ట్ సమర్థించాడు. ఈబర్ట్‌ను బలపరుస్తూ హిన్‌డెన్‌బర్గ్ ఒక ప్రకటన చేశాడు. "ఈబర్ట్ ప్రభుత్వాన్ని సైన్యం బలపరుస్తుంది; ప్రభుత్వం సైన్యరక్షణకు బాధ్యత వహించాలి."

మహాసభ సమాప్తమైన వెంటనే, బెర్లిన్ పొలిమేరల్లో ఉన్న సైన్యానికి ఈబర్ట్ ఉత్తర్వులు పంపాడు; 'బెర్లిన్ ప్రవేశించి, శ్రామిక సైనిక సంఘ కార్యాల యాన్నీ, ఇతర ప్రభుత్వ కార్యాలయాలనూ, రక్షిస్తూన్న సాయుధ శ్రామికసైన్యాలను చెదరగొట్టవలసిందిగా. విప్లవసైన్యాల స్వాధీనంలోనున్న భవనాలపై సామ్రాజ్య సైన్యాలు శతఘ్నులను పేల్చారు. బెర్లిన్ నగరం రక్తస్నానం చేసింది.

రాజకీయాల్లో సైన్యం జోక్యం కలిగించుకొన్న క్లిష్టపరిస్థితికి అనుగుణ్యంగా పార్టీకార్యక్రమాన్ని నడిపించలేకపోయినారు నాయకులు. లీబ్నెట్ ప్రజలమనిషియే.

ఉపన్యాస వేదిక మీద ఆతణ్ణిమించగలవారు అరుదు. ఆతని ఉపన్యాసంతో ఉద్రేక పూరితులు కావటమేగాక ఆతని ధైర్యం, త్యాగం, నైతికబలం ప్రజలకు ఆదర్శ ప్రాయములైనై; కాని ఆతనిచర్యలకు నిర్దుష్టమైన సిద్ధాంతం, భావశుద్ధి ఉండేదికాదు.

ఇక రోసా లక్సెంబర్గు; ఈమె స్పార్టాకస్ కూటమికి బుద్ధిబలంవంటిది; జన్మతః పోలిష్‌వనిత; విద్యార్థినిగా ఉన్నప్పుడే రహస్యవిప్లవచర్యల్లో పాల్గొని అరెస్టు తప్పించుకొనటానికై స్వదేశాన్ని విడచి జర్మనీ పారిపోయివచ్చింది. అచిరకాలం లోనే జర్మన్ సోషల్ డెమొక్రాటిక్ పార్టీలో ప్రముఖస్థానాన్ని వహించింది. రెండవ ఇంటర్ నేషనల్‌లో లెనిన్ ప్రమాదకరమైన సనాతనవాదిగా నిరసింపబడిన రోజుల్లో రోసా, వామపక్షీయులకు, తాత్త్విక విషయాల్లో నాయకురాలుగా పరిగ ణింపబడింది. సిద్ధాంతరీత్యా, రోసా కాట్‌స్కీ శిష్యురాలు; కాని విప్లవకార్యాచర ణలో మధ్యమార్గాన్ని అనుసరించింది. మార్క్సిస్టుల శాంతియుత క్రమ పరిణామ విధానానికి, రష్యన్ బోల్షివిక్కుల సాయుధతిరుగుబాటు విధానానికి మధ్యమార్గం. బోల్షివిక్కుల విధానమే 'లెనిన్ కమ్యూనిజం' అనబడింది. వాస్తవానికి రోసా విధానం అయోమయ విధానమైంది.

రోసా మధ్యమార్గంలో ప్రధానాంశం భారీయెత్తున జరిపే రాజకీయసమ్మెల ద్వారా పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయటం. ఇది లోపభూయిష్టమైన విధాన మని జర్మన్‌విప్లవం జరిగిన గడ్డురోజుల్లోనే తేలిపోయింది. రాజకీయసమ్మెలే, విప్లవ సైన్యానికి అంతిమ విజయయాత్ర ఐనచో, ఆ దండయాత్రను సక్రమంగా నడపటానికి సుశిక్షితమైన నాయకత్వం అవసరం; లక్సెంబర్గ్ తెలివిగలదే; కాని తన సిద్ధాంత పర్యవసానాలనుగురించి ఆమె స్పష్టంగా ఆలోచించి నిర్ణయించలేదు. అలా ఆలోచించి యున్నట్లయితే, తానూ లెనిన్ నిర్ణయానికి వచ్చియుండేది; అంటే క్రమశిక్షణగలిగిన విప్లవకారులపార్టీ లేనిచో, భారీయెత్తున రాజకీయసమ్మెలను సమర్థంగా జరపటం సాధ్యంకాదు. పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయటమే లక్ష్యమైతే రాజకీయ సమ్మె, సాయుధ తిరుగుబాటుగా పరిగణించక తప్పదు; ఐనచో ఈ కార్యక్రమాన్ని క్రమశిక్షణతో నడపటానికి సుశిక్షితమైన నాయకత్వం అవసరం. ఇదే బోల్షివిక్ పార్టీ సిద్ధాంతసారం. స్విట్జర్లాండులో పదిసంవత్సరాల ప్రవాసకాలంలో విప్లవకార్యా చరణ వివరాలన్నిటినీ క్షుణ్ణంగా చర్చించి లెనిన్ ప్రతిపాదించిన సిద్ధాంతం!

శ్రామికవర్గం, సాంఘిక సముద్ధరణకై పోరాటం సాగించటమనే సిద్ధాంతం, మార్క్సిజంలోని హేతువాద, మానవతావాద, ప్రజాస్వామ్యవాద సాంప్రదాయాలకు పూర్తిగావిరుద్ధం. కాబట్టి రష్యాలో విజయంపొందింది లెనినిజమేగాని, మార్క్సిజం కాదు! జర్మనీలో, విప్లవనాయకులు, పాశ్చాత్య సంస్కృతీ సాంప్రదాయబద్ధమైన మార్క్సిజానికి, క్రమంగా కమ్యూనిజం అని వ్యవహరింపబడిన రష్యన్ బోల్షివిజానికీ

సమన్వయం సాధించటానికై ప్రయత్నించారు. అందుకు లక్సెంబర్గే నిదర్శనం. కేవలం సిద్ధాంతంలో ఆమె అందెవేసినచేయి; కాని క్రియాత్మక రాజకీయాల్లో అనేక ఉద్రేకాలకు లోనయ్యేది. ఈరకం నాయకులంతా యింతే. అందుకు కారణం, వారి రాజకీయ జీవితమంతా మితవాదనాయకులను విమర్శించటంతోనే గడిచిపోయింది. అంచేత సమయం వచ్చినప్పుడు జర్మన్ కమ్యూనిస్టు పురోగాములు ప్రజావిప్లవోద్యమాన్ని విజయవంతంగా నడపలేకపోయినారు.

రోసా, సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వాన్ని బలపరచలేదు; స్పార్టాకిస్టులు అధికారాన్ని ఆక్రమించటానికీ సమ్మతింపలేదు; వర్గపోరాటాన్ని తీవ్రతరం చేయటానికై అవిరామంగా సమ్మెలు సాగించాలని ఆమె వాదం. శ్రామికవర్గంలో అధికసంఖ్యాకులు చైతన్యవంతులై స్వయంగా విప్లవాన్ని నడిపి, హింసాకాంక్ష లేకుండా కమ్యూనిస్టులను అధికారంలోకి తెచ్చేవరకూ, దేశంలో ప్రస్తుతం యేర్పడ్డ అధికార శూన్యతను కొనసాగించటమే ఆమె ఎత్తుగడలోని ఆంతర్యం. అంతవరకూ విప్లవ వ్యతిరేకశక్తులు స్తబ్ధత వహించి ఉంటాయని ఆమె ఊహ. ఈ ఊహకు యేమాత్రం అవకాశం లేదు; విప్లవవ్యతిరేకశక్తులు విజృంభించి తమ హింసాకాంక్షకు లీబ్నెట్‌తో సహా లక్సెంబర్గ్‌ను తొలి నైవేద్యంగా సమర్పించినై.

లక్సెంబర్గ్ ఏ రూపంలోనైనా నిరంకుశత్వాన్ని నిరసించింది; అప్పటికే లెనిన్ నాయకత్వాన కమ్యూనిస్టు విప్లవ విశ్వాసంలో నిరంకుశత్వమే ప్రధాన సూత్రమైంది. ఐనా ఆమె లక్ష్యం చేయలేదు; అదే ఆమె సిద్ధాంతంలోని విశిష్టత. ప్రజాస్వామ్యంలోనే ఆమెకు విశ్వాసం; కాని సాధారణ పార్లమెంటరీ విధానంగాక విప్లవాత్మక ప్రజాస్వామ్యమే ఆమె లక్ష్యం. ఐతే ఆమె తానుద్దేశించిన ప్రజాస్వామ్యానికి రూపకల్పన చేయనూ లేదు; అమలులో ఉన్న ప్రజాస్వామ్య విధానాన్ని సమ్మతింపనూ లేదు. సర్వత్రా సహాయనిరాకరణే ఆమె జీవితంలోని విశేషం. అందుచే రాజ్యాంగ పరిషత్తు (Constituent Assembly) లో కమ్యూనిస్టులను పాల్గొనకుండా చేసింది. ఈ వ్యతిరేక విధానం ఫలితంగా, కమ్యూనిస్టులు ప్రజాఉద్యమానికి దూరమైనారు; ఆచరణరూపం వహించని ప్రజల ఉత్సాహం ఎంతకాలం జీవిస్తుంది? అందుచే విప్లవప్రారంభంలో లీబ్నెట్ ప్రకటించిన సోషలిస్టు రిపబ్లిక్ గాలిమేడలుగానే ఉండిపోయింది. లక్ష్యశుద్ధిలేని ప్రజాఉద్యమం, సైనిక భయోత్సాహంతో, విరిగిపోయింది. 'శాంతి భద్రతలు నెలకొల్పాలి' అనే నినాదాన్ని మధ్యతరగతి ప్రజలంతా బలపరిచారు. సానుభూతిని కోల్పోయి శ్రామికవర్గం రాజకీయాలకు దూరమైంది.

దేశం నలుమూలలా నిరాశా నిస్పృహలు తాండవిస్తున్న ఈ పరిస్థితిలో ప్రాత సైనిక నిరంకుశత్వం పునరుద్ధరింపబడే ప్రమాద మేర్పడింది. ఆ ప్రమాదం నుండి దేశాన్ని రక్షించటానికి ఒకటే మార్గం కన్పించింది; అది సోషల్ డెమోక్రాటిక్

పార్టీ వాగ్దానం చేస్తున్న రిపబ్లిక్ రాజ్యం. అందుచే శ్రామికవర్గంలో చాలభాగం సోషల్ డెమోక్రాటిక్ నాయకత్వం చుట్టూ మూగారు. కమ్యూనిస్టుల నిస్సహాయ స్థితిని ఆసరాగా తీసుకొని ఈబర్ట్ షీడ్‌మన్, నాస్కేలు 'హింసకు హింసే సమాధానమ'ని ప్రకటించాడు; నాస్కే ప్రభుత్వంలో క్రొత్తగా చేరాడు; ప్రభుత్వానికి సైన్యానికి మధ్యగల సంబంధాలను పర్యవేక్షించేవాడు. పై ప్రకటనతో కమ్యూనిస్టులపై ప్రత్యక్ష దండయాత్ర ప్రారంభమైంది. బెర్లిన్ పొలిమేరల్లోకి పెద్ద సైన్యం తరలింపబడింది. జనవరి 9వ తేదీనాడు, సరిగా విప్లవం జరిగిన రెండు నెలలకు బెర్లిన్ నగరాన్ని, ఏమాత్రం ప్రతిఘటన లేకుండా సైన్యం ఆక్రమించింది.

ఆరే దీపం గప్పుని మండుతుంది; అదే విధంగా శ్రామిక - సైనిక సంఘం లీబ్నెట్ అధ్యక్షుడుగా ప్రత్యామ్నాయ విప్లవ ప్రభుత్వాన్ని ప్రకటించింది. సాహసంతో కూడిన ఈ నిర్ణయానికి కమ్యూనిస్టుపార్టీ బాధ్యత వహించ నిరాకరించి ఆ ఆహ్వానాన్ని అంగీకరించవద్దని లీబ్నెట్‌ను ఆజ్ఞాపించింది. దీనితో ప్రజా ఉద్యమానికీ, కమ్యూనిస్టులకు మధ్య గల సంబంధాలు పూర్తిగా తెగిపోయినై.

కొన్నిరోజులతర్వాత లక్సెంబర్గ్, లీబ్నెట్‌లను నిర్బంధించి, సైనిక కేంద్రానికి తీసికొని వెళ్ళి వాళ్ళ కళేబరాలను గుర్తింటానికి గూడా వీలులేనంతటి క్రూరమైన చిత్రవధకు గురిచేశారు. మరునాడే ఒక కాలువలో తేలినై వారి కళేబరాలు, వీరి హత్యను విచారించటానికి యేర్పాటైన సైనిక న్యాయస్థానం యిచ్చిన తీర్పు: "జైలులోనుండి తప్పించుకొనే ప్రయత్నంలో కాల్చివేయబడ్డారు." ఇందులో హత్య చేయబడింది వ్యక్తులుకాదు; దీని తరువాత విప్లవ ప్రతిఘటన, రక్తపాతం అంతర్యుద్ధాలతో దేశంలో సంవత్సరంపాటు అరాజకం బయలుదేరింది.

## బెర్లిన్ రక్తరహిత యుద్ధం

1919 డిసెంబర్‌లో జర్మనీ రాజధానిలోని రాజకీయ, మానసిక పరిస్థితి చాల ఉద్రిక్తంగాఉంది. ప్రతివ్యక్తినీ భయం ఆవేశించింది; మరుక్షణం ఏంజరుగుతుందో ఎవరికీ తెలియదు. కాని ప్రజాజీవితం మామూలుగా నడుస్తున్నట్లే ఉండేది. ప్రాచీన వ్యవస్థ కూలిపోయింది; ఆ శూన్యతను భర్తీచేయటానికి నూతన వ్యవస్థానిర్మాణం జరగలేదు; ప్రజలు గతానికి విలపించటంలేదు; భవిష్యత్తును గురించి కలలూ కనటం లేదు. వారి దృష్టిఅంతా ఆకలి, అవ్యవస్థ, ఆందోళనలతో నిండిన వర్తమానాన్ని ధైర్యంగా ఎదుర్కొనటంమీదనే కేంద్రీకృతమైంది. బజార్లలో జనం భూతాల్లాగా నడుస్తుండేవారు.

యుద్ధం చివరికాలంలో జర్మనీలో అవసరవస్తువుల కొరత యేర్పడింది. ముఖ్యంగా ఆహారపదార్థాలూ, వస్త్రం సరఫరా పూర్తిగా దిగజారిపోయింది. యుద్ధం

ముగిసింది; కాని ఇంకా క్షామం తాండవిస్తూనే ఉంది. ప్రజల్లో అధిక సంఖ్యాకులకు కడుపునిండా తిండి, ఒంటినిండా గుడ్డ కరువైంది. పాలు అంటే యేమిటో తెలియకుండానే ఒకతరం పిల్లలు పెరిగారు; చక్కెరలేదు; కాఫీలేదు; వెన్నలేదు; రేషన్ ప్రకారం తలకొక రెండు చిన్న రొట్టెముక్కలు; అవీ గోధుమరొట్టెలు కావు; ఏ పిండితో చేసేవారో ఎవరూ చెప్పలేరు. ఈ దారిద్ర్యంవల్ల జర్మనీలో వింతవింత ఆచారాలు బయలుదేరినై. పార్టీలకు వెళ్ళే అతిథులు తమ రేషన్ రొట్టెముక్కలను, శాఖరిన్ బిళ్ళలను వెంటతీసుకువెళ్ళేవారు. ఇక, గృహిణి ఏదో ధాన్యమాడ్చి తయారుచేసిన నల్లని ద్రావకాన్ని అతిథులకిచ్చేది. స్వెయిన్, స్విట్జర్లాండు దేశాలు ఐశ్వర్యముతో తులతూగటం కండ్లారా చూచాను. దానికీ జర్మనీదారిద్ర్యానికీగల వ్యత్యాసం చాలా భయంకరం! యుద్ధంవల్ల జర్మనులు అపారంగా నష్టపడ్డారని చెప్పటం అనవసరం. ఈ అనుభవాలే జర్మనులలో అసూయాద్వేషాలనూ, ప్రతీకారవాంఛనూ పురికొల్పినవనటంలో ఆశ్చర్యంలేదు.

ఐనా, బెర్లిన్‌లోకూడా రెండువిభాగాలున్నై; రెండూ రెండు ప్రపంచాలు. ఒక ప్రపంచంలో దారిద్ర్యం, అనారోగ్యకర నిరాశ. ఇక రెండవదాంట్లో విలాసం, ఉల్లాసం, నిర్లక్ష్యజీవితం. బెర్లిన్‌లో విలాసమయప్రాంతంలోని ప్రధానమైన వీధిపేరు 'కుర్ ఫుర్ స్టెన్ డామ్' దీనినిండా విలాసవస్తువుల అంగళ్లూ, మంచిమంచి హోటళ్లూ, నాట్యమందిరాలూ. వీనిని అర్ధరాత్రివేళనే తెరిచేవారు. సాయంకాలానికి ఈ ప్రాంతంలో క్రొత్తక్రొత్త కార్లతో ట్రాఫిక్ బందయ్యేది. వర్తకులు, విలాసప్రియులు, ఉద్యోగులు, వారివారి సహచారిణులతో హోటళ్ళు క్రిక్కిరిసిపోయేవి. పురుషుల్లో చాలమంది, యూనిఫారమ్‌లూ, ఐరన్‌క్రాసులూ ధరించియుండేవారు. కెయిజర్ యుగంలో, జర్మనీలో ప్రతిసైనికుడూ ఐరన్‌క్రాస్ గౌరవాన్ని పొందాలని ఆరాటపడేవాడు. ప్రస్తుతం, జర్మనీయుద్ధంలో ఓడిపోలేదనే భ్రాంతి కలిగించటానికే వీరీవస్తులు ధరించేవారు. ఇంతటి వ్యత్యాసాలుగల జర్మనీ అంతర్యుద్ధానికి రంగస్థలం కావటంలో విశేషంలేదు.

భయంతో, అనుమానంతో అయోమయంగా ఉన్న ఆ మహానగరంలో, ఒక విదేశీయుడు తన కార్యక్రమాన్ని నిర్వర్తించుకొనటం చాలా కష్టం. ఇచట నా మొదటి కర్తవ్యం బొరొడిన్‌ను కలుసుకొనటం; అతణ్ణి డా॥ ఫూక్స్ ద్వారా కలుసుకోవాలి. డా॥ ఫ్యూక్స్ సాంఘికాచారాల చరిత్రపై ఉద్గ్రంథాన్ని రచించి పేరుపొందినవాడు. గార్హస్థ్య జీవితంలోని అనేక ఆచారాలపై వివరాలను సేకరించి ప్రచురించాడు. ఈ గ్రంథంలో శృంగార శాస్త్రవిభాగం కూడా ఉంది. అందులో శృంగార చేష్టలనూ, సమస్యలను గురించి వివరించాడు. ఆ రోజుల్లో డా॥ ఫ్యూక్స్ గ్రంథంలేని గ్రంథాలయం గ్రంథాలయమే కాదు! కాని యువతీమణులు లా గ్రంథం

చదువరాదని నిషేధం. ఐనా, ఉన్నత కుటుంబాల్లో వయసు వచ్చిన ఆడపిల్ల లందరూ ఆ గ్రంథాన్ని దొంగతనంగా సంపాదించి, రహస్యంగా చదివి ఆనందిస్తూ ఉండేవారు.

డా॥ ఫూక్సు ఉపాధ్యాయ వృత్తిలో మంచి పేరు ప్రతిష్ఠ లార్జించినవాడు. ఐనా స్పార్టాకస్ కూటమి సభ్యుడు. రోసా లక్సెంబర్గ్, ఫ్రాన్జ్ మెహ్రింగ్ మున్నగు పురోగామి కమ్యూనిస్టు సిద్ధాంతకర్తలకు ఆప్తమిత్రుడు. మిగిలిన కమ్యూనిస్టు లందరూ - విలియం పీక్, ఎర్నెస్ట్ మేయెర్, ఆగస్ట్ థాల్‌హామర్, క్లారా జెట్కిన్, పాల్ లెవీ మొదలైనవారు జైళ్ళలోనో భూగర్భంలోనో ఉన్నారు. వారిని గురించి భోగట్టా చేయటంకూడా ప్రమాదకరమే. నేను 'ఫ్యూర్‌స్టెన్ హాఫ్' హోటల్లో బసచేస్తానని బొరొడిన్‌కు తెలుసు; కాని నే నెప్పుడు వచ్చేదీ తెలియదు. అందుచే, ఆ బొరొడిన్ స్వయంగా వచ్చి కలుసుకునేవరకూ, వేచియుండాలి!

ఈలోగా డా॥ ఫ్యూక్సును కలుసుకోవాలని చాల జాగ్రత్తగా ప్రయత్నించాను. అతడుకూడా రహస్యంగానే ఉంటూ ఉండేవాడు; బెర్లిన్‌లోని అతని గృహంలోగానీ, యూనివర్శిటీలోగానీ, పబ్లిక్ లైబ్రరీలోగానీ, ఆతని జాడలను గురించిన వర్తమానం లభించలేదు. ఒకరోజున ఒక చిన్న బ్యాంకుకు వెళ్ళవలసిన అవసరం కలిగింది. అదికూడా బొరొడిన్ సూచించిన బ్యాంకే. బ్యాంక్ పేరు హర్ సైమన్; యజమాని సోషల్ డెమోక్రాట్; కమ్యూనిజం అంటే సానుభూతి పరుడు; ఆతనితో స్నేహం చేసుకొన్నాను. ఆతని యింట్లోనే బెరన్‌స్టీన్, కాటస్కీ, హిత్‌ఫెర్డింగ్ మున్నగు సుప్రసిద్ధ నాయకులను కలుసుకున్నాను. తమ పార్టీ ప్రభుత్వంపట్ల అప్పటికే వారికసంతృప్తి ప్రబలింది.

క్రొత్తగా కమ్యూనిజాన్ని స్వీకరించిన నాకు పై నాయకులపట్ల రకరకాల ద్వేషభావా లుండటం సహజమే. కాని మార్క్సిస్టు సిద్ధాంతవేత్తలుగా వారి అంతర్జాతీయ ప్రతిష్టను వినియుండటంచేత వారియందు గౌరవం కూడా లేకపోలేదు. వారిలో నాకు బాగా నచ్చింది. వారి మానవత్వం; కమ్యూనిజాన్ని నిశితంగా విమర్శించేవారు; కాని ఆ విమర్శలో అసూయా ద్వేషాలు లేవు. లీబ్నెట్ నాటకాన్ని నిందించినా లక్సెంబర్గు అంటే వారికి విపరీతమైన అభిమానం. ఆమె బోల్షివిజాన్ని అంగీకరించదని వారి విశ్వాసం. వారి దృష్టిలో బోల్షివిజం అంటే మారువేషంలో పునరుద్ధరింపబడిన ప్రాచ్య నిరంకుశత్వం! అప్పటి కింకా సోషలిజం, కమ్యూనిజాల మధ్య వ్యత్యాసాలను ఇదమిత్థంగా జర్మన్ విప్లవకారులు నిర్ణయించలేదు. వారందరూ శ్రామికవర్గ సముద్ధరణే ఏకైక ఆశయంగా కల ఒక సోదర కూటమిగా కన్పించేవారు; అందరూ విద్యావంతులు, ఆలోచనాపరులు; ఉత్తమమైన అభిరుచులు, సంస్కృతీ కలవారే. వారికి సాంఘిక వ్యక్తిగత సంబంధాలు, పార్టీ

రాజకీయాలచే కలుషితంగాక, మానవత్వం తొణికిసలాడుతూ ఉండేవి. వారి వారి రాజకీయ విశ్వాసా లేమైనా, ఉదారమైన పరస్పర సహనం వారందరినీ కూడగట్టేది.

బెరన్‌స్టీన్ చాలవృద్ధుడు. కంటిచూపు అనటం లేదు. ఐనా ప్రతి సాయంత్రమూ హెర్ సైమన్ యింట్లో మిత్రబృంద సమావేశానికి హాజరయ్యేవాడు. ఎప్పుడూ కయ్యానికి కాలుదువ్వేవాడు. ఆతని శత్రువు లెనిన్. రష్యాలో బోల్షివిక్కులు ఎక్కువకాలం అధికారంలో ఉండలేరనీ, లెనిన్ కేవలం 'మొండి సాహసి' అనీ తన మూఢసిద్ధాంతాలతో అంతర్జాతీయ సోషలిస్టు ఉద్యమాన్ని విధ్వంసం చేయటమేగాక, రష్యా భవిష్యత్తుతో జూదమాడుతున్నాడనీ అనేవాడు. అంతలో అతని ఆగ్రహం పరాకాష్ఠ నందుకొనేది. "నన్ను తిరోగామి అంటాడా? మూర్ఖుడు! అహంకారం! మార్క్సిజాన్ని మట్టిలో కలుపుకున్నాడు! తిరోగాముల్లో తిరోగామి!" అనే బెరిన్‌స్టీన్ మాటల్లో ద్వేషంకంటె విషాదం ప్రతిధ్వనించేది.

బెరన్‌స్టీన్‌కు నన్ను పరిచయం చేసినప్పుడు నన్ను ఎత్తిపొడిచాడు. "ఐతే తార్తారు మూఢమతం పుచ్చుకొన్నా వన్నమాట?" సైమన్ యింట్లో ఎవరిమధ్యా రహస్యా లుండేవి కావు. మూడు రాజకీయ మతాల నాయకులకు సైమన్ విశ్వాసపాత్రుడే, "ఈ మూడు మతాలతరఫున రాజకీయ స్టాక్ మార్కెట్‌లో స్పెక్యులేషన్ వ్యాపారం చేస్తున్నాడు సైమన్" అని తమాషాగా బెరన్‌స్టీన్ అన్నాడొకసారి.

అందర్లో కమూనిస్టులకే ఎక్కువ బేరంచేసి పెట్టేవాడు సైమన్. సోషల్ డెమొక్రాటిక్ పార్టీకి ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ పెట్టుబడి పెట్టేది. ఫెడరేషన్ పటిష్ఠమైన సంస్థ; దేశవ్యాప్తంగా సహకార పరపతి సంఘాలను నడుపుతుండేది. పై పార్టీ నుండి చీలి యేర్పడిన ఇండిపెండెంట్ సోషల్ డెమొక్రాటిక్ పార్టీకిగూడా ఈ బ్యాంకులో వాటాలుండేవి. ఇక కమ్యూనిస్టులకు గూడా, తమ కుట్రలకూ, రహస్య కార్యక్రమాలకూ అవసరమైన ధనానికి బ్యాంకుల సహాయం కావలసి వచ్చింది. అదీగాక కథల్లో వ్యాపించిన బోల్షివిక్ బంగారంకూడా రష్యా నుండి నేరుగా కాక స్కాండినేవియా, హాలండ్ దేశాలగుండా చుట్టుత్రోవల వచ్చేది. ఈ దేశాల్లోనే జారు రష్యాలోని దోపిడిగాండ్ర నుండి దోచుకున్న అమూల్య వస్తువులను ధనంగా మార్చేవారు. ఆధనాన్ని బెర్లిన్‌లో ఇతర దేశాల కరెన్సీలలోనికి మార్చి ఆ యా దేశాలకు రహస్యంగా సరఫరా చేస్తుండేవారు; ప్రస్తుతం జర్మన్ 'మార్క్' విలువ పడిపోసాగింది. అందుచేత కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ కేంద్ర నిధిని డాలర్లలోనికి, పౌండ్లలోనికి మార్చవలసి వచ్చింది. ఈ లావాదేవీలన్నీ బ్యాంకు ద్వారానే జరగాలి. ఇందుకు హెర్ సైమన్ తోడ్పడుతూ ఉండేవాడు.

చివరకు డా. ఫ్యూక్సు నూ, అతనిద్వారా బొరొడిన్‌ను కలుసుకున్నాను. సుప్రసిద్ధ సినీమాతార ఎర్నా మొరీనాను పరిచయం చేశాడు. బొరొడిన్, ఆమె

యింట్లో కమ్యూనిస్టులు సమావేశమాతుండేవారు. అక్కడే కారల్ రాడెక్‌తో పరిచయమైంది. 'వారం రోజుల్లో జర్మనీని విడిచివెళ్ళాలి' అనే ఉత్తర్వుతో అప్పుడే రాడెక్‌ను జైలునుండి విడిచిపెట్టారు. నిరుద్యోగులైన సైనికోద్యోగులతో మైత్రిని గురించి కలలుగంటున్నాడు. మనిషి చాల పొట్టి. మంచి ఉత్సాహవంతుడు. క్షణంకూడా కదలకుండా ఉండలేడు; ఏ చిన్న విషయమైనా గదిలో పచార్లుచేస్తూ మహాసభలో వేదికపై ఉపన్యసిస్తున్న ధోరణిలో మాట్లాడేవాడు; సినిమాతారల కంటె ఎక్కువగా ఆకర్షించేవాడు ప్రేక్షకుల్ని. ఆమెకూడా రాడెక్‌ను విప్లవఅవతార మూర్తిగా ఆరాధించేది. పురుషుల్లో సైతం ఇంచుమించు అటువంటి భక్తిప్రపత్తులే ఉండేవి. రాడెక్, రష్యన్ బోల్షవిక్; కాని గాలీషియా యూదు కుటుంబంలో జన్మించినవాడు; ఈ భక్తులందరకూ "అతడొక దివ్యవాణి".

ఎర్నా మెురెనా ఇంట్లో ఒకరోజున నేషనల్ బోల్షవిజాన్ని గురించి చర్చ జరిగింది; జాతీయ విప్లవ మనేది అయోమయమైన ఆదర్శమని నా అనుభవం; అందుచే జాతీయ బోల్షవిజం అనేది సందేహాస్పదమైన భావంగా పరిగణించేవాణ్ణి. చర్చలో పాల్గొనకపోవటంవల్ల రాడెక్ నా విముఖత్వాన్ని గ్రహించాడు. ఉదాహరణ పూర్వకంగా నాకు నచ్చజెప్పే ఉద్దేశ్యంతో నాదగ్గరకు వచ్చి తన తలకు మించి ఎత్తుగా నున్న నా భుజంమీద చేయివేస్తూ అన్నాడు. "మన ఇండియన్ కామ్రేడు మూర్తీభవించిన జాతీయ బోల్షివిజం. జర్మనీనే కాదు, సమస్త ప్రాచ్య ప్రపంచాన్ని జయించి కమ్యూనిజాన్ని స్థాపిస్తుంది." అతని అభిప్రాయంలోని జోస్యాన్ని నాడు గ్రహించలేకపోయాను; అందుచే రాడెక్ వాదాన్ని సమ్మతింపలేకపోయాను. "కమ్యూనిజంలో హృదయపూర్వకమైన నమ్మకం కలగాలంటే కనీసం నా విషయంలో జాతీయవాది అదృశ్యంకావాలి." అన్నాను. సభలో కొందరు సభ్యులు సమ్మతి సూచకంగా మాట్లాడారు. భారతీయ కామ్రేడ్ పొరబాటు అభిప్రాయం పట్ల రష్యన్ బోల్షవిక్ కూడా జాలి వహించాడు. కాని నాకది నచ్చలేదు; ఐనా అప్పటికిక చేసేదేమీలేకపోయింది.

అచిరకాలంలోనే జాతీయ బోల్షవిస్టు సిద్ధాంతం గాలిబుడగ లాగా బ్రద్దలైంది. ఆ ప్రమాదంలో స్పార్టాకస్ కూటమికి చావుదప్పి కన్నులొట్టపోయినంత పనైంది. లక్సెంబర్గ్ తర్వాత స్పార్టాకస్ కూటమికి నాయకత్వం వహించిన ఎర్నెస్ట్ మేయెర్ నా అభిప్రాయాలతో ఏకీభవించినవాడే. రాడెక్ మాస్కో వెళ్ళాడు, జర్మనీని జయించే ప్రణాళికతో వచ్చాడని అతనికి బ్రహ్మాండమైన స్వాగత మిచ్చారు రష్యన్ కమ్యూనిస్టులు; కాని అతని జాతీయ బోల్షవిస్టు సిద్ధాంతాన్ని లెనిన్ తిరస్కరించాడు; వార్సెయిల్సు సంధిపై జరుగుచున్న విమర్శలో ప్రతిఫలించే జాతీయవాదం నిష్ప్రయోజన మంటూ ఒక కరపత్రంలో నిందించాడు. ఆ కరపత్రం శీర్షికే "వామపక్ష కమ్యూనిజమనే బాలారిష్టం".

1920 మార్చి మొదట్లో వీమార్ రిపబ్లిక్‌ను కూలద్రోయటానికి జర్మన్ రాజరిక సైన్యం ప్రయత్నించింది. ఒకనాటి ఉదయం రాజధానిలో ప్రవేశించి కీలక స్థావరాలన్నీ ఆక్రమించింది. అరెస్టు తప్పించుకొని ప్రెసిడెంట్ ఈబర్టు, మంత్రులు బెర్లిన్ వీడి పారిపోయినారు. పోట్సుడామ్ ప్లాజాలోని హోటల్ గదికిటికీ గుండా జర్మన్ సైన్యం నలుమూలలకూ విస్తరించటం చూస్తూనే ఉన్నాను. అన్ని వర్గాల ప్రజలూ ఈ హటాత్సంఘటనకు నిశ్చేష్టులైపోయినారు; అల్లకల్లోలంలో మునిగి పోయిం దా మహానగరం.

కాని; సైన్యం ఆట కట్టించి పరిస్థితిని అదుపులోనికి తెచ్చే నాయకత్వం ఆ రాత్రికిరాత్రే తయారైంది. ఈ విచిత్ర సన్నివేశంలోనే విలియం పీక్‌ను మొదటి సారిగా కలుసుకున్నాను. చూడగానే సివిలియన్ దుస్తుల్లో ఉన్న సైనికోద్యోగి అనే భావం కలిగింది. అంత పొడగరీకాదు, పొట్టికాదు, గంభీరమైన విగ్రహం, నుదురుమీద పడే ఎఱ్ఱని ముంగురులు, గాంభీర్యాన్ని యినుమడింపజేసేవి. ఈ కమ్యూనిస్టు పార్టీ రహస్య సమావేశానికి ఎర్నెస్ట్ మేయెర్‌తో బాటు వెళ్ళాను. మేయెర్ శాంతమైన స్వభావంగల పండితుడు; సరళంగా మాట్లాడేవాడు. పీక్ స్థానంలో నాటికే పార్టీ నాయకుడైనాడు మేయెర్. పార్టీ చర్చించాల్సిన సమస్య చాల క్లిష్టమైంది; సూర్యోదయానికి పూర్వమే నిర్ణయానికి రావాల్సి ఉంది. అప్పటికే దురూహ్యములైన పరిణామాలు జరిగిపోయినై. విప్లవ ప్రతికూల శక్తులను ప్రతి ఘటించవలసినదిగా ప్రజానీకాన్ని కారల్ లీజిన్ హెచ్చరిక చేశాడు; లీజిన్ జర్మన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ అధ్యక్షుడు. లీజిన్ అభివృద్ధినిరోధకుడంటూ, కమ్యూనిస్టులు వామపక్షీయ సోషల్ డెమోక్రాట్లు నిందించారు. మరునాటి ఉదయం నుండి రాజకీయ సమ్మె జరపటానికి లీజిన్ నిర్ణయించాడు. ఈ తరుణంలో విప్లవాత్మక శ్రామిక వర్గ నాయకత్వం కర్తవ్య మేమిటి? కేవలం సంస్కరణవాది లీజిన్ చెప్పినట్లు ఆడటమా? లేక కార్యరంగం నుండి పూర్తిగా నిర్గమించటమా? లీజిన్‌ను బల పరచాలని మేయెర్ అన్నాడు. పీక్ సందేహిస్తూ ఇండిపెండెంట్ సోషలిస్టు పార్టీ నాయకులను సంప్రదించాలని సూచించాడు; ఉభయపక్షాలూ కలిసి సమ్మె ప్రకటించారు. ప్రకటనపై కమ్యూనిస్టు పార్టీ తరఫున పీక్, మేయెర్లు సంతకాలు చేశారు.

నాల్గు రోజులు పాటూ మహానగరం నిర్జీవమై పోయింది. షాపులు, కర్మాగారాలు మూసి వేశారు. పగటిపూట వీధులన్నీ నిర్మానుష్యం. రాత్రి అంతా గాఢాంధకారం. నిర్మానుష్యమైన వీధుల్లో సైనికు లెవరిమీద కాల్పులు జరుపుతారు? ఉక్కు టోపీల సైనికులు నిశ్శబ్దంగా తిరోగమనం ప్రారంభించారు. ఇది సుసంఘటిత శ్రామిక మహత్తరశక్తి! సైనిక పశుశక్తిమీద సాధించు ఘనవిజయం!

బెర్లిన్‌లో ఉండి నాటి విప్లవాన్ని స్వయంగా చూడగలగటం ఎంతో అదృష్టం. నా మనస్సులో చెరిగిపోని ముద్రవేసిన సంఘటనల్లో అదొకటి. ఆ చిత్రంలో

మేయెర్, పీక్‌లతో పరిచయం చాల ప్రధానమైంది. చివరకు వీరిలో ఒకరిని రక్తపిపాసియైన మాతృ విప్లవం కబళించింది. మాతృ భక్తితో బాటు స్వతంత్ర ఆలోచనా శక్తి ఉండటమే అందుకు కారణం! ఇక రెండవ వానిలో మాతృదేవిపై భక్తికంటె, మానసిక స్వాతంత్ర్యం సమ్మతించని ఆమె పూజారులపట్ల విధేయత ఎక్కువగా ఉండేది; అందువల్ల వారిచేత బహుమతులు పొందాడు!

రాచరిక - సైనిక ప్రతిఘటనను బ్రద్దలు చేసిన లీజీన్ అంతటితో ఆగలేదు. క్లిష్టసమయంలో అనుమానాస్పదంగా ప్రవర్తించిన నాస్కే మున్నగువారిని తొలగించి మంత్రివర్గ పునర్నిర్మాణం జరగాలని కోరాడు. ఈ సందర్భంలో కూడా శ్రామిక వర్గ నాయకులు, ఇతర వామపక్ష రాజకీయవేత్తలూ, లీజీనును బలపరచి యున్నట్లయితే, సోషల్ డెమోక్రాటిక్ రిపబ్లిక్ సుస్థిరమై జర్మనీ చరిత్రగతీ, దానితో బాటు ఐరోపా చరిత్రగతీ మరొక విధంగా ఉండేది; ఇండిపెండెంట్ సోషలిస్టులూ, వారి ననుసరించి కమ్యూనిస్టులూ, సమైక్యతను భగ్నపరచి లీజీన్‌తో సహకరించటానికి నిరాకరించారు. మేయెర్ జైల్లో ఉండటంవల్ల ఈ సంప్రదింపులను పీక్ జరిపాడు; సమయానికి మేయెర్ బైట పడకుండనిచో పీక్ నాయకత్వాన కమ్యూనిస్టుపార్టీ మరింత అధోగతిపాలై యుండేది. లీజీన్‌తో సహకరింపకపోవటమే అధోగతికి మొదటి మెట్టు. లెనిన్ జోక్యం కలిగించుకొని జర్మన్ కమ్యూనిస్టుపార్టీ పతనాన్ని అరికట్టాడు. జాతీయ వాదానికి ఎర్రరంగు పులుముతున్న పీక్ మున్నగు నాయకుల విధానాన్ని (జాతీయ బోల్షివిజం) నిశితంగా ఖండించాడు లెనిన్. అదృష్టవశాత్తూ, అదే సమయానికి స్పార్టకస్ నాయకులు విడుదలైనారు. పీక్‌ను తొలగించి మేయెర్, థాల్ హీమర్‌లు జర్మన్ కమ్యూనిస్టుపార్టీ నాయకులై జాతీయ బోల్షివిక్కులను పార్టీ నుండి బహిష్కరించారు.

## జర్మన్ కమ్యూనిస్టు ప్రముఖులు

క్యాప్ లుట్‌విజ్ కుట్ర విఫలం కావటంతో జర్మనీ అంతర్యుద్ధంలో మరొక ఘట్టం ప్రారంభమైంది. కార్మిక సంఘాల అజమాయిషీలో ఉండేటట్లు ప్రభుత్వాన్ని పునర్నిర్మించటానికై లీజీన్ చేసిన ప్రయత్నం కూడా విఫలమైంది. కాని జర్మనీలోని పారిశ్రామిక ప్రాంతాల్లో విప్లవోద్యమం తలెత్తింది. ముఖ్యంగా రీన్‌లాండ్‌లోని రూర్ లోయలోనూ, శాగ్జనీలోనూ నెలలతరబడి సాయుధతిరుగుబాట్లు చెలరేగినై. 'రూర్ ఎఱ్ఱ సైన్యాన్ని' జయించటానికై ఎబర్ట్-ముల్లర్‌ల సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వం ప్రత్యేక చర్యలను, తీసుకోవలసివచ్చింది; వారి నియామకంతో సామ్రాజ్య సైన్యానికి చెందిన జనరల్ వాన్‌సీక్ట్సు, 'రీష్‌వేర్'ను తయారు చేశాడు. ఇందలి సైనికు లందరూ కాకలుదీరినవారు. ఇరవై సంవత్సరాల తరువాత ఐరోపాను పాదాక్రాంతం గావించిన (హిట్లర్) జర్మన్ సైన్యానికి 'రీష్‌వేర్' బీజప్రాయం!

రూర్ మండలంలో జరిగిన శ్రామిక తిరుగుబాటు లోక స్వచ్ఛంద ఉద్యమం. దానికి రాజకీయ నాయకత్వంలేదు. జర్మనీలోని శ్రామికపక్షాలు మూడూ ఈ 'సాహస చర్య'కు వ్యతిరేకులే. వీరు ఒక సంయుక్త ప్రకటనచేస్తూ 'రీష్‌వేర్'తో తలపడరాదనీ, అస్త్రసన్యాసం చేయవలసిందనీ కోరారు. ఈ ప్రకటనపై కమ్యూనిస్టుపార్టీ తరఫున విలియం పీక్ సంతకం చేశాడు. నిజానికి రూర్ తిరుగుబాటు సఫలమయ్యే అవకాశం ఏమాత్రం లేదు; దానికి దేశీయ విదేశీయ శత్రువు లెందరో ఉన్నారు; వారికి అండగా మిత్రమండలి విజయసైన్యం సిద్ధంగానే ఉంది. వాస్తవానికి వీమార్ రాజ్యం ఇచ్చిన హక్కులతో కంటె, మిత్రమండలి వారిచ్చిన పరోక్ష ప్రోత్సాహంతోనే 'రీష్‌వేర్' నిర్మాణం జరిగింది.

మధ్య జర్మనీలో మాత్రం విప్లవం మరికొంత ముందంజ వేసింది; ఇందులోనే హెన్రీచ్ బ్రాన్‌డ్లర్ పైకి వచ్చాడు. అనతికాలంలోనే బ్రాన్‌డ్లర్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడై 1923 లో రెండవ జర్మనీ విప్లవం విఫలమయ్యే వరకూ ఆ పదవిలో ఉన్నాడు. బ్రాన్‌డ్లర్ హఠాత్తుగా పైకి వచ్చిన రకం కాదు; వృత్తిరీత్యా తాపీ పనివాడు. స్వయంకృషితో తన వృత్తిలో ఉత్తమశ్రేణికి రాగలిగినవాడు. యౌవనంలో ఐరోపా అంతట పర్యటించాడు; మధ్యయుగ సాంప్రదాయాన్ననుసరించి వివిధ దేశాల్లో తన వృత్తి మేస్త్రీల క్రింద పనిచేస్తూ పర్యటనకు ధనాన్ని సంపాదించాడు. స్విట్జర్లాండ్‌లో లెనిన్‌ను కలుసుకొని బోల్షవిక్ ప్రవాసులతో కొంతకాలం గడిపాడు. 20 వ శతాబ్ది ప్రారంభం నుండి సోషల్ డెమోక్రాటిక్ పార్టీలో సభ్యుడు. చివరకు చిమిన్‌ట్జ్ దగ్గర స్థిరనివాస మేర్పరచుకొని స్థానిక కార్మికులను కూడగట్టి పటిష్టమైన రాజకీయ ఉద్యమాన్ని నెలకొల్పాడు. బెర్లిన్‌లో సైనిక కుట్ర సమాచారం అందిన వెంటనే బ్రాన్‌డ్లర్, చిమిన్‌ట్జ్ సిటీహాలులో శ్రామిక సంఘాన్ని (సోవియట్) నెలకొల్పి నగరపరిపాలన సాగించటానికి యేర్పాట్లు చేశాడు. నగరంలో విప్లవ ప్రతిఘటనకు తోడ్పడినవారందరూ అరెస్టయినారు. సుప్రసిద్ధ పారిశ్రామిక కేంద్రమైన లీప్జిగ్ నాక్రమించి, సాక్సనీ జిల్లా నగరాలనుండి విప్లవశ్రామికులతో సైన్యాన్ని తయారుచేసి బెర్లిన్ నగరంపై దండెత్తాలని బ్రాన్‌డ్లర్ సన్నాహం.

బ్రాన్‌డ్లర్ సన్నాహాలు చేస్తున్న సమయంలోనే జర్మన్ రాజకీయరంగం మీద మరొక విచిత్ర వేషధారి ప్రత్యక్షమైనాడు. అతడు మాక్స్‌హోలెజ్, శాక్సనీ ఎగువ భూముల నుండి పేద రైతులతో ఒక గెరిల్లా సైన్యాన్ని తయారుచేశాడు. ఈలోగా బెర్లిన్ సైనిక కుట్ర విఫలమైంది. బ్రాన్‌డ్లర్ తాపీగా కమ్యూనిస్టు ఉద్యమాన్ని బలపరచసాగాడు. హోలెజ్ గెరిల్లా విధానాన్ని నిరసించి బ్రాన్‌డ్లర్, హోలెజ్‌ను కమ్యూనిస్టుపార్టీ నుండి బహిష్కరించాడు. ఐనా, హోలెజ్ అంటే ప్రజల్లో విపరీతమైన అభిమాన ముండేది; అతని శౌర్య ధైర్యాలను కట్టుకథలుగా

చెప్పుకొంటూ ఉండేవారు. అందుచే హాలెజ్‌ను స్వయంగా దర్శించి కేంద్రజర్మనీ పరిస్థితులను గురించి నివేదిక సమర్పించవలసిందిగా కేంద్ర కమ్యూనిస్టుపార్టీ ఒక ప్రతినిధిని నియమించింది.

మాక్స్ హాలెజ్‌ను గురించి విన్న తరువాత ఆతని కార్యక్రమాలను స్వయంగా పరిశీలించాలనే అభిలాష నాలో ఎక్కువైంది. అప్పటికి జర్మన్ కమ్యూనిస్టుపార్టీ నాయకుడుగా పీక్ స్థానంలో ఆగస్ట్ థాల్ హీమర్ వచ్చాడు; భావనాత్మకమైన నా ఉత్సాహాన్ని చూచి నవ్వి నా ప్రయాణానికి ఏర్పాట్లు చేశాడు. కాని, హాలెజ్‌ను కలుసుకోలేకపోయినాను. అతనికి బదులు చిమిన్‌టజ్‌లో బ్రాన్‌డ్లర్‌ను చూడటం తటస్థించింది. హాలెజ్‌ను మాత్రం 1928లో మాస్కోలో కలుసుకున్నాను. ఈలోగా అతడు ఏడు సంవత్సరాల జైలు శిక్ష ననుభవించాడు.

బెర్లిన్‌నుండి, నేనూ, గురాల్‌స్కీ ఇద్దరం కలసి ప్రయాణం చేశాము. గురాల్‌స్కీ అప్పుడే మాస్కో నుండి కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ ప్రతినిధిగా వచ్చాడు. బొరొడిన్ ద్వారా మా యిద్దరికీ పరిచయమైంది. కాని గురాల్‌స్కీకి తాను జర్మన్ అనీ, తన పేరు 'క్లీన్' అనీ చెప్పుకొనటం యిష్టంగా ఉండేది. రూపంలోగానీ, బుద్ధిలోగానీ బొరొడిన్‌కి ఏమాత్రం సరిపోడు. ఇతడొక విచిత్రమైన తూర్పు ఐరోపా యూదు జాతీయుడు. విలాసంగా దుస్తులు ధరించేవాడు; తన కర్తవ్యాన్ని గురించి చాల గోప్యంగా ఉండేవాడు. జర్మనీలోనేగాక, పెయిట్‌నిస్కీకి ఆంతరంగిక కార్యదర్శిగా ఫ్రాన్సులోగూడా మంచి హోదాలోకి వెళ్ళాడు. పెయిట్‌నిస్కీ, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ రహస్యశాఖకు ఆధిపత్యం వహించి జాతీయ కమ్యూనిస్టుపార్టీశాఖలకు ధనసహాయంచేస్తూ ఉండేవాడు (1920-30).

బ్రాన్‌డ్లర్, గురాల్‌స్కీలు జర్మన్‌లో మాట్లాడుకున్నారు. నాకేంఅర్థంకాలేదు. బ్రాన్‌డ్లర్ నా ఉనికినే గమనించినట్లు లేదు. అతని ఆకృతి, ముఖ్యంగా ఆతని స్వరం నన్ను ఆకర్షించింది. కోపం వచ్చినప్పుడు బుల్‌డాగ్ మొరిగినట్లుండేది అతని స్వరం. చాల పెద్ద తల. విశాలమైన ముఖం; కాని కురుచ విగ్రహం, దానికితోడు గూని వీపు; తాపీ పనిచేస్తున్న రోజుల్లో ఎత్తుమీది నుంచి పడ్డాడట; వెన్నెముకకు దెబ్బ తగిలి గూని యేర్పడింది. భౌతిక లోప పరిజ్ఞానం మనిషిలో మానసిక దౌర్బల్యాలకు కారణమౌతుందని మానసిక శాస్త్రవేత్త లంటారు. మొదటి సమావేశంలో బ్రాన్‌డ్లర్ నన్ను పూర్తిగా నిర్లక్ష్యం చేశాడు; నాకది బాధ కలిగింపకపోలేదు; తరువాత ఉభయులమూ సన్నిహితంగా కలసి పనిచేయవలసి వచ్చినది. అప్పుడు గ్రహించాను; బిడియం తప్ప బ్రాన్‌డ్లర్‌లో ఏ దౌర్బల్యమూ లేదు. ఆ బిడియాన్ని కూడా తన గంభీర స్వరంతో కప్పిపుచ్చేవాడు. ఐనా, ప్రజాఉద్యమ లోనాయకుని బిడియం, మానసిక దౌర్బల్యానికి చిహ్నమనే చెప్పాలి.

ఇటాలియన్ కమ్యూనిస్టు నాయకుడైన అన్‌టానియో గ్రామీసీ కూడా గూని వాడే. మాస్కోలో ఉండగా గ్రామీసీని కలుసుకున్నాను. అతడు శ్రామికుడు కాడు. విద్యావంతుడు, తత్వశాస్త్ర ఆచార్యుడు. బ్రాన్‌డ్లర్ కంటె వేయిరెట్లు ఎక్కువ బిడియస్థుడు గ్రామీసీ. నలుగురిలో ఎప్పుడూ మాట్లాడేవాడేకాదు; చిన్నప్పుడే అరెస్టయి 22 సంవత్సరాలు జైలు శిక్ష అనుభవించాడు. అసలే బలహీనుడు; చిరకాల జైలువాసం అతని ఆరోగ్యాన్ని పూర్తిగా హరించింది. విడుదలైన వెంటనే మరణించాడు. యువకుల్లో క్రోసేపై అభిమానానికిగల కారణాల్ని పరిశీలిస్తూ మార్క్సిస్టు తత్వాన్ని పునఃపరిశీలించవలసిన అవసరం కలదనీ, ఐనచో మార్క్సిజం కూడా ఆదర్శవాదం పట్ల అభిమానం ఉన్నవారిని సైతం తృప్తిపరచగలదనీ గ్రామీసీ గ్రహించాడు; జైల్లో ఉండగా సుమారు 2000 పేజీలు రచన చేశాడు; ఇంతవరకూ ఏ కమ్యూనిస్టు చేయని తాత్త్విక రచన.

బ్రాన్‌డ్లర్ విజ్ఞాని కాదు; మార్క్సియన్ సాహిత్యంలో ఆదర్శప్రాయుడుగా వర్ణింపబడిన శ్రామికుడు. స్వయం కృషితో ఉన్నతమైన విద్యనే ఆర్జించాడు. అతనిలో ఆత్మవిశ్వాసమూ, శ్రామికవర్గంలో విశ్వాసమూ సమంగా ఉండేవి; నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించే వర్గానికి చెందినవాడననే గర్వం అతనిలో వ్యక్తమౌతూ ఉండేది. అతనితోపాటు కమ్యూనిస్టుపార్టీకి నాయకత్వం వహించినవారందరూ విద్యావంతులే; వారిలో పేర్కొనదగినవారు ఎర్నస్ట్ మేయెర్, ఆగస్టుథాల్ హీమర్, పాల్ లెవీ, పాల్ ఫ్రొవిచ్. లలితకళలు, సారస్వతం, న్యాయతత్త్వ ఆర్థికశాస్త్రాల్లో వీరందరూ ప్రవీణులు. వీరందరూ బ్రాన్‌డ్లర్‌లోని లౌక్యాన్ని, లోకజ్ఞానాన్ని అభినందించేవారు; సిద్ధాంతానికిగానీ, ఆచరణకుగానీ సంబంధించిన ఏ సమస్యనైనా లోకానుభవంతోనే పరిశీలించేవాడు బ్రాన్‌డ్లర్.

సురాల్‌స్కీతో మాట్లాడే బ్రాన్‌డ్లర్‌ను పరిశీలించేటప్పుడు నా కాతనిపై మిశ్రమ భావాలు కలిగినై. సురాల్‌స్కీ అధికార భావాన్ని ప్రదర్శించాడు; బ్రాన్‌డ్లర్ అదేమీ లక్ష్యంచేయక సురాల్‌స్కీ అడిగే ప్రశ్నలంత ముఖ్యమైనవి కావనే ధోరణిలో సమాధానాలు చెప్పాడు. సంభాషణ చివర్లో నన్నుద్దేశించి 'వలసరాజ్యాల్లో కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని అనుసరించేవారుండటం అసంభవ'మంటూ మాట్లాడాడు. ఐరోపాలోని శ్రామికవర్గానికిగల అభిప్రాయమే అది. ఈ ప్రథమ సమావేశంలో బ్రాన్‌డ్లర్ పట్ల యేర్పడిన వైమనస్యం చివరివరకూ నిలిచిపోయింది. 1922 లో బ్రాన్‌డ్లర్ మాస్కో వచ్చాడు. అక్కడే మాకు బాగా పరిచయమేర్పడింది. 1923 లో రెండవ జర్మన్ విప్లవాన్ని బ్రాన్‌డ్లర్, నేనూ కలసి నడిపాం. ఐనా మా యిద్దరి మధ్య మైత్రి యేర్పడలేదు; అందుకు నాలో అసనిపట్ల మొదట కలిగిన, వైమనస్యమూ, అతనిలోని బిడియమూ కారణాలై యుండవచ్చు.

కాని కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ నాల్గవ ప్రపంచ మహాసభలో, రష్యన్లు, రెండవ జర్మన్ విప్లవం విఫలం కావటానికి బాధ్యుడు బ్రాన్‌డ్లరేనని నిందించినప్పుడు మాత్రం బ్రాన్‌డ్లర్ పట్ల వైమనస్యాన్ని మాని, అతణ్ణి సమర్థించాను. ఐనా బ్రాన్‌డ్లర్‌ను పార్టీ నాయకత్వం నుండి తొలగించారు. నాటినుండి బ్రాన్‌డ్లర్ ఇంచుమించు విరాగియైపోయినాడనే చెప్పవచ్చు. తిరిగి 1929 లో బ్రాన్‌డ్లర్‌ను బెర్లిన్‌లో కలుసుకొన్నాను. అప్పటికి మేము ఒకరినొకరు పూర్తిగా అర్థంచేసికోగలిగాం. బ్రాన్‌డ్లర్ హృదయం చాల ఆర్ద్రమైంది; అతడు విశ్వాసపాత్రుడైన మిత్రుడు అనే భావం కలిగింది.

మొదటినుండీ ఆగస్ట్‌థాల్ హీమర్‌తో నా సంబంధం కేవలం వ్యక్తిగత మైత్రియే. శ్రామికవర్గాన్ని సాంఘికంగా ఉద్ధరించే కృషికి జీవితాన్ని అంకితం చేశాడు థాల్ హీమర్. ఐనా, అతణ్ణి విప్లవకారు డనటంకంటె పండితుడనటమే యుక్తం. విప్లవానికి అంకితం కాకుండినచో ఉపాధ్యాయవృత్తిలో అతడు చాల ఉన్నత శిఖరాల నందుకొనేవాడు. నాల్గవ ప్రపంచ మహాసభలో రెండవ జర్మన్ విప్లవం విఫలం కావటానికి బ్రాన్‌డ్లర్‌తో బాటు థాల్ హీమర్‌నుకూడా నిందించారు; ఆ సందర్భంలో థాల్ హీమర్‌ను "స్వప్నలోకంలో విహరించే విచిత్ర జర్మన్ ఆచార్యుడు" అని వర్ణించాడు రాడల్. రాడల్‌కు నోటితీట ఎక్కువ! కాని థాల్ హీమర్ విషయంలో మాత్రం రాడల్ వర్ణనలో సత్యం లేకపోలేదు. తరచుగా పార్టీ పొలిట్‌బ్యూరో సమావేశాలకు హాజరయ్యేవాడుకాదు థాల్ హీమర్; ఆ సమయాల్లో ఒక కేఫ్‌లో ఒంటరిగా కూర్చుని ఉన్నత గణితశాస్త్ర సమస్యలను గురించి ఆలోచిస్తూ ఉండేవాడు. ప్రక్కనే బీర్‌గ్లాసు. అది ఎప్పుడూ ఖాళీకాదు; కానీ కర్తవ్యస్మరణ, స్వప్నజగత్తులోనుండి అతణ్ణి వాస్తవ ప్రపంచంలోకి తీసుకొనివచ్చేది. అదేవిధమైన దీక్షతో, నిశితబుద్ధితో విప్లవ సిద్ధాంతాలను, విప్లవ కార్యక్రమాలను గురించి ఆలోచించేవాడు. గణితశాస్త్రంతోబాటు భాషాశాస్త్రం (Philology) కూడా అతని అభిమానాన్ని చూరగొన్నది. జర్మన్ పండితలోకంలో పాణినిమీద అధికారిగా పరిగణింపబడేవాడు థాల్ హీమర్. (పాణిని భారతీయ వ్యాకరణవేత్త. క్రీ. పూ. 6 వ శతాబ్దివాడని ప్రసిద్ధి.) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సిద్ధాంత కర్తలలో ఒక బుఖారిన్ వినా, థాల్ హీమర్‌ను మించినవారులేరు. పార్టీనుండి బహిష్కరింపబడిన తరువాతకూడా థాల్ హీమర్‌ను అదేవిధంగా గౌరవించేవారు.

నేను బెర్లిన్ చేరిన తరువాత మొట్టమొదట కలుసుకొన్న కమ్యూనిస్టు నాయకుడు థాల్ హీమరే; అది డా. ఎడ్వర్డు ఫూక్సు ఇంట్లో. ఎర్నామెయిరినా విలాస మందిరంలో చేరటానికి సమ్మతింపని ప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకులు ఫూక్సు ఇంట్లో సమావేశమయ్యేవారు. బెర్లిన్ సమీపంలో పైన్‌తోటలో ఉండేది ఫూక్సు ఇల్లు.

వాస్తవానికి అదొక ఆర్ట్‌గ్యాలరీ, సాంస్కృతిక ప్రదర్శనశాల. అతని ఇంట్లోని గ్రంథాలయంలో కళ, సంస్కృతీ, చరిత్రలను గురించిన గ్రంథాలెన్నో ఉన్నై. ఒక్కొక్క గది, ఒక ప్రత్యేక పద్ధతిలో అలంకరింపబడి, మంచి అభిరుచికీ, విలాసానికీ నిదర్శనంగా ఉండేది. అన్నిటిలో 'బీరువాను' ఎంతో జాగ్రత్తగా చూచుకొనేవాడు ఫూకు. అంతా గ్రీకు సాంప్రదాయానుగుణంగా ఉండేది. నన్ను థాల్‌హీమర్‌కు పరిచయంచేస్తూ అన్నాడు. "రాయ్‌నిగురించి బోరోడిన్ చెప్పినదానినిబట్టి అందరికంటె ముందుగా అతణ్ణి మీకే పరిచయంచేయటం సమంజస మనుకుంటాను." థాల్‌హీమర్ కుర్చీనుండి లేచి పైప్‌పై దృష్టి నిల్పి ఏదో ఆలోచిస్తున్నాడు. తరువాత యెర్నెస్టు మేయర్ వచ్చి కలిశాడు. ముగ్గురూ ఇంగ్లీషులో సంభాషణ జరిపారు. అది సాధారణ విషయాలను గురించే. అప్పటికి జర్మన్ పత్రికల్లో ఇండియాలోని సహాయ నిరాకరణోద్యమాన్ని గురించిన వార్తలు స్వల్పంగా ప్రకటింపబడుతున్నై. నా క్రొత్తమిత్రులలో ఆ వార్తలను గురించి ఎక్కువగా తెలిసికోవాలనే ఆరాటం కన్పించింది. నన్ను ప్రశ్నించారు. నాటి ఇండియా పరిస్థితినిగురించి వారికి నేనేమీ వివరించలేకపోయాను. ఇండియాను గురించి నా అజ్ఞానం వారికి ఆశ్చర్యం కలిగించింది. చివరికి మా అందరి లక్ష్యం ఒకటేనని గ్రహించగలిగాం.

ఆ తరువాత మేము తరచుగా సమావేశమౌతూ ఉండేవాళ్ళం; పార్టీ రహస్య సమావేశాలకుగూడా నన్ను ఆహ్వానించేవారు; అందు ప్రస్తుత విప్లవసమస్యలను గురించి చర్చ జరిగేది. ఆ చర్చలవల్ల నాకెంతో లాభం కలిగింది. అనతికాలంలోనే నేనూ ఆ చర్చల్లో పాల్గొనగలిగాను. నాకోసం చర్చలను థాల్‌హీమర్ ఇంగ్లీషులోనికి తర్జుమా చేసి చెప్పేవాడు. అప్పటికి పాల్ లెవీ ఇంకా జైల్లోనే ఉన్నాడు; బ్రాన్డ్లర్ దూరంగా శాక్సనీలో ఉన్నాడు; థాల్‌హీమరే పార్టీనాయకుడు. అతని మైత్రి ఫలితంగానే జర్మన్ కమ్యూనిస్టుపార్టీనాయకుల్లో నాకూ ఒక స్థానం లభించింది. జర్మన్ కమ్యూనిస్టులు నన్ను ప్రేమతో గౌరవంతో చూచేవారు.

## జర్మనీలో వామపక్ష కమ్యూనిజం

పరాజయం పొందిన సైనిక ఉద్యోగిబృందం సలహాపైగాని, సోషల్ డెమోక్రాటిక్ ప్రభుత్వం వర్సేయిల్స్ సంధిపై సంతకాలు చేయలేకపోయింది. రష్యాతో సంధిచేసికొని యుద్ధం కొనసాగించాలని చిన్న సైనికోద్యోగుల సలహాలను సేనాపతులు త్రోసివేశారు. అతిజాతీయవాదుల దృష్టిలో వర్సేయిల్స్ సంధి సమ్మతించటంతో, జర్మనీలో జాతీయ బోల్షివిజం సమాధి పొందినట్లే. తిరిగి రెండుసంవత్సరాల తరువాత రూర్‌లోయలో కార్మికులూ, యువకజాతీయవాదులూ పరస్పర సహకారంతో ఫ్రెంచి ఆక్రమణను ప్రతిఘటించి, భారీ విధ్వంసక చర్యలు సాగించటంతో అతిజాతీయ వాదం విజృంభించింది.

రూర్ విధ్వంసక చర్యలకు నాయకుడైన ష్లాగెటర్‌ను, ఫ్రెంచి సైనికులు పట్టుకొని వధించారు. అతిజాతీయవాదానికి ప్రతినిధి ష్లాగెటర్. కాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ ప్రపంచ మహాసభలో ష్లాగెటర్‌నుగురించి రాడెల్ ఉద్రేక పూరితమైన ఉపన్యాసంచేశాడు. "పితృభూమిని మిత్రమండలి సామ్రాజ్యవాదానికి వలసగా మార్చివేసిన వర్సెయిల్స్‌సంధిపై తిరుగుబాటుచేసిన జర్మన్ విప్లవశక్తి స్వరూపం"గా ష్లాగెటర్‌ను వర్ణించాడు. రాడెల్ మాట్లాడింది రష్యన్ కమ్యూనిస్టు పార్టీతరఫున; కాని, మహాసభ ఆ ఉపన్యాసాన్ని ఎంతగానో హర్షించింది. ప్రపంచం లోని కమ్యూనిస్టు పత్రికలన్నీ రాడెల్‌ను, అతని ఉపన్యాసాన్ని శ్లాఘిస్తూవ్రాసినై. నేనుకూడా సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటిస్తూ జాతీయవాదం నిర్వహిస్తున్న విప్లవా త్మక పాత్రనుగురించీ దానికి ప్రతినిధియైన ష్లాగెటర్‌నుగురించీ, 'ప్రావడా' లో ఒక వ్యాసం వ్రాశాను. అప్పటికే నా రాజకీయభావాలు, కార్యక్రమాలు గ్రహించి యున్న అతి జాతీయవాద జర్మన్ యువకులకు, నా ష్లాగెటర్ వ్యాసంతో నామీద అపారమైన అభిమాన మేర్పడింది.

జర్మన్ కమ్యూనిస్టుపార్టీలో నేషనల్ బోల్షివిస్టుముఠాకు నాయకులు హెన్రీచ్ లాఫెన్‌బర్గ్, ఫ్రిట్జ్ వుల్ఫ్‌స్టీన్ అనువారు. వీరిద్దరూ ఒకప్పుడు సోషల్ డెమోక్రాటిక్ పార్టీసభ్యులే. యుద్ధకాలంలోనూ, అనంతరమూ, ఆ పార్టీనాయకుల విధానాలతో విసుగెత్తి కమ్యూనిస్టులతో చేరారు. 1918 క్రీస్తుసమయంలోను, అనంతర అంతర్యుద్ధంలోను, స్పార్టకస్‌కూటమికూడా నిర్దుష్టవిధానాలను అనుసరించలేక పోయింది. జర్మనీలో శ్రామికవర్గం అధికారాన్నిపొందే సమయం ఇంకా రాలేదని రోసా లక్సెంబర్గ్ అభిప్రాయం; అదీగాక ఆమె బోల్షివిక్కుల సాయుధకుట్ర కార్య క్రమాన్ని తీవ్రంగా ఖండించేది. క్రమంగా సోషల్‌డెమోక్రాట్ల విద్రోహకర సంస్కరణ విధానాన్ని ఖండించి, శ్రామికవర్గం కమ్యూనిస్టుపక్షం వహిస్తారనీ, అపుడు కమ్యూనిస్టుపార్టీ చట్టబద్ధంగా అధికారాన్ని వహిస్తుందనీ లక్సెంబర్గ్ విశ్వాసం. రెండవ ప్రపంచ మహాసభ జరిగేవరకూ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌పై లక్సెంబర్గ్ అభిప్రాయాలే బలంగా పనిచేస్తుండేవి.

కమ్యూనిస్టుల్లో ఆవేశపరులైన యువకులకు లక్సెంబర్గ్ విధానం కేవలం సోషల్‌డెమోక్రాటిక్ సాంప్రదాయంగా కన్పించింది. అందుకు ప్రత్యామ్నాయంగా వారిని నేషనల్ బోల్షివిజం ఆకర్షించింది. లాఫెన్‌బర్గ్, వుల్ఫ్‌స్టీన్‌లకు పార్టీలో మంచి పలుకుబడి లభించింది. కాని లక్సెంబర్గ్ తరువాత పార్టీ నాయకత్వం వహిం చిన విలియంపీక్, పాల్ లెవీలు నేషనల్ బోల్షివిజాన్ని గర్హించారు. పాల్ లెవీ చిరకాలంగా లక్సెంబర్గ్‌తో కలసి పనిచేయటమే కాక ఆమె అభిప్రాయాలతో పూర్తిగా నేకీభవించినవాడు; అంతేగాక రాడల్ మిత్రుడు; నేషనల్ బోల్షివిజం

పట్ల రాడల్ అభిప్రాయాలను గ్రహించినవాడు. లాఫెన్‌బర్గ్, వుల్ఫ్‌స్టీన్‌లు జైల్లో రాడల్‌ను కలుసుకొని అతిజాతీయవాద విప్లవంతో సహకరించటానికి అతని అనుమతి పొందారు. ఈ ఉద్యమం క్రమంగా శ్రామికవర్గ నియంతృత్వ స్థాపనకు దారి తీయ గలదని వీరి అభిప్రాయం. చట్టసమ్మతంగా అధికారాన్ని వశపరచుకోవాలి అనే లెవీ విధానానికి నేషనల్ బోల్షివిజం వ్యతిరేకం. అందుచే 1919 అక్టోబర్‌లో హీడెల్‌బర్గ్‌లో కమ్యూనిస్టుపార్టీ ద్వితీయ మహాసభ జరగటానికి ముందుగానే లాఫెన్‌బర్గ్, వుల్ఫ్‌స్టీన్‌లను పార్టీనుండి బహిష్కరించాడు పాల్ లెవీ.

హీడెల్‌బర్గ్ పార్టీ మహాసభలో జాతీయ బోల్షివిజమే వామపక్ష కమ్యూని జంగా రూపొందింది. దానికి హాజరైన ప్రతినిధుల్లో అధికసంఖ్యాకులు లెవీ, పీక్‌ల కార్యక్రమాన్ని సంస్కరణవాద మంటూ తిరస్కరించారు. వారు పార్టీనుండి విడి పోయి 'కమ్యూనిస్టు శ్రామికుల పార్టీ'గా నేర్పడి సాయుధకుట్ర ద్వారా అధికా రాన్ని వశపరచుకోవటమనే బోల్షివిక్ విధానాన్ని అనుసరించారు.

నేను బెర్లిన్ చేరిన సమయానికే, బొరొడిన్, హీడెల్‌బర్గ్ సభకు వెళ్ళాడు. ఆ సభ చాల రహస్యంగా జరిగింది. అక్కడ ఏం జరిగిందీ తరువాత బొరొడిన్ చెప్పాడు. హాలెండు దేశీయుడైన హెర్మన్ గోర్టర్ వామపక్ష కమ్యూనిస్టు సిద్ధాంతకర్త. దీన్నే రెండవ ప్రపంచ మహాసభకు ముందు లెనిన్ 'బాలారిష్టం' గా వర్ణిస్తూ ఒక కరపత్రాన్ని ప్రచురించాడు. ఈలోగా జర్మనీలో అంతర్యుద్ధం తీవ్ర తరమై బెర్లిన్ రక్తరహిత యుద్ధం (మార్చి 1920) తో విప్లవప్రతిఘటన కూలి పోయింది. 'రూర్ ఎఱ్ఱ సైన్యాన్ని' తయారు చేసినవారు కమ్యూనిస్టు శ్రామిక సభ్యులే. నాకు గూడా వామపక్ష కమ్యూనిజం పట్లనే అభిమానం వుండేది. గోర్టర్‌ను కలుసుకోవాలని అనుకున్నాను. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ బాల్యదశలో ప్రతిభావంతులుగా డచ్చి మార్క్సిస్టులు పేరుపొందారు. రచయితగా గోర్టర్ మంచి కీర్తి సంపాదించాడు. మిగిలినవారిలో సుప్రసిద్ధులు హెన్రియెట్టీరోలెండ్ హాల్స్, యాన్‌టన్ పానెకాక్, జె. రట్‌గర్స్, స్నీవ్‌లీట్. బెర్లిన్ నుండి హాలెండు వెళ్ళటానికి వీలుచిక్కలేదు. స్నీవ్‌లీట్‌ను బెర్లిన్‌లోనే కలుసుకున్నాను. అతడు రెండవ ప్రపంచ మహాసభకు ప్రతినిధిగా మాస్కోకు ప్రయాణంచేస్తూ బెర్లిన్ వచ్చాడు. స్నీవ్‌లీట్ సూచనపై రట్‌గర్స్ నన్ను చూడటానికి స్వయంగా బెర్లిన్ వచ్చాడు. రోలండుహాల్స్‌ను మాస్కోలో ప్రపంచ మహాసభలో కలుసుకున్నాను, పానెకాక్, గోర్టర్లను 1922 లో హాలెండు వెళ్ళినప్పుడు చూచాను.

హెన్రియెట్టీరోలెండుహాల్స్ ప్రపంచ యుద్ధానికి పూర్వమే కవయిత్రిగా పేరు సంపాదించింది. నోబెల్ ప్రైజ్ కూడా రావచ్చు ననుకొంటూ ఉండేవారు. కాని ఆమె రచనలన్నీ డచ్చి భాషలోనే ఉన్నై. ఫ్లెమిష్‌లో కూడా కొన్ని ఉన్నై.

అవి ప్రధాన ఐరోపా భాషలలోనికి తర్జుమా కాలేదు. అందుచే కవయిత్రిగా ఆమె కీర్తి మాతృదేశానికి మాత్రమే పరిమితమై పోయింది. రోలెండు ధనికవర్గంలో జన్మించింది. తన రాజకీయ భావాలతో నేకీభవించని ఫ్లెమిష్ జమిందారును పెండ్లాడింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు ప్రతినిధిగా హాజరైంది. కాని చర్చల్లో పాల్గొన లేదు; రట్‌గర్స్, స్నీవ్‌లీట్ల ద్వారా ఆమెతో నాకు పరిచయ మేర్పడింది. సాంఘిక విప్లవ సిద్ధాంతంపట్ల ఆమె అభిమానం ప్రధానంగా భావనాత్మకం. కాని కమ్యూనిజాన్ని సవిమర్శకంగా పరిశీలించింది. ఏమైనా ఆమె భావాలు, మార్క్సుకు పూర్వముండిన ఆదర్శవాదుల భావాలతో ఏకీభవించేవి. వామపక్షీయ కమ్యూనిస్టు వర్గానికి చెందియున్నందున, రోలెండుకు లెనిన్ అనుసరిస్తున్న క్రొత్త ఆర్థిక విధానం (N. E. P.) నచ్చలేదు. మాస్కో నుండి ఆశాభంగంతో స్వదేశానికి మరలింది.

రోలెండు గ్రామీణ గృహం ఫ్లెమిష్ సరిహద్దుల్లో వుంది. 1922 లో కొన్ని రోజులు అక్కడ ఉన్నాను; అప్పుడు రోలెండ్ భర్తతో పరిచయమైంది. చాల చిత్రమైన వ్యక్తి. సోషలిజాన్ని గానీ, కమ్యూనిజాన్ని గాన్ని ద్వేషించడు గానీ, వానిని గురించి పట్టించుకునేవాడు కాడు. తన పొలంలో కూలీలతో కలిసి పనిచేసేవాడు. సాయంత్రం భోజనానికి ఇంటికి రావటానికి బదులు, కొందరు కూలీలతో బాటు దగ్గర్లో నున్న హోటల్లో గడిపేవాడు. రోలండుకు భర్తకు మధ్యగల సంబంధం ఎక్కువగా ఆదర్శ ప్రేమికుల మధ్యనుండే సంబంధం. దాంపత్య సంబంధాలపట్ల ఎవరూ శ్రద్ధవహించినట్లు కనబడదు. వారికి సంతానమూ లేదు. ఐనా సుఖంగానే వుండేవారు. ట్రాట్‌స్కీ స్టాలిన్ పోటీలో రోలండ్, ట్రాట్‌స్కీ పక్షం వహించింది. ఉద్రేకవంతులైన కమ్యూనిస్టు లందరూ, అంతే చేశారు. అందువల్ల పార్టీ నుండి రోలెండ్‌ను బహిష్కరించారు. అంతటితో రోలెండు రాజకీయాల నుండి వైదొలగి భక్తురాలై కాథలిక్ చర్చిలో చేరింది.

యాన్‌టన్ పానెకాక్ ఖగోళశాస్త్రజ్ఞుడుగా ఐరోపా అంతటా ప్రసిద్ధి చెందాడు. మార్క్సిజంలో అతని అభిరుచి తాత్వికమైంది; రాజకీయాల్లో అంత శ్రద్ధ వహించేవాడు కాదు. 'హిల్ వెర్‌శమ్' అబ్జర్వేటరీలో మహర్షిలాగా జీవితం గడిపేవాడు. హాలెండు వెళ్ళినప్పుడల్లా అక్కడికి వెళ్ళి పానెకాక్‌ను చూచేవాణ్ణి. గోర్టర్ అతని ముఖ్యస్నేహితుడు. గోర్టర్ అభిప్రాయంలో "బోల్షివిజం కేవలం విప్లవ అవకాశవాదం! లెనిన్ నిందించిన వామపక్ష కమ్యూనిజమే మార్క్సిజానికి అనుగుణమైంది."

రట్‌గర్స్ ఇంజనీరు. వలస ఉద్యోగిశాఖలో చేరి కొన్ని రోజులు ఇండోనీషియాలో ఉన్నాడు. వలసదోపిడీ విధానం స్వయంగా చూచి చాల బాధ చెందాడు.

స్వదేశానికి తిరిగి వచ్చి సోషలిస్టుపార్టీలో చేరాడు. అతని ప్రోత్సాహంతోనే సోషలిస్టుపార్టీ, వలసలలో శ్రామికోద్యమాలు నడపటానికి పూనుకొని స్నీవ్‌లీట్‌ను ఇండొనీషియాకు పంపింది. రష్యాలో విప్లవానికి పూర్వమే రట్‌గర్స్ స్విడ్జర్లాండులో బోల్షివిక్కులను కలుసుకొన్నాడు. విప్లవానంతరం దేశపునర్నిర్మాణంలో బోల్షివిక్కులకు సహాయం చేయటానికై, రష్యా వెళ్ళాడు. కాని 'యుద్ధ కమ్యూనిజం' (War-Communism) అంతర్యుద్ధాల కాలంలో రష్యాలో పునర్నిర్మాణకార్యక్రమం చురుకుగా సాగలేదు. మొదటి ప్రపంచ మహాసభ తరువాత రట్‌గర్స్ హాలెండు తిరిగి వచ్చాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పశ్చిమ ఐరోపాశాఖను నిర్మించే బాధ్యత అతనికి అప్పగించబడింది. రోలెండ్ - హోల్స్, డేవిడ్, విజిన్‌కూప్ ఈ శాఖలో చేరారు. విజిన్‌కూప్ డచ్చి పార్లమెంటులో సభ్యుడు.

వలస రాజ్యాల్లో విప్లవోద్యమాలను గురించి రట్‌గర్స్ ప్రత్యేక శ్రద్ధ వహించాడు. పరాధీన ప్రజల నుద్ధరించటానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏ విధంగా సహకరింపగలదో చర్చించటానికై బెర్లిన్‌లో నన్ను కలుసుకొన్నాడు. ఆ విషయానికి రెండవ ప్రపంచ మహాసభ ఎజెండాలో ప్రముఖస్థాన మీయవలసిందిగా వాదించమని కోరాడు. స్నీవ్‌లీట్ కూడా హాజరై బలపరుస్తాడు. కాని నేను ప్రతిపాదించాలి అని రట్‌గర్స్ పట్టుదల. రట్‌గర్స్ ఆ మహాసభకు హాజరు కాలేదు. కాని 1921 లో మాస్కో వచ్చాడు. సైబీరియాలో పారిశ్రామికాభివృద్ధికి గల మహదవకాశాలను పరిశోధించిన మొదటి ఇంజనీరు రట్‌గర్స్. సైబీరియా అంతటా పర్యటించి కుర్‌బాస్‌లో బొగ్గు ఇనుము సమీపప్రాంతాల్లో లభ్యమగుచున్నదనీ, ముఖ్యంగా మైళ్ళతరబడీ బొగ్గు, భూమి ఉపరిభాగం మీదనే దొరుకుననీ, అందుచే అక్కడ పారిశ్రామిక వలస నెలకొల్పటానికి అనుకూలంగా వున్నదనీ ఒక నివేదిక సమర్పించాడు. విదేశ కమ్యూనిస్టు ఉద్యమం నుండీ ఇంజనీర్లను, మెకానిక్కులను నియమించి క్రొత్త పారిశ్రామిక కేంద్రం స్థాపించవలెననే ప్రణాళిక తయారైంది. ఉద్యోగుల నిర్ణయానికి రట్‌గర్స్ విదేశాలకు వెళ్లాడు. సైబీరియా పారిశ్రామిక వికాసానికి కృషి చేయబూనిన రట్‌గర్స్ సైన్యంలో ముగ్గురు భారతీయ యువకులు కూడా చేరారు. వీరు జర్మనీలో ఇంజనీరింగు నభ్యసించినవారు; స్వదేశంలో ఉద్యోగం లభిస్తుందనే నమ్మకం లేకపోవటంచేత రట్‌గర్స్ సైన్యంలో చేరారు.

డచ్చి వామపక్ష కమ్యూనిస్టులలో స్నీవ్‌లీట్ చాల విచిత్ర వ్యక్తి; సోషలిజం సందేశాన్ని ఆసియాకు మొట్టమొదట తెచ్చిన దాతడే; 1913 లో డచ్చి వాణిజ్య సంఘ (Dutch chamber of Commerce) కార్యదర్శిగా జావా వెళ్ళాడు. ఆ ఉద్యోగం ఒక వేషమే. అనతికాలంలోనే జావాలో యువకులను ప్రోత్సహించి శ్రామిక సంఘాన్ని (Trade union), సోషలిస్టు పార్టీని నెలకొల్పాడు. డచ్చి అధికారాన్ని కూలద్రోసే నేరానికి ప్రభుత్వం స్నీవ్‌లీట్‌ను అరెస్టు చేసింది.

కోర్టులో నేరం ఒప్పుకొని స్వయంగా వాదించుకొన్నాడు. తన ఉపన్యాసంలో వలన విధానాన్ని తెగనాడి డచ్చి సామ్రాజ్యవాదం మీద తిరుగుబాటు చేసే హక్కు పరాధీన ప్రజలకు గలదని చాటిచెప్పాడు. కోర్టు అతనికి శిక్ష విధించింది. ఏమిటా శిక్ష? వలస రాజ్యం నుండి బైటికి పంపటమే! అంతకు మించిన శిక్ష తెల్లవాని ప్రతిష్టకు భంగంకాదూ? ఒక తెల్లవాణ్ణి స్వదేశీ నేరస్థులతో బాటు జైల్లో ఉంచటం కంటె ఘోరం మరొకటి ఉంటుందా?

యుద్ధకాలంలో స్నీవ్‌లీట్ హాలెండులోని ఇండొనీషియన్ విద్యార్థులలో సోషలిజాన్ని ప్రచారం చేశాడు. యుద్ధానంతరం వారు స్వదేశానికి తిరిగి వెళ్ళి విప్లవోద్యమాన్ని నడపాలని అతని సూచన. ఇండియాలో విప్లవ కేంద్రాన్ని నెలకొల్పి అటనుండి ప్రాచ్యదేశాలన్నింటిలో విప్లవ కార్యక్రమాలు సాగించాలని ప్రణాళిక తయారు చేశాడు. రెండవ ప్రపంచ మహాసభానంతరం అంతర్జాతీయ సంస్థ తరఫున ఇండియా వెళ్ళాలనుకొన్నాడు. ఈవిశేషాలన్నీ బెర్లిన్‌లో ఉన్న సమయంలో నాతో చర్చించి నా సహకారం కావాలని కోరాడు. అతని ఉత్సాహం క్రైస్తవ మత ప్రచారకుల దివ్యోత్సాహాన్ని గుర్తుకు తెచ్చి నన్ను ముగ్ధుణ్ణిచేసింది. మా యిద్దరి మధ్య గాఢమైన మైత్రి ఏర్పడింది. రాజకీయంగా మాలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు వచ్చినై. కాని వానివలన మా మైత్రికి భంగం కలగలేదు. అతనిద్వారానే ఇండొనీషియా ప్రముఖ విప్లవకారులైన శామోయెన్, సుదర్శన, తాన్‌మలాకా, అలీమిన్, హట్టా, షహ్రీర్‌లతో నాకు పరిచయమైంది. వీరిలో కొందరు డచ్చి విశ్వవిద్యాలయాల్లో విద్యార్థులు, మరికొందరు ప్రవాస విప్లవకారులు. వీరందరినీ చేర్చి స్నీవ్‌లీట్ విప్లవ రాజకీయ పాఠశాలలు నడిపేవాడు. వీరికి ఉపన్యాసాలివ్వటానికే తరచు హాలెండు వెళుతూ వుండేవాణ్ణి. వీరిలో కమ్యూనిస్టులు నన్ను తమ గురువుగా భావించేవారు. ఇంచుమించు వారిలో అందరూ కమ్యూనిస్టులే!

చిట్టచివరకు స్నీవ్‌లీట్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుండి తప్పుకొని ట్రాట్‌స్కీతో చేరాడు. దాదాపు ట్రాట్‌స్కీ కుడిభుజం అని చెప్పవచ్చు. హాలెండును నాజీలు ఆక్రమించి నప్పుడు స్నీవ్‌లీట్ పట్టుబట్టాడు. నాజీలు అతణ్ణి కాల్చి చంపారు.

బెర్లిన్‌లో మొట్టమొదట కలుసుకొన్నప్పుడు స్నీవ్‌లీట్, గోర్టర్ ఇద్దరికీ కొత్తగా ఏర్పడ్డ జర్మనీ కమ్యూనిస్టువర్కర్స్‌పార్టీతో సన్నిహిత సంబంధముండేది. వారిద్వారానే ఆ పార్టీనాయకులతో పరిచయం కలిగించుకొన్నాను. వారంతా యువకులు. స్పార్టాకస్‌కూటమి సాంప్రదాయాలు తెలియనివారు. లక్సెంబర్గ్ ఆత్మబలి స్మృతిని గౌరవిస్తారు. కాని బోల్షివిజంపట్ల ఆమె అభిప్రాయాన్ని గర్హించేవారు. పాల్ లెవీ అంటే వారికి విపరీతమైన ద్వేషం. అతడు విప్లవవాది కావనీ

పార్లమెంటరీ సంస్కరణవాది అనీ లక్సెంబర్గ్ పేరు చెప్పుకొని కమ్యూనిస్టుపార్టీ నాయకుడైనాడనీ నిందించేవారు. కాని లక్సెంబర్గ్‌వలెగాక రష్యన్ బోల్షివిక్కులనూ లెనిన్‌నూ వ్యతిరేకించకపోవటమే లెవీ నేరం అని వారి వాదన. అంతేగాక ఇండిపెండెంట్ సోషలిస్టుపార్టీని అభిమానించి ప్రజాఉద్యమాన్ని నిర్లక్ష్యం చేశాడనీ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో ఆ పార్టీకి ప్రాతినిధ్యంతెప్పించటానికై, వామపక్షీయ కమ్యూనిస్టులను పార్టీనుండి బహిష్కరించాడనీ అనేవారు. బెర్లిన్, హాంబర్గ్, రీన్ లాండు మొదలైన పారిశ్రామిక కేంద్రాలలోని కమ్యూనిస్టుపార్టీలలో అధికభాగం తమ క్రొత్తపార్టీలోనే చేరారని వారి విశ్వాసం.

1920 సం. వరకూ రష్యావెలుపల యేదేశంలోకూడా వ్యవస్థాపితమైన కమ్యూనిస్టుపార్టీయే లేదు. ఐరోపా అంతటా శ్రామికవర్గ ఉద్యమం రష్యాలో క్రొత్తప్రభుత్వంపట్ల సానుభూతి వహించింది. కాని కార్మికులలోని వామపక్ష మతాలు మాత్రమే బోల్షివిక్ కార్యక్రమాన్ని సమ్మతించారు. జర్మనీలోని స్పార్టాకస్ లీగ్‌కూడా కేవలం ప్రచారకసంఘంగానే ఉండేది. అందుచేత కమ్యూనిస్టు పార్టీ, ప్రజాభిమానాన్ని పొందక పూర్వమే సాయుధ తిరుగుబాటుద్వారా అధికారాన్ని వశపరచుకొనటాన్ని గురించి మాట్లాడటం వెఱ్ఱి అనే చెప్ప వచ్చు. భారీయెత్తున కమ్యూనిస్టుపార్టీని నిర్మించటమే ప్రస్తుతకర్తవ్యం. కార్మికుల్లో చాలామంది సోషలిస్టులు నడుపుతున్న కార్మికసంఘాల్లో ఉన్నారు. వాటిని సంస్కరణవాద సాంప్రదాయాలనుండి కార్మికులను కమ్యూనిస్టుపార్టీలోకి ఆకర్షించటం సులభసాధ్యంకాదు. అందుచేతనే యువకనాయకులు నేషనల్ బోల్షివిజంవైపు తిరిగారు. అతిజాతీయవాదనాయకులకు సైనికోద్యోగులతో సంబంధాలున్నై. కాబట్టి వారి సహాయంతో అధికారాన్ని కైవశం చేసికోవటం సులభమని వారి ఉద్దేశ్యం. కాని నేషనల్ బోల్షివిక్కులకు, అతిజాతీయవాదులకు పొత్తు కుదర లేదు. చివరకు నేషనల్ బోల్షివిక్కుల ఆరాటం, ఉద్రేకమూ వామపక్ష కమ్యూనిజానికి పునాదులైనై. ఈ సంఘటనలన్నీ కమ్యూనిజం ఇంకా పరిపక్వదశకు రాలే దనటానికి నిదర్శనాలు! అందుచేతనే వీటిని లెనిన్ 'బాలారిష్టం' అని నిందించాడు. ఏమైనప్పటికీ వామపక్షకమ్యూనిస్టులూ, అరాచకవాదులూ, రష్యా విప్లవాన్ని ఎంతో ఉత్సాహంతో సమర్థించటమేగాక తమతమ దేశాల్లో రష్యా ఉదాహరణను అనుస రించటానికి ఉద్రిక్తులౌతున్నారు. అందుచేత వీరి సానుభూతి, సహకారాలను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వదులుకోలేకపోయింది.

థాల్‌హీమర్ ఎర్నెస్ట్ మేయెరూ కూడా వామపక్ష కమ్యూనిస్టులపట్ల పైదృక్పథాన్నే ప్రదర్శించారు. ఐనా లెవీ జైలునుండి విడుదలైన తరువాతనే తుది నిర్ణయం జరిగింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు ప్రతినిధి

వర్గాన్ని పంపాలని ఇండిపెండెంట్ సోషలిస్టుపార్టీ నిర్ణయించింది. కార్మికుల్లో అధిక సంఖ్యాకులు ఈ పార్టీనే బలపరుస్తున్నారు. వీరి సంప్రదింపులు లెవీ ద్వారానే జరుగుచున్నై; అది సరైన మార్గం కాదని, లెవీకి ఎవ్వరూ నచ్చజెప్పలేరు. లెవీ భావి జర్మనీ లెనిన్; కాని అతని దృక్పథం నాకు నచ్చలేదు. తెలివితేటలు కల వాడే. చురుకైన లాయరు. పార్లమెంటేరియన్ చాకచక్యం గలవాడు. తన వాదనను బాగా సమర్థించుకోగలడు. కాని ఎవరైనా ఎదురు తిరిగారా తూకాన్ని కోల్పోయేవాడు. వామపక్ష కమ్యూనిస్టులతో పొత్తు కలియటం అసంభవమనీ, వారు బుద్ధిలేని సాహసికులనీ ఆతని నిర్ణయం. ఒకమారు అతనితోనే నన్నాను. 'కమ్యూనిస్టు' వర్కర్స్ పార్టీ ప్రపంచ మహాసభకు ప్రతినిధి వర్గాన్ని పంపకుండా ఎవ్వరూ ఆపలేరు.

లెవీ మండిపడ్డాడు :

"ప్రపంచ మహాసభలో వారికి ప్రవేశం లేకుండా చేస్తాను" అన్నాడు.

"ఐతే ఈ సమస్యకు పరిష్కారం మాస్కోలోనే జరుగుతుంది" అని అన్నాను.

రెండవ మహాసభలో లెవీ పాత్ర చాలా ఆశాభంగంగా తయారైంది. ప్రతి వారితోనూ పేచీ పెట్టుకున్నాడు. తరువాత అచిరకాలంలోనే లెవీ స్థానంలో బ్రాన్‌డ్లర్ జర్మనీ కమ్యూనిస్టుపార్టీ నాయకుడైనాడు. విద్యావంతుని స్థానంలో శ్రామికుడు; లెవీ బాధకు అంతులేదు. తిరిగి సోషల్ డెమోక్రాటిక్ పార్టీలో చేరాడు. అక్కడ కూడా లెవీని ఎవ్వరూ విశ్వసించలేకపోయినారు. అతని పాత చరిత్ర అటువంటిది. చివరకు 1929 లో తన బెర్లిన్ నివాసం నాల్గో. అంతస్థులో తన గది కిటికీగుండా క్రిందికి దూకి ఆత్మహత్య చేసుకొన్నాడు.

## బెర్లిన్‌లోని భారతీయ విప్లవ సంఘం

ఐదు సంవత్సరాలకు పూర్వం ఇండియాలో బయలుదేరినప్పటి నా కర్తవ్యాన్ని ఎప్పుడో త్యజించాను. అందులో నాకిప్పుడు శ్రద్ధలేదు. ఐనా బెర్లిన్ చేరిన తరువాత భారతీయ విప్లవ సంఘాన్ని కలుసుకోవాలనే ఉద్దేశ్యం కలిగింది. యుద్ధం ప్రారంభమైన వెంటనే ఈ సంఘాన్ని స్థాపించారు. 1914 చివర ఈ సంఘం పంపిన రాయబారి ఇండియా వచ్చి మేము సాగిస్తున్న స్వాతంత్ర్య పోరాటంలో జర్మనీ సాయం చేయగలదనే సందేశాన్ని అందించాడు. మాకెంతో ఉత్సాహాన్నిచ్చిందా సందేశం. జర్మన్‌లు వాగ్దానం చేసిన ఆయుధ నౌకకు స్వాగత మీయటానికే నన్ను జావా పంపారు. ఆ నౌకతో ఇండియా తీరంలో ఏదో ఒకచోట దిగాలనే మా ప్రణాళిక.

భారత విప్లవ జాతీయోద్యమానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పుకొనేది బెర్లిన్ కమిటీ; కాని అందలి సభ్యు లెవరో మా కెవరికి తెలియదు. వారిలో హరిదయాళ్, వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ, భూపేంద్రనాథదత్తా మినహాయించి మిగిలినవా రెవరూ భారత ఉద్యమానికి సంబంధించినంతవరకూ, స్వదేశంలోగానీ, విదేశాల్లోగానీ కృషిచేసినవారు కాదు. కొందరికి మాత్రం అమెరికా యిరోపాలలో సాగిన బ్రిటిష్ వ్యతిరేక ప్రచారంతో సంబంధముండేది. ఐనా బెర్లిన్ కమిటీ సభ్యులంటే మాలో విప్లవకారులనే గౌరవాభిమానా లుండేవి. బెర్లిన్‌లో భారతదేశ ప్రతినిధులుగా గౌరవింపబడి, బ్రిటిష్ సామ్రాజ్యంమీద ఇండియా సాగిస్తున్న పోరాటంలో జర్మనీ సహాయ సానుభూతులు సంపాదించటం చాల ఘన కార్యమే! బెర్లిన్ కమిటీ ప్రవాసంలో ఉన్న తాత్కాలిక భారత ప్రభుత్వంగా వ్యవహరించేది; జర్మన్ ప్రభుత్వం తమ్మి ఆ విధంగానే గుర్తిస్తున్నదని కమిటీ విశ్వాసం!

బెర్లిన్ కమిటీ పగటికలలు, జర్మన్ ప్రభుత్వశాఖ మోసం - ఒక కృత్రిమ వాతావరణాన్ని సృష్టించినై. ఈ కమిటీకి ఇండియాకు సంబంధాలు తెగిపోయినై. వీరు భారతీయోద్యమానికి సహాయపడే కృషి యిరోపాలో కూడా ఏమీ చేయలేక పోయినారు. ఇక జర్మన్ ప్రభుత్వానికి ప్రచారక సాధనంగా మాత్రమే ఉపయోగపడ్డారు. మెసొపొటేమియాలో పోరాడుచున్న భారతీయులను పురికొల్పి వారిచే తిరుగుబాటు చేయించే ఉద్దేశ్యంతో జర్మన్ ప్రభుత్వం కొందరు భారతీయుల్ని టర్కీ పంపింది. ఈ ప్రయత్నం ఫలించలేదు. అందుకు కారణం విప్లవకారుల ప్రచార దౌర్బల్యమే గాని భారత సైనికుల ప్రభుభక్తి కాదు! మెసొపొటేమియాలో కొందరు భారతీయ సైనికులు ఖైదీలుగా పట్టుబడ్డారు. కాని వారిసంఖ్య స్వాతంత్ర్య సైన్యాన్ని తయారు చేయటానికి తగినంతగా లేదు. ఐనా అటువంటి ప్రణాళికలో జర్మనులకు గాని, టర్కులకు గానీ, శ్రద్ధ గానీ, విశ్వాసం గాని లేవు. ఆ సైన్యం తమకు పనికి రాదని వారికి తెలుసు! ఈ పరిస్థితులకు తోడు కమిటీ ప్రధాన సభ్యులమధ్య పరస్పర ద్వేషాలూ, అసూయలూ, బయలు దేరినై. అంతటితో బెర్లిన్ కమిటీ విచ్ఛిన్నమై పోయింది.

బెర్లిన్ కమిటీ సుప్రసిద్ధుల్లో వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ ఒకడు. ఇతడు సరోజినీ నాయుడికి సోదరుడు. ఇంగ్లండులో విద్యార్థిగా ఉంటూ సావర్కార్ మున్నగు దౌర్జన్యవాదుల (Terrorists) ముఠాలో చేరాడు కర్జన్ వైలి హత్య తరువాత సావర్కారును అరెస్టు చేసి ఇండియా పంపారు. అర్థంలేని హత్యల్లో ఇదొకటి! చటోపాధ్యాయ పారిపోయి ఫ్రాన్సులో తలదాచుకొన్నాడు. అక్కడ బ్రిటిష్‌వ్యతిరేక ప్రచారం సాగిస్తున్న మడామ్ కామా, శ్యామజీ, కృష్ణవర్మలతో కలిసాడు. యుద్ధం ప్రారంభం కాగానే చటోపాధ్యాయ బెర్లిన్ చేరాడు. బహుశా జర్మనులు ఆహ్వానించిఉంటారు. కామా, కృష్ణవర్మ లాతణ్ణి అనుసరించలేదు.

సోషలిస్టులమని చెప్పుకొనేవారు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రష్యన్ (జర్మనీ) సైనికవాదాన్ని ఆమోదించలేకపోయినారు. సైనికవాదాన్ని ఖండించి యుద్ధవ్యతిరేక తీర్మానాలుచేసిన అంతర్జాతీయ మహాసభలకు మాత్రం హాజరైనారు. మదామ్ కామాను 1924 లో ప్యారిస్‌లో కలుసుకొన్నాను. అప్పటికే ఆమెలో బ్రిటిష్‌వ్యతిరేకత తీవ్రంగాఉంది. కాని ఆమె భావాల్లో సోషలిజం కన్పించలేదు; కృష్ణవర్మ అప్పటికి గతించాడు.

యుద్ధం ప్రారంభమైనపుడు జర్మన్‌విశ్వవిద్యాలయాల్లో కొందరు భారతీయ విద్యార్థులు చదువుకొంటూఉండేవారు. వీరు బ్రిటిష్‌సామ్రాజ్యప్రజలు కాబట్టి జర్మనీకి శత్రువులు. అందుచే వారిని జర్మన్‌ప్రభుత్వం నిర్బంధంలో నుంచవచ్చు. వీరిందరినీ చటోపాధ్యాయ కలుసుకొని తనతో చేరినట్లయితే నిర్బంధం తప్పించుకోవచ్చుననే ఆశచూపాడు. దానికితోడు తమ చదువులు పూర్తికాకుండానే పట్టాలిచ్చే సదుపాయముకూడా ఎరగా సూచించాడు. వీరితోనే ప్రథమ భారతీయ విప్లవసంఘం నెలకొల్పబడింది! భారతప్రభుత్వ ఉపకారవేతనంమీద జర్మనీలో భాషాశాస్త్రం అధ్యయనిస్తున్న మహమ్మద్ మన్సూర్ కమిటీకి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆ రోజులలో టర్కీ, జర్మనీలు మిత్రరాజ్యాలు; అందుచే ఇండియాతోటి సంబంధాల్లో జర్మనీ ముస్లిములను ఎక్కువగా ఆదరించేది.

యుద్ధకాలంలో మన్సూర్ కొన్నిరోజులు టర్కీలో ఉన్నాడు. ఇంతలో అమెరికాలో ప్రవాసం అనుభవిస్తున్న భారత విప్లవకారులు బెర్లిన్‌చేరారు. మన్సూర్ ప్రాబల్యం వెనుకంజవేసింది. నేను బెర్లిన్‌వచ్చినపుడు ఎక్కడ ఏంచేస్తున్నాడో తెలియలేదు. రెండుసంవత్సరాలతర్వాత హటాత్తుగా తన జర్మన్‌భార్యతో మాస్కోలో ప్రత్యక్షమైనాడు; కమ్యూనిస్టునని చెప్పుకొన్నాడు. బెర్లిన్‌కమిటీలోని ఇతరసభ్యులతణ్ణి బ్రిటిష్‌గూఢచారిగా అనుమానించారట. ఆ అనుమానికి ఆధారాలు లేకపోలేదు! వినా మాస్కోలో ఎవ్వరూ మన్సూరును విశ్వసించలేదు. అతడు ఎందుకువచ్చాడోకూడా నాకు తెలియనివ్వలేదు. నేనూ అతణ్ణి పట్టించుకోలేదు. కొన్నినెలలు గడిచినై. ఒకరోజున అతని భార్య వచ్చింది. మన్సూరును అరెస్టుచేశారనీ అతణ్ణి చూడటానికిగూడా ఆమెకు అవకాశమివ్వలేదనీ చెప్పింది. నన్ను జోక్యం కలిగించుకొని, ఆపదలో సహాయం చేయవలసిందిగా కోరింది.

ఆ రోజుల్లో రష్యాలో గూఢచారిగా అనుమానింపబడటం కంటె భయంకర మైంది మరొకటి లేదు. అటువంటి నేరస్థుణ్ణి అరెస్టు గాకుండా రక్షించటం లెనిన్‌కు కూడా సాధ్యమయ్యేది కాదు. ఫ్రెంచి విప్లవం రోజుల్లో ప్రజా రక్షక సంఘం (Committee of Public Safety) వలె రష్యాలో 'చెకా'కు సర్వాధికారాలు ఉండేవి. విప్లవ ప్రతిఘటనను రూపుమాపటానికి నెలకొల్పబడిన అసాధారణ

సంఘమే. 'చెకా' అరుణ రక్తపాతానికి (Red Terror) సాధనంగా దయాదాక్షిణ్యాలు లేకుండా వ్యవహరించేది. ఐనా జోక్యం కలిగించుకొని మన్సూర్ తక్షణం రష్యా విడిచిపోవటానికి అనుమతి సంపాదించాను; వెళ్లేముందు దాతడు నన్ను చూడటానికి గూడా అనుమతి నిరాకరింపబడినది. తరువాత 1930 వరకూ మన్సూర్ జర్మనీలో ఉన్నాడు. అరుణ రక్తపాత యుగంలో రష్యాలో గూఢచారి నేరంమీద అరెస్టు అయినవారు మరణ శిక్షను తప్పించుకొనటం అసంభవం; అట్టి పరిస్థితిలో మృత్యుముఖం నుండి తప్పించిన నాపై మన్సూరుకు యే మాత్రం కృతజ్ఞత లేకపోయింది!

నేను 1930 డిశెంబరులో ఇండియాకు తిరిగి వచ్చాను. 1931 జూన్‌లో అరెస్టు చేశారు. కాన్పూరు జైల్లో విచారణ జరిగినప్పుడు ప్రాసిక్యూషన్ తరపు సాక్షిగా మన్సూర్ హాజరైనాడు. మాస్కోలో తాను చూచిన యమ్. యన్. రాయ్ ఇతడే అని గుర్తించటమే మన్సూర్ సాక్ష్యం. అతడు కూడా ఇండియాకు వచ్చి కొన్ని మాసాలే ఐంది. ఆలీఘర్ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా నియమింపబడ్డాడు. ఇండియా తిరిగిరావటానికి అనుమతీ, ఆచార్యపదవీ మన్సూర్ ప్రభుత్వానికి చేసిన సేవలఫలితమేనని అతని భార్య డేమి రూమర్ చెబుతూ వుండేది. అందలి సత్యాసత్యాలు మనకు తెలియవు. కాని నాపై మోపబడిన నేరంలో "ఇతడే యమ్. యన్. రాయ్" అని గుర్తించటం చాల ప్రధానమైన అంశం! నేను జైల్లో వుండగానే మన్సూర్ మరణించాడు. మరణించినవారిని గూర్చి చెడు మాట్లాడటం సబబుకాదు!

1915 మొదట్లో జర్మన్ విదేశాంగ కార్యాలయం ఆఫ్ఘనిస్థానానికి ఒకరాయబార వర్గాన్ని పంప సంకల్పించింది. ఆఫ్ఘనిస్థానాన్ని బ్రిటిష్ ప్రభావం నుండి తప్పించి, ఇండియాలో విప్లవ కార్యక్రమాలను పురికొల్పటమే దాని కర్తవ్యం. కాబూలులో స్వతంత్ర భారతదేశ తాత్కాలిక ప్రభుత్వాన్ని నెలకొల్పే ప్రణాళిక కూడా సిద్ధమైంది. భారత తాత్కాలిక ప్రభుత్వాధిపతి, భారత స్వదేశ సంస్థానాధీశుల ప్రతినిధియైతే మరీ మంచిదని, ప్రాచ్య వ్యవహారాల్లో నిపుణులైన జర్మన్ ఉద్యోగుల అభిప్రాయం. ఇటువంటి వ్యవహారాల్లో వీరేంద్రనాథ ఛటోపాధ్యాయ చాల సమర్థుడు. ఉత్తరప్రదేశ్‌లోని హత్రాస్ అధిపతియైన రాజామహేంద్ర ప్రతాప్‌ను పట్టుకు వచ్చారు; ఐరోపాలో పర్యటిస్తున్న మహేంద్ర ప్రతాప్, యుద్ధం రావటంతో స్విట్జర్లాండ్‌లో ఆగిపోవలసి వచ్చింది. దర్బారులో కెయిజర్ తనకు స్వాగత మిచ్చే షరతుమీద మహేంద్ర ప్రతాప్ బెర్లిన్ రావటానికి అంగీకరించాడు. జర్మన్ విదేశాంగ కార్యాలయంలోని భారతీయశాఖ అనుమతితో ఛటోపాధ్యాయ, మహేంద్ర ప్రతాప్ షరతుకు సమ్మతించాడు. మహేంద్ర ప్రతాప్ బెర్లిన్ వచ్చాడు; భారతీయ విప్లవ సంఘానికి అధ్యక్షుడుగా అతణ్ణి ఎన్నుకొన్నారు. కెయిజర్ యుద్ధరంగంలో సైన్యాన్ని నడుపుతున్నాననే సాకుతో మహేంద్ర ప్రతాప్‌కు

యిచ్చిన వాగ్దానం నెరవేరలేదు. కాని భారత తాత్కాలిక ప్రభుత్వాధిపతికి జర్మనీ యువరాజు స్వాగత మిచ్చాడు.

ఇండో జర్మన్ రాయబారవర్గం పర్షియా గుండా ప్రయాణంచేసి కాబూలు చేరింది. జర్మన్ విదేశాంగ కార్యాలయానికి చెందిన బారన్‌వాన్ హెన్‌టింగ్ దాని ఆధిపత్యం వహించాడు. ఈలోగా ఆఫ్ఘనిస్థానంలో బ్రిటిష్ వారి కనుకూలుడైన తన తండ్రిని తొలగించి, అమనుల్లా సింహాసన మెక్కాడు. జర్మన్ రాయబార వర్గాన్ని ఆహ్వానించి, కాబూలులో, స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వస్థాపనకు సమ్మతించాడు. ఈ ప్రభుత్వానికి రాజామహేంద్రప్రతాప్ అధ్యక్షుడు. మౌలానా ఒబీదుల్లా ప్రధాన మంత్రి. ఈ మౌలానా ఇండియా నుండియే నేరుగా కాబూలు వచ్చాడు. ఐరోపాలోనూ, సమీపప్రాచ్యంలోనూ బ్రిటిష్‌వారు యుద్ధంలో మునిగి యుండటంవల్ల అమనుల్లా మూడవ ఆఫ్ఘన్ యుద్ధంలో విజయం పొందగలిగాడు. ఐనా రష్యా విప్లవానంతరం వరకూ, తన దేశంలో బ్రిటిష్‌వారి ప్రాబల్యానికి పూర్తిగా స్వస్తి చెప్పలేకపోయినాడు. అందుచే బ్రిటిష్, జార్జిస్టు ప్రభుత్వాల ఒత్తిడికి తల నొగ్గి జర్మన్ రాయబార వర్గాన్ని తన దేశం నుండి రద్దుచేశాడు; తరువాత కూడా కొంతకాలం భారతీయ విప్లవ వీరులకు ఆశ్రయ మిచ్చాడు. రష్యాలో బోల్షివిక్ ప్రభుత్వ స్థాపనతో పరిస్థితులు మారినై. బోల్షివిక్కులు పరాధీన ప్రజల స్వాతంత్ర్య ఉద్యమాలను బలపరిచారు. అమనుల్లాకు గూడా ప్రోత్సాహం లభించి ఆఫ్ఘనిస్థానంలో భారతీయ విప్లవకారుల పరిస్థితి మెరుగైంది. ఈలోగా నవరష్యా రాయబారవర్గం కాబూలుచేరి, భారత తాత్కాలిక ప్రభుత్వానికి ధనసహాయం చేసింది. నైతికంగా బలపరచింది; కాని ఆ ప్రభుత్వం సరిహద్దు లెగలను, బ్రిటిష్ ప్రభుత్వంపై రెచ్చగొట్టటంతోనే తృప్తిపడింది; భారత రాజకీయాలను దిద్ద లేకపోయింది.

1919 లో మహేంద్రప్రతాప్, ముందు కార్యక్రమాన్ని గురించి, కేంద్ర విప్లవ సంఘంతో సంప్రదించటానికై బెర్లిన్ వెళ్ళాడు. రష్యాగుండా ప్రయాణం చేశాడు. మాస్కోలో లెనిన్‌ను కలుసుకొన్నాడు; అది చాల తమాషా సంఘటన. తరువాత లెనిన్‌ను స్వయంగా వర్ణించి చెప్పాడు. మహేంద్రప్రతాప్ చిన్నతనం నుండీ తానొక ప్రవక్తననే విశ్వాసంతో ఉన్నట్లు కనిపిస్తుంది. కాబూలులో ఉండగా 'ప్రేమమతం' అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ ఒక గ్రంథం వ్రాశాడు. దాని ప్రతి నొకటి లెనిన్‌కి బహూకరిస్తూ "ఈ సిద్ధాంతాల ప్రకారం రష్యా క్రొత్త ప్రభుత్వాన్ని నడపనిచో, అది విఫలంకాక తప్పదు." అన్నాడట. ఆ గ్రంథాన్ని చదివి తన అభిప్రాయాన్ని తెలుపుతానని లెనిన్ వాగ్దానం చేశాడట. రెండవమారు కలుసుకొన్నప్పుడు ప్రవక్తకు లెనిన్ సలహా యిచ్చాడట. "మీరు ఇంగ్లండు వెళ్ళి మీ ప్రేమ మతాన్ని ప్రచారం చేయండి. బోల్షివిక్కులకు భగవంతునిలో విశ్వాసం

లేదు; మా దేశంలో సాధించినంత పురోభివృద్ధినైనా మీ దేశంలో మీరు సాధించినప్పుడే, మీ హెచ్చరికలను, సలహాలను బోల్షివిక్కులు వింటారు.”

వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ తరువాత బెర్లిన్ కమిటీలో చాల ముఖ్యుడు హర్‌దయాళ్; బుద్ధిబలంలో హర్‌దయాళ్ అందరిలో మిన్నేగాని అతని ఉద్రేకంలో ఆటుపోటు లుండేవి. రాజకీయంగా కూడా నిలకడలేనివాడు; సనాతన ధర్మ పరాయణులైన హిందూ కుటుంబంలో పుట్టి అరాచకవాదిగా తయారైనాడు. సంయుక్తరాష్ట్రాల్లో అరాచకవాదులైన అలెగ్జాండర్ బార్క్‌మన్, ఎమ్మాగోల్డ్‌మన్‌లతో కలసి పని చేస్తుండేవాడు. ఐనా అతనిలో బ్రిటిష్ వ్యతిరేక జాతీయ భావాలే బలంగా ఉండేవి. అందుచేతనే, భారతీయ విప్లవ సంఘంలో చేరే నిమిత్తమై అమెరికా నుండి బెర్లిన్ వెళ్ళి చటోపాధ్యాయతో సంఘర్షణ పడ్డాడు. జర్మన్లు చటోపాధ్యాయను అభిమానించారు; అందుచే హర్‌దయాళ్ విప్లవ సంఘం నుండి వైదొలగవలసి వచ్చింది. విప్లవ సంఘ కార్యక్రమాలకు వెలుపల గూడా భారతీయ స్వాతంత్ర్యం కోసం కృషిచేయటానికి అవకాశం ఉంది. ఈ చటోపాధ్యాయ చాల సాహసికుడు; శక్తివంతుడు; విధి విరామాలు లేకుండా పనిచేసేవాడు; ఐరోపాలోని తటస్థ రాజ్యాల్లో రహస్యంగా పర్యటించి జర్మన్ రహస్యశాఖకు అపారమైన సేవ చేసి బెర్లిన్‌లోని భారతీయుల్లో అభిమానానికి పాత్రుడై ప్రముఖ స్థానాన్ని పొందగలిగాడు; దాని ఫలితంగా హర్‌దయాళ్‌తో అధికారం కోసం వచ్చిన పోటీలో, చటోపాధ్యాయదే పైచేయి కాగలిగింది. శత్రు విదేశీయుడుగా హర్‌దయాళ్‌ని జర్మన్ ప్రభుత్వం అరెస్ట్ చేసి నిర్బంధంలో నుంచింది; జర్మన్ పరాజయం పొందిన తరువాత హర్‌దయాళ్ తప్పించుకొని స్వీడన్ పారిపోయాడు.

హర్‌దయాళ్, బెర్లిన్‌లోని తన అనుభవాలను వర్ణిస్తూ గొప్ప గ్రంథం వ్రాశాడు; దేశభక్తుల్లో సంచలనం కలిగించిందా గ్రంథం; అందులో బ్రిటన్ పట్ల హృదయపూర్వక విశ్వాసాన్ని ప్రకటించిన భాగమే చాల ముఖ్యమైన భాగం. కొందరు విషయాన్ని రాజకీయాల్లో హరదయాళ్ చపలత్వానికి నిదర్శనంగా భావించవచ్చు; దీన్నే మరికొందరు అనుభవంతో హరదయాళ్ చేసిన నిర్ణయంగా పరిగణించవచ్చు. విప్లవ జాతీయవాదిగా పౌరాణిక కథానాయకుల వంటి ప్రతిష్ఠ నార్జించిన వ్యక్తి ఆ విధంగా ప్రకటించటానికి అపారమైన నైతికబలం అవసరం. కాని ఆ నైతికబలంవల్ల హర్‌దయాళ్ ప్రజాదరణను కోల్పోయినాడు. రాజకీయాలనుండి విరమించి, ఉప్సలా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా తన జీవితం చివరి రోజులు గడిపాడు. వాస్తవానికి హర్‌దయాళ్ రాజకీయాలకు పనికిరాడు; ఆచార్యత్వమే అతని వ్యక్తిత్వానికి తగిన వృత్తి. కాని ఆ సత్యాన్నతడు కనుగొన్న అనతికాలానికే అకాలమృత్యువు వాత పడ్డాడు. బహుశా, మృత్యువే అతని పాలిట వరప్రసాదమేమో! కారణం? విజయాన్ని సాధించిన జాతీయవాదం కృతఘ్నురాలుగా తయా

రైంది! ఆమె పూజాపీఠంమీద సర్వస్వం బలిచేసిన వీరు లెందరో నేడు వృద్ధాప్యంలో అజ్ఞాతంగా అవస్థలు పడుతున్నారు! ఈ దుర్దశనుండి హారదయాళుని తప్పించింది మృత్యువు!

చంపక రామన్‌పిళ్ళె, బెర్లిన్ భారతీయ విప్లవసంఘ సభ్యుల్లో చాల విచిత్రమైన వ్యక్తి. మొదటిసారి బెర్లిన్ వెళ్ళి నప్పు డాతణ్ణి కలుసుకోలేక పోయినాను. తిరిగి 1922 లో బెర్లిన్ వెళ్ళినప్పుడు, పిళ్ళె ప్రాచ్య పురావస్తువుల అంగడి నడుపుతున్నాడు. ఇతని జన్మస్థలం తిరువాన్‌కూర్. బాల్యంలోనే తలిదండ్రులను కోల్పోయినాడు. ఒక ఆంగ్లమత ప్రచారకుడీ అనాథ శిశువును పెంచి, పై చదువులకు ఇంగ్లండు తీసుకు వెళ్ళాడు. పిళ్ళె పెద్దగా చదువుకున్నట్లు కనుపించలేదు; విప్లవకారులతో ఎలా పరిచయమైందో గ్రహించలేక పోయాను; అతనిలో ఏమ్రాతం విప్లవాత్మ కనిపించలేదు; పైపెచ్చు అతని భావాల్లో కరడుగట్టిన సనాతనత్వం గోచరించేది; అందువల్లనే ప్రతీపగాములైన ప్రష్యన్ సైనిక రాచరిక వాద ముఠాలో కొందరు మిత్రులను సంపాదించ గలిగాడు; పిళ్ళె ప్రధాన పోషకుడు కౌంట్ వాన్ రెవెంట్లో; అతని సహాయంతోనే చటోపాధ్యాయ అసూయకు తట్టుకొని, హారదయాళ్ దుర్గతిని తప్పించుకో గలిగాడు. 1922 లో పిళ్ళెను కలసికొన్నప్పటికి అతని సహచరుల్లో చాలమంది కెయిజర్‌పై ఆశలు వదలి బోల్షివిక్ రష్యా పైకి దృష్టి మరలించారు. కొందరు కమ్యూనిస్టులమని చెప్పుకొంటున్నారు. వీరి క్రొత్త భావాలను పిళ్ళెలో ఘనీభవించిన జాతీయవాదం పరిహసిస్తూ ఉండేది. క్రొత్త జర్మన్ ప్రభుత్వాన్ని జర్మన్ రాచరికవాదులకంటె కూడా నిశితంగా విమర్శిస్తూండేవాడు పిళ్ళె. కౌంట్ వాన్ రెవెంట్లో సహాయంతో అఖిల జర్మన్ జాతీయవాద పక్షంలో (Pan-German Nationalist Party) సభ్యుడు కూడా ఐనాడు. ఆ గౌరవాన్ని పొందిన ఒకే ఒక శ్వేతేతరుడు పిళ్ళె! పిళ్ళె శరీరచ్ఛాయ నిగనిగలాడే నల్లనిరంగు. జర్మనీలో తాను పొందిన గౌరవానికి గర్విస్తూ ఉండేవాడు. ఐరోపా సామాజిక మర్యాదలన్నీ బాగా తెలిసినవాడు; చాలాకాలం ఐరోపాలో నివసిస్తున్న భారతీయుల్లో కూడా అవి లోపించి యుండేవి. పిళ్ళె గీరల ట్రౌజర్, నల్లని ఫ్రాక్ కోటు ధరించేవాడు; ఉంగరాలు తిరిగిన జుట్టు మెరిసేటట్లు నూనె పూసేవాడు; ఆ అంగడిలో విచిత్ర ప్రదర్శన వస్తువుల్లో ఒకడుగా, ఎప్పుడు జెట్టిపోటులాగా కన్పించేవాడు! జర్మన్ నిర్దుష్టంగా మాట్లాడ గలడు. పారిస్‌లో కొంతకాలం ఉండటంచేత ఫ్రెంచి కూడా ధారాళంగా మాట్లాడేవాడు. అతడు బెర్లిన్ వచ్చింది పారిస్ నుండే. ఉబుసుపోనప్పుడు అతని షాపుకు గానీ, ఇంటికి గానీ వెళుతూ ఉండేవాణ్ణి. చాల సంతోషించేవాడు; జర్మనీలో ఉన్నత వర్గాలతో తన సంబంధాలను గురించి కథలు చెబుతూ ఉండేవాడు. మంచి కోతల రాయుడు; హిన్‌డెన్‌బర్గ్, లూడెన్‌డార్ఫులు అతని ఆప్తమిత్రకోటిలోనివారే!

బెర్లిన్ కమిటీలోని సభ్యులందరిలో ఒక భూపేంద్రనాథదత్తా మాత్రమే ఇండియాలో విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. దత్తా స్వామీవివేకానందుని సోదరుడు. విప్లవోద్యమ పత్రికయైన "యుగాంతర్"కు సంపాదకుడుగా పనిచేశాడు. 1907 లో ప్రభుత్వం అరెస్టుచేసి కారాగార శిక్ష విధించింది; విడుదలైన తరువాత సంయుక్తరాష్ట్రాలకు చేరాడు; తిరిగి నిర్బంధం తప్పించుకోటానికో, లేక అమెరికాలో కీర్తి సంపాదించటానికో తెలియదు. ఆ రోజుల్లో స్వామి వివేకానందుడు భారతీయ ఆధ్యాత్మికతకు విజయపతాకను అమెరికాలో స్థాపించినట్లు భావిస్తూ ఉండేవారు; బహుశా అన్నగారి అడుగుజాడలనే అనుసరింపదలచాడు దత్తా. కాని అమెరికాలో కొంతకాలం ప్రశాంతంగానే గడిపి యుద్ధం ప్రారంభమైనంతనే బెర్లిన్ భారతీయ విప్లవ సంఘంలో చేరటానికై జర్మనీ వచ్చాడు. నా చిన్నతనంలో ఆత్మార్పణ మొనర్చిన జాతీయవీరుడుగా దత్తాను అభిమానించేవాణ్ణి. విదేశాల్లో అతడు సాగిస్తున్న విప్లవ చర్యల కట్టుకథలా అభిమానానికి దోహదం చేసినై. కాని 1920 లో బెర్లిన్‌లో దత్తాను కలుసుకొన్నప్పుడు నాకు కలిగిన ఆశాభంగం ఇంతా అంతా కాదు; ఇంకా నిద్రావస్థలో మహదానందాన్ని అనుభవిస్తూ ఉన్న రిప్‌వాన్ వింకిల్ వలె కన్పించాడు. అతని బస చాలా అపరిశుభ్రంగా ఉంది. మనిషిలో మాత్రం దర్జా, అహంభావం స్ఫుటంగా కన్పించినై. అప్పటికి భారతీయ విప్లవ సంఘ సభ్యులలో బెర్లిన్‌లో మిగిలింది భూపేంద్రనాథదత్తాయే. ఆ అధికార హోదాలోనే ఇండియానుండి బయలుదేరినది మొదలు నాటివరకు నా చర్యలను నివేదించవలసిందిగా ఆజ్ఞాపించాడు; ప్రధానంగా జర్మన్ యేజంట్లనుండి అందిన ధనాన్ని గురించి వివరించాలి. నిదానంగా నివేదికను సమర్పిస్తానని చెప్పి, జర్మనీ రాజకీయాలను గురించి ప్రశ్నించాను; జర్మన్ రాజకీయాల్లోగానీ, ప్రజలను కలవరపెడుతున్న వర్గ సంఘర్షణ సిద్ధాంతంలోగానీ దత్తాకు ఆసక్తి యేమాత్రం కన్పించలేదు. రష్యాలో బోల్షివిక్ ప్రభుత్వం ఎంతోకాలం మనలేదని అతని అభిప్రాయం. అందుచే రష్యా వెళ్ళాలనే నా కోరికను అవహేళన చేశాడు; రష్యా వెళ్ళాలనే ఆలోచన కూడా తనకు లేదన్నాడు. కాని ఒక సంవత్సరం తరువాత ఇతర భారత జాతీయవాదులతో రష్యా వెళ్ళాడు; ఆశాభంగంతో తిరిగి వచ్చాడు. ప్రస్తుతానికి మంచి హోటల్లో భోజనం, తన పూర్వ విప్లవ జీవితంలోని సంఘటనలను వివరించటం అతని దినచర్యల్లో ప్రధానమైనవి.

జర్మనులతోనూ, మెక్సికోలోని భారతీయ విప్లవ కారులతోనూ నాకు కలిగిన అనుభవాలను దత్తాకు వివరించాను; తరువాత మెక్సికోకు బొరోడిన్ రాక, నేను డబ్బు ఖర్చుచేసిన విధానమూ నివేదించాను; అందుకు తీవ్రమైన ఆక్షేపణ తెలిపాడు దత్తా. భారతీయ విప్లవ ధనాన్ని, అర్థంలేని కారణాలకు దుర్వ్యయం చేశానన్నాడు. రష్యా విప్లవం యదార్థ సాంఘిక విప్లవమని నచ్చజెప్పటానికి

నే జేసిన ప్రయత్నం విఫలమైంది. ఏమైనా నా మీద దత్తా అధికారం చలాయించటానికి బెర్లిన్ భారతీయ విప్లవ సంఘం నాటికే అంతరించిపోయింది; ఇది గమనించే, తన ఉద్యమాన్ని వివరించాడు దత్తా.

బెర్లిన్ కమిటీలో గూడా 'ఎన్నో కుటుంబ కలహా' లేర్పడినై. చటోపాధ్యాయ మొనగాడై అందరినీ వేధించాడు. అతనితో నే గాక డాక్టర్ మన్సూర్‌తో గూడా దత్తాకు పడలేదు. బంకించటర్జీ 'ఆనందమఠ్' చదివిన ఉద్రేకంలో తయారైన పాత జాతీయవాదుల కోవకు చెందినవాడు దత్తా; అందుచే మహమ్మదీయులలో ఆతనికి విశ్వాసం లేదు. పిళ్ళైను గురించి నన్ను హెచ్చరించాడు. "అతనికి రాజకీయ సైనిక ముఠాతో సంబంధాలున్నై. నిన్నాతడు బ్రిటిష్‌వారికి అప్పగించవచ్చు! బోల్షివిక్కులకు సహాయంగా, సోషలిజం వికాసానికి జర్మన్ ధనాన్ని వినియోగించిన నిన్ను జర్మను లెన్నటికీ క్షమింపరు!"

దత్తా సంకుచిత భావనాశక్తికి నవ్వాను. తిరిగి నన్ను హెచ్చరించాడు. "చటోపాధ్యాయ ఇక్కడ లేనందున చాల అదృష్టవంతుడివి. పాపం, హరదయాళ్‌గతేమైందో నీకు తెలియదూ?"

"నాకు తెలుసు కాని ఆ ప్రభుత్వం కూలిపోయి క్రొత్త ప్రభుత్వం యేర్పడింది; సోషలిస్టుల్లో నాకు మిత్రు లున్నారు" అన్నాను. "సోషలిస్టులను గురించి నాకేం సదభిప్రాయం లేదు; వర్గపోరాటం వినావారికి మరేమీ పట్టినట్లు లేదు." అని పదే పదే అనేవాడు దత్తా.

చటోపాధ్యాయను గురించి యింతగా విన్న తరువాత, ఆతణ్ణి కలుసుకోవాలనే ఉత్సాహం కలిగింది; కాని అతణ్ణి కలుసుకోటానికి స్టాక్‌హోమ్ వెళ్లాలి. అతడక్కడే ఉన్నాడు. మాస్కోకు స్టాక్‌హోమ్ గుండా వెళ్లే అవకాశం ఉంది. కాని ఈలోగా క్రొత్త మార్గం తెరువబడింది. జర్మన్ నౌకాశ్రయమైన స్పెట్టిన్‌లో బయలుదేరిన ప్రథమ సోవియట్ నౌకలో ప్రయాణంచేసి లెనిన్‌గ్రాడు చేరాను.

# రష్యాలో మొదటి అనుభవాలు

## గమ్యస్థానం, మాస్కోలో తొలిరోజు

రైలుబండి మా గమ్యస్థానం చేరేసరికి మధ్యాహ్నం కావచ్చింది. లామోనోసావ్ గడియారంవంక జూచి 'సరిగా టైముకు చేరింది' అన్నాడు. అంతర్యుద్ధంతో రష్యాలోని రైల్వే విధానం పూర్తిగా దెబ్బ తిన్నది; తిరిగి పునరుద్ధరించటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది. రైలు బండ్లకు ఒక టైమ్ టేబుల్ లేదు. వాని ఇష్ట ప్రకారం నడిచేవి. 1920 నాటికి గూడా రైళ్ళు సైనిక సరఫరాకే రిజర్వు చేయబడియున్నై. రైళ్ళపై సాధారణ పౌర రాకపోక లుండేవి కావు. స్టేషనుకు వెళ్ళి, టిక్కట్ కొని రైలుబండి ఎక్కటమనే పద్ధతే లేదు. విప్లవంతో డబ్బు రద్దు అయింది. దానితో ధనిక, దరిద్ర తారతమ్యాలు నశించినై; 'ప్యాస్'లు వున్నవారు మాత్రమే, అదీ ఉద్యోగ ధర్మంలోనే, రైళ్ళపై ప్రయాణం చేసే అవకాశముంది. హోటళ్లలో భోజనం చేయాలన్నా, అంగడిలో బూట్లు కొనుక్కోవాలన్నా, నగరంలో ట్రామ్ బండీ ఎక్కాలన్నా, "శ్రామిక యోగ్యతా పత్రం" (Certificate of labour) ఉండాలి. రష్యాలో పౌర జీవిత మంతా 'పనిచేయని వానికి తిండిలేదు' అనే విప్లవ సాంఘిక న్యాయ సూత్రంమీద ఆధారపడి నడవసాగింది.

స్టేషన్ బైటికి దారితీస్తూ లామోనోసావ్, రైలు మార్గాల నిడివికి రష్యా ద్వితీయ స్థానం ఆక్రమిస్తుందని సగర్వంగా చెప్పాడు. కాని అన్ని మార్గాలమీదా రైలు ప్రయాణాన్ని పునరుద్ధరించటానికి కొన్ని సంవత్సరాలైనా పడుతుందన్నాడు; ప్రస్తుతానికి రెండు ముఖ్యనగరాలను కలిపే మార్గంమీద రోజుకు మూడు బండ్లు మాత్రమే సరిగ్గా నడుస్తున్నై; తరువాత రహస్యంగా అన్నాడు. "ఈ రైల్లో వారానికి మూడుసార్లు రష్యా ద్వితీయ నాయకుడు ప్రయాణం చేస్తాడు." అటువంటి బండిలో ప్రయాణం చేయటం మహత్తర అవకాశమే; కాని ఆ ప్రముఖ వ్యక్తితో బాటు ప్రయాణంచేసే సదవకాశం లభించలేదు. ఐనా, ఏ సాధారణవ్యక్తికి అట్టి సదవకాశం లభింపదు!

భయగౌరవాదులతో లామోనోసావ్ పేర్కొన్నవ్యక్తి జినోవీవ్ అని తరువాత తెలిసింది. జినోవీవ్ లెనిన్‌గ్రాడ్ సోవియట్ అధ్యక్షుడు. సర్వాధికారాలు గల కమ్యూనిస్టుపార్టీ పొలిటికల్ బ్యూరో సభ్యుడు, కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్

కార్యవర్గానికి ఛైర్మన్. అందుచేతనే రెండు రాజధానుల మధ్య వారానికి మూడు సారులు ప్రయాణం చేసేవాడు. అతడు ధరించే ప్రఖ్యాత త్రికిరీట గౌరవ చిహ్నం (Triple Crown) మరెవ్వరికీ లేదు. కాబట్టి లెనిన్ తరువాత, లెనిన్ అంత వాడుగా పరిగణింపబడుటంలో ఆశ్చర్యం లేదు.

లెనిన్‌గ్రాడ్ నగరానికి విదేశదండయాత్ర ప్రమాదం ఉండటంచేత రాజధానిని మాస్కోకు మార్చారు. ఫిన్‌లాండ్‌లో సరిహద్దులకు కొన్ని మైళ్ళదూరంలో ఇంకా జర్మన్ సైన్యం బలంగానే ఉంది. జారిస్టు సేనాపతి యూడెనిచ్ ఆధిపత్యంలోని వైట్ఆర్మీ (White Army), 1919 వేసంగిలో లెనిన్‌గ్రాడ్ దక్షిణ పొలిమేర వరకు నడిచింది. యూడెనిచ్‌కి మిత్రమండలి రాజ్యాల సహకారమూ, జర్మన్, బాల్టిక్ సైన్యం మద్ధతూ లభిస్తున్నది. మాస్కో దేశానికి గుండెకాయ వంటిది. ఆనగరానికి ప్రమాదాలేమీ లేవు. కానీ మాస్కో సాంప్రదాయకంగా మధ్యయుగ భూస్వామ్య అధికారానికీ, ప్రతిపగామి శక్తులకు కేంద్రం; అచటి సాంఘిక, సాంస్కృతిక వాతావరణం విప్లవాత్మక సంస్థల వికాసానికి అనుకూలం కాదు. మధ్య యుగం నాటి కోటయైన క్రెమ్లిన్, కర్షక - కార్మిక ప్రజారాజ్యానికి కార్యస్థానం కావటమే విచిత్రం!

లెనిన్‌గ్రాడ్ ఆధునిక నగరం. అక్కడ విప్లవానికి, సాంఘిక ఆధారమైన పారిశ్రామిక వాతావరణం ఉంది. విప్లవం లెనిన్‌గ్రాడ్‌లోనే ప్రారంభమై ఇతర ప్రాంతాలకు విస్తరిల్లింది. అధికారాన్ని ప్రథమంగా హస్తగతం చేసికొనటమేగాక పెట్రోగ్రాడ్ శ్రామికులు తమ ప్రాణాలొడ్డి నూతన విప్లవప్రభుత్వాన్ని కాపాడారు. అందుచే లెనిన్‌గ్రాడ్ సోవియట్, లెనిన్‌గ్రాడ్ పార్టీ విప్లవ రష్యాలో గౌరవప్రదమైన స్థానాన్ని పొంది, రాజకీయ జీవితాన్ని శాసింపసాగినై. దానిని చేజిక్కించుకొన్న వ్యక్తి అధికారానికి, ప్రతిష్టకు అంతులేదు. 1920 లో ఆ పదవి జినోవీవ్‌కు దక్కింది. కాబట్టి తాను లెనిన్ అంత వాడనని, లెనిన్‌కు వారసుడ నని జినోవీవ్ భావించడంలో ఆశ్చర్యం లేదు. మాస్కోకు వెళ్ళిన కొద్దిరోజులకే జినోవీవ్‌ను కలుసుకొన్నాను. ఆవ్యక్తిలో పదవికి తగిన ఘనత వున్నదా? అనే సందేహం కలిగింది. అతనిపై నాకేమాత్రం దురభిప్రాయం లేదు. అందరివలెనే నేను కూడా జినోవీవ్‌ను లెనిన్ కుడి భుజంగా భావించేవాణ్ణి. కాని ఆ గౌరవానికతడు తగడని చరిత్ర బుజువు చేసింది. మరొకమారు నా మొదటి అభిప్రాయమే సత్యమైంది.

ష్లిప్కిన్ మమ్మల్ని స్టేషన్ నుండి బయటకునడిపించాడు. 'మాస్కోలోఉన్నాను' అనే భావంతో స్వప్నంలో నడిచినట్లు నడిచాను; కాని నాగమ్యస్థలం చేరాననే ఉద్రేకంతో నా ఆలోచన ఆక్షణాన మొద్దుబారటం కూడా మంచిదే అయింది. లేనిచో మా చుట్టూ ప్రత్యక్షమైన అవ్యవస్థ, అపరిశుభ్రత, చెత్త చెదారాలతో

నిండిన వాస్తవ పరిస్థితి నాకు ఆశాభంగాన్నే కలిగించియుండేది. నూతన వ్యవస్థా నిర్మాణమంటే కన్నుమూసి తెరిచేలోగా జరిగే పనిగాదు గదా!

స్టేషన్ ముందు పెద్ద మైదానం. దాన్నిండా యూనిఫారములు ధరించిన మనుషులు. తుక్కు గుఱ్ఱపు బండ్లు. ఆగుఱ్ఱాల శరీరంలో మాంసం అనేదిలేదు. రోడ్లన్నీ కంకరరాళ్ళమయం. మామూలు ట్రాఫిక్ నిబంధనలను మన్నించక దూసుకపోయే మోటారుకారులు తరచు గుఱ్ఱపు బండ్లను ఢీకొని నుగ్గునుగ్గు చేసేవి. మోటారు కారుల దురుసుతనానికి అందలి సైనికులే కారణం. అధికారాన్ని సూచించే ఈ దురుసుతనం వల్ల ప్రజల ప్రాణాలపట్ల పైశాచిక నిర్లక్ష్యం జనించిందని రష్యాలో వున్న రోజుల్లో గ్రహించాను. నల్లని లిమోసీన్ కారు వచ్చి మా ముందు ఆగటంతో ఊహించినవీ, వూహించనివీ ప్రథమ అనుభూతులతో నేర్పడిన భావనా ప్రపంచంలో నుండి బైట పడ్డాను. సైనిక దుస్తుల్లో ఉన్నాడు డ్రైవర్. లామోనొసావ్ తలుపు తెరిచాడు. మాడమ్ వాడాక్ ఎక్కి కూర్చుంది. డ్రైవరుతో ష్లిప్కిన్ ఏదో అడ్రస్ చెప్పాడు. లిమోసీన్ కదలిపోయింది. మరొక మోటారులో మేము బయలుదేరాము. కారు చాలా పెద్దది; పైకప్పు క్రిందుగా ఉంది. ముందు సీట్లో డ్రైవర్ ప్రక్కనే సైనికుడొకడు కుర్చున్నాడు. సైనికుని చేతిలో తుపాకి; కంకర మయమైన రోడ్డుపై కుదుపుతూ దూసుకుపోయింది. వీధులన్నీ నిర్మానుష్యం. అంగళ్ళ కిటికీలన్నీ మూసి ఉన్నై; వీధుల్లో పచారు చేసేవారు లేరు. ప్రతివాడు ఏదో వ్యవహారం మునిగిపోతున్నదనే ధోరణిలో కన్పించాడు.

ఇంతలో మాకారు ఒక చిన్నదిమీద నున్న ఇనుపవంతెనను దాటింది. అదే మాస్కొనది. ఒడ్డునే కొంతదూరం నడచి ఇనుపబ్రిడ్జీ మీదుగా మాకారు ఒక ఇంటి ఆవరణలో ప్రవేశించింది. అది ఒక గృహస్థు ఇల్లై ఉండవచ్చుననే భావంకలిగింది. బొరోడిన్ పోర్టికోలోకివచ్చి ఆహ్వానించాడు. అందమైన దారు సోపానాలమీదుగా పై అంతస్థులోని గదికి తీసుకవెళ్ళాడు. నా ఆశ్చర్యానికి అంతులేకపోయింది. అది రాజప్రాసాదంకాదు. అయితే ఈ భవంతిలో మహారాజభోగంతో నివసిస్తున్నదెవరు? నా సందేహాన్ని బొరోడిన్ గ్రహించాడు. నేనడక్కపూర్వమే వివరించాడు. ప్రాత రోజుల్లో ఈ భవనం గుచ్‌కావ్ ప్రభువుది. ప్రభువర్గీయుడే ఐనా గుచ్‌కావ్ పరిశ్రమ లలో, వాణిజ్యంలో శ్రద్ధవహించి ధనికుడైనాడు. రష్యాలోని బీటుపంచదార పరిశ్రమలో అధికభాగానికి అధిపతియై 'రష్యా పంచదార రాజు' అని ప్రసిద్ధిచెందాడు. విప్లవం సొంతఆస్తిని రద్దుచేయటంతో 'గుచ్‌కావ్ భవనం' ప్రభుత్వపరమైంది. క్రింది అంతస్థులో కారఖాన్ సకుటుంబంగా కాపురం ఉంటున్నాడు. కారఖాన్ విదేశాంగ ఉపమంత్రి (Vice Commissar). పై అంతస్థు మాత్రం ప్రభుత్వ అతిథులకోసం ప్రత్యేకింపబడింది. ప్రశ్నాపరంపరలు నా మనస్సును బాధింపసాగినై. ఇంతలో

బొరోడిన్ ఒక నిడుపైన కిటికీముందుకు నడిపించి, దానికున్న ఎఱ్ఱని శాటిన్ తెరను తొలగించాడు. భవంతిముందుగా మాస్కోనది ప్రవహిస్తూ కన్పించింది. ఎదురుగా అవతలిగట్టుపై ఎత్తైన కోటగోడ; దాని కవతల గోపురం; చర్చిశిఖరాల మహారణ్యమధ్యంలో, బంగారుపూతపూసిన విమానాలు (Domes) మధ్యాహ్న సూర్యకాంతిలో ప్రకాశిస్తున్నై. అదే క్రెమ్లిన్! కొన్ని శతాబ్దాలకు పూర్వం ఈ దుర్గాన్ని నిర్మించినారు; అది కేవలం కోట కాదు; దుర్భేద్యమైన ఒక మహానగరం! ఐతే నేను మాస్కోలో క్రెమ్లిన్ కోటగోడల నీడలో వున్నానన్నమాట!

ఆ ప్రక్కగదిలో (Suite) నే బొరోడిన్ ఉంటున్నాడు; భోజనానికి తయారుకమ్మని తనగదికి వెళ్ళాడు బొరోడిన్. సాయంత్రం ఐదుగంటలకు వడ్డన జరిగింది. అది ఆఫీసులు మూసివేసేసమయం; భోజనానంతరం మా గృహమేధియైన కారఖాన్ను కలిసికొనే యేర్పాటుజరిగింది. భవనానికి తగినట్లుగాలేదు ఆ భోజనం. చాల పెద్దగది; గదినిండా రోజ్ వుడ్ సామగ్రి; విశాలమైన మేజామీద వడ్డించారు, కాబేజి పులుసూ, చిన్న నల్లనిరొట్టెముక్క; కాషా! కాషా అంటే ఏదో నల్లనిధాన్యం. నూకలతో తయారుచేసే పదార్థం. గంభీరమైన హాస్యంతో అన్నాడు బొరోడిన్: "కాషా, విలాసవస్తువు; ఇక ఆ పులుసులోని మాంసపుముక్క సాధారణ పరిస్థితులలో దొరికేదికాదు. ప్రభుత్వ సంస్థలన్నిటిలో భోజనప్రమాణం ఇదే. రష్యాసమత్వం సాధించినట్లే; ఐతే దానిస్థాయిమాత్రం చాలతక్కువ. అంతర్యుద్ధం ముగిసింది కాబట్టి సమత్వం స్థాయి పెరగ వచ్చునని ఆశిస్తున్నారు!"

గడచిన శీతకాలంతో పోల్చిచూస్తే ఈ సంవత్సరం పరిస్థితి చాల మెరుగైంది. నలువైపులనుండీ విప్లవ ప్రతిఘటన సైన్యాలు మాస్కో నగరంమీదికి దండయాత్ర ప్రారంభించిన రోజు లవి; ఆహారం కొరతకు తోడు వంటచెరకు కూడకరువైంది. నీరు గడ్డకట్టుకుపోయే శీతోష్ణస్థితి. ఈ పరిస్థితిలో రైతులు అభిమానము కొద్దీ ఒకబండెడు కట్టెలు తెచ్చి క్రెమ్లిన్కు యిచ్చి పడేశారట! ఈ దుస్థితికి గ్రామప్రాంతాల్లో యుద్ధకమ్యూనిజానికి ప్రజల ప్రతిఘటనే కారణం! జాతీయం చేసిన భూముల్లో మిగులు పంటంతా ప్రభుత్వం వశపరచుకొన్నది; దానికి విరుగుడుగా తమ అవసరాలకు మించి పండించటం మాని వేశారు. అందుచే నగరప్రాంతాల్లో కరువుకాటకాలు తాండవించినై. ఆ నగరా లన్నిటిలో ఎక్కువ బాధకు గురియైనది మాస్కో. విప్లవంతో మాస్కో జనాభా విపరీతంగా పెరగటమే అందుకు కారణం.

కారఖాన్ యువకుడు; ముప్పదియైదు సంవత్సరాలు కూడ పూర్తిగా నిండలేదు. తన పదవికి తగిన వయస్సాతనికి లేదు. ఉపమంత్రులలో ఒకడే ఐనా నిజానికి విదేశాంగశాఖకు అతడే అధ్యక్షుడు. కారఖాన్తో సంప్రదించకుండా చిచిరిన్ ఏమీ చేసేవాడు కాదు. విదేశాంగశాఖకూ, కమ్యూనిస్టు ఇంటర్నేషన

లకూ మధ్యవర్తి కారఖానే. ఆసియా ప్రభుత్వాలతో రాయబార సంబంధాలు నెలకొల్పి తద్వారా కమ్యూనిస్టు ప్రచారం సాగించాలని కారఖాన్ ప్రణాళిక; ఆర్మీనియన్ జాతీయుడు; కకేషియన్ పురుషత్వానికి చక్కని నమూనా. ఒకమారు రాడెల్ క్రూర పరిహాసం, కారఖానును 'సోవియట్లలో అందమైన గాడిద' అంటూ వర్ణించింది. కారఖాన్ మందబుద్ధి కాడు; తొందరగా బైటపడే రకం కాడు; అందుచే చాలమందికతడు తెలియడు. అంతేగాక, కారఖాన్ ఉన్నతపదవి, అతని తోటి యువకుల్ని అసూయలో ముంచింది; అతణ్ణి గురించి వారు నీచంగా మాట్లాడేవారు. కారఖాన్ సహజంగా అందగాడు; అందుచేతనే అనుకుంటాను, దుస్తుల విషయంలో చాల శ్రద్ధవహించేవాడు; దుస్తులపట్ల నిర్లక్ష్యం విప్లవసుగుణంగా భావించే వారిని ఏవగించుకొనేవాడు. అందుచేత వారతణ్ణి 'బూర్జువా' అంటూ నిందించేవారు. ప్రతి వ్యక్తి శ్రామికవర్గ పవిత్రతను ప్రదర్శించే ఆ రోజుల్లో ఇంతకంటె 'శాపం' మరొకటిలేదు. కారఖాన్ జన్మతః శ్రామికవర్గీయుడు కాడు; ఆ విషయాన్నాతడెప్పుడూ దాచలేదు. విప్లవానికి పూర్వం అతడు పెట్రోగ్రాడులో లైబ్రేరియన్‌గా ఉండేవాడు. ఆ రోజుల్లో తన లైబ్రరీకి తప్ప బైటికి వెళ్ళేవాడు కాదు. అప్పుడు కూడా నల్లని కోటు. శుభ్రమైన తెల్లని కాలరూ ధరించేవాడు. ఇవన్నీ బూర్జువా లక్షణాలని అతని విరోధులు దుయ్యబట్టేవారు. దీనికి సమాధానంగా తాను శ్రామిక విప్లవంలో పాల్గొనటానికి తెల్ల కాలరు ప్రతిబంధకం కాలేదనేవాడు. ఏ వ్యక్తిలోనైనా అలవాట్లు మొండిగా తిష్ఠ వేసికొనటం సహజమే. ఏమైనా అపరిశుభ్రతను, విప్లవ సద్గుణంగా భావించటం నాకు సమ్మతం కాదు.

భోజనానంతరం బొరోడిన్‌తో అతని గదికి వెళ్ళాను. అతడొక జరూరు పనిలో నున్నాడు. లెనిన్ రచించిన "వామపక్ష కమ్యూనిజం" అనే వ్యాసాన్ని ఇంగ్లీషులోనికి తర్జుమా చేయవలసిందిగా రెండు రోజుల క్రితం బలబనోవా అతనికి అప్పగించాడట. అది రష్యన్‌లో వ్రాయబడింది. బెర్లిన్‌లో నున్నప్పుడే దాన్ని గురించి విన్నాను; కమ్యూనిస్టుల్లో గొప్ప సంచలనం కలిగించిందా రచన. జర్మనీలోనికి తర్జుమా ఐందిగాని, అది యథామాతృకంగా లేకపోవుటచే అనేక దురూహలకూ, అభిప్రాయాల భేదాలకూ, కారణమైంది. అందుచే ఇంగ్లీషు, ఫ్రెంచి తర్జుమాలను జాగ్రత్తగా దోషరహితంగా తయారు చేయాలి. ఒకవైపు వామపక్ష కమ్యూనిజం ఖండనలోని గతతార్కికాలను గ్రహించి వివరించాలి; మరొకవైపు వామపక్ష కమ్యూనిజాన్ని బలపరచే మతాల సానుభూతిని కోల్పోకూడదు. కాని పక్షంలో రెండవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పునాదులు బలహీనమైపోతై. కాబట్టి ఈ పని కత్తిపై సామువంటిది; భాషాంతరీకరణ వృత్తిలో నున్న ప్రముఖులకు గూడ కష్టసాధ్యమైన పని. ఒక్క ముక్కలో వామపక్ష కమ్యూనిజం అంటే విప్లవ అసహనం; శ్రామిక పవిత్రతావాదం. ఈ విధానాన్ని గతితార్కిక దృష్టితో విమర్శించటమే

రెండవ ప్రపంచ మహాసభ పరిష్కరించవలసిన ప్రధాన సమస్య. అందుచే లెనిన్ వ్యాసానికి ఎంతో చారిత్రక ప్రాధాన్యత లభించింది; ప్రతి కమ్యూనిస్టూ చదివి, అర్థం చేసుకోవలసిన అవసరం ఏర్పడింది. ఆ తొలి రోజుల్లో కమ్యూనిస్టు విశ్వాసం ఉద్రేకం మీదే ఆధారపడినా హేతుతత్వంతో అర్థంచేసుకోవాలనే ప్రయత్నాలు కూడా జరుగకపోలేదు. అందుచే కేవలం విశ్వాసమే గాక హేతుతత్వాన్ని కూడా దృష్టిలో నుంచుకొనే లెనిన్ రచన సాగించాడు; అదే గతితార్కిక దృష్టి; కాని ఆతని శైలి అయోమయంగా ఉండేది. అనేక భావాలను ఒకే వాక్యంలో గుదిగుచ్చే అలవాటు వల్ల, ఆతని శైలి క్లిష్టంగా తయారైంది. పైపెచ్చు విప్లవ కాలంలో అల్ప కాల వ్యవధిలో వ్రాయవలసిరావటం చేత పై దుర్గుణాలు బలపడినై. వ్రాయటానికి బదులుగా విప్లవకారులు స్టెనోగ్రాఫర్లను చెప్పటం అలవరచుకొన్నారు; వేదికపై నిచ్చే ఉపన్యాసాలే గాక, ఏ వ్యాసంగానీ, పుస్తకంగానీ వ్రాయాలన్నా ఉపన్యాసాలే ఇస్తూ ఉండేవారు. అందులో కొందరు ముఖ్యంగా రాడెల్ పచార్లు చేస్తూ చెప్పేవాడు. ఐతే విప్లవ ఉద్రిక్త వాతావరణంలోకూడ లెనిన్ వ్రాయటం మానుకో లేదు. ఐనా ఆతని శైలి మరింత క్లిష్టతమమైపోయింది; అప్పుడప్పుడు రాడెల్ అంటూండేవాడు; "ఆ వృద్ధుడు (లెనిన్) ఒక ఉత్తరం కూడ డిక్టేట్ చేయటం నేర్చుకోలేదు." వ్రాయటం అనేది అతని అభిప్రాయంలో ప్రాత పద్ధతి!

లెనిన్ వ్యాసానికి శీర్షికను గురించి బొరోడిన్ వస్తీ పట్టటం ప్రారంభించాడు. మక్కికి మక్కి తర్జుమా చేస్తే లెనిన్ వాడిన శీర్షికకు "వామపక్ష కమ్యూనిజం అనే బాలారిష్టం" అనే అర్థం వచ్చేటట్లుంది. అందుచేత, ఆ శీర్షిక వామపక్ష కమ్యూనిజాన్ని లెనిన్ పూర్తిగా ఖండించాడనే భావం కలిగించి, వ్యాసంలోని గతి తార్కికాల వైశిష్ట్యానికి ప్రతిబంధకంగా తయారవుతుంది. అందుచే బొరోడిన్‌కి ఉపాయాంతరం సూచించాను. రెండు భావాలను విడగొట్టి "వామపక్ష కమ్యూనిజం-బాలారిష్టం" అని వాడమన్నాను. చివరకీ శీర్షికే లెనిన్ ఆమోదాన్ని పొంది, ఇతర భాషలలోని తర్జుమాలకు కూడ ఉపయోగింపబడింది.

గడియారం పది గంటలు కొట్టడంతో కారఖాన్‌తో నా సమావేశాన్ని గుప్తం చేశాడు బొరోడిన్. అతనితో నేనన్నాను. "ఇంతసేపటి వరకు గృహమేధి, అతిధిని చూడకపోవటం ఆశ్చర్యంగా ఉంది."

"కారఖాన్ భోజన కాలం వరకూ నిద్రపోతాడు; తరువాత కమ్మిసేరియట్‌కు వెళ్ళేముందు కొన్ని ఉద్యోగ ధర్మాలు నిర్వహించాల్సి ఉంది."

"ఐతే ఇప్పుడు కారఖానునుచూచి ప్రయోజనం ? మాట్లాడటానికే అవకాశం వుండదుగదా !"

బొరోడిన్ వివరంగా చెప్పాడు.

"విదేశకార్యాలయం రాత్రిపూట పనిచేస్తుంది; చిచిరిన్‌కి పగటిపూట నిద్రపోవటం అలవాటు. విదేశరాయబారులతోనూ, పత్రికా ప్రతినిధులతోనూ, అతని సమావేశాలు తెల్లవారుజామునే. అందుచేత కారఖానుతో కలిసి విదేశాంగశాఖా కార్యాలయానికి వెళ్ళినట్లయితే, అక్కడ మంచి వ్యవధి లభిస్తుంది; చిచిరిన్‌నుకూడా కలుసుకోవచ్చు."

సామ్రాజ్యవాదరాజ్యాలపై చిచిరిన్ చేసిన సింహగర్జన ప్రపంచమంతటా మారుమ్రోగింది. దానితో ప్రపంచ విప్లవకారుల అభిమానాన్ని చూరగొన్నాడు చిచిరిన్. ఆ రోజున అతణ్ని చూడటం అనుకోకుండా లభించిన మహదవకాశం!

కారఖాన్ ఇంట్లో డ్రాయింగ్‌రూమ్ చాల విశాలమైంది. అదే ఇంటిదగ్గర అతని ఆఫీసురూముకూడా. గదిమధ్యలో నిలబడిఉన్నాడు కారఖాన్. నీటుగా దుస్తులుధరించాడు. నల్లనికోటూ, లోకప్రసిద్ధిచెందిన తెల్లని కాలరూ! నాజూకుగా కత్తిరింపబడిన నల్లని గడ్డం, వెనకకు దువ్విన జుట్టు, కారఖాన్ ముందుకు నడచి కరస్పర్శ చేశాడు. నా ప్రయాణాన్ని గురించిన కుశలప్రశ్న లయినతర్వాత "ఇక బయలుదేరాలి" అన్నాడు. మా యిద్దరిమధ్య బొరోడిన్ దుబాసి (Translator). అప్పటికింకా కారఖాన్‌కు రష్యన్ తప్ప మరి యే భాషా రాదనే చెప్పవచ్చు. పోర్టికోలో నున్న 'లిమోసిన్'లో కూర్చున్న మరుక్షణంలో విదేశాంగ కార్యాలయం ముందు దిగాం. అప్పుడా కార్యాలయం మాస్కోలో ఒక పెద్దహోటల్లోఉండేది. కార్యాలయంముందు సాయుధ రక్షకభటుడు కాపలాఉన్నాడు. కారఖాన్ జేబులోనుండి కార్డు (Identity) తీసి చూపించాడు. భటుడా కార్డుమీద నున్న ఫొటోతో కారఖానును పోల్చిచూచి అనుమతించాడు. లోపలినుండి మరొక ఉద్యోగి అనుమతి పత్రాలు తెచ్చేవరకూ బొరోడిన్, నేనూ ఆఫీసుబైటనే వేచియుండాల్సివచ్చింది.

సోవియట్ విదేశాంగ దేవాలయంలోనికి అనుమతి లభించిన తరువాత, మమ్ము ఉపమంత్రి కార్యాలయంలోనికి నడిపించారు. ఒక పెద్ద తోలు కుర్చీలో కూర్చున్నాడు కారఖాన్; ముందు విశాలమైన మేజా; దానిమీద టెలిఫోను రిసీవర్లు; మా సంభాషణ మధ్యలో కారఖాన్ రెండు రిసీవర్లలోనికి ఒకే పర్యాయం మాట్లాడాడు. టెలిఫోన్లు మూడు ఒకేమారు మ్రోగితే ఏం చేసేవాడో!

## ప్రపంచ విప్లవానికి రెండవ రంగం

ఉదారంగు తోలు పడక కుర్చీలో లేచి కూర్చుని, మేజామీదుగా నాకు సిగరెట్ పెట్టె అందించాడు కారఖాన్. ఆ కుర్చీ బహుశా పూర్వం 'హోటల్ మెట్రోపాల్', లాబీల నలంకరించి యుండేదనుకుంటాను. అవి హైగర్ మార్కు సిగరెట్లు. వానిని కాబూలులో సోవియట్ రాయబారియైన సురిట్జ్ పంపాడట;

ఆ మార్కు సిగరెట్లు నా కీయటంలో ఔన్నత్యం ఉందనే భావంతో, వానిని నా కోసం కారఖాన్ భద్రపరచిఉంచాడట! అతని చాపల్యాన్ని సమర్థిస్తూ, 'ఔను, అది బెంగాలు పులిరాజు.' అన్నాడు బొరోడిన్. ఏం మాట్లాడటానికీ తోచక సిగరెట్ అందుకొన్నాను. పెట్టెకూడ చాల అందంగా ఉంది, పెద్ద పెద్ద సిగరెట్లు; కారఖాన్‌కు ఒక సిగరెట్టు ఇవ్వబోయాను. అప్పటికే కారఖాన్ కుర్చీలో పడుకొని వేరొక రకం సిగరెట్టు ముట్టించాడు. వానిని విదేశాంగ తపాలా సంచితో బాటు షిష్కిన్ తెచ్చాడట!

రష్యా చేరిన కొద్దికాలంలోనే అనేక విషయాలు తెలిసికొన్నాను. విప్లవం తొలిరోజుల్లో విదేశాల్లోని రష్యా రాయబార కార్యాలయాలకు వెళ్ళే వార్తాహరులు విప్లవ సాహిత్యంతో నిండిన సంచులతో వెళ్ళేవారు. తిరిగి వచ్చేటప్పుడు ఆ సంచుల నిండా విలాసవస్తువులు తెచ్చేవారు. ఉదాహరణకు మంత్రులకోసం సిగరెట్లు; వారి భార్యలకు అలంకరణ సామాగ్రి, సిల్కు మేజోళ్ళు! షిష్కిన్, కోమిన్ టరన్ ప్రత్యేక వార్తాహరుడు. అతని ధర్మాల్లో ప్రధానమైనది జినోవీవ్ అంతఃపురం కోరికలు తీర్చటమేనని ప్రచారంలో నున్న వదంతి! త్రికిరీట గౌరవధారియైన జినోవీవ్ వాస్తవానికి పవిత్రుడు; అతనికి త్రాగుడు, ధూమపానం మొదలైన దురలవాట్లు లేవు. అతని అంతఃపురాన్ని గురించిన వాగుడంతా అసత్య ప్రచారమే. రాజకీయంగా గొప్ప ఆశలు పెట్టుకోవటంచేత వ్యక్తిగత జీవితాన్ని నిర్లక్ష్యం చేస్తూండేవాడు. ఐనా సాంస్కృతికంగా జినోవీవ్ పెట్టీ బూర్జువావర్గంలోకే వస్తాడు. తన వ్యక్తిగత జీవితం సాంప్రదాయ సిద్ధమేనని లోకం గ్రహించాలనుకొనే వాడు.

కారఖాన్ విషయానికి వద్దాం; అతడు వాడుతున్న సిగరెట్ హాంబర్గ్‌లో క్రొత్తగా తయారైంది. దాన్ని వాడే గౌరవాన్ని కారఖాన్ బొరోడిన్లు పంచుకొన్నారు. సిగరెట్లు కాలుస్తూ ఉభయులూ ఏవో రష్యా భాషలో మాట్లాడుకొన్నారు. నాకు కొంచెం కష్టమనిపించింది. నేనూ 'రాయల్ బెంగాల్ టైగర్' ముట్టించి, కారఖాన్‌పై దృష్టి మరల్చాను. కోలముఖం; కన్నూ, ముక్కూ తీర్చి దిద్దినట్లున్నై: పాలిపోయిన ఆలివ్ వర్ణం; నీటుగా కత్తిరింపబడి ఉంగరాలు తిరుగుతా నంటున్న నల్లని గడ్డం, నాగరిక వాతావరణంలో అవతరించిన ఏసుక్రీస్తా? అనిపించేటట్టున్నాడు. కాని కారఖాన్ యూదుజాతీయుడు కాదు; పురాణప్రసిద్ధమైన బంగారురంగు జుట్టూ లేదు. క్రీస్తుకైనా బంగారురంగు జుట్టు ఉండేదని నేను నమ్మలేను. ఉన్నట్లుండి కారఖాన్ లేచి కూర్చొని, మేజామీద చేతులానించి నాతో సంభాషణ ప్రారంభించాడు, రష్యన్‌లో; బొరోడిన్ తర్జుమా చేశాడు:

"కాబూలులోని సోవియట్ రాయబారి సురిట్జ్, అక్కడనుండి వచ్చేస్తా నంటున్నాడు. అక్కడంతా మధ్యయుగ వాతావరణం; నాగరికు డెవ్వడూ ఎక్కువ

కాలం ఉండలేదు. అందుచే అతని కోరికను మన్నించాలి. మరి, అతని స్థానంలో బోరోడిన్‌ను పంపాలను కుంటున్నాం. ఈ విషయంలో మీ అభిప్రాయం చెప్పాలి."

ఇది నేను ఊహించని ప్రశ్న; నా కాశ్చర్యం కలిగించింది. తిరిగి వివరంగా చెప్పాడు కారఖాన్.

"ఇండియాలోని విప్లవకారులతో సంబంధాన్ని నెలకొల్పుకోవాలనే మీ ఆకాంక్షను గురించి, బోరోడిన్ మెక్సికోనుండి రాగానే వివరించాడు. 'వలస ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రోత్సహిస్తా' నంటూ సోవియట్ ప్రభుత్వ మొక ప్రసిద్ధ ప్రకటన కావించింది. దాని కనుగుణంగా, సోవియట్ ప్రభుత్వం శాయశక్తులా మీతో సహకరిస్తుంది. కాని మధ్యఆసియాలో సర్వత్రా అరాజకం తాండవిస్తున్నది. ఆ ప్రాంతాలను విప్లవం జయించాలి. ఈలోగా కాబూలులోని సోవియట్ రాయబార వర్గంద్వారా ఇండియా సరిహద్దులకు మార్గం సుగమమౌతుంది; ఇప్పటికే ఆ ప్రాంతాలలో విశేషప్రచారం జరిగింది. కానీ కాబూలులోని ఇండియన్ కామ్రేడ్స్ ఇండియాలో విజృంభిస్తున్న బ్రిటిష్ వ్యతిరేకసహకార నిరాకరణోద్యమంతో చేతులు కలపటానికి అవకాశం లేకపోతున్నది. ఇట్టి పరిస్థితిలో, మీ రా ప్రాంతంలో ఉండడంవల్ల రాజకీయంగా ఎంతో మేలు జరుగుతుంది. మీరు చురుకుగా పనిచేయటానికీ, మీ కృషి ఫలించటానికీ, మీ స్నేహితుడే కాబూలులో ఉండటం శ్రేయస్కరం. మీరే మంటారు?"

అసలువిషయం సురిట్జ్‌కూ, కాబూలులోని భారతీయ విప్లవకారులకూ పొత్తు కుదరలేదు. భారతీయ విప్లవకారుల్లో పోటీముఠా లేర్పడినై; సమైక్యతను సాధించటానికి బదులు, సురిట్జ్ 'సత్రకాయ' పాత్ర వహించి, వారిలోని విభేదాలను రెచ్చగొట్టాడు. జర్మన్‌పోషణలో నెలకొల్పబడిన "తాత్కాలిక భారత ప్రభుత్వం"లోని సభ్యులపట్ల సురిట్జ్‌కు సదభిప్రాయంలేదు. ఇండో ఆఫ్ఘన్ సరిహద్దులోని కొండజాతి ప్రజలకు ఆయుధాలిచ్చి, ధనసహాయంచేస్తే, వారు బ్రిటిష్‌ప్రాంతాలపై దండయాత్రలు సాగిస్తారని అచటి భారతీయులవాదన. వీరికి పోటీగా మరొక భారతీయ ముఠా తయారైంది. వారినాయకుడు ఆచార్య; ఇతణ్ణి బెర్లిన్‌కమిటీవారు, భారతీయ సైన్యంలో బ్రిటిష్‌వ్యతిరేక ప్రచారం సాగించటానికై కాబూలు పంపారు; కాని ఆచార్య కుట్ ఎల్ అమారా దగ్గర తురుష్కులకు ఖైదీగా పట్టుబడ్డాడు. యుద్ధానంతరం ఒక వృద్ధభారతీయ వర్తకునితో బాటు ఆచార్య ఆఫ్ఘనిస్థాన్‌లో ప్రత్యక్షమైనాడు. ఆ వృద్ధవర్తకునిపేరు అబ్దుల్ రాబ్; తనకు సరిహద్దుజాతులనాయకుల్లో బాగా పలుకుబడికలదంటూ ఉండేవాడు. ఆచార్య తాను కమ్యూనిస్టునని చెప్పుకొంటూ 'తాత్కాలిక భారత ప్రభుత్వ' సూచనను ఖండించాడు. సురిట్జ్, ఆచార్యను బలపరచాడు. కాబూలులోని భారతీయుల్లో అధికసంఖ్యాకులు జాతీయవాదులు. అందుచే వారందరు సురిట్జ్‌తో సహకరించటానికి నిరాకరించారు. ఈ జాతీయ

భావోన్మాదులు తన్ను హత్యచేస్తారనే భయంతో ఆచార్య, సురిట్జ్‌తో రష్యా వస్తున్నాడనికూడా ప్రకటింపబడింది. కాబట్టి కాబూలులో పరిస్థితులు పూర్తిగా విషమించినవనటం తథ్యం; వానిని చక్కబరచి, ఇండియాలో విప్లవచర్యలకు కార్య స్థానంగా కాబూలును రూపొందించాలి. ఆ కార్యభారానికి బొరోడిన్ సమర్థుడని కారఖాన్ అభిప్రాయం; అందుకు చిచిరిన్‌కూడా సుముఖుడే. ఇక కారఖాన్ సూచనను కమ్యూనిస్టుపార్టీ పొలిటికల్‌బ్యూరో ఆమోదానికి పంపాలి. అంతకు ముందుగా ఈ విషయాన్నిగురించి నేను లెనిన్‌తో సంప్రదించటం అవసరం.

మెక్సికోలో ఉన్నప్పుడే, భారత విప్లవకారులతో సంబంధాలు పునరుద్ధరించే అభిప్రాయాన్ని బొరోడిన్ సూచించాడు; నాటినుండి ఆ ప్రణాళిక అస్పష్టంగా నా మనస్సులో రూపొందసాగింది. కాని నాలో నేర్పడిన క్రొత్తదృక్పథానికీ, భావాలకూ అనుగుణంగా ఇండియాలో విప్లవ కార్యక్రమాన్ని గురించి భారత విప్లవకారులకు సహాయంచేసి విప్లవ వికాసానికి తోడ్పడే విషయాన్ని గురించి ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు. అందుచేత, కారఖాన్‌కు వెంటనే సమాధానమిచ్చే స్థితిలో లేను; ఆతని సూచన చాల ఆకర్షణీయంగామాత్రం ఉంది; కాని బొరోడిన్‌తో చర్చించి, జాగ్రత్తగా నిర్ణయానికి రావలసిన అంశం. ఏమైనా, ప్రస్తుతానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు సన్నాహాలు చేయవలసిన భారం నాపై బడింది.

### కామ్రేడ్ చిచిరిన్

ఆ క్షణానికి కారఖాన్‌తో సంభాషణ పూర్తియైనట్లే; అతనికి కూడ ఇతర పను లుండవచ్చు. "ఐతే, తిరిగి కలుసుకుందా"మని సూచిస్తూ ఉండగానే కారఖాన్ లేచి నిలబడ్డాడు; సమావేశం ముగిసిందని, గుడ్ బై చెప్పటానికనుకున్నాను. కాని అతని దృష్టి గదికి రెండవ వైపునున్న దర్వాజాపైకి మరలింది. ఆ తలుపులు చాల నెమ్మదిగా తెరచుకున్నై; ఒక తల బైటికి వచ్చింది; మా సమావేశానికి భంగం కలిగిస్తున్నానేమో అనే భయంతో కారఖాన్, విధేయతతో ఆ వ్యక్తిని రావలసిందిగా ప్రార్థించాడు. ఐనా, అర్ధరాత్రి ఆగంతకుడు "బెదరిన కుందేలు పిల్లలా" నెమ్మదిగా, క్షమాపణ కోరుతున్న ధోరణిలో గదిలో ప్రవేశించి, నిశ్శబ్దంగా తలుపులు మూసి, మేజా సమీపించాడు.

"కామ్రేడ్ చిచిరిన్, సోవియట్ విదేశాంగ మంత్రి" అంటూ కారఖాన్ పరిచయం చేశాడు.

చిచిరిన్! నమ్మలేక పోయినాను. ఐరోపా విదేశాంగ మంత్రులకు సింహస్వప్నమైన చిచిరిన్ ఇంతటి మేదకుడా! ఆ కీర్తి ప్రతిష్ఠలకూ ఈ ఆకారస్వభావాలకూ, హా స్తిమశకాంతరం! ఐరోపాపై విస్తరించుచున్న కారుమేఘంగా, పెట్టుబడిదారీ

రాజ్యాల విదేశాంగ మంత్రులకు స్వప్నాల్లో సాక్షాత్కరించే చిచిరిన్‌లో ఇంతటి సాధుత్వాన్ని ఊహించటం కూడ సాధ్యం కాని విషయం. ఆ రోజుల్లో సామ్రాజ్య వాద దౌష్ట్యాన్ని ఖండిస్తూ, దాని ఆసన్న పతనాన్ని సూచిస్తూ, సోవియట్ ప్రభుత్వ విదేశాంగశాఖ తరచు ప్రకటనలు జారీ చేస్తూండేది. విదేశ నీతిలో అపూర్వమైన ఈ భీషణ గర్జన లన్నిటికీ కారకుడు చిచిరిన్. అందుచే పెద్ద గడ్డంతో, వికృతాకారంతో, పండ్ల సందున పసిపాపల రక్తంతో తడిసిన కత్తితో, పురాణాల్లో కన్పించే రాక్షసులను పోలి ఉంటాడు చిచిరిన్ అని సర్వసాధారణమైన అభిప్రాయం!

పెట్టుబడిదారీ రాజ్యాల్లో నీతి బాహ్యమైన (Yellow press) పత్రికలు ద్వేషంతో ప్రచారం చేసే కట్టుకథలను నే నెప్పుడూ విశ్వసించేవాణ్ణి కాదు. ఐనా, చిచిరిన్ నాకు చాల ఆశ్చర్యాన్ని కలిగించాడు. అంత పొడవరీ కాదు, పొట్టీ కాదు; దుస్తులపట్ల శ్రద్ధ ఉన్నట్లు లేదు; ఆకర్షణీయమైన ముఖం; లెనిన్ గడ్డంలాంటి ఎఱ్ఱని చిన్న గడ్డం; నిడుపైన తల, దానిపై నల్లగా అందంగా ఉన్న జుట్టు; మధ్య భాగంలో ఇంచుమించు బట్టతల. బాహ్య ఆకారంలోని లోపాలపట్ల ఔదాసీన్యం పెంచే ఆంతరంగిక సంస్కారం ఉట్టిపడే పెద్దమనిషి! కాని, అతనిలో అహంకారంగానీ, మాంద్యంగానీ లేవు. గదిలో ఉన్నంతసేపూ క్షమాపణ చెప్పుకొంటున్న ధోరణే అతనిలో కన్పించింది. కాని అతని వ్యక్తిత్వంలోనుండి ఏదో అవ్యక్త శక్తి ప్రసరించి పరిసరాలను చైతన్యవంతం చేసినట్లైంది. సత్ప్రవర్తన, శ్రద్ధ, నైతిక దార్ఢ్యాలే ఆ అవ్యక్త శక్తి అనుకుంటాను. చిచిరిన్‌కి ఒక ఆదర్శం ఉంది; ఆ ఆదర్శాన్ని అనుసరించటంలో అతని యందు మతోన్మాదుల్లో ఉండే పట్టుదల కన్పిస్తుంది. కాని అతని పట్టుదలకు హేతుబద్ధమైన నమ్మకమే కారణం. అందుచేతనే అతని పట్టుదలలో, మతోన్మాదుల్లో కన్పించే అసహనం, అసభ్యత, అంధవిశ్వాసం కన్పించవు.

ఆదర్శ బోల్షివిక్‌లకు లెనిన్ చక్కని నమూనా. అతనిలో ఒక దృఢ విశ్వాసం గోచరించేది. ప్లేటో మానసిక పరిశ్రమతోనూ స్టోయిక్కుల కఠోర నైతిక దీక్షతోను సంస్కరింపబడిన, సెయింట్ పాల్ మున్నగు ఆదిమ క్రైస్తవ ప్రచారకుల విశ్వాసాన్ని పోలింది లెనిన్ విశ్వాసం. లెనిన్ స్థాయిని అందుకోగల బోల్షివిక్కులు చాల అరుదు. అంతేగాదు; జీవితాంతం ఆ స్థాయిని లెనిన్ నిలుపుకోగలిగేవాడా అని అనుమానం! అకాలమృత్యువు చల్లని హస్తం, లెనిన్‌కా విషమపరీక్ష రాకుండా చేసి మేలు చేసింది!

సోవియట్ రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడైన స్వెర్డలావ్ ఆదర్శ బోల్షివిక్కుల కోవలోని వాడేనని చెప్పుకోగా విన్నాను. స్వెర్డలావ్‌ను కలుసుకొనే అవకాశం లేకపోయింది. నేను రష్యా చేరకపూర్వమే ఆతడు మరణించాడు. కఠోర విప్లవాదర్శానికి జీవితాల నంకితం చేసిన వృద్ధ బోల్షివిక్కులలో చాలమందికి దాని విజ

యాన్ని చూచే భాగ్యం లభించలేదు. ఒక మహదాశయానికి అంకితం చేసిన ఉత్సాహజ్వాలకే వారి జీవితాలను ఆహుతిగా చేసికొన్నవా అనిపిస్తుంది. వారందరూ క్షయ, హృద్రోగం మొదలైన ఏదో ఒక వ్యాధితో బాధపడి గతించారు.

అరుణభయోత్పాతానికి సాధనమైన 'చెకా'ను నిర్మించి, దానికి ప్రథమ అధ్యక్షుడైన జెర్‌జిన్‌స్కీ మరొక ఆదర్శ బోల్షివిక్. ఇది చాల వింతగా తోచవచ్చు. కాని అతని ప్రవర్తనలో ప్రత్యేక విశేషమేమీ లేదు; మూఢవిశ్వాసానికి సహజమైన పరిణామమే అది. స్టోయిక్ కఠోర నైతికదీక్ష, మనకు తెలియకుండానే లౌకిక ప్రయోజనాల కుపయోగించే నైతిక సూత్రాలుగా దిగజారిపోతూ ఉంటుంది. ఈ పరిణామం లెనిన్ తరం బోల్షివిక్కులలో కన్పిస్తుంది. కాని ఈ నైతిక అఘాతానికి కొద్దిమంది మాత్రమే తట్టుకొని నిలబడినారు. ఆ అఘాతానికి బలియైన వారిలో ఒకడు జెర్‌జిన్‌స్కీ. అతడు క్షయ వ్యాధితో బాధపడుతూ ఉండేవాడు. కాని ఇతని విషయంలో, క్షయ వ్యాధికంటె, వ్యక్తిగత నైతిక నిర్ణయాలకూ, సాముదాయక లౌకికమతంలోని మూఢవిశ్వాసాలకూ మధ్య జరిగిన సంఘర్షణే ఎక్కువ ప్రమాదకరంగా పరిణమించింది. ఇది కేవలం నేను ఊహించుకొన్న అభిప్రాయం కాదు; స్వల్పకాలమే ఐనా, జెర్‌జిన్‌స్కీతో నాకున్న సన్నిహిత పరిచయం ఆధారంగా కలిగిన అభిప్రాయమే. అతని జీవితం రెండు వైపుల మండిన కాగడా! ఫ్రెంచి విప్లవంలో భయోత్పాతాన్నీ, రక్తపాతాన్నీ ఆరంభించినవాడు డాన్‌టన్; అతని శత్రువు లతన్ని ఉరికంబ మెక్కించే వరకూ డాన్‌టన్ రక్తపాత విధానంలోని రాక్షసత్వాన్ని గుర్తించలేదు. జెర్‌జిన్‌స్కీ అలా కాదు; ఎవరినైనా ఉరికంబ మెక్కించినప్పుడల్లా హృదయం బ్రద్దలయ్యేటట్లు విలపించేవాడు; లేకపోతే ఇంకా ఎక్కువ రోజులు బ్రతికి యుండేవాడే. కాని ఆతనికి జీవితంపై విరక్తీ, అసహ్యం యేర్పడింది. విప్లవానికి అంకితమైన జీవితమే ఒక దుర్భర విషాద నాటకం!

స్వెర్డ్‌లావ్, జెర్‌జిన్‌స్కీల తరగతికి చెందిన బోల్షివిక్కు లెందరో లేరు. వారి అనుభవాలతో రష్యావిప్లవమొక విషాదాంత నాటకమైంది. ఏమైనా వారి శ్రద్ధాసక్తులూ, సేవలవల్లనే విప్లవం విజయవంతమైంది. చరిత్రకు బలియైన ఈ వీరులతో కలిసి పనిచేసే అవకాశం లభించినందుకు నన్ను నేను అభినందించుకొనటంలో ఆత్మోత్కర్ష లేదు. చిచిరిన్‌కూడా ఈ వర్గానికి చెందినవాడే. సమకాలికచరిత్రలో మెరుపువలె మెరసి అంతర్ధానమైనాడు. ఐనా, అతనిలో మూర్తీభవించిన విలువలపట్ల, సంస్కృతి పట్ల అభిమానం వహించిన వారందరూకూడా అదృష్టవంతులే! తన రక్తదాహం తీర్చుకొనే నిమిత్తం విప్లవం చిచిరిన్‌ను కబళింపలేదు. అంతమాత్రాన అతనిలో విప్లవోత్సాహం తక్కువనటానికి వీల్లేదు. జీవితంలో ఏదోవిధంగా విజయం పొందటం కంటె, తన వ్యక్తిత్వానికీ, అభిప్రాయాలకూ ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ ఉండేవాడు. లాట్వీమోవ్ కానీ, విషిన్‌స్కీ గానీ చిచిరిన్‌కి ఏ మాత్రం చాలినవారు

కాదు. పెట్టుబడిదారీ విధానం మధ్య విప్లవ వ్యవస్థ ప్రశాంతంగానే మనగలదని లాట్వీమోవ్ భావించేవాడు; ఇక విషిన్‌స్కీ, నీతి నియమాలులేని వాగుడుకాయ. ఇటువంటి పద్ధతులేమీ చిచిరిన్‌కి నచ్చేవికాదు. వ్యక్తిగా, చిచిరిన్ ట్రాట్‌స్కీ అంతటి గొప్పవాడు కాకపోవచ్చు; జినోవీవ్, కామనీవ్‌లవలె కుట్రలు, అధికార పోరాటాల స్థాయికి దిగజారలేనంతటి ఉదాత్త స్వభావం కలవాడు.

రష్యా విప్లవంలో పాత్రధారులైన ఈ ప్రముఖుల వ్యక్తిత్వాన్ని, చారిత్రక ప్రాధాన్యతను గురించి ఈ అభిప్రాయాలను రావటానికి చాల రోజులు పట్టింది. చిచిరిన్‌పై నా అభిప్రాయానికి, మా ప్రథమ సమావేశంలో కలిగిన భావాలూ, అనుభూతియే పునాది.

కారఖాన్ పరిచయవాక్యాలైన తరువాత, చిచిరిన్ నిర్దుష్టమైన ఇంగ్లీషులో నాతో మాట్లాడాడు. నేను మాస్కో వచ్చినందుకు సంతోషం వెలిబుచ్చాడు. "పలస ప్రపంచంలో అసంతృప్తి ప్రజ్వరిల్లుతున్నది. విప్లవం తూర్పుగా విస్తరిల్లాలి: ఆసియాలో విప్లవ ద్వితీయ రంగానికి ప్రారంభోత్సవం జరపాలి!"

చిచిరిన్ నన్నభినందిస్తున్నాడనే భావం కలిగింది; కాని విప్లవ పురోగతిలో తన కిచ్చిన పాత్రను ఆసియా సగౌరవంగా నిర్వహింపగలదా అనే అనుమానం పీడింప సాగింది. ఆధునిక ప్రవక్తల జాతికి చెందినవాడు చిచిరిన్; అతని ఉత్సాహానికీ, ఆశలకూ వ్యతిరేకంగా నా అనుమానాలను వెల్లడించే ధైర్యం నాకింకా అలవడలేదు. "మరల సమావేశమై, సామ్రాజ్యవాదంపై తిరుగుబాటులద్వారా, పలస ప్రజలు ప్రపంచ విప్లవానికి చేయగల సేవను గురించి చర్చిద్దాం" అన్నాడు చిచిరిన్. సుప్రసిద్ధ సోవియట్ విదేశాంగ మంత్రి సంప్రదింపులకు నన్నాహ్వానించటం నా కెంతో గర్వ కారణమైంది. "ప్రపంచ విప్లవ వికాసానికై ఇండియాలో తిరుగుబాటు" అనే సూచన చాల ఆకర్షణీయం. మెక్సికోలో ఉన్నప్పుడే ఆ విషయాన్ని గురించి ఆలో చించాను; ఇక దాని వివరాలను నిర్దుష్టంగా రూపొందించాలి.

చిచిరిన్, కారఖాన్‌తో రహస్యంగా మాట్లాడి, అప్పటికి నాకు 'గుడ్ బై' చెప్పి, ఎంత ప్రశాంతంగా ప్రవేశించాడో అంత ప్రశాంతంగా నిష్క్రమించాడు. తన పై ఉద్యోగి ప్రవర్తనకు సంజాయిషీ చెప్పుకోవాలన్నట్లు చూచాడు కారఖాన్. తన ఆఫీసుకు రప్పించటానికి బదులు తన క్రింది ఉద్యోగితో సంప్రదించటానికై చిచిరిన్ దిగిరావట మేమిటి? కారఖాన్‌తో సమావేశం ముగిసేటప్పటికి వేగుజా మైంది. మాతోబాటు, ఇంటికి రాలేనందుకు కారఖాన్ క్షమాపణ చెప్పుకున్నాడు. ఇంకా ఆఫీసులో అతనికి కొంత పని మిగిలిపోయింది. పగటిపూట అతడు కన్పించక పోవటానికి కారణ మిప్పుడర్థమైంది.

ఆ మరునాడంతా, ప్రపంచ విప్లవ ద్వితీయ రంగాన్ని గురించి తీవ్రంగా ఆలోచించాను. బొరోడిన్ సోవియట్ రాయబారిగా వెళ్ళేపక్షంలో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభ పూర్తియైనంతనే కాబూలు వెళతాను. కాని ఆయుధాలు, సాధనసామగ్రి, ధనం తగినంతగా ఉండాలి. వారితో, సరిహద్దు ప్రజలతో పెద్ద సైన్యాన్ని తయారు చేస్తాను. కేవలం బ్రిటిష్ ప్రాంతాలపై దాడులుచేయుటమే నా లక్ష్యంకాదు. బ్రిటిష్ ఇండియాలో కొన్ని ప్రాంతాల నాక్రమించి, వాటిని మా పురోగమనానికి సోపానాలుగా పటిష్ఠం చేయాలని నా ప్రణాళిక అనీ, విప్లవ సంఘంతో (Revolutionary Military Council) సంప్రదించి నిర్ణయించాలని కారఖాన్ అభిప్రాయం; విప్లవ సైనిక సంఘం అధ్యక్షుడు ట్రాట్స్కీ; ఆత డప్పుడు యుద్ధరంగంలో నున్నాడు; అతని సహాయకుడైన స్క్లాన్స్కీ మాస్కోలోనే ఉన్నాడు. అతణ్ణి ఎప్పుడైనా చూడవచ్చు. కాని నా ప్రణాళికను ముందుగా లెనిన్‌తో చర్చించాలనే నా అభిప్రాయం.

ఉన్నట్టుండి బొరోడిన్ ఒక కొంటె సూచన చేశాడు: "ఆఫ్ఘనిస్థానుకు క్రొత్త సోవియట్ రాయబారిగ యం. యన్. రాయ్‌నే ఎందుకు పంపకూడదు?" సోవియట్ రష్యా జాతీయ రాజ్యం కాదు; ఎవరికైనా పౌరసత్వం పొందటం సులభం. ఆఫ్ఘనిస్థాన్‌లో, సోవియట్ రాయబారిగ నియమింపబడినచో, భారత దేశంలో యం. యన్ రాయ్ గౌరవప్రతిష్ఠలేగాక ప్రజాభిమానముకూడ పెరుగుతుంది. ప్రాచ్య దేశాలన్నిటిలో రష్యాపట్ల సానుభూతి ఏర్పడుతుంది. ఈ సూచన కారఖాన్‌కు బాగా నచ్చింది; బొరోడిన్ సూచన ప్రకారమే ఎందుకు చేయకూడదు? అని ఆలోచించ సాగాడు. ఆ సూచన నాకెంతో ఉత్సాహాన్ని కలిగించిందని వేరే చెప్పనక్కర లేదు; కాని అందులోని సాంకేతికమైన ఇబ్బందులు చిచిరిన్ సూచించే వరకూ మే మెవ్వరం గ్రహించలేక పోయినాం. ఏమైనా అంతిమ నిర్ణయం లెనిన్‌ది. అంతవరకూ ఎవ్వరూ ఏమీ చేయలేరు. ప్రస్తుతం, ఆంతరంగికమైన బోల్షివిక్ విప్లవ సమస్యలతో బాటు, రెండవ ప్రపంచ మహాసభ సమావేశ సమస్యలతో లెనిన్ సతమత మౌతున్నాడు. అందుచే ప్రపంచ విప్లవ ద్వితీయ రంగస్థాపనా ప్రయత్నాలను తాత్కాలికంగా విరమించాలి. మా శక్తిసామర్థ్యాలన్నీ, రెండవ ప్రపంచ మహాసభ మహానాటకాన్ని విజయవంతం చేయటంలోనే కేంద్రీకరించాలి.

## బోల్షివిజం ఇష్టదేవత

మాస్కో చేరిన మరునాడే, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ సాధారణ కార్యదర్శినియైన ఏంజెలికా బాలబనోవా నన్ను ఆహ్వానించింది; ఆ పదవి నాక్రమించిన మొదటి వ్యక్తి ఆమె! అది అధికార హోదాలో జరిగిన సమావేశం గాదు. తాను బస చేస్తున్న హోటలు గదికి మధ్యాహ్నం టీకి ఆహ్వానించింది. క్రెమ్లిన్ గోడ నంటియున్న పార్కు ముఖ్య ద్వారానికి ఎదురుగా ఉన్న దా హోటల్.

## క్రెమ్లిన్ పరిసరాలు

బొరోడిన్, నేనూ కలిసి కారఖాన్ 'లిమోసిన్'లో వెళ్ళాము; మా కారు ఇంచుమించు క్రెమ్లిన్ దుర్గానికి ప్రదక్షిణం చేసింది. దుర్గంలోని ముఖ్య భవనాలనూ, ఆ పరిసరాల్లో జరిగిన చారిత్రక సంఘటనలనూ వివరించాడు బొరోడిన్. క్రెమ్లిన్ దుర్గ సింహద్వారానికి ఎదురుగానే ఉన్నది సుప్రసిద్ధ రెడ్ స్క్వేర్ (Red Square). రెడ్ స్క్వేర్ దక్షిణ ద్వారానికి సమీపంలో ఒక పురాతనమైన చిన్న చర్చి ఉంది; నీలాకాశాన్ని అందుకొంటున్న దేవాలయ శిఖరాలు, బంగారు కాంతితో మెరిసే విమానాలు, బైజాన్‌టైన్ గోపురాలతో నిండియున్న పరిసరాల్లో ఆ ప్రాత చర్చి ఒక వికృతమైన మరుగుజ్జువలె కన్పించింది. ఆ చర్చి పేరు సెయింట్ జార్జి బాసిలికా; దానిది రక్తం గడ్డకట్టించే క్రూరమైన చరిత్ర. మాస్కో రాజరిక ఆరాధ్యదేవతకోసం భయంకరుడైన ఇవాన్ (Ivan the Terrible) దీన్ని నిర్మించాడు. తరతరాలుగా రాక్షసకృత్యాలకు పీఠమైన క్రెమ్లిన్ దుర్గ ద్వారాలను సంరక్షిస్తూ ఉండే దా దేవత!

1917 అక్టోబరులో బోల్షివిక్కులు క్రెమ్లిన్‌పై దాడి జరిపిన సందర్భంలో సెయింట్ జార్జి బాసిలికాలో కొంత భాగం నష్టమైంది. ఆ పరిస్థితుల్లో అటువంటి సంఘటనలు జరుగకుండా ఆపటం అసాధ్యం. కాని ఆ సంఘటన బోల్షివిక్ నాయకత్వంలో తీవ్ర పరిస్థితికి కారణమైంది. బాసిలికాపై దాడి వార్త పెట్రోగ్రాడ్ చేరగానే లూనాచార్‌స్కీ, లెనిన్ దగ్గరకు పరుగెత్తుకు వెళ్ళి ప్రాచీన నిర్మాణాలను ధ్వంసంచేసే విప్లవకారుల చర్యలపట్ల తీవ్ర ఆక్షేపణ తెలపటమే గాక, పార్టీనుండి రాజీనామా చేస్తానని బెదరించాడు. లూనాచార్‌స్కీ వంటి ప్రముఖుల సానుభూతి కోల్పోతే విప్లవం నీరసించటం తథ్యం. అందుచే, అట్టి విధ్వంసక చర్యలను నిలుపుచేస్తానని లెనిన్ హామీ ఇచ్చాడు; కళోపాసకుడైన వృద్ధ విప్లవకారుని ఆత్మ శాంతించింది. నష్టపడిన నిర్మాణాల స్థానంలో క్రొత్తవి నిర్మిస్తాననికూడ హామీ ఇచ్చాడట లెనిన్!

మధ్యయుగంనాటి నిరంకుశ ప్రభువు రాక్షసకృత్యాలకు గౌరవ చిహ్నంగా నిర్మింపబడిన కట్టడాలను నేలమట్టం చేయటాని కారోజుల్లో బోల్షివిక్కులు సందేహించేవారు కాదు. ఐనా సెయింట్ జార్జి బాసిలికా విధ్వంసాన్ని తప్పించుకొంది. అంతర్యుద్ధంలో నష్టపడిన చారిత్రాత్మక నిర్మాణాలను భద్రపరచవలసిందిగా సోవియట్ ప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. దానితో, రాజప్రాసాదాలు ప్రదర్శనశాలలుగా, చర్చీలు పాఠశాలలుగా మార్చబడినై. ఇటువంటి సాంఘిక ప్రయోజనాలకు వినియోగించటానికి సెయింట్ జార్జి బాసిలికా చిన్నదైంది; ఐనా తన వికృత స్వరూపంతో అలాగే నిలిచిపోయింది. కాని ఇప్పుడది దేవాలయమూ కాదు, మధ్యయుగ రాక్షసత్వానికి గౌరవ చిహ్నమూ కాదు; కేవలం రష్యాలో మిగిలిపోయిన బైజాన్‌టైన్ వాస్తు పద్ధతి కొక నమూనా మాత్రమే.

ఇటీవల విప్లవం తన పూర్వవిశ్వాసంలో చాల భాగాన్ని త్యజించింది. విప్లవ భావాలు, సంకుచితమైన మార్క్సు సిద్ధాంతాల పరిధిల నధిగమించినై! అంటే, జారు ప్రభుత్వ శిథిలాలపై నిర్మింపబడిన బోల్షివిక్ వ్యవస్థ, తన చారిత్రక వారసత్వం లోని మధ్యయుగ మాస్కో వైట్ సాంప్రదాయాలను పునరుద్ధరించింది. క్రొత్తగా సృష్టింపబడిన గాథలలో, చరిత్ర పునర్నిర్మింప బడింది. భయంకరుడైన ఇవాన్‌కు (Ivan the Terrible) ఘనుడైన ఇవాన్ (Ivan the Great) అని నామకరణ చేసి జాతీయ వీరుడుగా శ్రద్ధాంజలి సమర్పింపబడింది! ఆతని ఘోరకృత్యాలన్నీ సమర్థింప బడినై. ఆంతరంగిక విధ్వంసక శక్తులను నేల రాచి, నవస్లావ్ రాజ్యాన్ని తార్తారు దండయాత్రల నుండి రక్షించేందుకే ఆతడంత క్రూరంగా వ్యవహరించాడట! ఆతని క్రూర కృత్యాలు అరుణభయోత్పాతానికి (Red Terror) నాంది ప్రస్తావన! చరిత్ర నుత్పత్తిచేసే ఈ ఉద్యోగుల సృజనా సామర్థ్యాన్ని అధిగమిస్తూ, ఐసన్‌స్టీన్ కళా ప్రతిభ 'ఘనుడైన ఇవాన్' కొక చిత్రమైన స్మారక చిహ్నాన్ని నిర్మించింది. అది వేల కొలది వెండితెరలమీద ప్రదర్శింపబడిన చిత్రం! మానసికంగా నియమితమైన లక్షల కొలది అంతరాత్మల్లో నీరసించి పోతున్న విశ్వాసాన్ని పునరుద్ధరించటానికై, ఊహా నిర్మితమైన గతంనుండి ఉత్సాహోద్రేకాలను గ్రహించే ప్రయత్నమే ఆ చిత్రం!

సెయింట్ జార్జి బాసిలికాను స్పష్టంగా చూచే నిమిత్తం కారు దిగాను. ఉన్నట్టుండి రెడ్ స్క్వేరులో విప్లవాత్మక శ్రామికవర్గ గీతమైన 'ఇంటర్నేషనల్' స్వర యుక్తంగా ప్రతిధ్వనించింది. ఇంతపెద్దగా స్పష్టంగావినవచ్చే సంగీతాన్ని సృష్టిస్తూన్న వాద్యం ఎక్కడా అని చుట్టుప్రక్కల కలయచూచాను. నా ఆశ్చర్యానికి బొరోడిన్‌కి నవ్వు వచ్చినంత పనైంది. క్రెమ్లిన్ సింహద్వార గోపురంమీద నున్న గడియారం వైపు చూపించాడు. చాలా పెద్ద గడియారం; అందలి ముళ్ళు మానవ హస్తాలంత ఉన్నై; గోపురంమీది గంటకూడ చాల పెద్దది. ఆ చుట్టూ ఉన్న భవనాలు ప్రతి ధ్వనించే భీషణ సంగీతం ఆ గంటనుండే ఉత్పన్న మౌతున్నది; మైమరపించే అనుభూతి. విప్లవానికి పూర్వం జారిస్టు గీతం విన్పించిన ఆ క్రెమ్లిన్ గడియార గోపుర ఘంటికలు దారిద్ర్య, బానిసత్వాలపై విప్లవ ధ్వజ మెత్తవలసిందిగా ప్రపంచ కార్మికులను సంబోధిస్తూ 'ఇంటర్నేషనల్'ను మూడు సంధ్యలా ప్రచారం చేయసాగింది. రేడియో ప్రసారవిధానం బాగా అభివృద్ధి చెందటంచే ఇంటర్నేషనల్ ప్రపంచం నలుమూలలా మారుమ్రోగింది.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన కొంతకాలం వరకూ, ప్రతి సాయంత్రం రేడియో మాస్కో ట్యూన్ చేసి, వేలకొలది మైళ్లు ప్రయాణం చేసి హిమాలయ పర్వతశిఖరాలు మీదుగా వినవచ్చే ఉల్లాసకరమైన ఆ సంగీతం వింటూ ఉండేవాణ్ణి. నాజీ యుద్ధం యంత్రాంగం ముందు రెడ్ఆర్మీ తిరోగమిచ్చే వార్తలు కూడా వస్తూ

ఉండేవి! మాస్కో నగర పరిసరాలను సమీపించింది మాజీ సైన్యం; ఉక్రెయిన్‌తో పాటు లెనిన్‌గ్రాడ్ ఏ క్షణాన్నైనా పడిపోవచ్చు; కీవ్ నగరంలో సైన్య దిగ్బంధన మైంది; స్టాలిన్‌గ్రాడ్ నగరాన్నీ, కాకసస్ పర్వతప్రాంతంలో ఆసియా సరిహద్దుల్నీ సమీపించారు జర్మన్లు. ఇంతటి భయంకరమైన క్లిష్టసమయంలో కూడా ప్రతిరోజూ సాయంత్రం 'ఇంటర్నేషనల్' సంగీతం, యుద్ధంలో రష్యా కమ్యూనిజం విజయం తథ్య మనే నా విశ్వాసాన్ని జ్వలింపచేస్తూ ఉండేది. హఠాత్తుగా ఒకనాటి సాయంత్రం నా ఆశా సందేశం ఆగిపోయింది. మరునాడు ఆ మరునాడూ కూడా మాస్కో ట్యూన్ చేశాను; ప్రయోజనం శూన్యం! ఇక ఆ సందేశం విన్పించనే లేదు. దానికి బదులు అదే సమయంలో క్రెమ్లిన్ గోపురం గంటలు రష్యా జాతీయ గీతాన్ని ఆలపించ సాగినై. చరిత్రలో ఒక మహత్తర యుగం పరిసమాప్తమైంది! రష్యా విప్లవం, మానవజాతికి స్వేచ్ఛను ప్రసాదిస్తుందనే విశ్వాసం నాలో అంతరించింది. నాటి తర్వాత, అంటే రెడ్ స్క్వేరులో ఇంటర్నేషనల్ ఆలపించే క్రెమ్లిన్ గోపురం గంటలను కండ్లారా చూస్తూ ఆ సంగీతంతో తన్మయత్వం పొందిన తరువాత, ఇరువది రెండు సంవత్సరాలలో ఎన్నో ముఖ్య సంఘటనలు జరిగినై. ఆ మహత్తర యుగానికి 1942 సంవత్సరం చరమగీతం పాడిందని నా అభిప్రాయం.

భక్తి ప్రపత్తులతో, నిశ్శబ్దంగా కారెక్కి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సాధారణ కార్యదర్శిని చూడటానికి వెళ్ళాను. ఆ సమావేశమే నా జీవితంలో నూతనాధ్యాయానికి శ్రీకారం!

బలబనోవా ఒంటరిగా మా కోసం నిరీక్షిస్తున్నది. ఆలస్యమైనందుకు విసుక్కుంటుందేమోనని భయపడ్డాను. తరువాత తెలిసింది; రష్యాలో ఆలస్యంగా రావటమంటే ఏమిటో తెలియదు. ఎప్పుడైనా వారికి 'టీ' వేళే! ప్రతి యింట్లోనూ, అన్ని వేళలా టీ నీళ్ళు మరుగుతూనే ఉంటై; అవసరమైనప్పుడల్లా 'టీ' సిద్ధంగా ఉంటుంది. గ్లాసు వెంబడి గ్లాసు వేడి 'టీ' నీళ్ళు త్రాగటంలో రష్యనులకు వారే సాటి!

బలబనోవా నివసించే గది చాల చిన్నది; కాని పరిశుభ్రంగా ఉంది. వాకిట్లోనే మమ్మాహ్వానించింది. మంచి ఉత్సాహవంతురాలు; వయస్సెంతో చెప్పటం కష్టం; పొట్టిగా కొంచెం బొద్దుగా ఉంటుంది. ఎన్నో భగ్న హృదయాలకు నాయకురాలై విప్లవ చరిత్ర పుటల్లో కన్పించే అలెగ్జాండ్రా కొలొంతాయ్ లాగా వెలుగొత్తించే అందం బలబనోవాలో లేదు. ఈ లోపాన్ని ఆమె స్వభావం, గుణగణాలు, అంధ విశ్వాసం ఘనీభవించి రూపొందిన ఆశాభావమూ పూర్తిచేసినై. చిన్నతనం నుండి, తన జీవితాన్ని విప్లవానికి అంకితం చేసి, వృద్ధ బోల్షివిక్కుల కోవలో చేరింది; కానీ పార్టీ ఉన్నత వర్గంలో కన్పించే అహంభావం బలబనోవాలో

కన్పించదు. ఆమె జీవితం చాల నిరాడంబరం; కాని దాన్నే ఘనతగా బాహాటంగా చాటటం ఆమె స్వభావానికి విరుద్ధం. ఆమె అభిప్రాయంలో చింపిరితనం విప్లవ సద్గుణం కాదు. 'విప్లవం కొరకు ప్రాణాలర్పిస్తాను' అనే నిర్ణయానికి చిహ్నంగా మూతి బిగించుకొని కూర్చొనటం ఆమెకు గిట్టేది కాదు.

బలబనోవా ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడుతుంది. టేబుల్ దగ్గరలోనే ఉన్న సోఫా చూపించి కూర్చోమని కోరింది. ఆ టేబుల్ మీదనే 'టీ' పాత్ర బుసలు కొడుతోంది, వెంటనే బలబనోవా 'టీ' తయారు చేయటంలో నిమగ్నురాలైంది. అది చాల క్రొత్త పద్ధతి. 'టీ' పాత్రపై నున్న పింగాణీ బుడ్డిలోనుండి రెండు మూడు టీ బొట్లు పోసి, ఆ గ్లాసులను మరిగే నీళ్ళతో నింపింది; పంచదార బిళ్ళ వేసింది. టీ తయారైంది. అందులో నంజుకొనటానికై చెరొక నిమ్మకాయ బద్ద!

రష్యాప్రజలు 'టీ' లో పాల నుపయోగించరు. వాళ్లు త్రాగే 'టీ' చాల తేలికగా ఉండటమే బహుశా అందుకు కారణమై ఉంటుంది. ఆ 'టీ' పొడుం కూడా అంత మేలిరకమైందికాదు. అందుచేతనే సువాసనకోసం నిమ్మకాయ నుపయోగించుతారు. ఈ నిమ్మకాయలు, రష్యాకు ఇటలీనుండి దిగుమతి అయ్యేవి. రష్యాలో అంతర్యుద్ధం జరిగేరోజుల్లో విదేశవాణిజ్యం స్తంభించి నిమ్మకాయల దిగుమతి ఆగిపోయినది. అందుచేత దైనందిన జీవితావసరాల్లో నిమ్మకాయ అమూల్యమైంది! బ్లాక్ మార్కెట్ లోతప్ప మిగిలినచోట్ల అవి లభించేవే కాదు; ఇక, చీకటిబజార్లో విపరీతమైన ధర ఉండేది. ఒక నిమ్మకాయఖరీదు ఒక మిలియన్‌రూబుల్సు! బ్లాక్ మార్కెట్ వ్యాపారం చట్టవిరుద్ధంకాబట్టి వర్తకులూ, ప్రజలుకూడ తరచు 'చెకా' బారి పడుతూ ఉండేవారు. ఈ విలాసవస్తువు కొనబోయి కారాగారవాసం అనుభవించటం తరచు సంభవించేది. పైన చెప్పిన వెల విడ్డూరంగా కన్పించవచ్చు; కాని అది అక్షరాలా సత్యం! నాడు రష్యాలో కాగితపు డబ్బుకు విలువ పూర్తిగా నశించింది; మిలియన్ రూబులు నోటును 'నిమ్మకాయ' అని పిలుస్తుండేవారు. కారణం? అది కొనగలిగింది ఒక్క నిమ్మకాయమాత్రమే!

బలబనోవా యింట్లో నిమ్మకాయలు బ్లాక్ మార్కెట్‌లో కొన్నవిగావు. వాటిని బొరోడిన్ జర్మనీనుండి తెచ్చి ఆమెకు బహుకరించాడు; ఈ నిరుపద్రవ విలాసముతో ఆమె నిరాడంబర జీవిత కాఠిన్యాన్ని కొంచెం తగ్గించాలనే అతని ఉద్దేశ్యం! 'టీ'లో పాలుకలుపుకొనే ఇంగ్లీషు ఆచారంతో చెడిపోయిన భారతీయునకు, వృధాగా నిమ్మబద్ద ఇచ్చినందుకు బొరోడిన్ ఆగ్రహిస్తాడని కాబోలు నవ్వుతూ అన్నది బలబనోవా; "రెండవ ప్రపంచమహాసభకు వస్తున్న ఇటాలియన్ ప్రతినిధివర్గం, ఐలిచ్ (లెనిన్)కీ, నాకూ చెరొక గంప నిమ్మకాయలు తెస్తున్నామని వ్రాశారు; వానితో నీ బాకీని వడ్డీతో సహా చెల్లించుకొంటాను."

టీ ఇస్తూ, ఫలహార మేమీ ఇవ్వలేనందుకు నాతో క్షమాపణ చెప్పతూ, వెంటనే కోపంగా బోరోడిన్‌తో అన్నది: "ఏదో దుకాణం కిటికీలో తినుబండారాలు ప్రదర్శించాలట; అన్నార్తులైన ప్రజలు గుంపులుగా ఎగబడి చూస్తున్నారట. నీకు తెలిసిందా? ఇలిచ్, నవఆర్థికవిధానం అంటూ పట్టుకు కూర్చున్నాడు. ఏమవుతోందో ఏమో?" అంటూ విప్లవ భవిష్యత్తును గూర్చిన ఆందోళనను సూచించేటట్లు తల త్రిప్పింది. అప్పటికే ఆమె తల నెరుస్తూ ఉంది.

యుద్ధ కమ్యూనిజం (War Communism) వల్ల కలిగిన దుష్ఫలితాలు, దిగ్బంధనం (Blockade) తో దుర్భరమై ఆర్థికంగా రష్యా పతనోన్ముఖమైంది. మరొక సంవత్సరం, దేశవ్యాప్తమైన క్షామదేవత పాదాలక్రింద నలిగిపోయింది విప్లవ రష్యా. యుద్ధ కమ్యూనిజాల దుష్ఫలితాలను తొలగించాలనే ఉద్దేశ్యంతో లెనిన్ అనుసరించిన 'నవ ఆర్థిక విధానాన్ని' ఇంచుమించు వృద్ధ బోల్షివిక్కు లందరూ ప్రతిఘటించారు. వారిలో నొకతె బలబనోవా. కాని నవఆర్థిక విధానాన్ని విమర్శించినా, ఆమెకు లెనిన్‌లో ఎంతో విశ్వాసమూ భక్తీ ఉండేవి, వ్యక్తిగత జీవితంలో నియమబద్ధంగా ఉండేది; రాజకీయంగా ఆమె భావాలు చాల తీవ్రమైనవి. ఐనా ఆమె తన వ్యక్తిత్వాన్ని పార్టీకి బలి పెట్టలేదు. పార్టీ సభ్యులపట్ల చాల సహృదయతతో వ్యవహరించేది. ఆ సంబంధాల్లో మానవత్వం తొణికిసలాడేది. వాస్తవానికి బలబనోవా బోల్షివిజానికి మాతృమూర్తి.

లెనిన్‌తోబాటు బలబనోవా పెక్కు సంవత్సరాలు ప్రవాసంలో గడిపింది. ప్రవాసంలో అధికభాగం ఇటలీలో ఉంది. ఇటాలియన్ సోషలిస్టుపార్టీకి ఈమే 'కులదైవం'. ఇటాలియన్ సోషలిస్టు లామెను భక్తితో ఆరాధించేవారనే చెప్పవచ్చు. ఆమెపట్ల వారికి గల గౌరవాభిమానా లటువంటివి. 'ఆంజెలికా' అనేది ఆమెకు ఇటాలియను లిచ్చిన అభిమాన నామమే. అది రష్యన్ పదమూ కాదు, లాటిన్ రూపాంతరమూ కాదు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లోకి చేరిన సోషలిస్టు పార్టీలలో రాజకీయంగా పటిష్ఠమై ప్రజాదరణ పొందినది, ఇటాలియన్ సోషలిస్టుపార్టీయే. మితవాదపక్ష నాయకుడైన టురాట్టీని కాదని ఇటాలియన్ సోషలిస్టులు ఆంజలికానే అనుసరించారు. ఆమె వ్యక్తిగత జీవితాన్ని గురించి ఎవ్వరికీ తెలియదనుకుంటాను. కాని ఒక విషయం మాత్రం వినబడేది. ఇటాలియన్ మార్క్సిస్టు నాయకుడైన సెర్రాటీ, బలబనోవా ప్రభావంవల్లనే టురాట్టీ నుండి విడిపోయినాడట! పార్టీలో అసభ్య ప్రచారాలకు కారణమైన వారుకూడా బలబనోవాను గురించి అంతకుమించి మాట్లాడేవారు కాదు.

స్వార్థరహితులై, సున్నిత స్వభావం గల పురోగామి బోల్షివిక్కుల కోవకు చెందింది బలబనోవా. అందుచేతనే, విప్లవ స్వర్గంలో జుగుప్సాకర వైపరీత్యాలను

దర్శించినప్పుడు తన అంతరాత్మను సమాధాన పరచలేకపోయింది. ముఖ్యంగా పార్టీలో అధికారం కోసం వృద్ధ సహచరులమధ్య జరిగిన పోటీతో ఆమె కలలు భగ్నమైనై. మాస్కోకు తిరిగి వచ్చిన తరువాత రాడెల్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సాధారణ కార్యదర్శిపదవి కాంక్షించాడు. రాడెల్‌ను బలపరచాడు జినోవీవ్. అందుకొక స్వార్థం లేకపోలేదు! రాడెల్‌కు అధికార ప్రాబల్యాలను చేకూర్చి తద్వారా జర్మనీ లోని ఇండిపెండెంట్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ సానుభూతి సంపాదించాలని జినోవీవ్ ఆశయం. పూర్వ స్నేహసంబంధాలను పురస్కరించుకొని బలబనోవా, ఇటాలియన్ సోషలిస్టులను బలపరుస్తుందనే భయంతో, జర్మన్‌కమ్యూనిస్టులు రాడెల్ పక్షం వహించారు. ఈ కుట్రలతో విసువెత్తి, రెండవ ప్రపంచసభానంతరం, తనను పదవినుండి తప్పించవలసిందిగా లెనిన్‌ను కోరింది బలబనోవా. మామూలు పద్ధతిలో జరిగే జాప్యాన్ని సహింపలేకపోయినాడు రాడెల్. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయంలో ఏదో నాటకమాడి, బలబనోవా స్థానాన్ని ఆక్రమించగలిగాడు.

ఇది జరిగిన కొన్నిరోజుల్లోనే బలబనోవా, రష్యా రంగస్థలంనుండి పూర్తిగా నిష్క్రమించింది. లెనిన్ చనిపోయేవరకూ స్టాక్‌హోమ్‌లో బోల్షివిక్‌గానే కాలం గడిపింది. ఆ తరువాత పార్టీనాయకత్వానికై జరిగిన సంఘర్షణలో ఆమె స్వప్నాలు పూర్తిగా భగ్నమైనై. జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీదేశాల్లోని సోషలిస్టుపార్టీలనాయకులు మాస్కో ఆదేశాలను మన్నించలేదనే కారణంగా ఆ పార్టీలను విచ్ఛిన్నం చేయటానికి కమ్యూనిస్టు లుపయోగించిన ఎత్తులతో ఆమెకు పూర్తిగా అసహ్యం కలిగింది. సిద్ధాంతీ స్నేహం, నైతిక విలువలలో గౌరవం-బోల్షివిక్ పార్టీలో నశిస్తున్న ఆమె విశ్వాసాన్ని మరింత బలహీనపరిచినై. లెనిన్ మరణం ఆ విశ్వాసానికిగల పునాదులనే నిర్మూలించింది. లెనిన్‌తో బాటే బోల్షివిజంకూడా మరణించిందనే భావంతో, బలబనోవా తిరిగి సోషలిస్టులలో చేరింది. కొన్నిరోజుల తరువాత అమెరికా వెళ్ళి అక్కడ "తిరుగు బాటు దారుగా నా జీవితం", (My life as a Rebel) అనే పేరుతో తన స్వీయ గాథను ప్రచురించింది.

## క్రొత్త మత ప్రధాన పూజారి దగ్గరకు

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయంలో మరునాడామెను కలుసుకో వలసిందిగా బలబనోవా కోరింది. లెనిన్ వ్రాసిన పత్రం ప్రతి తన దగ్గర ఉన్నదనీ దాన్ని నాకివ్వాలనీ చెప్పింది. అది చాల ముఖ్యమైన పత్రం; జాతీయ వలస ప్రజల సమస్యలను గురించి లెనిన్ తన సిద్ధాంతాన్ని వివరించిన రచన అది. (Thesis on the National and Colonial Question). రెండవ ప్రపంచ మహాసభ ఈ సమస్యను చర్చించి నిర్ణయాలు చేయవలసియున్నది. లెనిన్ ఆ పత్రాన్ని రష్యను భాషలో వ్రాశాడు; నేను మాస్కో చేరక పూర్వమే బొరోడిన్ దాన్ని ఇంగ్లీషులోకి తర్జుమా

చేశాడు; కాని బొరోడిన్ ఆ విషయాన్ని గురించి ఒక్క ముక్కకూడా నాతో చెప్పలేదు; మెక్సికోలో కంటె రష్యాలో ఎక్కువ గోప్యంగా ఉండేవాడు; రహస్య ప్రవర్తన బోల్షివిక్ సద్గుణం అనేది క్రమ క్రమంగా గ్రహించాను. కాని అది ఎంత వరకు సద్గుణమో అనుమానం; దానివల్ల బోల్షివిక్కులకు మేలు కంటె కీడే ఎక్కువ జరిగింది!

## ఇంటర్నేషనల్ కార్యాలయం

ఆ రోజుల్లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయాన్ని క్రెమ్లిన్‌కి దూరంగా ఒక ఇరుకు గొందిలో నున్న భవనంలో యేర్పాటు చేశారు. నగరంలోని ముఖ్య కేంద్రాలకు కూడా అది చేరువలో లేదు. అది ఏ జమీందారుదో లేక వర్తకునిదో ఐ యుంటుంది. బ్రెస్ట్‌లిటావ్‌స్కీ సంధి జరిగిన తరువాత, సోవియట్ రష్యాకు జర్మనీ ఒక రాయబార వర్గాన్ని పంపింది; దాని అధ్యక్షుడు మీర్‌బక్ ప్రభువు (Court von Mirbach). కాని మాస్కోలో విదేశ రాయబార కార్యాలయాలకు తగిన భవనాలు లేవు. జారు ప్రభుత్వం రోజుల్లో రాయబార కార్యాలయాలన్నీ పెట్రోగ్రాడ్‌లోనే ఉండేవి. అందుచే ఇప్పుడు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయం ఉంటున్న ఈ భవనాన్ని జర్మన్ రాయబారి మీర్‌బక్‌కు ప్రత్యేకించబడింది.

రష్యాలోని సోషలిస్టు రివల్యూషనరీ పార్టీ మొట్టమొదట బోల్షివిక్కులతో కలిసి పని చేసింది. కాని బోల్షివిక్కులు అధికారంలోకి వచ్చిన కొద్ది రోజులకే బ్రెస్ట్ లిటావ్‌స్కీ సంధి, విప్లవ విద్రోహచర్య అనీ, రష్యా సర్వంసహాధికారాన్ని జర్మనీకి దత్తం చేయటమేనని ఖండింపసాగింది; శ్రామిక వర్గ నియంతృత్వానికి బదులు మీర్‌బక్ నియంతృత్వాన్ని నెలకొల్పినదంటూ సోవియట్ ప్రభుత్వంపై ఉవ్వెత్తున దుమ్మెత్తి పోసింది. సోషలిస్టు రివల్యూషనరీ పార్టీది దౌర్జన్య విధ్వంసక విధానం; దాన్ని పునరుద్ధరించే ఉద్దేశ్యంతో పార్టీ సభ్యుల్లో సాహసికుడొకడు మీర్‌బక్‌ను ఆతని కార్యాలయంలో హత్యచేశాడు. ఈ నేరానికి బోల్షివిక్కులే బాధ్యులంటూ, జర్మన్ ప్రభుత్వం మాస్కో నుండి తన రాయబార వర్గాన్ని ఉపసంహరించింది. అంతటితో ఖాళీయైన ఈ భవనంలోకి ఇంటర్నేషనల్ కార్యాలయాన్ని మార్చారు. ఇదే ఈ భవనం చరిత్ర! ఇందులో ప్రాచీన యుగ చరిత్ర విస్మృతి పథంలో పడిపోయింది; అద్యతన చరిత్ర మాత్రం ఇంకా ప్రతివాని మనస్సులో నవ్యంగా మెదలుతూనే ఉంది. మీర్‌బక్ హత్యచేయబడిన గదికి తాళం వేసి ఉంచేవారు. అందులో పర్షియన్ తివాచీమీద ఇంకా నెత్తురు మరకలు మాసిపోలేదు. ఆ గది ఒక మ్యూజియమైపోయిందే; సాయుధ రక్షకభటులా గదికి కాపలా ఉండేవారు. రష్యాకు వచ్చిన విదేశ కమ్యూనిస్టులా గదిని తప్పక చూచిపోతుండేవారు. దర్శకుల్లో కొందరా గదిని వీరోచితమైన విప్లవ దౌర్జన్యానికి గౌరవ చిహ్నంగా భావించేవారు. మరి కొందరు న్యాయదేవత తీసికొన్న ప్రతీకార చర్యకు చిహ్నంగా గౌరవించేవారు.

జర్మన్ సైనిక దౌర్జన్య వాదానికి ప్రతినిధి మీర్‌బక్; అంటే ఆతడు మానవాకృతి దాల్చిన దుర్జనత్వం! అట్టివాణ్ణి వధించటం - ఎవరు చేసినా అది పుణ్యకార్యమే!

. నేను ప్రభుత్వ అతిథినే ఐనా, ఇంటర్నేషనల్ కార్యాలయంలో జరిగే అధికార సమావేశానికి ఉపమంత్రి కారులో వెళ్ళటానికి వీల్లేదు. నాడు, రష్యాలో పార్టీ ప్రముఖ కార్యకర్తలకుగానీ, ఉన్నత ప్రభుత్వోద్యోగులకుగానీ, ఎవ్వరికీ సొంతకార్లు లేవు. మాస్కోలోని మోటారు కార్లన్నీ సిటీ సోవియట్ పరమైనై. ప్రముఖవ్యక్తులకు మాత్రం వాటి నుపయోగించుకొనే హక్కుంది. ఆ ప్రముఖుల పేర్ల జాబితాను సిటీ సోవియట్ తయారుచేసి, కేంద్ర గ్యారేజి అధికారికి అప్పగించింది. కేంద్ర గ్యారేజినే 'ఆటోబేస్' (Auto Base) అనేవారు. ప్రముఖుల్లో ఎవరికైనా కారు అవసరమైనప్పుడు గ్యారేజికి ఫోన్ చేసేవారు. పార్టీనాయకులకూ, ఉన్నతోద్యోగులకు ఒక్కొక్కకారు ప్రత్యేకింపబడియుండేది. ప్రాత మోడల్ రోల్సురాయస్ ఒకటి లెనిన్‌కు ప్రత్యేకింపబడింది. కొన్ని కార్లు ఇంటర్నేషనల్ ఉద్యోగి బృందానికి ప్రత్యేకింపబడినై. వానిలో ఒకటి వచ్చింది నన్ను ఇంటర్నేషనల్ కార్యాలయానికి తీసుకువెళ్ళటానికి. అది ప్రాతమోడల్ ఫియట్. చూపులకు అందంగాలేదుగాని చాలగట్టిది; రైలుఇంజనుకున్నంత శక్తిఉంది దాని ఇంజనుకు. ఆరోజుల్లో మాస్కో వీధులన్నీ రాళ్ళమయం; ఇక డ్రైవర్లు పోయే వేగానికి అంతులేదు. అందుచే పెద్దకార్లే ప్రయాణానికి సుఖంగా ఉండేవి. విలాసంకంటె, ఆకర్షణకంటె నేనెప్పుడూ సౌఖ్యానికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తాను. అందుచేతనే మాస్కో చేరినప్పటినుండి నా కా ప్రాతమోడల్ ఫియట్ ప్రత్యేకింపబడింది. గర్జిస్తూ, ఎగిరిపడుతూ కంకరరోడ్లమీద దూసుకొనిపోతూఉండేది. దాన్ని నడిపేది ఒక మిలిటరీ డ్రైవరు. మలుపుల్లోనూ, క్రాసింగుల్లోనూకూడా స్పీడు తగ్గించేవాడుకాదు. అనుక్షణం ప్రమాదాన్ని శంకిస్తూ కూర్చుండేవాణ్ణి!

అదృష్టవశాత్తూ వీధుల్లో జనసమ్మర్దం అంత ఎక్కువగా ఉండేదికాదు. పురుషుల్లో వయోజనులంతా యుద్ధరంగాల్లో ఉన్నారు; వారి స్థానాల్లో దృఢకాయులైన స్త్రీలు ఫ్యాక్టరీలలో పనిచేస్తున్నారు. ఫ్యాక్టరీలు మాస్కోనగరానికి వెలుపలనే ఉండేవి. ఇక శ్రామికవర్గేతర ప్రజానీకం భయంతో ఇండ్లనుండి బైటికే వచ్చేవారు కాదు. వీధుల్లో వారికేమి ఆకర్షణలులేవు; వీధుల్లో పచార్లు చేయటంగానీ, పార్కుల్లో కాలక్షేపంగానీ, సాంఘిక బాధ్యతనుండి తప్పించుకు తిరగటంగా పరిగణించేవారు; సాంఘికబాధ్యత అంటే వస్తూత్పత్తికృషి. అట్టి కృషిలో పాల్గొనని వ్యక్తి విప్లవ న్యాయదేవత ఆగ్రహానికి గురికాక తప్పదు.

మా పాత ఫియట్, "ఊగిసలాడుతూ, ఒక ఇరుకు గొందిలో ప్రవేశించి, ఒక్క కుదుపుతో ఆగిపోయింది; అది రెండంతస్తుల ఎఱ్ఱరాతి భవనం; నాలుగైదు

మెట్లు, దానిపై అందంగా చెక్కబడియున్న పెద్ద దారు దర్వాజా; తలుపులు వేసి ఉన్నై. రెడ్ ఆర్మీ యూనిఫారమ్‌లో ఉన్న ఇద్దరు సైనికులు లోపలినుండి తలుపులు తెరిచారు. గడపలో కాలు మోపానో లేదో ఆ సైనికులు తమ బాయొనెట్లను నాపై గురి పెట్టారు! ఆ క్షణంలోనే మరొక కారు వచ్చి ఆగినట్లూ, ఎవరో వ్యక్తి మెట్లపై పరుగునవస్తూ, ఉల్లాసంతో 'ఆగండి!' అని అరచిన శబ్దమూ వినిపించింది. అతడు రాడెల్! నా బుజం తడుతూ, "బలబనోవా ప్యాస్ ఇవ్వలేదా?" అంటూ అడిగాడు; లేదని చెప్పటంతోటే, "అంతా అయోమయం చేసేస్తోంది, బలబనోవా" అంటూ విమర్శించాడు. ఆ విమర్శకు కారణం నాకేమీ బోధపడలేదు. ఈలోగా సైనికులు భయానకమైన ఆటంకాన్ని తొలగించి రాడెల్‌తోబాటు లోనికి వెళ్ళటానికి అనుమతించారు. అప్పటికే ఇంటర్నేషనల్ కార్యాలయంలో రాడెల్ మంచి పరపతి సంపాదించినట్లు స్పష్టమైంది. రాడెల్, నన్ను సాధారణ కార్యదర్శి గది వరకూ తీసుకు వెళ్ళాడు. మధ్యహాలుకు ఎదురుగా ఉన్న దా గది. మిర్‌బక్‌ను హత్యచేసిం దా హాలులోనే. తన పైపుతో రాడెల్ గది తలుపుమీద తట్టి, వెంటనే పాలరాతి మెట్లమీదుగా పై అంతస్థుకు పరుగు తీశాడు; బలబనోవా, ఇంకా పదవి నుండి తప్పుకోనలేదు; అయినా రాడెల్ తన సొంత సిబ్బందితో ఆఫీసులోనే మకాం పెట్టాడు. ద్వంద్వ ప్రభుత్వం! అధికారాన్ని రాడెల్ హస్తగతం చేసుకొన్నాడు; కాని న్యాయతః ఇంకా బలబనోవాదే అధికారం. నేను ఆమె సూచనలనే శిరసావహించాను.

రాడెల్‌ను ప్రప్రథమంగా బెర్లిన్‌లో కలుసుకొన్నాను. ప్రథమ సమావేశంలోనే అతనిమీద సదభిప్రాయం కలగలేదు. మాస్కోలో అతనితో సన్నిహిత పరిచయం యేర్పడింది. మంచి స్ఫురద్రూపి అనీ, శక్తిసామర్థ్యాలు కలవాడనీ గ్రహించాను; ఐనా నా మొదటి అభిప్రాయం మారలేదు. అతనిలో కన్పించే ప్రతిభ కేవలం పైపూత లాంటిదే. హేతుబద్ధమైన విశ్వాసం గానీ, నిర్ణయాలకు కట్టుబడి ఉండగల నైతిక బలం గానీ అతనిలో పూజ్యం. కాని అతనిలో చక్కని హాస్యం ఉంది. పార్టీ వర్గాల్లో అతనికి గల పలుకుబడికి అదే కారణం. ఇతరులను పరిహాసం పట్టించటంలో అతనికి సాటిలేరు; అప్పుడప్పుడు తన్ను తనే పరిహసించుకొనేవాడు; కాని అతని పరిహాసాల్లో ఈర్ష్యాద్వేషాలు ప్రతిధ్వనిస్తూ ఉండేవి. రాడెల్ వృద్ధ బోల్షివిక్ నాయకవర్గానికి చెందినవాడు కాదు; నాయకునకవసరమైన లక్షణాలు కూడా అతనిలో లేవు. కాని అతనికి నాయకునిగా రాణించాలనే ఆశ లేకపోలేదు; దాన్ని సాధించటానికే ఏ ఎండకా గొడుగు పట్టటం నేర్చుకొన్నాడు. ఐనా లాభం లేకపోయింది. 1921లో పార్టీ కేంద్ర సంఘానికి (Central Committee) ఎన్నుకొనబడ్డాడు; లెనిన్ తర్వాత ఎక్కువ వోట్లు వచ్చింది రాడెల్‌కే. ఐనా, సర్వాధి

కారాలు గల పొలిట్ బ్యూరో దాకా వెళ్ళలేకపోయినాడు. అనేక క్లిష్టసమయాల్లో స్టాలిన్ కుడిభుజంగా పనిచేశాడు. స్టాలిన్ అభిమానం సంపాదించి ఉండవలసిందే. నీతినియమాలు లేకపోవటంచేత, తన రాజకీయ ఆశయసాధనకై ఏ పనికీ వెనుదీసే వాడు కాదు; ఈ స్వభావం గల వారికి స్టాలిన్ పన్నిన రాజకీయ పద్మవ్యూహంలో గాలివాలుకు ఈదటం సులభమైంది. కాని రాడెల్ అతితెలివియే అతని పతనానికి దారి తీసింది. వృద్ధ బోల్షివిక్కులలో చాలమంది పతనానికి వారి రాజకీయ విశ్వాసం, రాడెల్ విషయంలో మాత్రం అది కాదు. కారణం రాజకీయ నిర్ణయాల్లో అతడు చేసిన పొరపాట్లే రాడెల్ పతనానికి కారణమైనై; రాడెల్ తరచుగా రంగులు మార్చేవాడు; అందుచే ఏ ముఠాకూడ అతణ్ణి విశ్వసించలేకపోయింది. దానితో కేవలం ప్రసిద్ధ కమ్యూనిస్టు పత్రికా రచయితగా, బోల్షివిక్కు విదూషకుడుగా మాత్రమే చరిత్రలో నిలిచిపోయినాడు రాడెల్.

గృహిణిగా బలబనోవాలో కన్పించిన దివ్యత్వం ఆఫీసులోని బలబనోవాలో కన్పించలేదు. నేను ప్రవేశించగానే ఎదురుగానున్న కుర్చీలో కూర్చొనమని తలతో సూచన మాత్రం చేసింది. క్రితం రోజు ఆమెలో మూర్తీభవించిన గృహిణీత్వం ఉద్యోగ వాతావరణంలో మాయమైంది; కమ్యూనిస్టు ఇంటర్నేషనలు స్థాపనకు కారణమైన రెండు ప్రపంచ మహాసభలను విజయవంతంగా జరిపిన కార్యదర్శిహోదా, దర్పమూ ఆమెను ఆవేశించినట్లున్నై. ఏవో పత్రికలు చదవటంలో నిమగ్నురాలైయే పావు గంటవరకూ నా ఉనికినే గమనించినట్లు లేదు. నాలో సహనం నీరసించసాగింది. అంతలో పత్రికలను ప్రక్కనే ఉంచి, నన్నుచూచి సంతృప్తిని సూచించే చిరునవ్వుతో 'ఫోన్' తీసింది. ఇంకా నా ఉనికిని గమనించనే లేదా? క్రెమ్లిన్‌తో రష్యన్ భాషలో ఏదో మాట్లాడింది. సంభాషణ చివర మాత్రం నా పేరు విన్పించింది. బ్లాటింగ్‌పాడ్ మీద ఏవో కొన్ని మాటలు వ్రాసి, ఫోన్ క్రిందపెట్టి, క్షమాపణ పూర్వకంగా నాతో సంభాషణ కుపక్రమించింది, "నీవు వచ్చినప్పుడే, ఇటలీ నుండి క్రొత్తగా వచ్చిన రిపోర్టు చదువుతున్నాను; చాల మంచి సంగతులున్నై; వెంటనే ఐలిచ్‌కి తెలియజేయాలి. ఇటాలియన్ సోషలిస్టు పార్టీలోని మార్క్సిస్టు (మెజారిటీ) ముఠా, రెండవ ప్రపంచ మహాసభ కొక ప్రతినిధి వర్గాన్ని పంపటానికి నిర్ణయించింది; ఆ ప్రతినిధి వర్గ నాయకుడు సెర్రాటి. బోర్డిగో ముఠాతత్వమూ, బొంబాచీ అతివాదమూ పరాజయాన్ని పొందినై" అంటూ తన ప్రయత్నాలు ఫలించినవనే ఆత్మాభిమానంతో మాట్లాడింది. బోర్డిగో, బొంబాచీలు ఇటలీ కమ్యూనిస్టు నాయకులు.

వెంటనే సంభాషణ విషయాన్ని మారుస్తూ: "ఒక గంటలో, అంటే 12-30 గంటలకు, నీవు లెనిన్‌ను కలుసుకోవాలి. ఇప్పుడే ఫోనులో ఆ ఏర్పాటుచేశాను.

ఇంతలో నీవీ చిత్తుప్రతిని చదివేయాలి." అది జాతీయ వలస ప్రజలసమస్యలను గురించిన లెనిన్ సిద్ధాంతం. మొదటి సమావేశంలోనే ఆ సిద్ధాంతాన్నిగురించిన చర్చ జరగదు; ఐనా లెనిన్ నన్ను కలుసుకోవాలని తొందరపడుతున్నట్లు చెప్పింది బలబనోవా. తన ఆఫీసులో నేను వున్నట్లు ఆమె చెప్పగానే, వెంటనే సమావేశం ఏర్పాటు చేయవల సిందిగా సూచించాడట. ఆ క్షణంలో అధికారదర్పం బురఖా తొలగి బలబనోవాను క్రిందటిరోజు ప్రసన్నత్వం ఆవహించింది; మాతృవాత్సల్యం తొణికిసలాడే స్వరంతో మాట్లాడింది: "చిన్నవాడివి, గర్వపడటానికి తగిన కారణాలున్నై; ఐనా ఉద్రేక ములో బుద్ధిమాత్రం పోగొట్టుకోవద్దు; అదృష్టవంతుడివికావాలని ఆశీర్వదిస్తున్నాను." ఆ మాటలు యథాతథంగా ఎప్పుడూ నాచెవుల్లో మారుమ్రోగుతూనే ఉంటై; ఆమె హెచ్చరికను నేనెన్నడూ మరవలేదు; ఆదివ్య ఆశీర్వాదానికి గర్విస్తూ ఉండేవాణ్ణి!

డ్రాయరులోనుండి కొన్ని కాగితాలను బైటికిలాగి నాచేతి కందించింది బలబనోవా. అదే, చరిత్రను నిర్మింపనున్న లెనిన్ సిద్ధాంతానికి ఇంగ్లీషు తర్జుమా. తిరిగి ఉద్యోగ దర్పాన్ని వహించి ఉపాధ్యాయుని ధోరణిలో హెచ్చరించింది; "ఆ మూల కూర్చుని అది చదువు." నేనూ స్కూలు విద్యార్థిగా నామె ఆజ్ఞను మన్నించాను. నాకిచ్చిన వ్రాతప్రతి అట్టపై భాగం ఎడమచేతివైపు మూలమీద వి. ఐ. లెనిన్ సంతకంతో "కామ్రేడ్ రాయ్ సవిమర్శకమైన సూచనలకు" అనే మాటలు నా దృష్టిని ఆకర్షించినై. గ్లాసుడు మంచి సారాయి త్రాగినంత మత్తెక్కించినై ఆ మాటలు! కాని ఆంజెలికా హెచ్చరిక నా చెవుల్లో గింగురుమంటూనే ఉంది. ఆ పత్రాలను చదవటానికి ప్రయత్నించాను; కాని ఉద్రేకంవల్ల దృష్టి కేంద్రీకృతం కాలేదు. ఒక గంటలో ఆనాటి మహాపురుషుణ్ణి చూడబోతున్నాను! నాటి నా అభి ప్రాయంలో బహుశా లెనిన్‌ను మించిన మహాపురుషు డంతవరకూ జన్మించలేదు! రెండు సంవత్సరాలక్రితంవరకూ అత డొక అజ్ఞాతప్రవాసి. కాని, అసాధారణమైన ధైర్యాన్ని ప్రదర్శించి హటాత్తుగా ప్రపంచ రంగస్థలంపై కీలకస్థానాన్ని ఆక్రమింప గలిగాడు. నా ఊహాలు నాకంటె ముందుగా క్రెమ్లిన్ రాజప్రాసాదాని కెగిరి లెనిన్ రూపాన్ని చూడిసాగినై. లెనిన్ ఫొటోలు, బొమ్మలూ చూచి మనస్సులో ఒక రూపాన్ని యేర్పరచుకున్నాను. అతడొక విప్లవ నియంత; నేనొక అనామకుణ్ణి. మరి, ఈ పుస్తకంమీద వినయం ఉట్టిపడే ఈ ప్రార్థనావాక్యాలేమిటి? ఈ వైవిధ్యాల నెలా సమన్వయపరచటం? ఇది కేవలం మోసమా? ఈ ఆలోచనల్లో మునిగి తేలుతున్న సమయంలో బలబనోవా కార్యదర్శివచ్చి, తైమెందని హెచ్చరించాడు; "అరుణ నిషిద్ధ నగరి" (Red Forbidden City) సాంప్రదాయాలను తెలియజేయటానికై అతడే నన్ను పరించి వచ్చాడు.

క్రెమ్లిన్ ద్వారంలో కాపలా ఉన్న రక్షకభటునికి ఒక 'కార్డు' నిచ్చాడు. మరుక్షణమే ఒక ఉద్యోగి ప్రత్యక్షమైనాడు. నన్ను గుర్తించటమే అతని ధర్మం! చేతిలో నున్న పేర్ల జాబితాను పరికిస్తూ, తల నాడించాడు. ఇంకా పరీక్ష పూర్తి కాలేదు. లెనిన్ కార్యదర్శి బృందానికి ఫోన్ చేసి 'ఫలానావారిని ప్రవేశపెట్ట వచ్చునో లేదో ధృవపరచుకొన్నాడు. అది పరీక్షలో రెండవ దశ. అనంతరం, జారుల పట్టాభిషేక మందిర ద్వారంలో నన్ను ఆహ్వానించారు; ఇప్పుడా మందిరం, సావ్‌నార్కం (Sovnarkam, Soviet People's Commissars) విడిది. ఈ మందిర ద్వారంలో స్వాగత మనేది ప్రత్యేక హోదాకు చిహ్నం కాదు. భద్రతా కార్యక్రమంలో ఒక అంశం మాత్రమే. బోల్షివిజం దేవస్థానంలో సోవ్‌నార్కం గర్భగుడి; ఎంతటి గొప్పవాడైనా, క్రొత్త వారిని ప్రవేశపెట్టేటప్పుడు ఎన్నో జాగ్రత్తలు వహించాలి. మొదటి అంతస్థుకు దారితీసే మెట్లమీద సాయుధ రక్షక భటులు కాపలా ఉన్నారు. అవి విశాలమైన పాలరాతి మెట్లు, దానిపై తివాచీలు పరచబడి ఉన్నై. అవి యేవీ నా దృష్టి నాకర్షించ లేదు. మరుక్షణంలో వినూత్న మతానికి ఉన్నత పూజారిగా జోహారు లందుకొంటున్న ప్రపంచ విప్లవ నాయకుని దర్శించటం, అతనితో సంభాషించటం అనే భావోద్రేకం నన్ను పూర్తిగా ఆవేశించింది.

## లెనిన్‌తో ప్రథమ సమావేశం

లెనిన్, ప్రజామంత్రుల సభను (Council of People's Commissars) అధ్యక్షుడు; అతని కార్యాలయ ద్వారాన్ని సంరక్షిస్తూ ఒక కార్యదర్శిదళం ఉంటుంది! వీరంతా లెనిన్ ఆంతరంగిక కార్యదర్శులే; వారి సంఖ్య పండ్రెండు దాకా ఉండవచ్చు. వీరికి నాయకత్వం వహిస్తున్న దొక వృద్ధ వనిత; పేరు కామ్రేడ్ మేరియా. ఆమెది పటాటోపాలం లేని సాధు ప్రవర్తన; సాధారణమైన స్వరూపం; దుస్తులంత పరిశుభ్రంగా లేవు. మంచి సమర్థురాలు. కార్యదర్శిదళం కార్యాలయం చాల పెద్దదే. కార్యాలయంలో అంతా నిశ్శబ్దం. మేరియా మాత్రం, నిశ్శబ్దంగా మేజాలమధ్య రాకపోకలు జరుపుతూ ఉంటుంది. కార్యదర్శులతో మాట్లాడవలసి నప్పుడు వారంతా సాధ్యమైనంత రహస్యంగా మాట్లాడుతూ ఉంటారు. మేరియాను తప్ప ఇతరు లెవ్వరికీ లెనిన్ కార్యాలయంలో ప్రవేశించే హక్కు లేదు. అటువంటి గొప్ప పదవిని పొందిన వ్యక్తి ఎంతటి విశ్వాసపాత్రురాలో! ఈమె, నిజానికి బోల్షివిక్ స్వర్గానికి సెయింట్ పీటర్ వంటిది. మేరియా పార్టీలో చిరకాలంనుండీ సభ్యురాలు. మాస్కోలో ఆమెను తెలియనివారూ లేరు; గౌరవింపనివారూ ఉండరు.

లెనిన్ కార్యాలయానికి ఆనుకొనేఉంది దర్శకులు వేచియుండే గది. ఆ గది ఎప్పుడూ ఖాళీగానే ఉండేది. అంటే దర్శకుల నెక్కువ కాలం వేచియుండ నిచ్చే

వారు కాదు. కాలంపట్ల నిర్లక్ష్యం, రష్యా జాతీయుల లక్షణం; ఒక్క లెనిన్‌ను వినా, బోల్షివిక్కు లందరికీ ఈ లక్షణం వారసత్వంలాగ సంక్రమించింది. కాలాను సరణం అనేది దుర్భరమైన పెటీ బూర్జువా దుర్గుణం. కాలాన్ని ఎంత ఎక్కువగా నిర్లక్ష్యంచేస్తే అంత పెద్ద బోల్షివిక్ నాయకుడు. కార్యక్రమ బాహుళ్యం అనే సాకుతో ఈ దుర్గుణాన్ని సమర్థించుకొనేవారు. ఈ గుణానికి జినోవీవ్, ఇతరుల తల దన్ని పోయాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సభలూ, కార్యనిర్వాహక వర్గ సమావేశాలూ అనేకమార్లు అతని రాకను నిరీక్షిస్తూ గంటల తరబడి వేచి యుండ వలసి వచ్చేది.

ఈ పద్ధతికి లెనిన్ ఒక్కడే వ్యతిరేకం; ఈ విషయంలో మాత్రం అతడు రష్య నేతరుడే. అదే ఆ గది ఖాళీగా ఉండటానికి కారణం. ప్రతి రోజూ లెనిన్ దర్శనార్థం ఎందరో వస్తూ ఉండేవారు; ఈ సమావేశాలు చాల చిన్నవి; వాని కాల పరిమితి చాల తమాషాగా ఉండేది. తొమ్మిది, పదమూడు, పదునేడు నిముషాలు కాల పరిమితిని తప్పక పాటించేవాడు. ఒక సమావేశం పూర్తి కావటానికి రెండు నిముషాలు ముందుగా కామ్రేడ్ మేరియా ఒక మీట నొక్కేది; లెనిన్ మేజాపై నున్న ఎఱ్ఱ బల్బు వెలిగేది. పంక్చుయాలిటీకి తన కున్న కీర్తికి భంగం కలిగించేందుకు అవకాశం కూడ లెనిన్‌కు లభించేది కాదు. ఆ సూచన చేసిన తర్వాత దర్శకుణ్ణి మేరియా స్వయంగా ప్రవేశపెట్టేది. దర్శకులు లేనిచో సంతకాలకోసమై, ఏవో కాగితాలతో లెనిన్ ముందు ప్రత్యక్ష మయ్యేది. మిత్రకోటిలో పరిహాసంగా అనుకుంటూ ఉండేవారు. "కామ్రేడ్ మేరియా, ఐలిచ్‌ని మరీ స్కూలు విద్యార్థిగాచూస్తుంది."

ఖాళీ గది గుండా కార్యాలయానికి తీసుకువెళ్ళారు; కార్యదర్శు లందరూ తమ తమ పనుల్లో మునిగియున్నారే గాని, నా రాకనే గమనించ లేదు. కాని బోల్షివిక్ ప్రపంచ సెయింట్ పీటర్ మాత్రం చురుకుగానే ఉంది. నేను గదిలో ప్రవేశించటంతోనే లేచి నిలబడి గోడపై నున్న పెద్ద గడియారం వైపు చూచింది. నిశ్శబ్దంగా నన్ను సమీపించి, అంతవరకూ నా వెంట వచ్చిన ఉద్యోగిని పంపివేసింది. అక్కడ నుండి నన్ను నడిపించటం ఆమె వంతు. వెండి, బంగారం పనితనంతో మెరుస్తున్న పెద్ద తలుపులు నెమ్మదిగా తెరచి, లోపల ప్రవేశించవలసిందిగా ఆజ్ఞాపిస్తూ తల నూపింది. లోపల ప్రవేశించాను; తలుపులు మూయబడినై నిశ్శబ్దంగా.

పెద్ద గది; చతురస్రాకారం; నిడుపైన కిటికీలు; వానిలో నుండి అంతఃపుర పార్శ్వ భాగాలు కన్పిస్తున్నై; ఆకాశాన్ని అంటుతున్నదా అన్నట్లు చాల ఎత్తుగా నున్న పైకప్పు; గది అంతా ఖాళీ; నేలమీద మాత్రం దళసరి పారశీక తివాసీ నా దృష్టిని ఆకర్షించినది. గదిలో మధ్యగా నున్న మేజాపైకి వంగిన బట్టతల! ఉద్రేకంతో దడగా ఉంది. ఆలోచనారహితంగా మేజావైపు నడిచాను. వాకిలికి మేజా

చాల దూరంగా ఉంది. చప్పుడు చేయకుండా నడవాలనే నా సంకల్పంతో తివాసీ సానుభూతితో సహకరించింది. సగం దూరం నడిచానో లేదో, ఆ బల్లతల యజమాని లేచి నిలబడి, కుడి చేయి నా వైపునకు జాచి, త్వరగా నడిచి వచ్చాడు. లెనిన్ సమక్షంలో ఉన్నాను!

ప్రశ్నార్థకంగా నా ముఖం చూచాడు లెనిన్; మనిషి పొట్టి; నా భుజాల దగ్గరకు వస్తాడు; అందుచే నా ముఖంవైపు చూడటానికై తన పొడేలు గడ్డం (Goatee) అడ్డంగా వచ్చేటట్లు ముఖం పైకెత్తవలసి వచ్చింది. నాకంతా అగమ్యగోచరంగా ఉంది; నోట మాట రాలేదు; ఇంతలో నా పరిస్థితి తేలికైంది. "ఇంత కుఱ్ఱవాడివా! గడ్డాలు నెరిసిన ప్రాచ్య విజ్ఞానిగా ఊహించానే" ఆ మాటలతో నా దడ చాలవరకు తగ్గింది. అప్పటికి నా వయస్సు ఇరువై యేడు సంవత్సరాలు! నా వయస్సును కించపరుస్తూ మాట్లాడటాన్ని సహించలేక పోయినాను.

లెనిన్ నవ్వాడు; బహుశా, తన భక్తుని హృదయంలో గల భయాన్ని పోగొట్టే ఉద్దేశ్యంతో! నా జీవితంలో అదొక మహత్తర సంఘటన. ఆ అనుభూతితో తన్మయత్వం పొంది సమావేశ మర్యాదలను పూర్తిగా పాటించానని చెప్పలేను. మందహాసాలు అతని ఛాందస స్వరూపంలోని కాఠిన్యాన్ని కరగించి వేస్తున్నై.

కఠినమైన మనస్సు బిగించిన ఇనుపపిడికిలిలో లెనిన్ హృదయం నలిగిపోతున్నదనే ప్రచారానికి సవాలుగా ఉన్నై ఆ నవ్వులు. విప్లవకారుడంటే, మానవత్వంలేని, యంత్రం అనే విషయానికి లెనిన్ ఒక పెద్ద సవాలు! అతని నవ్వులో ద్యోతకమయ్యేది నిరాశా, నిస్పృహాయతలు గావు; పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసం, భవిష్యత్తును గురించిన మహత్తరమైన ఆశ. ప్రపంచ చరిత్రలో కన్పించే ఆశావాదుల్లో ఆశావాది లెనిన్. మార్క్సిజమే అంతిమ సత్యమనీ, అది విజయం సాధించటం తథ్యమనీ నమ్మినవాడు. ప్రవక్త ఉద్వేగం, ప్రచారకుని తత్పరత్వం అతనిలో మూర్తీభవించినై. అందుచేతనే సహచరు లందరూ తీవ్రంగా వ్యతిరేకించినా, బోల్షివిక్కులు అధికారం హస్తగతం చేసికోవాలని పట్టుపట్టాడు. బోల్షివిక్కుల అధికారం 'మూడునాళ్ళ ముచ్చటే' అని అందరూ హేళన చేశారు. ఆ క్లిష్టపరిస్థితిలో హేతుత్వేతరంబె విశ్వాసమే అతనికి ధృవతారయై నడిపించింది. ఐతే, లౌకికమైన చారిత్రక నియతివాదమనే భగవంతుని లోని విశ్వాసం కాదు; చరిత్రను సృష్టించటంలో మానవుని అపారశక్తి సామర్థ్యాలలో గల గాఢవిశ్వాసం! అతని జీవితంలో మాత్రమే కాదు; సమకాలిక చరిత్రలోనే అదొక క్లిష్టపరిస్థితి. ఆ సమయంలో ఒక భావకవివలె ప్రవర్తించాడు. లెనిన్ చేసినది సాధారణ కార్యమే. కాని అందులో అతని అసాధారణ ధైర్యసాహసాలు ప్రతిఫలించినై. దానితో మహోన్నత కీర్తిశిఖరాల నందుకొన్నాడు; మానవ చరిత్రలో మృతజీవుల్లో ఉత్తమోత్తము డైనాడు!

ఆధునిక యుగంలో విప్లవకారు లందరిలో డాన్టన్, లెనిన్ సుప్రసిద్ధులు. డాన్టన్‌కూడ భావోన్మాదియే. అతని మిత్రు డైన రాబిస్‌పీర్ హేతుతత్వ దేవాల యంలో ప్రధాన పూజారిగా చలామణి యైనాడు. ఐనా డాన్టనే ఫ్రెంచి విప్లవానికి ఆత్మ! అట్టి డాన్టన్‌ను అసూయతో వధ్యశిల కెక్కించాడు రాబిస్‌పీర్. దానితో ఫ్రెంచి విప్లవానికి ఆత్మ నశించింది! డాన్టన్ వలెనే లెనిన్ కూడా పరిస్థితులు విప మింపక పూర్వమే, మితవాదాన్ని అనుసరించాలని ప్రయత్నించాడు. కాని లెనిన్‌కి దీటైన ప్రత్యర్థి లేడు; అవకాశం ఉంటే, రాబిస్‌పీర్ మూఢత్వాన్ని ట్రాట్‌స్కీ అనుకరించేవాడే. అదే లెనిన్ మరణించిన తర్వాతే, ట్రాట్‌స్కీకి ఆ అవకాశం లభించి యుండేది; కాబట్టి, అకాలమృత్యువు వాత పడక, మరి కొంతకాలం, లెనిన్ జీవించి యున్నట్టయితే విప్లవం ఫలప్రదమైన మార్గంలో నడిచియుండేది. అందుకు లెనిన్ అమలు జరిపిన నవ్య ఆర్థిక విధానమే (N. E. P.) నాంది. ఈ విధానం పూర్తిగా అమలు జరిగియుండినచో, తరువాత జరిగిన హింసాకాండకు, రక్తపాతానికి అవ కాశం ఉండేది కాదు. కమ్యూనిజంలోని ఉత్తమ ఆదర్శవాదాన్ని రక్తపాతమే సమాధి చేసింది. ట్రాట్‌స్కీ అతివాద వ్యతిరేకతవల్ల, లెనిన్‌లోని డాన్టనిస్టు (మితవాద) స్వభావాన్ని హతమార్చాడు స్టాలిన్. ఫ్రెంచి విప్లవానికి రాబిస్‌పీర్ చేసి నంతటి అపకారాన్ని లెనిన్ వారసత్వానికి ప్రత్యర్థులుగా నిలిచిన ట్రాట్‌స్కీ, స్టాలిన్‌లు రష్యా విప్లవానికి చేశారు!

లెనిన్ వ్యక్తిత్వాన్ని గురించీ, విప్లవ చరిత్రలో అతని స్థానాన్ని గురించిన అభిప్రాయాలు అతనితో సమావేశం జరిగిన చాలకాలం వరకూ రూపొందినై. కాని ఆ అభిప్రాయాలకు మొదటి సమావేశమే బీజాలు చల్లింది. ఆ రోజుల్లో పెట్టుబడి దారీ ప్రభుత్వానికి లెనిన్ అంటె గుండెదడ! కాని అతని జీవితంలో అంతటి భయానక విశేషాలు కన్పించలేదు. పేరుకు మాత్రమే నియంత. స్వరూపంలో గానీ, భాషలో గానీ, నియంతృత్వ లక్షణాలేమీ ఉండేవి కావు. అతనిలో వినయం ఉట్టి పడేది; కాని అది స్వప్రయోజకత్వ పరిజ్ఞానంతో నేర్పడిన అతివినయం (ధూర్త లక్షణం) కాదు. మాటల్లో నిర్మొగమాటం; ప్రవర్తనలో ఆత్మీయత అతని గుణాలు. అనేక సంవత్సరాలపాటు బోల్షివిక్ పార్టీకి తిరుగులేని నాయకత్వం వహించాడు. అతని సూచనలనూ, నిర్ణయాలనూ, పార్టీ కేంద్ర కమిటీలో అధిక సంఖ్యాకులు సమ్మతింప లేదు. కాని, అతణ్ణి తొలగించి పార్టీ నాయకత్వం వహించాలని, ఎవ్వరూ కలవరించ లేదు. అతడు కేవలం నాయకుడు కాదు; ఆచార్యుడు! బోల్షివిజం ప్రధానపూజారి, పార్టీప్రముఖులకతడు మిత్రుడు, దార్శనికుడు. లెనిన్ అంటే వారి కెంతో ప్రేమ!

లెనిన్ రాజకీయాల్లో ప్రవేశించినప్పటినుండే, సోషల్ డెమోక్రాటిక్ పార్టీలోనూ, రెండవ ఇంటర్నేషనలులోనూ, వ్యతిరేకమతాలతో తీవ్రపోరాటం సాగించినవాడే. మితవాద నాయకత్వంమీద విమర్శలద్వారా నిప్పులు కురిపించాడు.

"విప్లవానికి అంకితమైనవారే శ్రామికవర్గపక్షానికి ఉక్కుగుండె." అనేదే అతని సిద్ధాంతం! ఇది చాల ప్రమాదకరమైన సిద్ధాంతమే. కాని పార్టీలో అతని ప్రవర్తన ప్రజాస్వామ్యసూత్రాల కనుగుణంగానే యుండేది. తన అభిప్రాయంతో కేంద్రకమిటీ ఏకీభవించనపుడు, దాన్ని పార్టీ సర్వసభకు నివేదించేవాడు. ఆరోజుల్లో ఇంకా, నాయకుని భావాలకు పార్టీసభ్యులు 'తందానా' అనటానికి ఏర్పాట్లుచేసే ఉద్యోగ యంత్రాంగం రూపొందలేదు. 1917 జులైలో లెనిన్ ఒకసూచన చేశాడు: అధికారం హస్తగతం చేసికొనటానికి నాందిగా ఒక సాయుధతిరుగుబాటు జరపాలని. బోల్షివిక్ పార్టీ కేంద్రకమిటీ ఆ సూచనను తిరస్కరించింది. అందుచే అతనికి మరల ప్రవాసం తప్పలేదు. ఫిన్‌లాండులో అజ్ఞాతవాసం గడుపుతూ పార్టీపత్రిక ప్రావడాలో, తన సిద్ధాంతాన్ని వివరిస్తూ వ్యాసాలు వ్రాశాడు. వాని ఫలితంగా రెండుమాసాలలో శ్రామిక, రైతు, సైనికప్రతినిధులతో అఖిలరష్యా సోవియట్ సమావేశమై "అధికారం సోవియట్‌లకు" అనే నినాదాన్నిచ్చింది.

పార్టీచర్చల్లో, వర్ణనాత్మక వివరణ పద్ధతిద్వారా తన భావాలను నచ్చజెప్పేవాడు లెనిన్. సోవియట్ ప్రభుత్వం బ్రెస్ట్ లిటొవ్‌స్కీ సంధిచేసికొనటం తప్పనిసరి అని ఒప్పించటానికై "శాంతికై, సైనికులు తమ కాళ్ళతో ఓటుచేశారు. ఎట్లా? యుద్ధరంగంనుండి పలాయనం చిత్తగించటంద్వారా" అన్నాడు. N. E. P. (నవ ఆర్థిక విధానం) సమర్థిస్తూ అఖిల రష్యన్ సోవియట్ల సమావేశంలో లెనిన్ వాదన: రష్యా విప్లవానికి పుట్టినిల్లు; ఇంటిని చక్కదిద్దుకొనటమే ప్రస్తుత కర్తవ్యం! ఈ విధముగా సందర్భోచితంగా ప్రతిపక్షానికి నచ్చచెపుతూ వుండేవాడు. రెండవ ప్రపంచ మహాసభలో, వలసప్రజల స్వాతంత్ర్యోద్యమాలు విప్లవాత్మకమైనవనే తన సిద్ధాంతాన్నివివరిస్తూ ఒక హెచ్చరిక చేశాడు. "జాతీయ వాదానికి ఎఱ్ఱరంగుమాత్రం పులమకండి!"

ఉద్విగ్నపరిస్థితినుండి నన్నుద్ధరించి, లెనిన్ వెనుదిరిగి తన మేజావైపు నడిచాడు. వెనుకనుండి అతని విగ్రహాన్ని స్పష్టంగాచూచే అవకాశం కలిగింది. లెనిన్ తల పెద్దది; గది చాల ఎత్తుగాఉంది. ఈ రెండు కారణాలచేత, ఇతడు మరుగుజ్జు అనిపించేటంత పొట్టిగాకన్పించాడు; కాని ఇది కేవలం భ్రమవల్లకలిగిన అభిప్రాయమే. లెనిన్ 5 అ., 4 అం., ల ఎత్తుండేవాడనుకుంటాను. అతనికున్న మరొక అలవాటు కూడా అతణ్ణి పొట్టివాడనే భావానికి కారణమైంది. లెనిన్, సర్వదా తలవంచి నడిచేవాడు; ప్రక్కలకుగాని, ముందుకుగానీ చూచేవాడుగాదు. అంటే నడుస్తూకూడా ఏవో సమస్యలను గూర్చిన ఆలోచనతో నిమగ్నుడై యుండేవాడని తెలుస్తుంది. తొందరగా పడే అడుగు లాతని మనస్సులోని ఆలోచనలకు తాళం వేస్తున్నట్లుండేవి. తనపైనున్న కార్యభారాన్ని నిర్వర్తించటానికి గల కాలవ్యవధి అత్యల్పమని గ్రహించాడా అన్నట్లు అతనికి ఎప్పుడూ పనితొందరే. ఈతనినికూడా మృత్యువు సమీపిస్తున్నదనే

భయమా అనికూడా కొందరు ఆశ్చర్యపోయేవారు. 'కావలసింది క్రియ, మాటలు కాదు' అనే పద్ధతితో లెనిన్ పొలిట్ బ్యూరోలో వాదోపవాదాలను అరికట్టుతూ వుండేవాడు. పొలిట్ బ్యూరో అంటే సర్వాధికారి! లెనిన్ రోజుల్లో అందు ఏడుగురుమాత్రమే సభ్యులు. ప్రతివారమూ సమావేశ మౌతుండేది. ప్రతి సమావేశం లోనూ, సభ్యునకు రెండుమార్లు మాట్లాడే అవకాశం ఉంది. మొదటి మారు 15 నిముషాలు; రెండవమారు 5 నిముషాలు. లెనిన్ ఆలోచన ఎంతచురుకో, ఉప న్యాసం అంత నిదానం! బహిరంగసభల్లో తప్ప, ఇతరత్రా మాత్రం క్లాసులో పాఠం చెబుతున్న ఉపాధ్యాయుడులాగా, కోర్టులో వాదించే ప్లీడరులాగా మాట్లాడేవాడు.

ఎదురుగా నున్న కుర్చీలో కూర్చోమని కోరుతూ లెనిన్, తన కుర్చీలో చేరగిలబడ్డాడు. మరుక్షణమే మేజాపైకి వంగి నాముఖంలోకి సూటిగా చూచాడు. బాదంకాయ (Almand) ఆకారంలో మిలమిల మెరిసే కండ్లు; పెదవులపై తాండ వించే మందహాసం, దాంతోనే నాకు పూర్తిగా స్వస్థత చేకూరింది. ఆ మేజా చిర పరిచితమైనట్లనిపించింది; నాముందున్న దొక గొప్ప వ్యక్తి, ఒక నియంత అనే భావమే లేదు; ప్రాత స్నేహితుని సమక్షంలో నున్నాననే ఉత్సాహం కలిగింది. ఒక సత్కార్యాన్ని సాధించి, అంతకు మించిన మహత్కార్యాన్ని సాధింపనున్న పుత్రునిపై తండ్రి చూపే సహజమూ వాత్సల్య పూరితమైన మందహాసమే అది! బలబనోవా అభినందన గుర్తుకు వచ్చి మత్తెక్కినట్లైంది; కాని ఆమె హెచ్చరిక గూడా మనసులో నొక మూల మెదులుతూనే ఉంది!

ఆలోచనా తరంగాల నుండి, లెనిన్ స్వరం నన్ను మేలుకొల్పింది. "మెక్సికోలో నీ విప్లవ చర్యలను గురించి బొరోడిన్ చెప్పాడు; కాని వివరాలు నీ ముఖంగా వినాలి. విప్లవం ఎత్తుగడలో అది చాల మంచి ప్రయోజనమే. మెక్సికో విడిచిరావటానికి సుముఖంగా లేవని కూడ చెప్పాడు, నిజమే. ఆరంభించిన పనిని మధ్యలో విరమించటం కష్టమే. కాని, అంతకంటె జరూరు విప్లవ సమస్యలను ముందుగా పరిష్కరించాలి గదా! క్రొత్త ప్రపంచంలో విప్లవం విజయవంతం కావ టానికి చాలా కాలం పడుతుంది. మెక్సికోలోనూ, ఇతర లాటిన్ అమెరికా రాజ్యా లలోనూ, పరిస్థితులు త్వరలోనే విప్లవానికి అనుకూలంగా పరిణామం పొందవచ్చు. కాని అమెరికా సామ్రాజ్యవాదం చూస్తూ ఊరుకుంటుందా? గత అనుభవాన్ని బట్టి అమెరికా జోక్యం కలిగించుకుంటుందనేది స్పష్టం. కాబట్టి, ప్రస్తుతానికి ప్రాత ప్రపంచంపైనే మన దృష్టిని కేంద్రీకరించటం అవసరం. దోపిడికి గురియై అణగారి పోతున్న ఆసియా ప్రజానీకాన్ని సంఘటిత పరచి విప్లవ మహోద్యమాన్ని ప్రారంభిం చాలి. అందుకు మెక్సికోలోని అనుభవం చాల సహాయకారి అవుతుంది. వలస రాజ్యా లలో విప్లవ పురోగమనంలో ఎత్తుగడలను గురించి, రెండవ ప్రపంచ మహాసభకు నేను నివేదింప నున్న సిద్ధాంతాన్ని, నీవు ముందుగా మెక్సికోలో ఆచరణద్వారానే

ఊహించావు. ఐతే, ఆ సిద్ధాంతాన్ని గూర్చిన చిత్తు ప్రతిపాదనలు చదివావా?" అని అడిగాడు.

"క్షమించాలి; చదువలేదు; ఇంతకుముందే అది నా చేతికి వచ్చింది. త్వరలోనే పూర్తి చేస్తాను."

"తిరిగి కలుసుకొని, దాన్ని గురించి చర్చిద్దాం. వలస దేశాల్లోని పరిస్థితులను గురించి నాకంతగా తెలియదు; అందుచే ఆ దేశాల్లో విప్లవ పురోగమనాన్ని గురించిన సిద్ధాంతం రూపొందించటంలో నీ సహకారం అవసరం. వలసదేశ చరిత్రనూ, ఆ దేశాల్లోని ప్రస్తుత పరిస్థితులనూ మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలిస్తున్న నీకు అనేక క్రొత్త విషయాలు తెలిసి ఉంటై" అన్నాడు.

మేజామీద నున్న ఎఱ్ఱ బల్బు వెలిగింది! లెనిన్ కుర్చీలో మేనువాలుస్తూ అన్నాడు:

"మేరియా ఆజ్ఞ ప్రకారం సమావేశం సమాప్తమైంది" నేను లేచాను; తిరిగి లెనిన్ నేత్రాలు మందహాసంతో ప్రకాశించినై; లెనిన్ నా ప్రక్కకు వచ్చి నిలబడ్డాడు. నా చేయి పట్టుకొని ద్వారం వైపుకు నడిపించాడు. తలుపు తెరచుకొన్నది. ఎవరో వ్యక్తి ప్రవేశించాడు. ఒత్తుగా నున్న జుట్టు; చురుకైన ముఖం; చిన్ని బొజ్జ! ఒదులుగా నున్న ట్రౌజర్లు, తెల్లని పొట్టిచేతుల చొక్కా; నెక్టై బదులుగా కాలర్‌కు నల్లని త్రాడు ధరించాడు; ఒక చంకలో తోలుసంచీ; ఆ సంచి పొట్ట ఉబ్బిపోతున్నట్లుంది! లెనిన్ అతణ్ణి పరిచయంచేశాడు, 'కామ్రేడ్ జినోవీవ్'. జినోవీవ్ మృదువుగా కరస్పర్శ చేశాడు; ఒక స్త్రీ కరస్పర్శ చేసినట్లనిపించింది. 'త్వరలో కలుసుకొందాం' అంటూ గంభీరంగా, బిగ్గరగా మాట్లాడాడు.

ఆ గది వెలుపల సెక్రటేరియట్‌లో ఒక యువకుడు మూడు పెట్టెలకు కాపలా కాస్తూ కన్పించాడు. నాడు జినోవీవ్ మూడు ముఖ్యమైన పదవుల నాక్రమించాడు; ఒక్కొక్క పెట్టెలో ఒక్కొక్క పదవికి సంబంధించిన పత్రాలున్నట్లు తర్వాత తెలిసింది.

## మొదటి బహిరంగ ఉపన్యాసం

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభకు వచ్చే ప్రతినిధుల్లో చాల భాగం 1920 వేసంగి ప్రారంభానికి మాస్కో చేరారు. తలకొక మార్గానా చట్టబద్ధంగా, విరుద్ధంగానూ ప్రయాణంచేసినవారే. కొందరు స్వీడన్ ఫిన్‌లాండులగుండా వచ్చారు; మరికొందరు జర్మనీనుండి సముద్రంమీదుగా లెనిన్‌గ్రాడుకు ప్రయాణంచేశారు. చట్టబద్ధమైన ప్యాస్‌పోర్టు లున్నవారు కూడా బోల్షివిక్ రాజ్యాల గుండా, గాలీషియా గుండా రహస్యంగానే ప్రయాణం చేయవలసి వచ్చింది. రష్యాకు సమీపంలో ఉన్న టర్కీ, పర్షియా మొదలైన ఆసియా రాజ్యాల నుండి కూడా ప్రతినిధులు

వచ్చారు. రష్యాకూ దూరప్రాచ్య రాజ్యాలకూ మధ్య నున్న మార్గాన్ని జపాను సైన్యం అటకాయించింది. ఈ సైన్యం సైబీరియా నడిబొడ్డు వరకూ నడిచింది. ఐనప్పటికీ చైనా, జపాను దేశాల ప్రతినిధులు మంగోలియా మీదుగా ప్రయాణం చేసి రష్యా చేరుకున్నారు. కొరియా కూడ ఒక ప్రతినిధిని పంపింది.

1920 వేసంగిలో ప్రపంచంలోని రోడ్లన్నీ మాస్కోకు దారితీసినవా అని పించింది. ఐరోపా రాజ్యాలన్నీ మహాసభకు ప్రతినిధులను పంపినై. క్రొత్త ప్రపంచం నుండి, ముఖ్యంగా లాటిన్ అమెరికా రాజ్యాల ప్రతినిధులు హాజరైనారు. సోవియట్ రాజధాని వీధుల్లో ఇంచుమించు ప్రపంచంలోని భాషలన్నీ వినవచ్చినై.

నల్లజాతివారూ, పచ్చజాతివారూ, తెల్లజాతి ప్రజలను కలుసుకోవటం ప్రపంచ చరిత్రలో ఇదే ప్రథమం అని చెప్పవచ్చు. ఈ తెల్లజాతీయులు, అహంభావ పూరితులైన సామ్రాజ్యవాదులు కారు. సామ్రాజ్యవాద దుష్ఫలితాలకు ప్రతిక్రియ చేయాలని ఆరాటపడే స్నేహితులు! ఈ ప్రతినిధుల్లో కొందరు నీగ్రోలు కూడా ఉన్నారు. వీరిలో ఇద్దరు మాత్రం దక్షిణాఫ్రికా నుండీ మిగిలినవారు సంయుక్త రాష్ట్రాలనుండీ వచ్చారు. శ్వేతజాతి ప్రజలతో కలిసి తిరగటం వారి కొక అపూర్వానుభవం. ఈ చనువు నీగ్రో ప్రతినిధులు నిర్భయంగా, బహిరంగంగా శ్వేతజాతి స్త్రీలతో 'డ్యాన్సు' చేసేవరకూ పోయింది వాస్తవానికి రష్యా స్త్రీలంటే నీగ్రోలకు అపరిమితమైన అభిమానం; విభిన్న గుణాల మధ్య ఏర్పడే ఆకర్షణ కిది చక్కని నిదర్శనం!

ఇటాలియన్ ప్రతినిధివర్గం చాల పెద్దది. వీరు కేవలం సంఖ్యాబలంతో నేగాక, తమ ఉల్లాసంతో, మాటకారితనంతో మహాసభను గుర్తుకు కొనేశారు. వీరిలో సోష లిస్టులు, కమ్యూనిస్టులు, అరాజక సిండికలిస్టులు మొదలైన ముఠాలున్నై. వీరి మధ్య గల సిద్ధాంత విభేదాలు, వీరి లాటిన్ భాషాభిమానంలో కొట్టుకొనిపోయినై. ప్రస్తుతం వారందరి కర్తవ్యం ఒకటే! అది, ఆధునిక చరిత్రలో మొట్టమొదటి సాంఘిక విప్లవానికి చేయూతనీయటం. వారందరి ఉత్సాహానికి కారణం ఒకటే. అది, ఈ సాంఘిక విప్లవం ఇతరదేశాలకు అంతికాలంలోనే విస్తరిల్లగలదనే ఆశ. సోషలిస్టుల నాయకుడు సెట్రాటీ; ఆతనికి సహాయంగా మిలాన్ విశ్వవిద్యాలయానికి చెందిన తత్త్వశాస్త్రాచార్యు డొకడు వచ్చాడు. ఈ బుల్లెంట్ నికోలో బొంబాచీ, అమాడియో బోర్డిగా అనేవారు కమ్యూనిస్టు నాయకులు. ఇక అనార్కో సిండికలిస్టువర్గ నాయకు డొక విచిత్రవ్యక్తి; యువకుడు; అందమైనవాడు, ప్రపంచ విప్లవసమస్యలలోకంటె, ప్రేమ కలాపాలలో మునిగి తేలుతుండేవాడు. వేదికపై ఉపన్యాసాలలో నిప్పులు కురిపించే వాడు. ఆ క్షణాలు వినా, మిగిలిన సర్వకాల సర్వావస్థలయందూ యువతీమణుల మధ్య మెలగుతూండేవాడు; యువతీ నెపోలియన్!

ప్రతినిధులందరికీ ఒక హోటలులో బస యేర్పాటుచేయబడింది. అది మూడు అంతస్థుల భవనం; క్రొత్తగా నిర్మించారు. నేను ప్రభుత్వ అతిథిగా, మాస్కో నదిపై నున్న 'చక్రరాజు' భవనంలోనే ఉండేవాణ్ణి. కాని నాకుగూడా హోటల్లో ఒక గది ప్రత్యేకింపబడింది; అంతర్జాతీయ కమ్యూనిస్టు మిత్రబృందాన్ని తరచు కలుసుకొనేందుకు వీలుగా. ఈ రెండు నివాసాల హోదాకు మరొక కారణంకూడా లేకపోలేదు. మహాసభ సమాప్తమయ్యేవరకూ, ఆప్ఘనిస్థానంలో సోవియట్ రాయబారిగా నన్ను నియమించే సమస్య పరిష్కారంకాదు గదా! హోటల్లో ఉండవలసి వచ్చిన రోజుల్లో, రాత్రి పదిగంటలవరకూ చర్చలు జరిగేవి. ఈ సందర్భంలోనే ప్రముఖ కమ్యూనిస్టునాయకులతో పరిచయమైంది; వారిలో కొందరు నా కాప్తమిత్రులైనారు. ప్రతిరోజూ ఉదయం, ప్రతినిధుల మతాలను మాస్కో పరిసరాలకు విహారయాత్రార్థం తీసుకువెళ్ళేవారు. ఆ ప్రాంతాలలో ప్రాచీన జమీందారీ భవనాలు శిశు సంక్షేమ గృహాలుగా మారినై; పైను అడవులలోని అంతఃపురాలు ఆరోగ్యకేంద్రాలుగా రూపొందినై. రెడ్ ఆర్మీ శిబిరాలకుగూడా యాత్రలకు ఏర్పాట్లు చేశారు. రష్యా విప్లవాన్ని, అనతికాలంలో విప్లవం సాధించిన ఘనవిజయాలను శ్లాఘిస్తూ, తమతమ దేశాల్లోని శ్రామికవర్గాలు పంపిన సందేశాలనీ ప్రతినిధివర్గాలు ప్రతిచోటా ఏకరువు పెట్టేవారు; రష్యాలో అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టిన పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దేశాలపై దుమ్మెత్తిపోసి, ఈ దుర్మార్గులను వారి స్వగృహాలలోనే శిక్షించేందుకు రైతు కూలీ ప్రజారాజ్యానికి తమశక్తికొలది సహాయం చేస్తామని వాగ్దానాలు చేసేవారు. వివిధభాషల్లో జరిపిన ఉపన్యాసాలన్నిటినీ రష్యన్ భాషలోకి తర్జుమాచేశారు. వీని నెంతో శ్రద్ధతో విని, ప్రేక్షకులు హర్షధ్వానాలుచేసేవారు. "శత్రువుచే ముట్టడింపబడిన దుర్గంవలె ఉన్న రష్యాప్రజల కొక ఆశా సందేశం; సహాయవాగ్దానం" అదే ఆ ఉపన్యాసాల సారాంశం.

మే దినోత్సవ సందర్భంలో జరిగిన బహిరంగసభలో నేను కూడా మాట్లాడాను. ఇదే నా మొదటి బహిరంగ ఉపన్యాసం. రష్యాలోనే కాదు, నా జీవితంలోనే ప్రథమ బహిరంగ ఉపన్యాసం! ఇండియాలో నున్నప్పు డవలంబించిన విప్లవ జాతీయవాదానికి ప్రజానీకంతో సంబంధమే లేదు; బహిరంగసభలూ, ఉపన్యాసాలూ మా కార్యక్రమంలో లేవు. క్రూర దౌర్జన్య చర్యల విధానాన్నే సగర్వంగా ఎన్నుకున్నాం; ఉపన్యాసాలు నిష్ప్రయోజనమని నిరసించాం; దుర్బలమైన నిర్ణయాలు జరిపి ప్రభుత్వానికి అందజేస్తూ ఉండే వారి దైన్యానికి జాలిపడేవాళ్ళం. ఆయుధాలు కోసం చేసిన ప్రయత్నాల్లో కూడా ఉపన్యాసాల కవకాశం లేకపోయింది. సంయుక్త రాష్ట్రాల్లో ఉన్నప్పుడు, విప్లవాన్ని గురించీ, రాజకీయ కార్యాచరణం గురించీ, నా భావాలు మారినై; క్రొత్త భావాలకు ఆచరణలో ప్రయత్నించటానికి సంయుక్త రాష్ట్రాల్లో వ్యవధి లభింపలేదు. ఆ అవకాశం మెక్సికోలో లభించింది; ప్రజా

విప్లవోద్యమంతో సంబంధ మేర్పడి, విప్లవ కార్యక్రమంలో మాట్లాడటం అలవరుచ్చుకొన్నాను. కాని మాట్లాడటానికి బాల్యంలోనే యేర్పడిన ఆటంకాన్ని పూర్తిగా అతిక్రమించటం సాధ్యం కాలేదు. మెక్సికోలో కూడ బహిరంగ మహాసభా వేదిక మీద నా ఉపన్యాసశక్తిని పరీక్షించుకోలేదు; అక్కడ నా ఉపన్యాసాలన్నీ పార్టీ సమావేశాలను గానీ, కమిటీ సభలను గానీ దాటి పోలేదు. ఇట్టి నన్ను, బహిరంగ సభలో ఉపన్యసించ వలసిందిగా కోరినప్పుడు కాళ్లు వణికినై. అదొక క్రొత్త అనుభవం.

## మే దినోత్సవాలు

మేడే కార్యక్రమంలో రెండు ప్రధానాంశాలున్నై. ఉదయం పార్టీ నాయకులు, ప్రభుత్వశాఖాధ్యక్షులు వందన స్వీకారం చేస్తారు; సాయంత్రం బహిరంగసభ; అందులో కమ్యూనిస్టు ఇంటర్నేషనలు సభలకు హాజరగుచున్న విదేశ ప్రతినిధు లుపన్యసిస్తారు. క్రెమ్లిన్ సింహద్వారానికి ఎదురుగా రెడ్ స్క్వేర్‌లో ఇంటర్నేషనల్ సంగీతం ఆలపించే గోపుర గడియారం క్రింద జరుగుతై ఈ రెండు అంశాలూ.

నాడు, ఉదయం నుండి యువకబృందాలు బారులు తీర్చి విప్లవ గీతాలు పాడుతూ రెడ్ స్క్వేర్ వైపు నడవసాగారు. నగరంలో ఎక్కడ చూసినా ఉత్సాహం ఉరకలు వేస్తున్న జనసముదాయమే. దీనితో శత్రుపరివేష్టితమైన మాస్కోలోని తీవ్రత కొంత తాత్కాలికంగా తగ్గింది. యూనిఫారాలు ధరించి అడుగులు లయకనుగుణంగా ప్రసిద్ధ రెడ్ ఆర్మీ గీతం పాడుతూ మైలు పొడుపున బారుతీర్చిన సైనికుల ఊరేగింపు, నాటి దృశ్యా లన్నిటిలో చాలఆకర్షణీయ మనిపించింది. అగ్రగామి దళం అందించిన ప్రతిపదాన్ని వెనుకనున్న సైనికు లందుకొని ఏక కంఠంతో పాడేవారు. ప్రతి పదం చివర పల్లవి: "స్వాతంత్ర్య యోధులం; ప్రజల బిడ్డలం" ఈ ఉత్సవంలో ఉత్పన్నమైన భీషణారవం దిక్చక్రవాళంలో ప్రతిధ్వనించి భూనభోంతరాలను పిక్కటిల్లేటట్లు చేసింది. 1920 మే దినోత్సవాలలో, రెడ్ఆర్మీలో ఒక చిన్న దళమే పాల్గొన్నది; మిగిలిన దళాలన్నీ దేశం నలుమూలలా అంతర్యుద్ధ రంగాలలో పోరాటం సాగిస్తున్నై; రెడ్ఆర్మీలో అధికభాగం, పశ్చిమరంగంమీద కేంద్రీకరింపబడింది. దాన్ని ట్రాట్‌స్కీ స్వయంగా నడుపుతున్నాడు. విప్లవపతాకను యిరోపా నడిబొడ్డుకు గొనిపోవాలనే ఆతని ఆశయం. యుద్ధరంగంలో రెడ్ ఆర్మీ దళాలన్నీ ఈ పాటనే పాడేవి. ఐతే మరొక పాట కూడా ఉంది. ఆ పాటలో కవిత్వం ఉన్నదన లేము.

"మా యింజను ముందుకు నడుస్తుంది; కమ్యూనిజానికి పూర్వం మరే స్టేషనూ లేదు; మరొక మార్గం కూడా లేదు; కాని మా చేతుల్లో తుపాకులున్నై" అని ఆ పాట సారాంశం. సంగీతం అంటే లెనిన్‌కు ఆసక్తి లేదు. కాని యీ విప్లవ గీతం అంటే చెవి కోసికొనేవాడు. బహుశా ఈ పాటను ఒక సైనికుడు కూర్చి ఉంటాడను

కుంటాను. అదికూడా, ఒక తుక్కు యింజనుతో నెమ్మదిగా కదిలే రైలు బండిలో యుద్ధరంగానికి పయనిస్తూ వ్రాసి ఉంటాడు!

ఈ ఉత్సవానికై ప్రత్యేకంగా నిర్మింపబడిన వేదికమీద లెనిన్ నిలబడ్డాడు, శాల్యూట్ చేస్తూ. ట్రాట్‌స్కీ, స్టాలిన్‌లు వినా మిగిలిన పార్టీ సభ్యులూ, పొలిట్ బ్యూరో సభ్యులూ అతని కిరుప్రక్కలా నిలబడ్డారు. ట్రాట్‌స్కీ పశ్చిమ రంగంమీద నున్నాడు గదా! ఇక స్టాలిన్, జారీజినాలో సైన్యంతో సహా ముట్టడింపబడి ఉన్నాడు. జారీజినా నగరం దిగువవోల్గాపై ఉంది. నగరం నలువైపుల నుండి వచ్చిన ప్రదర్శనాలన్నీ రెడ్ స్క్వేర్ పశ్చిమ ద్వారం దగ్గర కలిసినై. అక్కడ నుండి 'ప్రదర్శనను' స్క్వేర్‌లోనికి నడిపే గౌరవం విదేశ ప్రతినిధుల కీయబడింది. వాస్తవానికి, రెడ్ ఆర్మీలోని అంతర్జాతీయ దళమే గదా వీరంతా! వీరి వెంట రష్యన్ సైనికులు నడిచారు; వారి వెనుక కర్మాగార కార్మిక సమూహం! ప్రతి శాఖా, వేదికముందొక క్షణం నిలిచి నాయకులకు 'వందనం' సమర్పించారు. ఈ 'తంతు' పూర్తియై, ఆ మహాజన సమూహం అంతా స్క్వేర్‌లో ఆసీనులు కావటానికి కొన్ని గంటలు పట్టింది. అంతసేపూ, నాయకులు వందనం చేస్తూ "సిద్ధులై" నిలబడే ఉన్నారు! మానవ శిరస్సుల మహాసముద్రంమీద తేలియాడుతున్న ఎఱ్ఱ జెండాల మహారణ్యంలా కన్పించిందా మహాసభ. తిరిగి రెడ్ స్క్వేర్ ఖాళీయగు నప్పటికి ప్రొద్దు నడినెత్తికి వచ్చింది.

కార్యక్రమంలోని రెండవ అంశం, సాయంత్రం ఐదు గంటలకు ప్రారంభమైంది. ప్రజలు భోజనం చేసి తిరిగి రావటానికి వ్యవధి ఉండాలి గదా! అవి రష్యాలో ఇంచుమించు కరువు రోజులే. వినా లభ్యమైన దానితో తగుమాత్రంగానైనా పొట్ట నింపుకోక తప్పదు. ఎంతటి మహోన్నతమైన విప్లవోత్సాహమైనా ఆకలి దప్పులను జయించగలదా! ప్రకటించిన సమయానికి ముందుగానే రెడ్ స్క్వేర్ నిండిపోయింది. రష్యా చరిత్రలో ఏది ఏమవుతుందో చెప్పలేని సమయం. సర్వత్రా సంధిగ్ధత, అస్పష్టత తాండవిస్తున్నై. అందుచే స్త్రీలూ, పురుషులూ, వ్యక్తులుగా ఒంటరిగా ఉండటానికి భయపడుతూ, రక్షణ కొరకు ఆరాటంతో సమూహంలో కలిసిపోతూ ఉండేవారు. ఉపన్యాసా లీయవలసిన అంతర్జాతీయ ప్రతినిధులు వేదిక సమీపంలో ఆసీనులైనారు; ఆ సభకు జినోవీవ్ అధ్యక్షత వహించాలి. అతని రాకకై గంటసేపు వేచియుండాల్సి వచ్చింది. వచ్చీరావటంతో ఆలస్యమైనందుకు క్షమాపణ కోరుకొంటూ వేదిక నెక్కి ఉపన్యాసం ప్రారంభించాడు. నిజానికది ఉపన్యాసం కాదు. కట్టలు త్రెంచుకొని ప్రవహించే మాటల ప్రవాహం! విప్లవ ఉపన్యాస సామర్థ్యాన్ని దర్శించటం నాకదే ప్రథమ అనుభవం. నాకు చాల ఆశ్చర్యం కలిగింది. 'ఆ చాతుర్యాన్ని అనుకరించగలనా' అనే అనుమాన భయాలు నన్నావేశించినై. కొన్ని నిముషాల్లో ఆ విషమ పరీక్ష రానేవచ్చింది!

జినోవీవ్ నా పేరు ప్రకటించటంతో ఆ ఆవరణ మంతా కరతాళధ్వనులతో, నినాదాలతో ప్రతిధ్వనించింది. జినోవీవ్ వెనక్కు తప్పుకొని నన్నాహ్వానించాడు. ఉపన్యాసం తయారుచేసికోలేదు; ఆ సమయానికి ఏది సముచితమో స్పష్టంగా ఆలోచించనైనా లేదు. కాని నాలో సభాభీరుత్వం మాత్రం లేదు. అదీగాక నా పేరు ప్రకటించినంతనే సభికులు చేసిన కరతాళధ్వనులు నాలో అనిర్వచనీయమైన ఆత్మ విశ్వాసాన్ని కలిగించినై. బహిరంగ ఉపన్యాసాలకు అమూల్యమైన లౌడ్ స్పీకర్ లేదు; అందుచే నా కంఠస్వరాన్ని సాధ్యమైనంతగా పెంచాను. ఆ ఆవరణలో మారుమూలలకు గూడ నా మాటలు విన్పించినై; తర్వాత మిత్రులు శ్లాఘిస్తూ చెప్పారు. “అదొక గొప్ప ఫీట్; అగ్రనాయకుల్లో ఆ ఫీట్ చేయటం ట్రాట్‌స్కీ ఒక్కడికే తగింది.”

నా ప్రథమ బహిరంగోపన్యాసాన్ని సాంప్రదాయసిద్ధమైన మాటలతో ప్రారంభించలేదు. అంటే, “దోపిడికి గురియై సామ్రాజ్యవాదం పాదాలక్రింద నలిగి పోతున్న లక్షలాది వలసప్రజల ప్రతినిధిగా వచ్చా”ననిగానీ, “నా దేశప్రజలు తమ సహకారసానుభూతులతో రష్యా రైతుకూలీలకు అండగా నిలబడగలమనే సందేశాన్ని పంపారనే,” కృతక వాగ్దానాలతోగానీ ఉపక్రమింపలేదు. “నేను క్రొత్తగా కమ్యూనిస్టు విశ్వాసాన్ని స్వీకరించినవాణ్ణి; విప్లవ విజయం సాధించిన ఈ దేశానికి యిటీవలనే వచ్చాను. ఇచట విప్లవసైన్యంలో చేరాలనీ, హృదయపూర్వకంగా విప్లవాన్ని సేవించి, ఆ అనుభవంతో సాంఘిక విముక్తి సందేశాన్ని వలసప్రజల కందించటమే నా ఆశయం.” అంటూ ప్రారంభించాను. నేను ఇంగ్లీషులో మాట్లాడాను. ఆ మహాసభలో ఏ కొద్దిమందికో గానీ ఇంగ్లీషు రాదు. వేదికపై కూర్చొన్నవారిలో ఇంగ్లీషువచ్చిన ఒకరిద్దరు నా పరిచయవాక్యాలకు కరతాళధ్వనులుచేశారు. అదే సూచన మహాసభమొత్తం కరతాళధ్వనులు చేసింది. మిగిలిన ఉపన్యాసం పదినిముషాల్లో పూర్తిచేశాను. అందులోకూడ నా ఉపోద్ఘాతాన్నే వివరించాను. నా ఉపన్యాసాన్ని రష్యన్ భాషలోనికి అనువదించి చెప్పినపుడు సభికులు పదేపదే కరతాళధ్వనులుచేశారు. జినోవీవ్, సాంప్రదాయం ప్రకారం కరస్పర్శచేసి అభినందించాడు. నా ‘దుబాసి’ రష్యన్ యూదు యువకుడు; చాల సంవత్సరాలు ఇంగ్లండులో గడిపి వచ్చినవాడు; విమర్శనాత్మకంగా నా ఉపన్యాసాన్ని మెచ్చుకొన్నాడు; క్రొత్తవిషయాలు చెప్పినందుకు నన్ను శ్లాఘించాడు. ఈ అభినందనలకంటె సభాసదుల్లో కలిగిన సంచలనం చూచి నాకు చాల సంతోషమైంది!

# మాస్కో అంతర్జాతీయ సమావేశం

1920 జులై నెలలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ మహాసభకు ఏర్పాటు జరిగింది. అంతకుముందే ప్రతినిధి వర్గాలన్నీ మాస్కో చేరినై. వారికి ప్రత్యేకింపబడిన హోటల్ క్రిక్కిరిసి పోయింది. ఆలస్యంగా వచ్చిన వారికి ఇతర చోట్ల యేర్పాట్లు చేయవలసివచ్చింది. రష్యాకు చేరువలోనున్న ఫిన్‌లాండ్, బాల్టిక్ రాజ్యాలు, పోలెండ్, బాల్కన్ రాజ్యాలలో కమ్యూనిస్టుపార్టీలు నిషేధింపబడినై. అందుచే ఆ దేశాల ప్రతినిధులు రష్యాలో గూడా రహస్యంగానే ఉండాలి, లేని పక్షంలో స్వదేశానికి మరలిన వెంటనే ప్రాణాపాయంలో చిక్కుకొనే ప్రమాదం ఉంది. "పరాధీన రాజ్యాలకు స్వయం నిర్ణయాధికారం" అనే విల్సన్ సూత్రంపై వార్సెయిల్సు సంధివలన యేర్పడిన ఈ క్రొత్త రాజ్యాల్లో వ్యక్తిస్వేచ్ఛకు ఆస్కారం లేదు. ఆ రాజ్యాలనుండి వందలకొలది ప్రవాస విప్లవకారులు రష్యాలో తలదాచు కొంటున్నారు. వీరికి వారివారి దేశాల్లోని రహస్య కమ్యూనిస్టు సంఘాలతో సంబంధ ముండేది. పూర్వం ప్రవాస విప్లవకారుల్లో కొందరు జారు ప్రభుత్వానికి గూఢచారులుగా పనిచేసేవారు. రష్యానుండి విడిపోయిన రాజ్యాలా జారిస్టు సాంప్రదాయాన్ని అనుసరించారు. రష్యాలో ప్రవాస మందున్న కమ్యూనిస్టుల్లో ఆయా రాజ్యాల గూఢచారులున్నారు. అందుచే ఆ రాజ్యాల ప్రతినిధులు చాల జాగ్రత్తగా మసలు కోవాలి. సరిహద్దుల్ని రహస్యంగా దాటే సమయంలో పట్టుబడితే కాల్చివేయటమే!

ప్రవాస కమ్యూనిస్టుల్లో చాల మంది నాకు మిత్రులైనారు. వారిలో ఒకరు సుప్రసిద్ధ పోలిష్ రచయిత్రి వాన్డావాలెస్కాయా; 1941 లో రెడ్ ఆర్మీ పోలెండ్‌ను విముక్తి చేసిన తర్వాత వాన్డావాలెస్కాయా పోలిష్ ప్రభుత్వానికి అధ్యక్షత వహించింది. అన్ని విధాలా ఆమె ఒక వనితా రత్నం! యౌవనం గడిచిపోయినా చాల ఆకర్షణీయంగా కన్పించేది. మంచి పొడవరి; చక్కని అవయవసౌష్టవమూ, స్ఫురద్రూపి; గర్వింపదగిన అందమైన జుట్టు; ఐతే అప్పటికే జుట్టు బాగా నెరసిపోతోంది. ఆమెకు మిత్రుడైన వాలెకీ పోలిష్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు; ఈతడు రోజా లక్సెంబర్గ్‌తో కలిసి చాల రోజులుగా పని చేశాడు; అందుచే, లెనినిస్టు-బోల్షివిక్కులని వ్యవహరింపబడే యువకతరం కమ్యూనిస్టులకు వాలెకీ అంటే పడేది కాదు. వీరందరికీ నాయకుడు బ్రాన్‌ట్; చాల తెలివైనవాడు; పార్టీలో మంచి పలుకుబడి సంపాదించాడు. ఐతే, బ్రాన్‌ట్ ధనవంతుడైన జమీందారు కుమారుడనీ, జారు ప్రభుత్వంలో గొప్ప పదవి నధిష్టించినవాడనీ, మహాసభ ప్రతినిధుల్లో ఒక వదంతి

వ్యాపించింది. బ్రాన్‌ట్ స్వరూపంలోనూ, మనోజ్ఞమైన హావభావాల్లోనూ, ఆతని ధనికవర్గ వారసత్వం స్పష్టంగా ప్రతిఫలిస్తూ ఉండేది. జర్మన్ విశ్వవిద్యాలయంలో గణిత, తత్త్వశాస్త్రాల నభ్యసించాడట. సిద్ధాంతాల్లో తీవ్రమైన అభిప్రాయ భేదా లున్నా, వాన్దావాలెస్కయా, వాలెకీలకు బ్రాన్‌ట్ అంటే మంచి అభిమానం. ఐతే నాయకత్వంలో మాత్రం వాలెకీ, బ్రాన్‌టులు ఉత్తర దక్షిణ ధ్రువాలు! వాలెకీలో అనుమాన వాదం ఎక్కువ; దుస్తులు కూడా శుభ్రమైనవి ధరించేవాడు కాదు; మోటుగా కన్పించటానికి ప్రయత్నించేవాడేమో ననిపించేది. కాని, ఆతని బాహ్య వికార స్వరూపం కేవలం వయసుతో, అనుభవంతో పెరిగిన బురఖా మాత్రమే. ఆ బురఖా తొలిగించితే కన్పించే దొక గొప్ప సంస్కారి; మహాజ్ఞాని!

పోలెండ్ బాల్టిక్ రాజ్యాల కమ్యూనిస్టులు నన్నెక్కువగా అభిమానింప సాగారు; అందుకు కారణం 'జాతీయవాదం విప్లవాత్మక శక్తియే' అనే లెనిన్ సిద్ధాంతంతో నే నేకీభవించలేద నే వదంతియే. జాతీయ స్వయం నిర్ణయ సూత్రాన్ని ప్రచారంలోకి తెచ్చినకీర్తి వుడ్రో విల్సన్‌కి దక్కింది. నిజానికి ఆ సూత్రాన్ని మొట్ట మొదట ప్రతిపాదించినవాడు లెనిన్! ఆ సూత్రాని కనుగుణంగానే, విప్లవానంతరం బాల్టిక్ రాజ్యాలూ, పోలెండూ, రష్యానుండి విడిపోవటానికి బోల్షివిక్ ప్రభుత్వం సమ్మతించింది. ఈ విధంగా విడిపోయిన రాజ్యాల్లో అరుణభయోత్పాతం విజృం భించి, కమ్యూనిస్టుపార్టీలు బహిష్కరింపబడినై; అందుచేత ఆ రాజ్యాల్లోని కమ్యూ నిస్టులు తమకు రష్యన్ కామ్రేడ్లు ద్రోహం చేసినట్లు (రాజ్యాలు విడిపోవటానికి సమ్మతించటం ద్వారా) భావింపసాగారు. జాతీయ వలసరాజ్య సమస్యలపై లెనిన్ ప్రతిపాదించిన సిద్ధాంతం కూడా స్వయం నిర్ణయ సూత్రాన్ని బలపరిచింది; "చారిత్ర కంగా బూర్జువా జాతీయవాదులు విప్లవాత్మకమైన పాత్రను నిర్వహిస్తారనీ, అందుచే వలసల్లోని బూర్జువాలను కమ్యూనిస్టులు బలపరచాలి" అనేదే లెనిన్ సిద్ధాంతంలోని సారాంశం. ఈ సిద్ధాంతంతో నేను ఏకీభవించలేదు; అందుచేతనే నా అభిప్రాయాలు పోలిష్ కమ్యూనిస్టులను ఆకర్షించినై. వీరంతా రోజా లక్సెంబర్గ్ ముఠాకు చెందిన వారు. "లెనిన్ కేవలం జాతీయవాది; యం. యన్. రాయే నిజమైన కమ్యూనిస్టు" అని పరిహాసమాడుతూ ఉండేవారు.

విదేశీప్రతినిధులకు దుబాసీలుగా పనిచేయటానికై స్త్రీలను నియమించారు. వీరంతా ఒకప్పుడు ఉన్నతవర్గానికి చెందినవారే. ఆధునాతన పద్ధతులపై నడచిన బాలికా పాఠశాలల్లో చదువుకొన్నవారు. వివిధ యూరోపియన్ భాషల్లో ధారా ళంగా మాట్లాడగలరు; తమ ఉద్యోగ ధర్మాలను చాకచక్యంతో నిర్వహించటమే గాక అందంగా, ఆకర్షణీయంగా ఉండేవారు. జన్మతః బూర్జువా వర్గానికి గానీ, ధనిక వర్గానికి గానీ చెందినప్పటికీ, వీరికి కమ్యూనిజంలో గాఢమైన విశ్వాసం యేర్ప డింది; లేనిచో వీరి కా ఉద్యోగాలు లభించేవి కావు. సామర్థ్యం ఎలా ఉన్నా,

వారు నిర్వహించవలసిన ధర్మం ఎంతో బాధ్యతతో, విశ్వాసంతో కూడిన పని. ప్రముఖ విదేశీ ప్రతినిధులపై వీరు గూఢచారులు! అందుకై హావభావాలతో, విలాసాలతో వారిని తమ వలలో వేసుకోవాలి. అవసరమైతే తమ హృదయాలనైనా సమర్పించాలి! హేయమైన ఈ ధర్మనిర్వహణ కొన్ని సందర్భాలలో సుఖాంతమైన కలయికలకు దారితీసింది; కాని ఎక్కువగా వ్యభిచారానికీ, హృదయవిదారకమైన విషాదగాథలకూ కారణమైంది. ఈ యువతుల్లో కొందరిది వస్తుతా జారిణీ స్వభావం (Philanderer) వారంతా ధనికవర్గ సంజాతలే! బూర్జువా స్త్రీలలో సహజంగా ధైర్యసాహసాలు తక్కువ; కాని వీరు ఇటీవలనే కమ్యూనిజం స్వీకరించారు. ఆకస్మికమైన ఈ పరివర్తనే వీరిలో ధైర్యోత్సాహాలకు కారణమైంది. వీరు నీచవృత్తుల నంగీకరించటానికి మరొక కారణం కూడా లేకపోలేదు. తమ ఉద్యోగ నిర్వహణలో ఏ విదేశ ప్రతినిధి ప్రేమనైనా పొందగలిగితే, రష్యానుండి తప్పించుకుపోయే అవకాశం లభిస్తుంది. అదే వారి ఆశ!

ఈ విధంగా, పతితలైన ధనికవర్గ యువతీమణు లందరూ వెర్రి ఆవేశంతో కమ్యూనిజాన్ని స్వీకరించారు. వారందరిలోనూ ముఖ్యంగా లోలా గాథ చెప్పుకో తగింది. బోల్షివిక్ పార్టీ క్రమశిక్షణ పొందిన గూఢచారిణిగా ప్రవర్తిస్తున్నాననే విశ్వాసంతోనే, బ్రాన్‌ట్‌ను ప్రేమింపసాగింది లోలా!

లోలా తండ్రి విప్లవానికి పూర్వం రష్యాలో ఒక రాష్ట్రానికి గవర్నర్. ఆతనికి ఇద్దరు కుమార్తెలు. వీరిద్దర్నీ సెయింట్ పీటర్సుబర్గ్‌లోని ఈకట్రిన్‌స్కీ స్కూలుకు పంపించాడు. ఇందులో యువకులకు సైనిక శిక్షణ యివ్వబడేది. వీరిలో తమ భర్తల నెన్నుకొనే అవకాశం ధనికవర్గీయ బాలికలకు లభిస్తూ ఉండేది. లోలా మంచి ప్రజ్ఞావంతురాలు; తమ వర్గ స్త్రీల కృత్రిమ సాంప్రదాయా లంటే ఏవగించుకొనేది. సాంప్రదాయ విరుద్ధమైన లోలా ప్రవర్తన వల్ల స్కూలు వాతావరణంలో అలజడి చెలరేగింది; తోటి బాలికలను అపహాస్యం చేసి గురువుల ఆగ్రహానికి గురియగుచుండేది. తరచుగా ఆ స్కూల్లో డ్యాన్సులు (Balls) జరుగుచుండేవి. పెండ్లి అంగడి (Marriage Market) లో యువతీయువకులు తమకుగల గిరాకీని ప్రదర్శించటానికే ఈ కార్యక్రమా లుద్దేశింపబడినై. ఇట్టి సందర్భాలలో తనను డ్యాన్సుకు ఆహ్వానించిన విద్యార్థులను చివాట్లు పెట్టి పంపుతూ ఉండేది లోలా; ఒక రోజున దురదృష్టవంతు డొకడు ఆమెతో డ్యాన్సు చేయటానికి సాహసించాడు. డ్యాన్సు మధ్యలో అత డామె చెవిలో "సీతాకోక చిలుకలా అద్భుతంగా డ్యాన్సుచేస్తావు" అన్నాడట. మరుక్షణంలో వాడి దవుడ వాచిపోయిందట! ఈ కథను ఆమె తన స్నేహితురాండ్రతో ఎంతో ఉద్రేకంతో చెబుతూ ఉండేది. "తమాషా! నేనట, సీతాకోక చిలుకనట! మూర్ఖుడు." అనే మాటలతో కథ సమాప్తమయ్యేది. పొడవుగా, బొద్దుగా ఉండేది. స్కూల్లో ఉన్నప్పుడు గూడ సాధారణమైన దుస్తులే వాడేదట!

విప్లవం ఆరంభమైనప్పుడు లోలా వయస్సు పదునెన్మిది సంవత్సరాలు. ఒక రోజున స్కూలు ముందు చేరిన గుంపుపై ఉద్యోగులు కాల్పులు జరపటానికి సిద్ధమైనారు. గుంపు వెనుకకు తగ్గినట్లే తగ్గి, ఒక్కుమారుగా ఉద్యోగులపైబడి వారి భుజకీర్తులను లాగివేశారు. ఈ పద్ధతి సైన్యంలో ప్రారంభమై, క్రమంగా దేశంలో సర్వ సాధారణమైపోయింది. తన గది కిటికి గుండా ఈ దృశ్యాన్ని చూస్తున్న లోలా బయటికి పరుగెత్తి గుంపులో చేరింది; అనతి కాలంలో ఒక వేదిక తయారైంది; దానిపై లోలా గంభీరోపన్యాసం ప్రారంభమైంది. "హాస్యాస్పదమైన దుస్తుల్లో ఊగిసలాడే బుద్ధిహీనులకు సరియైన గుణపాఠం చెప్పార"ని జన సమూహాన్ని అభినందించింది. అనిర్వచనీయమైన శక్తి లోలాను ఆవేశించింది. నడివీథుల్లో ప్రభుత్వంపై యుద్ధానికి సన్నద్ధమైన ప్రజా సమూహంతో, ఒక ప్రభువు కుమార్తె చేరటం గొప్ప విశేషమే. మరుక్షణమే ఈ సంఘటన స్థానిక విప్లవ కమిటీ దృష్టి నాకర్షించింది. నాటి నుండి ఉపన్యాస వేదికపై లోలా పలుకుబడి అపారంగా పెరిగిపోయింది.

తరువాత లోలాను ఉక్రెయిన్‌కు పంపారు. ఉక్రెయిన్‌లో జర్మనుల ప్రోత్సాహముతో విప్లవ వ్యతిరేక విభజనోద్యమం సాగుతోంది. శత్రుశ్రేణుల వెనుక గూఢచారి కార్యక్రమం నడిపించటమే లోలా ధర్మం. అది చాలా సాహసంతోనూ, అపాయంతోను కూడినపని. బోల్షివిక్ పార్టీ భక్తులూ, అందులోనూ మొండిధైర్యం గలవారు మాత్రమే ఈ పనికి నియుక్తులైనారు. ఈ పనిలో లోలా పలుకుబడి మరింత పెరిగింది; కాని మాస్కోకు తిరిగివచ్చేటప్పటికి ఆమె శరీరంమాత్రం బాగా లావెక్కినది; ఆమెకు విశ్రాంతి అవసరమని వైద్యులు సలహాయిచ్చారు. ఉక్రెయిన్‌లో సాధించిన విజయంతో లోలా విశ్రాంతికి యోగ్యత సంపాదించింది. అందుచే ఆమెను రెండవ ప్రపంచ మహాసభ ప్రతినిధులకు దుబాసీగా నియమించారు. లోలా జర్మన్, ఫ్రెంచిభాషలను అనర్గళంగానూ, ఇంగ్లీషు, ఇటాలియన్ భాషలను తగుమాత్రంగానూ మాట్లాడేది. అనేక అగ్నిపరీక్షలకు తట్టుకొని విశ్వాసపాత్రురాలుగా పార్టీలో పరిగణింపబడుచుండటంచేత ఇతర దుబాసీలపై పర్యవేక్షణకూడా జరిపేది. ఈ దుబాసీ ఉద్యోగాలకు వారి విదేశ భాషాజ్ఞానమూ, వారి అందచందాలే ఈ యువతీమణుల అర్హతలు!

బ్రాన్‌ట్‌తో స్నేహ మేర్పడటంవల్ల, నాకు బాగా పరిచయమైంది. స్వల్ప కాలవ్యవధిలోనే వారిలో ఒకరిపైనొకరు ఎంతో శ్రద్ధవహించేవారు. కాని వారి వ్యవహారం తాత్కాలికంగానే పరిణమించింది. బ్రాన్‌ట్ తన హృదయ వేదనను వెల్లడించినప్పుడల్లా అతణ్ని లోలా పరిహసించటమేగాక, హెచ్చరిస్తూ ఉండేది. "కొన్ని రోజుల్లోనే, పిల్సుడ్‌స్కీ నరకానికి తిరిగి వెళ్ళబోతున్నావు; నిన్ననుసరించి ఆ నరకకూపంలో పడటానికి నాకు బుద్ధిలేదనుకున్నావా? మరొక విషయం గుర్తుంచుకో! నన్ను నమ్మబోకు; నీలాంటి యువకు లెందరో నా శయ్యను పంచుకొన్నారు.

ఎందుకు ? మరునాటి ఉదయమే మృత్యు ముఖంలో ప్రవేశించటానికే” కాకలు దీరి పొద్దుబారిన విప్లవకారణి అనే భావం స్ఫురించేటట్లు లోలా చెప్పిన ఈ మాటలు స్వయంగా నేనూ విన్నాను. ఎన్నటికీ మరుపురాని భయంకరమైన మాటలు! విప్లవ దేవత చాలా క్రూరురాలు! తన భక్తులకు ఎన్నో అగ్నిపరీక్షల పెట్టింది. ‘నీతి’ పట్ల పైశాచిక నిర్లక్ష్యమే ఆ పరీక్షల్లో నెగ్గినవారి లక్షణం! కాని లోలా అంతగా పతనం కాలేదు. పైకి నిరాశావాదిగా, కర్కోటకురాలుగా కన్పిస్తుందేగాని, ఆమె హృదయం చాల మెత్తన. అనుభవాలతో విషాదంనింపుకొన్న ఆత్మ! బ్రాన్‌ట్‌తో ఆమె చాల సుఖంగా ఉండేది. కాని మహాసభానంతరం బ్రాన్‌ట్ స్వదేశానికి తిరిగివెళ్లాడు; లోలాను తనతో తీసుకువెళ్ళలేక పోయినాడు! వారు తిరిగి ఎన్నడైనా కలుసుకొని నారో లేదోకూడా తెలియదు. తరువాత నేను బ్రాన్‌ట్‌ను కలుసుకొనలేదు. కాని, లోలాతో నా మైత్రిమాత్రం 1925 వరకు సాగింది. ఆ తరువాత ఏదో రహస్య కార్యక్రమంమీద విదేశాలకు వెళ్ళింది. లోలా, నేనూ చాలా సన్నిహితులమైనాం; ఒకసారి ఆమెతో కలిసి రష్యన్ ఓపెరా (సంగీత నాటకం) చూచాను. ఓపెరా చూడటం నాకదే ప్రథమం; అది, రిమ్‌స్కీ కోర్సకావ్ రచించిన “ఇగర్ రాకుమారుడు” అనే నాటకం. అద్భుతమైన అనుభూతి; సంగీతంపట్ల నాకున్న మూఢమైన విశ్వాసాన్ని విచ్ఛిన్నంచేసిన దా అనుభూతియే!

ఇటాలియన్ ప్రతినిధివర్గం వినా అందరూ ఆలస్యంగా వచ్చినవారే. జర్మన్, ఫ్రెంచి ప్రతినిధివర్గాలు చాల ఆలస్యంగా వచ్చారు. మాస్కో చేరిన తర్వాత జర్మన్ ఫ్రెంచి వర్గాలతో చాలా రోజులు రహస్యంగా సంప్రదింపులు జరపాల్సి వచ్చింది. ఇందుకు కారణం, “ఇంటర్నేషనల్‌లో చేరటానికి యిరువది యొక్క షరతులు” అనే అంశమే. ఈ షరతులను జినోవీవ్ తయారు చేశాడు; మహాసభ వీనిని ఆమోదించవలసి ఉంది. కాని, 1914 లో యుద్ధం ప్రారంభమైనంతనే కేంద్రనాయకత్వం లేకపోవటంతో రెండవ ఇంటర్నేషనల్ విచ్ఛిన్నమైనదనే వాదన బయలు దేరింది. యుద్ధంవల్ల యేర్పడిన క్లిష్టపరిస్థితిలో దేశభక్తి విజృంభించి అంతర్జాతీయ వాదం నీరసించింది. ఐనా, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు దేశాల సోషలిస్టు పార్టీలలోని వామపక్ష వర్గాలు రష్యన్ విప్లవంపట్ల సానుభూతి వహించి, క్రొత్తగా స్థాపింపబడిన అంతర్జాతీయ సంస్థలో చేరటానికి సమ్మతించారు. కాని వీరందరూ ఏకమైతే, క్రొత్తగా రష్యా స్థాపించిన అంతర్జాతీయసంస్థ విచ్ఛిన్నం కాగల ప్రమాదం ఏర్పడుతుంది. అట్టి ప్రమాదాన్ని తప్పించే ఉద్దేశ్యంతో, కేంద్రనాయకత్వాన్ని పటిష్ఠం చేయటానికై జినోవీవ్ ఆ షరతులను తయారు చేశాడు. ఈ పార్టీలు చేరని పక్షంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చాల బలహీన మౌతుంది; ఆ యా రాజ్యాల శ్రామికవర్గాల్లో కమ్యూనిస్టులకు పలుకుబడి సన్నగిల్లుతుంది. అందుచే ఈ సమస్య రష్యన్ కమ్యూనిస్టులకూ, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సుదేశాల సోషలిస్టులకూ మధ్య ద్వంద్వయుద్ధంగా పరిణమించింది.

బలబనోవా ప్రభావంవల్ల ఇటాలియన్ వర్గంలో విభేదాలు చాలవరకు తొలగింపబడినై. ఇంటర్నేషనల్‌లో చేరేలోపల, టురాటీ నాయకత్వంలో నున్న మితవాదవర్గాన్ని సోషలిస్టుపార్టీ బహిష్కరించాలి. ఈ విషయాన్ని గురించి ప్రతినిధి వర్గంలోని కమ్యూనిస్టు సభ్యులైన బోర్డిగా, బొంబాచీలు పట్టుపట్టారు. ఇక లెనిన్ సహాయంతో సెర్రాటీకి మాత్రం ఏ ప్రమాదమూ రాకుండా కాపాడాలని బలబనోవా ఆశించింది. అందుచే, రష్యన్, ఫ్రెంచి సోషలిస్టు నాయకులతో జర్మన్లు కుస్తీపట్లు పడుతూ ఉన్నంతసేపూ మార్సెల్ కాషిన్, ఫ్రసార్డులు రానే రాలేదు. ఇక, ఇటాలియన్లు రష్యను లిచ్చే అతిథి మర్యాదల ననుభవిస్తూ తమ విభేదాలనే విస్మరించారు. ఆసన్న ప్రపంచ విప్లవానికి కార్యస్థానం కానున్న మాస్కో ముట్టడిలో నుండటంచేత, జీవిత సౌకర్యాలేమీ లభింపవని గ్రహించి ముందుగా జాగ్రత్తపడి వచ్చారు. పెట్టెల నిండా మర్‌రోనీ, చియాన్టీ సారాయి, కావలసినంత జున్ను తమతో పట్టుకువచ్చారు. ఆంజెలికా గదిలో ప్రతి సాయంత్రం బ్రహ్మాండమైన విందు జరిగేది. తన ఇటాలియన్ మిత్రులతో గడపటానికై ఆంజెలికా బలబనోవా, ప్రతినిధుల హోటలుకు తన బస మార్చింది. బోల్షివిక్ ప్రభుత్వం, మొదట్లో మద్యనిషేధం అమలు జరిపింది. వోడ్కా త్రాగుడు, దోపిడీవర్గ పైశాచిక ప్రకృతిప్రోత్సహించిన దురలవాటు! దాని నుండి శ్రామికవర్గాలను రక్షించాలనే బోల్షివిక్కుల ఆశయం. కాని మహాసభ ప్రతినిధుల కీచట్టం వర్తించదు; బలబనోవా బస ప్రతినిధులందరికీ అందుబాటులో నే ఉండేది.

ప్రతినిధులకు సాధ్యమైనంత మంచి భోజన సదుపాయాలు చేయాలని రష్యా ప్రభుత్వం ప్రయత్నించింది. 'రై' రొట్టెతోబాటు నంజుడు (Cavia), కోడి పలావు తిన్నంత ఇచ్చేవారు. ఉదారమైన ఈ అతిథి మర్యాదల్లో ఒక లోపం కూడ లేక పోలేదు. నంజుడు బాగా మాగిపోయింది; ఇక మాంసం, ఎంతటి గట్టి పండ్లకైనా ఎదురు తిరిగేది! విదేశ ప్రతినిధుల గౌరవార్థం ఏ పక్షులను పట్టి చంపేవారో ఎవరికీ తెలియదు. కాని ఆ మాంసం నరాల పుట్ట; ఎముకలు చాల మందంగా ఉండేవి. దాన్ని బట్టి అది రాబందుల మాంసంగానీ, నిప్పుకోడి మాంసంగానీ ఐ యుండవచ్చు. గాఢ విశ్వాసంగల కమ్యూనిస్టులా విందు అద్భుతంగా ఉన్నదన్నట్లు నటిస్తూ ఉండేవారు. మాంసాన్ని చూచి బిత్తరపోయినా, నల్లరొట్టె, నంజుడుతో పొట్ట నింపుకొనేవారు. విప్లవ విజయంతో నాకిదే ప్రథమ పరిచయం; మిగిలిన విషయా లెలా ఉన్నా మాగి పోయిన 'నంజుడు' వాసన నాకు దుర్భర మనిపించింది; నా కది రష్యాలో విలాస వస్తువు; కాని దాన్ని నేను దగ్గరికే రానిచ్చేవాణ్ణి కాదు.

హోటల్లో ప్రతిరోజూ ఏదో ఒక గలభా జరుగుతూనే ఉండేది. ఒక రోజున హంగేరియన్ ప్రతినిధి వర్గం రాకతో పెద్ద గలాభా! వారిలో విప్లవానికి బలియైన ప్రముఖులు-జేలాకున్, రాకోసి, లూకేసీ, వార్గా మొదలైనవా రున్నారు. బుడా

పెట్టులో మూన్నాళ్ళ ముచ్చటైన సోవియట్ ప్రభుత్వం కూలిపోయినంతనే వీరందరినీ వియన్నాలో ఖైదు చేశారు. ఒక సంవత్సరం గడచిన తరువాత సోవియట్ ప్రభుత్వం యుద్ధ ఖైదీలుగా రష్యాలో నున్న ఆస్ట్రియా సైనికోద్యోగులను విడుదల గావించి అందుకు ప్రతిఫలంగా ఈ విప్లవ వీరుల విడుదల సాధించింది. ఈ హంగేరిన్ ప్రతినిధి వర్గం జులై 14 వ తారీఖున మాస్కో చేరింది. అది ఫ్రెంచి విప్లవ వార్షికోత్సవదినం- బాస్టీలు దుర్గపతన వార్షికోత్సవం! అంతర్జాతీయ కమ్యూనిస్టు బృందం వారికి స్వాగత మిచ్చింది; ఈ ఆహ్వాన బృందానికి నాయకుడైన జాక్విస్ సెడోల్ గొంతెత్తి 'కార్మ నోల్' పాడసాగాడు. అచట చేరికి యువతీ యువకులంతా చరిత్రాత్మకమైన ఫ్రెంచి విప్లవ నృత్యం ప్రారంభించారు. ఆగస్టులో ప్రారంభం కానున్న మహానాటకాని కిది సముచితమైన నాంది ప్రస్తావన!

## రెండవ ప్రపంచ మహాసభ

ఇంటర్నేషనల్ మహాసభలకు హాజరైన విదేశ ప్రతినిధులను, శక్తికొలది సోవియట్ ప్రభుత్వం గౌరవించింది. వారి కాలక్షేపానికి అనేక కార్యక్రమాలు ఏర్పాటు చేయబడినై. పగటిపూట, మాస్కో పరిసరప్రాంతాల్లోని విశేషాలను దర్శించటానికై విహారయాత్రలుండేవి. సాయంత్రం సంగీత, నృత్య, నాటకాది వినోదాలుండేవి. శ్రోత్రప్రభుత్వం సాధిస్తున్న విజయాలేగాక సాంస్కృతిక విశేషాలను, ప్రాచీన కళాఖండాలనూ, నిర్మాణాలను పరిరక్షించటంలో రష్యన్లు వహిస్తున్న శ్రద్ధను విదేశప్రతినిధులకు నచ్చజెప్పటమే బోల్షివిక్ ప్రభుత్వ ఆశయం! మాస్కోలోని పెట్రాకోవ్స్కీ ప్రదర్శనశాల ప్రపంచప్రసిద్ధిచెందింది. ఇదేగాక ఆనగరంలో అసంఖ్యాక మైన వాస్తు, శిల్పకళాఖండాలున్నై. మాస్కోవాస్తుపద్ధతుల్లో ప్రాచీన బైజాన్టైన్ సాంప్రదాయాలూ, ప్రాచ్య సాంప్రదాయాలూ సమ్మిళితమైనట్లు స్పష్టంగా కన్పిస్తై. పదునాల్గవ శతాబ్దంవరకూ మాస్కోలో తార్తారు (మంగోలు) జాతులవారు పరిపాలించారు. అందుచే అచట సంగీతం, వాస్తుపద్ధతులలోనేగాక సాంఘిక ఆచార వ్యవహారాలలో కూడా మంగోలు సాంస్కృతీ ప్రభావం కన్పిస్తుంది. ఇక భూస్వామ్యయుగం లోనూ, ఆధునికయుగంలోనూ రష్యా సాంస్కృతిక సాంప్రదాయాలను వరవడి దిద్దినది మాస్కోనగరమే. సెయింట్ పీటర్స్‌బర్గ్ 'పాశ్చాత్య దేశాలకు కిటికీ'మాత్రమే! అచటిది పూర్తిగా మిశ్రమసంస్కృతి. "అన్నా కెరినీనా",[1] ఘనుడైన పీటర్[2] నాటి సమాజానికి చెందినది. కాని 'అన్నా కెరినీనా'ను రచించిన టాల్‌స్టాయ్ మాస్కో వాడు; అతడు మధ్యయుగ రష్యారాజధాని (మాస్కో) సమీపంలోనున్న తన ఎస్టేటు పైన నివసిస్తూ ఉండేవాడు.

---

1. టాల్‌స్టాయ్ నవల. 2. రష్యాలో పాశ్చాత్య నాగరికతను ప్రవేశ పెట్టిన జారు (1696-1725); ఇతడే సెయింట్ పీటర్స్‌బర్గ్ నిర్మించినవాడు.

స్థానిక రష్యా సంస్కృతి కేవలం మాతృకమైనది. 'వోల్గా'నదియే మాతృదేవి. వోల్గా మాతపైగల ప్రేమతో స్లెన్ కా రేసిన్ పైగల భక్తి సమ్మిళితమైంది. తార్తారు దౌర్జన్యంపై తిరుగుబాటున కీ స్థానిక సాంస్కృతిక సాంప్రదాయాలే రష్యనులకు ప్రోత్సాహాన్నిచ్చినై. నేటికీ రష్యన్ హృదయాల్లో ఆనాటినినాదం ప్రతిధ్వనిస్తుంది. వాస్తవానికి, రష్యాలో నిరంకుశత్వాన్ని సహింపలేనిదీ, బోల్షివిజం స్థాపనకు కారణమైనదీ, స్వచ్ఛందమైన ఈ స్థానిక విప్లవ సాంప్రదాయమే గాని వైదేశికమైన మార్క్సిజం కాదు. మధ్యయుగ నిరంకుశత్వంపై జరిగిన తిరుగుబాటులో ఒక దొంగలనాయకుడు స్వాతంత్ర్య ప్రదాతగా జోహారు లందుకొన్నాడు. సాంస్కృతికంగా ఈ (దొంగల నాయకుని) సాంప్రదాయమే, తన ప్రత్యర్థులపై స్టాలిన్ విజయానికి తోడ్పడిందని చెప్పవచ్చు. ఇక, స్టాలిన్ ప్రత్యర్థుల భావాలూ, ఆశయాలూ ఆధునిక నాగరికత ప్రసాదించినవే!

విదేశాల్లో పేరు మోసిన రష్యన్ బాలట్ (నృత్య నాటిక) చాలవరకు ఆధునిక జారు సంస్కృతీ నిర్మాణమే! కాని మాస్కో నాటకశాల (Art Theator) అంతకంటె సుప్రసిద్ధమైంది. బాలట్ నిర్మాతయైన పావ్‌లోవ్లా, సెయింట్ పీటర్స్ బర్గ్ నివాసి; ఇతనికంటె గొప్పవాడు మాస్కో వాసియైన స్లానిస్లావ్‌స్కీ. ఈతడు నాటక ప్రదర్శనలో (Stage craft) ప్రపంచంలోనే అద్వితీయుడని పేరు గాంచిన వాడు. అదీగాక బొరోడిన్, రిమ్‌స్కీ, కార్సకావ్‌ల సంగీత నాటకాల్లో అంతర్భాగం గానే బాలట్‌కు ఖ్యాతి లభించింది. ఈ సంగీత నాటకాలు శ్లావ్ సాంస్కృతిక సాంప్రదాయాలకు ప్రత్యక్ష నిదర్శనాలు. ఈ సంగీత నాటకాల్లో బాలట్‌కు ఒక అంకం ప్రత్యేకింపబడుతుంది; అందులో, నాటకంలోని కథావస్తువును అంగవిన్యాసం ద్వారా ప్రదర్శిస్తారు. పూర్తిగా పాశ్చాత్య పద్ధతుల ననుసరించిన చైకోవ్‌స్కీ గూడా ఈ సాంప్రదాయాన్ని ధిక్కరించలేక పోయినాడు. ఏకైక కళాఖండంగా రూపొందించిన నాటకంలో నుండి విడగొట్టటంతో బాలట్ కృత్రిమంగా తయారౌతుంది. నీచమైన అభిరుచులు గల వారికి మాత్రమే బాలట్ నచ్చుతుంది!

అంతర్యుద్ధం జరుగుతూ, పస్తులుంటూ వంటచెఱకు లేక గడ్డకట్టుకు పోతున్న చలికాలంలో గూడ, మాస్కోలో నాటకశాలలు పనిచేసినై. రోజంతా కష్టపడి పనిచేసిన ప్రజలకీ నాటకశాల లొక్కటే కాలక్షేపం! రష్యాలో డబ్బు నిషేధించబడింది. అందుచే ప్రాతరోజుల్లో మాదిరిగా డబ్బున్న ప్రతివానికీ ఈ వినోదశాలల్లో ప్రవేశం లేదు; స్వేచ్ఛాపమత్వాలపై నూతన వ్యవస్థను నిర్మించే వారికే అందులో ప్రవేశార్హత, హక్కు! ప్రతి శాలలోనూ కొన్ని సీట్ల వరుసలు వివిధ సంస్థలకు అంటే: కార్మిక సంఘాలు, కమ్యూనిస్టుపార్టీ, మాస్కో సోవియట్ పాఠశాలలు మొదలైన వానికి ప్రత్యేకింపబడేవి. కాని మాస్కో జనా

భాలో అధిక సంఖ్యాకులు ఇందులో ఏ సంస్థలకూ చెందనివారే. అందుచే కొన్ని టిక్కెట్లను మాత్రం బహిరంగంగా అమ్మేవారట. ఇటువంటి టిక్కెట్ల సంఖ్య చాల తక్కువ కావటంచేత రోజూ ప్రతి నాటకశాల దగ్గిర పెద్ద 'క్యూ' ప్రత్యక్షమయ్యేది. ఈ టిక్కెట్ల ఖరీదు ఊహాతీతం!

ప్రతి శాలలోను కొన్ని సీట్లు, విదేశ ప్రతినిధులకు కేటాయింపబడినై. ఇవి ఒకప్పుడు జారు కుటుంబానికి ఏర్పరచిన బాక్సులు (Boxes). ప్రపంచ మహాసభ సమావేశాలకు పూర్వం మీ గౌరవస్థానాలు, అఖిల రష్యా సోవియట్ కాంగ్రెస్ (All Russia Soviet Congress) కేంద్ర కార్య నిర్వాహక సంఘ (Central Eexcutive Committee) సభ్యుల కీయబడినై. కాని విదేశ ప్రతినిధుల కీ శాలల కంటె బహిరంగ వినోద ఉద్యానవనాలే (Open air entertainment Parks) నచ్చినై. వీనిలో రకరకాల ప్రదర్శనలు జరుగుతూ ఉండేవి. ఆ రోజుల్లో మాస్కో నాటకశాలలో ప్రాచీన రష్యన్ నాటకాలను, విదేశీ నాటకాలను ప్రదర్శిస్తున్నారు. నాటి రష్యన్ నటుల్లో చెకోవ్ సుప్రసిద్ధుడు. క్షయ వ్యాధితో బాధపడుతూ ఉండే వాడు; ఐనా 'గగోల్స్ ఇన్ స్పెక్టర్' 'హామ్లెట్' నాటకాల్లో ప్రధాన భూమికలు ధరించేవాడు. అతని నటన 'హామ్లెట్' పాత్రకొక నూతన వ్యాఖ్యానం! గగోల్స్ ఇన్ స్పెక్టర్‌ను అనుకరిస్తూ రచింపబడిన స్పానిష్ ప్రహసనంలో కూడా చెకోవ్ ప్రధాన భూమికను ధరిస్తున్నాడు. మాస్కో నాటకశాలలోని నాల్గు స్టూడియోల కళాకారులూ స్లానిస్లావ్‌స్కీ పర్యవేక్షణలో, నాటక కళలోనూ, ప్రదర్శనా విధానంలోనూ పరిశోధనలు జరుపుతూ ఉండేవారు.

వారివారి అభిరుచుల ననుసరించి, విదేశ ప్రతినిధు లీ వివిధ వినోద ప్రదర్శనలను చూచి ఆనందించేవారు. రిమ్‌స్కీ-కార్సకావ్ సంగీతనాటకాలు ఇంగ్లీషు వారికి బాగా నచ్చినై; ఇటాలియన్లు, హామ్లెట్‌కు చెకోవ్ ఇచ్చిన క్రొత్తవ్యాఖ్యానాన్ని మెచ్చుకొన్నారు; 'బిథోవెన్' సంగీత ప్రదర్శనలకు ఫ్రెంచివా రెక్కువగా హాజరయ్యే వారు. జర్మన్లు, బహిరంగ ప్రదర్శనల్లో తరచుగా కన్పించేవారు; తమ 'జాజ్' సంగీతాభిమానాన్నికూడా మరచి, అమెరికన్లు రష్యన్ సంగీతాన్ని ఆనందించేవారు.

ఇక ప్రతినిధివర్గనాయకులకు ప్రత్యేకంగా గౌరవ హోదాలు లభించినై. ఈ ప్రతినిధివర్గాలన్నీ రెడ్ ఆర్మీ దళాలను దర్శించారుగదా! ఆ సందర్భంలో, అచటి సైనిక లీ వర్గాల నాయకులకు గౌరవ సైనికాధికార హోదాలూ, వానికి నిర్దేశమైన 'యూనిఫారము'లూ సమర్పించారు. ఐతే రష్యాలో అవి పాడుపురోజులు, అందుచే ఈ యూనిఫారము లేమంత యోగ్యంగా ఉండేవికావు. విప్లవం జరిగే రోజుల్లో తిరుగుబాటుదార్లు ప్రభుత్వోద్యోగుల దుస్తులపై మెరిసే అధికారచిహ్నాలను ఊడబెరికి తమ విజయానికి నిదర్శనంగా ధరించేవారు. ఆ సాంప్రదాయం రష్యాలో ఇంకా

మాసిపోలేదు! రెడ్ ఆర్మీ స్థాపింపబడిన తొలిరోజుల్లో అధికారులూ, సైనికులూ ఒకేరకమైన యూనిఫారములు ధరించేవారు. సైనికాధికారి చొక్కామీదమాత్రం ఆతని హోదా తెలియజేయటానికై ఎఱ్ఱని గీరలుండేవి. సైనికాధికారిని 'కామ్రేడ్ కమాండర్' అని సంబోధించేవారు. అధికారి హోదానుబట్టి ఎఱ్ఱగీరల సంఖ్య పెరుగుతూ ఉండేది. గౌరవ సైనిక హోదాలు లభించిన విదేశప్రతినిధులు చాలీచాలని యూనిఫారాల్లో తిరుగుతూ, తాముపొందిన మర్యాదలను సగర్వంగా చాటుకుంటూ ఉండేవారు. రెడ్ ఆర్మీలో మామూలుగా ఎత్తుబూట్లు ధరించేవారు; అవి వేసవికాలానికి పనికిరావు; అందుచే ఈ గౌరవోద్యోగులకు వదులుగాఉండే మరొకరకం బూట్లు (Putties) ఇవ్వబడినై. వీటిని గట్టిగా కట్టుకొనటం క్రొత్తవాళ్ళకు సాధ్యంకాదు; అందులో పిక్కలు సన్నగా ఉండేవారి అవస్థలు చెప్పనక్కర్లేదు. అనుభవంలేని ఈ గౌరవోద్యోగులు 'పుట్టీ'లను ధరించి కాలు కదపగానే అవి జారిపోయి నేలమీద జీరాడేవి. ఈ విదూషకచర్యలతో వీరితరులను కడుపుబ్బ నవ్వించేవారు.

విదేశ ప్రతినిధుల్లో కొందరికి మాస్కో సోవియట్‌లోనూ, ఇతర నగర సోవియట్లలోనూ గౌరవ సభ్యత్వ మీయబడింది. మాస్కో సోవియట్‌లో సభ్యత్వం లభించిన వారికి సభ్యత్వం చీట్లు ఇచ్చారు. ఈ చీట్లు ఉన్నవారు ట్రామ్‌కార్లలో ముందు సీట్లలో కూర్చోవచ్చు; నాటకశాల టిక్కెట్లు కొనటానికి క్యూలో నిలబడ నక్కరలేదు. ప్రతినిధులు, ముఖ్యంగా తమ స్నేహితురాండ్రకు టిక్కెట్లు కొనేందుకీ అవకాశాన్ని సద్వినియోగం చేసేవారు!

## మహాసభ కార్యక్రమం

మహాసభ దగ్గిర పడుతున్నకొలదీ, ప్రతినిధుల దృష్టి చర్చనీయాంశాలపైకి మరల సాగింది. జాతీయ ప్రతినిధివర్గాలు సమావేశాలు జరిపి మహాసభలో చర్చించటానికై నివేదికలు (Reports) తయారు చేశారు. ప్రతి దేశంలోనూ, విప్లవసాధన కవసరమైన రాజకీయ ఆర్థిక పరిస్థితులనుగురించీ, ఆయా దేశాల్లో విప్లవ పోరాటం సాగించే పద్ధతులను గురించీ, విభిన్న భావాలు వ్యక్తమైనై. మహాసభలో చర్చించి, నిర్ణయించే ముసాయిదా తీర్మానాన్ని కూడా ప్రతినిధులు పరిశీలించారు.

మహాసభ సమావేశానికి కొన్ని నెలలు ముందుగానే సభా కార్యక్రమం ప్రకటింపబడింది. ఇంటర్నేషనల్ తొలి రోజుల్లో, తీర్మానాలంటూ జరిగేవి కావు. అప్పటి కార్యక్రమంలో మూలసూత్రాలను స్పష్టీకరించటం, సిద్ధాంతాన్ని గురించిన వాదోపవాదాలను పరిష్కరించటం, రాజకీయ చర్యలకు కార్యక్రమాన్ని రూపొందించటం - ప్రధానాంశాలు. ప్రతి సమస్యమీద ఒక ముసాయిదా తయారుచేసి సభ్యులకు పంచిపెట్టేవారు; వానిని సభ్యులు, ముందుగానే చదవటంచేత, ప్రాథమిక

చర్చలు జరపటానికి వీలుండేది. ఇంటర్నేషనల్‌లో చేరిన ఏ దేశ పార్టీ అయినా, లేక సభ్యప్రతినిధియైనా, ఏ సమస్యమీదైనా ముసాయిదా తయారు చేయవచ్చు. కాని ప్రతి దేశంలోనూ, పార్టీలు వేరు వేరు ముఠాలుగా చీలిపోయి యుండటంచేత, వారెవరూ ముసాయిదా తయారుచేసే పనికి పూనుకొనేవారు కారు. అందుచే ఈ బాధ్యతను రష్యన్లే వహించారు. మహాసభ సమావేశానికి కొన్ని రోజుల పూర్వం వరకూ లెనిన్ ముసాయిదా ఒక్కటే చర్చనీయాంశంగా ఉంది. ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీ బాల్యదశలో, ఇతర దేశాల తప్పటడుగులవల్లనే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆలోచనాక్రమంలో రష్యన్ల ప్రాబల్యానికి పునాదులు వేయబడినై. క్రమంగా, 'ప్రతి సమస్యమీదా మొదటి మాటా, చివరి మాటా కూడా రష్యాదే.' అనే సాంప్రదాయం బలపడింది.

ఆ పద్ధతిలోనే, రెండవ ప్రపంచ మహాసభ కార్యక్రమం కూడా కొన్ని నెలల ముందుగా ప్రకటింపబడింది; దానితో బాటు జాతీయ, వలసరాజ్యాల సమస్యపై లెనిన్ తయారు చేసిన ముసాయిదా కూడా ప్రచారమైంది. అందుచే మహాసభలో ఆ ముసాయిదాపై సుదీర్ఘమైన చర్చ జరిగే అవకాశ మేర్పడింది. కాని ప్రముఖ యిరోపా ప్రతినిధి వర్గాల కా సమస్యలో శ్రద్ధ ఏ మాత్రం లేదు. యుద్ధానికి పూర్వం, సోషలిస్టుల ప్రపంచమంతా, యిరోపా, అమెరికాలే. యుద్ధానంతరం కూడా సోష లిస్టుల్లో అదే భావం బలంగా ఉండేది. ఈ సాంప్రదాయానికి స్వస్తి చెప్పి, ప్రపంచ మంతటికి సంబంధించిన సంస్థగా 'ఇంటర్నేషనల్'ను పటిష్ఠం చేయాలని లెనిన్ ఆశయం. కాని, తమ తమ ఆంతరంగిక సమస్యలతో సతమతమవుతున్న, యిరోపాలోని పిల్ల కమ్యూనిస్టుపార్టీలు, లెనిన్ మహదాశయాన్ని లక్ష్యం చేయలేదు; ఇక తూర్పు యూరపురాజ్యాల ప్రతినిధివర్గాలది జాతీయ సమస్య. కాని రష్యా విప్లవంవల్లనూ, వర్సెయిల్సు సంధితోనూ పరిష్కృతమైన జాతీయ సమస్యను, చారిత్రక సిద్ధాంత ప్రాధాన్యతే గాని, మహాసభా ప్రాధాన్యత నశించింది. కాగా, ఒక బ్రిటిష్ ప్రతి నిధి వర్గం మాత్రం లెనిన్ ముసాయిదాలో శ్రద్ధ చూపింది; కాని అప్పటి కింకా బ్రిటన్‌లో కమ్యూనిస్టుపార్టీయే లేదు. బ్రిటిష్ ప్రతినిధివర్గనాయకుడు టామ్‌క్వెల్చ్; ఈతని తండ్రి హిన్‌డ్‌మన్‌తో కలిసి పని చేశాడు; టామ్ స్వభావం చాల మంచిది; కాని పలుకుబడి లేనివాడు. "సామ్రాజ్యవాద రాజ్యాల్లో 'తెల్లవారి బాధ్యత'ను శ్రామికవర్గం వహించాలనేదే" లెనిన్ సిద్ధాంతమని టామ్ భావించాడు. ఈ బాధ్య తను గుర్తించియే, వలసరాజ్య ప్రతినిధులతోనూ వలస సమరాజ్య (Semi-Colonial) ప్రతినిధులతోనూ మైత్రి వహించటానికి ప్రయత్నించాడు. వలస సమరాజ్యాలనే విభాగం లెనిన్ సృష్టించినదే. కాని, ఈ ప్రతినిధి బృందాలతో టామ్‌కు సరిగా పొత్తు కుదరలేదు. వలస ప్రతినిధుల్లో తాము దురదృష్టవంతులమనే భావం బలంగా ఉండేది; అందుచే టామ్ ప్రదర్శించిన స్నేహభావాన్ని తమపట్ల దాక్షిణ్యంగా

అపార్థం చేసికొన్నారు. నేను మాత్రం టామ్‌తో మైత్రి వహించటానికి ప్రయత్నించాను. వలస ప్రతినిధుల్లో కనీసం ఒక్కరైనా తన సద్భావాన్ని అర్థం చేసికొనగలిగినందులకు చాల సంతోషించాడు. డచ్చి, అమెరికన్ ప్రతినిధివర్గాలు మాతో చేరటంతో మా ముఠా బలపడింది.

మహాసభ కార్యాచరణ చర్చా సమావేశాలు, మాస్కోలో, జారుల పట్టాభిషేక భవనంలో జరగాలనీ, విప్లవ జన్మస్థలమైన సెయింట్ పీటర్సుబర్గ్‌కు గూడా మహాసభ కార్యక్రమంలో గౌరవప్రదమైన స్థానం ఇవ్వాలనీ నిర్ణయమైంది. సెయింట్ పీటర్సుబర్గ్‌కే లెనిన్‌గ్రాడ్ అని నామకరణం జరిగింది. లెనిన్‌గ్రాడ్‌లో మహాసభ ప్రారంభోత్సవం జరపటానికి ఏర్పాట్లు జరిగినై. వాస్తవానికి సమకాలిక చరిత్రలో ఈ మహాసభ చిరస్మరణీయమైన సంఘటన! అందులో పాల్గొనటం ఒక మహదవకాశం! లెనిన్ నగరానికి ప్రతినిధులను తీసుకువెళ్ళటానికి మూడు ప్రత్యేక రైలు బండ్లు ఏర్పాటు చేయబడినై. స్టేషన్‌లో, అపారమైన జనసందోహం వారికి స్వాగతం పలికింది. జారిస్టు రష్యా రాజధానియైన ఈ నగర జనాభా 20 లక్షలుండేది; కాని యుద్ధంవల్లా, విప్లవంవల్లా 1920 ఆగస్టు నాటికి సగానికి సగం తగ్గిపోయింది. స్టేషన్ నుండి స్మాల్నీ రాజప్రాసాదానికి నడిచిన ప్రతినిధుల ఊరేగింపులో, నగర జనాభా మొత్తం పాల్గొన్నదనే చెప్పవచ్చు. 1917 నవంబరులో బోల్షివిక్కులు తమ ప్రథమ ప్రభుత్వాన్ని స్థాపించినదీ స్మాల్నీ భవనంలోనే!

స్మాల్నీ భవనంలో ప్రతినిధివర్గాలకు లెనిన్‌గ్రాడ్ సోవియట్ స్వాగతం చెప్పింది. లెనిన్‌గ్రాడ్ సోవియట్ ఆతిథ్యం స్వీకరించాము. రాజప్రాసాద సోపానాలపై నిలబడిన ప్రతినిధులను ఫొటో తీశారు. అందులో లెనిన్, జినోవీవ్, బుఖారిన్, రాడెల్, గోర్కీ, జెర్‌జిన్‌స్కీ మొదలైన ప్రముఖు లందరూ ఉన్నారు. ఈ ఫొటో మధ్య నేను లెనిన్ ప్రక్కనే నిలబడటం తటస్థించింది. తరువాత ఈ ఫొటోకు చారిత్రిక ప్రాధాన్యత లభించింది. ప్రపంచంలో కమ్యూనిస్టుపార్టీ కార్యాలయాలన్నిటిలో ప్రముఖస్థానాన్ని అలంకరించిం దీ ఫొటో!

మధ్యాహ్నం భోజనానంతరం, ప్రతినిధులు సంగీతశాలకు (Opera House) నడిచారు. అక్కడే, బహిరంగసభలో ప్రపంచ మహాసభకు ప్రారంభోత్సవం జరిగింది. హాలు చాల పెద్దది. మహాసభ ప్రారంభానికి కొన్ని గంటలు ముందుగానే, హాలు క్రిక్కిరిసి పోయింది. సాధారణంగా, రష్యన్ సంగీతశాలల్లో వేదికపై ఐదు వందల మందికి స్థలం ఉంటుంది. ఐనా ప్రతినిధుల కా వేదిక చాలలేదు. అందుచే రష్యా నాయకులూ, విదేశ ప్రతినిధుల్లో ప్రముఖులు కొందరు మాత్రమే వేదికపై ఆసీనులైనారు. వారు వేదికపైకి వచ్చినంతనే రష్యన్ ఆర్కెస్ట్రా 'అంతర్జాతీయ గీతాన్ని' ఉపక్రమించింది. రష్యన్ ఆర్కెస్ట్రాలో రెండు వందల వాయిద్యా

లంకై. అంతర్జాతీయ గీతం ప్రారంభం కాగానే, సభికులంతా లేచి నిలబడ్డారు. పదునైదు నిమిషాలపాటు హాలు భీషణ సంగీతంతో ప్రతిధ్వనించింది. ప్రపంచ పీడిత జనోద్ధరణకై యుద్ధరంగానికి నడుస్తున్నట్లు నాలో కలిగిన 'ఆవేశమే' సభికులందరికీ కలిగి ఉంటుంది. సంగీతం ఇంతటి భయానకమైన అనుభూతిని కలిగించ గలదని నేనెన్నడూ ఊహించలేదు.

ఉపన్యాసాలు ప్రారంభమైనై; లెనిన్‌గ్రాడ్ సోవియట్ అధ్యక్షుడుగా జినోవీవ్ ప్రథమ ఉపన్యాసకుడు. మామూలుగా ఉపన్యాసంలో నిప్పులు కురిపించే వాడు జినోవీవ్. కాని సందర్భాన్ని ఆవహించిన గాంభీర్యం, ఉద్రిక్తత ఉపన్యాసాని కవసరమైన ఆవేశాన్నియలేక పోయినై; అదీగాక ఆర్కెస్ట్రా సంగీత ప్రభావం ముందు జినోవీవ్ బొంగురుగొంతు ప్రభావం తేలిపోయింది. ఐనా, జినోవీవ్ చేసిన గొప్ప ఉపన్యాసాలలో నాటి ఉపన్యాసం ఒకటి.

నాటి ఉపన్యాసకు లందరిలో బాగా రాణించినవాడు మార్సెల్ కాచిన్; అలంకారయుతమైన ఫ్రెంచిభాషలో అతడు చేసిన ఉపన్యాసం ప్రేక్షకులను భావనా లోకంలో ఫ్రెంచి విప్లవ యుగానికి తీసుకుపోయింది. ఉజ్జ్వలమైన గతంలోనుండి మహోజ్జ్వలమైన భవిష్యత్తులోనికి పయనించే ప్రగతిశీలిగా కన్పించాడు కాచిన్. ఆఖరి ఉపన్యాసకుడు లెనిన్. మహాసభలో లెనిన్ ఉపన్యాసం వినటం అదే ప్రథమం. లెనిన్ ఉపన్యాసంలో సభికులను ఉద్రిక్తులను చేసే ప్రయత్నమే లేదు. గంభీరమై హృదయానికి హత్తుకొనే ఉపన్యాసం; సంగీత నిగూఢ ప్రభావాన్ని బ్రద్దలు చేసి సభికులను వాస్తవ ప్రపంచంలోనికి తీసుకు వచ్చింది. ఉపన్యాసానంతరం కరతాళ ధ్వనులతో సభికులు 'అమృతాన్ని' అన్నట్లనిపించింది.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మహాసభలకు జారుల పట్టాభిషేక మందిరాన్ని నిర్ణయించటంలో ఒక ప్రత్యేక ప్రాధాన్యత ఉంది. పాత పాలకవర్గ స్థానాన్ని శ్రామికవర్గం ఆక్రమించినదనే చారిత్రక సత్యాన్ని ప్రదర్శించటమే దానిలోని ఆంతర్యం. తమ, తమ దేశాల్లో కూడా ఇదే విధమైన మార్పులు సాధించాలనే ఉత్సాహాన్ని, రష్యేతర కమ్యూనిస్టు నాయకుల్లో ప్రజ్వరిల్ల చేయటమే ఆ ప్రదర్శన ఉద్దేశ్యం. తమ దేశ ప్రభుత్వాలచే పలు విధ హింసలకు గురియగుచూ, పీడిత ప్రజానీకం ప్రతినిధులుగా మహాసభకు హాజరగుచున్నవారి కిది మత్తెక్కించే అనుభవం. పీడిత ప్రజలు అధికారాన్ని హస్తగతం చేసికొనటం, దోపిడిగాండ్రను దోచు కొనటం-అనేవి కేవలం స్వప్నాలు కాదని వారికి అర్థమైంది. మేడపరితలంపై, చక్రవర్తుల సింహాసనం విరిగి ముక్కలై, కుప్పగా కూలి మాస్కో నదిని దీనంగా చూస్తున్నది. సింహాసన వేదిక మీదనే, మహాసభాధ్యక్షుని ఆసనం తయారు చేయ బడింది. సింహాసనాన్ని అలంకరించిన సువర్ణచ్ఛత్రం మాత్రం స్థానభ్రంశం పొందలేదు;

కాని, దానికి ఎఱ్ఱని ముసుగు వేశారు; ఆ ప్రక్క గదిలోనే ఉంది చక్రవర్తులు పవ్వళించిన శయ్య! ప్రతినిధులలో ఉబుసుపోనివారు, వంతులవారీగా, ఆ శయ్య ఎంతటి హాయి నిస్తుందో పరీక్షింపసాగారు. ఒక చిన్న హాలులో ఫలహారా లేర్పాటు చేశారు. జారుల నాటి ఆడంబరత్వం లేకపోయినా తెల్లని రొట్టె, జున్ను, వంజులు, ఖరీదైన పానీయాలు ఇవ్వబడినై. నాటి పరిస్థితులను బట్టి, మాస్కోలో ఇవి చాల అపూర్వ పదార్థాలు, పెట్టుబడిదారీ దేశాల్లో శ్రామికవర్గ సభ్యులకు అందుబాటులో ఉండని పదార్థాలు!

ముసాయిదా సిద్ధాంతాలను చర్చించి వానిపై నివేదికలు సమర్పించేందుకై, మహాసభ మొదటి సమావేశంలో, కొన్ని సంఘాలను నియమించింది. మహాసభ కార్యక్రమమంతా జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషల్లో నడిచింది. ఒక భాషలో చేసిన ఉపన్యాసాల్ని ఇతర రెండు భాషలలోనికీ తర్జుమా చేయబడేవి. అందుచే మహాసభ కార్యక్రమం పూర్తికావటానికి మూడు వారాలు పట్టింది. మహాసభను నడపటానికి ఇంకా సుదీర్ఘమైన యంత్రాంగం యేర్పడలేదు. విశేషమైన కాలహరణానికి ఈ లోపమే కారణం. ప్రతినిధులు కులాసా కబుర్లు చెప్పుకుంటూ రాజప్రాసాదం నలుమూలలా ప్రచారం చేస్తుండేవారు. చర్చలకు నిర్దేశిత స్థలం అంటూ ఉండేది కాదు. సోమరిపోతులు పడక గదుల నాశ్రయించి బైటికి వచ్చేవారే కాదు!

## రెండవ ప్రపంచ మహాసభలో ప్రముఖులు

లెనిన్‌గ్రాడులో నున్న రెండవ రోజున ప్రతినిధులకు సుదీర్ఘమైన కార్యక్రమం ఏర్పాటైంది. ఉదయమే వారందరినీ, 'జారు గ్రామాని'కి తీసుకువెళ్ళారు. ఇది లెనిన్‌గ్రాడుకు పదునారు మైళ్ళ దూరంలో ఉంది. ఈ గ్రామీణప్రాంతంలో అప్పుడప్పుడు చక్రవర్తులు కొలువు చేస్తుండేవారు. ఇప్పుడది బాలల కేంద్రంగా మార్చబడింది. భోజనానంతరం నేవా నదిపై నున్న శిశిరప్రాసాదాన్ని, ఆ సమీపంలోనే ఉన్న వస్తుప్రదర్శనశాలనూ చూచాం. తరువాత బహిరంగసభ. అదే నాటి కార్యక్రమంలోకెల్ల ముఖ్యమైన అంశం. ప్రపంచ కార్మికవర్గ నాయకు లుపన్యసించే ఆ మహాసభకు జినోవీవ్ అధ్యక్షుడు. క్రిందటి సాయంత్రమే లెనిన్, ఇతర రష్యా నాయకులూ మాస్కోకు తిరిగి వెళ్ళారు. జినోవీవ్ ఉపన్యాసంతో సభ ప్రారంభమైంది. ఒక గంటసేపు దంచేశాడు. అతని తర్వాత నా వంతు వచ్చింది. అది నాకొక పరీక్షే. కారణం, ఏమి మాట్లాడాలో ఆలోచించకుండా వేదిక నెక్కడమే.

బహిరంగ ఉపన్యాసాలపట్ల వైముఖ్యాన్ని నేను జయించలేకపోయినాను. ఒకొక్కమారు మాట్లాడదలచింది ముందుగా ఆలోచన చేసేవాణ్ణి; కాని వేదిక నెక్కినంతనే నేను ఆలోచన చేసినదానికీ, మాట్లాడే విషయానికి హస్తిమశకాంతరం

ఉండేది. కాని ఒక్కటి మాత్రం సంతృప్తికరం. ఎన్నడూ అసందర్భంగా మాత్రం మాట్లాడలేదు. తయారు గాకుండా బహిరంగసభలో ఉపన్యసించే అలవాటువల్ల నన్ను 'దివ్య వక్త' (Inspired Speaker) అంటూ ఉండేవారు. నిజానికి ఆ బిరుదుకు నేనేమాత్రం తగను. అంతేగాదు ఆ బిరుదుకు నేను తగక పోవటం అటుంచి, ఆ బిరుదు కూడా వాంఛనీయమైంది కాదు! ఊహాలోకంలో విహరిస్తూ, ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేయగల మంద ఉపన్యాసకులపట్ల నాకెప్పుడూ అసూయ లేదు. ఉపన్యాసకుడైన వాడు తనయందుకంటె ప్రేక్షకులయం దెక్కువ శ్రద్ధ వహించాలని నా ఉద్దేశ్యం. కాని, ప్రజాబాహుళ్యాన్ని ఉద్దేశించి మాట్లాడే సందర్భంలో, ప్రేక్షకుల భావాలను గ్రహించటం సాధ్యం కాదు. అందుచేతనే నేనెప్పుడూ, బహిరంగ ఉపన్యాసాలను ముందుగా తయారు చేయను; ప్రేక్షకులను దర్శించగానే ఏదో భావం మనసులో మెదలక తప్పదు; ఆ భావాన్ని వ్యక్తం చేయటంతో ఉప న్యాసం ప్రారంభమౌతుంది. దాని కనుగుణంగా మిగిలిన ఉపన్యాసం పూర్తవుతుంది. అందుచే నా ఉపన్యాసం ప్రేక్షకుల సంస్కృతిలూపే భాషావైదుష్య ప్రదర్శనంకాదు. పదిమందికి విన్పించేటట్లు ఆలోచన చేయటమే!

నా ఉపన్యాసం మధ్యలో ప్రేక్షకులు తరచు హర్షధ్వానాలు చేశారు. వాని వల్ల, నేను కూడా సందర్భోచితమైన నినాదాలు చేసే ఉండవచ్చు. కాని హర్షధ్వానాలకు నా ఉపన్యాసంలోని విశేషాల కంటె, యదార్థమైన కారణం మరొకటి లేకపోలేదు. అప్పుడప్పుడు హర్షధ్వానాలు చేయటం వారి అలవాటై పోయింది. ఈ భావం నాకు చాల బాధ కలిగించింది. మనశ్శాంతికి ఏదైనా కాల క్షేపం దొరుకుతుందా అని ఆలోచించాను.

## జాన్‌రీడ్ దంపతులు

లెనిన్‌గ్రాడ్ నుండి ప్రతినిధులను మాస్కోకు గొనిపోయే ప్రత్యేక రైలు బండి బయలుదేరటానికి యింకా చాల వ్యవధి ఉంది. ఇంతలో సుప్రసిద్ధ అమెరికన్ కమ్యూనిస్టు జాన్‌రీడ్‌ను కలుసుకొని మాట్లాడిరావచ్చు. జాన్‌రీడ్, ఇటీవల నే స్వదేశం నుండి తిరిగి వచ్చి లెనిన్‌గ్రాడ్‌లో ఉంటున్నాడు. రీడ్ భార్య లూసీబ్రియంట్‌ను మాస్కోలో కలుసుకున్నాను; ఆమె కూడా పత్రికా రచనలు చేస్తూ ఉండేది. మంచి తెలివితేటలు గలది; అందుకు తగిన అందం, ఆశయాలూ ఉన్నై; జాన్‌రీడ్ భార్యగా కీర్తింపబడటం ఆమె కేమాత్రం ఇష్టం లేదు. తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టు కొనే ఉద్దేశ్యంతో నే రష్యా విప్లవంపై నొక గ్రంథం వ్రాసి ప్రచురించింది. బహుశా అదే ఉద్దేశ్యంతో భర్తను చూడటానికి లెనిన్‌గ్రాడ్ కూడా రాలేదు. వ్యక్తిగత మైన కారణాల వల్ల మాస్కోలో తన పత్రికా రచన బాధ్యతలను విడిచి పెట్టలేకపోయింది.

మహాసభకు పూర్వం ఒకరోజు, అర్ధరాత్రి, కారఖాన్ కార్యాలయం నుండి బయటికి వస్తూ, లూసీబ్రియన్‌ట్‌ను కలుసుకున్నాను. ప్రెస్ బ్యూరో అధిపతిని చూచే నిమిత్తం వేచియున్నది లూసీ. విదేశ పత్రికా ప్రతినిధు లందరి వలెనే లూసీకూడా తన రిపోర్టులకు ప్రెస్ బ్యూరో అధిపతిచే తనిఖీ చేయించాల్సిందే. అది వేసవి రాత్రి కావటంచే కార్యాలయంనుండి హోటల్‌కు నడిచి వెళ్ళటమే బాగుంటుందనుకున్నాం. దారిలో ప్రెస్ బ్యూరో దౌర్జన్యం పట్ల చాల ఆగ్రహాన్ని ప్రకటించింది లూసీ; ఆ సాయంత్రమే లూసీ వ్రాసిన ఒక కథను, గుర్తించటానికి గూడా వీలులేనట్లు కత్తిరించిందట! యుద్ధరంగంపై ట్రాట్‌స్కీని చూడటానికి, ఆమెకు అనుమతి నిరాకరించిందట! కోపంతో ఉడికిపోయిన ఆమె నరాలన్నీ బైటి చల్లని గాలితో స్వాస్థ్యాన్ని పుంజుకొన్నై; ఇక జాన్‌రీడ్‌ను గురించి సంభాషణ ప్రారంభించింది. "రాష్ట్రాల్లో తన ఉపన్యాస కార్యక్రమాన్ని రద్దుచేసికొని అత్యవసర కారణాల వల్ల జాన్ రష్యా వచ్చాడు. జినోవీవ్‌తో సంప్రదింపులు జరపటానికై లెనిన్‌గ్రాడులోనే ఉంటున్నాడు. జాన్ చాల మంచివాడు. నీకు గూడా అతనిపై అభిమానం కలుగుతుంది. ఎవరైనా, చివరకు పురుషులైనా ప్రేమించగల స్వభావం జాన్‌ది. అందుకని నాకేమాత్రం అసూయలేదు. అందగత్తెల నుండి అతణ్ణి రక్షించటానికై నేనేం లెనిన్‌గ్రాడ్ పరుగెత్తటం లేదుగదా!"

హోటల్ గదిలో రీడ్, ఒంటరిగానే ఉన్నాడు. ప్రాత స్నేహితుణ్ణి చూచినంతటి సంబరంతో నన్నాహ్వానించాడు. మెక్సికోలో నా విప్లవ చర్యలన్నీ విన్నాడట. రష్యాకు వెలుపల మొదటి కమ్యూనిస్టుపార్టీని సంయుక్తరాష్ట్రాల్లో స్థాపించి విజయగౌరవాన్ని పొందాలని తాను ఆశించాడట! కాని, అతనికంటె ముందుగా మెక్సికోలో స్థాపించి నేనా గౌరవాన్ని దక్కించుకొన్నానట! ఐనా, తాను అసూయ చెందటం లేదని చెప్పాడు. పరిస్థితు లాతని కంత సుముఖంగా లేవు. అమెరికాలో కమ్యూనిస్టులమని చెప్పుకొనే వారందరూ కేవలం అవకాశవాదులే. ఏదో విధంగా పదుగురిదృష్టి నాకర్షించాలనే కాంక్ష గలవారే. కెరెన్‌స్కీ ని ఆదర్శప్రాయంగా చిత్రించిన మహనీయులే హఠాత్తుగా బోల్షివిక్కులుగా రంగసమార్చారు. వీరిలో చాలమంది నిన్నటివరకు క్రమశిక్షణలేని సైన్యాలతో కుట్రల విధానం అనుసరిస్తున్న లెనిన్‌ను తీవ్రంగా విమర్శించారు; కొందరు సిద్ధాంత రాద్ధాంతాల్లో కాకలు తీరినవారు; బాహాబాహి పోరాటానికి పదిమైళ్ళదూరంలో నిలబడతారు; కాని అవకాశం లభిస్తే వెన్నులో పొడవటానికి సమర్థులు!

తిరుగులేని అమెరికన్ కమ్యూనిస్టు నాయకుడుగా, జాన్‌రీడ్ జగమెరిగిన బ్రాహ్మణుడు! కాని అతని మాటలు నాకాశ్చర్యాన్ని కలిగించినై. అతడు వర్ణించినంత దుస్సహంగా ప్రవర్తించే వారుంటారా, అనే నా అనుమానం. అతని మాటల్లో ద్వేషం ఏమాత్రం ధ్వనించలేదు; అది, కేవలం ఆగ్రహం చెందిన అమాయకత్వమే!

జాన్ రీడ్ మంచి పొడవరి; దృఢమైన దేహం; అందమైన ముఖం; స్నేహపాత్రమైన స్వభావం; అతని భార్య చెప్పినట్లాతనిలో ఏదో మంత్రశక్తి ఉందనిపించింది. లూసీని కలుసుకున్నానని చెప్పినప్పుడు చాల సంతోషించాడు. తాను మాస్కో రాలేదని బహుశా ఆమెకు కోపం వచ్చి ఉండవచ్చునన్నాడు. ఏనా ఇంకా రెండు రోజుల పాటతడు లెనిన్‌గ్రాడులోనే ఉండాలట! మహాసభ ప్రారంభానికి జినోవీవ్‌తో కలిసి మాస్కో వస్తానన్నాడు. కాకతాళీయంగా "ఫ్రెయినాను కలుసుకున్నావా?" అని అడిగాడు. "ఔను"ని సమాధానం చెప్పాను. హృదయ పూర్వకంగా కరస్పర్శచేసి, భుజంమీద తట్టాడు. ఆ రెండూ కొంచెం నాకు నొప్పి కలిగించినమాట వాస్తవమే! అదే విప్లవ నాటకంలోని, ఒక ఉపనాయకునితో నా ప్రథమ సమావేశం!

## ఫ్రెయినా

జాన్‌రీడ్ రచించిన "ప్రపంచాన్ని కదిలించిన పదిరోజులు" (Ten days that shook the world) అనే గ్రంథంద్వారా జాన్‌రీడ్ అమెరికన్ కమ్యూనిజానికి నాయకత్వం సాధించాడు. కాని అతనికి వ్యవస్థాపక దక్షతలేదు; మార్క్సిస్టు సిద్ధాంతములో కూలంకషమైన పాండిత్యమూలేదు; వాస్తవానికి సంయుక్తరాష్ట్రాల్లో బాల్య దశలో ఉన్న కమ్యూనిస్టు ఉద్యమానికి రీడ్‌కంటె సమర్థుడైన నాయకుడవసరం. అందుకు 'నేనే తగినవాణ్ణి' అనేవాడు. లూయీ ఫ్రెయినాకాని, రీడ్‌ను త్రోసిరాజనటానికి ఫ్రెయినాకేమాత్రం అవకాశం కల్పించలేదు. రష్యన్లుకూడా రీడ్‌నే బలపరచేవారు; అందుకు కారణం పత్రికా రచనలద్వారా, రీడ్ విప్లవానికి అపారమైన సేవ చేస్తున్నాడు. మాస్కోలో కలిగిన ఈ అనుభవం ఫ్రెయినాకు నిరుత్సాహకరమైంది; సహజంగానే నిదానస్థుడు; పట్టించుకొనే స్వభావంకాదు. ఇన్ని కారణాల వల్ల మహాసభచర్చల్లో ఫ్రెయినా శ్రద్ధవహించలేక పోయినాడు.

నేను తిరిగి మెక్సికోవెళ్ళే అవకాశంలేదు. కాని అక్కడ అసంపూర్తిగా విడిచివచ్చిన కార్యక్రమాన్ని కొనసాగించగలవ్యక్తిని అన్వేషిస్తున్నాను. ఫ్రెయినా, అందుకు తగినవాడని భావించాను; బొరోడిన్ నాభావాన్ని బలపరచాడు. ఫ్రెయినా కూడా అవకాశంవచ్చేవరకూ, సంయుక్తరాష్ట్రాలకు వెలుపలనే గడపాలనుకుంటున్నాడు. అందుచే మహాసభ ముగిసినవెంటనే ఫ్రెయినాను మెక్సికోకు పంపాము; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు అనుబంధంగా లాటిన్ అమెరికన్ బ్యూరోను స్థాపించి, నడపటమే అతని కార్యక్రమం.

రెండవ ప్రపంచ మహాసభానంతరం నేను మధ్యాసియాకు వెళ్ళటంతో పశ్చిమ రాజ్యాల్లో జరిగే సంఘటలకు దూరమైనాను. 1922 మధ్యలో ఐరోపాకు తిరిగివచ్చిన వెంటనే మెక్సికోలో ఫ్రెయినా కార్యక్రమాన్ని గురించి తెలిసికొన ప్రయత్నించాను.

అతడు సంయుక్తరాష్ట్రాలకు వెళ్ళినట్లు తెలిసిందిగాని ఎక్కడ ఉంటున్నదీ తెలియలేదు. కమ్యూనిస్టులు రేచుకుక్కల వంటివారు; తమ ప్రత్యర్థులను తరిమి తరిమి హతమార్చే వారు; ఫ్రెయినా అదృశ్యం కావటానికి, ఆ సాంప్రదాయమే కారణం. కమ్యూనిస్టు నాయకత్వంలో మేధావులు నశించటానికి కూడా ఇదే కారణం!

జాన్ రీడ్ 1921 లో రష్యాలో మరణించాడు. వెంటనే, అమెరికా కమ్యూనిస్టు నాయకత్వాన్ని వశపరచుకొనే ఆశతో ఫ్రెయినా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళాడు. కాని ఒక ప్రమాదం ఏర్పడింది. మొదట, ఫ్రెయినా, ప్యాస్‌పోర్టుతో రష్యా వెళ్లాడు, అందుచే ఇప్పుడు బహిరంగంగా సంయుక్తరాష్ట్రాల్లో ప్రవేశించటం సాధ్యంకాక రహస్యంగా ఉండాల్సి వచ్చింది. ఇది ఇలా ఉండగా మెక్సికోనుండి డబ్బుతో పారిపోయినాడని కమ్యూనిస్టులు ఫ్రెయినాను నిందింపసాగారు. అందులో యదార్థం లేదు; కేవలం ద్వేషంతో అల్లిన కథ. కమ్యూనిస్టుపార్టీతో చెలరేగిన ముఠా కలహాల్లో సృష్టింపబడి ప్రచారం చేయబడిన కట్టుకథ. ఫ్రెయినా చేసిన తప్పంతా, మాస్కో అనుమతి పొందకుండా మెక్సికో విడిచి పెట్టటమే. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రాజధానిలోని ఉద్యోగి బృందాలు ఫ్రెయినా చర్యను నిరసించారు. సమయం కనిపెట్టి ఫ్రెయినా విరోధులు అతనిపై కట్టుకథలు ప్రచారం చేశారు. ఆ కట్టుకథలను మాస్కో పూర్తిగా విశ్వసించింది. ఈ అనుభవాలతో ఫ్రెయినాకు తలపట్టింది; దానితో అమెరికా కమ్యూనిస్టు ఉద్యమం ఒక సమర్థుడైన నాయకుణ్ణి కోల్పోయింది. తరువాత, లూయిస్ కోరే అనే మారుపేరుతో ఫ్రెయినా, ఆర్థిక శాస్త్రంమీద పెక్కు రచనలు ప్రచురించి తన బుద్ధి నైశిత్యాన్ని రుజువు చేసి కొన్నాడు. ఐతే నైతికంగా తన ప్రవర్తన నెట్లు సమర్థించుకొన్నాడో తెలియదు. మరి కొంతకాలం ఉత్తమస్థాయిలో ఒక విద్యాసంస్థ నడుపుతున్న పత్రికకు సంపాదకత్వం వహించాడు. తరువాత ఫ్రెయినా, ఒక కార్మిక ఉదార సమాజానికి (Working men's Benevelent Association) డైరక్టరుగా పని చేసాడు.

## సిల్వియా పాన్‌క్‌హర్స్టు

"వామపక్ష కమ్యూనిజం" అనే లెనిన్ కరపత్రమూ, జినోవివ్ ప్రకటించిన "ఇరువదిరెండు షరతులు". అనే రెండు విషయాలపైనే మహాసభలో తీవ్రమైన చర్చలు, వాదోపవాదాలూ జరిగినై. జర్మన్, ఇటాలియన్, ఫ్రెంచి ప్రతినిధివర్గాలు తమదృష్టిని రెండవఅంశంమీదనే కేంద్రీకరించారు. వీరిలో సోషలిస్టుపార్టీల సభ్యులు కూడా ఉన్నారు. ఇంటర్నేషనల్ లో చేరితే, ఆ షరతులవల్ల తమ పార్టీల స్వాతంత్ర్యం కోల్పోగలవనే భావంతో ఆ షరతులను వారంతా ఖండించారు. ఇక బ్రిటిష్, అమెరికన్, స్పానిష్ ప్రతినిధులు లెనిన్‌కరపత్రాన్ని గురించి చర్చించారు. వీరిలో చాలామంది వామపక్షీయులు. ఆ కరపత్రంలో వామపక్షకమ్యూనిజాన్ని

"బాలారిష్టం"గా వర్ణించాడు లెనిన్. అందుచే వామపక్షీయులు, మహాసభలో ఉపన్యాస వర్షం కురిపించారు. వీరందరిలో బాగా రాణించినది సిల్వియాపాన్‌ఖర్‌స్టు. ఈమె తండ్రి సుప్రసిద్ధ బ్రిటిష్ రాజకీయవేత్త. వయోజన వోటు ఉద్యమానికి నాయకత్వము వహించాడు. మహాసభ ప్రారంభమైన కొన్నిరోజుల తర్వాత సిల్వియా మాస్కో చేరింది. ఇక కాలహరణం ఇష్టంలేక, స్టేషన్‌నుండే యెకాయెకిని క్రెమ్లిన్‌కి వచ్చింది. వచ్చీరావటంతోనే మాట్లాడటానికి అవకాశం కోరింది. అధ్యక్షస్థానంలో జినోవీవ్ ఉన్నాడు. బహుశా మర్యాదకై వెంటనే ఆమె కోరికను మన్నించాడు.

సిల్వియావయస్సు ముప్పదియైదుసంవత్సరాలు లోపుగా ఉంటుంది. అంత పొడవరికాదు, పొట్టికాదు, మధ్యస్థం; సన్నగా నాజూకైన విగ్రహం. బూర్జువావర్గంలో జన్మించింది. ఐనా శ్రామిక విప్లవకారులలో మంచి ఆవేశంగల వ్యక్తి. అందుచే పార్లమెంటరీ విధానాన్నిగానీ, మరేవిధమైన సంస్కరణ విధానాన్నిగానీ యేమాత్రం సహించేదికాదు. ఆమెది కత్తిలేని శ్రామికవర్గ వాదం. మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన కొన్నిరోజులవరకూ, బ్రిటిష్ కార్మికులలో కొన్నివర్గాలు సిల్వియావాదాల్ని అభిమానించేవారు. వీరిదృష్టిలో లెనిన్ అనుసరిస్తున్నది కేవలం 'నిర్జీవ సంస్కరణ వాదం' (Senile Reformism). సిల్వియా రెండవ ప్రపంచ మహాసభకు హాజరు కావటంలో ఉద్దేశ్యం లెనిన్ 'నిర్జీవ సంస్కరణ వాదాని'కి ప్రతిగా వామపక్ష కమ్యూనిస్టుల 'బాలారిష్టాన్ని' సమర్థించటమే! సిల్వియా వేదికనెక్కి, ఉపన్యసించే సమయంలో లెనిన్ ఉపన్యాసకులలోనే ఉన్నాడు. ఆమె వక్తృత్వానికి ఆశ్చర్య పోయినాడు. నేరారోపణ చేస్తున్నధోరణిలో, చూపుడు వేలును పదేపదే లెనిన్‌పై గురిపెట్టి ఉపన్యాసం సాగించింది సిల్వియా. అధ్యక్షుడు గంట మ్రోగించాడు, ఆమెకిచ్చిన కాలపరిమితి సమీపించిందని సూచిస్తూ. సిల్వియా లక్ష్యం చేయులేదు. మూడవ మారు గంట కొట్టటానికై జినోవీవ్ నిలబడ్డాడు. సిల్వియా ఆతనివైపు తిరిగి "ఇదేం బూర్జువా పార్లమెంటు కాదు; నాయిష్టం వచ్చినంతసేపు మాట్లాడతాను" అన్నది సాధిస్తున్న ధోరణిలో. జినోవీవ్‌కు కోపం వచ్చింది. కాని ప్రయోజనం? లెనిన్‌గ్రాడ్ నియంత పరాజయాన్ని అంగీకరించక తప్పలేదు! కుర్చీలోకి ఒదిగి పోయినాడు. సభికు లాహ్లాదంగా నవ్వుతూ హర్షధ్వానాలు చేశారు. దానితో సిల్వియాకు కోపం ఆవేశించింది. పల్చని ఆమె ముఖం కందగడ్డగా తయారైంది; విరబోసినట్లుగా జుట్టు బుజాలపై ఆవరించింది. తిరిగి ఉపన్యాసాన్ని ప్రారంభించింది; కాని ఆవేశం వల్ల నరాల పటుత్వం తప్పినదనుకుంటాను; వేదిక మెట్లమీద పడపోవలసించే, కాని లెనిన్ పట్టుకొని తన ప్రక్కనే కుర్చీలో కూర్చోపెట్టాడు. సభికుల దృష్టి మరల్చటానికై, కార్యక్రమం కొనసాగించవలసిందిగా లెనిన్ సలహా యిచ్చాడు. జినోవీవ్ తరువాతి ఉపన్యాసకుని పిలిచాడు. కొన్ని క్షణాలు గడిచిన తర్వాత ప్రక్కవాకిలి గుండా సిల్వియాను హాలు బైటికి తీసుకువెళ్ళాడు లెనిన్.

మహాసభ పూర్తిగాక పూర్వమే సిల్వియా వెళ్ళిపోయింది. మహాసభలో ఆమెను తీరని ఆశాభంగం కలిగింది. తరువాత ఆమె కమ్యూనిస్టు పార్టీలో చేరనే లేదు. అంగడి పనివాండ్ర ఉద్యమ నాయకులైన టామ్‌మాన్, విల్లీగల్లేషర్, జె. టీ. మర్ఫి, జాల్‌టర్నర్ మొదలైన వారందరూ అరాజక సిండికలిస్టువాదులు. వీరైనా క్రమంగా సాత్వికులైనారు, కాని సిల్వియా మారలేదు. వీరిలో గల్లేషర్ మహాసభకు హాజరైనాడు; అతనికీ ఆశాభంగమే కలిగింది కాని చివరవరకూ ఉన్నాడు. తరువాత, పార్లమెంటుకు పోటీచేసి, పలుమార్లు ఓడిపోయి చివరకు ఎలాగో గెలిచాడు. సిల్వియా మాత్రం పేరూ ఊరూలేని చిన్న చిన్న ఉద్యమాలను నడపటంతో సంతృప్తి చెందింది. క్రమంగా, చిన్నతనంలోనే, సిల్వియా విస్మృతి పథంలో పడిపోయింది. సిల్వియా జీవితం కూడా రెండువైపులా మండిన కొవ్వువత్తి! ఆమె ఆవేశమే ఆమె జీవితాన్ని పూర్తిగా దగ్ధం చేసింది. సిల్వియా వంటి ఆవేశపరులు చాలమంది మహాసభకుహాజరైనారు. వారుకూడా ఆశాభంగంతో ఆగ్రహంతో మరలిన వారే. ఆదర్శరాజ్యం (Utopia) అసంభవమనే సత్యాన్ని గ్రహించటమే వారి ఆశాభంగానికి కారణం!

ఐరిష్ కార్మిక నాయకుడైన జిమ్‌లార్కిన్ కూడా ప్రేక్షకులను బాగా ఆకర్షించినవాడే! ఈతనికి ఏదైనా సిద్ధాంతమనేది ఉంటే, అది అరాజక సిండికలిస్టువాదమే. కమ్యూనిస్టు పార్టీలో చేరిన తరువాత కూడా లార్కిన్ తన వాదాన్ని విడిచిపెట్టలేదు. ఇతడు కూడా లెనిన్ అనుసరిస్తున్న బోల్షివిక్ సంస్కరణవాదాన్ని ఖండించి శుద్ధ శ్రామికవాదాన్ని అభిమానించాడు. కాని అతని వాదాన్ని శ్రద్ధగా ఆలకించినవారే లేరు. లార్కిన్ ఆజానుబాహు విగ్రహం; అతని కంఠస్వరం మేఘగర్జనమే. వాస్తవానికి అతనిలో కండపుష్టి హెచ్చు; బుద్ధిబలం శూన్యం ఇటువంటి వారు, అంటే బుద్ధిబలం లేనివారు, ఆరోజుల్లో కమ్యూనిస్టు ఉద్యమంలో రాణించేవారేకాదు. ఐరిష్ ప్రతినిధివర్గంలో జిమ్ కూడా ఉన్నాడు. ఈతని తండ్రి జిమ్‌కోన్ గర్లీ ఆత్మార్పణం చేశాడు. అతని కుమారుడుగా జిమ్ కొంత గౌరవాన్ని పొందాడు. ఇక మూడవవాడు "బ్లాక్ అండ్ టాన్" దౌర్జన్యవాద ఉద్యమంలో కాళలుతీరిన వాడు. అతడు చెప్పిన సాహసకృత్యాలకు ఒళ్ళు పులకరించేది. జాతీయ, వలస ప్రజా సమస్యపై జరిగిన చర్చలో చాల బాగా మాట్లాడాడు. రహస్యంగా వ్యవహరిస్తున్న ఐరిష్ రిపబ్లికన్ సైన్యాన్ని, బూర్జువా సీన్‌ఫీన్ ప్రభుత్వంపై రైతు విప్లవంగా రూపొందించవచ్చునని వాదిస్తూ ఉండేవాడు.

## వలస విధానంపై లెనిన్‌తో విభేదం

ఐరోపాలోని అభివృద్ధి నిరోధకశక్తులకు తరతరాలనుండీ పెట్టనికోటగా నున్న ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యాన్ని విచ్ఛిన్నం చేసే ఉద్దేశ్యంతో, వుడ్రో

విల్సన్ 'పరాధీన జాతులకు స్వయం నిర్ణయాధికారం' అనే సూత్రాన్ని ప్రతిపాదించినాడనీ, వర్సైయిల్సు సంధి ఆ సూత్రాన్ని అమలు జరిపిందనీ సాధారణంగా ప్రచారంలో ఉన్న భావం. 1914 - 18 యుద్ధానికి చాల పూర్వమే, ఈ ప్రజాస్వామ్య సూత్రాన్ని, బోల్షివిక్ పార్టీ ప్రణాళికలో లెనిన్ పొందుపరచాడనే విషయం చాల తక్కువమందికే తెలుసు. అధికారంలోకి వచ్చిన వెంటనే, లెనిన్ ఈ సూత్రాన్ని అమలు జరిపాడు. అంటే జారిస్టు సామ్రాజ్యంలో అణచివేయబడిన చిన్న జాతులకు సోషలిస్టు రిపబ్లిక్ నుండి విడిపోగల హక్కు ప్రసాదింపబడింది. తత్ఫలితంగా పోలెండ్, బాల్టిక్ రాజ్యాలు యేర్పడినై. వీని జన్మకారణం రష్యా రైతు కార్మిక ప్రజారాజ్యమే. కాని పుట్టినప్పటినుండీ ఈ రాజ్యాలు రష్యా ప్రక్కలో బల్లెములాగా తయారైనై. జర్మనీ పరాజయానంతరం కూడా, జర్మన్ సైన్యాలు క్రొత్తగా నేర్పడిన బాల్టిక్ రాజ్యాల్లో నిలిచి ఇటు ప్రక్క రష్యాలో, అటు జర్మన్ రిపబ్లిక్‌లో జోక్యం కలిగించుకొనటానికి సోపానాలుగా ఉపయోగింపసాగినై. జర్మన్ బాల్టిక్ సైన్యం విచ్ఛిన్నమై ఆ సేనాపతుల అధికారం అంతరించిన తరువాత, బాల్టిక్ రాజ్య ప్రభుత్వాలపై, రాజకీయంగా, ఆర్థికంగా మిత్రమండలి రాజ్యాలు తమ ప్రాబల్యాన్ని నెలకొల్పారు. తత్ఫలితంగా క్రొత్త జాతీయరాజ్యాలు సోవియట్ వ్యతిరేక ప్రచారానికి కేంద్రాలైనై. ఫ్రెంచి పోషణతో సమైక్య పోలెండ్ అగ్రరాజ్య హోదా పొందటానికి ప్రయత్నించటమేగాక, బోల్షివిజం వ్యాధి వ్యాపించకుండా కట్టిన కంచు కోటకు సైనికంగా కీలక స్థానమైంది.

రష్యన్ సామ్రాజ్యంలోనూ, ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యంలోను అణగారి పోతున్న చిన్న జాతుల స్వాతంత్ర్య ఉద్యమాలతో సోషలిస్టులు సహకరించాలని, విప్లవానికి పూర్వం లెనిన్ ఉద్ఘాటించాడు. కాని ఆ రాజ్యాల్లోని సోషలిస్టులు లెనిన్ వాదాన్ని ప్రతిఘటించారు. "ఈ రాజ్యాల్లోని జాతీయ బూర్జువా వర్గం రష్యా నుండి విడిపోవాలనే ఉద్యమాన్ని సాగిస్తున్నది; అందుచేత బూర్జువావర్గం నడిపే జాతీయ ఉద్యమానికి శ్రామికవర్గ సహకార సానుభూతులు లభింపవు." అని వారి వాదన. ఈ సమస్యపై బోల్షివిక్ పార్టీలో చిరకాలంగా వివాదం జరుగుతూనే ఉంది. విప్లవానంతరం కూడా పోలెండు, బాల్టిక్ రాజ్యాలలోని ప్రముఖ సోషలిస్టులు లెనిన్ వాదాన్ని వ్యతిరేకిస్తూనే ఉన్నారు; పరాధీన జాతులకు స్వయం నిర్ణయాధికారాన్నీయటం ద్వారా, వారి మాతృదేశాలకు అపూర్వ సాంఘిక విప్లవ లాభాలను లేకుండా సోవియట్ ప్రభుత్వం చేస్తున్నదనీ, మిత్రరాజ్యాల సహాయంతో ఈ రాజ్యాల్లో రాజకీయ ఆర్థిక అధికారాన్ని గుత్తకొన్న ప్రతీపగామి జాతీయ బూర్జువావర్గ దోపిడీ విధానానికి శ్రామికవర్గం గురిచేయబడుచున్నదనీ ఆరోపించారు. నిజానికి వీరి భయాలు యదార్థమేనని అనుభవం వల్ల రుజువైంది. కాని లెనిన్‌లోని "సనాతనవాది" తప్పులను అంగీకరించడు! మార్క్సు, ఏంగెల్సులు, హంగెరీ,

పోలెండులలోని జాతీయ ఉద్యమాలను ప్రోత్సహించినారు గదా! వారి సాంప్రదాయాలనే వారి శిష్యులు కూడా గౌరవించాలి; కాని ఒక విశేషం. లెనిన్ కేవలం తత్వవేత్తగానే వ్యవహరించినా డనుకోవటం పొరపాటు. అతడు కార్యశూరుడైన రాజకీయవాది. ఆతని చర్యలో అవకాశవాదం, వైదేశిక నీతి స్ఫుటంగా కనిపిస్తై. సోవియట్ ప్రభుత్వం, ఊపిరిపలుపుకొనటానికై జర్మన్ సైనికాధికారులు చెప్పినట్లు బ్రెస్ట్‌లిటావ్‌స్కీ సంధి చేసికొనక తప్పిందికాదు. నాటికి పోలెండ్, బాల్టిక్ రాజ్యాలు జర్మన్ ఆక్రమణలోనే ఉన్నై. అట్టి పరిస్థితిలో వాని స్వయం నిర్ణయాధికారాన్ని గుర్తిస్తే, సోవియట్ ప్రభుత్వానికి పోయేదేమీ లేదు. ఇందుకు వ్యతిరేకంగా వ్యవహరించటమే కేవలం సిద్ధాంత దాస్యం. అది సోవియట్ ప్రభుత్వానికి ప్రమాదకరంగా పరిణమించేది. అనగా సంధి సంప్రదింపులు విఫలమై, రష్యాపై జర్మనులు దండెత్తేవారు. పసితనంలో ఉన్న సోవియట్ ప్రభుత్వం జర్మన్ దండయాత్రకు తట్టుకోగలిగేది కాదు.

జాతీయ, వలస ప్రజాసమస్యలపై లెనిన్ సిద్ధాంతం ప్రాత విధానాన్ని సమర్థించింది. "వలస ప్రజల విముక్తికి అనుసరించే విధానం ఐరోపాలో కమ్యూనిస్టులు అనుసరించే విధానానికి అనుగుణంగానే ఉండాలి", అనే నిర్ణయాన్ని రెండవ ఇంటర్నేషనల్‌లో బోల్షివిక్కులు ప్రవేశపెట్టారు. పశ్చిమ ఐరోపా సామ్రాజ్యవాద దేశాల్లోని సోషలిస్టుల కిది నచ్చలేదు. వీరు, 19వ శతాబ్దపు లిబరలిజం సాంప్రదాయాలకు వారసులు; అందుచే పరాధీన ప్రజల జాతీయాశయాలపట్ల సానుభూతి వహించారు; కాని మాతృదేశంలోని శ్రామికవర్గ ఆర్థికాభివృద్ధికి వలసరాజ్యాల విస్తరణయే కారణమనే సత్యాన్ని విస్మరింపలేక పోయినారు. అందుచేత, సామ్రాజ్యంలో భాగాలుగానే పరాధీనజాతులకు స్వీయపరిపాలనాధికార మీయాలని వాదించారు.

1907లో ఆమ్‌స్టర్‌డామ్‌లో జరిగిన అంతర్జాతీయ సోషలిస్టు మహాసభకు జపాను సోషలిస్టైన కాటయామా, ఇండియా సోషలిస్టైన మదాంకామా హాజరైనారు. నాటినుండి ఐరోపాలో ప్రముఖ సామ్రాజ్యవాద రాజ్యాలైన బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండులలోని సోషలిస్టులు వలస ప్రజల జాతీయ ఆశయాలపట్ల సానుభూతిని ప్రకటిస్తూ, ఆ దేశాల్లో క్రమక్రమంగా, శాంతియుతంగా స్వపరిపాలనను ప్రవేశపెట్ట వలెనని వాదింపసాగారు. బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకులైన కీర్ హార్డీ, మార్డొనెల్‌లు సుహృద్భావాన్ని కల్గించటానికై భారతదేశం సందర్శించి, తమ ప్రభుత్వ ఆగ్రహానికి గురియైనారు. వలసల పరిపాలనను సంస్కరించి తీరాలని, మాతృదేశ శాసనసభలలో (Parliaments) సోషలిస్టు సభ్యులు వాదించారు.

ఐతే, పశ్చిమ ఐరోపా సోషలిస్టుల పంథాను రష్యన్ బోల్షివిక్కులు ఖండించారు. వారు, సంస్కరణవాదంతో వలసవిధానాన్ని, సమర్థిస్తున్నారని రష్యా

ఆరోపణ. 1914 లోనే యుద్ధం ప్రారంభించేముందు లెనిన్ ఒక కరపత్రాన్ని ప్రచురించాడు. "మార్క్స్ చెప్పిన జాతకం ప్రకారం, ఐరోపాలోని బూర్జువావర్గం తప్పనిసరిగా కూలిపోవాలి; వలసరాజ్య విస్తరణ, ఆ పతనాన్ని ఆలస్యం చేసింది." అని ఆ కరపత్రంలో వివరించాడు. సోషలిజం ప్రవక్తప్రకారం, పెట్టుబడిదారీ విధానం శ్రామికులను పూర్తి దరిద్రులనుగా చేయాలి; కాని ఆ విధంగా జరుగలేదు. మార్క్స్‌పట్ల ఎంతటి గౌరవమున్నా, బుజు, శాస్త్రీయ దృక్పథంగల చరిత్రకారులెవ్వరూ ఆ పరిణామాన్ని నిర్లక్ష్యం చేయలేరు. ఈ పరిణామమే ఎడ్వర్డ్ బెరన్‌స్టీన్ 'తిరగదోడే విధానానికి' (Revisionism) కారణమైంది. కాటస్కీ, హిల్‌ఫర్డింగ్‌లు నియంతృత్వ సూత్రాన్ని తిరస్కరించటానికికూడా అదే కారణం! రోజా లగ్జెంబర్గ్ వ్రాసిన 'పెట్టుబడి పెరుగుదల' (Accumulation of Capital) అనే గ్రంథంలోకూడా సిద్ధాంతరీత్యా సంస్కరణవాదమే కనిపిస్తుంది. ఆమెకూడా నియంతృత్వ భావాన్ని తిరస్కరించింది. లెనిన్ ప్రతిపాదించిన విప్లవశిక్షణ కార్యక్రమాన్ని, ముఖ్యంగా సార్వకాలిక విప్లవకారులతో, కేంద్రీకృత వ్యవస్థగా పార్టీని రూపొందించాలనే విధానాన్ని లగ్జెంబర్గ్ తీవ్రంగా ఖండిస్తూఉండేది.

ఐనా, మార్క్సిజం దోషరహితమేననీ, 'తిరగతోడే విధానానికి', సామ్రాజ్యవాద దేశాల్లో తయారైన 'శ్రామిక ధనికవర్గమే' (Proletarian aristocracy) కారణమనీ, లెనిన్ వాదించేవాడు. "శ్రామిక ధనికవర్గం" విప్లవ వ్యతిరేక సాంఘిక శక్తిగా తయారైంది. ఈ పరిణామాన్ని మార్క్స్ ఊహించలేదు. ఐతే దీనికి కారణం వలసరాజ్య విస్తరణే! వలసరాజ్యాల్లో ప్రజానీకాన్ని దోపిడీచేయటంవల్ల అధికలాభం (Super - Profit) లభ్యమైంది. తక్కువ వేతనాలకు కూలీలు లభించే ఈ వలసరాజ్యాలకు పెట్టుబడి ఎగుమతిచేయటంద్వారా, మాతృదేశంలోకంటె అక్కడ విశేషలాభాలు పొందవచ్చు. ఈ అధికలాభాల్లో కొంతభాగాన్ని మాతృదేశ శ్రామికవర్గంలో ఉన్నతస్థానాల్లోనున్న నాయకులకు పంచిపెట్టారు. వీరే శ్రామిక ధనికవర్గంగా తయారై సామ్రాజ్య విస్తరణను బలపరచారు. ఈ పరిణామాలను గుర్తించియే "ఐరోపాలో పెట్టుబడిదారీ విధానం కూలిపోవటానికి, వలసప్రజల (జాతీయ) విప్లవాలు విజయవంతం కావాల"ని లెనిన్ సిద్ధాంతీకరించాడు; ఆ సిద్ధాంతం ప్రకారం ప్రపంచ విప్లవం ఎత్తుగడలో, వలసప్రజల జాతీయస్వాతంత్ర్య ఉద్యమాలను బలపరచటమనేది ప్రధానాంశమైంది. ఈ దృక్పథమే జాతీయ వలసవిధానాలపై లెనిన్ వ్రాసిన వ్యాసంలో వివరింపబడింది. రెండవ ప్రపంచ మహాసభకు తన వ్యాసాన్ని నివేదిస్తూ "ఆసియా, ఆఫ్రికాల పీడిత ప్రజానీకానికి ప్రాతినిధ్యంలేని రెండవ సోషలిస్టు ఇంటర్నేషనల్, అంతర్జాతీయసంస్థ అనిపించుకోనదు" అని ప్రకటించాడు. ఐరోపాకు వెలుపలనున్న దేశాల్లో, జాతీయ విప్లవోద్యమాలను ప్రోత్సహించటం - అనే అంశాన్ని కార్యక్రమంలో చేర్చినప్పుడే, మూడవ ఇంటర్నేషనల్ వాస్తవమైన

ప్రపంచసంస్థ కాగలదు; అప్పుడే ప్రపంచ విప్లవానికా సంస్థ సైనికోద్యోగిబృందంగా రూపొందుతుంది.

సిద్ధాంతరీత్యా లెనిన్ వ్యాసం బాగా నే ఉంది. ఆపై మెరుగులు నాకూ నచ్చినై. కాని ఆ సిద్ధాంతంపై జరిగే ప్రచారంవల్ల, సామ్రాజ్యవాద దేశాలలోని సోషల్ డెమొక్రాటిక్ నాయకత్వమూ, కార్మికసంఘాల్లోని ధనికవర్గమూ బలహీన పడే అవకాశముంది. ఐతే, లెనిన్ ప్రకటనవల్ల కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆసియా, ఆఫ్రికా రాజ్యాల్లో ప్రజాభిమానం పొందుతుంది. సిద్ధాంతరీత్యా ఎంత సమంజసంగా ఉన్నా, లెనిన్ కార్యక్రమాన్ని అనుసరించటంలో పెక్కు ప్రతిబంధకాలు రాగల వని నా భయం. వలసదేశాల్లోని జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని ఇంటర్నేషనల్ ఏ విధంగా బలపరచగలదు? అనేదే ప్రధాన సమస్య. ఇది సాధన పదుపాయాలను గురించిన సమస్య. రెండవ ఇంటర్నేషనల్ నిర్ణయాలు కేవలం ఉబుసుపోకకు చేసినవి కానక్కరలేదు; కాని ఆ నిర్ణయాలను అమలు జరపటాని కవసరమైన సాధన సంపత్తి ఇంటర్నేషనలుకు లేదు. ఈ విషయంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పరిస్థితిని ఆలోచిద్దాం; దీన్ని స్థాపించినది రష్యన్ బోల్షివిక్ పార్టీ; రష్యా అపార సహజసంపద అంతా బోల్షివిక్ పార్టీ అధీనం; అందుచే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నిర్ణయాల వెనుక, వానిని ఆచరణలో పెట్టగల దార్ఢ్యత ఉంది. "ప్రపంచ విప్లవాన్ని సాధించటానికై, కనీసం ఒక దేశసంపదనైనా అందుబాటులోకి తెచ్చింది రష్యా విప్లవం" అంటూ రష్యా విప్లవ చారిత్రక ప్రాశస్త్యాన్ని గురించి లెనిన్ ఉద్ఘాటించాడుగదా! మరొక ప్రకటన గూడా చేచాడు లెనిన్: "ఇతరులకంటె ముందుగా అధికారాన్ని వశపరచుకొన్న రష్యా శ్రామికవర్గం, పీడిత ప్రపంచ ప్రజానీకాన్ని ఉద్ధరించటానికై, ఆత్మబలిదానంచేసే సదవకాశాన్ని సాధించింది." ఇప్పటికే పెట్టుబడిదారీ దేశాల్లో కమ్యూనిస్టుపార్టీ లున్నై; వీటికి సహాయంచేసి, 'సాంఘిక విప్లవ ఆశయానికి మే మంకితం' అనే విశ్వాసాన్ని వలస కమ్యూనిస్టుల్లో కలిగించవచ్చు. కాని వలస రాజ్యాల్లో విప్లవానికి అటువంటి సదుపాయాలేమీ లేవు. ఐనప్పుడు ప్రపంచ శ్రామిక విప్లవంలో భాగంగా వలసల్లో జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాలను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఎలా ప్రోత్సహించగలదు? అనేదే నేను లెనిన్‌ను అడిగిన ప్రశ్న.

నా ప్రశ్నకు లెనిన్ సమాధానం ఏమాత్రం సంతృప్తికరంగాలేదు; వలస రాజ్యాల్లోని సాంఘిక శక్తుల పరస్పర సంబంధాలను గురించి లెనిన్‌కు తెలియ దనిపించింది. మా మొదటి సమావేశంలోనే, తన లోపాన్ని స్పష్టంగా ఒప్పుకొన్నాడు. ఐతే, కేవలం సిద్ధాంతాన్నే, తన వాదానికి ఆధారంగా చేసికొన్నాడు. "సామ్రాజ్యవాదం, వలస దేశాల పురోగతి నరికట్టి, వానిని భూస్వామ్య, సాంఘిక పరిస్థితుల్లో నుండి బైటపడకుండా చేసింది; అంటే వలసలలో పెట్టుబడిదారీ విధానం వికసించటానికి ఆటంకమై, స్థానిక బూర్జువావర్గం ఆశలకు గొడ్డలిపెట్టైంది. ఇక

చారిత్రకంగా జాతీయ స్వాతంత్ర్యోద్యమ మంటే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవమే సమాజపరిణామంలో ప్రతి దశకూడా చరిత్రచే నియతమైంది; కాబట్టి వలసరాజ్యాలు. శ్రామిక విప్లవదశలో ప్రవేశించటానికి పూర్వం బూర్జువా ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించితీరాలి. అందుచేత, వలస రాజ్యాల్లోని బూర్జువా వర్గాన్ని విప్లవాత్మక శక్తిగా అంగీకరించి, వారి నాయకత్వంలో సాగుతున్న జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాభివృద్ధికి కమ్యూనిస్టులు సహాయపడాలి.” అని లెనిన్ సిద్ధాంతం.

ఇండియా వంటి బాగా అభివృద్ధి చెందిన వలసల్లో కూడా ఆర్థికంగా, సాంస్కృతికంగా వర్గ విభజన స్పష్టంగా లేదనీ, భూస్వామ్య సాంఘిక వ్యవస్థ నుండి బూర్జువా వర్గం భిన్నంకాదనీ, అందుచేత జాతీయ ఉద్యమ ఆదర్శాలు అభివృద్ధి నిరోధకాలు; అంటే, జాతీయ ఉద్యమ విజయంతో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవం సాధింపబడదనీ నేను సూచించాను. మా అభిప్రాయ విభేదానికి ఇండియా జాతీయోద్యమంలో గాంధీ నిర్వహిస్తున్న పాత్ర కీలకమైంది. “బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని ప్రోత్సహించి నడుపుతున్నాడు కాబట్టి గాంధీ విప్లవకారుడే” నంటాడు లెనిన్. “రాజకీయంగా గాంధీ విప్లవకారుడుగానే కన్పించవచ్చు; కాని మతానికీ, సంస్కృతికీ సంబంధించిన భావాల్లో, గాంధీ సనాతనవాది; అందుచే సాంఘికంగా గాంధీ ప్రతీపగామి కాక తప్పదు” అని నా వాదన. ఈ సందర్భంలోనే; రష్యాలోని సోషలిస్టు, పాపులిస్టు విప్లవోద్యమాలను గురించి ప్లెఖనోవ్ చేసిన నిర్ణయాలు నాకు బాగా ఉపకరించినై. భారత జాతీయోద్యమంలో ముఖ్యంగా వామపక్షీయులకు, గాంధీవాదులకు రష్యాలోని పైవర్గాలకు పోలిక కన్పించింది. రష్యాలోని పాపులిస్టు, సోషలిస్టు విప్లవకారులకు దౌర్జన్య చర్యలలోనూ, స్లావ్ జాతి ప్రత్యేక ప్రతిభలోనూ విశ్వాసం ఉండేది. పెట్టుబడిదారీ విధానాన్ని “పాశ్చాత్య రాజ్యాల దుర్గుణం” అని నిరసించి, రష్యాలో దానికి అవకాశం లేదనేవారు. ప్లెఖనోవ్ దృష్టిలో వీరు “రాజకీయంగా విప్లవవాదులు, సాంఘికంగా ప్రతీపగాములు”. మార్క్సిజంలో, ప్లెఖనోవ్, లెనిన్ గురువు! అతని అడుగుజాడల్లోనే లెనిన్ ఒక గ్రంథం వ్రాసి అందులో రష్యాలో పెట్టుబడిదారీ విధానం వికసిస్తున్నదనీ విప్లవాత్మక సాంఘిక శక్తిగా ఆ పరిణామం తప్పదనీ వివరించి గురువు ఋణం తీర్చుకున్నాడు! ఆ గ్రంథం తోనే లెనిన్ ప్రజానీకాన్ని ఆకర్షించగలిగాడు.

ప్లెఖనోవును సూచించి, లెనిన్ సిద్ధాంతానికి పునాదులే కదలించాను. సుదీర్ఘమైన చర్చలు జరిపినతర్వాత, నన్నొక వ్యాసం వ్రాయమన్నాడు లెనిన్; కాని, బహిరంగంగా లెనిన్‌ని కాదనటానికి సందేహించాను. మా చర్చలు రహస్యంగా జరిగినై. ప్రతినిధులందరూ గతితార్కికాలలో ప్రజ్ఞావంతుడైన లెనిన్ జ్ఞానాన్ని ధిక్కరించిన ఈ భారతీయయువకుని సాహసాన్ని గురించి గొణగసాగారు. లెనిన్‌పట్లవారి భయభక్తు లటువంటివి! కాని లెనిన్‌మాత్రం నాయందెంతో సహనంతో, దయతో వ్యవహ

రించాడు. అతని ముందు నేనొక విద్యార్థిని; మొట్టమొదట నావాదాన్ని తమాషాగా విన్నాడు. కాని, అనతికాలంలోనే సత్యాన్ని గమనించాడు. నిదర్శనపూర్వకంగా వివరిస్తున్న నా వాదనను కాదనలేకపోయినాడు. నిజానికి, నాజీవితంలో అది అపూర్వమైన మహత్తర అనుభూతి. ఒక ప్రముఖవ్యక్తి నన్ను తనతో సమానంగా గౌరవించాడు; ఆ సహనభావమే ఆతని ఘనతకు మెరుగులు దిద్దింది. వాస్తవానికి నేనొక సాధారణయువకుణ్ణి; నాతో చర్చలో తన అమూల్యకాలాన్ని వ్యర్థం చేసికోవలసిన అవసరం లెనిన్ అంతటివానికేముంది? అట్టి అభిప్రాయమే లెనిన్‌కి కలిగినట్లయితే ఇంటర్నేషనల్ కాంగ్రెసులో మాట్లాడే అవకాశమే నాకు లభించేదికాదు.

చివరకు లెనిన్ ఒక సూచనచేశాడు: వలసప్రజల సమస్యను పరిశీలించటానికై నియమింపబడిన ప్రత్యేకసంఘంలో చర్చ జరిపించవచ్చునట, తన సిద్ధాంతంతోపాటు, నా సిద్ధాంతాన్నిగూడ ఆమోదించవలసిందిగా మహాసభలో తానే ప్రతిపాదిస్తానని చెప్పాడు. నా ఆశ్చర్యానికి అంతులేదు. కాని లెనిన్ సిద్ధాంతానికి ప్రతిసిద్ధాంతంగా కాక, అనుబంధంగా చేర్చమని కోరాను. లెనిన్ సమ్మతిస్తూ, "మనమొక నూతనమార్గాన్ని అన్వేషిస్తున్నాం; అనుభవంతోగాని ఏ నిర్ణయమూ చేయటానికి వీల్లేదు" అన్నాడు. లెనిన్‌తో నేనూ ఏకీభవించానుగాని, "నాకుమాత్రం ఇది క్రొత్తమార్గంకాదు; ఇదే సరియైన మార్గం" అనే భావం నాలో లేకపోలేదు. లెనిన్ సహృదయతవలన నా భావం బలపడింది.

జాతీయ వలస విధానంపై, అనుబంధ సిద్ధాంతాన్ని వ్యాస రూపంలో తయారు చేశాను. రెండు ప్రతులను టైపు చేయించి, ఒక ప్రతిని లెనిన్‌కు స్వయంగా అందజేశాను. శ్రద్ధగా చదివి అక్కడక్కడ కొన్ని పదాలు మార్చవలసిందిగా సూచించాడు; ఆ సవరణలు చేశాను. అధ్యక్షుడుగా తానే, మా రెండు సిద్ధాంతాలను ప్రత్యేక సంఘపరిశీలనకు నివేదిస్తాను అన్నాడు. నా హృదయం తేలికపడింది. లెనిన్, ఒక నూతన మతానికి అర్చక శ్రేష్ఠుడు; ఆతని ముందు నిలబడి, ఆతని విజ్ఞానాన్నీ, అధికారాన్నీ ధిక్కరించటం బాధాకరమైన అనుభూతి!

జాతీయ వలససంఘంలోకూడా చర్చఎంతో శ్రద్ధగాజరిగింది. ఒక్క స్నీవ్‌లిట్ మినహాయించి, మిగిలిన సభ్యు లందరూ, నా సిద్ధాంతాన్ని కేవలం మర్యాదకోసమే లెనిన్ ప్రవేశపెట్టాడనీ, పెద్ద చర్చ లేకుండానే, త్రోసివేయవచ్చుననీ భావించారు. "రాయ్‌తో సుదీర్ఘమైన చర్చలు జరిపిన తర్వాత, నాకు నా సిద్ధాంతంలో సందేహం కలిగింది; అందుచే ఈ రెండు ముసాయిదా సిద్ధాంతాల సమన్వయమే, సిద్ధాంతరీత్యా సమర్థనీయమూ, ఆచరణ సాధ్యమూ ఐన ఋజుమార్గానికి చేరువగా ఉంటుందనే ఉద్దేశ్యంతోనే, ఈ రెంటినీ జోడించి పరిశీలించవలసిందిగా ప్రతిపాదిస్తున్నాను." అని లెనిన్ ప్రకటించటంతో సభ్యుల్లో కలవరం ప్రారంభమైంది.

ఆ సంఘంలో లెనిన్‌గాక మరొక రష్యా సభ్యుడు జార్జి సఫరావ్. లెనిన్ సూచనపై ఆ సంఘానికి ఉపాధ్యక్షుడుగా నన్ను ఎన్నుకోవాలని సఫరావ్ ప్రతిపాదించాడు. అందుకు నేనంగీకరించక, స్నీవ్‌లిట్‌ను ఉపాధ్యక్షుడుగానూ, సఫరావ్‌ను కార్యదర్శిగానూ ప్రతిపాదించాను; నా ప్రతిపాదనను బలపరిచాడు లెనిన్.

స్నీవ్‌లిట్, సఫరావ్ లిద్దరూ తమ పదవులకు తగినవారనీ, సమర్థులనీ రుజువు చేసికొన్నారు. ఐరోపా కమ్యూనిస్టు లందరిలో, తూర్పుదేశాల జాతీయోద్యమాలను గురించి తెలిసినవాడు స్నీవ్‌లిట్ ఒక్కడే; తూర్పు ఇండియా దీవుల్లో కొంతకాలం గడిపి, అచటి శ్రామికోద్యమాభివృద్ధికి స్వయంగా తోడ్పడినవాడు. నాటికి వలస రాజ్యాల్లో మరెక్కడా సోషలిస్టుపార్టీ లేదు. ఈ ప్రత్యక్షానుభవమే గాక, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అర్థం చేసికొన్నవాడు స్నీవ్‌లిట్. అందుచే చర్చల కాతడు చేసిన సేవ అమూల్యం. ఈ చర్చల ఫలితంగా ప్రతినిధి వర్గాలలో ఆతని గౌరవ ప్రతిష్ఠలు ఇనుమడించి ప్రముఖ ప్రతినిధులలో నొకడుగా పరిగణింపబడ్డాడు. సెఫరావ్ మంచి విద్యావంతుడు; యువకుడు. నాటికే బోల్షివిక్ పార్టీ ప్రముఖ సిద్ధాంత విచారకుల్లో నొకడుగా పరిగణింపబడుతున్నాడు. రెండవ ప్రపంచ మహాసభకు టర్కీస్థాన్ నుండి ప్రతినిధిగా వచ్చాడు; టర్కీస్థాన్‌లో స్థానిక శాఖను స్థాపించే నిమిత్తమై బోల్షివిక్ పార్టీ ప్రతినిధిగా వెళ్లాడు. వలస రాజ్యాల్లో, ముఖ్యంగా ముస్లిం రాజ్యాలలోని జాతీయోద్యమాల చారిత్రక ప్రాశస్త్యాన్ని హృదయ పూర్వకంగా విశ్వసించేవాడు. స్నీవ్‌లిట్‌తో బాటు సఫరావ్ కూడా చర్చల్లో ప్రముఖపాత్ర వహించాడు.

చర్చల్లో తరచుగా మాట్లాడిన మూడవ వ్యక్తి పర్షియా ప్రతినిధి సుల్తాన్ జాదే. ఒక రంగు మినహాయిస్తే, జాదేను పారశీకు డనటంకంటె, రష్యన్ అనటమే యుక్తం. విప్లవానికి పూర్వమే జాదే, విద్యార్థిగా రష్యా వచ్చాడు; బోల్షివిక్ పార్టీ రహస్యశాఖలో చేరి నూనెగనులలో పనిచేస్తున్న పారశీక కార్మికులలో విప్లవ సంచలనాన్ని పురికొల్పే ఉద్దేశ్యంతో బాకులో స్థిరపడ్డాడు; వట్టి వాగుడు కాయ; 'ఆసియాలో తొలి మార్క్సిస్టును' అని గర్విస్తూ ఉండేవాడు.

సిద్ధాంత సంబంధమైన సమస్యలను పరిష్కరించేది అనుభవమే. అందుచే ప్రత్యేక సంఘంలోని చర్చలవలన, నాకూ లెనిన్‌కూ మధ్య విభేదం ఒకే ఒక విషయంపైన తేలింది. వలస రాజ్యాలలోని జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాలను బలపరచాలనే లెనిన్‌వాదాన్ని నేనూ అంగీకరించాను; అంతేగాదు; అందుకు అనుకూలమైన సాధనాన్ని కూడా స్పష్టపరచాను. ఆ రాజ్యాల్లో కమ్యూనిస్టు పార్టీలను స్థాపించి, వాని ద్వారా రైతు, శ్రామిక వర్గాలను సంఘటిత పరచి, స్వాతంత్ర్య ఉద్యమ సాంఘిక స్వభావాన్ని విప్లవాత్మకంగా చేయవచ్చుననే సూచనతో, లెనిన్ సిద్ధాంతాన్ని ఆచరణలో నుంచటానికి స్పష్టమైన మార్గాన్ని కూడా సూచించాను. వలస

ప్రజల జాతీయ పోరాటంలో తోడ్పడటానికి అదే మంచి మార్గమని నా నమ్మకం. కాని, విప్లవ భయంవల్ల, వలసలలోని బూర్జువావర్గాలు, ఏవో స్వల్పమైన ఆర్థిక, రాజకీయ హక్కులతో తృప్తిపడి సామ్రాజ్యవాదంతో రాజీపడగలవని నా వాదన*. ఆక్లిష్ట పరిస్థితులలో శ్రామికవర్గం జాతీయ స్వాతంత్ర్యోద్యమ నాయకత్వం వహించ టానికి సన్నద్ధమై దాన్ని విప్లవ ప్రజా ఉద్యమంగా రూపొందించాలి. నా సిద్ధాంతం, లెనిన్‌కు నచ్చేటట్లు వివరించే సందర్భంలో కూడా ప్లెఖనోవ్ రచనలు నాకు తోడ్పడినై. శ్రామిక విప్లవంగా మారితేనేగాని రష్యాలోని ప్రజాస్వామ్య ఉద్యమం విజయం పొందదని 19 వ శతాబ్దం చివరలోనే వ్రాశాడు ప్లెఖనోవ్.

ప్రత్యేక సంఘంలో జరిగిన చర్చలను, లెనిన్ మహాసభకు నివేదించాడు. రెండు వ్యాసాలను అంగీకరించ వలసిందిగా కోరాడు.

అంతర్జాతీయ పరిస్థితిపై అధ్యక్షుని నివేదికయైన తరువాత, మహాసభ కార్య క్రమంలో మొదటి అంశం జాతీయ, వలస ప్రజల సమస్యయే. లెనిన్ తరువాత మాట్లాడినవాడు స్నీవ్‌లిట్; ఇతడు డచ్చి ప్రతినిధి అని చెప్పాను గదా! మారింగ్ అనే మారుపేరుతో మహాసభకు హాజరైనాడు. డచ్చి భాషలో మహావక్త. కాని మహాసభలో జర్మన్ భాషలో మాట్లాడాడు. ఐనా జర్మనీలో గూడా ధారాళంగా ఉపన్యసించాడు. ప్రత్యేక సంఘ సమావేశాల్లో మాత్రం-అందు ఇంగ్లీషు వచ్చిన వారే ఎక్కువ ఇంగ్లీషులోనే మాట్లాటాడు. ఇండోనేషియా వలసల్లో ధారుణ చర్యలు జరుపుచున్న తన దేశబూర్జువా వర్గంపై మహాసభలో దుమ్మెత్తిపోశాడు. అది, ఆవేశపూరితమైన మహోపన్యాసం. సాధారణంగా డచ్చివారు తిండిపోతులని ప్రతీతి; అందుకు నిదర్శనం స్నీవ్‌లిట్; పుష్కలంగా పాలు, వెన్న, జున్నులతో పుష్టిగా, బొద్దుగా పెరిగిన శరీరం! గుండ్రంగా చంద్రబింబం లాగా ఉండే తెల్లని ముఖం· కాని ఉపన్యాస వేదికమీద, స్పానిష్, ఇటాలియన్ అరాజక సిండికలిస్టులవలె, తెచ్చిపెట్టుకొన్న ఆగ్రహావేశంతో ఎఱ్ఱగా మారిపోయేవాడు.

మధ్యయుగం చివర్లో, నెదర్ లాండ్స్ (హాలెండు, బెల్జియం) స్పానిష్ సామ్రాజ్యంలో ఒక రాష్ట్రంగా ఉండేది; కాని ఆధునిక యుగంలో (హాలెండ్) ప్రథమ ప్రజాస్వామ్యానికి (Republic) జన్మభూమియైంది. సామ్రాజ్యం అంతర్థాన మైంది; ఐనా, స్పానిష్ స్వభావంలోని కొన్ని లక్షణాలు నెదర్‌లాండ్సులో మిగిలిపోయినై. స్పానియార్డులది నీటి బుడగలాంటి స్వభావం; ఆ స్వభావానికి అరా

---

* 1909 నుండి 1935 వరకూ ఇండియాలో జరిగిన రాజ్యాంగ వికాసం, అంటే 1909, 1919, 1935 సంగ్గరాలలో ఆంగ్ల సామ్రాజ్యవాదం ప్రవేశపెట్టిన శాస నాలు తన సిద్ధాంతానికి నిదర్శనాలే నంటాడు రాయ్.

జక సిండికలిస్టుల భావోన్మాదానికీ దగ్గిర పోలికలున్నై. ఈ స్వభావమే, కాల్వినిస్టు (ప్రొటెస్టెంటుల్లో అతివాదులు) మతోన్మాదంనుండి విముక్తి చెందిన తరువాత కూడా, నెదర్లాండ్సులో కన్పిస్తుంది. స్పానిష్ విజేతలు మరొక సాంస్కృతిక సాంప్రదాయాన్ని కూడా, విడిచివెళ్ళారు. అది లిబరలిజం; కాథలిక్ రాజ్యమైన స్పెయిన్ నుండి బహిష్కరింపబడిన యూదుపని వాండ్రూ, వర్తకులు ప్రొటెస్టెంటు దేశమైన నెదర్లాండ్సులో శరణార్థులైనారు; వీరే లిబరలిజాన్ని ప్రవేశపెట్టారు. అరబ్బుల శాస్త్రీయ దృక్పథాన్ని, హేతుత్వాన్ని, ఉత్తర ఐరోపాలో ప్రవేశపెట్టినది యూదులే. అందుచేతనే అఖండ పవిత్ర రోమన్ సామ్రాజ్య వ్యవస్థను మొట్టమొదట దబ్బివారే బ్రద్దలు కొట్టగలిగారు. నెదర్లాండ్స్ ఎరాస్మస్‌కూ [1], స్పినోజాకూ [2] జన్మభూమి మాత్రమే కాదు; సాంప్రదాయ శత్రువులైన వీరుభయులూ, యూదు బిడ్డలే! పిట్టీబోయల్ మున్నగు తిరుగుబాటుదార్లకు శరణు నొసగిన దేశం. ఆధునిక శాస్త్ర నిర్మాతల్లో పెక్కుమందికి నెదర్లాండ్సు జన్మభూమి!

ఇట్టి సాంప్రదాయాలలో నేర్పడిన సాంస్కృతిక వాతావరణం అరాజక సిండికలిస్టువాదానికీ, మార్క్సుసిద్ధాంతాల విస్తరణకూ తోడ్పడింది. అరాజక సిండికలిస్టు భావాలు కార్మిక ఉద్యమాల్లోనూ, మార్క్సిజం హేతువాదాభిమానులైన ఆలోచనాపరుల్లోనూ వ్యాపించినై. ఎర్నెస్ట్ ట్రోయెల్జ్ - ఐరోపాలో ప్రముఖ సోషలిస్టు సిద్ధాంతకారుల్లో ఒకడు. మరొకవైపున, యాన్‌టన్ పానెకాక్, హెర్మన్ గోర్టర్‌లు హాలెండులో ప్రత్యేకమైన విప్లవాత్మక మార్క్సిజానికి పునాదులు వేశారు. ఈ రెండు ఉద్యమాలకు సంగమస్థలం స్నీవ్‌లిట్; మానసికంగా అతనొక అరాజక సిండికలిస్టు; ట్రాట్‌స్కీ అద్భుత వ్యక్తిత్వమూ, భావావేశమూ అతని ఉద్రేక స్వభావాన్ని ఆకర్షించినై. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు పోటీసంస్థను స్థాపించటానికై ట్రాట్‌స్కీ యత్నించినప్పుడు అతనికి కుడిభుజంగా పనిచేశాడు స్నీవ్‌లిట్. చివరి రోజుల్లో అరాజక సిండికలిస్టుభావాలపై హాలెండు కార్మికులలో అధిక సంఖ్యాకులతో నేర్పడిన లేబర్ ఫెడరేషన్‌కు నాయకత్వం వహించాడు.

స్నీవ్‌లిట్‌ను మినహాయిస్తే, మరే ప్రముఖ యూరోపియన్ ప్రతినిధి జాతీయ వలస ప్రజల సమస్యను గురించి ప్రసంగించలేదు; ఆ సమస్యలో వారికి ఆసక్తి లేకపోవటమేకాక, ఆ సమస్యను గురించిన వారి అజ్ఞానమే అందుకు కారణం. అదీగాక

---

1. మతాచారాలను అవహేళనచేసి ఆధునికయుగ వైతాళికుడైన మానవతావాది ఎరాస్మస్.

2. హేతువాదానికి పుష్టిచేకూర్చిన తత్త్వవేత్త; "ఇది మన యిద్దరిమధ్యా రహస్యం; నా విశ్వాసం నీవు లేవనే" అనేది, భగవంతునిగూర్చి స్పినోజా అభిప్రాయమని ఫ్రెంచి తత్వవేత్త వోల్టేరు చమత్కరించాడు.

లెనిన్ మాట్లాడిన తర్వాత, వారికి చెప్పదగినది ఏముంది? లెనిన్ ప్రసంగంతో సమస్య పరిష్కారం ఐనట్లే! అందుచే కార్యక్రమంలో తమకు సంబంధించిన అంశాలను చర్చించాలని తొందరపడ సాగారు. ఐరోపా ప్రతినిధులు. కార్యక్రమంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించిన జర్మన్ సమస్యపై సుదీర్ఘమైన చర్చ జరిగింది. ప్రతినిధు లొకరిపై నొకరు దుమ్మెత్తి పోసుకొన్నారు. తర్వాతి మహాసభలలో కూడా జర్మన్ సమస్యే ప్రధాన సమస్యగా పరిణమించింది. రష్యా బోల్షివిక్ సిద్ధాంతులందరికీ జర్మన్ విప్లవాన్ని గురించి కలలు గనటం సహజమైంది, కాని జర్మనీలో విప్లవం జరుగలేదు. ఈ కాలహరణానికి కారణమైన ద్రోహులను పరిశోధించవలసిన అవసరం కలిగింది. సోషల్ డెమోక్రాటిక్ పార్టీపై నేరారోపణ ఇంతకుముందే జరిగిపోయింది. ఐతే, వామపక్షీయుల మనుకొంటూ, సోషల్ డెమోక్రాటిక్ పార్టీ నుండి విడిపోయి, యేర్పడిన 'స్వతంత్ర సోషల్ డెమోక్రాటిక్ పార్టీ'యే ద్రోహులంటూ రెండవ ప్రపంచ మహాసభలో నిందారోపణ జరిగింది. 1918—19 క్లిష్టపరిస్థితిలో, ఈ క్రొత్త పార్టీనాయకులు విప్లవాత్మకమైన దృఢనిర్ణయాన్నిగానీ, అచంచల విశ్వాసాన్నిగానీ ప్రదర్శించలేకపోయినారు. వీరు తమ తప్పిదాన్ని ఒప్పుకొని భవిష్యత్తులో తమ విధానాన్ని మార్చుకొనని పక్షంలో వారికి ఇంటర్నేషనల్ లో ప్రవేశముండదు! స్వతంత్ర సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ప్రతినిధివర్గంలో వక్తృత్వంలో రాటుదేలిన కార్మికసంఘ నాయకులూ, శాసనసభా వాదోపవాదాల్లోనూ, ఉపన్యాసా లీయటంలోనూ కాకలుదీరిన రాజకీయవేత్తలూ ఉన్నారు. కార్మిక నాయకుల్లో ప్రముఖులైన క్రిస్పీన్, డిట్టమాన్ లు కమ్యూనిస్టు ప్రతినిధివర్గ నాయకుడైన పాల్ లెవీతో తలపట్లు పట్టుకున్నారు. ఆగ్రహావేశంతో పాల్ లెవీ, వేదికపై వెర్రెత్తినట్లు ప్రవర్తించి సభికుల అభిమానం పొందలేకపోయినాడు. వేదికపైకి రెడ్ ఆర్మీ యూనిఫారమ్ లో వచ్చాడు; రోస్ట్రమ్ మీద నాతడు చేసిన హంగామాతో 'రెడ్ స్టార్' చిహ్నంతో బాటు, టోపీ క్రిందబడి, ఆతని తుపాకిగుండు ఆకారంలో నున్న బట్టతల బైటపడింది; సరిగా కట్టకపోవటంవల్ల బూట్లు సీలమండలదాకా జారిపోయినై; ఆతని పిక్కలు సన్నగా దబ్బనాల్లాగా ఉంటై! మిత్రుని సహాయార్థం రాడెక్ వేదికమీదికి పరుగుతీశాడు. కాని జర్మనీలో రాడెక్ విధానం కూడ దోష రహితం గాదు; కేవలం అవకాశవాదియై తలలు మార్చాడు. అందుచే, జాగ్రత్తగా తన ఛలోక్తులతో తప్పించుకున్నాడు. తరువాత లెనిన్ లేచాడు. ప్రత్యర్థులను చిత్తుచేసే ధోరణిలో, వక్తృత్వ శిఖరాలనందుకొన్న మహోపన్యాసం. చివరకు జినోవీవ్ మాట్లాడాడు. సింహాన్ని, దాని గుహలోనే పట్టాలనేది ఆతని స్వభావం. "స్వతంత్ర సోషలిస్టుపార్టీ ప్రత్యేక మహాసభను జరిపి అందులో, ఇరువదియొక్క షరతులపై కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లో చేరటానికి సమ్మతించని అవకాశవాదులైన పార్టీ నాయకులతో చర్చలు జరుపుతా"నని ప్రకటించాడు.

తరువాత కొద్దిరోజుల్లోనే, మధ్యజర్మనీలో పారిశ్రామిక కేంద్రమైన హాల్లీలో స్వతంత్ర సోషలిస్టుపార్టీ ప్రత్యేకసభలు జరిగినై. రెండురోజులపాటు జినోవీవ్ చర్చలు జరిపినతరువాత, ఏ షరతులు లేకుండా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరటానికి కొద్దిమందిమాత్రమే అంగీకరించారు; వీరు పార్టీనుండి విడిపోయి, కమ్యూనిస్టులలో చేరారు. క్రమంగా జర్మన్ కమ్యూనిస్టుపార్టీ గొప్ప ప్రజాఉద్యమమైంది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరే సమస్యమీదనే, ఫ్రెంచి సోషలిస్టుపార్టీనాయకులైన మార్సెల్ కాషిన్, ఫ్రాస్సార్డు లిద్దరూ ఇరువదియొక్క షరతులకు సమ్మతించారు; కాని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరే సమస్యమీదనే ఫ్రెంచి సోషలిస్టుపార్టీ కూడ చీలిపోయింది. రష్యాను ప్రతిఘటించే ప్రయత్నంలో ఇటాలియన్ సోషలిస్టుపార్టీమాత్రం సమైక్యమై నిలిచింది. ఈ విధంగా అనుబంధసంస్థలకు కించిత్తు స్వాతంత్ర్యాన్ని కూడా నిరాకరించిన రష్యావిధానంవల్ల కార్మిక ప్రజానీకానికి దూరమై ఐరోపాలోని కమ్యూనిస్టుపార్టీలు పుట్టుకుంటివిగా తయారైనై. ఐరోపాలోని కార్మిక ప్రజానీకమంతా రష్యావిప్లవాన్ని అభినందించినవారే; కాని రష్యావిధానాన్ని గర్హించారు.

రెండవ ప్రపంచ మహాసభలో లెనిన్, జినోవీవ్, రాడెక్‌లు వినా ప్రముఖ రష్యన్ నాయకులెవ్వరూ మాట్లాడలేదు. కొందరుమాత్రం ప్రత్యేక సంఘాలలో జరిగిన చర్చలలో, నిర్ణయాలలో పాల్గొన్నారు. అందుకు కారణం, రష్యన్ నాయకులందరూ, విప్లవం సృష్టించిన ఆంతరంగిక సమస్యలతో సతమతమవుతున్నారు. అంతర్యుద్ధం ముగిసిన సూచనలు కన్పిస్తున్నా, ఆర్థికపరిస్థితి నానాటికీ దిగజారిపోతోంది. దేశంలో చాలభాగాన్ని అంతర్యుద్ధం ధ్వంసంచేసింది; మిగిలినప్రాంతాల్లో వ్యవసాయ ఉత్పత్తిని, పూర్తిగా పడగొట్టింది, 'యుద్ధకమ్యూనిజం'; సైబీరియా, టర్కీస్థాన్‌లలో చాలాచోట్ల ఇంకా అంతర్యుద్ధజ్వాలలు చల్లారనేలేదు; యూరోపియన్ రష్యాలో క్షామదేవత తాండవించి, అనేకప్రాణాలను పొట్టనుబెట్టుకొంది. దీనితో రష్యా ఆర్థిక విధానం మరింత దిగజారిపోయింది.

ప్రపంచ జనాభాలో ఆఱవవంతైన రష్యన్లను ఇట్టి దారుణ పరిస్థితులనుండి ఉద్ధరించటం సామాన్యమైన సమస్యకాదు. ఆ కార్యభారం కమ్యూనిస్టుపార్టీపై బడింది. నాటికే రష్యన్ కమ్యూనిస్టుపార్టీ ఇద్దరు ప్రముఖనాయకులను కోల్పోయి బలహీనమైంది. సాంఘిక విప్లవకారుడననుకొనే మూర్ఖుడొకడు, యురిట్‌స్కీని హత్య చేశాడు; సోవియట్ రిపబ్లిక్ ప్రథమ అధ్యక్షుడైన స్వెర్డ్లావ్, ఏబదిసంవత్సరాల వయస్సు నిండకపూర్వమే క్షయవ్యాధికి బలియైనాడు. ఇక స్టాలిన్‌కూడా ఇంచుమించు మరణశయ్యమీదనున్నాడు; దిగువ వోల్గాపై శత్రువులుముట్టడించిన జారిజినా నగరంలో, ట్రాట్‌స్కీ శక్తిసామర్థ్యాలింకా, ఆర్థిక పునర్నిర్మాణరంగానికి అందుబాటులో లేవు. కాగా రెండవప్రపంచ మహాసభలు జరుగుచున్నపుడు సోవియట్

రాజధానిలోనున్న ప్రముఖ నాయకులు బుఖారిన్, కామనీవ్, జెర్‌జిన్‌స్కీ, రాకోవ్‌స్కీలు మాత్రమే. నాటికే పార్టీసిద్ధాంతవిచారణలో అగ్రగణ్యుడుగా పరిగణింపబడినా, బుఖారిన్ చాలా యువకుడు; కామనీవ్ మాస్కో-సోవియట్ అధ్యక్షుడు. సిద్ధాంతాల్లో గట్టివాడుకాడు, కాని మంచి పరిపాలనాదక్షుడు; విదేశాంగ నీతిలో కూడా సమర్థుడనిపించుకొంటున్నాడు; విషాదపూరితమైన మనస్సుతో, తప్పనిసరిగా "అరుణ రక్తపాతానికి" కార్యకర్తయైనాడు జెర్జిన్‌స్కీ; రకోవ్‌స్కీ జన్మభూమి రుమేనియా. జర్మన్ సైన్యాలు స్థానిక విప్లవవిద్రోహులూ పరాజయమైనవెంటనే ఉక్రేనియాలో సివిల్ ప్రభుత్వాన్ని స్థాపించినాయకత్వం వహించినవాడు; ప్రజలీతణ్ణి ఉక్రేనియా లెనిన్ అని గౌరవించేవారు. వీరితర్వాత చెప్పదగిన నాయకులు-రీజనావ్, రుజుటావ్, సొకోల్నికావ్, చిచిరిన్, సఫరావ్; వీరందరూ మహాసభాభవనంలో కన్పించేవారే! కాని, కొన్ని నిముషాలపాటు కూర్చొని, లేచి నిలబడి, అటూ ఇటూ కలయజూచి, నిశ్శబ్దంగా, ప్రవేశించినట్లుగానే నిర్గమించేవారు. వారిముఖాల్లో అలసట, ఆందోళన ప్రస్ఫుటంగా కన్పించేవి. దుర్భరమైన బాధ్యతల బరువు, క్రిందవారి శక్తిసామర్థ్యాలు నలిగిపోతున్నట్లుంనై; వాస్తవానికి చరిత్రలో ఏ తరంవారూ నిర్వహించని మహత్తర కార్యభారాన్ని నిర్వహించారువారు. వీరంతా పురాణ పురుషులే; స్వప్నలోకంలో సంచరిస్తున్నట్లు, తమ పరిసరాల్లోని సంఘటనలపట్ల నిర్లక్ష్యంతో కన్పించేవారు. ఒకే విశ్వాసం వారందరినీ కూడగట్టింది; వారి ఆశయాలూ, ఆందోళనలూ ఒకటే; కాని వారివారి ప్రత్యేక వ్యక్తిత్వాలు అచ్చుగుద్దినట్లుండేవి. ఉదాహరణకు బుఖారిన్‌ని పరిశీలించండి. దార్శనిక నిర్లిప్తతను యౌవనోత్సాహంలో దాచిపెట్టేవాడు. నవ్వులాడుతూ, ప్రతినిధులతో యథేచ్ఛగా తిరిగేవాడు. జెర్జిన్‌స్కీ, చిచిరిన్‌లకు బిడియం ఎక్కువ; ఎవ్వరితోనూ చనువుగా ఉండేవారుకాదు. కామనీవ్ నిలువెల్లాదర్పమే; కాని చాల మర్యాదస్తుడు; రకోవ్‌స్కీది గంభీరస్వభావం; ఐనా నిష్కల్మషహృదయం; స్నేహపాత్రుడు; రిజనావ్‌ది పూజారితత్వం; మాటల్లో పాండిత్యం ఒలకపోసేవాడు. సోవియట్ నాయకవర్గంలో ఉన్నతస్థాయి నందుకొన్నప్పటికీ, సోకాల్నికావ్, రుజుటావ్‌లతో ఎవరికీ పూర్తిపరిచయంలేదు; బెట్టుసరిగాఉండేవాడు. అందరిలోనూ సఫరావ్ వయసులో చిన్నవాడు; కాని స్వరూపంలోనూ, స్వభావంలోనూ కూడా కేవలం సర్వసంగ పరిత్యాగి!

మహాసభ కార్యక్రమంలో చివరి అంశం కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకొనటం; రెండు మహాసభల మధ్య తరచు సమావేశమౌతూ ఉంటుంది. కార్యనిర్వాహకవర్గం; అందు సభ్యులు నలుభై యొక్కరు. ఆసియా దేశాల్లో సుసంఘటితమైన కమ్యూనిస్టు పార్టీలు లేకపోవటంవల్ల, ఆ దేశాలకు రెండు స్థానాలు మాత్రమే కేటాయింపబడినై; మహాసభ కార్యనిర్వాహకవర్గం తయారు చేసిన అభ్యర్థుల జాబితాలో సుల్తాన్ జాదే పేరూ, నా పేరూ ఉన్నై. కార్యనిర్వాహకవర్గ సభ్యుడుగా

ఉండటానికి నేనంగీకరించలేదు; కారణం? మహాసభ పూర్తియైన వెంటనే రష్యా నుండి వెళ్లిపోవాలి. తిరిగివస్తానో, రానో? అందుచే కొరియా ప్రతినిధి పాక్ పేరు సూచించాను; అందరూ అంగీకరించారు. కార్యనిర్వాహక వర్గంలో పాక్ సభ్యుడైనాడు.

## చరిత్రాత్మక నిర్ణయం

మహత్తరమైన ఆశలు, అపారమైన ఉత్సాహం నిండిన వాతావరణంలో మహాసభా సమావేశాలు ముగిసినై. అదే సమయానికి ట్రాట్స్కీ నాయకత్వంలో ఎఱ్ఱసైన్యం దళాలు, విప్లవ వ్యతిరేక దళాలను తరిమికొట్టినై. గడచిన శీతాకాలంలో ఈ విద్రోహుల మూకలు ప్రాగ్దక్షిణ దిశల్లో మాస్కోనగరానికి అరవై మైళ్ళ దూరం వరకూ త్రోసుకు వచ్చారు. ఉక్రెయిన్‌లో కూడా రష్యా నుండి విడిపోవాలనే ఉద్యమం అణచివేయబడింది. యూరోపియన్ రష్యా అంతటికీ విముక్తి లభించింది. ఇక, విప్లవం తూర్పుగా పురోగమించి, కూలిపోయిన జారు సామ్రాజ్యంలోని ఆసియా ప్రాంతాలకు విముక్తి ప్రసాదించాలి; పశ్చిమంగా పయనించి పెట్టుబడిదారీ ఐరోపా హృదయాన్ని వశపరచుకోవాలి. ఐతే ఆసియా ప్రాంతాలకు విప్లవ జ్యోతిని కొని పోయే అదృష్టం నా వంతు. కాని ఐరోపాకే అగ్రతాంబూలమివ్వాలి. ఎఱ్ఱ సైన్యంలో అధికభాగం, పోలెండు సరిహద్దుల్లో సమీకరింపబడింది. పశ్చిమాభి ముఖంగా పురోగమించి పీడిత ప్రజానీకానికి విముక్తి సందేశాన్ని అందజేయాలని ఉవ్విళ్ళూరుతూ, ఆజ్ఞల కోసం ఎదురు చూస్తున్నది. ఆ సైన్యానికి ట్రాట్స్కీ స్వయంగా నాయకత్వం వహిస్తున్నాడు. చాల ముఖ్యమైన నిర్ణయం జరగాల్సి ఉంది. అంతర్జాతీయ విప్లవ ప్రతిఘటన శక్తులకు కీలక స్థావరంగా పోలెండు మారిపోయింది. ఎఱ్ఱసైన్యం అంతర్యుద్ధంలో విజయం సాధించిన మాట నిజమే. కాని ఆ సైన్యానికి అవ సరమైన సాధనసంపత్తి లేదు. పశ్చిమంగా నడిస్తే చాల బలవత్తరమైన శత్రువు నెదుర్కొనవలసి వస్తుంది. మార్షల్ ఫాక్‌కు అత్యంత విశ్వాసపాత్రుడైన ఫ్రెంచి జనరల్ వేగాన్డ్ నాయకత్వంలో సర్వసమృద్ధమైన సైన్యం వార్సాలో స్థావర మేర్ప రచుకొని మధ్యఐరోపా మార్గాలన్నింటిని పరిరక్షిస్తున్నది. ట్రాట్స్కీ యుద్ధ రంగంలో మాత్రమే నాయకుడు. అంతిమ నిర్ణయం జరపాల్సింది లెనిన్; ఎఱ్ఱసైన్యం ముందుకు సాగటానికి అనుమతి లెనిన్ ఇవ్వవలసినదే!

ఈలోగా, మహాసభకు ట్రాట్స్కీ ఒక సందేశాన్ని పంపాడు. మహాసభకు తాను హాజరుకాలేకపోయినందుకు విచారాన్ని ప్రకటిస్తూ, అంతర్జాతీయ ప్రతినిధి వర్గం యుద్ధరంగాన్ని దర్శించి, అత్యంత ముఖ్యమైన దండయాత్ర ప్రారంభించనున్న విప్లవ సైన్యాన్ని ప్రోత్సహించటం సమంజసమని సూచించాడు. ట్రాట్స్కీ సందేశం ప్రతినిధి వర్గాలకు అపారమైన ఉత్సాహాన్నిచ్చింది; మిన్స్కీ నగరాని కొక అంతర్జాతీయ ప్రతినిధి వర్గంలో నన్ను కూడా చేర్చారు; మొట్టమొదటిసారిగా

ట్రాట్స్కీని కలుసుకున్నాను. అతని ఉపన్యాసం విన్నాను; అతనిది అద్భుతమైన వక్తృత్వం. విప్లవాత్మక రచనలు చేసే పత్రికా రచయితగా ప్రఖ్యాతిగాంచినవాడు; కరపత్రాలు ప్రచురించటంలో అతని కతడేసాటి. అట్టి పత్రికా రచయిత అణువణువునా నేడు సైనికుడే! కేవలం శూన్యంలో నుండే ఎఱ్ఱసైన్యాన్ని సృష్టించాడంటే ట్రాట్స్కీ అఘటనఘటనా సామర్థ్యం ఊహించవచ్చు. అతని యందు ఎఱ్ఱసైన్యానికి గల భక్తి విశ్వాసాలు, గౌరవాభిమానాలూ అపారం. అందుకు కారణం, అతడే భావి ఐరోపా మోక్షప్రదాత! ఎఱ్ఱ నెపోలియన్! ట్రాట్స్కీ ఎంతో వివేకంతో ఉపన్యసించేవాడు; వేదికపై శిలావిగ్రహమా అన్నంత నిశ్చలంగా నిలబడేవాడు. ఐనా అతని ఉపన్యాసం వేలాది ప్రేక్షకుల నుఱ్ఱూతలూ పేది!

"ప్రపంచ విప్లవ సైన్యం ముందునుండి దండయాత్ర సాగించిన మరుక్షణం లోనే, కేంద్ర మధ్య ఐరోపాలోని శ్రామికవర్గం వెనుకనుండి శత్రువుపై దెబ్బ తీస్తుందని" ఆలోచనారహితంగా ఎఱ్ఱ సైన్యానికీ, ట్రాట్స్కీకీ హామీ యిచ్చి, అంతర్జాతీయ ప్రతినిధివర్గం మాస్కోకు మరలివచ్చి, మహాసభ ముగిసిన సందర్భంలో జరిగే విందులు, వినోదాలలో మునిగిపోయింది; ఆతర్వాతనే ట్రాట్స్కీ తన కార్యస్థానాన్ని పోలిష్ సరిహద్దులకు సమీపంగా ఉండే స్థలానికి మార్చాడు; చాల విషమ పరిస్థితి! కాని సైనిక రహస్యాలేమీ క్రెమ్లిన్ గోడలను దాటిపోవటానికి అవకాశం లేదు. క్రెమ్లిన్‌లో సర్వాధికారి లెనిన్; యుద్ధరంగంమీద సర్వసైన్యాధ్యక్షుడు ట్రాట్స్కీ; ఏ క్షణానికా క్షణం ఉభయులనూ కలిపేవి తంతి తీగలు! ఒక అర్ధరాత్రి ట్రాట్స్కీనుండి తంతివర్తమానం "నా కుడిపార్శ్వంలోనున్న దళనాయకుడు, ఈశాన్యదిశనుండి వార్సాపైకి దండయాత్ర ప్రారంభించాడు! ఆ సైన్యంతో తలపడవలసిందిగా జనరల్ వేగాన్డ్ తన సైన్యాన్ని ఆజ్ఞాపించాడు. మన సైన్యానికి సంఖ్యాబలం లేనందున పరాజయం తప్పదు. ఐతే, కీడులో మేలన్నట్లు, ఈ చర్యల వలన ఐరోపా రక్షణ సన్నాహంలో కీలకస్థానమైన వార్సాకు రక్షణబలం క్షీణించింది; మరొక దిక్కునుండి వార్సాను ముట్టడించటానికి అవకాశం లభించింది. వార్సాపైన నడవటానికి నేను సిద్ధంగానే ఉన్నాను. అనుమతి ఇస్తావా?" తంతి తీగలపై లెనిన్ ఒకే ఒక మాట అన్నాడు: 'సరే'. అదే ప్రమాదకరంగా పరిణమించింది. జూదంలో పందెం ఒడ్డాడు లెనిన్; అది ఆధునిక చరిత్రలో ఆడిన జూదాల్లో చాల ముఖ్యమైనది! ఐరోపా భవితవ్యాన్ని నిర్ణయించే జూదం! బోల్షివిక్కులు పందెం ఓడిపోయినారు. నెపోలియన్ ఎత్తుల్లో ఫ్రెంచి జనరల్ వేగాన్డ్, తానే సమర్థుడనిపించుకున్నాడు. అతని ప్రధాన ప్రత్యర్థి ట్రాట్స్కీ. తన సైన్యంలో అధికభాగాన్ని ఈశాన్య రంగానికి పంపి, ట్రాట్స్కీని వార్సా పరిసరాల వరకూ రానిచ్చాడు. ట్రాట్స్కీ భయపడినట్లుగానే, ఈశాన్య రంగంలో ఎఱ్ఱసైన్యం దక్షిణపక్షం పూర్తి పరాజయాన్ని పొందింది. విజయవంతమైన వేగాన్డ్ సైన్యాలు దక్షిణానికి మరలినై; ట్రాట్స్కీ ఎఱ్ఱసైన్యం నలువైపులా ముట్టడింపబడింది. ఈయుద్ధమే, మొదటి రెడ్ నెపోలియన్‌కు వాటర్లూగా పరిణమించింది. కేంద్ర పశ్చిమ ఐరోపా రాజ్యాలకు విప్లవాన్ని అందించే ఆశలు అడుగంటినై. తిరిగి ఇరవైయైదు సంవత్సరాల తరువాత, అఖండ విజయాలు సాధించిన రెండవ రెడ్ నెపోలియన్ (స్టాలిన్) సేనాని ఆ ఆశలను పునరుద్ధరించారు!

# అరుణ విప్లవం తూర్పుకు మరలింది

## జినోవీవ్ సర్కస్

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహకవర్గం సాధారణ సమావేశం జరిపి, ఐదుగురు సభ్యులతో ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘాన్ని 'చిన్న బ్యూరో' అని వ్యవహరించేవారు. ఇది, తరచుగా సమావేశమై కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విధానాలను రూపొందించటమేగాక, కార్యనిర్వాహకసంఘంగా కూడా వ్యవహరించేది.

ఐరోపాలో విప్లవం పరాజయం పొందింది. అందుచే బోల్షివిక్కుల ఆత్మలు నిరాశతో, నిరుత్సాహంతో క్రుంగిపోసాగినై. ఇది గమనించి లెనిన్ ఒక ప్రకటన చేశాడు. "ఈ పరాజయం తాత్కాలికం; ప్రపంచం అంటే కేవలం ఐరోపా ఖండమేనని దుర్భ్రాంతిలో పడకూడదు. లండన్, న్యూయార్కు నగరాలు గంగా, యాంగ్సీ నదులపై కూలిపోవటం తథ్యం" అనేదే లెనిన్ ప్రకటనలోని సారాంశం. అంటే పశ్చిమాన తాత్కాలికంగా పరాజయం పొందిన విప్లవం తూర్పుదిశగా పురోగమించాలి. ఆసియాలోని విచ్ఛిన్న జారు సామ్రాజ్య భాగాలను సోవియట్ ప్రభుత్వంలోనికి తీసుకురావాలి. ఆ కార్యక్రమానికి ఉపక్రమించటమే బోల్షివిక్కుల తక్షణ కర్తవ్యం!

రష్యా పొరుగున నున్న ముస్లిం దేశాల్లో సులభంగా విప్లవం విజయవంతం కాగల అవకాశాలున్నై; 'మధ్య ఆసియా విమోచనం' అనే సందేశంతో ఆ దేశాలన్నీ పాశ్చాత్య సామ్రాజ్యవాదంమీద తిరుగుబాటులు జరుపుతై; ఇప్పటికే టర్కీలో కెమాల్ విప్లవానికి ప్రారంభోత్సవం చేశాడు. ఇతర ముస్లిం పాలకులు ఆతని అడుగుజాడల ననుసరిస్తారు. ఇండియాలో చెలరేగిన ఖిలాఫత్ ఉద్యమ ప్రతిధ్వనులు మాస్కోలోకూడా వినవస్తున్నై; ఈ పరిస్థితుల్లో 'ఇస్లాంసమైక్యత' (Fan-Islamism) విప్లవాత్మకమైనదనీ, ప్రపంచ శ్రామిక విప్లవ పురోగతికి ఉపకరింపగలదనీ, అందుచే ఆ ఉద్యమాన్ని ప్రోత్సహింప వచ్చుననీ బోల్షివిక్కులు భావిస్తున్నారు. వారి అభిప్రాయాలతో నేను ఏకీభవింప లేకపోయినాను. ఈ సమస్యపై తిరిగి లెనిన్‌తో సుదీర్ఘమైన చర్చలు జరిగినై. "ప్రాచ్యదేశ సమస్యను క్షుణ్ణంగా తెలిసినవాడు స్టాలిన్;

అతని అభిప్రాయం గ్రహించే వరకూ 'ఇస్లాం సమైక్యత' అనే విషయంపై అంతిమ నిర్ణయాలు చేయటం తగదు." అని లెనిన్ సలహా యిచ్చాడు. ఆ సమయంలో స్టాలిన్ జారిజినా రక్షణలో ఉన్నాడు. జబ్బుగా ఉన్నా, మంచి సమర్థతతో ముట్టడిని ఛేదిస్తున్నాడు. ఈలోగా ఎఱ్ఱ సైన్యంలో కొంతభాగం జారిజినా పైకి మరలింపబడింది. త్వరలోనే స్టాలిన్ మాస్కోకు రావచ్చు. కాని ఇంతలో నేను టర్కీస్థాన్ వెళ్ళటం జరిగింది; 1921 వేసంగిలో మాస్కోకు తిరిగి వచ్చాను; అంత వరకూ స్టాలిన్‌ను కలుసుకొనే అవకాశం లభించలేదు.

చిన్న బ్యూరో కార్యక్రమంలో ఆసియా విప్లవప్రణాళికా నిర్మాణమే ప్రధానాంశమైంది. ఇంటర్నేషనల్ కార్యవర్గంలో చేరటానికి నిరాకరించానుగాని ఈ ఉపసంఘంలో మాత్రం సభ్యుడుగాక తప్పలేదు. చిన్న బ్యూరో చేసిన నిర్ణయాలలో రెండు ప్రధానమైనవి: (1) బాకూనగరంలో తూర్పుదేశాల పీడిత ప్రజానీకం మహాసభను (Congress) జరపాలి; (2) టాష్కెంట్ కేంద్రంగా, ఇంటర్నేషనల్ మధ్య ఆసియాశాఖను (Central Asiatic Bureau) స్థాపించాలి. ఇందులో మొదటిది జినోవీవ్ సూచన; ఒక మహాసభను జరపటంతో ఆసియాలో విప్లవం సాధింపలేము అనే విషయం అందరికీ తెలిసినదే. ఐతే, ఆసియాలో ఆందోళనను తీవ్రతరం చేయటానికి సాధనంగా మహాసభ ఉపకరిస్తుందని జినోవీవ్ ఉద్దేశ్యమై యుండవచ్చు. కాని జినోవీవ్ సూచన కేమాత్రం సమ్మతించలేదు. "ఆసియాదేశాలు ఎన్నుకొని పంపిన ప్రతినిధులతోగాని కాంగ్రెస్ మాత్రమే చర్చలుజరిపి, ఆచరణయోగ్యమైన కార్యక్రమాన్ని నిర్ణయించటానికి అర్హతగలిగిన సంస్థ; ఇంత స్వల్పకాలవ్యవధిలో పొరుగురాజ్యాలలోని విప్లవోద్యమసంఘాలు తమ ప్రతినిధులను కాంగ్రెసుకు పంపే అవకాశంలేదు. అందుచేత ఆ మహాసభ కేవలం స్థానికంగానున్న నూనెగనులలో పనిచేస్తున్న ముస్లింకార్మికులూ, నగరవాసులూ హాజరయ్యే బహిరంగసమావేశమే అవుతుందిగాని కాంగ్రెస్ కానేరదు" అని నా ఉద్దేశ్యం; అదే బహిరంగంగా వివరించాను. ఐనా జినోవీవ్ సూచన ఐరోపా రాజ్యాల ప్రతినిధులను బాగా ఆకర్షించింది. అప్పటికే బలబనోవాను తొలగించి రాడెల్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యదర్శి పదవి నాక్రమించాడు. జినోవీవ్ సూచన అతనికి మహోత్సాహాన్ని కలిగించింది. జాన్‌రీడ్ కవితా భావోన్మాదం అందరినీ ఆవేశించింది!

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, బాకూనగరంలో ప్రదర్శనం జరపటంలో ఒక ఆంతర్యం ఉంది. అంతర్యుద్ధం జరిగే రోజుల్లో బ్రిటిష్ ఇండియా సైన్యాలు బాకూలోని నూనెగనుల నాక్రమించినై. కొన్ని మాసాల క్రిందటనే ఆ సైన్యాలను తరిమివేశారు. అంతకు ముందు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులను ఇరవై యిద్దర్ని, బ్రిటిష్ సైన్యాధిపతులు కాస్పియన్ సముద్రతీరంలో వధించారు. సామ్రాజ్యవాదుల

హింసాకాండ కెరయైన కమ్యూనిస్టుల ఆత్మబలిదానానికి చిహ్నం అప్పటికే నిర్మింప బడింది. ఆ చిహ్నం నీడలోనే సమావేశం జరుగుతుంది. కాబట్టి సూచనప్రాయంగా జరిగే ఈ సమావేశానికి చాల ప్రాధాన్యత ఉన్నమాట నిజమే! కాని ఇంతకంటె మంచి కార్యక్రమం లేదా? అని నా ప్రశ్న. ఇటువంటి పండుగలు, పబ్బాలతో కాలం వృధాచేయటం కంటె, ఆసియాఖండంలో ఆశించిన విప్లవ సాధనకే ప్రయత్నించవచ్చును గదా! అట్టి విప్లవంతో పాశ్చాత్య సామ్రాజ్యవాద దేశాల్లోని కార్మిక వర్గాలు బలవత్తరం కాగలవు గదా! అందుచేతనే నేను రెండవ నిర్ణయానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాను. దాని ప్రకారం కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మధ్య ఆసియా శాఖను (Central Asiatic Bureau) స్థాపించి, దానికి టర్కీస్థాన్, బొఖారాల గుండా, తత్పరిసర దేశాలకు, ముఖ్యంగా ఇండియాకు విప్లవాన్ని గొని పోయే బాధ్యత నప్పగించాలి! ఈ ప్రణాళిక నన్నెక్కువగా ఆకర్షించటానికి ఇందులో ఇండియా చేరటమని వేరుగా చెప్పనక్కర్లేదు! దీని దృష్ట్యా జినోవీవ్ సూచించిన బాకూ మహాసభవల్ల కేవలం వృధా, కాలహరణమూ, ధనవ్యయమూ తప్ప అవి జరిపే ఆందోళనలో అర్థం లేదు. తుద కా ప్రణాళికను "జినోవీవ్ సర్కస్" అని వర్ణించటానికి గూడా సాహసించాను.

అత్యద్భుతమైన ప్రాచ్య సీమలకు ద్వారం వంటిది బాకు. అచట జినోవీవ్ ప్రదర్శించదలచిన నాటకానికి సన్నాహాలన్నీ జరిగినై. అందులో పాత్ర ధరించాలనే సరదా నన్నాకర్షింపకపోలేదు. ఐనా ఆ మహానాటక సమాజంలో చేరటానికి నేను సమ్మతించలేదు. నా మానసిక వికారం పట్ల జాలిగా నవ్వి ఊరుకున్నాడు లెనిన్; ఒక అమాయక యువకుడు తన నిర్ణయాన్ని ధిక్కరిస్తాడా? అన్నట్లు ఆగ్రహించాడు జినోవీవ్. రాడెల్ నా మొండితనాన్ని పరిహసించాడు. క్రమశిక్షణ అనేది బోల్షివిక్ సద్గుణం అని నేనింకా గ్రహించలేకపోయినందుకు బొరొడిన్ చాల బాధ పడ్డాడు. చిచిరిన్ నన్ను సమ్మతింప జేయటానికి ప్రయత్నించి విఫలుడైనాడు. ఇంత ఆదుర్దా తగదనీ, నా మధ్యఆసియా ప్రయాణానికి సన్నాహాలు పూర్తికాలేదనీ, అందుచే బాకూ సభలో పాల్గొనమనీ బోధించాడు. కాని నా నిర్ణయాన్ని మార్చుకో లేదు. బాకూ సమావేశానికి ఇండియా ప్రతినిధిగా అబనీ ముఖర్జీని సూచించాను. ముఖర్జీ కూడా ఈ అవకాశంతో ప్రాముఖ్యాన్ని పొందవచ్చుననే ఆశతో సంతోషించాడు. నేను మాత్రం మాస్కోలోనే ఉండి నా ప్రయాణానికి సన్నాహాలు పూర్తి చేసుకోవాలి. ఆ రోజుల్లో మాస్కోలో పనులు, మనం ఆశించినంత త్వరగా జరిగేవి కావు. త్వరలో బ్రిటిష్ విదేశాంగ మంత్రి కర్జన్ ప్రభువుకు సింహస్వప్నం కావాలి! ఈ నా భావాలతో ఒక్క కారఖాన్ మాత్రం సానుభూతి వహించాడు. అతడూ ప్రాచ్యదేశీయుడే!

ఇంటర్‌నేషనల్ మధ్య ఆసియాశాఖ

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మధ్యఆసియాశాఖలో సాకోల్నికావ్, సఫరావ్, నేనూ సభ్యులం. సాకోల్నికావ్ అప్పటికే ఉన్నతమైన సైనికపదవిలో ఉన్నాడు; మధ్యఆసియాలోని ఎఱ్ఱసైన్యానికి సేనాపతి (Commander), కేంద్రసోవియట్ ప్రభుత్వంలో టర్కీస్థాన్ సంఘానికి అధ్యక్షుడు. టర్కీస్థాన్ సంఘంలో సఫరావ్, కగనోవిచ్, రహించేఫ్ సభ్యులు. బోల్షివిక్‌పార్టీ కేంద్రసంఘం ప్రతినిధి, అగణ రక్తప్రాంతానికి సాధనమైన చెకా (Cheka) కు, సెయింట్ పీటర్‌వంటివాడు కగనోవిచ్. పౌరపరిపాలన ఈతనిచేతిలోఉంది; ఇక రహించేఫ్, టర్కీస్థాన్, సోవియట్ కేంద్రకార్యవర్గానికి అధ్యక్షుడు.

సాకోల్నికావ్ యువకుడు; ఇంకా నలభై సంవత్సరాలైనా నిండలేదు. మంచి అందంగాకూడా ఉంటాడు. పారిస్‌లో ప్రవాసం అనుభవిస్తూ విలాసవస్తువుల అంగడిలో అలంకరణచేస్తూ భుక్తి గడుపుకున్నాడు; కాని బుద్ధికుశలతా, విద్యా, సంస్కారమూ కలవాడు; అందుచేతనే పార్టీ రహస్యంగా నడుపుతున్న "ప్రవడా" పత్రికకు సంపాదకుడు కాగలిగినాడు. అందులోనూ బోల్షివిక్కులు అధికారాన్ని వశపరచుకొన్న క్లిష్టపరిస్థితుల్లోనూ, అంతర్యుద్ధంలోనూ, ప్రముఖపాత్రను నిర్వహించటుచేత సాకోల్నికావ్‌ను ఎఱ్ఱసైన్యంలో ఒక దళానికి అధిపతినిచేసి 1923 లో గాలీషియాద్వారా జర్మనీపైకి పంపారు; జర్మనీలో విప్లవం విజయవంతంకాగలిగితే, తన సైన్యంతో సాకోల్నికావ్ జర్మన్ విప్లవకారులకు సాయంచేయాలి. కాని, జర్మన్ విప్లవం విఫలమైంది. తరువాత, సాకోల్నికావ్ లండన్‌లోని సోవియట్ రాయబారిగా నియమింపబడ్డాడు. లండన్‌నుండి తిరిగివచ్చినంతనే, సోవియట్ ఆర్థికమంత్రి (Commissor) యైనాడు. ఆర్థికమంత్రిగా సోవియట్‌రష్యాకతడు చేసిన సేవ అపారం. నాటికి పెక్కుసంవత్సరాలుగా రష్యాలో విపరీతమైన ద్రవ్యోల్బణ పరిస్థితులు (Inflation) ఉన్నై; దేశంలో బంగారునిధులు లేవు; ఐనా, దొంగడబ్బయిన "చిరివానెజ్"ను రద్దుచేసి రూబుల్ కరెన్సీని పటిష్టంచేసి ఘనవిజయాన్ని సాధించాడు సాకోల్నికావ్. అతనిమిత్రులు నవ్వుతూ అంటూఉండేవారు; "మార్క్సు రచించిన కాపిటల్ గ్రంథం మూడుభాగాలే ఆధారంగా, రూబుల్‌ను పటిష్టంచేశాడు మా సాకోల్నికావ్." లెనిన్ మరణానంతరం నాయకత్వానికి జరిగిన పోటీలో సాకోల్నికావ్, ట్రాట్‌స్కీని బలపరచాడు; అతడు పనిచేసింది ట్రాట్‌స్కీక్రింద నేగదా! ట్రాట్‌స్కీపతనంతో సాకోల్నికావ్‌కూడా రాజకీయరంగంనుండి అదృశ్యమైనాడు. రక్తదాహంతో విప్లవదేవత, తన కన్నబిడ్డలనే అసంఖ్యాకంగా పొట్టనబెట్టుకొంది. ఆ దురదృష్టవంతుల్లో సాకోల్నికావ్ ఒకడు!

ఇక, మధ్య ఆసియాశాఖలో రెండవ సభ్యుడు జార్జి సఫరావ్; పార్టీలో మంచి ఉపజ్ఞ కలవాడు; లెనిన్ శిష్యుల్లో చిన్నవాడూ, ప్రతిభావంతుడు. గురు శుశ్రూష చేయటానికై లెనిన్‌తో బాటు ప్రవాసం అనుభవించాడు; దక్షిణప్రాన్సులో తోటమాలిగా పనిచేసి పొట్టబోసుకున్నాడు. విప్లవం ప్రారంభమైనంతనే రష్యా తిరిగివచ్చి, అనతికాలంలోనే మార్క్సిస్టు సిద్ధాంతంలో గొప్ప పండితుడుగా, రచయితగా, జర్నలిస్టుగా కీర్తి సాధించాడు. అంతర్యుద్ధకాలంలో 'ప్రచారక రైలుబండి' నాయకుడుగా, దేశం నలుమూలలా పర్యటించి స్వేచ్ఛాసందేశాన్ని పంచి పెట్టాడు. ఈ రైలుబండిలో ఫిల్ములు, సినిమా ప్రొజక్టరూ, ఒక అచ్చు యంత్రమూ, ప్రదర్శనానికి (Exhibition) అవసరమైన సాధన సామగ్రి ఉండేవి. ఆ రైలుబండి ఒక దిన పత్రికను ప్రచురించేది. కొన్ని వేల సమావేశాలు జరిపింది. జరిపిన ప్రదర్శనల కంతు లేదు. ఆ రైలుబండి మొత్తాన్ని ఎత్తైన ప్రకటన పత్రాలతో ముంచి వేశారు; సైనిక రక్షణలో ప్రయాణంచేస్తూ ఉండేది. ఈ ప్రచారక సమాజంలో సభ్యులందరూ సాయుధులే; అప్పుడప్పుడూ వీరు శత్రు ప్రాంతాలగుండా పోరాడుతూ ప్రయాణం చేయాల్సి వచ్చేది.

ఆ అనుభవం వల్లనే, ఆందోళనలు జరపటానికీ, ప్రచారం సాగించటానికీ, సఫరావ్‌ను మంచి సమర్థుడుగా పరిగణించేవారు; అదే కారణంగా బోల్షివిక్ పార్టీ కేంద్రకమిటీ సభ్యుడుగా ఎన్నుకోనబడ్డాడు. అధికారవర్గంలో రెండవ ఉన్నత స్థానాన్ని ఆక్రమించినా, వయసులో మాత్రం అందరిలో చిన్నవాడు సఫరావ్. అప్పటి కింకా, మాలటోవ్, వయస్సులో పెద్దవాడైనా పార్టీలో అనామకుడే! 'ప్రచారక రైలు' నాయకుడైన సఫరావ్‌కు కార్యదర్శిగా ఉండేవాడు.

1921 లో మధ్య ఆసియానుండి, రష్యాకు తిరిగి వచ్చిన తరువాత, కొంత కాలం సఫరావ్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రాచ్యశాఖకు అధ్యక్షుడుగా ఉన్నాడు; అనంతరం, పార్టీ పత్రికా సంపాదకుడుగా లెనిన్‌గ్రాడులో స్థిరపడి పోయినాడు. ట్రాట్స్కీతో జరిగిన సంఘర్షణలో ప్రముఖపాత్ర వహించాడు. పార్టీలో జరిగిన, ముఠాల కుమ్ములాటల్లో, చాలసార్లు రంగులు మార్చాడు సఫరావ్. స్టాలిన్ విజయం సాధించి జినోవీవ్‌తోసహా సఫరావ్‌ను పార్టీనుండి బహిష్కరించాడు. జినోవీవ్, సఫరావ్‌లు గురు శిష్యులు! గురువు తన ధోరణి మార్చుకొని పార్టీలో ప్రవేశించాడు. శిష్యు డాతణ్ణి అనుసరించాడు.

ఈ సందర్భంలోనే ఒక విచిత్రసంఘటన జరిగింది. 1929 లో, కమ్యూనిస్టుఇంటర్నేషనల్ సాధారణ కార్యదర్శిగా ఉన్న కూశినెన్, ఒక తమాషా ప్రకటన చేశాడు. "జర్మన్ కమ్యూనిస్టుపార్టీలోని ప్రతిపక్షానికి చెందిన పత్రికలో వ్రాయటంద్వారా యం. యన్. రాయ్, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సభ్యత్వానికి స్వయంగానే నీళ్ళు

వదులుకున్నాడు.” అని ఆ ప్రకటన. సఫరావూ, నేనూ చాల సన్నిహితమిత్రులం. కాని, తన క్రొత్త ధోరణిలో, తన విశ్వాసాన్ని - అంటే స్టాలిన్ ప్రభుత్వంలో తనకు పూర్తి విశ్వాసం ఉన్నట్లు ప్రకటించటానికై, కూశినెన్ ప్రకటన సఫరావ్‌కు అవకాశం కల్పించింది. వెంటనే నన్ను దూషిస్తూ ఒక వ్యాసం వ్రాశాడు సఫరావ్. ‘యం. యన్. రాయ్ అంతం’ (The End of M. N. Roy) అని దాని శీర్షిక. నేనూ సహించలేక పోయినాను; దుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నట్లుగా, వేరొక వ్యాసం వ్రాసి ‘పశ్చాత్తప్తుడైన ప్రతిపగామి బోకరింపులు’ (The Ravings of a Repentent Renegade) అనే శీర్షికతో ప్రచురించాను. మా కలహం ఐరోపాలోని అన్ని తరహాల కమ్యూనిస్టులకూ వినోదాన్ని కల్పించింది.

ఏదైనా మూఢంగా నమ్మటమే సఫరావ్ స్వభావం. ఒకప్పుడు ట్రాట్‌స్కీ విప్లవ వ్యతిరేకి అని నమ్మాడు; తర్వాత స్టాలిన్‌ను విప్లవ ద్రోహిగా పరిగణించాడు. అప్పుడూ, ఇప్పుడూ కూడా అతనిది హృదయ పూర్వక విశ్వాసమే! తన విశ్వాస పవిత్రతనూ, తన మతసుస్థిరత్వాన్నీ రక్షించాలనే పట్టుదలే అతని ప్రాణాలను బలి గొన్నది. 1937 ప్రక్షాళన (Purge) లో పేరు చెప్పకుండా, విప్లవం కబళించిన అసంఖ్యాక దురదృష్టవంతుల్లో ఒకడు సఫరావ్.

రెండవ ప్రపంచ మహాసభ ముగిసిన వెంటనే, సొకోల్నికావ్, సఫరావ్‌లు టర్కీస్థానుకు వెళ్ళారు. అక్కడ విప్లవం ఇంకా పరిసమాప్తం కాలేదు; వారు వెళ్ళే ముందు ఇంటర్నేషనల్ మధ్యఆసియాశాఖ సమావేశం జరిగింది. అందులోనే నన్ను అధ్యక్షుడుగా ఉండమని కోరారు. కాని ఇంకా కొంతకాలం నేను మాస్కోలోనే ఉండాలి; ఆఫ్ఘనిస్థాన్‌కు నన్ను రాయబారిగా పంపే సమస్య ఇంకా పరిష్కారం కాలేదు; ఇండియాలో విప్లవోద్యమానికి సాయం చేసే విధానాన్ని రూపొందించటం అవసరం. పూర్తిగా యుద్ధ పరంజామా, అంటే విప్లవ సాధనాలు తీసుకోకుండా మాస్కో నుండి బయలుదేరటంలో అర్థంలేదు. దూరప్రాచ్యంలో కూడా ఇటువంటి ప్రయత్నమే విఫలమైంది; ఆ తరువాత జర్మన్లు మోసగించారు. ఈమారు అలా జరగటానికి వీల్లేదు; రష్యా బోల్షివిక్కులు చాల మర్యాదస్తులు. మాస్కోలో ఈ కార్యక్రమాలన్నీ నిర్వహించవలసియుండటం చేత, సొకోల్నికావ్‌ను అధ్యక్షుడుగా ఉండమని కోరాను. అందు కాతడు కాదనలేదు.

రెండవ ప్రపంచ మహాసభ తరువాత బోల్షివిక్కుల కార్యక్రమం మందకొడిగా సాగింది. పెట్టుబడిదారీ ఐరోపాపై ప్రథమ దండయాత్ర విఫలం కావటంతో కొంత నిరుత్సాహం కూడా ఏర్పడింది. ఈ పరిస్థితిలో తొందరపడి లాభంలేదు; ఓర్పువహించాలి. ఈలోగా పత్రికల నిండా, బాకూలో “జినోవీవ్ సర్కస్” ప్రదర్శనను గురించిన వార్తలే. ఆసన్న ప్రపంచ విప్లవంలో ప్రజల ఉత్సాహం సడలి

పోకుండా రక్షించటానికా ప్రచారం చాల అవసరం! బాకూ సమావేశం సందర్భంలోనే, కాస్పియన్ సముద్రతీరంలోని "ఎన్‌జేలీ" అనే పర్షియన్ రేవు పట్టణంలో కుఘుక్ ఖాన్ విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించాడట! అంతేగాదు. ఖొరాసాన్‌లోని బ్రిటిష్ సైన్యాన్ని వదలి కొందరు భారతీయ సైనికులు, బాకూకు వచ్చారు. బాకూ సభ వీరిని భారతీయ ప్రతినిధులుగా గౌరవించింది. పర్షియన్ కమ్యూనిస్టు సుల్తాన్ జాదే సూచనపై, బాకూ కాంగ్రెస్, కుఘుక్ ఖానును అభినందిస్తూ తీర్మానించింది, ఆసియాలో మొదటి ఎఱ్ఱ జెండాను ప్రతిష్ఠించిన గౌరవం సాధించినందుకు. ఈ కుఘుక్ ఖాన్ పర్షియాలో పేరుమోసిన దొంగలముఠా నాయకుడు. ఆలోచనారహితమైన ఈ వెఱ్ఱి ఉత్సాహంలో జినోవీవ్ తన మార్క్సు సిద్ధాంతాభిమానాన్ని గంగలో కలిపివేశాడు. "జాతీయవాదానికి ఎఱ్ఱరంగు పులుముకు" అని జినోవీవ్‌ను గదమాయించాడు లెనిన్!

బాకూ కాంగ్రెస్ తీర్మానం కొందరు ఛోటా బోల్షివిక్ నాయకుల్లో ఉత్సాహాన్ని రెచ్చగొట్టింది. కుఘుక్ ఖాన్ నాయకత్వంలో పర్షియా భూభాగంలో నిజంగా సోవియట్ రిపబ్లిక్ స్థాపించే ప్రయత్నాలు చేశారు. రష్యా నుండి ఆయుధాలనూ సైనిక సలహాదారులనూ రాజకీయతంత్రజ్ఞులనూ పంపారు. ఎన్‌జేలీ రేవు పట్టణానికి ఒక ఎఱ్ఱ సైనిక దళాన్ని పంపే ప్రయత్నం కూడా జరిగింది. రెండు రష్యన్ యుద్ధ నౌకలు నిజంగానే కాస్పియన్ సముద్రంలో ప్రత్యక్షమైనై, ఎఱ్ఱ దోపిడీ నాయకుణ్ణి కాడలగొట్టే ఉద్దేశ్యంతో. సమయానికి చిచిరిన్ జోక్యం కలిగించుకొని పరిస్థితిని అదుపులోకి తెచ్చాడు. ఎఱ్ఱ సైన్యదళం, కాస్పియన్ సముద్రం మీదుగా (ట్రాన్స్ కాస్పియన్ రైలు మార్గానికి కాపలా ఉండే నిమిత్తం) క్రాస్నో దస్కుకు పంపివేయబడింది. ఈ రైలు మార్గాన్ని, మెషెడ్‌లో ఉన్న బ్రిటిష్ ఇండియా సైన్యం, అనేక పర్యాయాలు ధ్వంసం చేసింది.

నాటికే, సమైక్య ఇస్లాం ఉద్యమనాయకు లిద్దరు సహాయార్థం మాస్కో వచ్చారు. రష్యా దక్షిణ సరిహద్దుల నతిక్రమించి విప్లవం పురోగమించే అవకాశాన్ని చాల ఆదుర్దాతో పరిశీలిస్తున్నారు. నాతో బాటు వీరికికూడా 'చక్రరాజు' భవనంలోనే విడిది యేర్పాటైంది. వారికున్నంత హోదా నాకు లేదు; కాని బోల్షివిక్ ప్రభుత్వానికి వారి కంటె నేను ఎక్కువ విశ్వాసపాత్రుణ్ణి గదా!

## పతితులైన సమైక్య ఇస్లాంవీరులు

చిరకాలంగా చివికిపోయిన టర్కీ పతనం మొదటి ప్రపంచయుద్ధంతో పూర్తి అయింది. 1908 నుండీ టర్కీ భవితవ్యాన్ని నిర్ణయిస్తూన్న త్రిమూర్తులు-తలట్ పాషా, ఎన్వర్ పాషా, జమాల్ పాషా-శరణార్థులై జర్మనీ పారిపోయినారు. జర్మనీ, టర్కీకి మిత్రరాజ్యం; కాని జర్మనీకూడా పతనమైంది. అందుచే ఈ శరణార్థులను రక్షించే

పరిస్థితిలో లేదు. ఈ త్రిమూర్తులకు కమ్యూనిజం అంటే గిట్టదు; కాని వారిలో "ఇది కూడా మన మేలుకే జరిగిందా" అనే ఆలోచనకూడా లేకపోలేదు. సమైక్య ఇస్లాం నాయకులైన వీరికి జారుసామ్రాజ్య విచ్ఛిన్నం క్రొత్తఆశలను చిగురింపజేసింది. మధ్య ఆసియాలో క్రొత్త ముస్లింరాజ్యాన్ని స్థాపించాలనే కలలు వీరిని వెన్నాడినై. ఆ విధముగా తమ గౌరవప్రతిష్ఠలను పునరుద్ధరించుకొనటం ఎలాఉన్నా, ముందు తమ ప్రాణాలను రక్షించుకొనాలి; వీరిని బ్రిటిష్‌వారు రేచుకుక్కల్లా వెన్నంటి తరుముతున్నారు. ఇక వీరిని రక్షింపగల దేశం రష్యా ఒక్కటే!

యువ తురుష్కులకు (Young Turks) మొదట్లో, పారిస్ పుణ్యక్షేత్రం (మక్కా)గా ఉండేది. సాధారణ విద్యాభ్యాసానికేగాక, సైనిక శిక్షణకొరకు కూడా, ఫ్రాన్సు వెళ్ళేవారు; ఫ్రెంచి వారి రెండవ మాతృభాష; వారి నడవడిలో సైతం పారిస్ సంస్కారం ఉట్టి పడేది. కాని, ఉన్నట్లుండి రష్యా, బ్రిటనులతో మైత్రి చేసికొన్నది ఫ్రాన్సు. బ్రిటన్, రష్యా దేశాలు చిరకాలంనుండీ టర్కీ విరోధులు. అందుచే, టర్కీ ఫ్రాన్సు మైత్రికి స్వస్తి చెప్పి, జర్మనీ వైపు మొగ్గింది. జర్మనీ సైనిక బలం త్రిమూర్తులకు బాగా నచ్చింది; తత్ఫలితంగా, రిపబ్లికన్ ఫ్రాన్సుకు బదులు, సామ్రాజ్యవాద జర్మనీ పోషణ నర్థించారు; బెర్లిన్ - బాగ్దాదు రైలుమార్గానికి టర్కీ వారధిగా తయారైంది. కొద్దిరోజుల్లో జర్మన్ సైన్యం, ఆ వారధి మీదుగా నడిచి, బ్రిటిష్ ఇండియా సరిహద్దులను చేరుతుందని గర్వించేవారు. ఈ విధంగా ఆర్థిక, సైనిక విషయాల్లో తమ దేశాన్ని జర్మనీకి ఉపగ్రహంగా మార్చటంవల్ల, యువ తురుష్కులు ఫ్రాన్సు సానుభూతిని కోల్పోయినారు. అదీగాక, ఆర్మీనియాలో క్రిస్టియనులను వధించినందువల్ల సంయుక్తరాష్ట్రాల్లోనేగాక యావత్ క్రిస్టియన్ ప్రపంచంలో ప్రజాభిప్రాయం టర్కీకి వ్యతిరేకంగా తయారైంది. ఈ కారణాలన్నిటివల్ల, తమ దేశంనుండి పారిపోయిన తురుష్కమూర్తిత్రయం నిస్సహాయులైనారు.

ఈ పాషాలకు జర్మనీలో మిత్రులూ, సానుభూతిపరులూ ఉన్నారు. కాని ఈ జర్మన్లు స్వదేశంలో అరాజకాన్నీ, విప్లవ ప్రతిఘటననూ రెచ్చగొట్టగలరే గాని, పదవీచ్యుతులై పారి వచ్చిన తమ మిత్రులకు సహాయంచేసే స్థితిలో లేరు. ఈ త్రిమూర్తులైనా, జర్మనీలో ప్రశాంత శరణార్థి జీవితం గడపటానికి నిర్ణయించినట్లయితే, మిత్రమండలి రాజ్యాలు వారి జోలికిపోయేవి కాదు. వీరిలో పెద్దవాడూ, కౌటిల్య ప్రజ్ఞ గలవాడూ తలట్ పాషా. అచిరకాలంలోనే జర్మన్ సైనికబలం పునరుద్ధరింపబడగలదనీ, జాతీయంగా, అంతర్జాతీయంగానూ తన ప్రతిష్ఠ పునరుద్ధరించటానికి జర్మనీ సహాయం చేయగలదనీ ఆతని దృఢవిశ్వాసం. అందుచే, జర్మనీలో పరిస్థితి సుముఖంగా తయారయ్యేవరకూ, రాజకీయాలనుండీ, తాను వైదొలగినట్లు నాటకం ఆడగలడు. కాని మిగిలిన ఇద్దరి స్వభావం ఇదికాదు.

ఎన్వర్ పాషాలో ఆశతో బాటు అసహనంకూడా ఎక్కువే; యువకుడు; అందుచే తలట్ పాషాలోని అనుభవమూ, జ్ఞానము ఇతనిలో కన్పించవు. అంతేగాక బ్రిటిష్‌వారు పట్టుకొని వధిస్తారేమోనన్న భయంతో బాధపడుతున్నాడు. ఐనా జారు సామ్రాజ్య విచ్ఛిన్నంతో తమ కలలు ఫలించబోతున్నాయనే ఊహలను రెచగొట్టిం దాతని పేరాస. కాని ఇవి ఫలించటానికి కొంత రాజకీయ చాణక్యం అవసరం. ఆ ఎత్తులతోనే అతడు రష్యా వచ్చాడు. బ్రిటిష్ సామ్రాజ్యంపై మధ్యప్రాచ్యంలోని ముస్లిం ప్రజలను రెచ్చగొట్టటంలో బోల్షివిక్కులతో సహకరిస్తానని వాగ్దానం చేశాడు. ఇండియా ఆఫ్ఘనిస్తాన్‌ల సరిహద్దులలో నున్న ముస్లిం కొండజాతుల సహకారంతో, ఇండియాలో చెలరేగే ఖిలాఫత్ ఉద్యమంతో సంబంధ మేర్పరచు కొంటాననీ, ఆఫ్ఘన్ రాజైన అమనుల్లా తనతో తప్పక సహకరిస్తాడనీ, అనతి కాలం లోనే తాను కాబూలు నేతన కార్యక్రమానికి కేంద్రం గా చేయబోతున్నాననీ వివరించాడు. వాయువ్య సరిహద్దులోని కొండజాతి ప్రాంతాలలో సైనిక చర్యలు జరుపుచున్న తన సందేశాన్ని వినీవినటంతోనే భారతీయులు విజృంభించి బ్రిటిష్ పరిపాలకులను పారద్రోలుతారు అనికూడా హామీ ఇచ్చాడు!

ఎన్వర్ పాషా రాజనీతికి రష్యన్లు మురిసిపోయినారు. అగ్రనాయకుల్లో కొందర్ని మినహాయించి, రష్యాలో ఎవ్వరికీ ఇండియా పరిస్థితులను, అచటి విప్లవ అవకాశాలను గురించి తెలియదు. వీరిలో చాలమంది ఇండియాను ముస్లింరాజ్యంగానే భావించేవారు. ఏమైనా, తురుష్క మంత్రిత్రయాన్ని మాస్కోకు ఆహ్వానించారు. కాని తలట్ పాషామాత్రం మాస్కోకు రాలేదు; ఎన్వర్ పాషా, జమాల్ పాషాలు మాస్కోకు వచ్చారు. జమాల్ పాషా చాల జాగ్రత్తమనిషి; మితభాషి; సైనిక వ్యూహరచనలో మంచి అనుభవం ఉన్నవాడు; త్వరలో జర్మనీ పునరుద్ధరణ జరుగుతుందనే తలట్ ఆశల్లో ఇతనికి విశ్వాసంలేదు; ఐతే ప్రాణాపాయాన్నిగురించి ఎన్వర్ కంటె ఎక్కువగా భయపడేవాడు. అందుకు కారణంకూడ లేకపోలేదు; ఆర్మీనియనుల హత్య కతడే స్వయంగా బాధ్యుడు! ఏమైనా కొంత ప్రపంచాన్ని, ఉన్న అవకాశాలనూ స్వయంగా పరిశీలించే ఉద్దేశ్యంతో మాస్కో వచ్చాడు జమాల్.

ఈ పాషాలు మాస్కోకువచ్చిన పరిస్థితులుకూడా అనుమానికి కారణమైనై. జర్మన్‌సైన్యానికి చెందిన విమానంలో రహస్యంగా ప్రయాణంచేశారు. మిత్రమండలి సైన్యాలకు పూర్తిగా లొంగని జర్మన్‌సైన్యం, పాషాల సాహసంలో శ్రద్ధవహిస్తున్న దనే విషయం స్పష్టమౌతుంది. రష్యాలోకూడ వీరికి ఘనమైన స్వాగతం లభించలేదు; అనామకమైన ప్రదేశంలో బస యేర్పాటైంది. ఐతే ప్రభుత్వ అతిథులనే అభిప్రాయం కలిగించే నిమిత్తమై విదేశ వ్యవహారాల ఉపమంత్రి నివాసం ఆవరణలో వీరి విడిది ఏర్పాటుచేసారు; అంతకుమించి వీరిని తలచినవారేలేరు. చక్కెరరాజు ప్రాసాదంలో కేంద్రభవంతికి ఇరువైపులా ఎదురెదురుగా రెండుభవనాలున్నై; ఇవి రెండంతస్తుల

భవనాలు; మొదట్లో ఈ భవనాల్లో ఏవో కార్యాలయాలుండేవి; ప్రస్తుతం ఇవే పాషాల విడిదిగృహాలు; వీరికి మందీ మార్బలం చాలాఉండేది!

పాషాలు ఎప్పుడూ బైటికి వెళ్ళేవారు కాదు; ఉభయపక్షాలవారూ పరస్పరం కలుసుకున్నట్లు కూడా ఎన్నడూ చూడలేదు. వేసవికాలం పగటిపూట కొంచెం వేడిగా ఉండేది; అందుచే ఈ అతిథి పుంగవులు, సాయంత్రం వేళ తమ తమ మేడల మీద మాత్రం విహరిస్తుండేవారు. కేంద్రభవంతిలో నా విడిది; కిటికీ తెరల మరుగు నుండి వీరని చూస్తూ ఉండేవాణ్ణి. ఎన్వర్ పాషా, సర్వదా సైనిక దుస్తులు ధరించి దర్పంగా ఉండేవాడు; అతనిలో అసంతృప్తి, ద్వేషం నివురుగప్పిన నిప్పులా కన్పించేవి. స్వజనంతో కూడా మాట్లాడేవాడు కాదు. జమాల్ పాషా ఆజానుబాహు విగ్రహం; ఏబది పైబడిన వయస్సు; తీవిగా, పరసంగా కన్పించేవాడు. ఈ పాషా లిద్దరికీ స్వభావంలో పోలికే లేదు. కాని నిస్సహాయత, ఒంటరితనం ఇద్దరిలో కన్పించే సమాన లక్షణాలు; ఇద్దరూ బ్రతికి చెడినవారే; వారిని చూచి సానుభూతి వహించనివారు సాధారణంగా అరుదు. ఈ విషాద నాటకంలో బొరోడిన్ హాస్యాన్ని ప్రవేశపెట్టాడు.

పాషాలు, తామొక మహత్తర రాజకీయ సాధనకై రష్యా వచ్చినట్లు భావించేవారు; అందుచే వారికి విదేశాంగమంత్రియే స్వయంగా స్వాగత మీయాలని వారి అభిప్రాయం. ఆ లాంఛనాలన్నీ పూర్తయే వరకూ, తాము సోవియట్ రాజధాని లోని సాంఘిక కార్యకలాపాల్లో పాల్గొన కూడదనీ భావిస్తుండేవారు. అంటే, ఇంకా వారి ప్రపంచమే వారిది! తమ హోదా బహిరంగంగా గుర్తింపబడి గౌరవింపబడే వరకూ వారు బైటికి రాకూడదు. ప్రతి రోజూ సాయంత్రం మేడమీద కూర్చొని కారఖాన్ తన కార్యాలయానికి వెళ్ళటం చూస్తూనే ఉండేవారు; తను నాతడు గమనించని విషయం కూడా గమనించేవారే! ఎంతటి అవమానం! ప్రతి నిత్యం వారి కది బాధాకరమైన అనుభూతి! ఇందులో కారఖాన్ తప్పేమీ లేదు. సహజంగానే అతనికి బిడియం ఎక్కువ; అదీగాక ఈ అతిథుల హోదా కనుగుణంగా గౌరవించవలసినవాడు చిచిరిన్; ఇక చిచిరిన్ తటపటాయిస్తున్నాడు. పాషాలతో మైత్రి వహించి, ఇంత త్వరలో కర్జన్ ప్రభువు ఆగ్రహానికి గురికావటం అతని కిష్టం లేదు. కాబట్టి మాట వస్తుందనే భయంతోనే కారఖాన్ పాషాల విషయం పట్టించుకొనేవాడు కాదు. బొరోడిన్ అంటూ ఉండేవాడు: "కారఖాన్ కారులో వెళ్ళటం చూసినప్పుడల్లా పాషాలు పళ్ళుకొరుకుతూ ఉంటారు; స్వదేశంలో దొరికితే ఎప్పుడో అతని పనిపట్టి ఉండేవారు." కారఖాన్ ఆర్మీనియా దేశస్థుడు!

పరిస్థితి చాల విషమంగా తయారైంది. ఎవరో ఒకరు పిల్లికి గంటకట్టాలి. మాటవస్తే రానీమని నేను సిద్ధమైనాను. కాని నాదొకరకమైన భయం; ఉభయులను ఒకేమారు కలుసుకొనటానికి అవకాశంలేదు. ముందుగా ఒకరిని కలుసుకుంటే

మరొకరికి ఆగ్రహంరాకతప్పదు! ఇద్దరిలో ఎవరిని చూడటం ముఖ్యం! ఇద్దరిలో జమాల్‌పాషా పెద్దవాడు; దూరాన్నుంచే చూచినా ఇతనిపట్ల నాకెందుకో అభిమానం కలిగింది. బొరోడిన్ అభిప్రాయం మరొకవిధంగాఉంది. పెద్దవాడూ, లోకానుభవం కలవాడూ ఐనందున, జమా ఎటూ సరిపుచ్చుకుపోతాడు. అందుచే యువకుడూ, దురభిమానియైన ఎన్వర్‌నే ముందు కలుసుకొని అతణ్ణి శాంతింపజేయటం ఉచితం, ఎన్వర్ యువ తురుష్క ఉద్యమానికి చెందినవాడు; సమైక్య ఇస్లాం ఉద్యమనాయకుడుగా ప్రసిద్ధికెక్కినవాడు" అని బొరోడిన్ సలహా. నాకిది నచ్చలేదు; ఐనా విప్లవ శ్రేయోభివృద్ధిదృష్ట్యా కొంత చాణక్యం అవలంబిద్దామనే నిర్ణయించాను. ఒక ప్రాచ్య రాజధానికి రాబారిగా వెళ్ళటానికి ఊహిస్తున్న నాకిది మంచి అనుభవంకూడా కావచ్చు!

మరునాడుదయమే, ముందుగా కబురంపి ఎన్వర్‌పాషాను కలుసుకున్నాను. నావెంట బొరోడిన్‌కూడా వచ్చాడు. ప్రాచ్య మర్యాదల ననుసరించి మమ్మల నాహ్వానించాడు; సందర్భానికి ఉచితం కాకపోయినా పెద్ద టీపార్టీ యేర్పాటుచేశారు; ఎన్వర్‌పాషా ఇంకా నడివయస్సులోనే ఉన్నాడు; నలభై ఐదూ, ఏభై లోపుగా ఉంటుంది వయస్సు. అంత పొడవరికాదు; అందంగాఉంటాడు; బిగుతుగా ఉండే దుస్తులు ధరించాడు; చక్కని ఫ్రెంచిలో మాట్లాడాడు "మాస్కోలో ఎన్నోరోజులుండననీ, త్వరలో జర్మనీకి తిరిగి వెళ్ళుతున్నా"ననీ చెప్పాడు. తనదేశ గౌరవాన్నీ, తమ మిత్రుని గౌరవాన్ని పునరుద్ధరించటానికే తన జీవితాన్ని అంకితం చేస్తానన్నాడు. ఈ నైతిక బాధ్యతే లేకున్నట్లయితే యుద్ధరంగం నుండి విరమించి, విద్యాభ్యాసంతో ప్రొద్దుపుచ్చేవాడట!

చేతి వజ్రపు టుంగరాల నుండీ కాంతులు ప్రసరించేటట్లు హావభావాలు ప్రదర్శిస్తూ, పారిస్ విలాస మందిరంలో ప్రసంగిస్తున్నట్లున్న అతని ధోరణి పరిశీలించిన తరువాత, అతనితో వ్యవహార విషయాలు మాట్లాడ బుద్ధిపుట్టలేదు. అధికార హోదాలేమీ లేని ఒక అపరిచిత వ్యక్తితో వ్యవహారం చర్చించటాని కాతడూ సముఖుడు కానట్లుతోచింది. బొరోడిన్ కేవలం తమాషా చూస్తున్నట్లు కూర్చున్నాడు. బైటికి రావటంతో బొరోడిన్ అడిగాడు.

"ఎన్వర్ 'కార్సెట్' * ధరించాడు గమనించావా?"

"లేదే" అంటూ ఆశ్చర్యాన్ని వెళ్ళడించాను.

"నువ్వు వట్టి అమాయకుడివి."

---

* స్త్రీలు ధరించేది. Corset — Woman's closely fitting inner bodies stiffened with whole fastened by lacing.

ఎన్వర్‌తో మాట్లాడినంతసేపూ జమాల్ పాషా ప్రసక్తేరాలేదు. కాని ఆ మరునా డుదయమే ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. జమాల్ పాషా స్వయంగా నా బసకే వచ్చాడు. ఆ సాయంత్రం తా నేర్పాటు చేస్తున్న టీ పార్టీకి ఆహ్వానించాడు. నాకు చాల సంతోషమైంది; ఆహ్వానాన్ని ఆనందంతో అంగీకరించాను. అది కేవలం టీ పార్టీయే కాదు. ఎన్వర్‌లో కన్పించే ఆడంబరత్వం జమాలులో లేదు; అతనివి సాధారణమైన అలవాట్లు; ముచ్చటైన పద్ధతులు. ఆర్మీనియా హత్యాకాండకు ఇతడు కారకుడా? అనిపించేటంతటి హృదయరంజకంగా ఉంటుం దాతని ప్రవర్తన. అంతేగాదు ఆ హత్యాకాండకు తన బాధ్యత నెన్నడూ అతడు కాదనలేదు జమాల్; "చేస్తున్నది సైనిక దండయాత్ర; శత్రువుల భూమి; ఆ పరిస్థితిలో హత్యాకాండ వినా గత్యంతరం లేకపోయింద"ని మాత్రం సమర్థించుకొనేవాడు. దీనితో ఎదుటివారు అస్త్రసన్యాసం చేయాల్సి వచ్చేది. ఐనా మా మైత్రి కొంతకాలం సాగిన తర్వాత గాని ఈ విషయాన్ని గురించి జమాల్‌తో నేను మాట్లాడ లేదు.

మొదటి సమావేశంలో కూడా, జమాల్ కేవలం పిచ్చాపాటీ మాట్లాడ లేదు. టీ పార్టీ ఐన వెంటనే తన పరివారాన్ని లోపలికి పంపివేసి వ్యవహారానికి వచ్చాడు. "నీవు రష్యానాయకుల ఆదరాభిమానాలు సంపాదించావు. నీకీ విషయాలు తెలిసే ఉండాలి. నన్ను గురించి వా రేమనుకుంటున్నారు? నాలో వారికి నమ్మకం ఉందా? జమాల్ ఉత్తమ పురుష ఏక వచనంలోనే మాట్లాడటాన్ని జాగ్రత్తగానే గమనించాను. అది ఎన్వర్‌తో తనకు సంబంధం లేదని సూచించే ప్రయత్నమే. "ఆ విషయం తెలుసుకొంటాను" అని వాగ్దానం చేస్తూ అడిగాను, "మీ ఆశయం ఏమిటి?"

"నా దేశాన్ని సేవించటమే."

"ఐతే, కెమాల్ పాషాతో మీరు సహకరిస్తారా? కెమాల్‌కు రష్యా సహాయం చేస్తున్నది."

ఈ ప్రశ్నతో అతని ముఖం గంభీరమైపోయింది.

"ఇది చాల చిక్కు ప్రశ్న; ఆలోచించి చెబుతాను." అన్నాడు.

ఈలోగా చిచిరిన్‌ను కలుసుకుంటే పరిస్థితులన్నీ చక్కబడగలవని అతని ఆశ!

కెమాల్ పాషా టర్కీ క్రొత్త పాలకుడు; ఈ ముగ్గురూ ప్రాత పాలక బృందానికి చెందినవారు. ఉభయుల మధ్య సరియైన సంబంధాలు లేవు. పరాజయానంతరం వీరు దేశాన్ని వదలి పారిపోయినప్పుడు, కెమాల్ అనటోలియా అడవుల్లోనికి ఉపసంహరించుకొని, విజేతలైన మిత్రమండలి సైన్యాలను ప్రతిఘటించటానికై ప్రయత్నాలు చేశాడు. అందుకు ఎంతో సాహసం అవసరం; ఐనా కెమాల్ చాల వరకు విజయాల్ని సాధించాడు. ఐనప్పుడు, విదేశాల్లో తల దాచుకొంటున్న పాత

పరిపాలకుల అధికారాన్ని కెమాల్ గౌరవిస్తాడా? నిజానికి కెమాల్ నడిపిన విప్లవం, యువ టర్కీ పేరుతో నడుస్తున్న ప్రాచీన పాలనా విధానం మీదనే. అతని ఉద్యమ లక్ష్యం ఇస్లాం సమైక్యతా కాదు; తురుష్క జాతి ఐక్యతా కాదు. అతని విప్లవం టర్కిష్ సుల్తానేటునేగాక ముస్లింఖిలాఫత్ నుగూడా తుడిచిపెట్టింది. యువతురుష్కులు ఇస్లాం సమైక్యత (Pan-Islam) అనే భావాన్ని ప్రోత్సహించారు; నీరసించి విచ్ఛిన్నమైపోతున్న తురుష్క సామ్రాజ్యాన్ని పునరుద్ధరించటమే వారి మహాదాశయం; అంటే వారు తురుష్క జాతీయైక్యతావాదులు; కాబట్టి కెమాల్ జాతీయ కార్యక్రమం వారికేమాత్రం నచ్చలేదు. ఒకప్పుడు కెమాల్ తమ ఉద్యోగి అనే సంగతి మరచిపోతేగాని పాషాలు అతనితో సహకరింపలేరు; క్రొత్త పరిస్థితికి తలనొగ్గి పాషాలు కెమాల్ నాయకత్వాన్ని అంగీకరించాలి!

ఎన్వర్ పాషావంటి స్వార్థపరుడు, దురాశాపరుడు, దేశభక్తికి ఆత్మగౌరవాన్ని బలిచేస్తాడనుకోవటం కేవలం వెఱ్ఱి. కాని జమాల్‌పాషాపట్ల మొదటి సమావేశంలోనే సదభిప్రాయం కలిగింది; అతనిలో వాస్తవిక దృక్పథాన్ని కలిగించవచ్చు. కెమాలు ఉద్యమంలో సహకరించటానికి రష్యన్లు అంగీకరించారు. ఈ సహాయాన్ని పతితవీరులవైపు మరలించటంవల్ల రష్యాకు కలిగే ప్రయోజనం లేదు. అందుచే మూర్తిత్రయానికి రష్యా సహాయమనేది అసంభవం! కొన్ని రోజుల తరువాత జరిగిన సమావేశంలో చిచిరిన్ ఈ విషయాన్నే స్పష్టం చేశాడు. దానితో ఎన్వర్ పాషా కోపం ఎక్కువైంది. వెంటనే జర్మనీ వెళ్ళిపోతానన్నాడు. అది కేవలం బెదరించేదని నాకు తెలుసు. ఐనా, వెళ్ళితే వెళ్ళాడనే భావంతో, జమాల్ పాషాపై నా దృష్టి కేంద్రీకరించాను. నా ప్రయత్నం ఫలించింది. వెంటనే, నేరుగా అనటోలియా కేగి, తనకున్న సైనికానుభవంతో, శక్తిసామర్థ్యాలతో కెమాల్‌కు సాయం చేస్తానన్నాడు. ఈ ఉదారబుద్ధివల్లనే జమాల్ రష్యనుల ఆదరాభిమానాలకు పాత్రుడైనాడు. జమాల్‌లో ఆశ లేకపోలేదు; కాని దురాశను తృప్తిపరచటానికై ఎన్వర్‌లో ఉన్న అసంబద్ధ ప్రణాళికలు జమాల్‌కు లేవు. జమాల్ ముందున్నవి రెండే రెండు కార్యక్రమాలు: ప్రాణభీతితో, ఆజన్మ ప్రవాసంలో కాలం గడపటం, లేదా స్వదేశానికి మరలి, మర్యాదగా మాతృదేశసేవకు జీవితాన్ని అంకితమొనర్చటం. చివరకు జమాల్ చాల తెలివైన నిర్ణయం చేశాడు.

కాకసస్ ద్వారా అనటోలియా చేరటానికి కొంతదూరం అరాజక ప్రాంతాలగుండా ప్రయాణం చేయాలి. ఈ ప్రాంతంలో జమాలుకు సరియైన రక్షణ కల్పించటం రష్యనులకు సాధ్యం కాదు. అందుచే అతని ప్రయాణ విషయం అతిరహస్యంగా ఉంచబడింది; ముఖ్యంగా ఎన్వర్ పాషాకుగానీ, అతని పరివారానికిగాని తెలియనీయలేదు. ఇది జమాలు నన్ను స్వయంగా కోరటంవల్ల జరిగిన ఏర్పాటే. అందుచే

వీడ్కోలు విందు ఆడంబరంగా జరపటానికి వీలులేకపోయింది. కొంతకాలంవరకూ, జలుబువల్ల జమాల్ బైటికి రావటం లేదనే వదంతికూడా ప్రచారం చేశాం.

ఆ రాత్రికే జమాల్ మాస్కోనుండి బయలుదేరాలి. జమాల్, బొరొడిన్‌లను టీకి ఆహ్వానించాను. టీ అనంతరం జమాల్ మాకు సిగరెట్ల నిచ్చాడు. టర్కిష్ సిగరెట్లు చాల ప్రసిద్ధమైనవి. జమాల్, బొరొడిన్లు సిగరెట్లు ముట్టించారు. నా సిగరెట్ ముట్టించుకొనపోతుండగా, జమాల్ టేబుల్ మీదికి వంగి నిప్పుపుల్లను ఆర్పి వేశాడు. ఒక అగ్గిపుల్ల మూడు సిగరెట్లను అంటించకూడదు! తన క్రొత్త మిత్రునికి అపాయం రావటం భరింపలేడు. నేనూ, బొరొడిన్ నాస్తికులం; మాకు ఆ మూఢ విశ్వాసం వింతగా తోచటంలో విశేషం లేదు; జమాల్‌కు మాత్రం అందులో అచంచలమైన నమ్మకం. అటువంటివి జరగటం తను కన్నులారా చూచాడట!

రెండు వారాలు గడిచినై; ఆ మరునాడే టర్కిస్థాన్‌కు నా ప్రయాణం. చెకాకు వర్తమానం వచ్చింది. కాకసస్ టర్కీలకు మధ్య అరాజక ప్రాంతంలో ఒక ఆర్మీనియన్, జమాల్ పాషాను కాల్చి చంపాడు! నన్ను దురదృష్టంనుండి కాపాడటానికాతడు చెందిన ఆందోళన గుర్తుకువచ్చి చాల బాధ కలిగింది; ఎన్నో రోజులు గడవక పూర్వమే, జర్మనీలో, బర్లెరియా స్నానవాటిక చెంత తలట్ పాషాకు కూడా అదే దుర్గతి పట్టిందనే వార్త తెలిసింది. తలట్, జమాల్ పాషాలు ఆర్మీనియన్ ప్రతీకార కాంక్షకు బలియై పోయినారు.

## ఆసియాలో విప్లవం

ఆసియాలో విప్లవపరిణామాలను గురించి పగటికలలు కంటున్న రష్యానాయకులకు, ఎన్వర్ పాషా వ్యవహారం కండ్లుతెరిచింది. స్వచ్ఛందంగా విజృంభించిన వలస ప్రజానీక విప్లవ మహోగ్రతను చిత్రించి సామ్రాజ్యవాదులను హడలగొట్టవచ్చునని రష్యన్లు ఆశించారు. "అది ఎంతవరకు సత్యం?" అని ప్రశ్నిస్తూ ఉండేవాణ్ణి. 'శాస్త్రీయ సోషలిజమే' బోల్షివిక్ నాయకుల వేదం; ఐనా వారు గాలిమేడల్లో విహరిస్తుండేవారు. వారికి అంతే, సామ్రాజ్యవ్యతిరేక వాద జాతీయభావం విప్లవాత్మకం కాదనీ, సమైక్య ఇస్లాంఉద్యమం కేవలం ప్రతీపగామిశక్తియేననే నా వాదం కేవలం నిరాశావాదం; అది వారికేమాత్రం రుచించలేదు. కాని నా భయాలూ, అనుమానాలూ నిజమేనని ఎన్వర్‌పాషా రుజువుచేశాడు. ఎన్వర్ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ద్వేషిస్తున్నాడనేది అందరికీ తెలిసినదే; ఐతే సమైక్యఇస్లాం ఉద్యమ నాయకత్వం వహించిన ఎన్వర్ సాంఘికంగా విప్లవకారుడని ఎవ్వడూ అంగీకరించడు. ఐనప్పటికీ రష్యన్ బోల్షివిక్కులతనితో మైత్రివహించటమే ఆశ్చర్యకరమైన విషయం.

## వలస జాతీయోద్యమ సమస్య

అనుభవంతో ఊహాసౌధాలు కూలిపోవటం సహజం. బోల్షివిక్కుల్లో విచక్షణాజ్ఞానం కలవారు నా వాదంలోని సత్యాన్ని గ్రహింపసాగారు; ఏవర్గం నడుపుతున్నా, చారిత్రకంగా వలసల జాతీయోద్యమం విప్లవశక్తియేననీ, అందుచే ప్రపంచ కార్మిక విప్లవంలో అంతర్భాగంగా ఆ ఉద్యమాలతో పూర్తిగా సహకరించాలనే లెనిన్ సిద్ధాంతాన్ని ఎదిరించటంలో నా ఉద్దేశ్యాన్ని, అందలి హేతుతత్వాన్నీ గమనించారు. మధ్యప్రాచ్యంలోనూ, హిందూదేశంలోనూకూడా బ్రిటిష్ వ్యతిరేకతకూ, ఇస్లామ్ సమైక్యతకూ చిహ్నంగా ఎన్వర్ పాషాకు బోల్షివిక్కులు బ్రహ్మరథంపడుతున్నారు. ఈ ఎన్వర్ పాషా సోవియట్ సహాయం అర్థిస్తున్నాడు. ఎందుకు? విప్లవం ఆసియాలోకి విస్తరించకుండా అరికట్టటానికి! కాబట్టి ఆసియాలో విప్లవవ్యూహాన్ని పన్నే సందర్భంలో ఈ అనుభవం మార్గదర్శకంకావాలి. ఆసియాలో విప్లవం కార్మికవర్గ విప్లవం కాజాలదు; బూర్జువా ప్రజాస్వామ్య విప్లవంమాత్రమే. ఐతే, ఈ ప్రజాస్వామ్య ఉద్యమానికి సాంఘిక పునాదులు మాత్రం పటిష్టంగా నిర్మించటం అవసరం.

"వలసదేశాల్లో, జాతీయ బూర్జువావర్గం ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించలేదు" అనేదే నా వాదం. ఇండియావంటి బాగా అభివృద్ధిచెందిన వలసరాజ్యాల్లో కూడా జాతీయ ఉద్యమాల్ని బూర్జువా వర్గం నడపటంలేదని రుజువు చేశాను. ఈ రాజ్యాల్లోని బూర్జువావర్గం సామ్రాజ్యవాదులతో రాజీపడి, భూస్వామ్య సామాజిక పరిస్థితుల్లో మ్రగ్గుతున్న కార్మికులను దోచుకొన్న లాభాల్లో వాటా పంచుకొంటారు. బూర్జువా వర్గమే విప్లవాత్మకం కానిచో, ఇక మధ్యప్రాచ్యంలోని ముస్లింరాజ్యాల్లోని జాతీయోద్యమాన్ని సాగిస్తున్న భూస్వాములూ, పూజారులూ విప్లవ వ్యతిరేకులనటంలో సందేహం ఉండదు. నా వాదనను చక్కగా బలపరచాడు ఎన్వర్ పాషా.

సమైక్య ఇస్లాంకు గల విప్లవ ప్రాశస్త్యంలో బోల్షివిక్కులకు విశ్వాసం నీరసించింది. "హిందూ మహర్షి గాంధీ, ఖాన్ సోదరుల నాయకత్వంలో ఇండియా తిరుగుబాటు చేస్తున్నది. అందుచే వలస రాజ్యాల్లో మతంకూడా ఒక విప్లవ శక్తి అనే విషయం రుజువౌతున్నది" అని వారి ఉద్దేశ్యం. తలాతోకాలేని ఈ భావాలను తొలగించటానికై, కొన్ని వ్యాసాలు వ్రాశాను. వానిలో సమకాలిక భారతీయ సమాజ వ్యవస్థను సవిమర్శకంగాపరిశీలించి భూస్వామ్య సాంఘికసంబంధాలపై పెట్టుబడిమారు దారీ ఆర్థిక విధానం పులమబడుతున్నదనీ, అందుచేత పూజార్లు, రాజులు విప్లవోద్యమాలు నడిపిన మధ్యయుగ ఐరోపా పరిస్థితులకూ, భారతదేశ ప్రస్తుత సాంఘికపరిస్థితులకూ పోలికేలేదని స్పష్టంచేశాను. మతోద్రేకంతో ప్రజలు ఉద్రిక్తులౌతున్నారనేమాట నిజమే; సహాయనిరాకరణా, ఖిలాఫత్ ఉద్యమాలకు కారణం కూడా మతమే కాని, మతం వ్యక్తిని లౌకిక అధికారానికి బానిసగా మారుస్తున్నది. 'భగవన్నిర్మాణం' అనే

భావంతో సమకాలిక సాంఘిక వ్యవస్థను పవిత్రంగా ప్రజలు పరిగణించే ప్రమాదం ఉన్నది. కాబట్టి ప్రజానీకంలో విప్లవాత్మక ప్రజాస్వామ్య దృష్టి పెరగటానికి ఇండియాలోని సాంఘిక సాంస్కృతిక వాతావరణం అనుకూలంగా లేదు.

నాకూ కొన్ని పగటి కలలు లేకపోలేదు. క్రొత్తగా మార్క్సు మతాన్ని పుచ్చుకున్నవాణ్ణి; ఆ ఉద్రేకంలో శ్రామికవర్గం విప్లవాత్మక పాత్రను నిర్వహిస్తుందని దృఢంగా విశ్వసిస్తూ ఉండేవాణ్ణి. "ఇండియాలో, బ్రిటిష్ వలన ఆర్థిక విధానం బిగించిన చట్రాల్లోన్నే స్థానిక పెట్టుబడిదారీ విధానం పెరిగి, విప్లవాత్మకమైన శ్రామికవర్గ ఉదయానికి దారితీసింది. భూస్వామ్య సంబంధాలే వలస ఆర్థిక విధానానికి సాంఘిక పునాదులు. ఆ సంబంధాలలోనే తమ శ్రేయస్సులు పాదుకొనటం వల్ల, భారత బూర్జువావర్గం, భూస్వామ్య విధానాన్ని కూలద్రోసే ఉద్యమానికి నాయకత్వం వహించి రైతులను నడపజాలదు. ఐరోపాలో బూర్జువావర్గం విప్లవాత్మకమైన పాత్రను నిర్వహించిన మాట వాస్తవమే; కాని భారత బూర్జువా వర్గానికా అవకాశం లేకుండా చేసింది చరిత్ర. ఐతే ప్రపంచ చరిత్ర మాత్రం కారల్ మార్క్సు వ్రాసిన జాతకం ప్రకారం జరిగాల్సిందే! నిరపేక్షకమైన సాంఘిక పరిణామ శక్తుల ప్రభావంతో చరిత్ర పురోగమించాల్సిందే. ఏదో ఒక వర్గ ఇష్టానిష్టాలు అనే సాపేక్షకమైన విషయాలతో ప్రమేయమే లేదు. బూర్జువావర్గానికి సమ్మతం కానంత మాత్రంచేత విప్లవం ఆగదు; వారి తలదన్ని విప్లవం జరిగితీరుతుంది; బూర్జువావర్గ అసమర్థతవల్ల బూర్జువా విప్లవాన్ని నడిపే అవకాశాన్ని కార్మిక వర్గానికి దత్తం చేసింది చరిత్ర!" అని నాటి నా విశ్వాసం.

భారతదేశ పరిస్థితిని, మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించిన ఫలితంగా ఒక నిర్ణయానికి రాగలిగాను: "భారత జాతీయోద్యమ నాయకత్వాన్ని కార్మికవర్గం హస్తగతం చేసికోనిపక్షంలో, భారత జాతీయవాదం బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడి తీరుతుంది." అనేదే ఆ నిర్ణయం. నా నిర్ణయాన్ని విని, చిచిరిన్ 'నీవు కేవలం నిరాశావాదివి' అని హేళన చేశాడు; కాని ఆతనిది కేవలం గాలిమేడల్లో విహరించే ఆశావాదమే. క్రొత్త మతంలో నా కేర్పడిన గాఢవిశ్వాసానికి లెనిన్ మెచ్చు దిన్నాను. లెనిన్ కార్యశూరుడు. భారతదేశంతో బాటు వలసల జాతీయస్వాతంత్ర్య ఉద్యమ మనేది జటిలమైన సమస్య; ఆ సమస్యకు, ఒక నిర్దుష్టమై, ఆచరణ యోగ్యమైన పరిష్కారం పరిశోధించాలనే ఆతని తాపత్రయం.

ఎక్కడో దూరంగా రష్యాలో కూర్చుని చర్చించటంవల్ల ఇండియాలో సాధింపగలిగింది లేదు. ఇండియాలోనే ఒక సంస్థను స్థాపించి దానిద్వారా బాల్యావస్థలోనున్న ఉద్యమాన్ని ప్రోత్సహించవచ్చు; ఐతే సహాయాన్ని గురించి ఆలోచించే ముందు ఎవరికి సహాయం చేయాలో, ఏవిధంగా సహాయం చేయాలో నిర్ణయించటం

అవసరం. అందుచే ఇండియా సరిహద్దులకు సాధ్యమైనంత సమీపంలోనే రంగస్థలాన్ని ఏర్పాటు చేయటం ఆవశ్యకర్తవ్యం. తరువాత దేశంలో పలుకుబడిగలవారితో ఉత్తరప్రత్యుత్తరాలద్వారా సాన్నిహిత్య మేర్పరచుకొని, అనంతరం ఒకమహాసభను జరిపి, దేశంలో వాస్తవ ప్రజాస్వామ్య విప్లవం సాధించటానికి అవసరమైన సాధన సంపత్తిని గురించి ఆలోచించాలి. ఈకృషి ఫలితంగా విప్లవాత్మకసంస్థ పునాదులు బలపడి, గాంధీ నాయకత్వంతో తయారౌతున్న ప్రజాఉద్యమానికి పురోగామి కాగలుగుతుంది. ఐతే సహాయ నిరాకరణ అనే గాంధీ నినాదం కేవలం వ్యతిరేక నినాదం. నిర్దుష్టమైన లక్ష్యం క్రియాత్మకమైన కార్యక్రమం లేకపోతే ఆ విప్లవోద్యమం, మొదటి పరాజయంతో విచ్ఛిన్నమైపోయే ప్రమాదం ఉంది. "విప్లవాత్మక భావాలు లేనిదే విప్లవం అసంభవం" అనే విషయాన్ని లెనిన్ దగ్గర నేర్చుకున్నాను. లెనిన్ దగ్గర మరొకవిషయం కూడా నేర్చుకొన్నాను: "ప్రజాఉద్యమాన్ని నిర్దుష్టమైన గమ్యంవైపు క్రమంగా నడిపించటానికి, విప్లవాత్మక భావప్రోత్సాహమూ, లక్ష్యశుద్ధి గల సంస్థ చాల అవసరం. అట్టి సాధనం ఇండియాలో ఇంకా తయారు కాలేదు. కాబట్టి జాతీయ స్వాతంత్ర్యోద్యమంతో సహకరించటానికి పూర్వం ఆ ఉద్యమం ఆశించే లక్ష్యాన్ని స్పష్టంగా నిర్వచించి ప్రజలకు నచ్చజెప్పాలి. అలా జరిగినప్పుడు, ఆ ఉద్యమంలో ప్రగతిశీలురైన కొందరు విప్లవాత్మకమైన తమ కృషి ప్రాధాన్యతనూ, పరస్పర సహకార ఆవశ్యకతనూ గుర్తించి, సన్నిహితులై ఆ ఉద్యమ నాయకత్వం వహించటానికి ఉద్యుక్తులౌతారు."

ఇది దీర్ఘకాలికమైన కార్యక్రమం. అనుభవం నాకు ఓర్పును నేర్పింది; అంతిమవిజయంలో విశ్వాసాన్ని కలిగించింది మార్క్సిజం. ఆసన్న భవిష్యత్తులో గాంధీ సహాయనిరాకరణోద్యమం సాధింపగలిగేదేమీ లేదనే నా తీర్మానం. కాని నిరంతరంగా జరుగుతున్న ఆందోళనవలన నిద్రాణమైయున్న సాంఘికశక్తులు విజృంభిస్తై; ఐతే వానిని సక్రమమార్గంలో నడిపించాలి; ప్రచారంద్వారా తమతమ విప్లవ ప్రాధాన్యత నా శక్తులు గుర్తించేటట్లు చేయాలి. ఈ ప్రచారం సరిహద్దులకు సమీపంలోఉన్న విదేశ కేంద్రాలనుండి జరగాలి. అందుకు కాబూలు చాలా అనుకూలమైనదని నిర్ణయించాను.

## రస్కాల్నికొవ్ దంపతులు

రష్యా రాయబారిగా, నేనే కాబూలు వెళ్ళాలని కొందరు సూచించారు; అందువల్ల ప్రయోజనముండబోదని ఆఫ్ఘన్ ప్రభుత్వం భయపడింది. ఆఫ్ఘన్ల ఉద్దేశ్యం 'నేను కేవలం అనామకుణ్ణి' అని కాదు. నన్ను రాయబారిగా నియమించిన మరుక్షణములో తమకూ, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికీ మధ్యగల విదేశీసంబంధమైన వ్యవహారాలు స్తంభించిపోయే ప్రమాదమున్నదనే వారిభయం. అదీ నిజమే; ఇండియాపట్ల

సుహృద్భావం వ్యక్తంచేయటానికి నన్నొక ఉద్యోగానికి ముడిపెట్టటం ఆటంకం కావచ్చునని లెనిన్‌కూడా అభిప్రాయపడ్డాడు. అంతేగాదు; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మధ్యఆసియాశాఖలో సభ్యుడుగా, చాలరోజులవరకూ, అంటే విప్లవం విజయవంతం అయ్యేవరకూ నేను టర్కీస్థాన్‌లోనే ఉండవలసిన అవసరం యేర్పడవచ్చు. సత్వరమే ఇండియా పరిహద్దులకేగి పూర్వమిత్రులతో, సహచరులతో సంబంధాలు పునరుద్ధరించాలనే నామనస్సు ఆరాటపడసాగింది; కాని సువిశాలమైన మధ్య ఆసియా రంగస్థలంమీద విప్లవాన్ని నడిపే సదవకాశం నాలో ఉత్సాహోద్రేకాలను ఉద్బూతలూపింది. ఈ కార్యక్రమంద్వారా అనుభవం గడించటమేకాక, విప్లవాన్ని సుస్థిరంచేసి ఇండియా మొదలైన పెక్కుదేశాల సరిహద్దులకు విప్లవాన్ని గొనిపోయే అవకాశం ఉంది. 'విప్లవం తప్పనిసరి' అనే విశ్వాసం నాలో బలపడటంచేత, ఇండియాకు నా అవసరంలేదు అనేభావంకూడ కలగసాగింది; సమయం వచ్చినప్పుడు ఇండియాలో కూడా విప్లవం జరిగితీరుతుంది. కాబట్టి ఈలోగా విప్లవంలో మునిగి తేలటమే ఉత్తమ మార్గం.

ఈ కారణాల వల్ల, నన్ను కాబూలుకు సోవియట్ రాయబారిగా పంపే ప్రయత్నం విరమింపబడింది. చివరి క్షణంలో బొరొడిన్ కాబూలు వెళ్ళటానికి నిరాకరించాడు. బోల్షివిక్ ఐనవా డెవడూ బాధ్యతా నిర్వహణను నిరాకరించ కూడదు! ఐతే అతణ్ణి మాస్కోలోనే నిలుపుదల చేయటానికి యేమి ఇంద్రజాలం జరిగిందో తెలియదు. కాబూలుకు రస్కోల్నికావ్ నియమింపబడ్డాడు. రస్కోల్నికావ్ యువకుడు; మంచి అందగాడు. అతని తండ్రి జారుల ఆస్థానంలో ప్రముఖులైన ప్రభువర్గంలోని వాడు. రస్కోల్నికావ్ నౌకా దళంలో ఉద్యోగిగా క్రాన్‌స్టాడ్ తిరుగుబాటులో పాల్గొన్నాడు; ఈ తిరుగుబాటే పెట్రోగ్రాడ్ విప్లవానికి నాందియైంది; అంతర్యుద్ధ కాలంలో 'వోల్గా ఫ్లోటిల్లా'కు నాయకుడై నల్లసముద్ర యుద్ధంలో బ్రిటిష్‌వారిని ఓడించాడు.

రస్కోల్నికావ్ భార్య లారిస్సారీస్నర్. విప్లవంలో ప్రముఖపాత్రను నిర్వహించిన యువతీమణుల్లో ఒకతె. రీస్నర్, యూనివర్సిటీ ఆచార్యుని కుమార్తె; బాగా చదువుకొన్నది. రస్కోల్నికావ్‌ను పెండ్లాడక పూర్వమే సారస్వతంలో కీర్తిప్రతిష్ఠల నార్జించింది; అందగత్తె అని కూడా కీర్తి గడించింది. భర్తకు సహాయంగా '(Comrade-in-arms)' అంతర్యుద్ధంలో అసాధారణ సాహసకృత్యాలు జరిపింది. వోల్గా ఫ్లోటిల్లాపై పతాక రక్షణ శ్రేణిలో తుపాకి ధరించి పోరాడింది; తరచు రస్కోల్నికావ్ స్థానంలో రీస్నర్ ప్రత్యక్షమౌతూ ఉండేది. "ఇంట్లో బ్రౌజర్సు ధరించే రీస్నరే, నల్లసముద్ర యుద్ధంలో విజయం సాధించింది" అంటూ మిత్రులు పరిహాసమాడేవారు. "సోవియట్ పతాక నౌకమీద ప్రత్యక్షమైన మత్తెక్కించే సౌందర్యరాశిని చూచి భ్రమించి బ్రిటిష్ నౌకాదళాధిపతి తుపాకులు గురితప్పినై"

అంటూ ఉండేవారు సామాన్య ప్రజానీకం. "దేశంపై దండెత్తిన శత్రువులను నిర్మూలించటానికై అవతారం దాల్చిన వోల్గా దేవతయే రీస్నర్", అని వారి విశ్వాసం!

రాయబారిగా నియమింపబడినప్పుడు రస్కాల్నికావ్ బాల్టిక్ నౌకాదళానికి అధిపతిగా ఉన్నాడు. క్రొత్త ఉద్యోగానికి సంబంధించిన రాజకీయ విశేషాలను గురించి విదేశాంగశాఖతో చర్చించటానికి వారి సలహాలను పొందటానికి మాస్కో వచ్చాడు. పురాణప్రసిద్ధమైన యుద్ధ దేవతనూ, ఆమె భర్తనూ మాస్కోలోనే దర్శించాను. వాస్తవానికి రీస్నర్ స్వరూపంలో ప్రాచీన గ్రీకు దేవతామూర్తిని పోలి ఉండేది; ఆమెలో సంగ్రామ భీభత్సం ఏమాత్రం కన్పించలేదు. వారి దొక నిరాడంబరమైన బోల్షివిక్ గృహం; నౌకర్లు లేరు; గృహిణియే టీ తయారుచేసి తెచ్చి యిచ్చింది. రీస్నర్ ఆకర్షణీయమైన వ్యక్తి అనటంలో సందేహం లేదు. నా జీవితంలో అటువంటి స్త్రీని మరెక్కడా చూడలేదనటం అతిశయోక్తి కాదు! స్త్రీత్వం మూర్తీభవించినట్లుండేది ఆమె; గ్లాక్సోపాప ముఖంతో రస్కాల్నికావ్, భార్య ముందు దివిటీ ముందు దీపం! ఐనా లారిస్సా, రస్కాల్నికావ్‌ను గాఢంగా ప్రేమించేది; ఆదర్శ పత్నిలా ప్రవర్తించేది; భర్తను త్రోసిరాజనాలనే భావమే ఆమెకు ఉండేది కాదు. కాని తన వ్యక్తిత్వాన్ని చంపుకొనే స్వభావమూ కాదు ఆమెది. ఈ విషయానికే రస్కాల్నికావ్ గర్విస్తూ ఉండేవాడు. ఏమైనా, సుఖంగా సంసారం చేస్తున్న దంపతులు. ఉభయులూ, సాహసోపేతమైన జీవితాన్ని అనుభవించినవారు. క్రొత్త దేశంలో, ఉద్రిక్త వాతావరణంలో చవిచూడగల క్రొత్త సాహసాల నూహించి ఆవేశాన్ని పొందుతున్నారు.

ఆసన్నభవిష్యత్తులో, అంటే అఫ్ఘనిస్థానంలోని జీవిత పరిస్థితులను గురించి చెప్పవలసిందిగా కోరింది లారిస్సా. తన భర్త ఆశయం సఫలీకృతం కావటానికి తానేమైనా చేయటానికి సిద్ధం అనీ, అది తన విప్లవధర్మం అనీ చెప్పింది. ఈ ధర్మం కేవలం వివాహరీత్యా సంక్రమించింది కాదు. స్వయంగా తాను బోల్షివిక్! విప్లవానికి ముందే, విద్యార్థినీ దశలోనే ఆమె పార్టీలో చేరింది. ఆ రోజుల్లో, బోల్షివిక్ పార్టీలో చేరటం అంటే కష్టాలను కొనితెచ్చుకోనటమే! ప్రాచ్య రాజ్యస్థానాల అనుభవంలేని, నేను నా క్రొత్త మిత్రులకు, వాటి ఆచార వ్యవహారాలను గురించి చెప్పలేకపోయినాను. కాని లారిస్సాకు మంచి భావనాశక్తి ఉంది; అదీగాక అరేబియన్ నైట్సు గ్రంథాన్ని తిరిగి చదవటం మొదలు పెట్టింది. భావనాపథంలో అఫ్ఘన్ అమీర్ అమనుల్లా ఆస్థాన వాతావరణాన్ని సృష్టించుకొన గలిగేందుకు అమనుల్లా కూడా హరున్ అల్ రషిద్ * లాగానే ఉంటాడా అని ఆమె ఆశ్చర్యం. కాని మాకు

* బాగ్దాద్ నేలిన అరబ్ ఖలీఫాలలో సుప్రసిద్ధుడు హరున్ అల్ రషీద్ (క్రీ. శ. 786-809); అరేబియన్ నైట్సుకథ లితని పోషణలోనే రచింపబడినవి.

చేరిన వర్తమానాలనుబట్టి అమనుల్లా ఆధునిక భావాలు, సంస్కృతీ కలిగి నేటియుగానికి చెందిన వ్యక్తియే; ఐన పక్షంలో, రాయబారి భార్యగా తాను ఆస్థానంలో ప్రవేశించటానికి, అమనుల్లా అనుమతి నిరాకరించడు. లారిస్సా ఒక్క గడుగ్గాయిడిచే టట్లు చెప్పింది; తనకు ప్రాచ్య నాట్యపద్ధతులు తెలుసుననీ, అవకాశం లభిస్తే, కేవలం సరదాగా-అమనుల్లాను ఉల్లాసంకలిగించే నిమిత్తమేగాని మరే ఇతర ఉద్దేశ్యంతోనూ కాదు - నాట్యం చేస్తాననీ చెప్పింది. అందుకై తన భర్తగానీ, అమనుల్లా పట్టమహిషిగానీ అసూయపడకూడదు! రస్కాల్నికావ్ కండ్లలో గర్వంతో కూడిన అభినందన స్పష్టంగా కన్పించింది. "బ్రిటిష్ నౌకాదళాధిపతిని దిగ్భ్రాంతిలో ముంచిన నీకు అమనుల్లా ఒక లెక్కా" అనేవాడు. లారిస్సాకు కోపం వచ్చింది. "బ్రిటిష్ నౌకాదళాన్ని వోల్గానుండి తరిమికొట్టి నల్లసముద్ర యుద్ధంలో ఓడించింది నేను కాదు; సోవియట్ నౌకాదళం; దాని నాయకుడు కామ్రేడ్ రస్కాల్నికావ్" అంటూ అతణ్ణి మందలించింది. రస్కాల్నికావ్ సంతోషానికి పట్టపగ్గాలు లేకపోతున్నై. ఏమనేవాడోగాని తిరిగి లారిస్సా మందలించింది. "అంత కొంటెతనం పనికిరాదు."

లారిస్సా, రస్కాల్నికావ్‌ల వంటి వ్యక్తులు అరుదుగా ఉంటారు. వారి పరిచయభాగ్యం కలగటం నా అదృష్టమే. వారు కాబూలు నగరానికి, నేను టాష్కెంటు వెళ్ళేలోపల చాలాసార్లు వారిని కలుసుకున్నాను. కాబూలులో వారెంతోకాలం ఉండలేరు. అందుకుకారణం ఎన్వర్‌పాషా కుట్ర ప్రభావమే. అదీగాక ఆఫ్ఘనిస్థాన్‌లో 'ముల్లాల' (మతాధికారులు) ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. వారి మూఢనమ్మకాలకు అమనుల్లా బలికాక తప్పలేదు! ఆ కొద్దికాలంలోకూడా లారిస్సా, రస్కాల్నికావ్‌లు తమ పాత్రను చాల సమర్థంగా నిర్వహించారు! వారు నిజంగా నూటికి నూరుపాళ్లూ బోల్షివిక్కులు! అమనుల్లా విశ్వాసాన్ని చూరగొన్నాడు రస్కాల్నికావ్. తాను తనతండ్రిని హత్యచేసినట్లు అమనుల్లా రస్కాల్నికావ్‌తో చెప్పటమే అందుకు నిదర్శనం! తండ్రిని హత్యచేశాడుగాబట్టి తాను బోల్షివిక్కునని అమనుల్లా వాదం! ఇక లారిస్సాకు, సురయారాణితో స్నేహం చేసుకొన్నది. ఆమె అనుమతితో 'సలోమి' నాట్యంచేసి అమనుల్లాకు వినోదాన్ని చేకూర్చిందట!

## ఇండియా విప్లవానికి పథకం

ఇండియాలోని పరిస్థితులను గురించి ఇతర బోల్షివిక్కులవలెనే రస్కాల్నికావ్ కూడా కలలు కంటూ ఉండేవాడు. అతణ్ణి కాబూలులో రాయబారిగా నియమించటానికి కారణం కూడా అదే. కాబూలుకు బయలుదేరే ముందు నాతో మరీ మరీ చెప్పాడు, "ఇండియా సరిహద్దులోనున్న జాతులకు ఆయుధాలు, ధనం సరఫరా చేసే పథకం త్వరలో ఆచరణలోనికి వచ్చేటట్లు చేయవలసిందని". ఈ జాతులవారు

బ్రిటిష్ ప్రభుత్వంతో యుద్ధం చేస్తారట! వీరి తిరుగుబాటు ఫలితంగా బలహీనమైన బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఖిలాఫత్ ఉద్యమం సులభంగా కూల్చివేస్తుంది. ఇవన్నీ నా సూచనలే. నాకూ వారిలో విశ్వాసం పూర్తిగా పోలేదు. వీటిని ఆచరణలో పెట్టటం వల్ల మేలు జరుగవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వం కూలిన మరుక్షణమే ఇండియాలో విప్లవ జ్వాలలు విజృంభించి ఉన్నత వర్గాలు అధికారాన్ని పొందగల అవకాశ మేర్పడుతుంది; ఐనా, ప్రజాస్వామ్య శక్తులు విజృంభించి విజయం సాధించటానికి గూడా అవకాశాలున్నై. ఏమైనా, నూతన వ్యవస్థా నిర్మాణానికి, ప్రాత వ్యవస్థను కూల్చివేయటం అవసరం!

నా పథకాన్ని లెనిన్‌తో చర్చించి ఆతని అంగీకారాన్ని పొందాలి. లెనిన్ ఆమోదించనిదే ఏ పనీ జరగటానికి వీల్లేదు. నా పథకంలో లెనిన్ శ్రద్ధ చూపించాడు. "తరువాత పరిణామాలేమైనా, బ్రిటిష్ అధికారాన్ని కూలద్రోయటమే ఇండియాలో విప్లవాత్మకమైన సంఘటన; బ్రిటిష్ సామ్రాజ్య పతనం తూర్పుదేశాల్లో విపరీత పరిణామాలను దారితీయటమే గాక బ్రిటన్‌లో విప్లవానికి నాందీగీతాన్ని ఆలపిస్తుంది; ఐతే, కొండజాతులవారు పెద్ద ఎత్తున తిరుగుబాటు జరిపి బ్రిటిష్ సైన్యంతో పోరాటం సాగిస్తున్నప్పుడు గాని దేశంలో తిరుగుబాటుకు అవకాశం ఉండదు. అందుకు తగినంత ఆయుధ సామగ్రి కొండజాతులకు అందజేయటం ఎలా! ఈ కార్యసాధనలో ఆఫ్ఘన్ ప్రభుత్వ సహకారం పొందాలి. ఇది సాధ్యమా? అమనుల్లా విప్లవవాది కాడు; చాల తెలివైనవాడు; తనకు లాభసాటిగా ఉన్నదనే ఆశతోనే బ్రిటిష్ వ్యతిరేకిగా నటిస్తున్నాడు. ఈ అవకాశవాది, ఎవరు పెద్ద ఎర చూపితే వారివైపుకు మొగ్గటం తథ్యం; రష్యాకంటె ఈ పరిస్థితిలో బ్రిటన్ చూపే ఎర ఎక్కువ ఆకర్షణీయంగా ఉంటుంది. కాబట్టి రష్యాలోని బోల్షివిక్ ప్రభుత్వంకంటె, ఇండియాలోని బ్రిటిష్ ప్రభుత్వమే ఆతని దృష్టిలో మెరుగైంది." అని అన్నాడు లెనిన్ నిర్లిప్తంగా.

నేను అడిగాను: "ఈ భావాలు, ఇతర ఆసియా రాజ్యాలకు వర్తింపవా? ఇండియాలోని జాతీయ బూర్జువావర్గం, తనకు మృత్యుతుల్యమైన బోల్షివిజంకంటె బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీబడటమే ఉత్తమమని భావించదా?"

ఒకనవ్వుతో నా సూచనను ఆమోదించాడు లెనిన్. "మనం గాలిమేడలు నిర్మించకూడదు; ఉన్న అవకాశాలను పూర్తిగా వినియోగించుకోనటమే విప్లవ ఎత్తుగడ. కాబట్టి ఇండియాలో విప్లవానికి రంగస్థలంగా ఆఫ్ఘనిస్తానాన్ని ఉపయోగించుకొనే అవకాశాన్ని జారవిడువకూడదు" అంటూ నా ప్రణాళికా వివరాలను రూపొందించవలసిందిగా సూచించాడు. పార్టీ పొలిట్‌బ్యూరో, విప్లవ సైనిక సంఘమూ ఆ వివరాలను ఆమోదించాలి.

## స్వేచ్ఛా సైన్య నిర్మాణం

సరిహద్దుల్లోని కొండజాతి ప్రజలకు యుద్ధసామగ్రిని సరఫరా చేసి బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికి అలజడి కలిగించటమే నా ప్రణాళిక. ఈ ప్రణాళికను ఆచరించటంలో ఏమాత్రం కష్టం లేదు. కాని దాని ప్రయోజనాన్ని గురించి నాకు విశ్వాసమేర్పడలేదు. అందుకు కారణం ఐరోపాలో యుద్ధం పరిసమాప్తమైంది. అందుచే అచిరకాలంలోనే, ఇండియా వాయువ్య పరిహద్దుల రక్షణకు అవసరమైన సైన్యం, తయారులో ఉంటుంది. అప్పుడు మా బలాబలాలు తారుమారై, అంటే బ్రిటిష్ బలాలు వృద్ధిచెంది, తద్వారా సరిహద్దు సంగ్రామ ఫలితం మేము ఆశించిన దానికి వ్యతిరేకంగా పరిణమించవచ్చు.

పోనీ, రష్యా సహాయంతో సరిహద్దు జాతులవారే బ్రిటిష్ వారిపై విజయం సాధించారనుకుందాం. అప్పటి ఇండియాలో పరిస్థితులు బ్రిటిష్ వారికి మరింత ప్రోత్సాహకరంగా మారుతై; విజయోత్సాహంతో, సరిహద్దు జాతులు, ఇండియా పల్లెలు, పట్టణాలు దోచుకోనకమానరు. పూర్వం ఎన్నోసార్లు కొండజాతులు ఆ విధంగానే చేశారు. ఆ దాడులను గోరంతలు కొండంతలు చేస్తూ ప్రభుత్వం ప్రచారం చేస్తుంది. ఇండియా జనాభాలో అధిక సంఖ్యాకులైన, హిందువులీ దాడులను సరిక్రొత్త ముస్లిం దండయాత్రగా భయపడి 'అన్యథా శరణం నాస్తి' అంటూ బ్రిటిష్ వారిని శరణు జొచ్చకమానరు. దీని ఫలితంగా బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమం వెనుకాడుతుంది. లేదా, దేశవ్యాప్తంగా మతకలహాలు చెలరేగుతై. ఈ పరిస్థితిని అదుపులోనికి తీసుకు రాగల బలం ప్రభుత్వానికి లేనందువల్ల దేశంలో అరాజకత విజృంభిస్తుంది. నిర్దుష్టమైన ఆశయాలతో అధికారం హస్తగతం చేసికోనగల ఉద్యమం లేకపోవటంవల్ల దేశంలో శాంతిభద్రతల పునరుద్ధరించి ప్రజాస్వామ్య పరిపాలనను నెలకొల్పటం సాధ్యం కాకపోవచ్చు.

నా ప్రణాళికలో మరొక క్రొత్త విషయం కూడా చేర్చాను. మాస్కోకు చేరుతున్న వార్తలనుబట్టి, ఖిలాఫత్ ఉద్యమ నినాదాల ఫలితంగా భారతదేశంనుండి వేలకొలది ముస్లింలు, కెమాల్ పాషా సైన్యంలో చేరే ఉద్దేశ్యంతో టర్కీకి ప్రయాణమైనారు. అదొక అఖిల ముస్లిం సమైక్య మతోద్యమం. ఆ ఉద్యమానికి భవిష్యత్తు లేదనే నా దృఢవిశ్వాసం; ఐనా ఆ ఉద్యమంద్వారా ఇండియా విముక్తికొరక సైన్యాన్ని తయారుచేసే అవకాశం నాకు లభించింది. సైనికుల్లో చాలమందితో పరిచయం చేసికొన్నాను.

కెమాల్ పాషా పోరాటం సాగిస్తున్నది ఆటోమన్ సామ్రాజ్య పునరుద్ధరణకూ కాదూ, ఖలీఫా పదవిని రక్షించటానికీ కాదు. సుల్తాన్ పదవిని రద్దు చేయటంతో పవిత్ర ఇస్లాం ఖలీఫా సంస్థకూడా అంతరించింది. అంటే భారతీయ ముస్లింలు

పరాజయమైన కారణంకోసం పోరాడుతూ అమాయక ప్రజానీకానికి మతం పేరుతో గంగవెర్రులెత్తిస్తున్నారు. విద్యావంతులైన యువకుల్లో రాజకీయ చైతన్యంలేక పోలేదు. కాని ఖిలాఫత్ ఉద్యమాన్ని సాగిస్తున్నది విద్యావంతులే! వీరికి 'ఖలీఫా' పదవి ఇస్లాం సమైక్యతకు సాంప్రదాయక చిహ్నం! ఈ చిహ్నం నశించినప్పుడు అఖిల ఇస్లాం సమైక్య ఉద్యమం నీరసించిపోక తప్పదు; కనీసం ఆ ఉద్యమకారుల ఉద్రేకానికి ఆధారం ఉండదు.

ఈ పరిణామాలను స్పష్టంగా అర్థంచేసికొనగలిగితే, అంటే టర్కీలో జరుగుతున్న పోరాటం ఖలీఫా కొరకుగాదనీ, లౌకిక జాతీయవాదం కొరకు మాత్రమేననీ భారతీయ ముజహిర్లు గ్రహిస్తే టర్కీకి తాము సాగిస్తున్న యాత్రలో అర్థం లేదని గ్రహిస్తారు. అప్పుడు వారందరినీ, నేను ఊహిస్తున్న భారత దాస్యవిమోచన సైన్యంలో చేర్చవచ్చు.

ఆ సైన్యాల్ని ఆఫ్ఘనిస్థాన్‌లో తయారుచేసి క్రమశిక్షణ నిచ్చి, వారికి ఆయుధాలనూ, ధనాన్ని సరఫరాచేయటమే నా పథకం; సరిహద్దు భూములను కార్యాచరణ కేంద్రంగా చేసికొని కొండజాతుల సహాయంతో విమోచన సైన్యం భారత దేశంలో కొంత భాగాన్ని ఆక్రమించి సాధ్యమైనంత త్వరలో పోటీ ప్రభుత్వాన్ని స్థాపిస్తుంది. ఈ విప్లవ ప్రభుత్వం జాతీయ స్వాతంత్ర్యం సాధించిన వెంటనే అమలు జరిపే సాంఘిక, ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాన్ని వెంటనే ప్రకటిస్తుంది. విమోచన సైన్యంతో పోరాడు శత్రువు వెనుక నుండి తిరుగుబాటు చేయవలసిందిగా ప్రజానీకాన్ని ఉద్దేశించి సందేశం ఇస్తుంది. ఇది ముఖ్యంగా పారిశ్రామిక, రైల్వే కూలీలకు ఉద్దేశింపబడుతుంది. దేశవ్యాప్తంగా తిరుగుబాటు చెలరేగినప్పుడు విమోచన సైన్యం నిరాటంకంగా పురోగమించటానికి వీలౌతుంది. విముక్త భూభాగంలోని వయోజనులందరికీ ఆయుధాలీయబడుతై. వీరిలో కొందరు ఆ ప్రాంతాల రక్షణకు నియుక్తులౌతారు. మిగిలినవారు విమోచన సైన్యంలో చేరి ఆ సైన్యాన్ని పెంపొందిస్తారు. విప్లవ ప్రభుత్వం ప్రకటించిన సంస్కరణలు విముక్త భూభాగాల్లో సత్వరం అమలు జరుపబడుతై. అందుచే ప్రజానీకం హృదయపూర్వకంగా క్రొత్త ప్రభుత్వాన్ని బలపరుస్తారు. తద్వారా స్వాతంత్ర్య స్వరూపం నిర్దుష్టంగా కన్పించి కండ్ల ఎదుట ప్రత్యక్షం కావటమే ప్రజానీకానికి ప్రోత్సాహం. ఐతే జాతీయ స్వాతంత్ర్యంలోని ఈ విప్లవాత్మక పరిణామాలు, కరుడుగట్టిన స్వార్థ శ్రేయస్సులకు భంగకరం కావచ్చు. ఈ ఉన్నత వర్గాలవారు జాతీయ విప్లవ ప్రవాహ పురోగతిని ఆటంకపరచటానికి ప్రయత్నాలు చేయటం సహజం. కాని యుద్ధంలో పూర్తిగా దెబ్బతిన్న బ్రిటిష్ సామ్రాజ్యవాదం పునాదులు, ప్రజా విప్లవంతో కదలిపోతై. అందుచే విప్లవ విరోధులకు బ్రిటిష్ సామ్రాజ్యవాద సహాయం లభింపదు.

ఈ పథకం అమలు జరగటానికి, పెద్ద ఎత్తున ఆయుధాలూ, ధనమూ, సుశిక్షితులైన సైనిక బృందమూ, యుద్ధరంగాని కవసరమైన సరంజామా సన్నద్ధపరచాలి. యుద్ధ సరంజామాను మాత్రం, కమ్యూనిస్టు పార్టీ సిఫారసుపై, మంత్రి మండలి (Council of People's Commissors) మంజూరుచేసింది. అంతర్యుద్ధంతో ఆయుధాగారం (Military Stores) కట్టి పోవటంతో మిగిలిన సాధన సామగ్రిని సంపాదించటానికి శ్రమపడాల్సి వచ్చింది. ట్రాట్స్కీ మాస్కోలో లేకపోవటంవల్ల, క్లాన్‌స్కీ స్వయంగా నా వ్యవహారంలో శ్రద్ధవహించాడు. ఇతడు విప్లవ సైనిక సంఘానికి ఉపాధ్యక్షుడు. అక్టోబర్ విప్లవం మూడవ వార్షికోత్సవానంతరం, మాస్కో నుండి బయలుదేరటానికి మా బృందం తయారైంది.

## టాష్‌కెంటుకు ప్రయాణం

మా మొదటి గమ్యస్థానం టాష్‌కెంట్. మాస్కోకు సుమారు రెండు వేల మైళ్ళ దూరంలో ఉంది. గడచిన శీతాకాలం వరకూ ఈ మధ్యమార్గంలో అధికభాగం విప్లవ వ్యతిరేక సైన్యాల చేతుల్లో ఉంది. వీరే శ్వేతరక్షక దళాలు! వీరిలోని తిరుగుబోతులు బందిపోటులుగా మారి యూరల్ నదికి ఆవల నున్న స్టెప్పీలలో స్థావరాలేర్పరచుకొన్నారు. తరచుగా ఈ బందిపోటులు రైలు మార్గాలను ధ్వంసం చేసి, రైళ్ళ నాపి దోచుకొనేవారు. మా బృందం రెండు రైళ్ళలో ప్రయాణం ప్రారంభించింది; ఒక బండిలో 30 టన్నుల పెట్టెలు 27 ఉన్నై; వీనినిండా పిస్తోళ్ళు, రైఫుల్లు, మరతుపాకులు, చేతి బాంబులు, తదితర ఆయుధసామగ్రి, మందుసామాను, యుద్ధభూమికి అవసరమైన సరంజామా, రేడియో యంత్రాలూ, ప్రసారసాధనాలూ ఉన్నై. ఈ బండికి రక్షణగా రెండు రెడ్ ఆర్మీ దళాలు, ఒక సేనాపతీ బయలుదేరారు. ఈ సేనాపతి పేరు జాన్. ఇతడు కొన్నాళ్లు సంయుక్త రాష్ట్రాల్లో ప్రవాసం అనుభవించాడు; ఆరోజుల్లో అరాజక సిండికలిస్టులు నడిపే "ప్రపంచ పారిశ్రామిక కార్మికులు" (Industrial Workers of the World) అనే సంస్థలో చేరాడు. సంయుక్త రాష్ట్రాల్లోని కార్మిక సంస్థలన్నిటిలో నిది తీవ్రవాద సంస్థ. విప్లవానంతరం జాన్ రష్యా తిరిగివచ్చి, అంతర్యుద్ధంలో మునిగిపోయాడు. తన అరాజక సిద్ధాంతాలకు వ్యతిరేకం కావటంచేత, జాన్ కమ్యూనిస్టు పార్టీలో చేరటానికి నిరాకరించాడు. కాని అంతర్యుద్ధంలో ఆతని సాహస కృత్యాలవల్ల, విప్లవం పట్ల, సోవియట్ ప్రభుత్వం పట్ల ఆతనికి గల విశ్వాసం రుజువైంది. అందుచే జాన్ విశ్వాసపాత్రుడై, బాధ్యతగల ఉన్నత పదవు లందుకొన్నాడు. విమానదళంలో మెకానిక్‌గా కూడా పనిచేశాడు. సుమారు ఏడడుగుల పొడవుండేవాడు; దానికి తగిన లావు; భయంకరమైన స్వరం. ఒక్క మాటలో చెప్పాలంటే జాన్‌ది ఒక రాక్షస స్వరూపం!

ఇక రెండవ రైలు బండిలోనున్న సరంజామా: రెండు పెట్టెలనిండా డబ్బు; అంటే బంగారం, బంగారు నాణాలూ, పౌను, రూపాయినోట్లు; పది పెట్టెలనిండా ఊడగొట్టిన విమానాల భాగాలు, విమానదళానికి అవసరమైన సాధనాలూ (Airforce Battalian); విమానదళోద్యోగులూ, సైనికశిక్షణ కేంద్రానికి అవసరమైన ఉద్యోగులూ ఏడుపెట్టెల్లో ప్రయాణం చేస్తున్నారు. నాకొక సెలూన్ ఏర్పాటు చేశారు. ఈ రైలు ఒక విమానదళోద్యోగి అధీనంలో ఉంచబడింది; అతడు నా ఉత్తర్వుల ననుసంధి వ్యవహరించేవాడు. ఈ బండి రక్షణలో ప్రత్యేకశ్రద్ధ చూపబడింది. బండి కప్పుపై మరతుపాకు లేర్పాటుచేశారు. నా సెలూన్ పై కూడా మరతుపాకులున్నై.

మా బృందం సమారా చేరటానికి రెండు రోజులు పట్టింది. దానితో మా ప్రయాణంలో మొదటి ఘట్టం పూర్తయింది. సమారా, వోల్గా నది తూర్పుతీరంలో ఉంది. ప్రస్తుతం ఆ నగరాన్ని కుయ్‌బిషేవ్ అంటారు. రెండవ ప్రపంచ యుద్ధంలో క్లిష్టసమయంలో సోవియట్ ప్రభుత్వం, విదేశాంగ కార్యాలయాలన్నీ ఈ నగరానికి మరలించింది. మరొక రోజున్నరకు ఓరెన్‌బర్గ్ చేరాం. ఇది ఐరోపా రష్యా, టర్కిస్థాన్‌ల సరిహద్దున ఉంది. ఈ ప్రాంతంలో వోల్గా చాల విశాలంగా ప్రవహిస్తుంది. వోల్గాను దాటి, రష్యా మైదానం అంచులగుండా మా రైలు ప్రయాణం చేసింది. యూరల్ పర్వతాలూ, ఖండాతర్గతమైన కాస్పియన్ సముద్రంలోకి ప్రవహించే యూరల్ నదీ, ఆసియా, ఐరోపాలమధ్య సహజమైన సరిహద్దులు. దిగువ వోల్గా, యూరల్ నదులమధ్య సరిహద్దు భూముల్లో నివసించే ప్రజానీకం ఆసియా వాసులైన తార్తారు, బష్కీర్, ఖిర్గిజ్ జాతులకు చెందినవారే! ఓరెన్‌బర్గ్ నగరం, ఐరోపాలోని ఏకైక ఒయాసిస్! జారుల మహాసామ్రాజ్యంలో ఒక రాష్ట్ర ముఖ్యపట్టణం కావటంచేత ఓరెన్‌బర్గులో రష్యన్‌జాతివారే ఎక్కువగా ఉన్నారు. గవర్నరు, స్థానిక సైనిక దళాధిపతి మొదలు చిన్న ఉద్యోగి వరకూ అందరూ పాలక జాతికి చెందిన (రష్యన్) వారే. కాని విప్లవంతో పరిస్థితులు మారినై. పూర్వ పాలనా విధానానికి చెందిన ఉద్యోగులు అదృశ్యమైనారు. 'ఓరెన్‌బర్గ్' అనేది ఐరోపా పదం. పేరేదైనా అది ఆసియా నగరమే! 1920 లో పేరుకూడా మార్చబడింది. ప్రజల జాతిరీత్యా, పరిపాలనా విధానంరీత్యా, ప్రాచ్యవాసనలు వోల్గానది దిగువ ప్రాంతంవరకూ విస్తరించినై.

ఆసియాలో యూరల్ నదికి తూర్పున నలువైపులా ఖిర్‌గిజ్ స్టెప్పీభూములు వందలమైళ్ళకొలదీ విస్తరించినై. 1920 లో ఆ ప్రాంతమంతా అరాజకత తాండవించింది. ఓరెన్‌బర్గ్, టాష్‌కెంట్‌లమధ్య అనగా సుమారు వేయి మైళ్ళప్రాంతంలో చెప్పదగిన పట్టణమే లేదు. సంచారజీవనులైన స్థానిక ప్రజలు, రష్యానుండి వలస

వచ్చినవారూ, విప్లవ వ్యతిరేకులను, (తెల్ల రక్షక దళాలను) అనుసరించి పారిపోయి నారు. పెద్ద పెద్ద రైల్వేస్టేషన్‌లకు సమీపంలో ఉండే అంగడులన్నీ నిర్మానుష్య మైనై. ఇటువంటి రెండు రైలుస్టేషనులకు మధ్య దూరం సుమారు వంద మైళ్ళకు పైగా ఉంటుంది. ఈమధ్య ప్రాంతాల్లో ఏమీ లభ్యపడేది కాదు.

మా బండ్లలో ఒక్కొక్కదానికి రెండు ఇంజన్లు. ఈ నాల్గింటికీ నీరు సంపా దించటం అన్నిటికంటె గడ్డుసమస్యగా పరిణమించింది. అదీగాక, ఓరెన్‌బర్గ్ దగ్గర మా బండ్లకు పాత ఇంజన్లు తగిలించారు. వీనితో వేయిమైళ్ళ ప్రయాణం చేయాలి! టాష్‌కెంట్ చేరేలోగా వీనిని మార్చటానికి అవకాశం లేదు. ఈ ఇంజన్లలో ఏ రెండు చెడిపోయినా భయంకరమైన ఎడారిమధ్యలో ఇరుకున పడిపోతాము. గోబీ ఎడా రిలో చెలరేగే దుస్సహమైన ఇసుక తుపాన్లు, ఇక్కడ లేకపోవచ్చు. కాని ఇక్కడ విస్తారంగా పెరిగే పొదలు క్రూరమృగాలకూ, అంతకంటె క్రూరులైన బందిపోటులకూ ఆవాసనివాసాలు!

అదృష్టవశాత్తూ బొగ్గు సమస్య లేకపోయింది. అంటే మా ఇంజన్లనిండా బొగ్గు ఉన్నదని కాదు. అవసరమైనప్పుడల్లా బండ్లు నాపి సైనికులు పొదల్లో దూరి ఎండిన చెట్లవ్రేళ్ళు పీక్కువచ్చి ఇంజన్లో వేస్తూ ఉండేవారు. ఇక ఇంజన్లో బొగ్గు నిల్వచేసే ప్రదేశాల్లో, ఇనపపీపాలతో నీళ్ళు నిల్వచేశారు. మా ప్రయాణంలో కొన్ని వందల మైళ్ళవరకూ చుక్క కూడా నీరు దొరకని ప్రాంతాలున్నై. అక్కడ నీరు అపురూపద్రవం!

సమారాలోను, ఓరెన్‌బర్గ్‌లోనూ మాకు కావలసిన భోజనం వగైరా పదుపాయాలకు ఏర్పాట్లు చేయబడినై. ఓరెన్‌బర్గ్‌లో ఒక వారానికి ఏర్పాట్లు చేసుకోవాలి. మధ్యలో ఏ ప్రమాదమూ లేకపోతే మూడు నాలుగు రోజుల్లో గమ్యస్థానం చేరవచ్చు. కాని మా తుక్కు ఇంజన్లకు ఎక్కువ పని కల్పిస్తే, పాడైపోక తప్పదు; దిక్కూ, మొక్కూలేని ఆ ప్రాంతంలో ఏదో ఒక ఆపద సర్వసాధారణంగా తటస్థిస్తూనే ఉండేది. అందుకని ఓరెన్‌బర్గ్ నుండి టాష్‌కెంటుకు ప్రయాణ పరిమితి వారంరోజులుగా నిర్ణయమైంది. ఏదైనా బండి, ఏదో ఒకవైపు వారంరోజులలో చేరని యెడల, రక్షణకార్యక్రమాలు తక్షణం మొదలు పెట్టేవారు. కాని మాకిటు వంటి అవసరం కలుగలేదు. అంటే మేము సరిగా ఏడవరోజు సాయంకాలం చీకటి పడుతూ ఉండగా టాష్‌కెంట్ చేరుకున్నాము. టర్క్‌ఫ్రంట్ సేనాపతి స్వయంగా రైలు స్టేషన్‌లో మమ్మ ఆహ్వానించాడు. మాకొరకై సర్వసమృద్ధమైన రక్షక బృందాన్ని పంపటానికై అతడు స్టేషన్‌కు వచ్చాడట! రక్షక బృందం మరుక్షణంలో బయులుదేరేదే!

మేము ప్రయాణం చేసిన భూభాగంలో చాలవరకు సూర్యుని కోపాగ్నికి దగ్ధమైపోయినట్లు కనిపించింది. పగలు నిప్పులు చెరిగినట్లు వేడిగా ఉండేది. నేను ప్రయాణం చేస్తున్న సెలూను జారులకై తయారుచేయబడినదని చెప్పారు. కాని అందులోని సదుపాయాలేవీ ఆ శీతోష్ణ పరిస్థితులలో నాకు ఉపకరింపలేకపోయినై. మా అదృష్టం బాగుండి త్రోవలో నీటి బుగ్గలు కన్పించితే తప్ప త్రాగటానికి చల్లని నీరు దొరికే అవకాశం లేదు. రైలు ఇంజన్లు నీరు పట్టుకొనటానికి వీలుగా పెద్ద పెద్ద స్టేషనులన్నీ అటువంటి నీటి బుగ్గల సమీపంలోనే నిర్మించారు; కాని ప్రస్తుతం విప్లవ వ్యతిరేకులీ బుగ్గ బావులను పూడ్చివేసి పారిపోయినారు. అందుచే మేము క్రొత్త బావులకై వెదకవలసివచ్చింది. రైలు బండిలో నుండే దూరదర్శినీ సహాయంతో పరిసరాలను పరిశీలించే ఏర్పాట్లు చేశారు. నీటి బుగ్గ ఉన్నచోట ఎడారి వృక్షాలు కొంచెం ఎత్తుగా పెరిగి పచ్చగా కన్పించటం సహజమే కదా! అటువంటి ఒయాసిస్ కనిపించినచోటల్లా ఆగేవాళ్ళం. అవి సాధారణంగా రైలు మార్గానికి దూరంగా ఉండేవి. ఆ ప్రదేశానికి ముందుగా ఒక సైనిక దళాన్ని పంపేవాళ్ళం, ఆ ప్రాంతాలను తనిఖీ చేసే నిమిత్తం. అది యోగ్యమైన ప్రాంతమని తెలిస్తే ఎండ తీవ్రత చల్లారే వరకూ ఆ బుగ్గ సమీపంలోనే గడిపేవాళ్ళం. రైలుబండ్లను విడిచి వెళ్ళటానికి వీల్లేదు కాబట్టి, సైనికులు జట్లు జట్లుగా వచ్చి చల్లని నీటిలో తృప్తిగా స్నానం చేసి, పుష్కలంగా త్రాగటానికి నీళ్ళు తెచ్చేవారు. అప్పుడప్పుడీ నీటి బుగ్గలు చాల చిన్నవిగా ఉండేవి. అక్కడ స్నానాలకు అవకాశం ఉండేది కాదు. మంచి నీరు మాత్రం పట్టుకు వచ్చేవాళ్ళు.

ఒక రోజున మా గస్తీదళం, తూర్పుగా ఒక పెద్ద సైనిక శిబిరం ఉన్నట్లు పసికట్టింది. దాని స్వభావాన్ని గురించి మా దళంలో అభిప్రాయభేదం ఏర్పడింది. ప్రవాస మనుభవిస్తున్న తెల్ల గస్తీ దళమని కొందరి అభిప్రాయం; సంచార జీవనులైన ఖిర్గిజ్ జాతుల శిబిరమని మరికొందరు భావించారు. నా రైలుబండికి అధిపతిగా ఉన్న విమాన దళాధిపతి సహజంగా చాల జాగ్రత్తగలవాడు. నా సలహాపై గాని అతడే సాహసానికీ పూనుకొనటానికి వీల్లేదు. ఈ బృందానికి నేనే సర్వాధికారిని; అది ఏమో తెలిసికోవాలనే ఆరాటం నాలో కలగకపోలేదు. కాని నా ఔత్సుక్యానికి నా క్రింది ఉద్యోగి జాగ్రత్తను బలిచేయటం నాకు సమ్మతం కాలేదు. మా సైనిక దళంతో, ప్రవాసంలోని తెల్ల గస్తీ దళాన్ని ఎదుర్కొనటం కష్టంకాదు. కాని దానివల్ల మరొక ప్రమాదం సంభవించవచ్చు. మా సైన్యాన్ని ఒక వైపుకు పంపితే మరియొక వైపునుండి శత్రువులు రైలుబండ్లను ముట్టడించవచ్చు. శిబిరంపైకి పంపిన గస్తీ దళం సాయంకాలంవరకూ రానిచో రాత్రంతా ఎడారి మధ్య ఉండిపోవాల్సి వస్తుంది.

ఖిర్గిజ్ సంచార జీవనుల శిబిరం చూడాలనే నా వాంఛను గమనించి, నాకు సహాయం చేయ నిశ్చయించాడు జాన్. అరాజకవాదిగా, ఆతనికి క్రమశిక్షణలో విశ్వాసం లేదు. గస్తీ దళానికి నాయకుడుగా గాక తాను స్వయంగా, ఒంటరిగా శిబిరాన్ని దర్శించి వస్తానని చెప్పాడు. జాన్‌పై అధికారి విమాన దళాధిపతి. జాన్‌ను ఒక చిన్న దళంతో పంపవలసిందిగా అతణ్ణి కోరాను. పసిపిల్లవాని మహోత్సాహంతో మోటారు సైకిల్ మీద బయలుదేరాడు; ఒక ట్రక్కులో ఆర్గురు సైనికు లాతని వెంటనే బయలుదేరారు. వారందరూ కనుచూపుమేర దూరంలో పొదల్లో అంతర్ధాన మయ్యేవరకూ ఆదుర్దాతో చూస్తూనే ఉన్నాం. అప్పుడప్పుడూ ట్రక్కుపైన ఎఱ్ఱి జెండా మాత్రం కనిపించేది. గమ్యస్థలం చేరటానికి వారికి ఒక గంట పట్టింది. అది కేవలం భూమికి అడ్డంపడిపోవటమే! ప్రకృతి పరచిన బాటమీద మోటారు బండ్లు కూడా పది మైళ్ళకు మించిన వేగంతో పోలేవు.

దూరదర్శినితో చూస్తున్న మా కాపలాదారు చెప్పాడు. "మన దళానికి స్నేహపూర్వకమైన స్వాగతం లభించినదని" కొన్ని క్షణాల్లో అచటి ఒక గుడారం మీద ఎఱ్ఱి జెండాను ఎగుర వేశారట. మరి కొంతసేపటికి తిరిగి వస్తున్నారనే సందేశాన్ని సూచించాడు.

మరునాటి ఉదయమే ఒక ఖిర్గిజ్ జాతి ప్రతినిధివర్గం మమ్మల్ని దర్శించబోతున్న దనీ, అందుకు తగిన ఏర్పాట్లు చేయాలనీ జాన్ తెలియజేశాడు. మరునా డుదయం నిద్ర లేచేసరికి ఖిర్గిజ్ శిబిరం మా సమీపంలో ప్రత్యక్షమైంది. అందులో చిన్న - పెద్ద గుడారాలు 53 ఉన్నై. ఆ గుడారాలన్నీ దళసరి ఫెల్టుతో వేశారు. మధ్యలో ఉన్న నాయకుని గుడారం మిగిలిన వానికంటె పెద్దది. ఆ శిబిరంలో స్త్రీ, పురుషులూ, పిల్లలూ కలిసి మూడు వందలపైగా ఉన్నారు. ఒంటెలు, గొఱ్ఱెలు, గుఱ్ఱాలు, చక్రాలు లేనిబండ్లూ మాత్రమే వారి సంపద. వీనికి కాపలా ఉన్న కుక్కలు మాత్రం చాల భయంకరంగా ఉన్నై. విమాన దళాధిపతి, జాన్‌లతో కలసి నాయకుని శిబిరానికి వెళ్ళాను. మా దళ రాజకీయ నాయకుడు, రష్యా రహస్య పోలీసు శాఖకు చెందిన వ్యక్తి; ఇంకా ఏదో మోసం జరుగుతుందనే ఆతని అనుమానం. అందుచే తన స్థానంనుండి అంగుళంకూడా కదపనని రైలుబండ్లకు అవలివైపు కాపలా కాస్తూ నిలబడే ఉన్నాడు. అతని ఉద్దేశ్యంలో ఎన్ని ప్రాణాలనైనా బలి చేయవచ్చును గానీ పవిత్రమైన శ్రామికవర్గ సంపదను మాత్రం కోల్పోకూడదు!

ఖిర్గిజ్ నాయకుడు వృద్ధుడు; చాల ఉదారస్వభావం కలవాడు; ఆతని సేవకుడు మంచి ఉల్లాసంగా ఉన్నాడు; యువకుడు; అతడు రష్యన్ భాషలో మాట్లాడటం మా అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. సమీపంలో ఉన్న రష్యా వలస ప్రజల పాఠశాలలో చదువు కొన్నాడట; తరువాత ఒక రష్యన్ ఫర్ వర్తకునికి గుమాస్తాగా

చేరాడట. రష్యా విప్లవం జరిగి ఖిర్గిజ్ మాతృభూమిని జయించి సేనాను లందరిని పారద్రోలినట్లు విన్నానని చెప్పాడు. కాబట్టి విప్లవం అంటే ఖిర్గిజ్ జాతికి స్వాతంత్ర్యం లభించిందని అతని ఉద్దేశ్యం. ఆ జన్మ బోల్షివిక్ అనిపించేటట్లు, 'విప్లవం వర్థిల్లాలి' అంటూ నినాదం చేశాడా యువకుడు. ఖిర్గిజ్ జాతి అంతా ఆ నినాదంలో పాల్గొన్నారు. తరువాతి రోజంతా ఉల్లాసంగా గడచిపోయింది; ఆ రోజు జరిగిన విందులో మందలోని గొర్రెలు చాలాఖాళీ యైనై; ఈ ఉత్సాహ ఉద్రేక వాతావరణంలో నా దృష్టిని వొక విశేషం ఆకర్షించింది. మధ్యఆసియాలో సంచార జీవితం గడుపుతున్న ఆదిమ సాంస్కృతిక కేంద్రానికి కూడా ఆధునిక యంత్రనాగరికత విస్తరించింది. ఖిర్గిజ్ జాతి రాణికి ఉన్న విలాసవస్తువుల్లో క్రొత్తగా మెరుస్తున్న సింగర్ కుట్టు యంత్రం ప్రధానమైంది !

ఈ కార్యక్రమంవల్లనే, మా రైలు టాష్కెంట్ చేరటం ఆసల్యమై కామ్రేడ్ సోకాల్నికావ్‌కు ఆందోళన కలిగించింది. రైల్వే ప్లాట్‌ఫారంమీద కరస్పర్శచేసే సందర్భంలో సోకాల్నికావ్ ఆ విషయాన్నే ముచ్చటించాడు. మా రక్షణకోసం బయలు దేరబోతున్న దళాన్ని ఆ మరునాడు, ఖిర్గిజ్ దళాన్ని కలుసుకునేందుకు పంపాం.



# మధ్య ఆసియా విప్లవ విజయం

## టాష్కెంట్‌లో జీవితం

మా రైలు బండ్లు టాష్కెంట్ చేరినై. రైల్వే ప్లాట్‌ఫారం మీదనే, సోకోల్నికావ్ మా బృందంలోని సైనికులను, ఆయుధ సామగ్రినీ అప్పగించుకున్నాడు. అతడే మధ్యఆసియాలోని సైనికదళాలకు అధిపతి. ప్రయాణంలో మా రైలుబండ్లకు నాయకుడైన విమాన దళాధిపతి, మరునాటినుండి సోకోల్నికావ్ ఆజ్ఞలను శిరసా వహించాలి. మా వెంట తెచ్చిన ధనం స్థానిక ట్రెజరీలో భద్రపరచబడింది.

మా ప్రయాణంలో మొదటి మజిలీ టాష్కెంట్. నేను ఉద్దేశించిన భారత విమోచన సైన్యసమీకరణకు కేంద్రం కూడా టాష్కెంట్ నగరమే. ఆ సైన్యానికి ఇంకా బీజారోపణకూడా జరగలేదు; సైన్యాన్ని సమకూర్చి తగిన శిక్షణ నివ్వటానికి చాలకాలం పట్టవచ్చు. ఈ సైన్యానికి పురోగమన రంగం కాబూలు; ఇండియా సరిహద్దుల్లో కార్యాచరణ రంగాల నేర్పాటు చేయాలి. ఇందుకు అవసరమైన ఆఫ్ఘన్ ప్రభుత్వం సమ్మతి సహకారాలను పొందటానికై నేటినుండీ ఆ ప్రభుత్వంతో మంతనాలు ప్రారంభించాలి. కాని ఎన్వర్ పాషా కుట్రలవలన మా మంతనాలు సక్రమంగా సాగుతై అనే ధైర్యం క్షీణించింది. ఆ కార్యక్రమం పూర్తయ్యేలోగా, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కిస్థాన్ బ్యూరోలో సభ్యుడుగా కొన్ని బాధ్యతలు నిర్వహించాలి; బోల్షివిక్ విప్లవంతో, మధ్యఆసియాలోని జారు సామ్రాజ్యం విచ్ఛిన్నమైంది; ఆయా రాష్ట్రాల్లో విప్లవ ప్రభుత్వాన్ని నెలకొల్పి సుస్థిరం చేయటమే టర్కిస్థాన్ బ్యూరో నిర్మాణంలోని ప్రధాన ఉద్దేశ్యం. ఈ కార్యభారం నాపైనే ఉంచారు; అందుచే టాష్కెంటులో ఎంతకాలం ఉండవలసివస్తుందో తెలియదు.

టాష్కెంట్‌లో నా బస కోక ఇల్లు ప్రత్యేకింపబడింది; మరొక యింట్లో టర్కి బ్యూరో కార్యస్థానాన్ని నెలకొల్పారు. రైలుబండ్లకు కాపలా నియమించి, సోకోల్నికావ్ నన్ను నా బసకు తీసుకువెళ్లాడు. దారిలో, అస్తవ్యస్తంగా ఉన్న పరిస్థితుల్లో నేనిక్కడ బసచేయవలసి వచ్చినందుకు క్షమాపణ చెప్పుకున్నాడు. టాష్కెంటు నాక్రమించటానికి బోల్షివిక్కులు పెద్దగా యుద్ధం చేసే అవసరం లేకపోయింది. పశ్చిమ రంగంమీద కేంద్రీకరించే ఉద్దేశ్యంతో, మధ్య ఆసియాలోని సైన్యాలను జారు ప్రభుత్వమే ఉపసంహరించింది. అందుచే జారిస్టు వ్యవస్థను రక్షించ

టానికి తగిన సైన్యం మధ్యఆసియాలో లేకపోయింది. రైల్వే షాపుల్లోనూ, తదితర పారిశ్రామికసంస్థల్లోనూ పనిచేసే రష్యన్ కూలీలు సులభంగా అధికారాన్ని వశపరచుకున్నారు. జారిస్టు ఉద్యోగులూ, ఉన్నత కుటుంబాల రష్యన్లు తమతమ చరాస్థిలో చాలభాగం ధ్వంసంచేసి పలాయనం చిత్తగించారు. అందుచే టాష్కెంట్‌లో నవనాగరక ప్రాంతాలలోని ఇండ్లన్నీ నివాసయోగ్యంగా లేవు. భవనాలనుమాత్రం కూల్చలేకపోయినారు; కాని సామాన్లు, నీటికుళాయిలు, విద్యుత్తంత్రులూ ధ్వంసం చేశారు.

నా బస దగ్గిర, ఒక రాక్షసవిధ్వంసకచర్య ప్రత్యక్షమైంది! సోకోల్నికావ్ ఆ దృశ్యాన్ని ముందుగానే వర్ణించి చెప్పాడు. మిగిలిన ఇండ్లకంటె కొంచెం మెరుగుగా ఉన్నందున ఆ యింటిని నా బసకు కేటాయించారట! తన కిచ్చిన యింట్లో నివశించటానికి వీలుగాలేక, ఆ ఆవరణలోనే ఒక గుడారం వేసుకొని కాలక్షేపం చేస్తున్నట్లు చెప్పాడు. టర్క్ కమిషన్‌లో, అంటే తాత్కాలిక విప్లవ సంఘసభ్యుల్లో ఎవరి పరిస్థితీ అంతకంటె మెరుగుగా లేదట!

టాష్కెంట్ జారుల వలస సామ్రాజ్యానికి రాజధాని. అంతర్యుద్ధం లేకుండానే ఇక్కడ విప్లవం విజయం పొందిందని చెప్పాను. కాని అనేక శాత్రవ శక్తులు పరోక్షంగా విప్లవాన్ని ప్రతిఘటింపసాగినై. అందులో ప్రధానమైంది ప్రాచీన వ్యవస్థ కూలిపోతూ సృష్టించిన విధ్వంసమూ, అవ్యవస్థ. ఇక రెండవది ప్రజల నిర్లక్ష్యం. దీని కనేక కారణా లేర్పడినై. ఒకవైపు బోల్షివిక్ మ్లేచ్ఛులపై బహిరంగంగా మతోన్మాదాన్ని రెచ్చగొట్టే ముల్లాల నిరసన; మరొక ప్రక్క నూతన స్వేచ్ఛా భావోన్మాదంతో వెఱ్ఱి యెత్తించే యువకుల ఉత్సాహమూ; మరొకవైపున నూతన వ్యవస్థ ఉద్దేశ్యాలను ప్రయోజనాన్ని అనుమానించే వారి ద్వేషపూరితమైన ప్రచారమూ - ఈ మూడు దుష్టశక్తులమధ్య నలిగిపోతున్న ప్రజల్లో విప్లవంపట్ల నిర్లక్ష్యమేర్పడటంలో ఆశ్చర్యం లేదు. అందుచే నిది చాలక్లిష్టమైన సమస్య! ఈ శాత్రవ శక్తులను నిర్మూలింపనిదే టాష్కెంటులో విప్లవం సుస్థిరం కాదు.

టాష్కెంట్ ఒక బయాసిస్ మధ్య ఉంది. వేసవిలో వేడి ఎక్కువగానున్నా, చలికాలంలో నీరు గడ్డకట్టుపోయే చలి వేస్తుంది. మేము టాష్కెంట్ చేరింది నవంబరు మధ్యలో. తర్వాత కొద్దిరోజులకే మంచు కురవటం ప్రారంభించింది. సుమారు రెండు నెలలపాటు, టాష్కెంట్ నగరమూ ఆ పరిసర ఎడారి ప్రాంతమూ విశాలమైన తెల్లదుప్పటిగా మారిపోయినై.

బసకుచేరే టప్పటికి బాగా ప్రొద్దుగూకింది; బస, చల్లగా అంధకారబంధురంగా ఉంది. విద్యుత్తంత్రుల్ని సరిచేయటానికి యింకా రెండు రోజులైనా పట్టవచ్చు. టాష్కెంట్‌లో అవసర వస్తుసామగ్రి కానీ, సరియైన పనివాండ్రు గానీ లేకపోవటమే యింత ఆలస్యానికి కారణమైంది. కిరోసిన్ బుడ్లు, క్రొవ్వు వత్తులూ

రెపరెపలాడుతూ, నిర్మానుష్యమైన ఆ ఇంటి సమాధి అంధకారాన్ని ఛేదించటానికి వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నై. శరీరాన్ని కొరికివేస్తున్న చలి రాక్షసి కోరలను చీకటి పదును పెడుతున్నదా అనిపించింది. గోడల్లో బిగించిన పింగాణీ కుంపట్లు, చల్లనీ చీకటిని కప్పుకున్న భూతాలలాగా మా కండ్లలోకి చూస్తున్నై. శీతకాలం ప్రారంభమై కొన్ని వారాలైనప్పటికీ ఆ కుంపట్లను ముట్టించిన పాపాన పోలేదు.

ఇంట్లో కుర్చీలూ, బల్లలూ లేని లోపాన్ని తివాచీ చుట్టలు తీర్చినై: అవి చాల ఖరీదైన తివాచీలు; కాని వాని నిండా అరచేతి మందాన దుమ్ము! విప్లవానికి పూర్వం, ఈ భవనంలో బొఖారా అమీర్ రాయబారి నివసించేవాడట. మధ్యప్రాచ్య దేశాల సాంప్రదాయాల కనుగుణంగా, అతడే, విలువైన తివాచీలు, తెరలు కొని యింటిని అలంకరించాడు. ప్రస్తుతం, వాటిని చుట్టగా చుట్టి బల్లలుగా, మంచాలుగా ఉపయోగిస్తున్నారు!

నా బస రెండు అంతస్తుల భవనం; చక్కని నిర్మాణం; గదులు విశాలంగా ఉన్నై. నగర రాజవీధిలో కేంద్ర ఉద్యానవనానికి ఎదురుగా ఉంది. సాధ్యమైనంత వరకూ సుఖంగా నివసించటానికి వీలైన వసతులన్నీ సమకూర్చారు. ఆ యింట్లో పేరుకొన్న చెత్తా చెదారాల్ని తొలగించటానికి పది మంది పనివాండ్రు కొన్ని రోజులుగా తంటాలు పడ్డారు. క్రమంగా విద్యుచ్ఛక్తి సరఫరా పునరుద్ధరింపబడింది. కాని, క్రొత్త నీళ్ళ పంపుల్ని మాత్రం వెయ్యలేకపోయినారు. అందుచే, స్నానం ఒక పెద్ద సమస్యగా తయారైంది. బావి నుండి నీళ్ళు తెప్పించుకోవచ్చు; కాని నీటిని కాచటానికి వంటచెరకు లేదు. ఇక్కడ, వస్తువులన్నిటిలో అపురూపమైంది వంటచెరకే. పూర్వం ఇక్కడికి డాన్ లోయనుండి బొగ్గు సరఫరా జరిగేది; ఐతే డాన్ లోయ చాల దూరాన ఉంది; రైలు సౌకర్యాలు లేకపోవటంతో బొగ్గు సరఫరా నిలిచిపోయింది. స్వల్పంగా ఉన్న పెట్రోలు ఉద్యోగుల మోటారుబండ్లకూ, సైనిక అవసరాలకూ నిల్వచేయబడింది. ఎడారి ప్రాంతం కావటంచేఅడవులు దగ్గర్లో లేవు; సమీపంలోని స్టెప్పీలలో మొలిచిరిగిన వ్రేళ్ళ దుబ్బులు మాత్రం లభించేవి; వానినే రేషనింగ్ ప్రకారం వంటింటి అవసరాలకు సరఫరాచేసేవారు. వాటితోనే ఆ మహానగరంలోని వంటింటి కుంపట్లు రాజుతూ ఉండేవి. మాకు మాత్రం ప్రత్యేక రేషన్ ఇచ్చేవారు. దానితో రెండు పూటలా వంట పూర్తైన తరువాత కూడ కొన్ని నిముషాల పాటు మా కుంపట్లలో నిప్పు ఉండేది. ఈ ప్రాంతాల్లో వంట ఇంటి కుంపట్లను పెద్ద పెద్ద రాళ్ళతో నిర్మించేవారు. అందుచే వంట పూర్తయిన తరువాత కూడా చాల సేపటి వరకూ కుంపటి వేడిగా ఉంటుంది. అందుచే, నా గుమాస్తాలందరూ తివాచీలు పరచుకొని వంటయింటి కుంపటి చుట్టూ మూగేవారు. నా కార్యాలయాన్ని కూడా వంటయింట్లోకి మార్చటానికి మొదట్లో నా హోదా అడ్డుపడింది! కాని చలి ముదిరి నీరు గడ్డ కట్టే పరిస్థితి రావటంతో నా నిర్ణయం దానంతట అదే సడలిపోయింది.

ఆహారపదార్థాల సరఫరాకూడా చాల తక్కువగా ఉండేది. మా రేషన్‌లో నల్లరొట్టె, బియ్యం, మాంసం, ఆపుల్ టీ, ఎండు ద్రాక్ష యిచ్చేవారు. సాధారణంగా ఎప్పుడూ చద్ది మాంసమే లభించేది. శాస్త్రీయ పద్ధతిలో నిల్వచేయని ఆ మాంసం ఎంతవరకు యోగ్యమో అనుమానం. ఆ మాంసంలోని క్రొవ్వు కుళ్ళిన నీచువాసన ఆ యింటి చీకటి మూలల్లో స్థిర నివాసం యేర్పరచుకొని, అక్కడి నుండి తివాచీ చుట్టల అంతరాంతరాల్లో ప్రవేశించింది. కొన్ని సంవత్సరాలవరకూ, మాంసాన్ని చూడగానే, ఆ వాసన గుర్తుకు వచ్చి అసహ్యం కలిగేది. ఇక భోజనంలో ప్రధానాంశం "కాషా". నల్లని ముడి బియ్యంతో, క్రొవ్వు, మాంసం ముక్కలూ కలిపి, వండి తయారు చేసేవారు; అక్కడక్కడ క్యారెట్ ముక్కలు కూడా కన్పించేవి. దుర్గంధభూయిష్టమై, వికారంగా కన్పించే ఆ పదార్థాన్ని 'పిలాఫ్' అనేవారు. అది తప్పితే, ఉప్పు చల్లిన రొట్టె ముక్కల్ని ఆపుల్ టీతో కలిపి మ్రింగాలి. ఆ రొట్టె నల్లగా జిగురుగా ఉండేది. ఏ పదార్థంతో చేసేవారో చెప్పటం సాధ్యం కాదు. ఏమైనా, నీచుకంపు గొట్టే మాంసం పిలాఫ్ కంటె, ఈ రొట్టె మెరుగనిపించేది!

'టీ' అనే పేరేగాని వాస్తవానికది నల్లని వేడి నీరు! ఎండు యాపుల్ ముక్కలతో దాన్ని తయారు చేసేవారు. ఒక స్పూన్ యాపుల్ ముక్కలపై మరిగే నీరు పోస్తారు; అవి రక్తం కంటె ఎఱ్ఱగా మారేవి; వానిలో మరికొంచెం వేడి నీరు కలిపితే అస్పష్టమైన తీయని వాసనతో 'యాపుల్ టీ' తయారయ్యేది. దీనివల్ల శరీరం వెచ్చగా ఉండటం కంటె వేరే ప్రయోజనం శూన్యం! టీలోకి చక్కెర లభించేది కాదు; పాలను గురించి ఆలోచించటానికి కూడా ఆస్కారం లేదు; పాలు దొరికినా, ఆ ఎఱ్ఱ నీళ్ళలో కలవగానే విరిగిపోయేవి. ఎండు ద్రాక్షపండ్లు నంజుకొంటూ ఈ నీటినే త్రాగేవారు. టాష్కెంట్ పరిసరాల్లో ద్రాక్షతోట లెక్కువగా ఉండేవి.

ఒక్క మాటలో చెప్పాలంటే, టాష్కెంటులో జీవితం చాల దుర్భరం. కాని, విశ్వాసంతో, ఆసక్తితో కృషిచేస్తే మహోజ్జ్వలమైన భవిష్యత్తుగల ప్రాంతమనేది యదార్థం. ఈ ప్రాంతాన్ని నా కార్యాచరణ రంగంగా నిర్ణయించుకొన్నందుకు నే నెన్నడూ పశ్చాత్తాపం చెందలేదు. విప్లవ మార్గం పూలబాట కాదని అనుభవం ఎన్నడో నేర్పింది. అంతేగాక నాకొక ఆశ ఉండేది. శతాబ్దాలుగా దాస్యంలో మ్రగ్గుచున్న ప్రజల విమోచనకై చేస్తున్న కృషిలో కలిగే ఆనందంతో, అపాయకరమైన సాహసకృత్యాలతో, మహత్తర విజయసాధనోత్సాహంతో నా అనుభవాల ఖజానా నిండుతుంది; నా జీవితం సంపత్తరమాతుంది!

రష్యన్ ఇంపీరియల్ బ్యాంకుకై నిర్మింపబడిన భవనంలో టర్కు బ్యూరో కార్యాలయాన్ని నెలకొల్పారు. ఈ భవనాని కుపయోగించిన ఎఱ్ఱరాయి, యూరల్ పర్వతాల నుండి తెచ్చారు; చాల గంభీరమైన భవనం, ఇంపీరియల్ బ్యాంకే స్థానిక

ట్రెజరీగా పనిచేసేది. అందుచే విప్లవం ప్రారంభం కాగానే విప్లవకారులు బ్యాంకు నాక్రమించారు; కాబట్టి ఈ భవనానికి మాత్రం విధ్వంసన ప్రమాదం తప్పింది. ఈ బ్యాంకులోనే యువరాజు కిరీటాభరణాలూ, ప్రభువుల ఆభరణాలూ, దాచబడినై. వానికితోడు ఎంతో బంగారమూ, బ్యాంకు నోట్లకట్టలూ ఉన్నై. వీటన్నిటికీ సీళ్లూ, తాళాలూ వేసి సురక్షితంగా ఉంచారు. మాస్కో నుండి ఉత్తర్వులు వచ్చేవరకూ ఇవి చెక్కు చెదరలేదు.

ఆ భవనంలోనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విభాగాన్ని నెలకొల్పటంలో ఒక విశిష్టత ఉంది. విప్లవం వశపరచుకొన్న అపారమైన ధనరాసులన్నీ ప్రపంచ కార్మిక వర్గానికి చెందినవని సూచించటమే దాని ఉద్దేశ్యం! ఆ పెన్నిధిని రక్షించే గౌరవం నాకు లభించింది. టర్కు బ్యూరోకు నేను అధ్యక్షుణ్ణి; అందులో మరో ఇద్దరు సభ్యులున్నారు. కాని, ఇంతకంటె సాహసోపేతమైన ఆకర్షణీయమైన కార్యక్రమాలలో పాల్గొనే నిమిత్తమె టర్కు బ్యూరో చర్యలను పూర్తిగా నాకు వదలి పెట్టారు. బ్యూరో సమావేశం వారానికొకమారు జరిగేది; పూర్వం బ్యాంక్ డైరెక్టర్ కార్యాలయంలో బ్యూరో సమావేశమాతూ ఉండేది. అధ్యక్ష పీఠాన్ని అమూల్యమైన కలపతో తయారు చేశారు; దాని వెనుక భాగం ఎత్తుగా, జిలుగు పనితనంతో అందంగా ఉండేది; అందుకుతోడు ఎఱ్ఱని మొఖ్మల్ తొడుగు; దానిపై జరీతో కుట్టిన రోమనావ్ వంశ సామ్రాజ్యాధికార చిహ్నలు; ఒక గిల్టు కిరీటం; నిజానికి కా కుర్చీ ఒక సింహాసనం! టర్కు బ్యూరో అధ్యక్షుడుగా ఆ సింహాసనాన్ని అధిష్ఠించే హక్కు నాకు లభించింది. ఆ సింహాసనానికి వెనుక భాగంలో జార్ రెండవ నికలస్ చిత్రపటం ఉండేది. ఇతర కళాఖండాలతో, అమూల్య వస్తువులతో బాటు ఆ చిత్రాన్ని కూడా బ్యాంకు గదుల్లో భద్రపరచారు.

## బొఖారాలో విప్లవ ప్రతిఘటన

### కుట్రదారులు

రష్యన్ విప్లవంతో బొఖారా, ఖీవాలకు స్వాతంత్ర్యం లభించింది; ఈ రెండు రాజ్యాలూ కలిసి ఏరల్ సముద్రంనుండి ఇండియా వాయువ్య సరిహద్దులవరకూ విస్తరించి యుండేవి. వీని కావలనున్న కాస్పియన్ మైదానంలోనికి బ్రిటిష్ ఇండియా దళాలు దాడులు సాగించటమేగాక, ఖురాసాన్ (పర్షియాలో తూర్పుననున్న రాష్ట్రం) ఆక్రమించి 'మెషెడ్' దగ్గర ఒక స్థావరాన్ని యేర్పరచుకొన్నై; దీనితో పర్షియాకు బోల్షివిజం ప్రభావంనుండి పూర్తి రక్షణ లభించటమేగాక ట్రాన్సు సైబీరిన్ రైలు మార్గానికి ప్రమాదం వాటిల్లింది. ఈ రైలు మార్గం పర్షియా సరిహద్దు వెంట కొన్ని వందలమైళ్ళు విస్తరించింది. బ్రిటిష్‌దళాలవల్ల నవటర్కీ రిపబ్లిక్‌కు బొగ్గు, పెట్రో

లియం పరపరా ఆగిపోయింది. ఆ ప్రాంతాలనుండి బ్రిటిష్ దళాలను తరిమి వేయటానికి స్వతంత్ర బొఖారా ప్రభుత్వం అనుమతి పొందాలి; బ్రిటిష్ వారిపై చర్యలను బొఖారా సమ్మతించటం లేదు. అమీరుగానీ, ఆతని ఆస్థాన ప్రభువర్గంగానీ తమ స్వాతంత్ర్యానికి బోల్షివిజంపట్ల కృతజ్ఞులై యున్నారని విశ్వసించటానికి వీల్లేదు. సరిహద్దు నగరమైన అష్కాబాదులోని సైనికులకు ఆహార సామగ్రి పంపటానికి గూడా ఆటంక మేర్పడింది. అందుచే మధ్యఆసియాలో విప్లవాన్ని సుస్థిరం చేయటానికి ప్రచారంద్వారా బ్రిటిష్ సైన్యాన్ని విచ్ఛిన్నం చేయటం, బొఖారాను వశపరచుకొనటం అవసరంగా కన్పించినై. ఈ సందర్భంలోనే అష్కాబాదు మొదలైన సరిహద్దు ప్రాంతాలలో జాగ్రత్తగా పర్యటించి పరిస్థితులను పరిశీలించాను. నాటికే టాష్కెంటులో భారత విమోచన సైన్యానికి ప్రారంభోత్సవం జరిగింది; నా పర్యటనతో బ్రిటిష్ ఇండియా దళాన్ని వదలి చాలమంది సైనికులు విమోచన సైన్యంలో చేరారు. వీరు గెరిల్లా యుద్ధం సాగించి ఖొరాసాన్ నుండి ఆంగ్ల సైన్యాలను వెనుకకు తరిమి వేశారు; ఈ విషయాలన్నీ ముందు అధ్యాయంలో వివరిస్తాను. ప్రస్తుతానికి బొఖారా గాథను పరిశీలిద్దాం.

జారిస్టు నిరంకుశత్వంనుండి తనకు విముక్తి ప్రసాదించిందనే కృతజ్ఞత లేకుండా, బొఖారా రాజ్యం, మధ్యఆసియాలో సోవియట్ ప్రభుత్వంపై ఆంగ్లేయులు పన్నే కుట్రలకు రంగస్థలమై, టర్కిస్థాన్ సోవియట్ రిపబ్లిక్ ప్రక్కలో బల్లెంగా తయారైంది. మధ్య యుగారంభంనుండీ బొఖారా రాజ్యాస్థానం ప్రగతిశీలమైన ఇస్లాం సంస్కృతిని ఆదరించి పోషించింది. బొఖారా అమీరులు, బాగ్దాదు *ఖలీఫాలకు తామే వారసుల మని భావించేవారు. 'ఖలీఫా' అంటేనే వారసుడని అర్థం. ఖలీఫాలు ప్రవక్త మహమ్మదు వారసులు! బ్రిటిష్ సామ్రాజ్యవాదులు బొఖారా అమీరుల భావాలకు తాళం వేయటమేగాక, ఆ సాంస్కృతిక సత్సాంప్రదాయాలను, ప్రతీపగామిశక్తుల రక్షణార్థమై వినియోగించు కొంటున్నారు. వారి ప్రోత్సాహంతోనే మధ్యఆసియాలోని పూజారి వర్గాని కొక వినతి సమర్పింపబడింది. "భూములను పంచుతామనే ఎరజూపి భక్తిపరులైన ముస్లిములను వలలో వేసికొంటున్న బోల్షివిక్ నాస్తికులపై 'పవిత్ర యుద్ధం' ప్రకటించాలి. అందుకు సంప్రదింపులు జరిపేనిమిత్తం బొఖారా రాజాస్థానంలో సమావేశం కావాలి" అని వినతిపత్రంలో అభ్యర్థింపబడింది. ఆ పత్రంమీద ప్రముఖులైన ఇమాము లందరూ సంతకాలు చేశారు. కాని అచిరకాలంలోనే ప్రజాభిమానాన్ని పొందిన ప్రభుత్వాన్ని కూలద్రోయటం సులభ

---

* ఖలీఫాలలో రెండు వంశాలవా రున్నారు. మొదటిది ఒమ్మయ్యాడ్ వంశం; వీరి రాజధాని డమాస్కస్; వీరి తరువాత అబ్బాసీద్ వంశస్థులు ఖలీఫాలై బాగ్దాదును రాజధానిగా చేసికొన్నారు; హరూన్ ఆల్ రషీద్ అబ్బాసీద్ వంశస్థుడే.

సాధ్యం కాదు; అక్కడ కొద్దిమంది భూస్వాములూ, ప్రముఖ పూజారులూ మాత్రమే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉన్నారు. విప్లవకాలం నాటి ఫ్రాన్సులో వలెనే బొఖారాలో గూడా పూజారి వర్గంలో ఉన్నత, అధమ తరగతులున్నై. రెండవ తరగతి వారు ప్రజానీకంలో అంతర్భాగం; ప్రాచీన వ్యవస్థ కూలిపోయే తరుణంలో వారంతా ప్రజలతో చేరి పోరాడేవారే. అందుచేత, 'పవిత్ర యుద్ధం' నెగ్గదనీ, సాయుధమైన తిరుగుబాటే ప్రయోజనకారియనీ 'విశ్వాస సంరక్షకులు' నిర్ణయించారు. ఖొరాసాన్ నుండి తరిమికొట్టబడిన బ్రిటిష్ సైన్యం చిత్రాల్, గిల్‌గిట్ లలో స్థావరం ఏర్పరచుకున్నారు; అక్కడనుండి మధ్య ఆసియాలో కార్యాచరణ సాగించటమే వారి లక్ష్యం. చిత్రాల్, గిల్‌గిట్‌ల బ్రిటిష్ సైన్యంలోని భావి తిరుగుబాటుదారులనుండి, ఫర్గనా పర్వతారణ్య భూములగుండా బొఖారాకు ఆయుధాలు లభిస్తూ ఉండేవి.

కర్జన్ ప్రభువు ఇండియాలో రాజప్రతినిధిగా ఉన్నప్పుడు (1899—1906) పర్షియా, ఆఫ్ఘనిస్థాన్, మధ్యఆసియాలలో రష్యాప్రాబల్యం నెలకొనకుండా తీవ్రమైన కృషిచేశాడు. ఇరవై సంవత్సరాల తరువాత, ఇప్పుడాతడే బ్రిటిష్ విదేశాంగశాఖ కార్యదర్శియైనాడు. ఈలోగా, రష్యాలో సామ్రాజ్యవాదం స్థానంలో రైతుకూలీ ప్రజారాజ్యం ఏర్పడింది. అయినప్పటికీ, రష్యా విస్తరణభూతం మాత్రం కర్జన్ ప్రభువును వెన్నాడుతూనే ఉంది! ఈ ప్రజారాజ్యం ఆశయం సామ్రాజ్య విస్తరణకాదు. దాస్యంలో క్రుంగిపోతున్న ఆసియాప్రజల విముక్తియే దాని లక్ష్యం. పిట్టు మంత్రి వలెనే కర్జన్‌కూడా కరడుగట్టినసామ్రాజ్యవాది; ఇట్టివారికి రష్యా విప్లవప్రాశస్త్యాన్ని గుర్తించటం సాధ్యంకాదు. బోల్షివిక్ విప్లవనినాదాల నెవ్వరూ ప్రతిఘటించలేరు. మధ్యఆసియాలో బోల్షివిక్ ప్రభుత్వంపై, బ్రిటిష్‌పోషణలో జరిగిన తిరుగుబాటు ప్రయత్నం విఫలమైంది; ప్రజలను మోసగించటం యేమంత సులభంకాదు. ఒకవైపు ఇహలోకంలో తిండి, పాలు, శాంతి; మరొకవైపున పూజారుల దీవనలూ, పరలోక సౌఖ్యాలూ! ఇహలోక సౌఖ్యాలనే ఎన్నుకున్నారు ప్రజలు!

అయినా, మతపిచ్చిలో ప్రమాదకర పరిణామాలు జరిగే అవకాశం లేకపోలేదు. అజ్ఞానంలోఉన్న ప్రజానీకాన్ని మతంపేరుతో రెచ్చగొట్టటం చాల సులభం. అందుచే అటువంటి కుట్రలను మొదట్లోనే త్రుంచివేసే ఎదురు ఎత్తులు వేయాలి. ఆ ప్రయత్నాలు కొనసాగి, మధ్యఆసియాలో విప్లవం సుస్థిరంకావటానికి బొఖారా విమోచనం అత్యవసరమని తేలింది.

బొఖారాలోని పరిణామాలు అమనుల్లా, ఎన్వర్‌పాషాల ప్రవేశంతో మరింత క్లిష్టతరంగా రూపొందినై. ఈ ప్రమాదాలన్నిటినీ నేను ముందుగానే ఊహించాను. వాస్తవానికి కుట్రప్రారంభించినవాడు అమనుల్లా; బొఖారా అమీరును ఇస్లాం

ప్రపంచాధిపత్యం సంక్రమించటాన్ని సహించేవాడు కాదు; ఇది గ్రహించి బ్రిటిష్‌వారు తమ విదేశాంగనీతిని జాగ్రత్తగా, తాపీగా నడుపుతూ ఉభయుల అపరాభిమానాలను పొందటానికి ప్రయత్నిస్తున్నారు. ఇక ఎన్వర్ పాషా విషయం! నాటికే, ఇస్లాం ప్రపంచాధినేతగా గౌరవాలందుకొంటున్నాడు ఎన్వర్. బోల్షివిజం నాస్తికత్వంనుండి ఇస్లాం మతసంస్కృతులను రక్షించటానికొక గొప్ప సైన్యాన్ని తాను నిర్మిస్తున్నాననే వదంతిని వ్యాపింపజేశాడు. ఎన్వర్ స్వయంగా కాబూలు వెళ్ళలేదు; కాని అతని ప్రతినిధులు, అమనుల్లాను వలలో వేసికోగలిగారు. అమనుల్లా సందిగ్ధావస్థలో పడ్డాడు; నాటివరకూ బ్రిటిష్‌వారిపై కోపంతో సోవియట్ రష్యాతో మైత్రి వహించాడు. ఇప్పుడాతనికి ఒకవైపు బోల్షివిజం, మరొకవైపు ఇస్లాంమతం! ఏదియేమైనా అమనుల్లా ముస్లిం! అందుచే నాతడు ఇస్లాం రక్షణకు కంకణం ధరించిన ఎన్వర్ పక్షం వహించటములో ఆశ్చర్యం లేదు. ఎన్వర్ రాయబారులు అమనుల్లాను మరో ఎర కూడా చూపారు. ఇస్లాంరక్షణకై మధ్య ఆసియాలో జరిగే కుట్రలో చేరినచో బ్రిటిష్‌వారికీ అతనికీ రాజీ కుదర్చగలమని హామీయిచ్చారు. ఈవిధంగా బొఖారా అమీరు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులూ, ఎన్వర్ అమనుల్లాల కూటమి యేర్పడి మధ్య ఆసియాలో బోల్షివిజం నిర్మూలనకు కుట్రప్రారంభించారు.

## రష్యన్ విధానం

బొఖారా కుట్రను గురించి అచిరకాలంలోనే రష్యన్లు పసిగట్టారు; అమీరును తొలగించటం వారికి మూడు నిముషాలు కూడా పట్టదు; కాని తమంతతాముగా పరిస్థితులను విషమింపజేయటం వారికి యిష్టంలేదు. కుట్రకు మూలకారణమైన ఎన్వర్ కేవలం గాలి మేడల్లో విహరిస్తున్నాడు; ఇక, బ్రిటన్ హృదయపూర్వకంగా జోక్యం కలిగించుకోదు; కొన్ని రాజకీయ కారణాలవల్ల, తాముకూడా దూరంగా ఉండటమే మంచిదని వారి అభిప్రాయం. తెలివితేట లుపయోగించి, పమైక్య ఇస్లాం ఉద్యమాన్ని ప్రతీపగామి నాయకత్వం నుండి తప్పించగల్గితే, అది బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమంగా రూపొందగలదని బోల్షివిక్కుల ఆశ! ఏమైనా, రష్యాపట్ల ఇస్లాం ప్రపంచ వ్యతిరేకతను రెచ్చగొట్టే ప్రయత్నాలను బోల్షివిక్కులు తలపెట్టగూడదు. ఇతర మధ్య ఆసియా రాజ్యాల వంటిది కాదు బొఖారా; తరతరాలుగా ఇస్లాం సంస్కృతికి పట్టుగొమ్మ! అమీరును తొలిగించి, రిపబ్లిక్ ప్రభుత్వాన్ని నెలకొల్పటాన్ని బొఖారా ప్రజలు ప్రతిఘటింపకపోవచ్చు; బొఖారా ప్రజలు రష్యాపట్ల అభిమానం వహించే ఉన్నారు. కాని పరిసర ముస్లిం రాజ్యాలీ పరిణామాన్ని సహింపవు.

టర్క్ బ్యూరోలో ఈ విషయాలన్నీ చర్చించాం. "వెంటనే తగిన చర్య తీసికోవాలనీ, బొఖారా ప్రాంతాలలో శత్రువుల ప్రచారానికి ఎక్కువ కాలం అవకాశం ఇస్తే, మధ్యఆసియాలోని అమాయక ప్రజానీకంలో క్రొత్త ప్రభుత్వంపట్ల

ద్వేష బీజాలు పనిచేయవచ్చున”నీ హెచ్చరించాను. సమైక్య ఇస్లాం ఉద్యమంలోని విప్లవాత్మక స్వభావాన్ని గురించి మొదటినుండీ నాకు అనుమానమే! ఐతే బ్యూరోలోని సభ్యులిద్దరూ రష్యన్లు, ఉగ్రవాదులతో క్రమశిక్షణను జీర్ణించుకొన్న పార్టీ సభ్యులు. ఇస్లాం సమైక్య ఉద్యమమూ, బోల్షివిక్ విప్లవమూ సుహృద్భావంతో ఉండాలని పార్టీ అధికార విధానం. “నీ భావాలతో పార్టీ విధానంలో లెనిన్ విశ్వాసం సడలినమాట వాస్తవమే; ఐనా, మాస్కో నుండి క్రొత్తగా సూచన లేమీ రానిదే ప్రాత విధానాన్ని మార్చటానికి వీల్లేదు” అని టర్కు బ్యూరో సభ్యుల వాదన. “సర్వకాల సర్వావస్థల్లోనూ ఒకే విధానాన్ని పట్టుకొని ప్రాకులాడటం శ్రేయస్కరం కాదు; పరిస్థితుల కనుగుణంగా మన విధాలను మార్చుకొనటం ఉచితం; సమీప ముస్లిం రాజ్యాల్లోని ప్రజల సానుభూతిని కోల్పోగలనునే భయంతో, ఆసన్న ప్రమాదాన్ని నిర్లక్ష్యం చేయటం తెలివి తక్కువ; కాబట్టి స్థానికంగా ఉన్న పార్టీ సభ్యుల్లో ప్రముఖులైన వారిని సమావేశపరచి, వారి అభిప్రాయాలను సేకరించి, వెంటనే మాస్కోకు ఒక నివేదిక పంపుదాం” అని మరొక సూచన చేశాను.

నా సూచన ప్రకారం ప్రముఖ పార్టీ సభ్యుల సమావేశం జరిగింది; స్థానిక కమ్యూనిస్టు నాయకుల్లో చాల మంది రష్యనేతరులే. వారందరూ క్రొత్త రిపబ్లిక్ ప్రభుత్వంలో సభ్యులు; వారంతా నా వాదననే బలపరచారు. కొందరు రష్యన్లు గూడా మా పక్షం వహించారు. బొఖారా, ఆఫ్ఘన్ ప్రభుత్వాలతో సంప్రదించి, వాని దృక్పథాలను పరిశీలించవలసిందిగా నన్ను నియమిస్తూ ఒక నిర్ణయం చేశారు. “టర్కోమన్లు నిర్బంధించిన భారతీయ ముజహిర్ల విడుదల సాధించటానికై రెడ్ ఆర్మీ దళాన్ని పంపాలి; * ఆదళం బొఖారా గుండా ఆఫ్ఘన్ సరిహద్దులను చేరాలి. పురోగమించటానికై బొఖారా అనుమతిని సంపాదించాలి; ఎన్వర్ పాషా సమక్షంలో ఆఫ్ఘన్ రాయబారిని కలుసుకొని, సైనిక సదుపాయాలతో ఆఫ్ఘనిస్థానం గుండా ఇండియా సరిహద్దులకు నా ప్రయాణాన్ని గురించిన వర్తమాన మేమైనా వచ్చినదేమో తెలిసికోవాలి” అనీ నిర్ణయాలు జరిగినై.

ఆఫ్ఘన్ రాయబారినీ, ఆతని ప్రధానోద్యోగులనూ, రాజకీయ విందుకు ఆహ్వానించాను. టాష్కెంట్‌లోని నా బసలో యింకా పెద్ద విందుకు తగిన సౌకర్యాలు లేవు. ఆ సంగతి తెలిస్తే ఆఫ్ఘన్లు నా ఆహ్వానాన్ని అంగీకరించేవారు కాదు. బహుశా ఈ విందును వారు తమ కొక సదవకాశంగా పరిగణించారు. తమ భోగ భాగ్యాలకూ, సోవియట్ రిపబ్లిక్ పేదరికానికీ మధ్యగల వ్యత్యాసాన్ని ఈ విందు ద్వారా స్థానిక ప్రజలకు నిరూపించవచ్చుననీ తద్వారా క్రొత్త ప్రభుత్వంపట్ల అసమ్మతినీ, ద్వేషాన్నీ రెచ్చగొట్టవచ్చునని వారు ఆశించి ఉంటారు.

---

* ఈ విషయాన్ని గురించి ముందు అధ్యాయంలో వివరింపబడుతుంది.

టాష్కెంటులో విలాసాలకు పేరుబడ్డ పెద్ద హోటల్లో ఆఫ్ఘన్ రాయబార వర్గం విడిదికి ఏర్పాట్లు జరిగినై. ఒక భోజన విషయంలో వినా, మిగిలిన విషయా లన్నిట్లో ప్రత్యేక సౌకర్యాలు కల్పించారు. భోజన పదార్థాల సరఫరా తక్కువగా ఉండటంచే ఆ విధంగా చేయవలసివచ్చింది. నగరంలో ధనికవర్గాలు నివసించే ప్రాంతంలో ఉన్నదా హోటలు; ఇక్కడ ధనికవర్గం అంటే రష్యన్ ఉద్యోగులూ, సామ్రాజ్యవాద బూర్జువావర్గమూ మాత్రమే. విప్లవంతో వీరంతా అదృశ్యమైనారు. వలస రాజధానిలో ప్రధానమైన భాగం నిర్మానుష్యమైంది. విలాసజీవితానికి అను కూలంగా నిర్మించిన భవనాలు ఇతర కార్యక్రమాల కుపయోగించవు. అందుచేత తురుష్కులకీ ప్రాంతంలో చాల యిబ్బందిగా ఉండేది. వారి సౌఖ్యాలు, విలాసాల స్థాయి వేరు. ఆఫ్ఘన్లు మాత్రం ప్రాచ్య మర్యాదలనే పాటించేవారు; కాని రాయ బారులుగా, ఆ హోటల్లోని వైదేశిక సాంప్రదాయాలను అనుభవించటం తమ హక్కుగా పరిగణించారు. కాని ఇక్కడ వారి వారి భోగభాగ్యాలను ప్రదర్శించటం కేవలం వృథా ఐంది. నగరంలోని సామాన్యప్రజానీకం వీరిని దర్శించటానికిగానీ, కలుసుకొనటానికిగానీ వీల్లేకుండా కట్టుదిట్టాలు చేయబడినై. ఆఫ్ఘన్ రాయబార వర్గంలో ప్రభుత్వ అతిథిగా ఉంటున్న ఎన్వర్ పాషాను కూడా విందుకు ఆహ్వానించాం. ఎన్వర్ అంగీకరించాడు.

ఆ యింట్లో ప్రవేశించిన తరువాత ఇదే మొదటిసారిగా భోజనశాల నుపయో గించటం! అది విశాలమైన గది; మంచు ముద్దలా ఉంది; గది గోడలో గూడా ఒక పింగాణీ కుంపటిని అమర్చారు. కనీసం రెండు రోజులైనా ఆ కుంపట్లో అగ్ని ప్రజ్వ లిస్తేగాని, ఆ గదిలో నిలబడటానికి వీలుండదు. అందుకు బండ్లకొలదీ వంటచెరకు కావాలి. వంటచెరకు అపురూపం కదా! ఐనా తెప్పించారు. రాజకీయ విందు పుణ్యమా అని ఇల్లంతా వెచ్చగా తయారైంది. ఆ కుంపట్లు, పాత పద్ధతిలో, పెద్ద పెద్ద బండలతో మందమైన పింగాణీ పెంకులతో నిర్మించారు; ఒకమారు వేడెక్కితే కొన్ని రోజులవరకూ అవి చల్లారవు. ఇంటిల్లిపాదీ ఆఫ్ఘన్ రాయబారవర్గంపట్ల కృత జ్ఞత వెల్లడించారు! ఇక విందు విషయంలో రష్యన్ సభ్యులకూ నాకూ అభిప్రాయాలు వేరైనై; ప్రాచ్య మర్యాదల కనుగుణంగా అతిథులకు పెద్ద యెత్తున విందు జరపాలని వారూ, విప్లవ నిరాడంబరత్వానికి స్వస్తి చెప్పకూడదని నేనూ పట్టుదల వహించాం. చివరకు ఒక భోజన విషయంలో మాత్రం రాజీకి వచ్చాం.

ప్రాచ్య విదేశాంగనీతిలో నేరుగా విషయచర్చ జరపటం అంటూ ఉండదు. భోజనానంతరం, చర్చను ఉపక్రమిస్తూ ఎన్వర్ పాషాను ప్రణాళిక ఎలా పురోగమిస్తున్నదీ అడిగాను. సంతృప్తికరంగా ఉన్నదనీ, త్వరలోనే తాను కాబూలు వెళ్ళవచ్చుననీ చెప్పాడు. అంతకుమించి అతడేమీ మాట్లాడలేదు. కాబూలుకు నా ప్రయాణాన్ని

గురించి ప్రస్తావన చేయటానికదే మంచి సమయం. ఎన్వర్ చెప్పినదానికంటె మరింత ఆశ్చర్యకరం; ఆఫ్ఘన్ రాయబారికి నేనాశించిన వర్తమానం వచ్చింది. "ప్రముఖ భారతీయుని హృదయపూర్వకంగా ఆహ్వానించి, భారతదేశ విముక్తి ఉద్యమంలో, సర్వశక్తులా ఆతనికి సాయం చేయటానికి ఆఫ్ఘన్ ప్రభుత్వం సిద్ధంగా ఉంది." ఐతే, నా ప్రయాణం సుకరంగా సాగటానికై, నా సాధనసామగ్రినంతా, టాష్కెంటులోని ఆఫ్ఘన్ రాయబారవర్గానికి అప్పగించాలి; అవసరమైనచోట, నాకు వాని నందజేస్తారు. ఈ సూచనలోని ఆంతర్యం? ఆఫ్ఘనిస్థాన్‌లో, నేను ఆ దేశంయొక్క దయాధర్మాలపైనే పూర్తిగా ఆధారపడిఉండాలి. ఇందుకు వారుచూపిన కారణమేమిటంటే, ఆఫ్ఘనిస్థాన్ గుండా ఆయుధాలనూ, యుద్ధసామగ్రినీ సరఫరా చేసికొనే అవకాశాన్ని భారతీయ విప్లవకారులకు కలిగించినచో తమకూ, బ్రిటిష్ ప్రభుత్వానికీ మధ్య సంబంధాలు చెడిపోగలవట! వారివాదనలో కొంత సత్యం లేకపోలేదుగానీ ఇండియా సరిహద్దుల్లో ఆఫ్ఘన్‌లు నాకు ఆయుధాలు చేర్చగలరని ఎలా నమ్మటం? వారు మోసంచేస్తే నే చేయగలిగిందేమీ లేదు. అది చాల జిత్తులమారిసూచన అనటంలో ఆక్షేపణ లేదు; ఐనా ఆ క్షణంలో పూర్తిగా నిరాకరించకూడదు. నిరాకరిస్తే ఆఫ్ఘన్ ప్రభుత్వాన్ని శంకించినట్లవుతుంది! ఈ రాజకీయ సంబంధాల నిదేవిధంగా కొనసాగించాలి. అందుచే పరస్పర శుభాకాంక్షలను, సుహృద్భావాన్ని వెల్లడించుకొంటూ సమావేశాన్ని ముగించాం. దీన్నిబట్టి ప్రస్తుతానికి ఆఫ్ఘనిస్థాన్ వెళ్ళటం నిష్ప్రయోజనమనీ, అక్కడ భారత విమోచనసైన్య స్థాపరం నెలకొల్పే నా ఆశ నిరాశయైనదనీ తేలిపోయింది!

## బొఖారాపై దండయాత్ర – ఎన్వర్ మరణం

ఒకదాని వెంట మరొకటిగా సంఘటనలెంతో వేగంగా జరగసాగినై. బొఖారా అమీరు ఒక చిన్న బృందంతో, రహస్యంగా దేశంవిడిచి పారిపోయినాడనే వర్తమానం వచ్చింది. ఎన్వర్ పాషాకూడా రంగస్థలంనుండి నిష్క్రమించాడు. భారతీయ విప్లవకారులను తమదేశం విడిచి వెళ్ళవలసిందిగా ఆఫ్ఘన్ ప్రభుత్వం ఉత్తర్వు జారీ చేసినట్లు, కాబూలులోని సోవియట్ రాయబారవర్గంనుండి వార్త! ఈ విప్లవకారులందరూ, మూడవ ఆఫ్ఘన్‌యుద్ధకాలంలో సరిహద్దుజాతులను బ్రిటిష్‌వారిపై రెచ్చగొట్టే ప్రయత్నంలో వచ్చినవారే. యుద్ధానంతరం స్వదేశానికి తిరిగివెళ్ళటానికి వీల్లేక కాబూలులోనే ఉండిపోయినారు. వీరిలో కొందరు 1916 లో నెలకొల్పబడిన భారత తాత్కాలిక ప్రభుత్వంలో సభ్యులు. (Indian Provisional Government) నాటివరకూ వీరు రాజకీయశరణార్థులు; మిత్రులు. వీరి బహిష్కరణకు విదేశాంగ పరిణామాలే కారణం. న్యూఢిల్లీతో స్నేహసంబంధాలు పునరుద్ధరించుకొనాలనే కాబూలు తాపత్రయం!

భయానకమైన ఈ సంఘటనవల్ల త్వరలోనే 'భరతవాక్యం' పాడటానికి శత్రువులు నిర్ణయించారని ఊహించాను. కాని అది తొందరపడిచేసిన నిర్ణయమే! వారికి ఇంకా తగిన బలం చేకూరలేదు. ఏమైనా, వారే మమ్మల్ని ఉసిగొల్పారు. ఇక గత్యంతరంలేదు. రెడ్ఆర్మీ బొఖారాపై నడిచింది; అక్కడ నామమాత్రమైన ప్రతిఘటనకూడాలేదు. బొఖారాలో విప్లవప్రభుత్వం నెలకొల్పబడింది. అమీర్ పలాయనంతో దేశంలో చట్టబద్ధమైన ప్రభుత్వంలేదు. ఆశూన్యాన్ని భర్తీచేయటానికి, అన్నివిధాలా టర్కీస్థాన్ రిపబ్లిక్‌కు హక్కుఉంది. మధ్యఆసియాలో అరాజకం చెలరేగి, తురుష్క తిరుగుబాటుదారులు విజృంభింపకుండా అదుపులో నుంచటం టర్కీస్థాన్ ధర్మం. హఠాత్తుగా బొఖారాఅమీరూ, ఎన్వర్‌పాషా ఉభయులూ అదృశ్యంకావటంతో పర్వతారణ్యామయమై, దుర్గమమైన ఫర్గణాప్రాంతమును విప్లవప్రతిఘటనకు స్థావరంగా చేసికొని, అక్కడనుంచి టర్కీస్థాన్ రిపబ్లిక్‌పై సైనికచర్య జరపాలని వారి ఆశయమైనట్లు గ్రహించాను. బ్రిటిష్‌ప్రభుత్వమూ, ఆఫ్ఘన్ ప్రభుత్వమూ తమశక్తికొలదీ వారికి మద్దతునిస్తున్నట్లుకూడా స్పష్టంగా తెలిసింది.

బొఖారా నగరాన్నీ, పశ్చిమ మైదానాన్నీ సులభంగానే ఆక్రమించాము. ఇక ఫర్గణాలో సమాయత్తమౌతున్న ప్రతిఘటనను విధ్వంసం చేయటానికై పెద్దయెత్తున సైనిక చర్య జరపాలి. ఫర్గణా, ఆఫ్ఘనిస్థాన్‌ల మధ్య సుమారు 200 మైళ్ళు సరిహద్దు ఉంది. బ్రిటిష్ స్థావరాలైన చిత్రాల్, గిల్‌గిట్టులు కూడా ఫర్గణాకు అందుబాటులోనే ఉన్నై. రెడ్ ఆర్మీలోని తురుష్క దళాలకు ఆయుధాలూ, ఇతర సామగ్రీ యిచ్చి నడిపాము. యుద్ధంలో ముక్కాకలు దీరిన యోధులు తురుష్కులు. ఫర్గణాపై రెండు వైపులనుండి దాడి జరిగింది. బొఖారా మైదానం మీదుగా ఒకదళం తూర్పుగానూ, మరొక దళం తూర్పుటర్కీస్థాన్ సరిహద్దుల్లో నున్న అండిజాన్ నుండి దక్షిణంగానూ పురోగమించినై. మొదటి దళం ఎదురు దాడి జరిపి తిరుగుబాటుదారుల్ని వెనుకకు తరిమి కొట్టింది. రెండవ దళం, ఎత్తైన పర్వత కనుమల గుండా పురోగమించి ప్రక్కవాటుగా శత్రువుల ప్రధాన స్థావరంపై దాడిజరిపింది. ఈ స్థావరం ఇండియా సరిహద్దులకు చాల సమీపంలో ఉంది. పామీరు పీఠభూమిపై అరుణ పతాకాన్ని ప్రతిష్ఠించటంతో మా విజయం పూర్తయింది. ప్రపంచపు పైకప్పుపై నిలిచి "ఫీల్డు గ్లాసుల" గుండా ఇండియాపై దృష్టి సారించాను. నా మాతృభూమికీ, పామీరుకూ మధ్య ఆఫ్ఘన్ భూభాగం. అది సన్నని పీలికే ఐనా, దుర్గమమైన కోటగోడలా నా మార్గాన్ని అటకాయించింది!

చివరి శత్రు స్థావరాన్ని నేల మట్టం చేసి ఎఱ్ఱ సైన్యం వెనుకకు మరలింది. అక్కడే యుద్ధభూమిపై ఎన్వర్ పాషా మృతకళేబరం కన్పించింది. ఆ కళేబరం, బ్రిటిష్ సైనికోద్యోగి దుస్తుల్లో ఉంది!

## రిపబ్లిక్ అవతరణ

బొఖారాలో నానాటికి పెరుగుతున్న విప్లవ ప్రతిఘటన శక్తుల మాయా జాలాన్ని విచ్ఛిన్నం చేయటానికి రష్యా సైనికచర్య తప్పనిసరైంది. కాని, అచటి ప్రాచీన వ్యవస్థను కూలద్రోసి విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించగల విప్లవ పక్షం లేదు. ఐనప్పుడు రష్యా ఎవరికి సాయం చేయాలి? అనే ప్రశ్న ఎదురైంది. కమ్యూనిస్టులు ఆశించినట్లు బొఖారాలో విప్లవానికి అవసరమైన సాంఘిక పునాదులు లేవు. పారిశ్రామికంగా దేశం చాల వెనుకబడి ఉంది. శ్రామికవర్గం లేదనే చెప్పవచ్చు. ఇక, విప్లవాన్ని పురికొల్పగల వారెవరు? రైతుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. వీరు మతాధికారు గీచిన గీటు దాటరు. ఆధునిక పరిభాషలో మధ్యతరగతి అనేది బొఖారాలో లేనే లేదు. ఐతే, వాణిజ్య కేంద్రాలలో వర్తకవర్గమొకటి ఉంది. కాబట్టి. ఈ వర్తకవర్గాన్నే సంఘటితపరచి, ప్రాచీన భూస్వామ్య - పూజారి విధానంమీద తిరుగుబాటుకు పురికొల్పాలి. అప్పుడే విప్లవం స్వచ్ఛందమూ, స్థానికమూ ఐనట్లు రుజువౌతోంది.

బ్రిటిష్ వారూ, అఫ్ఘన్లూ బొఖారో కేంద్రంచేసికొని రెచ్చగొడుతున్న విప్లవ విధ్వంసక శక్తులవల్ల క్రొత్త ప్రభుత్వానికి నలుమూలలా ప్రమాదం ముంచుకు వచ్చింది. ఆ పరిస్థితుల్లో ముస్లిం ఉద్రేకాలను గూర్చిన భయాలతో, జోక్యం కలిగించుకొనకుండా చేతులు ముడుచుకొనటానికి వీల్లేదు. అందుచే రష్యన్ల భయాన్ని తొలగించటానికై నేనొక సూచన చేశాను.

"మధ్యఆసియాలో విప్లవ ప్రతిఘటన నెగ్గితే, ముస్లిం ప్రజానీకం బలికాక తప్పదు; భూస్వాములు విజృంభించి రైతులను పీడించి దోచుకొంటారు; ప్రజల మత సాంస్కృతిక జీవితం మీద పూజారుల దౌర్జన్యం బలవత్తరమై తీరుతుంది. విప్లవ ఉద్దేశ్యం అమీరుని తొలగించటం కాదు; నిరంకుశ భూస్వామ్య - పూజారివర్గాల దౌర్జన్యాల నుండి ప్రజలను రక్షించటమేనని ప్రజలకు నచ్చేటట్లు ప్రచారంచేయగలిగినప్పుడు బొఖారాలో రష్యన్ జోక్యానికి వ్యతిరేకత అంతరిస్తుంది."

అమీరువల్లగానీ, చితికిపోయిన అతని ఆస్థానంవల్లగానీ మాకు ప్రమాదం జరుగుతుందని మేమెన్నడూ భావించలేదు. అందుచేతనే అతడు రాజధాని విడిచి పారిపోతున్న వర్తమానం ముందుగానే అందినా, నివారించటానికి ప్రయత్నింపలేదు. అనుచరులతో సహా అమీరును ఖైదు చేయటం కష్టమైన పని కాదు; కాని దానివల్ల ప్రయోజనం లేదు. అమీరును తుదముట్టించటం కూడా తేలికైన పనే; కాని వృద్ధ అమీరును వధించటం కేవల రాక్షసత్వ ప్రదర్శనమే! పైగా అట్టి చర్యలవలన ముస్లిం ప్రజానీకం రెచ్చిపోయే ప్రమాదం ఉంది. ఎంతైనా, అమీరు ముస్లిం ప్రపంచానికి అధిపతి!

బొఖారాలో జోక్యం తప్పనిసరి అని నిర్ణయమైన వెంటనే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కి బ్యూరో ఆధ్వర్యాన టాష్కెంట్‌లో ఒక "బొఖారా విప్లవ సంఘాన్ని" నెలకొల్పాము. బొఖారా ప్రజానీకంతోనే గాక ఈ సంఘం బొఖారా మున్నగు నగరాల్లోని వర్తక వర్గాలతో కూడా మంతనాలు జరిపింది. "రైతులను భూస్వామ్య బానిసత్వం నుండి విముక్తి చేయటం వల్ల వర్తకవర్గానికి నష్టంలేదనీ, నిజానికి భూస్వామ్య విధానమే వాణిజ్య విస్తరణకు తీవ్రప్రతిబంధకంగా ఉంద"నీ నచ్చజెప్పటానికి ప్రయత్నించింది. మతాధిపతి అనే గౌరవమూ, సాంప్రదాయసిద్ధమైన భావనా అనే రెండు కారణాలవల్లనే వర్తకవర్గం అమీరుపట్ల విధేయత వహించింది. కాని, ప్రజారక్షణలో తన ధర్మాన్ని త్యజించి, ప్రాణభీతితో అమీరు పలాయనం చిత్తగించటంవల్ల, ఆ అనుబంధాలు తెగిపోయినై.

ఇక రైతువర్గాల్లో: "విప్లవం రైతులకు భూములను పంచి పెట్టింది. ఇప్పుడు బ్రిటిష్, ఆఫ్ఘన్ ప్రభుత్వాల సహాయంతో విప్లవాన్ని కూలద్రోయాలనే ప్రయత్నం జరుగుతోంది; ఆ ప్రయత్నాలు ఫలిస్తే రైతులు తిరిగి దాస్యశృంఖలాల్లో చిక్కుకొనక తప్పదు. కాబట్టి, ఒకవైపు తమ శ్రేయస్సులను సేకరించిన ప్రాతభూస్వామ్య విధానమూ, రెండవ వైపు విప్లవం తెచ్చిన లాభాలు; అంటే అమీరునో లేక విప్లవం ప్రసాదించిన భూమినో రైతులు ఎన్నుకోవాలి." అని ప్రచారం సాగించాం. మార్క్సిజంలో మాకున్న విశ్వాసాన్నిబట్టి, రైతు లీ ఎన్నికలో పొరబాటు పడరని భావించాం. కాని రైతులు పూర్తిగా అజ్ఞానంలో మునిగి ఉన్నారు. పూజారులు రెచ్చగొట్టే మతోద్రేకాలకు బలిగాకుండా తప్పించుకోనటం వారికి సులభం కాదు. అందుచే, ప్రజల మతవిశ్వాసాల నేమాత్రం గాయపరచవద్దని, విప్లవ సంఘాన్ని హెచ్చరించాం; ఇక పూజారి వర్గాన్ని విచ్ఛిన్నం చేయాలి. ఈ కృషిలో మాకు ఫ్రెంచి విప్లవం మార్గదర్శకమైంది. ఫ్రెంచి విప్లవకాలంలో, ధనిక పూజారి వర్గంపై గల ద్వేషంతో పేదపూజారు లందరూ విప్లవకారుల పక్షంలో చేరారు. మధ్య ఆసియాలో కూడా అటువంటి పరిణామాన్ని తీసుకురావటానికే ప్రయత్నించాము. ఈ సందర్భంలోనే, కొరాను, ఇతర ముస్లిం మతగ్రంథాలను క్షుణ్ణంగా చదివాను. బహిరంగ ఉపన్యాసాలలో ముస్లిం మతగ్రంథాలనుండి ధారాళంగా ఉదాహరణలిస్తూ విప్లవాన్ని సమర్థించేవాణ్ణి!

విప్లవం విజయవంతమై, ప్రజాభిప్రాయంపై క్రొత్త ప్రభుత్వ మేర్పడేవరకూ, విప్లవ సంఘమే బొఖారాలో తాత్కాలిక ప్రభుత్వాన్ని నిర్వహించాలి. ఆ బాధ్యత నిర్వహించటానికి తగినట్లు విప్లవసంఘాన్ని రూపొందించటంలో పెక్కు చిక్కులేర్పడినై. టాష్కెంటులోని బొఖారా వర్తకులలో విద్యాగంధమున్నవారే లేరని చెప్పవచ్చు. అందుచే విప్లవసంఘ సభ్యులకు, వారి ఉద్యమ ప్రాశస్త్యాన్ని గురించిన ప్రాథమిక పాఠాలు కూడా చెప్పవలసివచ్చింది. ఐతే, మా అదృష్టం బాగుండి,

ఫైజుల్లా ఖాజేవ్ అనే యువకు డొకడు లభించాడు. అత డొక లక్షాధికారి బిడ్డ; పెద్ద పెద్ద ఆశలు గలవాడు; జర్నలిజం నేర్చుకొనే ఉద్దేశ్యంతో, పెట్రోగ్రాడ్ వరకూ పర్యటించాడు! పిత్రార్జితమైన దుకాణంలో గడపటం అతనికి సరిపడలేదు. నూతన పంథాలో జీవితం సాగించాలనే ఆతని ఆశయం. ఐతే, ఈ ఆశయానికి ఆతని విద్యా, యోచనాశక్తీ పునాది కావటమే గొప్ప సుగుణం. కాని ఆతని వయస్సు పెద్ద ప్రతిబంధకమైంది! ప్రాచ్య ముస్లిం ప్రపంచంలో నెరసిన గడ్డానికిఉన్న గౌరవం మరొకనికి ఉండదు. ఫైజుల్లాది అటువంటి గడ్డం కాదు! ఐనా తంటాలు పడి, ఫైజుల్లానే బొఖారా విప్లవ సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నిక చేశాం. అతడు కూడా మంచి సమర్థతతోనే తన పదవిని నిర్వహించాడు. అమీరు పలాయనానికి కొన్ని నెలలకు పూర్వమే బొఖారా విప్లవసంఘం టాష్కెంటులో పని ప్రారంభించింది.

బొఖారా నగర ప్రాంతాల వర్తక వర్గంలోని యువకులతో, విప్లవ సంఘ కార్యక్రమం ప్రారంభమైంది. ఆ యువకుల్లో కొందరిని ఎన్నిక చేసి, ప్రచారకులుగా, ఆందోళన కారులుగా శిక్షణ పొందటానికై టాష్కెంట్ పంపేంది. వీరి ద్వారానే విప్లవ సందేశం నలుమూలలా ప్రతిధ్వనించింది. అంతేగాక ప్రజాప్రభుత్వ స్థాపనకు పూర్వం ఒక మహాసభ జరుగుతుందనీ, దానికి వర్తకవర్గం ప్రతినిధులను పంపాలనీ సూచన చేశారు. దీనితో, విప్లవ లాభాలలో తమకూ వాటా లభిస్తుందనే ఆశయేగాక, రష్యా పోషణ విశ్వాసయోగ్యమనే నమ్మకమూ కలిగింది. సహజమైన పిరికితనం పోయి వర్తకవర్గానికి ధైర్యం చేకూరింది.

## విప్లవ ప్రభుత్వ సలహాదారుగా

అమీరు పారిపోయినట్లు తెలిసినంతనే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కీ బ్యూరో, టర్కీస్థాన్ రిపబ్లిక్ ప్రభుత్వమూ సంయుక్త సమావేశం జరిపి, తక్షణ చర్యలను గురించి చర్చించారు. బొఖారాలో నేర్పడిన రాజకీయ శూన్యతను భర్తీ చేయటానికై క్రొత్త ప్రభుత్వాన్ని స్థాపించాలని నిర్ణయింపబడింది; బొఖారా విప్లవ సంఘం వెంటనే బొఖారా కేగి, ప్రజాప్రతినిధులసభను సమావేశ పరచాలి; ఆ మహాసభయే, ప్రాతప్రభుత్వ అస్తమయాన్నీ, నూతనప్రజాప్రభుత్వోదయాన్నీ ప్రకటిస్తుంది! విప్లవ సంఘానికీ, త్వరలో యేర్పడే తాత్కాలిక ప్రభుత్వానికీ సలహాదారుడుగా నేను బొఖారో వెళ్ళాలని కూడా నిర్ణయించారు. బొఖారాలో పరిస్థితులన్నీ సందిగ్ధంగా ఉన్నై. అంతా అనుకున్నట్లు జరుగుతుందనే ఆశ లేదు; ఎప్పుడు, ఏ మూలనుండి శత్రువులు దండెత్తుతారో ఊహించటం కష్టం; కాబట్టి, తగినంత కట్టుదిట్టంగా ఉండాలనే భావంతో ఫ్రూన్జీ నాయకత్వాన రెడ్ ఆర్మీ దళాన్ని కూడా మా వెంట బొఖారాకు పంపటానికి నిర్ణయం జరిగింది. టర్కీస్థాన్ రంగంలో, రెడ్ ఆర్మీ దళాధిపతిగా, సొకొల్నికావ్ స్థానంలో వచ్చాడు ఫ్రూన్జీ.

బొఖారా చేరుకున్నాం; అక్కడి వాతావరణంలో అవ్యవస్థ, అరాజకం తాండవిస్తూ ఉన్నై. బొఖారా చేరగానే, విప్లవ సంఘం, ప్రజాప్రతినిధులను ఆహ్వానించింది; మహాసభా సమావేశం ఎన్నో రోజులు లేదు. ఈలోగా తానే తాత్కాలిక ప్రభుత్వంగా ప్రకటించుకొని, విప్లవ సంఘం, పరిపాలనను నిర్వహింపసాగింది. క్రొత్త ప్రభుత్వ ఆశయాలూ, కార్యక్రమమూ, పెద్ద పెద్ద అక్షరాలలో అచ్చువేసి గోడలకు అంటింపబడినై. "అమీర్ దేశం విడిచి పలాయనమైనాడు; దానితో ఆతనికి ప్రజల విశ్వాస విధేయతలను కోరే హక్కు నశించింది. భూస్వాముల స్వాధీనంలో ఉన్న భూమిని సంగ్రహించి రైతులకు పంచుతాము; అమీర్ సొంత భూములన్నీ జాతీయం చేయబడినై; ఆ ఆస్తిపై ముఖ్య ఇమామ్ ధర్మకర్తగా ఉంటాడు" అని ప్రకటనలలోని సారాంశం.

ఈ విధంగా, తాత్కాలిక ప్రభుత్వం పీడిత ప్రజోద్ధరణమే తన ప్రధమ కర్తవ్యమని వాగ్దానం చేసింది; ఇతర ప్రజానీకానికి హాని కలిగించనని హామీ యిచ్చింది. ఇక, దేశంలో రష్యా సైన్యం ఆవశ్యకతను గురించి ప్రజలకు నచ్చజెప్పాలి. "క్రొత్తగా నేర్పడిన విప్లవ ప్రభుత్వాన్ని ప్రమాదాల నుండి రక్షించి, దానికి అండగా ఉండే ఉద్దేశ్యంతో, బొఖారా విప్లవ సంఘ ఆహ్వానం మీదనే రష్యా సైన్యం వచ్చింది. ప్రజామోదం పొందిన ప్రభుత్వం యేర్పడగానే రష్యా సైన్యం మరలి పోతుంది" అని ప్రకటించిన వారం రోజుల్లోనే తన సైన్యంలో అధిక భాగంతో ఫ్రూన్జీ, టాష్కెంట్ మరలి వెళ్ళాడు; ఐతే అమీర్ ఆస్తిలోని బంగారం అంతా తనతో తీసుకు వెళ్లాడు. ఆ సంగతి మాత్రం ఎవ్వరికీ తెలియదు!

అనుకొన్న రోజునే ప్రజాప్రతినిధుల మహాసభ సమావేశమైంది. ప్రతినిధుల్లో అనేకులు పూజారులు. ఐనా విరుద్ధమైన వాదాలేమీ జరగలేదు. బోల్షివిక్కుల నాస్తికత్వాన్ని గురించి మాత్రం గుసగుసలు జరిగినై. క్రొత్త ప్రభుత్వం, మతాన్ని హింసిస్తుందేమోననే భయం అందరిలో కన్పించింది. ఏమైనా తాత్కాలిక ప్రభుత్వ ఎన్నిక ఏకగ్రీవంగా జరిపించాలి. మహాసభలో ఫైజుల్లా తన ఉపన్యాసాన్ని, అల్లా, మహమ్మదుల ప్రార్థనలతో ప్రారంభించాడు. "అల్లామీద ప్రమాణం చేసి, ఆతని ప్రవక్త మహమ్మదుమీద ప్రమాణం చేసి మాట్లాడుతున్నాను; నేను కమ్యూనిస్టును కాదు; మీ అందరిలాగా నేనూ పవిత్ర ముసల్మానునే. మీ అందరికీ హామీ యిస్తున్నాను. బొఖారాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని స్థాపించటం రష్యనుల ఉద్దేశ్యం కాదు. మన సహాయార్థం మన కోరికమీదనే వారు వచ్చారు. రష్యా విప్లవమే, మనకు స్వాతంత్ర్యాన్నీ సర్వం సహాధికారాన్నీ ప్రసాదించింది. వాటిని రక్షించుకొనటం మన ధర్మం. అందుకై, మన మందరం కలిసి ప్రజా విప్లవ పక్షాన్ని (People's Revolutionary Party) స్థాపించుకొందాం. విదేశీయులు జోక్యం

కలిగించుకొని, మన స్వాతంత్ర్యాన్ని హరించటానికి, మన ప్రజా విప్లవాన్ని హత మార్చటానికి వ్యూహం పన్నుతున్నారు. వారికి సహాయకారిగా, అమీరు సర్దారులు విప్లవ ప్రతిఘటనోద్యమానికి సన్నాహాలు చేస్తున్నారు. ప్రజలు మెలకువగా వ్యవహరించి, స్వాతంత్ర్యాన్నీ, విప్లవాన్నీ రక్షించుకోవాలి.” ఫైజుల్లా మాట్లాడుతున్నంతసేపూ కరతాళధ్వనులే! ఉపన్యాసం పూర్తికాగానే క్రొత్త పార్టీలో చేరటానికి వందలూ, వేలూగా ఎగబడి ముందుకు వచ్చారు.

ఇదేసమయానికి ఒక విచిత్ర సంఘటన జరిగింది. బొఖారాలో ప్రధానమైన మాస్కు గోపురంనుండి ఇమాము, మహాసభలోని భక్తులనుద్దేశించి, 'నమాజు' చేయవలసినదిగా సందేశం ఇచ్చాడు. చాల క్లిష్టమైన పరిస్థితి యేర్పడింది. సభికుల్లో అధిక సంఖ్యాకులు ప్రార్థనలో చేరాలని ఆరాటపడుతున్నారు. కాని అది క్రొత్తపార్టీ కార్యక్రమానికీ, లక్ష్యాలకూ అనుగుణమో కాదో అనే సందేహం! ఈ విషమపరీక్షలో నెగ్గటంమీదనే విప్లవభవితవ్యం ఆధారపడియుంటుందనే భావంతో, సభలో మాట్లాడటానికి సభాధ్యక్షుడైన ఫైజుల్లా అనుమతికోరాను. అతడు సభికులకు నన్ను పరిచయం చేశాడు; “ఈమహాసభకూ, విప్లవకార్యాచరణకూ కారకుడై, నాకు అన్నివిధాలా సహాయం చేస్తూఉన్న భారతీయమిత్రుడు మీతో నాల్గుముక్కలు మాట్లాడుతాడు.” నేను లేచి నిలబడ్డాను. ఉపన్యసించే ఉద్దేశ్యంలేదు; ఒక సూచనమాత్రం చేయ నిశ్చయించాను. కాని ఆ సూచనే ప్రళయాన్ని అదుపులోబెట్టి, బొఖారా విప్లవాన్ని కాపాడగలిగింది. నేను మాట్లాడాను: “పీడితప్రజానీకాన్ని ఉద్ధరించటమే విప్లవం ఉద్దేశ్యం; మన విప్లవానికి మతంతో విరోధంలేదు; ఆ సత్యాన్ని ప్రపంచానికి చాటటానికి ఇదే మంచి సమయం. ప్రస్తుతానికి, మీరందరూ ప్రార్థనలో చేరటానికి వీలుగా సమావేశాన్ని ముగిద్దాం.” చివరకు ఒకమాటఅనకుండా ఉండలేకపోయినాను. “కాని మీరంతా నన్ను మాత్రంక్షమించాలి. మీ ప్రార్థనలోనేనుచేరలేను; నేను ముసల్మానును కాదు.”

ప్రజాప్రతినిధిసభ ఎన్నుకోనటంతో (Soviet People's Delegates) మహాసభ కార్యక్రమం పూర్తయింది. ఈ సభకే ప్రభుత్వం బాధ్యత వహిస్తుంది. క్రొత్తరిపబ్లిక్ అధ్యక్షుడుగా ఫైజుల్లా ఎన్నికైనాడు. క్రొత్తప్రభుత్వాన్ని నిర్మించే బాధ్యతఅంతా అతనిదే. ఆ నాటకంలో నాయకపాత్రధారి ఫైజుల్లా.

## నాల్గువందలమంది బీగములకు స్వాతంత్ర్యం

ఎన్వర్‌పాషా దురాశాపూరిత సాహసకృత్యాలూ, దూరాలోచనలేని అమీర్ పలాయనం మినహాయించి, బొఖారా విప్లవం కేవలం రక్తరహిత విప్లవమే. అమీర్ రక్షణకై ఫర్గణా పర్వతప్రాంతాల్లో టర్కొమన్లు తిరుగుబాట్లు జరిపారు; కాని బొఖారా మైదానభూముల్లో ఏ అలజడీ కలగలేదు. నిర్భయంగా రైతులు తమ పొలాల్లో వ్యవసాయం సాగించుకొన్నారు; వర్తకులు నిరాటంకంగా వాణిజ్యం

సాగించి లాభాలు గడించారు; బొఖారా ప్రజల్లో అధికసంఖ్యాకులీ రెండువర్గాలవారే. క్రొత్తప్రభుత్వంకూడా సులభంగానే కుదుటబడి వ్యవహారాలు చక్కబెట్టసాగింది. అందుచే నాకిక బొఖారాలో ఉండవలసిన అవసరంలేదు; కాని మాస్కోకు తిరిగివెళ్ళే లోగా అక్కడ ఒక తమాషా జరిగింది. మధ్యయుగ పరిస్థితుల్లోనున్న ఆ రాజ్యంలో జరిగిన విప్లవంలో కెల్లా తమాషాసంఘటన; సుఖాంతంగా పరిణమించిన విషాదనాటకం!

సాంప్రదాయంప్రకారం నైష్ఠికుడైన ముసల్మాను నల్గురు భార్యలవరకూ చేసికోవచ్చు. కాని అమీరు సాధారణవ్యక్తికాదు; మతాధికారి; ప్రభువు; అందుచే తనకు పెక్కుమంది భార్యలుండటం ధర్మశాస్త్ర విరుద్ధం కాదని వ్యాఖ్యానించుకొన్నాడు; ఆతని అంతఃపురంలో నాల్గువందలమంది రాణులుండేవారు; అమీరు పలాయనంతో వారందరూ అనాథలైనారు. ఇక అంతఃపురంలో వారి ఉనికికి అర్థం లేదుకాని వారిప్పుడెక్కడికి వెళ్ళగలరు? అంతేగాదు. సుఖంగా ఉన్న ఈ శరణాలయాన్ని విడిచివెళ్ళటానికికూడా వారికి యిష్టంలేదు. అందుచే వారంతా క్రొత్త ప్రభుత్వానికొక క్లిష్టసమస్యగా తయారైనారు. విలాస జీవితానికి అలవాటుపడిన వీరందరినీ అంతఃపురంలో పెట్టి పోషించటానికి అపారమైన ధనంకావాలి; ప్రజల ధనాన్ని వీరిపై దుర్వ్యయం చేయుటానికి విప్లవప్రభుత్వం సమ్మతించదు. దిక్కుతోచక ఫైజుల్లా నా సలహాకోరాడు. నాకూ, ఆ సమస్యాపరిష్కారం సులువుగా కన్పించలేదు. "విప్లవం వారందరికీ స్వేచ్ఛ ప్రసాదించినదనీ తమ యిష్టమైనచోటికి వారు వెళ్ళవచ్చుననీ" ప్రకటించవలసినదిగా సూచించాను. బాహ్యప్రపంచం ఎరుగనివారికీ స్వేచ్ఛవలని ప్రయోజనం శూన్యం. ప్రపంచంలో వారికి స్థానంలేదు; అందుచేతనే వారికి బానిసత్వమే సుఖమైంది; ఆ బానిసత్వంనుండి బైటపడటానికి వారు నిరాకరించారు!

ఇక, సాహసోపేతమైన ఉపాయాంతరం అన్వేషింపవలసివచ్చింది. "అమీరు అంతఃపురస్త్రీలు తమ యిష్టానుసారం తిరిగి వివాహం చేసికోవచ్చు"నని ప్రకటింపవలసిందిగా ఫైజుల్లా ప్రభుత్వానికి సూచించాను. వీరందరూ వయసులోనున్నవారనీ, మంచి అందగత్తెలనీ ప్రతీతి. ముఖ్యంగా సైనికులకు ఈ ప్రకటన ఆకర్షణీయంగా ఉంటుందనీ ఆశించాను. "అమీరు అంతఃపురస్త్రీని వివాహమాడి, పౌరజీవితంలో స్థిరపడిన సైనికునకు కొంతభూమీ, ఆ భూమిని సాగుచేసికొనటానికి పెట్టుబడీ ప్రభుత్వం ఈయగలద"నికూడా ప్రకటింపబడింది. ఐనా, బీగములు తమ చెరనుండి విముక్తి పొందటానికి సాహసింపలేకపోయినారు.

ఈ క్లిష్టపరిస్థితినుండి బైటపడటానికి తీవ్రమైన చర్య తప్పనిసరైంది. పై ప్రకటనకు సుముఖులైన సైనికులు అమీరు అంతఃపురంలో ప్రవేశించి తమకు నచ్చిన బీగమును భార్యగా తెచ్చుకోవచ్చునని ప్రభుత్వం ప్రకటించింది; ఐతే, బలప్రయోగం

గానీ, రౌడీచర్యలుగానీ జరపకూడదని శాసించింది. అమీరు అంతఃపుర దోపిడీలో విషాదసంఘటనలేమీ జరుగకుండా జాగ్రత్త వహించారు. అంతా, ప్రభుత్వోద్యోగుల పర్యవేక్షణలో, సవ్యంగా నడిచిపోయింది. బీగములుమాత్రం బెదరినకుందేలు పిల్లలైనారు! కాని, తమప్రేమభిక్షకోసం ప్రాకులాడే యువకజనాన్ని చూచినప్పుడు వారి కొకరకమైన సంతృప్తికలిగింది. దృఢగాత్రుడైన యువకుడు, తన కోర్కె తీర్చమని ప్రాధేయపడటం వారికొక మహత్తరమైన అపూర్వానుభూతి! ముసలి అమీరు వల్ల వారి కామేచ్ఛమాత్రం తీరేదా! ఈ నాటకంలోని చివరిఅంకం చూడముచ్చటైంది! నాటివరకూ పరదాలమాటున క్రుగ్గిన యువతీమణులు, గర్వం, కీని మూర్తీభవించినట్లున్న పురుషపుంగవుల బుజాలపై ఉల్లాసంగా ఊరేగసాగారు. ఈ దోపిడీలో అధికభాగం కాజేసినవారు రష్యన్ సైనికులే!

## ప్రజలిచ్చిన బహుమతి

అమీరు అంతఃపురంఖాళీయైంది; అందులోని విశేషాలను చూడాలనే అభిలాషతో ఫైజుల్లాను వెంటబెట్టుకొని లోపలికి వెళ్ళాను. ఐతే బాహ్య ఆకారానికీ, అంతర్భాగానికీ పోలికే లేదు. ఆ రాజప్రాసాదం బైటికి మట్టికోటగా కన్పించేది; అందలి గదులుమాత్రం, పర్వతసానువుల్లో తొలిచిన గుహలవలె ఉన్నై; ప్రతి గదికీ ఒకటే దర్వాజా; కిటికీలు లేవు; గదినిండా విలువైన సామగ్రి! అందు ప్రధానమైనవి తివాచీలు. బీగములు తమతమ వస్త్రాలనూ, ఆభరణాలనూ తీసికొనివెళ్ళారు; అమీరు మాత్రం తన ఆస్తినంతా తనతో తీసుకువెళ్ళలేకపోయినాడు; పట్టుదుస్తులు కుప్పతిప్పలుగా గోడలపై వ్రేలాడుతున్నై; వానిలో ఒకటిమాత్రం నా దృష్టి నాకర్షించింది. అది చేత్తో నేసిన పట్టుబట్ట; చాల మందంగాఉంది; ఇంద్రధనస్సులోని రంగులన్నీ అందు అమర్చబడినై; ఆరడుగులవ్యక్తికైనా పాదాలవరకూ వస్తుంది. ఆ పట్టుబట్టను ప్రశంసించకుండా ఉండలేకపోయినాను. వెంటనే ఫైజుల్లా దాన్నితీసి నా భుజానికి తగిలించాడు; నేను వారించాను. నన్ను సమాధానపరచటానికి ఫైజుల్లా అన్నాడు: "నిరుపేదల శ్రమతో తయారైన దీ వస్త్రం; నేటికైనా, యోగ్యుడైన యజమానిని పొందే అదృష్టం కలిగించండి. ఇదే మీకు బొఖారా రిపబ్లిక్ సమర్పింపగల బహుమతి; చంద్రునికో నూలుపోగు". ఆ బహుమతిని అంగీకరింపక తప్పలేదు; బైటికి వచ్చాం; ఆ బహుమతి నా భుజంమీదే ఉంది.

ఈ విషాద ప్రహసనాన్ని తిలకించటానికై అమీర్ ప్రసాదం వెలుపల పెద్ద జన సమూహం చేరింది. వారంతా ఆశగా చూస్తున్నారు; బొఖారా ప్రభుత్వ సభ్యులూ, వారి సలహాదారూ, బీగములలో నెల్లా అందమైన వారితో బైటికి వస్తారనీ; వారికి ఆశాభంగంగా, పదచ్యుతుడైన అమీరు దుస్తుల్లో నేను ప్రత్యక్షమైనాను.

నాకిచ్చిన బహుమతికి, ప్రజామోదం పొందటం అవసరమని భావించినట్లున్నాడు ఫైజుల్లా; జన సమూహాన్ని ఉద్దేశించి చిన్న ఉపన్యాస మిచ్చాడు :

"బొఖారా ప్రజల విముక్తికై, అపారమైన సేవచేసిన భారతీయ కామ్రేడుకు, బొఖారా ప్రభుత్వం ఈ పట్టు వస్త్రాన్ని బహూకరిస్తున్నది."

అందుకు సమాధానంగా నేను మాట్లాడవలసి వచ్చింది :

"ఒక మహారాజు ధరించిన అంగరఖాగా దీన్ని నేను గౌరవించటం లేదు; ప్రాచీన సంస్కృతీ, సభ్యతలు గల ఈ దేశ ప్రజల ఆదరాభిమానాలకు చిహ్నంగా మాత్రమే దీన్ని స్వీకరిస్తున్నాను."



# భారత కమ్యూనిస్టుపార్టీకి బీజారోపణ

## భారత విమోచన సైన్య నిర్మాణం

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఉపసంఘానికి (Small Bureau) సమీప దేశాల్లోని విప్లవాత్మక శక్తులతో సంబంధాలేర్పరచుకొనటమే ప్రధాన కర్తవ్యం. అందుకనుగుణంగా ప్రవాసంలో నున్న ముతాలను చేరదీసి, వారి వారి దేశాల్లో విప్లవోద్యమాలను వికసింపజేయుటకు తగిన శిక్షణ నిచ్చి పంపటానికి నిశ్చయించాం. కాని ఈ ముతాలతో గూడా మాకు సూటి సంబంధాలు లేవు. పర్షియా సరిహద్దుల్లో రహస్యంగా పర్యటించి, ప్రచారంద్వారా వీరిని ఆకర్షించాల్సివచ్చింది. ఈ సందర్భంలో భారతీయ వర్తకులతో నా అనుభవాన్ని ముచ్చటిస్తాను.

## వర్తకుల దేశభక్తి?

మధ్య ఆసియాలో చాల కొద్దిమంది భారతీయులే ఉండేవారు; వీరిలో అధిక సంఖ్యాకులు వర్తకులు. విప్లవంతో వారి వృత్తికి ఆటంకమేర్పడింది. ఇంకా సొంత వర్తకం రద్దు కాలేదుగాని ఖొరాసానును బ్రిటిష్ ఇండియా సైన్యాలు ఆక్రమించటంవల్ల పర్షియా, ఆఫ్ఘనిస్థానుల మీదుగా రవాణా సౌకర్యాలు బందైపోయినై. స్వాతంత్ర్యాన్ని పొందిన బొఖారా రాజ్యంలో అధికారుల జులుం ఎక్కువైంది. ఈ కారణాలవల్ల ఇండియా, మధ్యఆసియాల మధ్య వర్తకం క్షీణించింది. నేను టాష్కెంటు వచ్చిన క్రొత్తలో, భారతీయ వర్తక బృందం మొదటే నన్ను కలిసికొని తమ యిక్కట్టులకు పరిష్కారం ఆలోచించ వలసిందిగా కోరారు. బొఖారా ప్రభుత్వం తన ప్రతిఘటన విధానాన్ని మానుకొని, సానుభూతి వహిస్తే గాని మెషెడ్ - క్వెట్టా మార్గంనుండి బ్రిటిష్‌సైన్యాలను మరలించటం సాధ్యంకాదు; బ్రిటిష్‌సైన్యాలు వైదొలగితేగాని వర్తకుల ఇక్కట్టులు గట్టెక్కవు. అందుచే, ఖొరాసాన్‌లోని భారతీయ వర్తకులలో బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం సాగించటానికై, ఈ వర్తకుల సహకారం అర్థించాను. వీరంతా, తాము దేశభక్తులమని చాటుకొంటూ ఉండేవారు! నా కోరికను మన్నించటానికి తమ అశక్తతను వెల్లడిస్తూ బొఖారా వర్తకులను కలుసుకోవలసిందిగా సలహా యిచ్చారు. బొఖారా వర్తకులు ధనవంతులూ మంచి పలుకుబడిగలవారూనట! నాకు సహాయపడగలరట! తమకు మాత్రం వెంటనే ఫర్గణా గుండా ఇండియాకు తిరిగివెళ్ళే సదుపాయం చేయాలట! ఫర్గణా, బొఖారాల్లో

తూర్పు సరిహద్దు జిల్లా; ఇండియాలోని గిల్‌గిట్, చిత్రాల్ ప్రాంతాలు ఫర్గణాకు చాల దగ్గరగా ఉంటాయి; ఈ రెండు ప్రాంతాలను వేరుచేస్తూ ఇరుకైన ఆఫ్ఘన్ ప్రాంతం ఉంది. టర్కీస్థాన్‌లో ముల్లాల ప్రోత్సాహంతో తిరుగుబాట్లు చెలరేగుతూ ఉన్నందున టర్కీస్థాన్ ప్రభుత్వం భారత వర్తక బృందానికి రక్షణ నీయలేదు. అందుచే కొంతకాలం ఓపిక వహించవలసిందిగా వర్తక బృందాన్ని కోరవలసివచ్చింది. ఐతే వారు నా సూచనను మన్నింపలేదు. నగరాలలో, క్రొత్త ప్రభుత్వ మీయగల రక్షణ కంటె, ఎంత అపాయకర మార్గమైనా, తిరోగమనమే మంచిదని వారిభావం; ఇండియాకు బయలు దేరారు.

భారతీయ మిత్రులకు ఇసుమంతైనా కష్టం కలిగించరాదని రష్యన్ల తాపత్రయం; అందుచే సోవియట్ ప్రాంత సరిహద్దుల్లో, ముందు అపాయంలేదనే వార్త వచ్చేవరకూ విశ్రమించి, తరువాత ప్రయాణం సాగించవలసినదంటూ ఏమేమో సలహాలిచ్చారు; భారతీయ వర్తకు లవేమీ పట్టించుకున్నట్లు కన్పించదు. టాష్కెంట్ పరిసరాలను దాటీదాటటంతోనే వారంతా అదృశ్యమైనారు. రకరకాల మారు వేషాలతో చిన్న చిన్న ముఠాలుగా నేర్పడి తూర్పు టర్కీస్థాన్ చేరి, కాష్గర్‌లోని బ్రిటిష్ రాయబారి రక్షణ నర్థించారట! వట్టి విశ్వాసహీనులు! బ్రిటిష్ సహాయాన్ని పొందటానికై ఎన్నో కల్లిబొల్లి కథలు కల్పించి చెప్పారు. ఆ కట్టుకథలు ఆధారంగా "మధ్యఆసియాలో నేర్పడిన క్రొత్త రిపబ్లిక్‌లోని ముస్లిములు నానాహింసలకూ గురియగుచున్నారని" అభూతకల్పనలు చేసి బ్రిటిష్ రహస్య పోలీసు దళం ప్రచారం సాగించింది. టాష్కెంట్‌లోని భారతీయ విప్లవ కేంద్రం కూడా ఆ దుష్ప్రచారానికి గురియైంది.

భారతీయ వర్తకుల ఈ వింత ప్రవర్తనకు కారణం తరువాత తెలిసింది. అది ఎన్వర్‌పాషా గూఢచారులు వీరిలో కల్పించిన ఆశలే! తాను క్రొత్తగా 'ఇస్లాం రాజ్యం' స్థాపిస్తున్నాననీ, టర్కీస్థాన్ నుండి వచ్చి, తన క్రొత్త రాజ్యంలో స్థిరపడి, ఇండియా, మధ్యఆసియాలకు జరుగుచున్న వర్తకాన్నంతా కాశ్మీరు గుండా తన దేశానికి మరలించవలసిందనీ ఎన్వర్‌పాషా భారతీయ వర్తకులను కోరాడట! తన కోరిక మన్నించినచో టర్కీస్థాన్‌లో భారతీయులకు కలిగిన నష్టానికి తాను పరిహారమిస్తానని గూడా వాగ్దానం చేశాడట ఎన్వర్‌పాషా! కాని త్వరలోనే ఇదంతా బూటకమని భారతీయులకు జ్ఞానోదయమై యుంటుంది. ఈ వర్తకుల్లో నూటికి తొంభై వంతులు సింధురాష్ట్ర వాసులైన హిందువులు! వీరినే "షికార్ పూరీ" లంటారు.

బొఖారాలోని భారతీయ వర్తకుల్లో కూడా దేశభక్తికి బదులు నమ్మకద్రోహమే కన్పించింది. భారతదేశ దాస్య విముక్తి సాధ్యమనే విశ్వాసాన్ని వారిలో

కల్గించటానికి ప్రయత్నించి విఫలుడనైనాను. అందువల్ల బొఖారాలోని బ్రిటిష్ మిత్రుల అభిమానం కోల్పోవటానికి వారంగీకరించలేదు. బొఖారాలో రష్యన్ ప్రాబల్యం అంతరించటంతో, ఖొరాసాన్‌లోని బ్రిటిష్ ఇండియా సైన్య రక్షణలో ఇండియాతో వర్తక సంబంధాలు పునరుద్ధరించవచ్చునని వారి ఆశ! బ్రిటిష్‌వారికి నన్ను గురించిన వర్తమానం అందజేయటానికి గూడా వీరు వెనుకాడలేదు. అదీ వారి దేశభక్తి!

## రెడ్ ఆర్మీలోని అంతర్జాతీయ దళం

అష్కాబాద్ మొదలైన సరిహద్దు ప్రాంతాల్లో పర్యటనసాగించిన సందర్భంలో బ్రిటిష్ సైన్యంనుండి వైదొలిగిన భారతీయ సైనికుల ముఠాలను కలుసుకొన్నాను. వారిలో చాల భాగం పఠాన్లు; అనటోలియాకు వెళ్ళి ఖిలాఫత్ కొరకు పోరాడాలనే ఉత్సాహంతో ఉన్నారు. వీరిలో కొందరు బాకూ కాంగ్రెసుకుకూడా హాజరైనారు; బాకూ నుండి ముందుకు సాగటానికై వీరు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. బాధాకరమైన వీరి అనుభూతి,ఇతర ముస్లిం పవిత్రసైనికుల ఉత్సాహాన్ని తగ్గించలేకపోయింది. ఐనా ప్రయత్నించి, పఠాను ముఠాలతో అనేక సంభాషణలు జరిపాను. నాప్రయత్నం కొంతవరకు ఫలించింది. ఖిలాఫత్ సంగతి ఎలాఉన్నా, తమ మాతృదేశ విమోచనమే తమ ప్రధాన కర్తవ్యమనే భావం వారిలో కలగసాగింది.

సరిహద్దుల నుండి టాష్కెంటుకు తిరిగి వచ్చినంతనే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఉపసంఘానికొక సూచనచేశాను. "నేను ఉద్దేశించిన 'విమోచన సైన్యం'లో బ్రిటిష్ ఇండియా సైన్యం నుండి వైదొలిగిన సైనికులను చేర్చవలసినదనీ, రెడ్ ఆర్మీకి అనుబంధంగా ఈ సైన్యం, క్రాస్నోవోడస్క్ నుండి మెర్వ్ వరకూగల ట్రాన్సు కాస్పియన్ రైలు మార్గానికి గస్తీగా ఉంటారనీ, దరిమిలా ఖొరాసాన్‌నుండి బ్రిటిష్ సైన్యాలను పారద్రోలే కార్యక్రమానికీ చర్య నాందివాచకంగా ఉపకరింపగలదనీ" వివరించాను. నా సూచన అంగీకరింపబడినది. భారత విమోచన సైన్యానికి బీజారోపణ జరిగింది! కొన్ని రోజుల తరువాత ఈ భారతీయ సైనికులతో పర్షియన్ విప్లవకారులను, రష్యన్ కమ్యూనిస్టులనూ కలిపి ఒక సైన్యానికి ప్రారంభోత్సవం జరిపాం. వీరితో బొఖారా నుండి తీసుకువచ్చిన 'ముజహిర్' ముఠా చేర్చబడింది. ఈ ముజహిర్లను గురించి క్రింద వివరిస్తాను.

భారత విమోచన సైన్యమే, రెడ్ ఆర్మీకి అనుబంధంగా తయారైన మొదటి అంతర్జాతీయ దళం (International Brigade). ఈ సైన్యంలో ఎక్కువ భాగం పఠాన్లు; సహజంగానే దృఢగాత్రులు; ఎడారి యుద్ధాల్లో మంచి అనుభవంగలవారు; బ్రిటిష్ సైన్యంలో అందుబాటులో నుండని పెద్ద ఆయుధాలు వారికిప్పుడు లభించినై;

వాని నుపయోగించటంలో పఠానులకు శిక్షణ ఈయబడింది. రైఫిళ్ళ నుపయోగించటంలో సమర్థులైనందున మరతుపాకులనూ తదితర అగ్నియంత్రాలనూ ఉపయోగించటం సులభంగానే నేర్చుకొన్నారు. ఈ పఠాన్ దళాలు మెషెడ్-అష్కాబాద్ రోడ్డుపైనున్న బ్రిటిష్ ఇండియా దళాలపై పెక్కుమార్లు దొంగచాటు దాడులు జరిపారు. అచిరకాలంలోనే పర్షియన్ సరిహద్దుల నుండి బ్రిటిష్ దళాలు తిరోగమించినై; ఇక అంతర్జాతీయ దళంలోని పర్షియన్ ముఠాలు మారువేషాలతో తమ దేశంలో ప్రవేశించి, మెషెడ్ దక్షిణంగా నున్న రోడ్డుపై విడిసిన బ్రిటిష్ సైన్యాన్ని వెనుకగా తాకి అపారమైన నష్టాన్ని కలిగించినై.

మొదట్లో, ఇండియన్‌దళాలను రష్యనులే నాయకత్వం వహించి నడిపేవారు. ఈ రష్యన్ సేనానులు, అంతర్యుద్ధకాలంలో గెరిల్లాయుద్ధపద్ధతుల్లో ఆరితేరినవారు. క్రమక్రమంగా రష్యన్లు తప్పుకొని, భారతీయులే అధికార హోదాలు పొందసాగారు. ఈ పరిణామంవల్ల కలిగిన నైతిక ప్రభావంతో భారతీయసైనికులు పునర్జన్మమెత్తినట్లైంది. కేవలం దర్పమే కాక భారతీయుల్లో శౌర్యసామర్థ్యాలుకలవని రుజువుచేశారు. అచిరకాలంలోనే వీరి అనుభవాలు, బ్రిటిష్‌సైన్యంలోని వీరి సోదరుల నాకర్షించినై. క్రమంగా బ్రిటిష్‌సైన్యం నీరసించి 'విమోచన సైన్యం'లో భారతీయుల సంఖ్య పెరగసాగింది. అచిరకాలంలోనే రెడ్ఆర్మీ అంతర్జాతీయదళం బలవత్తరంగా రూపొందింది. దీని ఫలితంగా క్రాస్నోవోడస్క్-మెర్వ్ రైలుమార్గం సురక్షితమై, కాకసస్‌నుండి మధ్యఆసియాకు పెట్రోలు సరఫరా పునరుద్ధరింపబడటమేగాక మెషెడ్‌లోని బ్రిటిష్ సైనికస్థావరానికి ప్రమాదం వాటిల్లింది. నలువైపులనుండి గెరిల్లాదళాలు మెషెడ్‌స్థావరంపై దండయాత్రలు జరిపారు. మరొకవైపున పర్షియన్ విప్లవకారుల ప్రచారంవల్ల పౌరజనంలో విదేశీయులైన బ్రిటిష్‌సైనికులపట్ల ద్వేషం పెరిగిపోయింది. ఎంతధర యిచ్చినా, బ్రిటిష్‌సైన్యాలకు ఆహారసామగ్రి లభించలేదు. క్వెట్టా-మెషెడ్ రోడ్డుపై రవాణాసౌకర్యాలకు గెరిల్లాదళాలు భంగం కలిగించారు. ప్రతిచోటా గెరిల్లాదళాలకు పౌరజన స్వాగతసహకారాలు లభించినై. అందుచే ఒకసంవత్సరం లోపుగానే మెషెడ్‌నుండి బ్రిటిష్‌సైన్యం నిర్గమించింది. పారశీక రాష్ట్రమైన ఖొరాసాన్ బ్రిటిష్‌శృంఖలాలనుండి విముక్తమైంది.

## ముజహిర్ దళం

నేను బొఖారా చేరిన క్రొత్తల్లో, భారతీయ ముజహిర్ ముఠా ఒకటి ఆఫ్ఘనిస్థాన్‌మీదుగా టర్కిస్థాన్‌లో ప్రవేశించిందనీ, వారందర్నీ టర్కొమన్ తిరుగుబాటుదారులు పట్టుకొని ఆక్సస్ నది ఎగువ ప్రాంతాల్లో నిర్బంధించి హింసిస్తున్నారనీ ఒక వార్త తెలిసింది. ఆలోచించగా ఈ వార్త యదార్థమేనని తేలింది; ఐతే ముజహిర్ల సంఖ్యను గురించి మాత్రం తలకొకరకంగా చెప్తున్నారు. కొందరు 200 మంది

అంటే మరికొందరు 5000 దాకా ఉన్నారంటున్నారు; కాబూలు పత్రికల్లోని వార్తలనుబట్టి 30,000 పైగా భారతదేశంనుండి బయలుదేరినట్లు తెలిసింది. "స్వతంత్ర ఇస్లామిక్ రిపబ్లిక్‌లో స్థిరపడే ముస్లిములకు భూమీ, ఇతర సౌకర్యాలూ కల్పిస్తాము" అని ఆఫ్ఘన్ ప్రభుత్వం చేసిన ప్రకటనయే ఈ ముజహిర్లనాకర్షించింది. ఆఫ్ఘన్ ప్రభుత్వం తన వాగ్దానాన్ని నిలుపుకోలేక పోవటంచేత వీరిలో కొందరు టర్కీకి, మరి కొందరు రష్యాకు బయలుదేరినట్లూ వార్తలు వచ్చినై; ఏమైనా వీరి సంఖ్య కనీసం రెండు వేలైనా ఉంటుందని ధృవపరచుకొన్నాను. మా 'విమోచన సైన్యా'నికి ఇదేమంత తక్కువ సంఖ్య కాదు; కాబట్టి ముందు వీరి విమోచన సాధించటానికి నిర్ణయించాను.

ఆక్సస్ ప్రాంతమంతా తురుష్క తిరుగుబాటుదారుల మయం; అందుచే భారతీయ నిర్బంధితుల విముక్తికి ఆ ప్రాంతంపై దండయాత్ర తప్పనిసరి అయింది. అదృష్టవశాత్తూ ఇంకా ఫ్రూన్జీ బొఖారాలోనే ఉన్నాడు. అతనితో సంప్రదించి ఒక ఫిరంగినౌకలో రెడ్ ఆర్మీ దళాన్ని ఆక్సస్ నదిపై పంపించాను. నిర్బంధితుల ప్రాంతాన్ని రెడ్ ఆర్మీ సులభంగానే చేరింది. అచట ముజహిర్ల దురవస్థ వర్ణనాతీతం. వారిని తురుష్కులు మోకులతో కట్టివేశారు; అన్నం ముద్దలు దూరంనుండి విసరి వేస్తున్నారు; ఆ అన్నం సహింపరాని దుర్గంధభూయిష్టం; వారి దుస్తులన్నీ పీలికలై పోయినై; పస్తులతో కొనఊపిరితోనున్న వారిలో అడుగుతీసి అడుగువేసే శక్తికూడా లేదు. బొఖారా చేరగానే భోజన వస్త్ర సదుపాయాలూ, మంచి వసతీ కల్పించే యేర్పాటు చేశాను. కొంచెం స్వస్థత చిక్కిన తరువాత వారి కథ నడిగి తెలిసికొన్నాను. అదొక పెద్ద గాథ!

## ముజహిర్ల గాథ

బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో జరుగుచున్న పోరాటంలో, 1919 లో భారత ఖిలాఫత్ ఉద్యమం, భారత జాతీయ మహాసభతో చేతులు కలిపింది. అంతేగాక, స్వచ్ఛంద సైనికులుగా టర్కీకి వెళ్ళి ముస్తఫా కమాల్ పాషాతో చేరి ఖిలాఫత్ రక్షణకై పోరాడవలసిందిగా ముస్లిములకొక సందేశాన్నికూడా ఇచ్చింది. ఐతే, ఇండియానుండి టర్కీకి అఫ్ఘన్‌స్థాన్‌గుండా ప్రయాణముచేయాలి. కాబట్టి ముజహిర్లకు అఫ్ఘన్ ప్రభుత్వ అనుమతి అవసరమైంది. ఆఫ్ఘన్ ప్రభుత్వం అనుమతి నీయటమే గాక, 'ఖిలాఫత్ రక్షణకై పోరాడిన అనంతరం తమ దేశంలో స్థిరపడిన ముస్లిములకు భూములను పంచియిస్తా'నని ప్రకటించింది. దీనితో భారతీయ ముస్లిములు తండోపతండాలుగా బయలుదేరారు. ఈ 'ముజహిర్ల' యదార్థ సంఖ్య నాటికీ నేటికీ తెలియదు; లక్షకు తక్కువగా, ఏబదివేలకు పైగా ఉండవచ్చు. వీరు అఫ్ఘనిస్థానాన్నేగాక, పర్షియా కూడా దాటాలి. అప్పటికే స్వాతంత్ర్యపోరాటాలు

సాగిస్తున్న ఆసియా ప్రజలకు బోల్షివిక్ రష్యా సహాయంచేస్తుందనే సందేశం ఇండియాకు చేరింది; ఈ సందేశంలోని సత్యాసత్యాలను తేల్చుకొనే ఉద్దేశ్యంతో కొందరు ముజహిర్లు కాబూలులోని రష్యా రాయబారవర్గాన్ని కలుసుకొన్నారు. ఈ చర్య వల్ల ఆఫ్ఘన్ ప్రభుత్వానికి ఆగ్రహం కలిగి ముజహిర్ల స్వేచ్ఛ నరికట్టి, వారందరినీ ఒక బహిరంగ బందిఖానాలో (Concentration Camp) బంధించింది. టర్కీ వెళ్ళటానికి అనుమతి నిరాకరించినా, కనీసం పై ప్రకటనప్రకారం, ఆఫ్ఘనిస్థాన్‌లోనైనా స్థిరపడనిమ్మని ముజహిర్లు ప్రభుత్వాన్ని అభ్యర్థించారు. ప్రభుత్వం ఆ కోరికనుకూడా నిరాకరించింది. ముజహిర్ల ఆశ లడుగంటినై; కాని వారిలో రాటుదేలిన కొందరు సాహసికులు తిరుగుబాటుచేసి రష్యా సరిహద్దులకు పారిపోవ సంకల్పించారు; ఐతే ఇది చాల ప్రమాదాలతో కూడిన నిర్ణయం!

హిందూకుష్ పర్వత శృంగాలమీదుగా, సుమారు 150 మైళ్ళు కాలినడకను ప్రయాణంచేయాలి; ప్రయాణం చివరిదశలో ముజహిర్లు దారితప్పారు. ఐనా, రష్యా సరిహద్దు సమీపంలో ఉన్నదనే నమ్మకంతో, ధైర్యంగా దుర్గమారణ్యాలను గడిచి ఉత్తరంగా పయనించి ఆక్సస్‌నదిని చేరుకున్నారు. ఆక్సస్‌నది ఆఫ్ఘనిస్థాన్, బొఖారా లకు సరిహద్దు. ఆఫ్ఘన్లు నమ్మించి ద్రోహంచేశారు; బొఖారాకూడా ముస్లింరాజ్యమే. ఇక్కడ తారసిల్లిన తురుష్కులుసైతం ముస్లిములే. ఐతేనేం? ఇక్కడ మరొక ఆశాభంగం! మరొక నమ్మకద్రోహం! రష్యాకు దారి చూపిస్తున్నట్లే నటించి, అడవినుండి బైటపడగానే, ముజహిర్లను బంధించారు తురుష్కులు. అదొక భయంకరమైన అనుభవం! ఐనా ముజహిర్లకు మతపిచ్చ వదలలేదు. వారిని రక్షించిన నాపట్ల అణుమాత్రమైనా, వారిలో కృతజ్ఞత కన్పించలేదు!

## ముజహిర్ల మొండిపట్టు

బొఖారాలో క్రొత్తప్రభుత్వం యేర్పడినదనీ, వారిని ఆదరించగలదనీ ముజహిర్లకు నచ్చజెప్పటానికి ప్రయత్నించాను. వారు నా మాటలను పెడచెవినిబెట్టి తక్షణం తమ్ము టర్కీ పంపే యేర్పాట్లు చేయవలసిందని పట్టుబట్టారు. వారిలో కొందరు కొద్దిగా చదువుకున్నవా రున్నారు. వారిని ప్రత్యేకంగా కలుసుకొని నచ్చ జెప్పాను: "మీరు టర్కీలో సాధింపగలదేమీలేదు; ముస్తఫా కమాలుకు సొంత సైన్యం ఉంది; సైనికశిక్షణలేని మీవంటి భారతీయు లతనితో చేరినంతమాత్రాన ఒరిగే దేమీలేదు; మీది కేవలం ఎండమావులవేట! కాబట్టి ఈ ఉద్యమాన్ని విరమించి, మధ్యఆసియాలోనే ఉండి రాజకీయంగా, సైనికంగా తర్బీదుపొంది ఇండియాలో రానున్న విప్లవానికి నాయకత్వం వహించండి!" రాజకీయశిక్షణ అనే భావం మాత్రం వారికేమీ రుచించలేదు. వారందరూ సామ్రాజ్యవాద వ్యతిరేకులే. అంతకుమించి రాజకీయంగా నేర్చుకోవలసిన పాఠాలేమున్నై? ఇక, సైనికశిక్షణపొందతగినదే! అనే

అభిప్రాయాన్ని సూచించారు. ఒక అంశంమీదనైనా మాకు సమాధానం కుదిరినందుకు సంతోషించి టాష్కెంట్‌లో సైనికశిక్షకు యేర్పాట్లు చేస్తానని వాగ్దానంచేశాను. ఈ ముజహిర్ బృందంలో ఉన్నవారంతా డెబ్బదిమంది; వారిలో ఏబదిమంది టాష్కెంట్‌కు రావటానికి సమ్మతించారు; వీరూ అంతంతమాత్రంగా చదువుకొన్నవారే! మిగిలినవారందరూ నిరక్షరాస్యులే; పల్లెరైతులూ, లేక పట్టణాల్లోని తిరుగుబోతులూ! ఆఫ్ఘన్‌ప్రభుత్వ ప్రకటనను నమ్మి బయలుదేరినరకం! మరికొందరు 'పవిత్ర యుద్ధం' (Jeahad) లో ప్రాణాలర్పించి స్వర్గం పొందుదామనే ఆశతో వచ్చినవారు. ఏమైనా వారిలో మత దురభిమానం అంతా, ఇంతా కాదు; వారితో వాదించి ప్రయోజనము లేదు; అందుచే వారిని బాకూ పంపివేశాను; అక్కడినుండి అనటోలియా ప్రయాణానికి యేర్పాట్లు జరిగినై; మిగిలినవారితో టాష్కెంట్ బయలుదేరాను.

## డాక్టర్ X

టాష్కెంట్ వచ్చిన భారతీయ ముజహిర్లలో ఒక హిందూ యువకుడుండటం ఆశ్చర్యమైన విషయం. అతణ్ణి ముస్లిములు అనుమానంతో చూచేవారు; వారి మత దురహంకారాని కాతడు బలికాకపోవటం మరింత ఆశ్చర్యకరం. ఐతే, అతని పిచ్చ ఆకారమూ, శాంత స్వభావమూ అతణ్ణి రక్షించి ఉంటై. బాగా చదువుకున్నవాడు. బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో M. A. పట్టా పుచ్చుకున్నాడు. అతని పేరు గుర్తులేదు; డాక్టరు X అని మాత్రం పిలుస్తూ ఉండేవారు. అతడు ముజహిర్లతో చేరిన కారణం గ్రహించటానికి ఎంతగానో ప్రయత్నించాను. లాభం లేకపోయింది; దేనికీ సరియైన సమాధానం చెప్పేవాడు కాదు. సైనిక శిక్షణ అంటే నచ్చకపోయినా, బొఖారా నుండి నా వెంట టాష్కెంటుకు రావటానికి చాలా ఆరాట పడ్డాడు. చివరకు తన లక్ష్యాన్ని గురించి క్లుప్తంగా చెప్పాడు: "సుప్రసిద్ధ హిందూ నాయకుల నుండి లెనిన్‌కు ఒక సందేశాన్ని తీసుకొనిపోతున్నాను. సాధ్యమైనంత త్వరలో మాస్కో వెళ్ళాలి. స్వయంగా లెనిన్‌కే అందజేయాలి."

"నీ సందేశ స్వభావం తెలియనిదే మాస్కో పంపే యేర్పాటు జరగదు" అని స్పష్టం చేశాను.

"ఆ అవకాశం లభించేవరకూ టాష్కెంట్‌లోనే ఉంటాను" అని తన దురదృష్టంతో రాజీపడే ధోరణి ప్రదర్శించాడు.

రోజు రోజుకూ డాక్టరు X ప్రమాదకరంగా పరిణమించాడు; ఒక రోజున, మాస్కోకు పాదయాత్ర ప్రారంభిస్తానని బెదరించాడు. అతనికి దోవ తెలియదు; రైలు పట్టాల వెంబడి ప్రయాణం సాగిస్తాడట! చిత్తచాంచల్యం కలిగిందా అనే అనుమానం వచ్చింది; ఏమైనా లాభంలేదని డాక్టరు X ను మాస్కో పంపే ఏర్పాటుచేశాను.

అక్కడ ఏమి జరిగినా నా బాధ్యత లేదని కూడా వివరించాను. డాక్టరు X మాస్కో చేరాడు; అతిథి గృహాలలో ఒక గదిలో విడిది యేర్పాటు చేశారట; తరువాత అతని దిక్కూ మొక్కూ ఆలోచించినవారే లేరు. మధ్యఆసియా నుండి నేను మాస్కోకు తిరిగి వెళ్ళినప్పు డింకా మాస్కోలోనే ఉన్నాడు. తన సంగతి ఆలోచించలే దంటూ లెనిన్‌ను నిందించాడు. రష్యన్ల చిత్తశుద్ధిలో ఆతనికి నమ్మకం నశించింది. అతని సందేశాన్ని గురించి తిరిగి ప్రశ్నించాను. బాగా విసిగిపోవటంవల్ల కాబోలు తన రహస్యాన్ని చెప్పాడు: "ఇండియాలో సాయుధ విప్లవానికి సైనిక సహాయం కోరుతూ, ప్రముఖ భారతీయ విప్లవకారులు నన్ను మాస్కో పంపారు." నమ్మశక్యం గాని ఈ మాటలతో డాక్టరు X చిత్తచాంచల్యం రూఢిపడింది. అతడు చెప్పిన నాయకుని నే నెరుగుదును; అంత సుప్రసిద్ధుడూ కాదు; అతనికి సాయుధ విప్లవంలో విశ్వాసమూ లేదు. అందుచే డాక్టరు X రహస్యాన్ని బైటికి పొక్కనీయలేదు. నేనూ, అతనికి సహాయం చేయలేకపోయినాను. తరువాత ఒక రోజున డాక్టరు X శవం టర్కీస్థాన్ సమీపంలో రైలు పట్టాల ప్రక్క దొరికినట్లు వార్త వచ్చింది. పాపం! నిరాశతో ఆత్మహత్య చేసికొని ఉంటాడు. నాటి అసంఖ్యాక విషాదగాథల్లో ఇదొకటి!

## ముజహిర్ల విడిది

టాష్కెంట్‌లో భారతీయ ముజహిర్లకు నివాసానికీ, భోజనానికీ సదుపాయాలు కల్పించటం కష్టసాధ్యమైంది. టర్కీస్థాన్ రిపబ్లిక్ రాజధాని ఐనప్పటికీ టాష్కెంట్‌లో క్షామపరిస్థితులు తాండవిస్తున్నై; ప్రతివస్తువుకూ కొరతగానే ఉంది. అన్నిటికంటె ప్రధానమైనది గృహసమస్య. మాకు ఏబదిమందికి సరిపడే భవనం కావాలి. భారతీయ కామ్రేడ్ల రాకను గురించిన వర్తమానం అందినంతనే, టర్కీస్థాన్ ప్రభుత్వ సహాయంతో టర్కుబ్యూరో ఒక యింటిని సంపాదించింది. నగరంలో క్రొత్తగా కట్టిన పేటల్లో అంత పెద్ద యిల్లు లేనేలేదు; ఇది ప్రాత, క్రొత్త నగరాలకు మధ్యగా ఉంది. ఒకే అంతస్తుగల భవనం; గదులు చాలా ఉన్నై. అప్పటి కింకా శీతాకాలం వెళ్ళిపోలేదు; బొఖారాలోనే భారత కామ్రేడులకు వెచ్చని ఉన్ని దుస్తులు, రెడ్ ఆర్మీ యూనిఫారాలు యిచ్చాం. ఉదారగుంలో పొడవైన ఆకోటు చలికి మంచి కాపుదల! ఐనా, ఇంట్లో చలి తగలకుండా ఒక నెల రోజుల వరకూ ఏర్పాట్లు చేయాలి. అందుకు వంటచెరకు అవసరం. టాష్కెంటులో వంటచెరకు అపురూపవస్తువు! ప్రభుత్వంనుండి ప్రత్యేకమైన పర్మిట్ సంపాదించాలి. ఆ పర్మిట్ ఇవ్వటానికి, 'సరఫరాల మంత్రి'కి మాత్రమే అధికారం ఉంది. సోవియట్ అధిష్ఠానవర్గంలో తరువాత చాల సుప్రసిద్ధుడైన లాజార్ కగనోవిచ్, నా డచ్చట సరఫరాల మంత్రిగా ఉన్నాడు. కగనోవిచ్‌ని స్వయంగా చూస్తే సులభంగా పర్మిట్ పొందవచ్చునని ఆలోచించాను. కాని నా దుబాసీ - కార్యదర్శి నన్ను వారించాడు.

ఈతడొక రష్యా యూదు జాతీయుడు; అమెరికాలో చాల రోజు లున్నవాడు. ఉద్యోగరీత్యా సరఫరాలమంత్రికంటె ఉన్నతాధికారినైన నేను స్వయంగా కగనోవిచ్ చెంతకు వెళ్ళటం భావ్యం కాదనీ, నేను ఒక జాబు వ్రాస్తే సరిపోతుందనీ, ఆ జాబును తానే కగనోవిచ్‌కి అంద చేయగలననీ చెప్పాడు. రష్యన్‌లో జాబును తయారు చేయ మన్నాను. కన్నీటితో వ్రాశాడా అనిపించేటట్లు భారత కామ్రేడ్ల విషాద గాథను గురించి ఒక 'భారతం' తయారు చేశాడు; వెంటనే వంటచెరకు పంపనిచో వారంతా గడ్డగట్టుకు పోవటం తథ్యం అంటూ వివరించాడు.

"ఇదంతా అవసరమా!" అని అడిగాను.

"తప్పకుండా. మంత్రికి వేడి కలిగించాలంటే కొంత ఆందోళన అవసరం" అన్నాడు.

యథాతథంగానే ఉత్తరాన్ని పట్టుకువెళ్ళి, రెండు గంటలకల్లా విజయ వంతంగా తిరిగి వచ్చాడు నా కార్యదర్శి. వంటచెరకేగాక భారత కామ్రేడ్లకు తలకొక జత 'వాల్నికీ' కూడా మంజూరైనై. వాల్నికీ అంటే శీతాకాలంలో రష్యన్లు ధరించే పొడవైన ఫెల్టు బూట్లు. "ఈ భారత కామ్రేడ్ల కవసరమైన సౌకర్యాలన్నీ కల్పిస్తాననీ, వాటిని గురించి ఫోనుమీద కబురంపితే చాలుననీ" కబురంపాడు కగనోవిచ్.

రెండు లారీల కట్టెలు వచ్చినై; భవనంలోని పింగాణి కుంపట్లన్నీ వెలిగినై; ఇక గదులను గురించీ, చిల్లర విషయాలను గురించీ కీచులాట ప్రారంభమైంది. ఈ ప్రమాదాన్ని ఊహించే, ముజహిర్ బృందంలోని వారితో నొక చిన్న సంఘాన్ని నియమించి వారే గదుల పంపిణీ, ఆహార పదార్థాల సరఫరా మొదలైన విషయాల అజమాయిషీ చేయాలని సూచించాను. విద్యావంతులైన ముగ్గురు ముజహిర్ యువకులతో గృహవసతి సంఘం యేర్పడింది. వృద్ధులకూ, అస్వస్థులకూ, మంచి గదులను ఏర్పాటు చేయటం అవసరమని వారూ సమ్మతించారు. మంచాలు కూడా వృద్ధులకే కేటాయింపబడినై; మిగిలినవారు తివాచీలతో తృప్తిపడ్డారు. ఖిలాఫత్ ఉద్యమంలో వయోవృద్ధులు చాలమంది ఉన్నారు. హిమావృతములైన హిందూకుష్ శిఖరాలపై ప్రయాణంలో వీరు బ్రతికి బయట పడటం నిజంగా అద్భుతమైన విషయమే.

భోజన సదుపాయాలు కూడా తృప్తికరంగానే జరిగినై; పార్టీ సభ్యులకు గానీ, ఉన్నత ప్రభుత్వోద్యోగులకు గానీ లభించే భోజన పదార్థాల కేమాత్రం తీసి పోనివే ముజహిర్లకు సరఫరా చేశారు. ఉదయం 'ఫిలాఫ్'; సాయంత్రం 'లెపి యోష్కా'తో బాటు మాంసంతో తయారైన 'షష్లిక్' (or Shik Kabah) ఇచ్చే వారు. లెపియోష్కా అంటే రొట్టె; దీన్నే ఉత్తర ఇండియాలో 'నాన్' (Nan) అంటారు. ఉదయమూ, సాయంత్రమూ ఎండుద్రాక్షతో ఆపుల్ టీ; భారతీయ

అతిథి మర్యాదలతో పోల్చితే, ఇది మంచి భోజన మనలేముగాని, నాడక్కడున్న పరిస్థితులను బట్టి అది గొప్ప విందు భోజనమే! స్వదేశంలో ఈ ముజహిర్ల కీ మాత్రం భోజనమైనా దొరికేదనటం అనుమానం. ఐనా రెండు మూడు రోజులు గడవక ముందే గొణుగుడు ప్రారంభించారు. మాపై దయతలచి మా ఆతిథ్యాన్ని అంగీకరించారట! ఈ నేరారోపణలన్నీ నాదాకా రాకుండానే గృహవసతి సంఘం సర్దిపుచ్చారు. విద్యావంతుల్లో పది మందిదాకా నాతో పూర్తిగా సహకరించారు.

## రా జ కీ య శి క్ష ణ

ఈ ఏర్పాట్లన్నీ జరిగిన తరువాత ముజహిర్ల సైనిక శిక్షణకై ప్రయత్నం ప్రారంభించాను. టాష్కెంటులో కొన్ని రోజులు కాలక్షేపం చేస్తే, ధనంతో, ఆయుధాలతో, బ్రిటిష్‌వారి పైకి పంపుతారనే ఆశతోనే వారందరూ టాష్కెంట్ వచ్చారు. కాని వారి సైనిక శిక్షణ మాకొక పెద్ద సమస్య అయింది. ముజహిర్లలో సమర్థతను బట్టి వారి వారి కీయగల శిక్షణ స్వభావాన్ని నిర్ణయించాలి. తుపాకులు గానీ, అంతకంటె క్లిష్టమైన ఆయుధాలు గానీ ప్రయోగించే శిక్షణ నీయటమూ, ఆయుధాల నీయటమూ కష్టంగాదు. కాని ఈ తుపాకులను ఏ ఆశయంతో ఎవరిపై ప్రయోగిస్తారు? అనేదే జటిల సమస్య.

ఖిలాఫత్ కొరకు పోరాడే నిమిత్తమై వీరందరూ ఇండియా నుండి బయలుదేరారు. వీరిలో మూడు వంతులు జాతీయవాదులు కూడా కాదు; కేవలం బ్రిటిష్ వ్యతిరేకులు మాత్రమే. ఇండియా నుండి ఆంగ్లేయులు వైదొలిగిన తరువాత జరిగే పరిణామాలేమో ఎవరికీ తెలియదు. అందుచే, ఆయుధాలిచ్చే ముందు, వీరిలో ప్రాథమికమైన రాజకీయ పరిజ్ఞానం కలిగించటం అవసరం. వీరందర్నీ కమ్యూనిస్టులుగా మార్చటం నా లక్ష్యం కాదు; వారిలో కనీసమైన రాజకీయ చైతన్యాన్ని ప్రబోధించటమే నా ఉద్దేశ్యం. "ఖిలాఫత్ జిందాబాద్" నినాదానికి బదులు, "ఇన్‌క్విలాబ్ జిందాబాద్" అని వీరిచే కేకలు వేయించటం సులభమే! కాని వీరికి విప్లవాన్ని గురించిన పరిజ్ఞానం కలిగించి, విశ్వాసపాత్రులైన విప్లవ యోధులుగా తయారు చేయాలి. అప్పటికి జాతీయ ప్రజాస్వామ్య విప్లవమనే కలలు కంటున్నాం; జాతీయ భావమేలేనిది, ప్రజాస్వామ్యాన్ని గురించి ఊహించటం వెర్రితనం!

ఈ సాధక బాధకాలన్నీ ముజహిర్లలోని విద్యావంతులతో చర్చించి, సైనిక శిక్షణాకేంద్రాన్ని ప్రారంభించటానికి పూర్వం భారతీయ విప్లవ యోధులకు రాజకీయ శిక్షణ ఆవశ్యకతను గురించి వారిని సమ్మతింప జేసేసరికి తల ప్రాణం తోకకు వచ్చింది. ఆయుధాలను సంపాదించటం సులభమే. వాస్తవానికి, అపారమైన ఆయుధ సామగ్రితోనే నేను టాష్కెంట్ వచ్చాను; టాష్కెంట్ నుండి ఇండియాకా ఆయుధాలను పంపే మార్గం లేకపోయింది. భారతీయ ముజహిర్లు కమ్యూనిజాన్ని స్వీకరించాలని

నా ఉద్దేశ్యం కాదు. వారికి ఆయుధాలు కావాలి; కాని ఆ ఆయుధాలను మాపైనే, అంటే కమ్యూనిస్టులపైనే ప్రయోగింపరనే విశ్వాసం కలగాలి!

అందుచే, విద్యావంతులైన ముజహిర్లను వేరుపరచి, వారికి రాజకీయ శిక్షణ ప్రారంభించాను. వీరిలో కొందరి ప్రవర్తన చాల సంతృప్తికర మనిపించింది; కాని కొందరిలో మతదురహంకారం, విద్యావిహీనులను కూడా మించి పోవటం ఆశ్చర్యకరం. మరీ విచిత్ర మేమంటే వీరిలో ఒకరు గాఢవిశ్వాసం గల కమ్యూనిస్టుగా మారిపోయి నాడు. అత డిప్పటికీ పాకిస్థాన్‌లో ఎక్కడో ఉంటున్నట్లు తెలుస్తుంది *. కాని యిప్పు డాతడు కమ్యూనిస్టుపార్టీలో లేడు. బహుశా పార్టీ బహిష్కరించి ఉంటుంది. అతనిదీ ఒక విషాదగాథే! ఏ విషయాన్ని నమ్మేవాడు కాదు; మతంలో మాత్రం మూఢమైన విశ్వాసం కలవాడు! ఈతనికంటె వయస్సులో కొంచెం పెద్ద వాడొకడు వుండేవాడు; ఖిలాఫత్ ఉద్యమ నాయకుడైన మహమ్మద్ ఆలీతో కలిసి పనిచేశాడట; అందుచే, ముజహిర్లంతా అతడంటే ఎంతో భక్తి శ్రద్ధలు వహించేవారు; అతడు ఆడించిన విధంగా ఆడేవారు. మమ్మల్ని యితడు పెట్టిన బాధ అంతా ఇంతా కాదు. నేటికీ ఇతడు సజీవుడే; పాకిస్థాన్ ప్రభుత్వంలో ఉన్నత పదవిలో ఉన్నాడు!

విద్యావంతులతో సన్నిహితంగా నుండటం వృద్ధ దురహంకారులలో అసూయా ద్వేషాలకు కారణమైంది. వీరి వైమనస్యాన్ని అవకాశంగా తీసికొని, యువకుల్ని కమ్యూనిస్టులుగా మార్చటానికి ప్రయత్నిస్తున్నానని పై యువకు లిద్దరూ నాపై దుష్ప్రచారం ప్రారంభించారు. వారిలో కొందరు కమ్యూనిస్టులైన మాట వాస్తవమే! ముజహిర్లలో పెద్ద ఆందోళన ప్రారంభమైంది. దీనికి నాయకు డెవరో సులభంగా బైట పడలేదు; ఒక రోజున పతాక సన్నివేశం జరిగింది: "గొర్రెలను తమ సమక్షంలోనే వధించి, తమ కిచ్చే మాంసం తయారు చేయాలని" పట్టుబట్టారు ముజహిర్లు. ముస్లిములకు నిషిద్ధమైన మాంసాన్ని తమకు పంపుతున్నామని వారి అను మానం. ఇది అర్థంలేని అనుమానం. నాడు టర్కీస్థాన్‌లో పందులు దొరికేవి కాదు. ఎంత చెప్పినా ముజహిర్ దురహంకారులు వినే పద్ధతిలో లేరు. నచ్చజెప్పటానికి ప్రయత్నించిన 'గృహ వసతి సంఘ' సభ్యులను 'కాఫర్లు' అంటూ తూలనాడి, వారిని బలవంతంగా బైటికి గెంటివేస్తామని బెదరించారు. పరిస్థితి ప్రమాదకరంగా పరిణ మించింది మత దురహంకారులనే బైటికి పంపి వేద్దామని ఆలోచించాను; దానివల్ల కలిగే ప్రయోజనం లేదు. అదీగాక భారత కామ్రేడ్లపట్ల రష్యన్ల కొక ప్రత్యేక దురభిమానం! తొందర పడవద్దని సలహా లిస్తూ ఉండేవారు. "టర్కీస్థాన్ రిపబ్లిక్ అధ్యక్షుడు ముసల్మాన్; అతడు ముజహిర్ల విడిదిని సందర్శించి, వారిని సమాధాన పరచ వచ్చు"నని రష్యన్లు మరొక సూచన చేశారు. ఆ సూచన ప్రకారం టర్కీ

* ఇది వ్రాయబడింది 1954 మే నెలలో.

స్థాన్ అధ్యక్షుని ఆహ్వానించాను. అతడు కూడా యువకుడే; యూరోపియన్ దుస్తులు ధరించేవాడు; గడ్డం కూడా లేదు! ఐనా, అతడు ముజహిర్లతో మాట్లాడిన తరువాత పరిస్థితి కొంత మెరుగైంది. ఎలాగైనా, అధ్యక్షుడంటే ప్రభుత్వాధినేతగదా!

ముజహిర్లతో నేను పడుతున్న బాధను గ్రహించి, టర్కిస్థాన్ అధ్యక్షుడు నా పట్ల సానుభూతి వహించాడు; ముజహిర్లవల్ల జరిగే ప్రయోజనం కూడా లేదని అతనికి అర్థమైంది. అందుచే ఆత డొక సూచన చేశాడు: "ముజహిర్ విద్యావంతులలో పనికివచ్చే వారిని మినహాయించి, మిగిలిన వారందర్నీ బైటికి పంపి వేద్దాం; వారి పొట్ట వారు పోసుకోవాలి; కమ్యూనిస్టు రాజ్యం పనిచేయనిదే భోజనం లేదనే సూత్రంమీద యేర్పడినదిగదా! కష్టపడటానికి సమ్మతించిన వారికి పని చూపిస్తాను" అన్నాడు. అధ్యక్షుని సూచన ఎవ్వరికీ సమ్మతం కాలేదు; పైగా, ఆ సూచనను చాల గోప్యంగా ఉంచవలసివచ్చింది!

## భారత కమ్యూనిస్టుపార్టీ అవతరణ

ఇద్దరు కుట్రదారులనూ మినహాయించి, మిగిలిన యువకులకు రాజకీయశిక్షణ ప్రారంభించాను. ఇతరులకు బైట తిరగటానికి అనుమతి యీయబడింది. కాని ఇదీ చాల ప్రమాదకరమైన చర్యయే. టాష్కెంటులో కూడా విరోధి గూఢచారులున్నారు; మా పట్ల అసంతృప్తులైన ముజహిర్లకు డబ్బు ఆశచూపి తమకు అనుకూలంగా త్రిప్పవచ్చు. అచిరకాలంలోనే ఈ సంగతి రుజువై ముజహిర్లలో శత్రువుల ఏజంట్లు పట్టు బడ్డారు. నాడు రష్యాలో శత్రు ప్రతినిధుల కిచ్చే శిక్షనే వీరికీ విధించాలి; కాని రష్యన్లు భారత కామ్రేడ్లపై ఈగను కూడా వ్రాలనీయరు. ఇది నాకొక పరీక్షగా తయారైంది.

రాజకీయ శిక్షణ కార్యక్రమంలో నేనూహించిన దానికంటె ఎక్కువ సత్ఫలితాలే కలిగినై; ఇస్లాములో తమకున్న గాఢఅభిమానాన్ని వీరు కమ్యూనిజం వైపు మరలించారు; కమ్యూనిజాన్ని గురించి నేను వారితో ప్రస్తావించనే లేదు; సాంఘికంగా విప్లవ ప్రాముఖ్యాన్ని మాత్రం వివరించటం తప్పనిసరైంది: "ఇండియా నుండి బ్రిటిషు వారిని తరిమి వేయటంతోనే ఇండియాలో విప్లవం జరగదు; అందువల్ల విదేశ దోపిడీదారులస్థానంలో స్థానిక దోపిడీదార్లు తయారౌతారు; ప్రస్తుత ఆర్థిక దుస్థితినుండి భారత ప్రజానీకాన్ని ఉద్ధరించ గలిగినప్పుడే విప్లవం సార్థకమాతుంది." అని వివరించాను. స్వభావాన్నిబట్టి, నా వలెనే వీరుకూడా ఆదర్శవాదులు. అందుచే "ప్రజానీక విమోచనం సాధించి వారిని ఉద్ధరించే విప్లవం కమ్యూనిస్టు విప్లవంకాక తప్పదు" అనే నా అభిప్రాయంతో వారంతా ఏకీభవించారు. కొందరు కమ్యూనిస్టు పార్టీలో తమ్ము చేర్చుకోవలసిందిగా నన్ను అభ్యర్థించటం నాకు ఆశ్చర్యమైంది. మరి కొందరు తక్షణం భారతకమ్యూనిస్టుపార్టీని ఇక్కడే ఎందుకు స్థాపింప కూడదు? అని

ప్రశ్నించారు. వారి ఉత్సాహమూ, ఉద్రేకమూ సహజమైనవే! వారిలో కొందరికి స్వప్రయోజన దృష్టికూడా లేకపోలేదు; ఐనా వారిని నిరుత్సాహ పరచటం అనుచిత మని భావించాను.

## అబ్దుల్ - ఆచార్య ముఠా

ఉన్నట్లుండి, కాబూలునుండి మరొక ముఠా వచ్చి చేరటంతో వీరి సంఖ్యా బలం పెరిగింది. క్రొత్త ముఠా, కాబూలులోనే తాము కమ్యూనిస్టుల మని చెప్పు కొనేవారట. వీరి నాయకులు ఇద్దరు : ఒకరు అబ్దుల్ రబ్; పూజారి వర్గీయుడు; అప్పటికే గడ్డం కొద్దిగా నెరుస్తున్నది. రెండవవాడు దాక్షిణాత్య హిందూ యువకుడు; పేరు ఆచార్య; వీరికి గూడా కాందిశీకుల గృహంలోనే విడిది యేర్పాట్లు జరిగినై; కమ్యూనిస్టులమని చెప్పుకొనటం వల్ల వీరికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలు లభించినై. వీరి రాకను వ్యక్తిగతంగా నేను కొంత సంతోషించాను; నాకు అండగా నుండి, నా బాధల్లో సహాయం చేయగలరని ఆశించాను. కాని అచిరకాలంలోనే ఆశాభంగం కలిగింది; అబ్దుల్ రబ్ కేవలం దగాకోరు; ఆచార్య అరాజకవాది. ఐనా రాజకీయ శిక్షణ పొందుతున్న ముజహిర్ వర్గాన్ని వీరిద్దరూ బాగా ఆకర్షించి వారిలో రగులు చున్న కమ్యూనిస్టు దురభిమానాన్ని ప్రజ్వలింపజేశారు.

దీనితో క్రొత్త క్లిష్ట పరిస్థితి యేర్పడింది. కాందిశీక గృహంలో బహిరం గంగా కమ్యూనిజాన్ని గురించిన చర్చలూ, వాదోపవాదాలూ ప్రారంభమైనై; వీరి నూతనోత్సాహం, తమ పాత పిచ్చ జీవిత విధానాన్నీ, దాన్ని ఇంకా ఆరాధిస్తున్న తమ మిత్రులనూ అవహేళన చేసేవరకూ వెళ్ళింది. ఈ వాదోపవాదాలు ముష్టియుద్ధా లకూ గూడా దారి తీసినై. అందుచే కాందిశీక గృహంలో శాంతి భద్రతలనూ, అల్ప సంఖ్యాక వర్గాన్నీ రక్షించటానికి సాయుధ రక్షకభటులను నియమింపవలసి వచ్చింది! భారత కమ్యూనిస్టుపార్టీని స్థాపించాలన్న వారిని ఆచార్య-అబ్దుల్ ముఠా బలపరచింది. క్రొత్తముఠా ప్రోత్సాహంతో వీరు, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కి బ్యూరోకు, తమ సూచనలతో ఒక ప్రతినిధి వర్గాన్ని పంపారు. "ఇంత తొందర అవసరంలేదనీ, కొందరు కాందిశీకులు కలిసి భారత కమ్యూనిస్టు పార్టీ అని వ్యవహరించుకొనటం వల్ల ఫలితం శూన్యమనీ, ఇండియాకు తిరిగి వెళ్ళేవరకూ వేచియుండమనీ" వారితో చెప్పారు; వారికి ఆశాభంగం కలిగింది; వారి ఉత్సాహం నశిస్తుందేమోనని నాకూ భయం కలిగింది; ముజహిర్ కాందిశీకుల నడుమలో నుంచటానికి వీరి సాయం నాకవ సరం; అందుచే చివరకు వారి సూచనలను అంగీకరింపక తప్పలేదు; వీరు స్థాపించిన కమ్యూనిస్టు పార్టీ నామ మాత్రమే ఐనా, భావి భారత కమ్యూనిస్టు పార్టీకి బీజ ప్రాయమైంది. మహమ్మద్ షఫీక్ పార్టీ కార్యదర్శిగా ఎన్నికైనాడు; షఫీక్ గూడా ఆచార్య ముఠాతో కాబూలు నుండి వచ్చినవాడే; యువకుడు; బాగా చదువు కొన్నవాడు.

## పార్టీ కార్యక్రమం

పార్టీ స్థాపింపబడింది; కాని ఈ పార్టీ కార్యక్రమం? కమ్యూనిస్టు పార్టీ అనేది ప్రజానీకంలో కలిసి పనిచేయాలి. ఇండియా దూరంగా ఉంది. ఇండియా ప్రజానీకాన్ని ఈ పార్టీ ఏ విధంగా కలుసుకోనగలదు? ఐతే, ముజహిర్ కాందిశీకులే భారత ప్రజానీకం ప్రతినిధులని సూచించాను. ఇండియాకు తిరిగి వెళ్ళినంతనే, ఈ నవ కమ్యూనిస్టులు, భారత ప్రజానీకంతో వ్యవహరించాలి. భారతీయులు అజ్ఞానంతో, రాజకీయ చైతన్యంలేక మూర్ఖంగా ఉన్నారు; వారిలో మత పిచ్చి ఎక్కువ. కాబట్టి ముజహిర్లను మరమ్మతు చేయటంలో నవకమ్యూనిస్టులకు, తమ భావి కార్యాచరణలో మంచి శిక్షణ లభిస్తుంది. అందుచే సైనిక శిక్షణ కేంద్రంలో చేరటానికి పూర్వం, కాందిశీకు లందరూ రాజకీయ పాఠశాలకు హాజరయ్యేటట్లు వీరు ప్రయత్నించాలి; అందుకు కృషి చేస్తామని కమ్యూనిస్టులు హామీ ఇచ్చారు. వారే ముజహిర్లకు పాఠాలు కూడా చెప్పాలి. సఫీక్‌తో బాటు, షౌకత్ ఉస్మానీ, అబ్దుల్లా సఫ్‌దార్లు కూడా మంచి సమర్థతతో కృషిచేశారు. ఉస్మానీ స్ఫురద్రూపి; ఏదో భారతీయ విశ్వవిద్యాలయంలో పట్టా పుచ్చుకున్నాడు; కాని మూఢ విశ్వాసం ఎక్కువ; చివరివరకూ తన పట్టుదలను విడిచినవాడు కాదు; ఆదర్శ ముసల్మాన్ అని కాందిశీకు లతణ్ణి గౌరవించేవారు; అతని ఉపన్యాసాలకు శ్రద్ధగా హాజరయ్యేవారు. కొన్ని సంవత్సరాల తరువాత, ఉస్మానీ ఇండియాకు మరలి, కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖ సభ్యుడైనాడు. మీరట్ కుట్రకేసులో అతడు కూడా ఒక ముద్దాయి. ఇక, అబ్దుల్లా సఫ్‌దార్, పరిహద్దుల్లోని ఇంగ్లీషు సైనికోద్యోగులకు ఉర్దూబోధిస్తూ ఉండేవాడు; అతనికి మాత్రం ఇంగ్లీషు రాదు; వృత్తి రీత్యా ఉపాధ్యాయుడై నందున ఉపన్యాసాలీయటంలో బాగా రాణించాడు. సఫ్‌దార్ మాస్కో వెళ్ళి ప్రాచ్య శ్రామికుల కమ్యూనిస్టు యూనివర్శిటీలో పట్టభద్రుడైనాడు; తరువాత ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రొఫెసర్సులో మార్కిసిస్టు సిద్ధాంతంలో ఉన్నత విద్యాభ్యాసం సాగించాడు; భారతదేశం తిరిగి వచ్చి చాల కాలం రహస్యంగా (Under ground) గడిపాడు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభంకాగానే ఇండియా నుండి రష్యాకు బయలు దేరాడు; తరువాత ఆతని సంగతి తెలియటం లేదు.

కాందిశీకుల కేర్పాటుచేసిన రాజకీయ ఉపన్యాసాలలో, "వారు వెంటనే ఇండియాకు మరలి మాతృదేశ విముక్తికి పోరాటం సాగించాలనే" అంశమే ప్రధానమైంది. ఆయుధాలు లభించినంత మాత్రంచేత, ఈ కొద్దిమందీ విప్లవాన్ని సాధింపలేరు. వేలాదిగా ప్రజలను తమవైపు త్రిప్పుకొన్నప్పుడే విప్లవం విజయవంతమౌతుంది. కాబట్టి, ఇండియాకు తిరిగివెళ్ళే పూర్వం, ప్రజాభిమానాన్ని సాధించే ఉపాయాన్నీ, కార్యక్రమాన్నీ తెలిసికోవాలి. ఈ ప్రాథమిక శిక్షణ పొందిన తరువాత, సైనిక పాఠ.

శాలలో అనేక రకాల ఆయుధాల ప్రయోగంలో శిక్షణ నిస్తారు. ఇండియాలో ప్రజలను తమవైపు త్రిప్పుకో గలిగినప్పుడు అపారంగా ఆయుధాలు లభిస్తై.

ఉపన్యాస కార్యక్రమం కొన్ని రోజులు జరిగిన తరువాత ముజహిర్లలో కొంత మార్పు కనిపించింది. అందుకు ఉపన్యాసకులు తమ మతస్థులే కావటం ఒక కారణం; ఉపన్యాసకులు సైతం, 'కమ్యూనిజం' అనే మాటనుగానీ, మత విశ్వాసాలను గానీ ఉపన్యాసాలలో రానిచ్చేవారుకాదు; దానితో 'ఇండియా హౌస్'లోని వాతావరణంలో ప్రశాంతత యేర్పడింది. కాందిశీక గృహాన్నే ఇండియా హౌస్ అంటూ ఉండేవారు.

అచిర కాలంలోనే ఒక సైనిక శిక్షణా కేంద్రం నెలకొల్పబడింది; మాస్కో నుండి నా వెంట వచ్చిన రష్యన్ సైనికోద్యోగులే దానికి తగిన యేర్పాట్లు చేశారు. అమెరికన్ వోల్లి, జాన్ ఆ కేంద్రానికి అధ్యక్షుడు (Commandant). అందులో క్రమశిక్షణ బాధ్యత అంతా అతనిదే. కొన్ని రోజుల అనుభవానంతరం పరిహాసంగా అతడు నాతో అన్నాడు: "మనం తయారు చేయబోతున్నది విప్లవ సైన్యాన్ని కాదు; దేవుని సైన్యాన్ని."

## టాష్కెంట్ సైనిక కేంద్రం

### కర్జన్ ప్రభువుకు సింహస్వప్నం

టాష్కెంట్ సైనిక కేంద్ర ప్రారంభోత్సవం పెద్దయెత్తున జరిగింది. టర్కిస్థాన్ రిపబ్లిక్ ప్రధానోద్యోగులూ, టర్కిస్థాన్ కమ్యూనిస్టుపార్టీనాయకులు హాజరైనారు; కొన్ని రాజకీయకారణాలవల్ల రష్యన్లు మాత్రం హాజరు కాలేదు. అదే సమయంలో సోవియట్ రిపబ్లిక్‌పై ఆర్థిక దిగ్బంధనం తొలంగించి తద్వారా వర్తక సంబంధాల పునరుద్ధరణకై రష్యా బ్రిటనులమధ్య సంప్రదింపులు జరుగుచున్నై. నాడు కర్జన్‌ప్రభువు బ్రిటిష్ విదేశాంగ కార్యదర్శి. బ్రిటిష్‌సామ్రాజ్యంమాట ఎత్తితే పూదలి పోయేవాడు. ఇండియాకు వైస్రాయి (1898—1905) యైనది మొదలు "మధ్య ఆశియాలో రష్యన్లు" అనే విషయం ఒక భూతమై అతణ్ని వెన్నాడింది. ఆనాటి జారు ప్రభుత్వం పతనమైంది; ఆస్థానంలో, స్వయంనిర్ణయాధికార సూత్రాన్ని ప్రకటించి, సామ్రాజ్యవాదాన్ని తీవ్రంగా ఖండించిన ప్రభుత్వమేర్పడింది. ఐనా, కర్జన్ ప్రభువుకు రష్యా సింహస్వప్నమే! అందుచే, ఆర్థిక దిగ్బంధనం తొలగి రష్యా, బ్రిటనులమధ్య వాణిజ్య సంబంధాలు పునరుద్ధరించుకొనటానికి ఆరాటపడుతున్న రష్యా ఆ సంప్రదింపుల కంతరాయం కలిగించే చర్యకు సంసిద్ధంగాలేదు. అందుచేతనే ఆ ఉత్సవానికి రష్యన్లు హాజరు కాలేదు. ఐనా, అనుమాన వెనుభూతాన్ని తొలగించటం కష్టం! సైనిక కేంద్రం ప్రారంభమై సంవత్సరమైనా నిండకపూర్వమే బ్రిటిష్

విదేశాంగ కార్యదర్శినుండి సోవియట్ ప్రభుత్వానికొక పిడుగువంటి జాబువచ్చింది. "టాష్కెంట్‌లోని భారతీయ సైనికకేంద్రం బ్రిటిష్‌సామ్రాజ్యంపై సోవియట్ దురాక్రమణ కాంక్షకు నిదర్శనం" అంటూ ఆ లేఖలో నిందింపబడింది. క్రొత్తగా బ్రిటన్‌తో పునరుద్ధరింపబడిన ఆర్థికసంబంధాలు తెగిపోతే, రష్యా ఆర్థిక పునర్నిర్మాణానికి అంతరాయం కలుగుతుంది. అందుచే, టాష్కెంట్ సైనికకేంద్రాన్ని మూసివేయటం తప్పనిసరియైంది.

ఐతే, అందువల్ల కలిగే నష్టంగానీ, అప్రతిష్ఠగానీ లేదు. తన శక్తిసామర్థ్యాలలోనూ, తన ఆశయంలోనూ దృఢవిశ్వాసమున్న విప్లవకారునకు ప్రతిష్ఠాభంగం అంటూ లేదు. అసలు, పరిస్థితు లింత తొందరగా విషమించటానికి టర్కిస్థాన్ కమ్యూనిస్టు నాయకుల వెర్రి ఉద్రేకమే కారణం. సైనిక కేంద్ర ప్రారంభోత్సవ సందర్భంలో వీరంతా మతప్రవక్తల ధోరణిలో ఉపన్యాసాలు చేశారు. విప్లవ ప్రారంభ దశలో ఉండే ఉద్రేకమే అటువంటిది! విప్లవ నాయకులు, యుక్తాయుక్తవిచక్షణతో, రాజనీతితో వ్యవహరించటం అలవరచుకోలేదు. భారత కామ్రేడ్లకు స్వాగతంచెబుతూ "సామ్రాజ్య దాస్యంలో మ్రగ్గిపోతున్న ప్రాచీనదేశప్రతినిధులు మీరు; అనాగరక బ్రిటిష్ సామ్రాజ్యవాదంపై తిరుగుబాటు చేస్తున్న మీకు మా స్వాగతం" అంటూ మాట్లాడారు. "రష్యన్ బోల్షివిక్కుల ఆశయం వలస ప్రజల విముక్తియే! అధికారంలోకి వచ్చిన మరుక్షణమే, జారు నిరంకుశత్వంలో శతాబ్దాలుగా మ్రగ్గిన లక్షలాది ముస్లిములకు స్వేచ్ఛ నిచ్చారు. స్వేచ్ఛను సాధించిన ఈ ముస్లిం ప్రజానీకం, సరిహద్దుల్లోనున్న సోదర ముస్లిములకు సహాయం చేయటం తమ ధర్మంగా గుర్తించాలి. టాష్కెంట్ సైనిక కేంద్రంలో శిక్షణపొందిన భారత విప్లవకారులు, రష్యా విప్లవ సందేశాన్ని తమ దేశానికి తీసుకుపోవాలి. ఆ సందేశంతో ఉత్సాహవంతులైన భారత ప్రజానీకం, వీరోచితంగా పోరాడి బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోసి తీరుతుంది!"

ఉపన్యాసాలన్నీ ఈ ధోరణిలోనే జరిగినై; వీనికి చిలవలు పలవలు చేర్చి పత్రికలు ప్రచురించినై అనటంలో వింత లేదు. దీనితో కర్జన్ ప్రభువుకు నిద్రాభంగమై, వెఱ్ఱులెత్తి, విదేశాంగ వ్యవహార మర్యాదలనేగాక, బ్రిటన్ శ్రేయస్సులను గూడా విస్మరించాడు. వాస్తవానికి రష్యా బ్రిటనులమధ్య వాణిజ్య పునరుద్ధరణ ఉభయదేశాలకూ లాభకరమే. బ్రిటన్ ఖనిజపరిశ్రమకు రష్యా కలప అవసరం; యుద్ధంలో దెబ్బతిన్న పరిశ్రమలను పునరుద్ధరించుకొనటానికి బ్రిటన్‌కు రష్యా వస్తువులు అనేకం కావాలి; అదీగాక, రష్యావంటి పెద్ద దేశాన్ని ఆర్థికంగా పునర్నిర్మించే కార్యక్రమంలో, బ్రిటన్ పారిశ్రామిక వస్తువులకు రష్యా మార్కెటు కాగల అవకాశం కూడా లేకపోలేదు. డబ్బు విషయంలో రష్యన్లు చాల మర్యాదస్థులు; వస్తుమారకానికి అవకాశం లేనప్పుడు, ధనరూపంలో అంటే బంగారం చెల్లించేవారు. పౌను విలువను నిలకడ చేయటానికి రష్యా బంగారం బ్రిటన్‌కు ఎంతోగానో ఉపకరించేది,

ఏమైనా టాష్కెంట్ సైనిక కేంద్రం మూడునాళ్ళ ముచ్చటైంది. అందులో తయారైన ప్రథమదళంలో విప్లవ సైన్యానికి నాయకత్వం వహింపగల సమర్థులు చాల తక్కువ. వీరు రాజకీయ శిక్షణ ప్రాధాన్యతను గ్రహించినవారు. సైనిక దుస్తులు ధరించి కవాతు చేయటంగానీ, వీపున తుపాకులు మోయటంగానీ, వీరిని ఆకర్షించ లేదు. కేవలం సైనిక శిక్షణకై పట్టుబట్టిన వారిని రాజకీయంగా విశ్వసించటానికి వీలులేకపోయింది. వారి కిచ్చిన ఆయుధాలు 'భస్మాసురహస్తం' గా పరిణమించవనే నమ్మకం లేదు. అట్టి వారు భారత విప్లవ సైన్యానికి బీజప్రాయమాతారని విశ్వ సించటం మంచిదా? పోనీ ఇండియా నుండి యువకుల నాకర్షించి తర్ఫీదు చేసి విప్లవ సైన్యంగా పంపుదామని ఆలోచించాను. అందుకు అవకాశమూ, వ్యవధానమూ లేకపోయినై.

కాందిశీకుల్లో అధిక సంఖ్యాకులకు రైఫిల్ శిక్షణవరకూ ఈయబడింది. కొందరు విద్యావంతులకు మాత్రం అధునాతన క్లిష్టతర ఆయుధాల్లోకూడా తర్ఫీదు నిచ్చారు. వీరి చాకచక్యం రష్యన్ బోధకులకే ఆశ్చర్యాన్ని కలిగించింది. వీరిలో కొందరికి విమానయానం మీద మోజు కలిగింది అప్పటి కింకా రష్యాలోనే గాక, ప్రపంచంలోనే సైనిక విమానయానం ప్రాథమిక దశలో ఉంది. మాస్కో నుండి, నా వెంట కొన్ని విమానాలు కూడా తెచ్చాను. కాందిశీకుల్లో కొందరిని ఏరి విమాన యాన శిక్షణకు నియమించాను. చాల మంది ఎగబడ్డారు; ఎన్నికలో పక్షపాతం వహిస్తున్నానని మమ్మ నిందించారు; "తాత తండ్రుల మతానికి తిలోదకాలిచ్చి కమ్యూనిస్టు నాస్తికత్వాన్ని స్వీకరించిన వారిని మాత్రమే ఎన్నిక చేసి"నట్లు ఆరోపిం చారు. ఈ ఆరోపణకు కారణం విద్యావంతులనూ, రాజకీయ చైతన్యం కలవారిని మాత్రమే ఎన్నుకొనటం! కాని అప్పటికి వీరిలో ఒక్కరూ కమ్యూనిస్టు కారు. తరువాత వీరే స్వయంగా కమ్యూనిస్టులైనారు. టాష్కెంట్‌లో లభించిన పరిమిత శిక్షణకే వీరు మంచి నైపుణ్యం సంపాదించారు. వీరిలో ఇద్దరు మాత్రం ఉత్తమశ్రేణి పైలట్లుగా గణన కెక్కారు. ఇందులో ఒకరు లెనిన్‌గ్రాడ్‌లో రెడ్ ఆర్మీ విమాన దళంలో నియమింపబడ్డాడు. చివరి కేదో ఒక ప్రదర్శన-(Solo flight) సందర్భంలో విమానం కూలి మరణించాడు. అతని మృతికి రెడ్ ఆర్మీ అశ్రుతర్పణ విడిచింది. రెండవవాణ్ణి దక్షిణరష్యాలో దళాధిపతిగా నియమించి, ఆఫ్ఘన్, పర్షియన్ కాడెట్లకు శిక్షణ నిచ్చే యేర్పాటు చేశారు. తరువాత అతడేమైనాడో, ప్రస్తుతం ఎక్కడ ఉంటున్నాడో తెలియదు.

### బ్రిటిష్ గూఢచారి

విద్య, రాజకీయచైతన్యమూ లేని కాందిశీకులు తెచ్చిపెట్టిన ప్రమాదాన్నిబట్టి ఆలోచిస్తే, సైనిక కేంద్రాన్ని త్వరలో మూసివేయటమే మంచిదని తేలింది. వీరు నన్ను

కూడా ఇరుకున పడేశారు. కాందిశీకులకు బజార్లలో షికార్లుకొట్టటం మంచికాలక్షేప మైంది. సైనికకేంద్రంలో చేరినతరువాత ఆ అవకాశం లేకపోయింది. ఐనా, ఇండియా హౌస్‌కూ బజారుకూ సంబంధాలు తగ్గలేదు. 'మహమ్మద్ ఆలీకి కుడి భుజాన్ని' అని చెప్పుకొన్న వ్యక్తి సైనికశిక్షణకుగానీ, రాజకీయశిక్షణకుగానీ అంగీకరింపలేదు. తాను సర్వజ్ఞుడననీ, మూర్తీభవించిన విప్లవశక్తిననీ అనేవాడు. భారత విప్లవానికి సహాయం అర్థించి, తద్వారా వలసప్రజల దాస్యవిముక్తియే తన లక్ష్యమని ప్రకటించిన సోవియట్ రష్యా చిత్తశుద్ధిని పరీక్షించటానికే తాను రష్యా వచ్చాడట! అతడు మరీ చిన్నవయసువాడుకాదు. అందుచే ఆతనిమాటలు నమ్మి, నేను టాష్కెంట్ ఆయుధాలతోనే వచ్చాననీ, ఇండియా వాయువ్యసరిహద్దులకుచేరి, అచట భారత విమోచనసైన్యాన్ని నిర్మించటమే నా లక్ష్యమనీ వివరించాను; ఆఫ్ఘనిస్థాన్‌గుండా ప్రయాణం చేయటాని కా ప్రభుత్వం అనుమతి నిరాకరించటంవల్లనే నా ప్రణాళిక కార్యరూపంలోనికి రాలేదని కూడా చెప్పాను. మాస్కోనుండి తెచ్చిన ఆయుధాలను ఆఫ్ఘన్ ప్రభుత్వపరం చేయ సమ్మతింపలేదనగానే ఆశ్చర్యపోయినాడు. అదే నేచేసిన గొప్పతప్పట! అంతేగాదు. ముస్లిం ప్రభుత్వంపట్ల హిందువులకు సహజంగా ఉండే అపనమ్మకమట! ఖిలాఫత్ కాందిశీకులకు ఆఫ్ఘన్ ప్రభుత్వం చూపిన మర్యాదను బహుశా మరచిపోయి ఉంటాడు! క్రమంగా ఇతడు నాకు తలనొప్పిగా పరిణమించాడు. ఒకరోజున నా బసకు వచ్చి:

"భారత పరిహద్దులనుండి ప్రముఖవ్యక్తి ఒకడు మీకొక సందేశం తెచ్చాడు."

"ఎక్కడున్నాడు?"

"ఇండియా హౌస్‌లో"

నాకు ఆశ్చర్యం కలిగింది; ఒక అపరిచితవ్యక్తికి ఇండియా హౌసులో ప్రవేశమా? ఏమైనా, అతణ్ణి కలుసుకొనటానికి నిర్ణయించాను. కాని, నా విడిదికి గానీ, టర్కిబ్యూరో కార్యాలయానికిగానీ అతణ్ని రానీయకూడదు. "నేనే ఇండియాహౌసుకు వెళ్ళి అతణ్ని చూస్తాను" అన్నాను. మా మధ్యవర్తికి శృంగభంగ మైనంత పనైంది. క్రొత్తవ్యక్తిని పెద్దవారితో పరిచయంచేసి తన ఘనతను చాటుకొందామని అతని ఎత్తు!

ఎందరో అపరిచిత వ్యక్తులను కలుసుకొన్నాను; కాని ఈ వ్యక్తిని చూడటంతోనే నాకంత సద్భావం కలగలేదు; అందుకు, బహుశా నిష్కారణమైన ద్వేషభావమే కారణమై యుండవచ్చు. మంచి పొడవరి; స్ఫురద్రూపి; జాతికి పఠాను; నల్లని పొడవైన గడ్డం; నగిషీ తలపాగా, ఆతడి పేరు మాత్రం గుర్తులేదు; ఏదో మౌలానా అంటూ పరిచయం చేశారు; సరిహద్దు ప్రాంత ప్రజల్లో బాగా పలుకుబడి కలవాడనీ, సులభంగా బ్రిటిష్ వ్యతిరేక సైన్యాలను నిర్మింపగల సమర్థుడనీ వివరిం

చారు. కాని నాకు సరిహద్దు జాతులకు ఆయుధా లిచ్చి తర్ఫీదు చేసే కార్యక్రమంలో శ్రద్ధ నశించింది; అందుచే ఇండియాలోని జాతీయోద్యమంతో ఆతని కేమైనా సంబంధ మున్న దేమోనని అడిగాను. సందిగ్ధంగా సమాధానం చెప్పాడు. అతని రుజువర్తనను గురించి నమ్మకం కలిగితేగాని అతనికి సహాయం చేయరాదని నిశ్చయించాను. "పోనీ, కాబూలులోని తాత్కాలిక ఇండియన్ ప్రభుత్వంతో సంబంధ మున్నదా?" అని అడిగాను. ఈ ప్రభుత్వానికి అధిపతి మౌలానా ఒబీదుల్లా; ముస్లిం పూజారి. కొన్ని సంవత్సరాలుగా సరిహద్దు కొండజాతుల్లో బ్రిటిష్ వ్యతిరేక ప్రచారాన్ని సాగిస్తున్న వాడు. అతని ప్రచారం ఆశించిన ఫలితాల నిచ్చినా, లేకపోయినా, పశ్చిమ ఇండియా అంతటా ఒబీదుల్లా పట్ల భక్తి విశ్వాసా లేర్పడినై; ఒబీదుల్లాకు ఇండియన్ ఖిలాఫత్ కమిటీతో కూడా సంబంధముంది. ఈ క్రొత్త వ్యక్తికి ఒబీదుల్లా పరిచయంలేదు; ఇక, తన ఉనికిని సమర్థించుకొనే నిమిత్తం, కాబూలు తాత్కాలిక ప్రభుత్వాన్ని నిందించటం ప్రారంభించాడు. నా అనుమానం ధృవపడింది; జాగ్రత్తగా వ్యవహరించాలి:

"విప్లవోద్యమాలకు రష్యా ప్రభుత్వం సహాయం చేయటం తథ్యం; కాని మీ ఉద్యమం నిజంగా విప్లవాత్మకమైనదని రుజువు కావాలి; అదీగాక, రష్యా ఆయుధాలూ, ధనమూ సరిహద్దులకు చేరగలవనే నమ్మకం ఉండాలి. దానికి మీరేం యేర్పాటు చేశారు?"

ఈ ప్రశ్నతో నేనూహించిన దాని కంటె సులభంగానే దొరికిపోయినాడు సరిహద్దు రాయబారి.

"ఆఫ్ఘన్ రాయబారిని కలుసుకొని సంప్రదించాను; కాబూలు నుండి అనుమతి రాగానే, ఆయుధాలు స్వాధీనం చేసికొని ఇండియా సరిహద్దులకు చేర్చే బాధ్యత వహిస్తానని హామీ యిచ్చాడు. ఇక, డబ్బును టాష్కెంటులోని ఇండియా వర్తకుల ద్వారా చేర్చవచ్చు."

అర్థమైంది; కేవలం ధనాన్ని సంగ్రహించటమే వీరి ఉద్దేశ్యం కాదు; అంతకంటె ఘోరమైన ఆశయసాధనకే వీరు కుట్ర పన్నుతున్నారు. అడుగడుగునా జాగ్రత్త అవసరం. సమావేశం ముగించాను. తిరిగి అతనికి రష్యా సహాయాన్ని గురించి హామీ యిచ్చాను. నా మాట లాతనికి నచ్చలేదు. కాని అసంతృప్తిని బహిరంగంగా వ్యక్తీకరింపలేక పోయినాడు. కాని హావభావాల్లో తలబిరుసుతనం స్పష్టమౌతూనే ఉంది.

మరునాడే ఈ విషయాన్ని టర్కీస్థాన్ కమీషన్‌లోని రహస్య పోలీసు (Tchaka) దళప్రతినిధికి తెలియజేశాను; టర్కీస్థాన్, విప్లవ వ్యతిరేకశక్తులకు పట్టుగొమ్మగా నున్నందున చెకా ప్రతినిధిగా పీటర్‌ను ఇక్కడికి పంపారు. నిర్దాక్షిణ్యానికి

పెట్టినది పేరు పీటర్; 'నెత్తురు త్రాగే పీటర్ (Bloody Peter)' అంటూ ఉండే వారు. నా కథ నంతా విని పీటర్ అన్నాడు :

"వీడు (సరిహద్దు రాయబారి) నిస్సందేహంగా శత్రు గూఢచారే; కాని రష్యన్ కామ్రేడ్లు అడ్డుపడతారుగదా! వారికన్నీ అర్థంలేని మూర్ఖభావాలు; అందుచే వెంటనే నేనేమీ చేయలేను."

"తొందర పడనక్కర్లేదు; అంత పెద్దప్రమాదకరమైన వ్యక్తికూడా కాదు; జాగ్రత్తగా పరిశోధిస్తే, గొప్ప కుట్ర బయల్పడవచ్చు" అన్నాను.

పీటర్ నా సూచన నంగీకరించాడు; ఆతని అనుచరులు మాలానా చర్యలు కనిపెట్టి కొంత సమాచారం సేకరించారు; "పగలంతా, బాగా చీకటిపడే వరకూ, మాలానా బజార్లోనే గడిపేవాడు; బ్రిటిష్ గూఢచారులుగా అనుమానింపబడుతూ ఉన్న భారతీయ వర్తకులతో కలిసి తిరిగేవాడు; రహస్యంగా తరచు ఆఫ్ఘన్ రాయబార కార్యాలయానికి వెళ్ళివస్తూ ఉంటాడు" అని వారి పరిశోధన.

ఈలోగా ఈ వ్యక్తిని గురించి, కాబూలులోని మాలానా ఒబీదుల్లాకు వ్రాశాను. ఒబీదుల్లా రాజకీయాభిప్రాయా లేమైనా మర్యాదస్థుడనీ, గౌరవనీయుడనీ, పేరున్నది. ఎవరినిగురించీ అసత్యంగాగానీ, ద్వేషంతోగానీ మాట్లాడడు. ఒబీదుల్లా నుండి సమాచారంతో ఇద్దరువచ్చారు; వారిద్దరూ ఆతని ప్రభుత్వ సభ్యులే; కమ్యూనిస్టు సానుభూతి పరులనే అనుమానంతో వారిద్దరినీ, కాబూలు విడిచివెళ్ళవలసిందిగా, ఆఫ్ఘన్ప్రభుత్వం ఆజ్ఞాపించిందట! నేనడిగినవ్యక్తి తనకు తెలియదనీ, తానెన్నడూ ఆతనిగురించి వినలేదనీ ఒబీదుల్లా వ్రాశాడు. తాత్కాలిక భారతప్రభుత్వ సభ్యులు కాబూలునుండి రావటంతో సరిహద్దు రాయబారి ఇండియాహౌస్నుండి అదృశ్య మైనాడు; తన మిత్రులతో ఉంటాననీ, అక్కడే సౌకర్యంగా ఉంటుందనీ చెప్పాడు; ఒకరోజున కాబూలునుండి వచ్చిన మిత్రుల సమక్షంలో అతణ్ణికలుసుకునే అవకాశం లభించింది. కాబూలుమిత్రులు, చిరకాల పరిచయం ఉన్నట్లాతనికి అభివందనం చేశారు. తరువాత వారివల్ల తెలిసింది : బ్రిటిష్ యేజంటుగా, కాబూలులో అత డందరికీ తెలుసునట! ఆఫ్ఘన్ప్రభుత్వానికిగూడా ఆతడు విశ్వాసపాత్రుడట!

కాబూలుమిత్రుల సాక్ష్యమీద, మాలానాను నిర్బంధించవలసిందిగా, పీటర్ ఆజ్ఞాపించాడు. నా కోరికపై అరెస్టుమాత్రం చాల రహస్యంగా జరిగింది. ఒకరోజు సాయంత్రం బజారునుండి తిరిగివస్తూంటగా అరెస్టుచేశారు. ఆతనిదగ్గర ఇండియన్ కరెన్సీలో చాలడబ్బు ఉంది. ఇండియన్ సైనిక పాఠశాలలోని కాడెట్లను తరచుగా బజారుకు తీసుకువెళ్ళి మేపటమేగాక వారితో రాజకీయాలు చర్చిస్తూ ఉండేవాడట; వారికి డబ్బుకూడా ఇస్తూ ఉండేవాడు. ఒకరోజున 'చెకా' సభ్యులు, ఆతనిదగ్గిర డబ్బుతీసికొన్న భారతీయ కాడెట్లను గుర్తించారు; మరునాడుదయం ఏదోమిషపై

ఆ కాడెట్లను పాఠశాల బయటికి రప్పించి పరిశోధించారు. ఆ కాడెట్లు అందరి దగ్గర ఇండియన్ కరెన్సీనోట్లు పట్టుబడినై!

నాటి విప్లవ న్యాయశాస్త్ర సమ్మతంగా నేరం రుజువైంది. ఇక పీటర్ నెవ్వరూ ఆపలేరు; హెచ్చరికలూ, సలహాలూ వినేరకం కాదు; విప్లవ వ్యతిరేక శక్తులను నేలరాయటమే అతని విధి. నిర్బంధితుడైన మాలానాకు మరణశిక్ష విధింపబడింది. అతనితో లాలూచీ పడుతున్న కాడెట్లను మాత్రం రక్షించమని వేడుకొన్నాను; కరుణించాడు పీటర్!

అంతకంటె చేయగలిగిందిలేదు; మాలాను విడిచిపెట్టటం ప్రమాదాన్ని కొని తెచ్చుకొనటమే. ఒక పెద్ద ముఠాలో మాలానా ఒకడు. ఇతణ్ణి విడిచిపెడితే సరిహద్దుల్లోనూ, ఇండియాలోనూ కూడా రష్యాపై వ్యతిరేక ప్రచారం సాగిస్తాడు. కాని విప్లవ న్యాయాన్ని పాటించటంలో పీటర్ నిర్ణయానికి రష్యన్ కామ్రేడ్లు తబ్బిబ్బులైనారు. ఐనా ఈ విషయంలో పీటర్ స్వతంత్రుడు. టర్కీస్థాన్ కమిషన్ ఏకగ్రీవంగా చేసిన నిర్ణయం కూడా పీటర్ నిర్ణయాన్ని మార్చలేదు. మంచిగానీ, చెడుగానీ పీటర్ నిర్ణయానికి తిరుగులేదు!

పీటర్ నిర్ణయానికి కార్యరూపాన్నీయటంలో ఒక చిక్కు వచ్చింది. నిందితుణ్ణి కాల్చివేయాలి. అందుచే భవిష్యత్తులో తనకు మాట రాకుండా నిందితుణ్ణి పౌర అధికారులకు అప్పగించాడు పీటర్. అతని ఆజ్ఞలను ఆచరించవలసిన వారు పౌర అధికారులే. ఆ సమయంలో మాలటావ్ టర్కీస్థాన్‌లో ఉన్నాడు. మధ్యఆసియాకు విప్లవ సందేశాన్ని తెచ్చిన ప్రచారక దళంలో సఫరావ్‌తో బాటు మాలటావ్ కూడా వచ్చాడు; టర్కీస్థాన్ కమిషన్‌కు కార్యదర్శిగానూ, టర్కీస్థాన్ కమిషనుకూ, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ టర్కు బ్యూరోకూ మధ్యవర్తి (Laison) గానూ టర్కీస్థాన్‌లోనే ఉండిపోయినాడు మాలటావ్. పీటర్ నిర్ణయాన్ని అమలు జరిపే బాధ్యత అతని కీయబడింది; అతడైతే బైటికి పొక్కకుండా జరిగిపోతుందని భావించారు. పీటర్ ఆదుర్దా ఎక్కువ కాసాగింది. ప్రతిరోజూ నాకు ఫోన్ చేసేవాడు: "ఆ బ్రిటిష్ గూఢచారి సంగతేమిటి?" అని. నాకూ ఏ సంగతీ తెలియదు; అతణ్ణి ఎక్కడ నిర్బంధించారో కూడా నాకు తెలియదు. నాకే అధికారం ఉన్నట్లయితే అతణ్ణి విడిచిపెట్టేవాణ్ణి; రష్యన్ కామ్రేడ్లు సంతోషించేవారు. కాని పరిస్థితి మా చేయి జారిపోయింది. ఐనా ఈ వ్యవహారాన్ని ముగింపుచేయటం నా బాధ్యతేనని అందరూ భావింపసాగారు. రోజులు గడిచినకొలదీ అందరికీ ఆదుర్దా ఎక్కువైంది. ఈ సంఘటన బైటికి పొక్కితే అవాంఛనీయమైన రాజకీయ పరిణామాలు జరగవచ్చు. గత్యంతరం లేక సఫరావ్ సహాయం అర్థించాను. రష్యా కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధిగా, పీటర్‌పై అధికారి సఫరావ్; తన సహజ నిరాశావాద ధోరణిలో "ఇంకొక్క మనిషి మరణిస్తే వచ్చే నష్టమేమిటి? కాని మాలటావ్ మాత్రం అల్లా ఆగ్రహానికి బెదరి

పోతున్నాడు; రేపు నీ దగ్గిరికి పంపుతాను; ఆలస్యం లేకుండా పని పూర్తి చేయమని చెప్పు" అని అన్నాడు.

మరునాడుదయం మాలటావ్ వచ్చాడు; మౌలానా మరణశిక్షను అమలు జరపని కారణాన్ని గురించి ప్రశ్నించాను. వణికిపోతూ ఏదో నసిగాడు. రష్యా అధికారవర్గంలో బాగా పైకి వచ్చేవరకూ మాలటావ్ ప్రతి విషయానికీ నత్తులు గొడుతూ మాట్లాడేవాడు. క్రమంగా ఈ లోపాన్ని సవరించుకున్నాడు "డెమోస్తనీస్ అంతటి వాణ్ణి కావాలి" అని అతని ఆశయమంటూ అంటూ ఉండేవారు; కాని మాలటావ్ మాత్రం వక్త కాలేకపోయినాడు. నా ప్రశ్నకు మాలటావ్ నసిగిన సమాధానం: "ఇండియన్ కామ్రేడును చంపటం యుక్తమా?"

మాలటావ్‌తో గట్టిగా మాట్లాడవలసి వచ్చింది. మౌలానా కామ్రేడ్ కాదనీ, శత్రు గూఢచారి యని స్పష్టమైన సాక్ష్యం లభించిందనీ వివరించాను: "విప్లవ న్యాయం జరిగితీరాలి; శత్రు గూఢచారిగా నిందింపబడినవాణ్ణి తక్షణం తుద ముట్టించాలి" అని ఆజ్ఞాపించాను. మౌలానా సాహసం సమాప్తమైంది. అదృష్ట వశాత్తూ అంతా రహస్యంగా జరిగిపోయింది.

మౌలానా హఠాత్తుగా అదృశ్యం కావటం భారతీయ కాందిశీకుల్లో ఆందోళన కలిగింది. సైనిక పాఠశాలలోని కాడెట్లను మౌలానాతో పరిచయమున్న భారత వర్తకులు బెదరిస్తున్నట్లు చెకా పభ్యులు కనిపెట్టారు. ఇండియాకు తిరిగి పంపవలసినదిగా కోరమనీ, పంపనిచో రహస్యంగా పారిపోవటానికి తాము సాయం చేయగలమనీ కాడెట్లనా వర్తకులు ప్రోత్సహించారు. ఇట్టి పరిస్థితుల్లో సైనిక పాఠశాలను నడపటంలో అర్థం లేదు. అదీగాక మాస్కోలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ ప్రపంచ మహాసభా సమావేశాలు సమీపిస్తున్నై; వానికి హాజరు కావాలి. టర్కీస్థాన్ నుండి వెళ్ళక తప్పదు; వినచో ఈ అల్లరిమూక నెవరికి అప్పగించాలి? వీరిలో పది పంద్రెండుగురు మాత్రం నిజమైన విప్లవయోధులుగా తయారైనారు. త్వరలో టర్కీస్థాన్ విడిచి వెళ్ళుతున్నానని తెలిసి బాధపడ్డారు. రష్యన్ కామ్రేడ్ల ఆమోదంతో పీటర్‌నుండి ఒక హామీ తీసుకున్నాను. "సైనిక పాఠశాలలోని భారతీయ విద్యార్థుల నెవ్వరినీ నిర్బంధించను అని" ఆ హామీ.

## మాస్కోలోని భారతీయ విప్లవకారులు

### అవనీ ముఖర్జీ

నేను టాష్కెంటులో బయలుదేరే సమయానికి, అవనీ ముఖర్జీ మాస్కో నుండి వచ్చాడు. అతని రాకను గురించి ముందుగా నాకు తెలియదు. టాష్కెంటులో అతనికి గల పనేమిటో అంతకంటె తెలియదు. అతణ్ణి బాకూ కాంగ్రెసుకు

పంపాను; బాకూనుండి మాస్కోకు తిరిగివచ్చినవెంటనే పశ్చిమ యూరపుకు వెళ్ళి, హాలెండులో కార్యస్థానాన్ని నెలకొల్పుకొని, నావిపులద్వారా, అతడు ఇండియాతో సంబంధాలు పునరుద్ధరించే యేర్పాట్లు చేశాను. ఉన్నట్లుండి అవనీ టాష్కెంటు రావటం ఆశ్చర్యాందోళనలకు కారణమైంది. నేను మాస్కోలో నున్నంతవరకూ సైనిక కేంద్రాన్ని నడిపే బాధ్యత తాను వహిస్తానన్నాడు; భారత కమ్యూనిస్టుపార్టీని అభివృద్ధి చేయాలనీ, సంఖ్యాబలం పెంచి విస్తృతం చేయాలనీ అతనిలో ఆరాటం ఎక్కువగా కన్పించింది.

ఇంతకుముందే, అవనీకి 'చెకా'తో లావాదేవీలున్నందున, అతని రాకను గురించి మరుక్షణంలోనే పీటరుకు తెలిసింది. మాస్కోలో ఒకసారి స్వయంగా జోక్యం కలిగించుకొని పీటర్ రక్తదాహానికి బలిగాకుండా అవనీని రక్షించాను; అందులో లెనిన్ ఔదార్యాన్నికూడా ఉపయోగించుకొనవలసి వచ్చింది. నాటినుండి ఆశాభంగంతో కుమిలిపోతున్నాడు పీటర్. ఇటు, అవనీ దురాశాపరుడు; తుఫాను లాంటి స్వభావంకలవాడు; అందుచే తిరిగి ఏదో ప్రమాదంలో చిక్కుకొనటం తథ్యం. నేను మాస్కో వెళ్ళినచో, పీటర్ ప్రతీకారకాంక్షనుండి అవనీని రక్షించేదెవరు? సఫరావ్‌కు అవనీ అంటేనే అసహ్యం. అందుచే మాస్కోకు బయలుదేరేముందుగా పీటర్‌ను కలుసుకొని, అవనీపట్ల కొంచెం ఉదారంగా ఉండమని కోరాను. పీటర్ నామీద ఎగిరిపడ్డాడు; "ముఖర్జీ నిక్కడికెందుకు రప్పించావ్? ఏదో ప్రమాదం తెచ్చిపెడతాడు. ఈసారిమాత్రం అతణ్ని వదిలిపెట్టేదిలేదు." పీటర్ మాటకు తిరుగు లేదు. నాకు భయంకలిగింది; సక్రమంగా నడుచుకుంటానని ముఖర్జీ వాగ్దానంచేశాడనీ, ఇతర భారతీయ విప్లవకారు లతణ్ణి అదుపులో నుంచగలరనీ పీటర్‌తో చెప్పాను.

ఐనా, ఈ సమయంలో మూడవ ప్రపంచ మహాసభ జరగబోయేముందు మాస్కో నుండి అవనీ టాష్కెంట్ రావటమేమిటి? నా ప్రశ్నకు మాస్కో వెళ్ళిన తరువాతగాని సమాధానం బోధపడలేదు.

## బెర్లిన్ విప్లవ సంఘం

నేను టాష్కెంటునుండి రాకపూర్వమే, పలువురు భారతీయ విప్లవకారులు మాస్కో చేరారు. వీరందరూ బెర్లిన్‌లోని భారతీయ విప్లవసంఘానికి ప్రతినిధులు. ఆ సంఘం ఇప్పుడు నామమాత్రావశిష్టమైంది. మెక్సికో నుండి మాస్కో వస్తూ బెర్లిన్‌లో వీరిని కలిసికొని మాస్కో రమ్మని కోరాను; రష్యా మాత్రమే మనకు శరణ్యమనీ, ఇండియాలో విప్లవశక్తులను బలవత్తరం చేయటానికి ఉపకరించే కేంద్రమనీ నచ్చజెప్పటానికి ప్రయత్నించాను. నాడు, వీరందరూ కమ్యూనిజంపట్ల వైముఖ్యం వహించారు; రష్యా విప్లవానికి భవిష్యత్తే లేదని వారివిశ్వాసం. క్రమంగా మనస్సు మార్చుకొని ప్రపంచ విప్లవ కేంద్రంపై నేటికైనా దృష్టి మరల్చుకొనటం నాకు

సంతోషాన్ని కలిగించింది. కాని వీరిలో కొందరు నాపట్ల నిరసన ప్రదర్శించటం బాధాకరమైంది. మాస్కోకు రాబోతున్న విప్లవసంఘానికి పురోగామిదళంగా వచ్చినట్లు చెప్పుకున్నారు. అందుచేత ముందు ముందు, ప్రముఖ విప్లవకారులైన వీరేంద్రనాథచట్టోపాధ్యాయ, భూపేంద్రనాథదత్తాల రాకతో పరిస్థితి మెరుగు కాగలదనీ, అనుభవజ్ఞులూ, విప్లవానికి అంకితమైన ఆ మహనీయులు నాతో సహకరింప గలరనీ ఆశించాను.

కొన్ని రోజులకే వారంతా మాస్కో వచ్చారు. అనుకూల పరిస్థితులు కల్పిస్తే భారత విప్లవసంఘం తన కార్యస్థానాన్ని బెర్లిన్‌నుండి మాస్కోకు మార్చటానికి నిర్ణయించినదని ప్రకటించారు. నిజానికి ప్రపంచంలో నాడు విప్లవానికి మాస్కోవంటి కేంద్రం లేనేలేదు. ఐతే, భారతదేశానికి ప్రాతినిధ్యం వహించే హక్కు ఆ సంఘానికి మాత్రమే కలదని వెల్లడించారు; దాని ఉద్దేశ్యం ఇండియాను గురించి మాట్లాడే హక్కు నాకు లేదని సూచించటమే! ఐనప్పటికీ వారితో సహకరించటానికి నాకు అభ్యంతరం లేదని వివరించాను. కాని ఏదో ప్రతీకారకాంక్షతో నన్ను తప్పించుకు తిరగసాగారు.

'బెర్లిన్ భారతీయ విప్లవ సంఘం' అనేది చరిత్రలో జీర్ణించి పోయింది. మొదట్లో అది ఏమి సాధించినా, యుద్ధం ముగిసే నాటికి అది విచ్ఛిన్నమై అందలి సభ్యులు పరస్పరం దుమ్మెత్తి పోసుకొనసాగారు. అందుచే ఆ సంఘం పేరుతో వ్యవహరించటం కంటె నూతన పరిస్థితుల్లో క్రొత్త వ్యవస్థను స్థాపించటం యుక్తంగా ఉండేది. టాష్కెంటులో కాందిశీకులతో భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపించారనే వర్తమానం వృద్ధ విప్లవకారుల భయానికి కారణమైంది. తమ అధికారాని కది ఒక సవాలుగా పరిగణించారు. నాకు అవకాశం యిచ్చి ఉంటే, "టాష్కెంట్ కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు నేను సుముఖుణ్ణి కాదనీ, కేవలం కాందిశీకులకు భారత శ్రామిక వర్గానికి ప్రాతినిధ్యం వహించే హక్కు లేదనీ అందుచే వారు భారతజాతికి ప్రతినిధులు కాదనీ వివరించియుండేవాణ్ణి. కాని దురదృష్టవశాత్తూ, వారిని కలుసుకునే అవకాశం కూడా వారు నాకు నిరాకరించారు.

బెర్లిన్ నుండి వచ్చిన భారత విప్లవకారుల ప్రతినిధి బృందంలోని పదునల్గురు సభ్యుల్లో ముఖ్యులు వీరేంద్రనాథచట్టోపాధ్యాయ, భూపేంద్రనాథదత్తా, వీరేంద్రనాథదాస్‌గుప్తా, ఖన్‌ఖోజె, గులామ్ అంబియాఖాన్ లుహానీ, నళినీగుప్తా, యాగ్నెస్ స్మెడ్లీ. ఈ బృందానికి ప్రాణం వంటిది యాగ్నెస్‌స్మెడ్లీ. ఈమె అమెరికన్; ఈమెను మొదట అమెరికాలోనే కలుసుకున్నాను; అప్పుడామె అరాజక శాంతివాది; కొంతకాలం లాలాలజపతిరాయ్ అంతరంగిక కార్యదర్శిగా పనిచేసింది. ఇండియా పట్ల ఆమెకు ఎంతో సానుభూతి ఉండేది. భారత విప్లవకారులు బెర్లిన్‌లో ఉన్నారని

తెలిసి యుద్ధానంతరం బెర్లిన్ వెళ్ళి విప్లవ సంఘంలో చేరి అనతికాలంలోనే మంచి పలుకుబడి సంపాదించింది.

మాస్కో వచ్చిన భారతీయ సంఘానికీ, బెర్లిన్ సంఘానికీ పోలిక లేదు. బెర్లిన్ సంఘంలో హరదయాళ్, చట్టోపాధ్యాయలు ప్రముఖులు. చివరికి వీరిద్దరి మధ్య స్పర్ధ పెరిగింది. బ్రిటిష్ వ్యతిరేకియైనా, హరదయాళును శత్రు గూఢచారి అనే అనుమానంతో జర్మన్లు నిర్బంధించారు. జర్మనీ లొంగిపోగానే హరదయాళ్ తప్పించుకొని స్టాక్‌హోం (స్వీడన్) పారిపోయినాడు. అక్కడ జర్మనీలో తన అనుభవాలను గురించి ఒక పుస్తకం వ్రాశాడు. దానివల్ల, అతనికి జర్మనీపట్ల సద్భావం నశించిందని తెలుస్తుంది. భారత దేశంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని సమర్థిస్తున్న ధోరణిలో, ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం కంటె అధినివేశ ప్రతిపత్తియే యోగ్యమైనదని వాదిస్తూ వ్రాశాడు. ఆ వాదనలో ఎంతటి సత్యమున్నా, అవి విప్లవ భారత జాతీయవాది చెప్పదగిన మాటలు కావు! అంతేగాదు. భారత స్వాతంత్ర్య వీరులు, ఇంగ్లండు నుండియే సమరోత్సాహాన్ని పొందారనీ; వీరికి ఇండియా మాతృదేశమైతే, ఇంగ్లండు మాతామహి దేశమంటూ ధైర్యంగా చెప్పాడు. ఇవి భారత విప్లవకారులందరికీ తలవంపులు కలిగించే వాక్యాలు! హరదయాళ్ వ్రాతలను పలువురు పలు రకాలుగా విమర్శించారు. బ్రిటన్‌ద్వారా ఇండియాకు తిరిగి వెళ్ళటానికి అనుమతి పొందే ఆశయంతో వ్రాశాడని కొందరు విమర్శించారు. కాని అతని కా అనుమతి లభింపనే లేదు! కొందరు మతి చలించినదన్నారు; కాని హరదయాళ్ స్వీడన్‌లోనే స్థిరపడి, ఉప్సలా విశ్వవిద్యాలయంలో భారతీయ తత్త్వశాస్త్ర ఆచార్యుడుగా పని చేశాడు. అతని మానసిక స్వస్థతకూ, పాండిత్యానికీ ఆ పదవియే నిదర్శనం.

## బెర్లిన్ కమిటీ కార్యక్రమం

బెర్లిన్ కమిటీకి అధ్యక్షుడు మహమ్మద్ హసన్‌మన్‌సూర్. యుద్ధారంభంలో టర్కీ వెళ్ళి, ఆశాభంగంతో బెర్లిన్ తిరిగివచ్చి కమ్యూనిస్టునైనానని చాటుకున్నాడు. అందుచే బెర్లిన్ కమిటీలో మన్‌సూరును చేరనివ్వలేదు; తరువాత మాస్కో వచ్చి రెండు సంవత్సరాలున్నాడు. అతనితో నా అనుభవాలను పైన వివరించాను. 1919 లో బెర్లిన్ వచ్చినప్పుడు యుద్ధకాలపు సంఘంలోని సభ్యుల్లో భూపేంద్రనాథదత్తా ఒక్కడే బెర్లిన్‌లో ఉంటున్నాడు; మిగిలినవారు అదృశ్యమైనారు; వీరేంద్రనాథ చట్టోపాధ్యాయ, స్టాక్‌హోంలో జరుగుచున్న అంతర్జాతీయ సోషలిస్టు మహాసభలో భారత స్వాతంత్ర్యాన్ని గురించి వాదించటానికై వెళ్ళాడట.

మాస్కోవచ్చిన బెర్లిన్‌కమిటీ సభ్యులకు నాయందొక దురభిప్రాయ మేర్పడినది. వారి ప్రణాళికకూ, రష్యా నాయకులతో వారి సమావేశానికి నేను ఆటంకమని వారి అభిప్రాయం. అది తొలగించే ఉద్దేశ్యంతోనే, నేను వారి జోక్యం కల్పించుకో

లేదు. ఆధారంలేని వారి అనుమానాలవల్ల నాకు చాలబాధ కలిగింది. మొట్టమొదట వీరందరూ చిచిరిన్‌ను కలుసుకోవాలని ఆరాటపడ్డారు. చిచిరిన్ సోవియట్ విదేశాంగ మంత్రి (Commissar of Foreign Affairs). కానిరాజకీయ ప్రాబల్యంఉన్నవాడు కాదు. అదీకాక, ఆ సమయానికే మధ్య ఆసియాలో భారత విప్లవకారుల చర్యలను గురించి బ్రిటన్‌నుండి తాఖీదు అందింది. అందుచే ప్రముఖ భారత విప్లవకారులతో మాస్కోలో సమావేశం జరపటం మంచిదికాదనే అభిప్రాయంలో ఉన్నాడు. ఐనా, చిచిరిన్ చాల మర్యాదస్తుడు; ఇతరుల మనసు నొప్పించరాదనే మనస్తత్వం కలవాడు. అందుచే ఒక చిన్న సమావేశం జరిపి భారత విప్లవకారులను కలుసుకొన్నాడు. ఆ సమావేశం భారతీయులకు ఆశాభంగం కలిగించింది.

ఇక, లెనిన్‌తోనే సూటిగా సంభాషణలుజరిపే ప్రయత్నాలను రహస్యంగా ప్రారంభించారు; నాకీ సంగతి లెనిన్‌ద్వారానే తెలిసింది. ఒకరోజు తన్ను కలుసుకో వలసిందిగా లెనిన్ ఫోన్‌చేశాడు. మాస్కోవచ్చిన భారత విప్లవకారులను గురించి ప్రశ్నించి, తాను వారితో సంభాషించటం అవసరమా అని ప్రశ్నించాడు. "ఇండియాలో విప్లవకార్యక్రమాన్ని గురించిన ప్రణాళిక యేదైనా ఉంటే, వారు కమ్యూనిస్టు ఇంట ర్నేషనల్‌తో చర్చించాలిగాని, నాతో నేంపనీ?" అన్నాడు. భారత విప్లవకారులు నా పట్ల సుముఖంగాలేరని విని నిర్ఘాంతపోయినాడు. ఐనా, వారి ప్రణాళికను గురించి వినవలసిందిగా కోరాను; లెనిన్ నవ్వుతూ అన్నాడు: "వారు పదునల్గురూ; నీవు ఒక్కడివే!" సమాధానంగా అన్నాను; "నాకు నేనే తప్ప మరెవ్వరికీ ప్రాతినిధ్యం వహించటంలేదని మీకు తెలుసు; ఐనా, నాకు తెలిసినంతవరకూ మా మధ్య విభేదా లేమీలేవు."

"వారితో చర్చించావా?"

"వారు నాతో కనీసం మాట్లాడటమేలేదు" అని అన్నాను.

లెనిన్ ఆశ్చర్యపడి, బాధగా కుర్చీలో చేరగిలబడి అన్నాడు: "వారిలో ముగ్గురిని ఎన్ని నా దగ్గిరికి పంపు."

"అది నా సాధ్యంకాదు; వారిసంగతి మీరే స్వయంగా చూచుకోవాలి."

తరువాత కొన్ని రోజుల వరకూ, భారత ప్రతినిధివర్గంలో చిన్న అలజడి రేగింది. సమావేశానికి లెనిన్ అంగీకరించాడు; కాని తమలో ముగ్గుర్ని ఎన్నుకొని తమ ప్రతినిధులుగా పంపాలి. ఆ ఎన్నిక దగ్గరే పేచీలు వచ్చినై. ఆ గౌరవాన్ని పొంద టానికి ఎవరికివారు తామే అర్హులమంటూ వాదించుకున్నారు. నాకీ సమాచారమంతా నళినీగుప్తద్వారా అందుతూ ఉండేది. నళినీగుప్త మాత్రం నాతో స్నేహంగానే ఉండేవాడు; ఐరోపాలో ఉంటున్న భారతీయులందరిలో ఇతనికి మాత్రమే ఇండియా లోని విప్లవసంఘాలతో సంబంధ ముండేది. అప్పుడప్పుడూ రహస్యంగా ఇండియాకు

వెళ్ళివస్తూ ఉండేవాడు. ఇండియాలో నా ప్రాత స్నేహితులను కలిసికొని, వారిద్వారా యుద్ధారంభంలో ఏ కార్యభారంతో నేను బయలు దేరిందీ తెలిసి కొన్నాడట! నన్ను కలుసుకోవలసిందిగా అతని స్నేహితులు సలహా యిచ్చారని నళినీ చెప్పాడు. అందుచే మొదటినుండి పరస్పరం విశ్వాసంతో వ్యవహరింపసాగాం. లెనిన్‌ను దర్శించే ప్రతినిధుల నెన్నుకొనటంలో పేచీపడ్డా, లెనిన్‌కు సూచించే కార్యక్రమాన్ని గురించి మాత్రం వారిలో అభిప్రాయభేదం లేదు. చట్టోపాధ్యాయ, స్మెడ్లీలు కలిసి లెనిన్‌కు నివేదించటానికై సుదీర్ఘమైన వ్యాసాన్ని తయారు చేశారు. రెండవ ఇంటర్నేషనల్ ఆమోదించిన నా సిద్ధాంతాన్ని ఖండించటమే అందలి ప్రధానాంశం. వీరి వ్యాసాన్ని సరళమైన భాషలో వ్రాసినది లుహానీ; ఉత్తర బెంగాలీ ముస్లిం; బ్రిటన్‌లో న్యాయశాస్త్రం అభ్యసించాడు; చురుకైనవాడు; మంచి వక్త; ఐనా వయసులో చిన్నవాడు కావటంచే లెనిన్‌ను దర్శించే ప్రతినిధివర్గంలో లుహానీ లేడు!

యాగ్నెస్ స్మెడ్లీ లెనిన్‌ను దర్శించాలని ఆరాటపడింది; ఆమెను చట్టోపాధ్యాయ బలపరిచాడు; కాని, ఆమె ప్రాతినిధ్యానికి ఇతర భారతీయులు సమ్మతింపలేదు; చివరకు చట్టోపాధ్యాయ, భూపేంద్రనాథదత్తాలు ఎన్నికైనారు; మూడవ వాడెవరో సరిగా గుర్తులేదు; కేవలం బెంగాలీ ప్రతినిధివర్గమనే ఆరోపణకు అవకాశం లేకుండా, బహుశా ఖన్‌ఖోజీని చేర్చి ఉంటారు; ఇతడు మహారాష్ట్ర దేశీయుడు.

ప్రతినిధి వర్గసభ్యులు చెప్పినదంతా, మర్యాదగా, ఓర్పుతో విన్నాడు లెనిన్; చివరకు ఇతర దేశాల్లో విప్లవాలు పురికొల్పే చర్యల్లో సోవియట్ ప్రభుత్వం జోక్యం కలిగించుకొనదని వివరిస్తూ, ఐనా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యదర్శిని చూడమని సలహా యిచ్చాడు. ఆశాభంగంతో, అంతకు మించిన ఆగ్రహంతో మరలారు భారతీయ ప్రతినిధులు. తన ఆగ్రహాన్ని బహిరంగంగానే వెళ్ళగ్రక్కాడు దత్తా: "బోల్షివిక్కులు బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో రాజీపడుతున్నారనీ, భారతీయ విప్లవకారులు రష్యా సహాయం అర్థించటం వెఱ్ఱితనమనీ" ప్రచారం ప్రారంభించాడు.

ఐనా, భారతీయ విప్లవకారులు రాడెక్‌నుకూడా కలుసుకున్నారు. రాడెక్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సాధారణ కార్యదర్శి. వారు అతని ఆఫీసుకు వచ్చినప్పుడు, నేను ప్రక్కగదిలోనే ఉండటం తటస్థించింది. వారి సమక్షంలోనే, రాడెక్ ఆ సమావేశానికి నన్నుకూడా హాజరుకమ్మని ఫోనులో కోరాడు. క్షమాపణ పూర్వకంగా నేను రాజాలనందుకు కారణం, త్వరలోనే అతడు గ్రహింపగలడని చెప్పాను. అంతకు ముందుగానే, భారత విప్లవకారుల సిద్ధాంతాన్ని రాడెక్‌కు పంపాడు లెనిన్. అందువల్ల రాడెక్ వారితో స్పష్టంగా చెప్పాడు: "వలస రాజ్యాలలోని జాతీయోద్యమాలకు సహాయంచేసే కార్యక్రమంలో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ ప్రపంచ మహాసభ ఆమోదించిన సిద్ధాంతానికే కట్టుబడి ఉంటుంది; ఐతే, మీరు ఆసిద్ధాంతంతో

ఏకీభవింపక, ఇంటర్నేషనల్ తన విధానాన్ని మార్చుకోవాలని కోరే పక్షంలో, మూడవ ప్రపంచ మహాసభలో వాదించే అవకాశాన్ని మీకు కల్పిస్తాము; త్వరలోనే ఆ మహాసభ జరగబోతోంది; దానికి ప్రతినిధుల హోదాలోగాక ప్రేక్షకులుగా మీరు హాజరుకావచ్చు. మీ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యదర్శిగా, సభికుల పరిశీలనకు పంపే యేర్పాటు చేస్తాను."

భారత ప్రతినిధులలో సహనం నశించింది. రాడెల్‌తో వారు అన్నారట: "మూడవ మహాసభ జరిగేవరకూ మాస్కోలో వృధాగా కాలక్షేపం చేయలేము; స్వదేశానికి మరలి యుద్ధంవల్ల ఆగిపోయిన విప్లవ కార్యక్రమాలను పునరుద్ధరించాలి; పశ్చిమ ఐరోపాదేశాలలో విప్లవచర్యలు కొనసాగించటానికి రష్యా సహాయం చేయగల దనే ఆశతోనే మేము మాస్కో వచ్చాము."

సమాధానంగా రాడెల్ వారితో చెప్పాడు: "తూర్పు దేశాల్లో విప్లవా లను ప్రోత్సహించే ఉద్దేశ్యంతోనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ మహాసభ మధ్యఆసియా బ్యూరోను నెలకొల్పింది; క్రొత్త విధానాలు రూపొందేవరకూ, ఇండియాకు సంబంధించిన ప్రణాళికలన్నీ మధ్యఆసియా బ్యూరోతో సంప్రదించి తయారు చేయవలసినదే; ఆ బ్యూరోలో యం. యన్. రాయ్ సభ్యుడు; అతడు ప్రస్తుతం మాస్కోలోనే ఉన్నాడు; అతనితో చర్చించి ఒక కార్యక్రమాన్ని రూపొందించుకోవచ్చు."

## విచారణ సంఘం

లెనిన్‌తో సమావేశం కంటె రాడెల్‌తో సమావేశం భారతీయులకు మరింత ఆశాభంగం కలిగించింది. ఇది గమనించి, వారిని సంతృప్తి పరచే ఉద్దేశ్యంతో రాడెల్ వారి కొక హామీ యిచ్చాడు. "మీ సిద్ధాంతాన్ని పరిశీలించటానికై ఒక చిన్న సంఘాన్ని నియమించమని ఇంటర్నేషనల్ కార్యవర్గాన్ని కోరుతాను." రాడెల్ సూచనలు వా రెవరికీ నచ్చలేదు. అందుచే ఒకరి తరువాత మరొకరు మాస్కో నుండి నిష్క్రమించారు. చట్టోపాధ్యాయ, స్మెడ్లీ, భూపేంద్రనాథదత్తా, లుహానీ, నళినీ గుప్త మరికొందరు మాత్రమే మిగిలారు.

రాడెల్ సూచనపై భారతదేశ పరిస్థితిని పరిశీలించటానికై ఒక సంఘం నియమింపబడింది. అందు సభ్యులు ముగ్గురు: జర్మన్ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు తావ్‌హీమర్; బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీకి చెందిన క్వెల్చ్; బోరొడినూ. ఇక భారత ప్రతినిధి వర్గానికి చట్టోపాధ్యాయ నాయకుడని వేరుగా చెప్పనక్కరలేదు. కాని చట్టోపాధ్యాయ వక్త కాదు; అందుచే అతని తరఫున మాట్లాడాలని స్మెడ్లీ ప్రయత్నిం చింది. భారతీయేతర వ్యక్తి భారతదేశ విషయాలను గురించి ప్రస్తావించటం అనుచితం;

అందుచే లుహానీకి ఆ గౌరవం దక్కింది. లుహానీ చక్కని సామర్థ్యం ప్రదర్శించాడు; అతడు మాట్లాడటం పూర్తి కాగానే తావ్‌హీమర్ ప్రశ్నించాడు: "క్రొత్తగా వచ్చిన భారత కామ్రేడ్లకు, యం. యన్. రాయ్‌తో కలిసి పనిచేయటానికి అభ్యంత రమా?" నన్నూ అదే విధంగా అడిగాడు: "నాకేమీ అభ్యంతరం లేదు; భారత దేశానికి నేను ప్రాతినిధ్యం వహిస్తున్నానని చెప్పటం లేదు; ఒక కార్యక్రమంపై కృషిచేయటానికి సమ్మతించి మాస్కోలో వుండే పక్షంలో వారితో పూర్తిగా సహ కరిస్తాను" అన్నాను. అంతటితో చట్టోపాధ్యాయ తల్లక్రిందులై ఆగ్రహావేశంతో అన్నాడు: "నీమీద మాకు ప్రత్యేకంగా కోపం లేదు; కాని అనేక భారతీయ విప్లవకారుల దుర్మరణానికి కారకుడైన బ్రిటిష్ గూఢచారితో నీకు సంబంధం ఉన్నంత కాలం, మేము నీతో కలసి పనిచేయలేము."

కమిటీ సభ్యుల కా మాటలు పిడుగుపాటైనై; చట్టోపాధ్యాయ ఉద్దేశించిన బ్రిటిష్ గూఢచారి ఎవరా అని నేనూ అప్రతిభుణ్ణి ఐనాను. మరికొంత స్పష్టంగా వివరించమని అడిగాడు బొరొడిన్; లుహానీని చెప్పమన్నాడు చట్టోపాధ్యాయ; 'అవనీముఖర్జీ' అంటూ, ఆతని నేరమేమో వివరించాడు లుహానీ: "1916 లో జపాను నుండి ఇండియాకు తిరిగి వెళుతూ, బ్రిటిష్ పోలీసులకు పట్టుబడ్డాడు అవనీ; అతణ్ణి సింగపూరులో బంధించారు. జైలు నుండి తప్పించుకు పారిపోయినాడని వదంతి; కాని వాస్తవానికి అతడు తప్పించుకు పారిపోలేదు; భారత విప్లవకారుల రహస్యాలను బైట బెట్టటంవల్ల అతణ్ణి పోలీసులే విడుదల చేశారు; అవనీ ఇచ్చిన సమాచారం ఆధారంగా, రహస్యంగా ఉంటున్న అనేక మంది విప్లవకారులను పట్టుకొని, ప్రభుత్వం వారికి దీర్ఘకాలిక కారాగార శిక్ష విధించింది."

లుహానీ వాదనకు సమాధానంగా, ఏ పరిస్థితుల్లో నేను అవనీని కలుసు కొన్నదీ వివరించాను; నాకు గూడా ఆతని ప్రవర్తన అనుమానాస్పదంగా కన్పించి నట్లు కూడా చెప్పాను. "ఐనా నిర్దుష్టమైన సాక్ష్యంలేనిదే, అస్పష్టమైన అనుమా నంతో శిక్షించటం కూడని పని. అది కూడా సాధారణ శిక్ష కాదు; మరణ శిక్ష! అందుచేతనే అవనీని రక్షించాను" అని వివరించాను.

ఇది చాల బాధాకరమైన విచారణ; ఆ క్షణంలో తేలేది కాదు. అందుచే ఆ విషయాన్ని ఆపి, మా ఉభయుల మధ్యగల రాజకీయ విభేదాలను గురించి చర్చిద్దా మని సూచించాడు తావ్‌హీమర్. ప్రతినిధివర్గం తరఫున లుహానీ మాట్లాడాడు:

"టాష్కెంటులో నేర్పడిన భారత కమ్యూనిస్టుపార్టీని మేము గుర్తింపము; దాన్ని రద్దుచేయనిదే, మా మధ్యసహకారం అసంభవం". టాష్కెంటులో భారత కమ్యూనిస్టుపార్టీ ఏ పరిస్థితుల్లో స్థాపింపబడినదీ, వివరించి "ఆ పార్టీని రద్దుచేయవలసిం దని నేను సూచించినా, భారత ముజహిర్ బృందం అంగీకరింప"దని స్పష్టం చేశాను.

ఈ విషయంలో భారత ప్రతినిధివర్గం చాల పట్టుదల వహించింది. వారి తరఫున చట్టోపాధ్యాయ, ఈ విచారణ సంఘానికి ఒక శ్రీముఖం ఇచ్చాడు: "తమ కోర్కలను మన్నించనిచో, భారత విప్లవకారులు, రష్యా సహాయం లభింపదనే నమ్మకంతో మాస్కోనుండి నిష్క్రమిస్తారు."

## బాధాకరమైన అనుభవం

బెర్లిన్‌నుండి భారత విప్లవకారులు మాస్కో రావటం నాకొక బాధాకరమైన అనుభూతి అని చెప్పాను. వారిని గురించీ, భారత స్వాతంత్ర్యం కొరకు వారు చేస్తున్న కృషిని గురించీ ఇండియాలో నున్నప్పుడే ఎంతగానో విన్నాను. బెర్లిన్ వెళ్ళినప్పుడు భూపేంద్రనాథదత్తా వినా, నేను విన్న వారెవ్వరూ అక్కడ లేరు. చిరకాలంగా విదేశాలలో ఉంటున్నా, దత్తా, ఏ విప్లవ కార్యక్రమంలోనూ పాల్గొన్నవాడు కాదు; ఇండియాలో నున్నప్పుడే, 1907లో ప్రభుత్వంపై దుష్ప్రచారం చేస్తున్న నేరానికి నిర్బంధింపబడటంతో పేరులోనికివచ్చాడు. ప్రభుత్వం అతనికి రెండు సంవత్సరాల జైలు శిక్ష విధించింది. అప్పుడాతడు రహస్య విప్లవసంఘానికి చెందిన 'యుగాంతర్' అనే బెంగాలీ వారపత్రికకు సంపాదకుడుగా ఉండేవాడు. శిక్షానంతరం, తిరిగి ఆలీపూర్ బాంబు కేసులో నిర్బంధం తప్పించుకొనే ఉద్దేశ్యంతో సంయుక్తరాష్ట్రాలకు వెళ్ళాడు; భారతీయ విప్లవకారుడుగా కంటె, స్వామి వివేకానందుని సోదరుడుగానే అమెరికన్లు దత్తాను గౌరవించేవారు. ఇతర భారతీయ కాందిశీకులవలెనే, యుద్ధం ప్రారంభమైనంతనే దత్తా బెర్లిన్ వెళ్ళాడు. వివేకానందుని సోదరుడనీ, యుగాంతర్ సంపాదకుడుగా శిక్ష ననుభవించటంవల్లనూ బెర్లిన్ భారతీయులాతనికి గౌరవప్రదమైన స్థానాన్ని యిచ్చారు. 1919 చివర్లో దత్తాను బెర్లిన్‌లో కలుసుకున్నాను. అప్పుడాతని రాజకీయ అజ్ఞానానికి ఆశ్చర్యం కలిగింది. ప్రపంచ యుద్ధంలో సర్వనాశనం జరుగుచున్న క్లిష్టసమయంలో ఐరోపా నడిబొడ్డున ఉన్నాడు దత్తా. కాని యుద్ధంవల్ల గానీ, అనంతరం జరిగిన జర్మన్ విప్లవంవల్లగానీ అతడు నేర్చుకొన్నదేమీ లేదు! జర్మనీలో రాచరికవాదులనుండి అధికారం కైవసం చేసికొన్న జర్మన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీని కలుసుకొనే ప్రయత్నమే చేయలేదు దత్తా. సోషలిస్టుల వర్గపోరాట సిద్ధాంతం అతనికి వెఱ్ఱి యెత్తించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో భారతీయులు సాగించే పోరాటంలో సోషలిస్టుల కేమాత్రం సంబంధం లేదని దత్తా సిద్ధాంతం. ఇక రష్యా విప్లవ స్వభావాన్ని గుర్తింపకపోగా రాచరికవాదులైన జర్మన్ మిత్రులద్వారా బోల్షివిక్కులపట్ల ద్వేషాన్ని సంపాదించుకొన్నాడు. అందుచేతనే తన కార్యస్థానాన్ని మాస్కోకు మార్చుమనే నా సూచనను తిరస్కరించాడు. ఐనా నాకు ఆశాభంగం కలగలేదు; దత్తావల్ల ఒరిగే ప్రయోజనం శూన్యం; అతడు ఎక్కడున్నా ఒక్కటే!

చట్టోపాధ్యాయ బెర్లిన్ భారత విప్లవసంఘానికి నాయకుడు; అతణ్ణి కలుసుకోవాలని చాలా ప్రయత్నించాను. ఇప్పుడు మాస్కో వచ్చాడని తెలిసి సంతోషించాను. మంచి తెలివితేటలు, శక్తిసామర్థ్యాలూ గలవాడని ప్రసిద్ధి. వీరోపాలో ఆతని జీవితమంతా సాహసకృత్యాలతోనే గడిచింది. విప్లవ కార్యక్రమంలో నాకు చేదోడు వాదోడుగా నుండగలడని ఆశించాను. కాని ఆతడే నాపట్ల బహిరంగంగా శత్రుత్వం వహించటంతో నాకు దిగ్భ్రాంతి కలిగింది. ఐతే చట్టోపాధ్యాయ ద్వేష అసూయాలకు ప్రత్యేక కారణాలు లేవనీ, నాపట్ల ఆతని ప్రవర్తనకు యాగ్నిస్ స్మెడ్లీయే కారణమనీ క్రమంగా అర్థమైంది.

సంయుక్త రాష్ట్రాల్లో మొదట కలిసి కొన్నప్పటినుండీ, స్మెడ్లీ, అకారణంగా నాపై అసూయ ప్రదర్శింపసాగింది. నిజానికి వీరపూజ మూర్తీభవించి స్మెడ్లీ తయారైంది. భారత స్వాతంత్ర్య పోరాటాన్ని సమర్థిస్తూ, సుప్రసిద్ధ భారత విప్లవకారుల్లో ఒకర్ని ప్రేమించటమే భారతదేశంపట్ల తన విశ్వాసానికి నిదర్శనంగా భావించింది. మొదట ఆమె ఆరాధించిన భారతవీరుడు, లజపతిరాయ్ అంటూ ఉండేవారు. కాని ఆతడు చాలా వృద్ధుడు! తరువాత ఒక యువక భారతవీరుణ్ణి ఆరాధించింది. నన్ను కలిసికొనే నిమిత్తమై, భారతదేశంలోని నా మిత్రులు లాతణ్ణి అమెరికా పంపారు. ఆతడు నన్ను న్యూయార్కులో కలిసికొన్నాడు. అచటి సోషలిస్టు అనార్కిస్టు బృందాల కాతణ్ణి పరిచయం చేశాను. నాడు, వారే ఇండియా స్వాతంత్ర్యోద్యమంపట్ల సానుభూతి చూపుతూ ఉండేవారు. ఆ బృందంలోనే స్మెడ్లీ ఆ యువకుణ్ణి కలిసికొన్నది; తనకంటె వయసులో చాలచిన్నవాడు; ఐనా అతణ్ణి ప్రేమించింది స్మెడ్లీ. తరువాత నేను మెక్సికో వెళ్ళాను; ఆతడు కూడా వచ్చాడు; ఆతనిలో జాతీయ భావోద్రేకం ఎక్కువ; మెక్సికోలో నా కార్యక్రమాన్ని అభినందించలేకపోయినాడు. అమెరికాలో భారత ప్రచార కేంద్రాన్ని నెలకొల్పాలని ఆతని ఆశయం; అందుకు డబ్బు కావాలన్నాడు. మెక్సికోలోనే ఉండి విప్లవానుభవాన్నీ రాజకీయ గుణపాఠాలనూ నేర్చుకొమ్మని ప్రోత్సహించాను; నా సూచనలను తిరస్కరించి న్యూయార్కు వెళ్ళిపోవాలని పట్టుబట్టాడు. నాతో ఉంటూ ఉండగా, అతనికి ప్రతిరోజూ స్మెడ్లీ దగ్గరనుండి ప్రేమలేఖలు వచ్చేవి; న్యూయార్కు తిరిగి రావలసిందిగా ప్రార్థిస్తూ వ్రాసేది ఆ లేఖల్లో. "వయసులో నీకంటె పెద్దదైన ఆమెపై మోహం మంచిదికాద"ని చెప్పి వాణ్ణి; నా మాటలు నిర్లక్ష్యంచేసి, అమెరికా వెళ్ళాడు; ఏదో నాటకమాడి, చాల పెద్ద మొత్తమే పట్టుకు వెళ్ళాడు; ఆతడూ, స్మెడ్లీ కలిసి "ఇండియాకు స్వాతంత్ర్యంకోరే మిత్రులు" (Friends of Freedom for India) అనే సంఘాన్ని స్థాపించి, కార్యస్థానాన్ని వాషింగ్టన్‌లో నెలకొల్పారు. కొన్ని రోజులకే అమెరికా ప్రభుత్వం ఇద్దర్నీ అరెస్టు చేసింది. అధికార పూర్వకమైన యోగ్యతా పత్రాలు లేకుండానే, ఒక విదేశానికి ప్రతినిధులుగా నటిస్తున్నారనే అభియోగం

మీద! "డబ్బు పంపి మమ్ము రక్షింప"మని ప్రాధేయపడుతూ కేబుల్సు పంపారు. అర్థంలేని సాహసాలకు దుర్వినియోగ పరచటానికి నా దగ్గిర డబ్బు లేదు! చివర కా యువకుడు మరొక అమెరికన్ చిన్న దాన్ని పెండ్లిచేసి కొన్నాడు. పాపం! స్మెడ్లీ వేరొక వీరుణ్ణి వెదుక్కోవలసి వచ్చింది; చట్టోపాధ్యాయ ఆమె నాకర్షించాడు! నాటికే విప్లవకారుడుగా కీర్తిప్రతిష్ఠ లార్జించి, చట్టోపాధ్యాయ, స్మెడ్లీ ప్రేమకు యోగ్యత సంపాదించాడు. స్మెడ్లీ బెర్లిన్ వచ్చి చట్టోపాధ్యాయతో కొన్ని సంవత్సరాలు సంసారం చేసింది. ఆమే చట్టోపాధ్యాయకు నాపై నూరిపోసి ఉంటుందని నా అనుమానం! ఏమైనా, మాస్కో వచ్చిన భారత విప్లవసంఘంలో స్మెడ్లీ కాటిల్య ప్రజ్ఞ ప్రదర్శించింది; ఆమే లేకపోతే చట్టోపాధ్యాయ ప్రవర్తన మరొక విధంగా ఉండేదని నా నమ్మకం. భారతీయు లందరూ స్మెడ్లీని ద్వేషించేవారు; భారతీయుల కంటె తనకే భారతదేశాభిమానం ఎక్కువ అనే ఆమె దురహంకారమే అందుకు కారణం.

ఇక, నాయకులతో ప్రయోజనంలేదని, భారతీయుల్లోని చిన్నకారు విప్లవ కారులతో పరిచయం చేసికొన్నాను; అదీ విశ్వప్రయత్నంమీద. వీరికి రాజకీయాలతో పెద్దపరిచయంలేదు; విప్లవకారులమని చెప్పకొన్నా విప్లవాన్ని గురించి ఏ అభిప్రాయమూ లేనివారు; వీరిలో కొందరు జర్మనీలో వర్తకం సాగించేవారు; మరికొందరు వృత్తివిద్య లభ్యసించేవారు. మాస్కోవచ్చిన పని విఫలం కావటంతో వీరంతా జర్మనీకి మరలి, తమ సొంతకార్యక్రమాల్లో నిమగ్నులైనారు. వీరే నాతో చెప్పారు: చట్టోపాధ్యాయ నన్ను కలుసుకొని, పరిచయం చేసికోవాలని ఆసించినట్లూ, స్మెడ్లీ అడ్డుపడినట్లూ! స్మెడ్లీది ఒక విచిత్రమైన మనస్తత్వం. సైకోయనలిస్టుల పరిశోధనలకు బాగా పనికివచ్చే తత్వం. ఆమె ప్రభావంవల్ల చట్టోపాధ్యాయలోకూడా మానసిక వైపరీత్యాలు ప్రవేశించినై.

భారత విప్లవకారులు మాస్కో వచ్చింది; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ ప్రపంచ మహాసభకు సన్నాహాలు జరుగుచున్న సమయంలో. అప్పటికి అంతర్జాతీయ ప్రతినిధులింకా రాలేదు. ఐనా 'హోటల్ లక్స్' నిండిపోయింది; హోటల్ లక్స్ అంటే, మాస్కోలో విదేశ కమ్యూనిస్టుల విడిది. భారతీయులకుగూడా ఆ హోటలులోనే బస యేర్పాటైంది. ఐనప్పటికీ భారతీయులెవరూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని వేధిస్తున్న సమస్యలలో శ్రద్ధవహించలేదు. రష్యాకమ్యూనిస్టుపార్టీసైతం ఆంతరంగిక సమస్యలతో, ముఖ్యంగా ఆర్థిక పునర్నిర్మాణ సమస్యను గురించి సతమతమౌతోంది. నాటి చర్చలలో లెనిన్ నవ ఆర్థికవిధానమే (N. E. P.) ప్రధానాంశం. హోటల్ లక్స్‌లో భారతీయుల ప్రధాన కార్యక్రమం పచార్లుచేయటం; హోటల్లో ఉంటున్న ప్రతివ్యక్తినీ కలుసుకొని, ఇండియాలో బ్రిటిష్ దుష్పరిపాలనను గురించి వివరించటం! అది కేవలం, అయస్కారవాటికలో సూదులమ్మే ప్రవర్తన! కమ్యూనిస్టు

ఇంటర్నేషనల్ సభ్యులందరూ-రష్యన్లుగానీ, రష్యనేతరులుగానీ సామ్రాజ్యవాదాన్ని నిరసించి, వలసప్రజల స్వాతంత్ర్య పోరాటంపట్ల సానుభూతి వహించినవారే. వారిని వేధిస్తున్న సమస్య, ప్రజల స్వాతంత్ర్యాన్ని సాధించే మార్గాన్ని గురించీ, వలసప్రభుత్వ స్థానంలో నెలకొల్పబడే ప్రభుత్వ విధానాన్ని గురించీ! భారతీయ విప్లవకారు లీప్రశ్నలకు సమాధానా లీయలేకపోయినారు; ఈ సమస్యలనుగురించి వారు ఆలోచించనేలేదు. అందుచే వీరి ప్రవర్తనవల్ల భారత స్వాతంత్ర్యోద్యమ సానుభూతిపరులకు ఆశాభంగం కలిగి, క్రమంగా వీరంటే నిర్లక్ష్యం వహింపసాగారు. తమ సహజధోరణిలో భారతీయులు దీన్ని భారతదేశంపట్ల నిర్లక్ష్యంగా వ్యాఖ్యానించేవారు. ఈ పరిస్థితినే ఒకసారి, తన సహజ హాస్యధోరణిలో బొరోడిన్ వ్యాఖ్యానించాడు: "వరండాచివర 'నల్లమేఘం' కన్పించగానే, సోదర కమ్యూనిస్టు ప్రతినిధులు భయంతో తమ తమ గదుల్లోకి పారిపోయి దాక్కుంటున్నారు."

## విరోధికి సహాయం

తమ శ్రీముఖాన్ని సోవియట్ నాయకులు తిరస్కరించటంతో భారతీయ విప్లవకారులు మాస్కో విడిచి వెళ్ళారు; వీరు ఏ ప్రయోజనం ఉద్దేశించి మాస్కో వచ్చారో ఎవరికీ తెలియదు. ఐనా, భారతీయ విప్లవానికి ప్రాతినిధ్యం వహించే హక్కు నాకు లేదనీ, బెర్లిన్‌కమిటీనిమాత్రమే భారతదేశ ప్రతినిధులుగా రష్యా ప్రభుత్వం గుర్తించాలనీ వారి వాదమైనట్లు అందరికీ స్పష్టమైంది. ఇది కేవలం, తెరచి ఉన్న తలుపులను బ్రద్దలుకొట్టే అర్థంలేని ధోరణి. ఇండియాలో ఏ సంస్థకూ, ఏ ఉద్యమానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు నేను చెప్పలేదు. కేవలం వ్యక్తిగానే మాస్కో వచ్చాను; వ్యక్తిగా నేను సాగించిన విప్లవచర్యలే మాస్కోలో నాకు లభించిన స్థానానికి కారణం. అదీగాక, బెర్లిన్‌కమిటీని మాస్కోకు రమ్మని ఆహ్వానించినదే నేను. తమ కార్యస్థానాన్ని మాస్కోకు తరలించి నేను సాగిస్తున్న కృషికి బాధ్యతవహిస్తే నా శక్తికొలది వారితో సహకరిస్తానని చెప్పాను; వారి కోరికలను గాదనలేకపోవటం వల్లనే బెర్లిన్‌కమిటీ నన్ను కదలించలేకపోయింది. అందుచే తమ ఆయుధాన్ని అవనీ ముఖర్జీపై మరలించారు. కొందరు, 'చెకా' కార్యస్థానానికికూడా వెళ్ళి 'అవనీ బ్రిటిష్‌గూఢచారియనీ, అతణ్ని నేను రక్షిస్తున్నాననీ' వాఙ్మూలంకూడా యిచ్చారు. ఈ అభియోగాల ఫలితంగా టాష్కెంటునుండి అవనీని మాస్కోకు రప్పించారు. మాస్కోలో అతనిపై 'చెకా' ఒక కన్ను వేసి ఉంచటానికి వీలుంటుంది.

నళినీగుప్త, లుహానీ మాత్రమే మాస్కోలో దిగుబడి పోయినారు. త్వరలో ఇండియాకు తిరిగివెళ్ళే ప్రణాళికను నాతో చర్చించే ఉద్దేశ్యంతోనే నళినీగుప్త మాస్కోలో ఉన్నాడు. అతనిద్వారానే, ఇండియాలో ప్రాత స్నేహితులతోనూ, క్రొత్తగా కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలతోనూ పరిచయ మేర్పరచుకొన్నాను.

ఇండియాలో విప్లవ ప్రచారానికి, పశ్చిమ ఐరోపాలో ఒక కేంద్రాన్ని నెలకొల్పమని సలహా యిచ్చాడు గుప్తా.

ఇక లుహానీ, చట్టోపాధ్యాయకు సన్నిహితుడుగా కన్పించాడు. ఇండియన్ కమీషన్ తరఫున లుహానీయే వక్త; కాని, స్మెడ్లీ, చట్టోపాధ్యాయలాతనికి నాపై బాగా పురి యెక్కించారు. టాష్కెంట్‌లోని కమ్యూనిస్టుపార్టీని గురించీ, వలస ప్రజోద్యమాలను గురించిన నా సిద్ధాంత మూలసూత్రాన్ని గురించీ హేళనగా మాట్లాడే వాడు. జాతీయ స్వాతంత్ర్యపోరాటంలో నాయకత్వం వహించటానికై కార్మిక కర్షకులతో ఒకపక్షాన్ని స్థాపించాలనేదే నా సిద్ధాంతంలోని మూలసూత్రం.

లుహానీ కూడా మాస్కోలో ఉండిపోవాలని నిర్ణయించినట్లు గుప్తా చెప్పి నప్పుడు నాకు ఆశ్చర్యం కలిగింది. తరువాత కొన్ని రోజులకు బొరొడిన్ చెప్పాడు: తనను లుహానీ కలుసుకొన్నట్లూ, బెర్లిన్ సంఘంతో విసివి వారినుండి తాను విడిపో తున్నట్లు చెప్పి, తన భావి కార్యక్రమం గురించి సలహాకోరాడట! నన్ను కలుసుకొన వలసిందిగా లుహానీకి సలహా ఇచ్చాడట బొరొడిన్. దానితో లుహానీకి శృంగభంగమై నట్లైంది. "బెర్లిన్ కమిటీతో నా సంబంధాల వల్ల నన్ను రాయ్ నమ్మకపోవచ్చు; పైగా ప్రతీకారం కొరకు ప్రయత్నించవచ్చు" అన్నాడట.

"నీది కేవలం అర్థంలేని భయం; ప్రయత్నించి చూడు; నీకే ఆశ్చర్య మౌతుంది" అని బొరొడిన్ సమాధానం.

నిజంగానే లుహానీకి ఆశ్చర్యమైంది; నేనాతనికి హృదయ పూర్వకంగా స్వాగత మిచ్చాను. తాను ఇండియాకు తిరిగివెళ్ళాలని ఆశించినట్లూ, మాస్కో రావటం వల్ల ఆ అవకాశం నశించినట్లూ బాధపడ్డాడు లుహానీ. అప్ప డిక ఎవరూ చేయగలిగినది లేదు. అందుచే మాస్కోలోనే కొన్ని రోజులపాటు ఉండమని సలహా యిచ్చాను; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌కు చెందిన సమాచారశాఖలో ఉద్యోగం చూపించాను. సంతోషంతో అంగీకరించాడు.

## కాబూలులో భారత తాత్కాలిక ప్రభుత్వం రద్దు

భారతీయ విప్లవకారులు మాస్కోనుండి మరలివెళ్ళే సమయానికే, కాబూలు లోని సోవియట్ రాయబారి ఒక వర్తమానాన్ని పంపాడు. భారత తాత్కాలిక ప్రభుత్వాధిపతియైన ఒబీదుల్లా, తన సహచరులతో సహా కాబూలు విడిచి వెళ్ళవలసిందిగా ఆఫ్ఘన్ ప్రభుత్వం శాసించినదట! గత్యంతరం లేక కాన్‌స్టాంటినోపిల్ మీదుగా మక్కా యాత్ర సాగించాలని మౌలానా ఆశించాడు; రష్యా గుండా ప్రయాణం చేయటానికి అనుమతి కోరాడు మౌలానా. మక్కాలోనే తన కార్యస్థానాన్ని నెల కొల్పి అచటికి వచ్చే ముస్లిం తీర్థయాత్రికులలో బ్రిటిష్ వ్యతిరేక ప్రచారం సాగిం చాలనీ, వారిద్వారా ఇండియాతో సంబంధాలు నెలకొల్పుకొనాలనీ ఒబీదుల్లా

ప్రణాళిక. తన రాయబారి ద్వారా సోవియట్ ప్రభుత్వం ఒబీదుల్లాకు అనుమతిని అందజేసింది.

అచిర కాలంలోనే మరొక భారతీయ విప్లవకారుల ముఠా మాస్కో చేరింది. వీరిలో జఖేరియా, మహమ్మద్ ఆలీ ఉన్నారు. వీరిద్దరూ భారత తాత్కాలిక ప్రభుత్వంలో సభ్యులు. ఒబీదుల్లాకంటె ముందే కాబూలులో బయలుదేరారు. కాని టాష్కెంటునుండి ఒబీదుల్లాతో బాటు ప్రయాణంచేసి మాస్కో వచ్చారు. ఒబీదుల్లా వెంట చాలామంది వచ్చారు; వారిలో ఒక శిబ్‌నాథ్ బెనర్జీ మినహా అందరూ ముస్లిములే. శిబ్‌నాథ్ ఉపాధ్యాయ వృత్తి నవలంబించే ఉద్దేశ్యంతో కాబూలు వచ్చాడట! ఇదే సమయానికి అబ్దుల్ రాబ్-ఆచార్య ముఠాకూడా టాష్కెంట్ నుండి మాస్కోకు మకాం మార్చారు. కాబూలులోనే ఇద్దరూ దెబ్బలాడుకున్నారు; ఇప్పటికీ అదే ధోరణిలో ఉండటంచేత చెరియొకచోట బస యేర్పాటు చేయవలసివచ్చింది.

ఆఫ్ఘన్ రాజైన అమనుల్లాకూ, బ్రిటిష్ వారికీ చాలా సంప్రదింపులు జరిగి, చివరకు వారిమధ్య సమాధానం కుదిరింది. బ్రిటిష్ వారి కోరికపై, భారతీయ విప్లవకారులను ఆఫ్ఘనిస్థాన్ విడిచి వెళ్ళవలసిందిగా అమనుల్లా ఆజ్ఞాపించినట్లు ఒబీదుల్లా వివరించాడు. ఒబీదుల్లా కథను బలపరిచాడు కాబూలులోని రష్యన్ రాయబారి. అచిర కాలంలోనే సోవియట్ రాయబారిని కూడా తనదేశంనుండి వెళ్ళిపోవలసిందిగా కోరాడు అమనుల్లా; ఇది ఎవ్వరూ ఊహించని హటాత్పరిణామం! నాటివరకూ అమనుల్లా సోవియట్ ప్రభుత్వంతో మైత్రి నటించాడు; సోవియట్ ప్రభుత్వంకూడా అతనికి అన్నివిధాలా సహాయం చేస్తున్నది. సోవియట్ రాయబారి రస్కాల్నికావ్, ఆతని భార్యా లారిస్సారీస్నన్ తమ ప్రజ్ఞావిశేషాలతో, సామర్థ్యంతో ఆఫ్ఘన్ రాజ దంపతుల మైత్రీ విశ్వాసాలను చూరగొన్నారు. అంతఃపురంలో జరిగే వినోదాలకు కూడా రస్కాల్నికావ్ దంపతులను ఆహ్వానించేవారు. ఆ సమయాల్లో ఆఫ్ఘన్ రాణి సురయా పరదా ధరించేది కాదట! లారిస్సా తన నృత్య ప్రదర్శనలతో అమనుల్లాకు ఉల్లాసం కలిగించేది; లారిస్సా మంచి అందగత్తెగాక, గొప్ప రచయిత్రిగా, నాట్యంలో ప్రజ్ఞావంతురాలుగా పేరు పొందింది. ఇటువంటి ఉల్లాసకరమైన సమయాల్లో ఒకసారి రస్కాల్నికావ్ అమనుల్లాను అడిగాడట:

"బోల్షివిజాన్ని గురించి, మీ భావాలేమిటి? భూస్వామ్య పెట్టుబడిదారీ విధానాలను ఖండించే బోల్షివిజం అంటే మీకు భయం లేదా?"

అమనుల్లా నవ్వుతూ అన్నాడు.

"మాకేం భయం లేదు; నిజం చెప్పాలంటే నేనూ బోల్షివిక్కునే!" రస్కాల్నికావ్, తన మాటను పరిహాసంగా పరిగణించినట్లు గమనించి, అతని చెవిలో అమనుల్లా అన్నాడట రహస్యంగా.

"నేను అన్నదాంట్లో అసత్యం లేదు; నేను మా తండ్రిని చంపి సింహాసన మెక్కాను!"

అమనుల్లా కుతంత్రంతో బ్రిటిష్ ప్రాబల్యం ఆఫ్ఘనిస్థాన్‌లో పునరుద్ధరింప బడటం, లెనిన్ మినహా రష్యాలో అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. లెనిన్ మాత్రం ఈ పరిణామాలను ఎప్పుడో ఊహించాడు. మధ్యఆసియాకు బయలుదేరే ముందు అనేక విషయాలపై లెనిన్‌తో సంభాషణలు జరిపాను. ఒక సందర్భంలో ఆఫ్ఘన్ ప్రభుత్వ విధానాలను గురించి చర్చ జరిగింది. నా ప్రణాళికా విజయానికి ఆఫ్ఘన్ ప్రభుత్వ సహకారమూ, సానుభూతీ అవసరం. లెనిన్ అడిగాడు :

"ఆఫ్ఘన్ ప్రభుత్వం సహాయం చేస్తుందనే నమ్మకం యేమిటి?"

"అమనుల్లా బ్రిటిష్‌వారితో తగాదా పడ్డాడు; అతనికి సోవియట్ సహాయం అవసరం గదా" అన్నాను.

"కానీ, ఆఫ్ఘనిస్థాన్ బ్రిటిష్ సామ్రాజ్యానికి కీలకస్థానం; అంత సులభంగా దాన్ని వారు విడిచిపెట్టరు; తిరిగి సంపాదించటానికి విశ్వప్రయత్నం చేస్తారు."

"ఆ ప్రయత్నాల స్వభావం?" అని అడిగాను.

"అమనుల్లా కోటలో బ్రిటిష్‌వారు వెండి బంగారు గుండ్ల వర్షాన్ని కురిపిస్తారు."

"ముందుగా, మనమే ఆ అస్త్రాన్ని ప్రయోగిస్తే?"

"అసంభవం. ఆసియా రాజాస్థానాలలో లంచాలు కురిపించి వానిని వశ పరచుకొనటంలో బ్రిటిష్‌వారితో సోవియట్ ప్రభుత్వం పోటీ చేయలేదు. సువిశాల మైన వలస సామ్రాజ్యం నుండి బ్రిటన్ పొందుతున్న అదనపు లాభాల ముందు జారుల నిక్షేపాలు నామమాత్రం!"

లెనిన్ సమాధానం నచ్చకపోలేదు; కాని అది కేవలం నిరాశావాదమని పొరబడ్డాను. లెనిన్ రాజకీయ పరిజ్ఞానాన్ని చరిత్ర రుజువు చేసింది.

# రష్యా రాజకీయాలలో

## రైతులపై యుద్ధం - విప్లవ తిరోగతి

బెర్లిన్ భారతీయ విప్లవసంఘం మాస్కో రావటం భారతీయ విప్లవకారులను గురించిన నాకలలు భగ్నంకావటమేగాక, మూడవ ప్రపంచ మహాసభా సన్నాహాలలోనూ, రష్యా క్లిష్టపరిస్థితిని గూర్చిన చర్చల్లోనూ పాల్గొనటానికి నాకు ఆటంకమైంది. "యుద్ధ కమ్యూనిజం" వల్ల రష్యాలో కలిగిన దుష్ఫలితాలూ, నష్టాలూ, ట్రాట్స్కీ చర్యలతో వెర్రితలలు వేయసాగినై. పెట్టీబూర్జువా అరాజకత్వాన్ని నిర్మూలించి సైనిక నియంతృత్వం ద్వారా శాంతి నెలకొల్పాలని ట్రాట్స్కీవాదులు ప్రయత్నాలు ప్రారంభించారు.

### యుద్ధ కమ్యూనిజం

రష్యాలో 1920 నాటికి, అంతర్యుద్ధం ముగిసి, క్రొత్తప్రభుత్వం విజయం సాధించింది. అనంతరం, దేశ ఆర్థిక పునర్నిర్మాణ విధానాలను గురించీ, సాధనాలను గురించీ బోల్షివిక్ పార్టీలో తీవ్రమైన అభిప్రాయభేదాలు తలెత్తినై; విప్లవం భూమిని రైతులకు పంచిపెట్టింది; కాని సోవియట్ ప్రభుత్వంచేసిన మొదటి శాసనాల్లో ఒకటి భూమిని జాతీయం చేసింది. ఇంకా పరిశ్రమల జాతీయకరణ జరగలేదు. కాని, ఒక్కొక్క కర్మాగారంపై శ్రామికుల యాజమాన్యాన్ని (Control) నెలకొల్పుతూ ప్రత్యేకంగా శాసనాలు చేయబడినై. ఇది జరిగిన అనతికాలానికి ఇతర కర్మాగారాలలో యజమానులూ, ఉద్యోగులూ (Managers) శ్రామికులకూ మధ్య తగాదాలు ప్రారంభమైనై. ఈ తగాదాలలో కొన్ని ఫ్యాక్టరీలను కార్మికులు వశపరచుకొన్నారు. అంతేగాని పరిశ్రమలు మొత్తాన్ని జాతీయం చేయటానికి అనుకూలించే పరిస్థితులేర్పడలేదు. నాటివరకూ రష్యాది వ్యవసాయ ఆర్థిక విధానమే; వ్యవసాయ పరిశ్రమ అనే మహాసముద్రంలో దీవుల్లాగా కన్పించేవి భారీపరిశ్రమలు! ఆ పరిశ్రమలు సైతం అంతర్యుద్ధం జరిగిన రెండు సంవత్సరాలలోనూ బాగా దెబ్బతిన్నై. ఇట్టి పరిస్థితుల్లో, ఫ్యాక్టరీలను కార్మికులు వశపరచుకొనటాన్ని ఖండించింది బోల్షివిక్ పార్టీ; అది అరాజక సిండికలిస్టు విధానమని వారి అభిప్రాయం! సోవియట్ ప్రభుత్వ మేర్పడిన సంవత్సరానికి అఖిల రష్యా ఆర్థిక సంఘాల మహాసభ (All Russian Congress of Economic Councils) సమావేశమై, కార్మికులు స్వయంగా ఫ్యాక్టరీలను వశపరచుకొనే విధానాన్ని ఖండిస్తూ తీర్మానించింది.

అంతర్యుద్ధంవల్ల రాకపోకల సౌకర్యాలు చిందరవందరై, వర్తకం స్తంభించి పోవటంతో పల్లె ప్రాంతాలకూ నగరాలకూ మధ్య సంబంధాలు పూర్తిగా విచ్ఛిన్న మైనై; నగరాల్లో ఆహార పదార్థాల కొరత నానాటికీ మితిమీరిపోయింది; నగరాలన్నీ ఆర్థిక దిగ్బంధంలో నున్నట్లు కన్పించినై. ఆ నగరాలనుండి సాయుధులైన కార్మిక ముఠాలు బయలుదేరి సమీపగ్రామాలపైబడి, ధనిక రైతులదగ్గిరనున్న నిల్వధాన్యాలను దోపిడీ చేయసాగారు. పేదరైతులు కూడా కార్మికులలో చేరి ధనికులపై దండయాత్ర చేశారు. ఈ పరిణామాలు భూమిని జాతీయం చేయటంవల్ల నేర్పడినవే! "భూమి జాతి అంతకూ చెందిన ఆస్తి; దాని ఫలసాయం అందరికీ చెందవలసినదే. కొత్త ప్రభుత్వం పైసూత్రాన్ని పూర్తిగా అమలు జరపలేకపోతున్నది; ఇది కార్మిక రాజ్యం! విప్లవ నాయకులు కార్మికులే!" ఇదీ నాటి ఆలోచనాక్రమం. దాని ఫలితంగా న్యాయం, చట్టం, కార్మికుల హస్తగతమైనై. ఆ చట్టాన్నే కార్మికులు అమలు జరపబూనుకున్నారు. ఐతే, ఇది కేవలం రైతులపై యుద్ధంగా పరిణమించింది. అందుచేతనే ఇది యుద్ధకమ్యూనిజమని ప్రసిద్ధి చెందింది.

ఉక్రెయిన్‌లోనూ, జర్మను లాక్రమించిన దక్షిణ రష్యాలోనూ యుద్ధకమ్యూనిజం చురుకుగా విస్తరించి, క్రమంగా అన్ని ప్రాంతాలకూ వ్యాపించింది. దాని ప్రభావంవల్లనే సోవియట్ ప్రభుత్వం పరిశ్రమలను జాతీయంచేస్తూ శాసనాన్ని జారీ చేసింది. కాని యుద్ధకమ్యూనిజంతో, నగరాల ఆర్థిక ఇబ్బందులు తీవ్రతరమైనై. ధనిక రైతులు విధ్వంసక చర్యలకు పూనుకొన్నారు; ప్రభుత్వానికి అప్పగించటానికి బదులు, తమ గాదెల్లోని మిగులు ధాన్యాలను తగలబెట్టారు; వందలకొలది పశువులను వధించారు; వేలకొలది యకరాల పంటపొలాలను బీడుపెట్టారు. ఈ చర్యల ఫ లితంగా దేశమంతటా క్షామం తాండవించసాగింది. ఆచరణ సాధ్యమైనా, కా పోయినా, పార్టీలో అసంఖ్యాకంగా చేరిన శ్రామిక మహాప్రవాహ ప్రభావంవల్ల, ప్రభుత్వానికి జాతీయకరణ శాసనం చేయక తప్పలేదు. 1918 - 20ల మధ్య రెండు సంవత్సరాలలో బోల్షివిక్ పార్టీ సభ్యత్వం రెండు లక్షలనుండి 16 లక్షలకు పెరిగి పోయింది!

## కార్మికులకు సైనిక శిక్షణ

ఈ పరిణామానికి ప్రతికూలంగా ట్రాట్స్కీ మరొక ప్రయత్నం ప్రారంభించాడు. అంతర్యుద్ధంలో పోరాడిన చెదురు మదురు గెరిల్లా దళాలను సమైక్యం చేసి క్రమశిక్షణ గల గట్టి సైన్యంగా తయారు చేశాడు. ఈ సైన్య ప్రమాణం నానాటికీ పెరిగింది. అంటే, రష్యాలోని మానవ శక్తి క్రమంగా ట్రాట్స్కీ చెప్పుచేతుల్లోకి రాసాగింది. ఏదో విధంగా సైన్యంతో సంబంధ మున్న శ్రామికు లందరికీ కఠినమైన శిక్షణ ఈయబడింది; క్రమంగా కార్మిక సంఘాలన్నీ సైనికమైన క్రమశిక్షణకు

బద్ధమైనై. ఐతే, క్రొత్తగా తాము సాధించిన స్వేచ్ఛకు ఆటంకమని గ్రహించి శ్రామికులీ విధానాన్ని నిరసింపసాగారు. "అంతర్యుద్ధ కాలంలో, క్రొత్త ప్రభుత్వం చావు బ్రతుకుల్లో నున్నప్పుడు, అత్యాయిక చర్యలకు కార్మికులు తల నొగ్గారు; అంతర్యుద్ధం ముగిసిన తరువాత ఆ విధానాల అవసరం లేదు" అనే భావంతో బోల్షివిక్ పార్టీలోని వృద్ధులు, ప్రజాస్వామ్యానికి విరుద్ధమైన కేంద్రీకరణ విధానాలను ఎదిరించారు; పార్టీలోని శ్రామిక సభ్యులు వారిని బలపరచారు. ఇట్టి పరిస్థితిలో రష్యా విప్లవానికి ట్రాట్‌స్కీ, నెపోలియన్ బోనపార్టీ కాగలడేమోనని చాల మంది భయపడ్డారు. వారి భయాందోళనలు కూడా సహేతుకమైనవే. రెడ్ ఆర్మీలో వేలకొలది జారిస్టు అధికారులను చేర్చుకొన్నాడు ట్రాట్‌స్కీ! ట్రాట్‌స్కీ చర్యలను, వామపక్ష కమ్యూనిస్టులు తీవ్రంగా ఖండించారు. వీరి నాయకుడు బుఖారిన్ "శ్రామిక-కర్షక గణరాజ్యానికి కేంద్రీకృతమైన సైన్యం అనవసరం; అత్యంత క్లిష్ట పరిస్థితుల్లోనే ఈ గణరాజ్యాన్ని కేవలం గెరిల్లా దళాలు రక్షింపగల్గినై; ఇప్పుడు క్రమశిక్షణ అనే సాకుతో విప్లవాన్ని కాపాడిన వీరుల స్వాతంత్ర్యాన్ని హరిస్తున్నారు" అని వారి వాదన.

అంతర్యుద్ధంలో బోల్షివిక్ ప్రభుత్వానికి ట్రాట్‌స్కీ అపూర్వమైన సేవ చేశాడు. అది గుర్తించే, ట్రాట్‌స్కీ సామ్రాజ్య దాహాన్ని నిరసించిన వారిని తృప్తి పరచటానికనేక విధాల ప్రయత్నించాడు లెనిన్. తీవ్ర అభిప్రాయభేదం వచ్చినప్పుడల్లా ట్రాట్‌స్కీ సూచనలను త్రోసిపుచ్చేవాడు; రెడ్ ఆర్మీలో కీలకస్థానాలలో ప్రముఖులైన పార్టీ సభ్యులనే నియమించాడు. అదీగాక, తూర్పురంగంలో ట్రాట్‌స్కీ ఉన్నప్పుడే లెనిన్ అతనికొక తాఖీదు పంపాడు: "రెడ్ ఆర్మీలోని జారిస్టు అధికారులనూ, సాంకేతిక నిపుణులనూ తొలగించి సైనికానుభవం గల పార్టీ సభ్యులనే ఎందుకు నియమింపకూడదు?" లెనిన్ సూచనను "కేవలం ఆకతాయితనం" అంటూ వర్ణించాడు ట్రాట్‌స్కీ. అది తలబిరుసు తనమే! కాని తన తలబిరుసు దనాన్ని సమర్థించుకొంటూ, ట్రాట్‌స్కీ అన్నాడు: "ఇప్పటికి రెడ్ ఆర్మీలో ముప్పది వేలమంది జారిస్టు అధికారులున్నారు; వారిని తొలగించటం అంటే రెడ్ ఆర్మీని రద్దుచేయటమే! అది సాధ్యమేనా?"

జర్మనీలో విప్లవం విజయం పొందుతుందనీ, విప్లవ జర్మనీ సాంకేతిక సహాయంతో రష్యా ఆర్థిక పరిస్థితి చక్కబడగలదనీ లెనిన్ ఆశించాడు. జర్మనీలో విప్లవం పరాజయం పొందటంతో ఆ ఆశలు అడియాసలైనై. తరువాత, 1920 డిసెంబరులో జరిగిన ఎనిమిదవ సోవియట్ల మహాసభ లెనిన్ ప్రణాళికను బలపరిచింది. అందులో;
(1) పారిశ్రామిక పునర్నిర్మాణానికి ప్రాతిపదికగా విద్యుచ్ఛక్తి విస్తరణ జరగాలి;
(2) సైన్యం నుండి బర్తరఫ్ ఐన సైనికులకై క్రొత్త పరిశ్రమలు నెలకొల్పాలి;
(3) విప్లవం కొరకు పోరాడిన రైతు యువకులను క్షామం తాండవిస్తున్న గ్రామాలకు

వెళ్ళనీయ కూడదు; (4) వారితో శ్రామిక దళాలను నిర్మించి పనివారి కొరత ఉన్న ప్రాంతాలకు పంపాలి అని లెనిన్ సూచించాడు. లెనిన్ చివరి సూచనయే, శ్రామికులను సైనికంగా తయారు చేసే కార్యక్రమంలో ట్రాట్‌స్కీకి ఉపకరించింది. ఎఱ్ఱసైన్యం, శ్రామిక సైన్యంగా రూపొందాలి అనేది లెనిన్ ఉద్దేశ్యం. కాని, దేశంలోని మానవ శక్తి సర్వస్వాన్ని కేంద్రీకృతమైన సైన్యానికి అనుబంధంగా మాత్రమే ఉంచాలని ట్రాట్‌స్కీ ప్రణాళిక! "దేశంలో పదకొండు లక్షల మంది శ్రామికులున్నారు; కాని వారిలో ఎనిమిది లక్షల మంది మాత్రమే పనిలో ఉన్నారు; మిగిలిన 3 లక్షల మంది సంగతి ఏమిటి? సైనిక పరిభాషలో వీరందరూ పిరికిపందలే! అందుచేత సైనికుల వలెనే శ్రామికులకు గూడా విధి నిర్వహణలో నిర్బంధన అవసరం. తమ ధర్మాన్ని శ్రామికులు నిర్వహించేటట్లు, వారిని కార్మిక సంఘాలు సమీకరించాలి" అని ట్రాట్‌స్కీ వాదించేవాడు.

ట్రాట్‌స్కీ వాదనలో ఆర్థికంగా నిగూఢమైన అంతరార్థం లేకపోలేదు. నాడు, పార్టీ అంతరంగిక వర్గాలలో లెనిన్ తన నవ ఆర్థిక విధానాన్ని (N. E. P.) ప్రచారం చేస్తున్నాడు. దాన్ని తిరస్కరించటమే ట్రాట్‌స్కీ వాదనలోని ఆంతర్యం! యన్.యి.పి.ని 1921 వేసవిలో పార్టీ ఆమోదించింది. ఇక, ట్రాట్‌స్కీ సిద్ధాంతంలోని మూలసూత్రం "ఉత్పత్తికి ప్రథమ స్థానం ఇవ్వాలి" అనేది. అంటే దేశ ఆర్థిక పునర్నిర్మాణం భారీపరిశ్రమలతో ప్రారంభం కావాలి; భారీపరిశ్రమలలోనే ఉత్పత్తి సాధనాలు తయారౌతవి; ఉత్పత్తి సాధనా లున్నప్పుడే, ప్రజానీకానికి అవసరమైన వినిమయ వస్తువులను ఉత్పత్తి చేయగలము" అని ట్రాట్‌స్కీ సిద్ధాంతం. ఏమైనా, శ్రామిక వర్గాన్ని సైనికంగా తర్ఫీదు చేయటం ద్వారా రష్యా ఆర్థిక పునర్నిర్మాణం జరగాలనే ట్రాట్‌స్కీ ప్రణాళిక ఫలప్రదం కాలేదు. సైన్యం నుండి విముక్తి బడసిన మరుక్షణమే సైనికులు స్వగృహాలకు పరుగెత్తారు!

## మాస్కో సోవియట్ సభ్యత్వం

రాజకీయ, ఆర్థిక రంగాలలో వివాదగ్రస్తములైన సమస్యలను చర్చించి పరిష్కరించే ఉద్దేశ్యంతోనే బోల్షివిక్ పార్టీ పదవ మహాసభ ఏర్పాటైంది; ఈ సభా నిర్ణయాలను, రానున్న కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ ప్రపంచ మహాసభ ఆమోదించాలి. అందుచే, ఈ రెండు సభలకు నాందీగా రష్యాలో పై సమస్యలను గురించి బహిరంగంగా చర్చలు జరిగినై. ఈ చర్చలకు, మాస్కోలో వుంటున్న, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంలోని రష్యేతర సభ్యులను కూడా ఆహ్వానించారు. వీరు, తమ తమ దేశాల్లో కూడా విప్లవం కనుచూపుమేరలో నున్నదనీ, రష్యన్ శ్రామిక వర్గం మరికొంత కాలం ఓపిక పట్టినచో, ప్రపంచ విప్లవంతో వారి కష్టాలు గట్టెక్కగలవనీ రష్యన్ శ్రామిక వర్గానికి ధైర్యం చెప్పారు. వీ రెంత చెప్పినా, 1918లో

జర్మన్ విప్లవ పరాజయమూ, తరువాత వార్సా దగ్గిర రెడ్ ఆర్మీ పరాజయమూ ప్రపంచ విప్లవాన్ని గురించిన కలలను భగ్నం చేసినై; బోల్షివిక్ పార్టీలోనూ, రష్యా విప్లవంలోనూ వచ్చిన క్లిష్టపరిస్థితికీ ఆ ప్రమాదాలే కారణమైనై.

పశ్చిమరంగంలో కలిగిన ఆశాభంగంవల్ల, రష్యా శ్రామికవర్గం తూర్పు రంగంపై ఆశాదృష్టుల్ని మరలించింది. అందుచే, బహిరంగసభలలో నా ఉపన్యాసాలకు కరతాళ ధ్వనులెక్కువైనై! నాది, అర్థంలేని గాలిమేడలకు దోహదం చేసే స్వభావం కాదని తెలిసి కూడా, సభలలో మాట్లాడవలసిందిగా నన్ను కోరేవారు; బోల్షివిక్ పార్టీ నాయకులనూ, ఇతర ఆలోచనాపరులనూ కలవరపరుస్తున్న సమస్యలను గురించి మాత్రమే మాట్లాడేవాణ్ణి. బోనపార్టిస్టు విధానాలను సమర్థిస్తూ, యుద్ధ కమ్యూనిజాన్ని కొనసాగించవలెననే ట్రాట్స్కీ సిద్ధాంతాన్ని ఎదిరిస్తున్న వామపక్ష కమ్యూనిస్టులపట్లనే సానుభూతి వహించాను. నాటి వామపక్ష కమ్యూనిస్టుల పలుకుబడికి నిదర్శనంగా, నన్ను మాస్కో సోవియట్‌కు రెండు కీలక నియోజక వర్గాలనుండి ఎన్నుకొన్నారు: ఒకటి ప్రెస్ పనివాండ్ర సంఘమూ; రెండవది క్రాస్నా ప్రెస్నియా జిల్లా; 1917 లో ప్రథమంగా తిరుగుబాటు చేసిన గౌరవం క్రాస్నా ప్రెస్నియాదే!

పార్టీ సభత్వాన్ని గురించిన చర్చలకు గూడా హాజరైనాను. ఈ సందర్భంలోనే వామపక్ష కమ్యూనిస్టు వర్గనాయకుడైన బుఖారిన్‌తో సన్నిహితత్వమేర్పడింది. బోల్షివిక్ నాయకు లందరిలో మిక్కిలి ప్రేమపాత్రుడు బుఖారిన్; వయసులో చిన్నవాడైనా, కమ్యూనిస్టు సిద్ధాంత సమన్వయంలో లెనిన్ తరువాత లెనిన్ అంతవాడుగా అతణ్ణి గౌరవించేవారు; లెనిన్ కూడా బుఖారిన్‌ను తన మానసపుత్రుడుగా చూచేవాడు. వామపక్ష కమ్యూనిజంతో లెనిన్ ఏకీభవించలేదు; ఐనా బుఖారిన్ పట్ల ఎంతో నిదానంగా వ్యవహరించేవాడు. ఇక, నేనంటే లెనిన్ వాత్సల్యం పదర్శించేవాడు. వివాదగ్రస్తములైన అనేక విషయాలను ఆంతరంగికంగా మా యిద్దరితో చర్చించేవాడు. ఒక్క విషయంలో మాత్రం తాను వామపక్షీయులతో నేకీభవించాడట; అది: దేశంలోని మానవశక్తి నంతటినీ సైనికంగా రూపొందించి సైన్యాన్ని పార్టీకంటె బలవత్తరం చేయాలనే ట్రాట్స్కీ ప్రణాళికను ఖండించటంలో!

ఈ ఆంతరంగిక సమాలోచనల్లోనే, ట్రాట్స్కీకి వ్యతిరేకంగా, స్టాలిన్‌ను బలపరుస్తున్నాడు లెనిన్ అని గ్రహించాను. నాటికి, పార్టీ అధిష్ఠానవర్గాలలో మినహా, స్టాలిన్ పేరు ఎవరికీ తెలియదు. రెండు సంవత్సరాల తరువాతగానీ 'వారసత్వపు తగాదా' ప్రారంభం కాలేదు. ఐనా, పార్టీ అగ్రనాయకులలో నీ సమస్యను గురించి భయాందోళనలు కన్పించేవి. అనేక సంవత్సరాలపాటు, ఐరోపా ప్రవాసంలో లెనిన్ సహచరుడు జినోవీవ్; అందుచే సహజంగా తానే లెనిన్ వారసుడననే నమ్మకంతో ఉన్నాడు జినోవీవ్. అదీగాక కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ అధ్యక్ష పదవికి

ఎన్నిక కావటంలో జినోవీవుకు లెనిన్ సాయం చేశాడు. జినోవీవ్ నమ్మకాస్నీ సంఘటన బలపరిచింది. ఐనా, మొదటినుండీ, ట్రాట్స్కీ, స్టాలిన్ లిద్దరూ జినోవీవ్ ప్రత్యర్థులు; కాని ట్రాట్స్కీ, స్టాలిన్లు, ఒకరికొకరు బలమైన ప్రత్యర్థులు; ఉభయులూ నియంతృత్వవాదులే! అంతర్యుద్ధంవల్ల నేర్పడిన అరాజకతను నిర్మూలించి శాంతిభద్రతలు పునరుద్ధరించటానికి సైనిక నియంతృత్వం అవసరమంటాడు ట్రాట్స్కీ; పార్టీ నియంతృత్వం కావాలంటాడు స్టాలిన్!

స్టాలిన్ శక్తిసామర్థ్యాలలోనూ, నిర్ణయాలలోనూ మెన్కు అపారమైన విశ్వాసం ఉండటం గ్రహించిన మీదట, స్టాలిన్తో పరిచయం సంపాదించటానికి ప్రయత్నించాను; అందుకు అవకాశం కూడా లెనినే కల్పించాడు. వలసరాజ్యాల్లోని పరిస్థితులను గురించీ, టర్కీస్థాన్ బ్యూరో చర్యల ను గురించీ, మూడవ ప్రపంచ మహాసభకు నివేదికను సమర్పించే బాధ్యత నాపై నుంది. నివేదికలోని అంశాలను లెనిన్తో చెప్పాను. రెండవ మహాసభ తరువాత, మా ఇద్దరిమధ్య వలస జాతీయోద్యమాల విప్లవ స్వభావ సామర్థ్యాలను గురించిన అభిప్రాయభేదాలు చాలవరకు తగ్గిపోయినై. కానీ గాంధీని గురించి మాత్రం మాకింకా ఏకాభిప్రాయం లేదు. రష్యాలో అప్పుడప్పుడే గాంధీ పేరు వినిపింప సాగింది. మధ్యయుగ ఐరోపాలోని తిరుగుబాటు దారులవలె (Heretics) గాంధీకూడా విప్లవకారుడేనని లెనిన్ అభిప్రాయం. గాంధీని, మధ్యయుగ తిరుగుబాటుదార్లతో పోల్చటం తగదనీ ఆర్థిక సాంఘిక సమస్యలపై గాంధీ భావాలు కేవలం ప్రతీపగామి భావాలని నా అభిప్రాయం. సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న గాంధీ, విప్లవాత్మకమైన పాత్రనే నిర్వహిస్తున్నాడని లెనిన్ వాదన. "రాజకీయంగా పురోగాములు, సాంఘికంగా తిరోగాములు" అంటూ ప్లెఖనావ్ వర్ణించిన రష్యన్ సాంఘిక విప్లవకారుల మార్గానికీ గాంధీ పంథాకీ వ్యత్యాసం లేదని వివరించాను. మా అందరికీ గురువు లెనిన్; అందుచే సందేహాలు తీర్చుకొనే శిష్యుని ధోరణిలో అడిగాను: "తిరోగామి సాంఘిక భావాలతో, మూఢమతవిశ్వాసాల భారంతో సాగుచున్న సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం ప్రగతిశీలం కాగలదా?" నా అనుమానంలోని సత్యాన్ని లెనిన్ గమనించాడు; కాని అనుభవంతో గాని, ఏదీ నిర్ణయింప రాదనే భావంతో నా అభిప్రాయంతో ఏకీభవించటానికి నిరాకరించాడు.

మూడవ ప్రపంచ మహాసభకు నేతయారుచేసిన నివేదికలో కొన్ని సూచనలు చేస్తూ, స్టాలిన్తో చర్చించవలసినదిగా లెనిన్ సూచించాడు. నాడు, రష్యాలో జాతుల సమస్యలపై మంత్రిగా ఉన్నాడు స్టాలిన్ (Commissar of Nationalities). అతణ్ణి వలస రాజ్య ఉద్యమాల సమస్యపై అధికారిగా పరిగణించేవారు. నేను కలుసుకొన్నప్పుడు స్టాలిన్కి జబ్బుగా ఉంది; తిరిగి సంవత్సరానికి గాని కలుసుకోలేక పోయినాను; ఈలోగా, లెనిన్ ఎన్నికపై పార్టీ కార్యదర్శియైనాడు స్టాలిన్.

## క్రాన్‌స్టాడ్ తిరుగుబాటు

మానవ శక్తిని సైనికంగా రూపొందించాలనీ, సోషలిస్టు వ్యవస్థలో కార్మిక సంఘాలకు స్వతంత్ర బాధ్యత ఉండవనీ అందుచే నవి ప్రభుత్వ యంత్రాంగంలో లీనమైపోవాలనీ ట్రాట్స్కీ సిద్ధాంతం. ఈ సిద్ధాంతం కార్మికుల్లో అలజడికలిగించి సమ్మెలకు దారితీసింది. 1921 మార్చి I వ తేదీన క్రాన్‌స్టాడ్ చెంత యుద్ధ నౌకల్లోని నావికులు సమ్మె చేశారు; అచటి సైన్యంకూడా తిరుగుబాటు ప్రారంభించింది. వారందరూ ఒక బహిరంగసభ నేర్పరచి, అందులో పార్టీలోని వ్యతిరేక వర్గాల కోరికలతో ఒక కార్యక్రమాన్ని తయారు చేశారు. నియంతృత్వ విధానాలపై, అసంతృప్తులైన కార్మిక-కర్షక ప్రజానీకం జరిపిన తిరుగుబాటు కా కార్యక్రమమే నిదర్శనం! అందులోని ముఖ్యమైన కోరికలు : (1) కార్మిక సంఘాలకు స్వాతంత్ర్యం; (2) సొంత సాధనాలతో వ్యవసాయం చేసికొనే రైతులకు భూమిపై హక్కు; (3) స్వశక్తితో వస్తూత్పత్తికి (Crafts-Production) హక్కు. ఈ కోరికలలో ఆలోచనాపరులైన మధ్య తరగతి భావాల ప్రభావం స్పష్టంగా కన్పిస్తుంది.

క్రాన్‌స్టాడ్ తిరుగుబాటును బోల్షివిక్ పార్టీ, సోవియట్ ప్రభుత్వాలు, విప్లవ వ్యతిరేకోద్యమంగా ఖండించినై; ఫిన్‌లాండ్‌లో తలదాచుకొంటున్న విప్లవ వ్యతిరేక వర్గాల నాయకులు (White-Guard Generals) నడిపిన తిరుగుబాటుగా వర్ణించారు. అట్టి ప్రమాదకరమైన ఉద్యమంతో రాజీ అసంభవం! సైనిక సహాయంతో తిరుగుబాటు నణచివేయవలసిందిగా ప్రభుత్వం ఉత్తర్వుచేసింది; ఆ ఉత్తర్వును పార్టీ బలపరిచింది. కాని ఈ సంఘటనలోని విశిష్టతను మాత్రం అందరూ గుర్తించారు. ఆ తిరుగుబాటు ఒక హెచ్చరిక! సరిగా, మూడు సంవత్సరాలకు పూర్వం అక్టోబర్ విప్లవానికి చిహ్నంగా క్రాన్‌స్టాడ్ నావికులే విప్లవ ధ్వజాన్ని ప్రతిష్ఠించారు. ఇప్పుడా నావికులే, అసంఖ్యాకులైన శ్రామికుల సహాయంతో, విప్లవ ప్రభుత్వంపై తిరుగుబాటు చేస్తున్నారు. ఇది కేవలం చెదురుగా జరుగుచున్న తిరుగుబాటని త్రోసి పుచ్చటానికి గూడా వీల్లేదు. క్రాన్‌స్టాడ్ కార్యక్రమం, ప్రజల్లో విస్తరించుచున్న అసంతృప్తికి దర్పణం వంటిది! ప్రభుత్వ మీ తిరుగుబాటును సులభంగానే అణచివేసింది. కాని ప్రజానీకంలో వ్యాపిస్తున్న అంటువ్యాధిని నిర్మూలించటానికి తీవ్రతరమైన చర్య అవసరమని గుర్తించింది.

## నవ ఆర్థిక విధానం - రైతు స్వాతంత్ర్యం

నవ ఆర్థిక విధానాన్ని (N. E. P,) ఆమోదించవలసినదిగా బోల్షివిక్ పార్టీని కోరాడు లెనిన్; యుద్ధకమ్యూనిజం కల్పించిన భయంకర క్లిష్టపరిస్థితికీ, భీభత్సానికీ అదొక్కటేవిరుగుడని లెనిన్ విశ్వాసం! ఆ విధానాన్నిగురించి, ముందుగానేపార్టీ అధిష్టాన వర్గాలతో చర్చలుజరిపాడు. వాస్తవానికియన్.యి.పి.ద్వారా ఆర్థికరంగంలోతిరోగమ

నాన్నే సూచించాడు; ఇది రాజకీయరంగంలో అలజడికి దారితీయవచ్చుననే ఉద్దేశ్యంతో ఈవిషయాలను పార్టీ సభ్యులందరికీ తెలియనీయలేదు. ఐనా ఉన్నతవర్గాలలో జరిగే చర్చల సారాంశం కనీసం సూచన ప్రాయంగానైనా, ప్రజల్లో వ్యాపించింది; ఈ ఆందోళన కమ్యూనిస్టువర్గాలలో పరస్పర అనుమానాలకు కారణమై, సోవియట్ విరోధుల ఆశలు రేకెత్తించింది; ఈ పరిస్థితుల్లో నైతికపతనం పొందకుండా శ్రామిక ప్రజానీకాన్ని ఒకే ఒక శక్తి రక్షింపగలిగింది. అది ప్రపంచ విప్లవ నాయకుని అచంచలమైన ధైర్యం! "లెనిన్ తప్పటడుగు వేయడు; విప్లవద్రోహి కాలేడు" అని ప్రజల విశ్వాసం!

రష్యా అనుభవిస్తున్న ఆర్థిక దురవస్థలో, రైతుప్రాబల్యాన్ని గుర్తించటమే, లెనిన్ యన్.యి పి. లోని విశిష్టత; నూతనవ్యవస్థమనుగడకు రైతుల సంతృప్తి, విశ్వాసములే ఆధారం. విప్లవం, రైతులకు భూమిని పంచిపెట్టింది. వ్యవసాయ ఉత్పత్తి అనేది రైతులశ్రమయే; అందులో అధిక భాగాన్ని సంగ్రహించటంద్వారా, విప్లవమిచ్చిన బహుమతిలోని ఆర్థికవిలువలను అపహరిస్తున్నది యుద్ధకమ్యూనిజం! న్యాయరీత్యా రైతుదే భూమి; కాని అనుభవంలోకి రాని న్యాయసమ్మతమైన హక్కువల్ల ప్రయోజనం శూన్యం. శరీరశ్రమ చేసి పండించిన పంటకు రైతు యజమాని కాడు; అంటే తన శరీరశ్రమకుగూడా తాను యజమాని కాని దుర్గతిపట్టింది రైతుకు!

ఈ విషయాలన్నీ పార్టీనాయకులకు వివరించటంలో ఎంతో ఓర్పు ప్రదర్శించాడు లెనిన్. ఈ నాయకు లందరూ శ్రామికవర్గ నియంతృత్వ సిద్ధాంతాన్ని ఆరాధిస్తున్నారు; అందుచే, రైతులకు ఆర్థిక స్వాతంత్ర్యాన్నిస్తే, క్రమంగా వారు రాజకీయాధికారాన్ని హస్తగతం చేసికొని, పల్లెప్రాంతాల్లోని సోవియట్లనాక్రమించి, శ్రామికవర్గ ఆధిక్యతను ధిక్కరిస్తారని వీరి భయం! అంటే, ఇది లెనిన్‌లోని మార్క్సిస్టు సనాతనత్వానికీ (Marxist Orthodoxy), పార్టీసభ్యుల విశ్వాస మాంద్యానికీ మధ్య సంఘర్షణ! ఈ సన్నివేశంలోకూడా లెనిన్ ఒక్కడే ఒక పక్షం. ఆతని అనుయాయులే, ఆతని వాదంలోని బలాన్ని శంకిస్తూ మరొకపక్షమైనారు. "శాశ్వత విప్లవం" అనే సిద్ధాంతంతో, ట్రాట్‌స్కీ లెనిన్ ప్రతిపక్షులకు నాయకత్వం వహించాడు. ఆరోజుల్లో నేను విప్లవాన్ని గురించి పగటికలలుకంటున్నాను. అందుచే నాకు గూడా యన్.యి పి. మార్క్సు మూలసూత్రాలకు విరుద్ధంగాకనిపించింది. కాని, విప్లవానంతర ఆర్థిక పునర్నిర్మాణానికి మార్క్సు యేమీ సూచించలేదనే పరిజ్ఞానం మా కెవ్వరికిలేదు! సిద్ధాంత పవిత్రతకూ, శ్రామిక శ్రేయస్సుకు రక్షకుడుగా ట్రాట్‌స్కీ కన్పించాడు. ఆ గుణాల ముందు, సైనిక నియంతృత్వ స్థాపన కాతడు చేస్తున్న కృషిని నిర్లక్ష్యం చేశాను. క్రమంగా ట్రాట్‌స్కీ అనుయాయుల్లో ఒకడుగా నన్ను పరిగణింపసాగారు; ట్రాట్‌స్కీ గూడా, కొన్ని సంవత్సరాలవరకూ నాపట్ల ఎంతో అభిమానంతో, విశ్వా

నంతో వ్యవహరించాడు; పార్టీ నాయకత్వానికి జరుగనున్న పోరాటంలో తననే బలపరుస్తానని కూడా ఆశించేవాడు. కాని, N. E. P. ని గురించిన అతని భయాందోళనలతో నేకీభవించినా, వ్యక్తిగతంగా ట్రాట్‌స్కీ అంటే నాకు సదభిప్రాయం ఉండేది కాదు!

ఇంతలో, క్రాన్‌స్టాడ్ తిరుగుబాటు జరిగింది. ఇక, యన్.ఇ.పి. ని గురించి చర్చలు పొడిగించి ప్రయోజనం లేదనీ, సత్వర నిర్ణయాలు చేయాలనీ బోల్షివిక్ పార్టీ గుర్తించింది. లెనిన్‌ని ప్రతిఘటిస్తున్న బోల్షివిక్ నాయకుల కండ్లు తెరిచిందా తిరుగుబాటు; వారితో బాటు నాకూ జ్ఞానోదయమైంది!

సోవియట్ రాజ్యం కూలిపోయే ప్రమాదం యేర్పడిందని లెనిన్, పార్టీకి హెచ్చరిక చేశాడు; "ఆ ప్రమాదం తప్పించటానికి ఒకే ఒక మార్గం ఉంది. అది శ్రామిక ప్రజానీక భావాలనూ, కోరికలనూ సోవియట్ ప్రభుత్వం గుర్తించినదని ప్రజలకు నచ్చేటట్లు వ్యవహరించటమే! ఈ క్లిష్టపరిస్థితినుండి బైటపడాలంటే రైతుల సహకారం అవసరం; రైతు సహకారం లేనిదే శ్రామికులు అధికారాన్ని వశపరచుకోవటం అసంభవం. సైనిక దౌర్జన్యాలద్వారా, ప్రస్తుత ఆర్థిక విధానాన్ని పారిశ్రామికం చేయ పూనుకొనటంకంటె అవివేకం లేదు" అని లెనిన్ వివరించిన తరువాత, పార్టీలో ట్రాట్‌స్కీపట్ల వ్యతిరేకత తీవ్రతరమైంది. కాని, ట్రాట్‌స్కీకి లెనిన్ అండదండలుండనే ఉన్నై! ఏమైనా, ఈ రాజీవిధానం ఎంతో కాలం నిలువజాలదు; యుద్ధ కమ్యూనిజానికి స్వస్తి చెప్పి సత్వర రష్యా ఆర్థిక పునర్నిర్మాణానికి అనువైన క్రొత్త విధానాన్ని రూపొందించాలి.

క్రాన్‌స్టాడ్ తిరుగుబాటు తరువాత వారంరోజులకు మాస్కోలో బోల్షివిక్ పార్టీ మహాసభ జరిగింది. మహాసభ ఆమోదానికి లెనిన్ తన (N. E. P) ని సమర్పించాడు. ఆ సందర్భంలో లెనిన్ చేసిన ఉపన్యాసం అచంచల దీక్షకూ, ధైర్యానికీ నిదర్శనం; ఆ ఉపన్యాసంతో పార్టీ హడలిపోయింది. ఉపన్యాస ప్రారంభంలోనే లెనిన్ ప్రకటించాడు: " 'స్వేచ్ఛా వాణిజ్యం పునరుద్ధరించాలి' అనే నినాదంతో సోవియట్ ప్రభుత్వంమీద రైతులు తిరుగుబాటు చేస్తున్నారు; వారికి నగరాల్లోని మధ్యతరగతి ప్రజల సానుభూతి లభిస్తుంది; ఇక, శ్రామికవర్గాన్ని సైనికం చేయటమూ, కార్మిక సంఘాలను ప్రభుత్వ యాంత్రాంగానికి అనుబంధంచేసే విధానాలను శ్రామికులు నిరశిస్తున్నారు; ఈ విధంగా అన్ని వర్గాలలో అసంతృప్తి ప్రబలటంతో సోవియట్ ప్రభుత్వ సాంఘిక పునాదులు విచ్ఛిన్నమాతున్నై".

లెనిన్ ప్రకటన పార్టీకి విద్యుద్ఘాతంగా పనిచేసింది; ప్రతిపక్ష ముఠాలు తమ తమ సిద్ధాంతాలను మరచి, లెనిన్ చెప్పే ప్రతి మాటా శ్రద్ధగా వినసాగారు. లెనిన్ సూచించినది, ఆర్థికరంగంలో తిరోగమనంగా, పెట్టుబడిదారీ విధానంతో

రాజీగా, తద్వారా సోషలిస్టు ఆదర్శానికి విద్రోహంగానూ ధ్వనించిన మాట వాస్తవమే! 'శ్రామిక ప్రతిపక్షాని'కి (Worker's Opposition) నాయకత్వం వహిస్తున్న ష్లియాప్నికావ్ నుద్దేశించి అన్నాడు లెనిన్: "ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్లో రష్యాలో పరిశ్రమల నభివృద్ధిపరచి, వ్యావసాయక ఆర్థిక విధానాన్ని పారిశ్రామికంగా రూపొందించటానికీ, శ్రామికవర్గాన్ని ఆర్థికంగా పటిష్ఠం చేయటానికీ, కనీసం పది సంవత్సరాలు పడుతుంది. ఈ పది సంవత్సరాల్లో, సోవియట్ ప్రభుత్వంపట్ల రైతులకు అసంతృప్తి ప్రబలితే మనం చేయగల దేమిటి? కాబట్టి తొందరపాటువల్ల ప్రమాదం ఉంది! సహనం అవసరం. రెండు సంవత్సరాలపాటు కరువు కాటకాలు లేక, బొగ్గు పుష్కలంగా సరఫరా జరిగితే కర్మాగారాలలో పని చురుకుగా సాగుతుంది; శ్రామిక వర్గ శక్తిసామర్థ్యాలు ఇతోధికంగా వృద్ధిపొందుతై; నాడు, నేటికంటె నూరింతలుగా శ్రామికులు మనలను బలపరుస్తారు."

"ప్రస్తుత క్లిష్ట పరిస్థితికి కారణం సైన్యాన్ని రద్దుచేసి, రైతులను స్వగృహానికి మరలించటమే. నేటివరకూ యుద్ధమే వృత్తిగా నున్న వేలకొలది రైతులు నిరుద్యోగులైనారు; వీరిలో చాలమంది దోపిడి గాండ్రుగా మారి, దేశం నలుమూలలా అశాంతిని రెచ్చగొడుతూ, విప్లవ వ్యతిరేకశక్తులను బలపరుస్తున్నారు. దేశంలో శ్రామికులు అల్పసంఖ్యాకులే; రైతులే అధిక సంఖ్యాకులు. వ్యవసాయ పరిశ్రమ విచ్ఛిన్నమై రైతులు ప్రభుత్వంమీద తిరుగుబాటు చేయటంతో జాతీయ ఆర్థికవిధానం పునాదులు వెల్లగిల్లుతున్నై."

"కాబట్టి తక్షణం, బలప్రయోగంతో ధాన్యసేకరణ పద్ధతిని రద్దుచేసి, మార్కెట్‌లో స్వేచ్ఛగా ధాన్యాన్ని అమ్ముకొనే స్వేచ్ఛను రైతులకిస్తూ, బోల్షివిక్ పార్టీ ఒక ఆదేశ మివ్వాలి; అందు కనుగుణంగా, పట్టణాలలోనూ, నగరాలలోనూ, యుద్ధ కమ్యూనిజం నిర్మూలింప దలచిన స్వేచ్ఛావాణిజ్యాన్ని పునరుద్ధరించాలి" అని ఉపన్యాసాన్ని ముగించాడు.

ఉపన్యాసం మధ్యలో, లెనిన్, విప్లవ గమనంలో మార్పులకు కారణమైన జాతీయ, అంతర్జాతీయ పరిణామాలను సమీక్షించాడు: "గత మూడు సంవత్సరాలుగా అంతర్జాతీయ విప్లవాన్ని గురించి ఆశలు పెంచుకొన్నాం; కాని అది వెంటనే జరుగుతుందని చెప్పలేము; కాబట్టి దేశీయ, విదేశీయ వర్గసంబంధాలతో మన కార్యక్రమాన్ని సమన్వయ పరచుకొంటూ శ్రామికవర్గ నియంతృత్వాన్ని కొనసాగించాలి; మనకు సంభవించిన కష్టనష్టాలకు ప్రతీకారం చేయాలి."

## ఇంటర్నేషనల్ రహస్య సమావేశం

పార్టీ మహాసభ యన్.యి.పి.ని ఆమోదించింది; కాని "శ్రామిక ప్రతిపక్షం" వేపున కొందరు యన్.యి.పి.ని వ్యతిరేకిస్తూనే ఉన్నారు. ఈ వ్యతిరేకవర్గానికి, కార్మిక

మంత్రియైన ష్లియాప్నికావ్, మదాం కొల్లాన్‌తాయి నాయకత్వం వహించారు. శ్రామిక ప్రతిపక్షానిది అరాజక సిండికలిస్టువాదం; యుద్ధకమ్యూనిజాన్ని కొనసాగించాలనీ, పార్టీ ఆధిపత్యం పనికిరాదనీ వాదించేవారు; పార్టీమహాసభలో పరాజయం పొందటంతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ మూడవ ప్రపంచ మహాసభకు తమ వాదనను నివేదించటానికి నిర్ణయించారు; అందుకు నాందిగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గ రహస్య సమావేశంలో చర్చకు తెచ్చారు. అదొక చిరస్మరణీయమైన సమావేశం; రాజకీయ విభేదాల వెనుకనున్న వ్యక్తిగత ద్వేషాసూయల్ని వెలుగులోనికి తెచ్చిన సన్నివేశం!

ష్లియాప్నికావ్ చర్చను ప్రారంభించాడు; నెమ్మదిగా, నిదానంగా మాట్లాడే వాడు; ప్రతిపక్షనాయకునిలో సహజంగా కన్పించే ఉద్రేకం అతనిలో కన్పించదు; అధికారం 'ఉత్పత్తిదారుల సంఘానికే' (Congres of Producers) సంక్రమించాలనే తన సిద్ధాంతాన్ని విపులీకరించాడు. ఐతే పదవ పార్టీ మహాసభలోనే "ఉత్పత్తిదారు" అంటే ఎవరో స్పష్టంగా నిర్ధారణచేయాలని లెనిన్ సలహాయిచ్చాడు. శ్రామిక వర్గమనేది సంకుచితమైన పదమనీ, ఉత్పత్తిదారుకు అది అర్థంకాదనీ, శ్రామికవర్గమే పెట్టిపుట్టిన వర్గంకాదనీ ష్లియాప్నికావ్ వాదమైనచో, అతడు యన్. యి. పి. ని తిరస్కరించటంలో అర్థంలేదు; అధికసంఖ్యాకులుగానున్న ఉత్పత్తిదారులందరి హక్కులను గుర్తిస్తున్నది యన్. యి. పి.

ట్రాట్‌స్కీ సిద్ధాంతాలకూ, 'కార్మిక ప్రతిపక్ష' కార్యక్రమానికీ చాల పోలికలున్నై. అందుచే, ట్రాట్‌స్కీగూడా ఈ పక్షాన్ని బలపరుస్తున్నాడనే అపోహకు తావులేకుండా, ట్రాట్‌స్కీ చర్చల్లో పాల్గొన్నాడు. కాని ష్లియాప్నికావుకు సమాధానం చెప్పటానికి బదులు, ట్రాట్‌స్కీ తన ఉపన్యాసంలో కొల్లాన్‌తాయ్‌పై వ్యక్తిగత దూషణ సాగించాడు; ధనికవర్గానికి చెందిన వన్నెలాడియనీ, విప్లవంతో దోబూచులాడుచున్నదనీ నిందించాడు. అసంబద్ధమైన ఈ దూషణవలన, సభికులలో కొల్లాన్‌తాయ్‌పట్ల సానుభూతి కలిగింది; ఇది అవకాశంగా కొల్లాన్‌తాయ్ ట్రాట్‌స్కీకి సమాధానం చెప్పింది. ట్రాట్‌స్కీ మహావక్త; అంతగా గాకపోయినా కొల్లాన్‌తాయ్‌కూడా గొప్ప వక్తయే. 'నెపోలియన్‌వలె దురాశాపరుడనీ, విప్లవ ధ్వంసానికి యత్నిస్తున్నాడనీ' ట్రాట్‌స్కీని నిందించింది; శ్రామికులను సైనికులుగా తయారుచేసే ట్రాట్‌స్కీపథకాన్ని ఎదిరించటమే 'కార్మిక ప్రతిపక్షం' ప్రధాన లక్ష్యమంటూ వివరించింది.

కొల్లాన్‌తాయ్ సమాధానంతో ట్రాట్‌స్కీకి దిక్కుతోచలేదు; అతణ్ణి ఆదుకొనటానికై లెనిన్ లేచాడు. ష్లియాప్నికావ్‌ను తన సిద్ధాంతాలను పునఃపరిశీలించవలసిందిగా కోరాడు; కాని కొల్లాన్‌తాయ్‌పట్ల చాల నిర్దాక్షిణ్యంగా మాట్లాడాడు;

ఆమెను పెట్టీబూర్జువా అరాజకవాదిగా వర్ణించాడు లెనిన్. తిరిగి సమాధానం చెప్పటానికై లేచి నిలబడింది కొల్లాన్‌తాయ్; కాని మాట్లాడలేక ఏడుస్తూ బైటికి వెళ్ళింది!

అదంతా, నాటకంలోని దృశ్యంగా కన్పించింది; సభికు లందరికీ ఇది అగమ్య గోచరంగా తయారైంది. విప్లవ మహానాయకులైన లెనిన్, ట్రాట్‌స్కీ లొక అబలపై తమ బ్రహ్మాస్త్రాలను ప్రయోగించటమా! ఆనోటా ఆనోటా అనేక వదంతులు వ్యాపించినై. వానిలో మిక్కిలి రసవత్తరమైన వదంతి: లెనిన్ ట్రాట్‌స్కీలు ఉభయులూ, ఒకప్పుడు కొల్లాన్‌తాయ్‌ని ప్రేమించి ఆశాభంగం చెందారట! అందు కిది ప్రతీకారమట! ట్రాట్‌స్కీ విషయంలో ఈ వదంతి నిజమే కావచ్చు; అతనిది, ఉద్రేకం పొంగులకు లొంగిపోయే తత్వం; కాని, కేవలం వ్యక్తిగత విషయాలపై రాజకీయ నిర్ణయాలు జరిపాడు లెనిన్ అనేది నమ్మశక్యంగాని విషయం!

కొన్ని రోజుల తర్వాత "ఈ వదంతులు ఎంతవరకు సత్యం?" అని కొల్లాన్‌తాయ్‌నే స్వయంగా అడిగాను. నాలో ఇంతటి సాహసానికి కారణం, ఆమె నాతో చనువుగా వ్యవహరించటమే. వ్యక్తిగత జీవితానికి సంబంధించిన అనేక విషయాలు నాతో ముచ్చటిస్తూ ఉండేది. బహుశా, యావనంలో ఉన్న నాకు హెచ్చరికగా ఆ విషయాలు చెప్పేదేమో! పై వదంతిని గురించి ఆమె అన్న మాటలు: "ప్రాత స్మృతులను త్రవ్వి తీయబోకు; మనం విప్లవకారులం; రాజకీయాల ముందు స్వవిషయాలను మనం లెక్కచేయకూడదు." ట్రాట్‌స్కీపట్ల తన ఆగ్రహాన్ని అణచలేకపోయేది గాని, లెనిన్ పెద్దమనిషి తనాన్ని కించపరచే ఒక మాట కూడా ఆమె నోటివెంట వినలేదు. ఆమె ధోరణినిబట్టి, లెనిన్‌కు సంబంధించినంతవరకూ, ఆ వదంతిలో కొంత సత్యం లేకపోలేదనీ, కాని ఆశాభంగం జరిగింది కొల్లాన్‌తాయ్‌కేననీ గ్రహించాను. కొల్లాన్‌తాయ్‌లో భావోద్రేకం ఎక్కువ; పార్టీ నాయకుణ్ణి ఆమె ప్రేమించటంలో విడ్డూరం లేదు. ఇక లెనిన్ విషయం; ఆతనిలోని మానవత్వం అగాధమైంది; కాని అతడొక యంత్రం! వ్యక్తిగతమైన భావనలూ, ఉద్రేకాలూ ఎన్నిఉన్నా రాజకీయ, సిద్ధాంత నిర్ణయాలకు వాని నడ్డంరానిచ్చేవాడుకాదు లెనిన్!

ఏమైనా, చరిత్రాత్మకమైన ఈ కమ్యూనిస్టు కార్యవర్గసభలో కొల్లాన్‌తాయ్‌కి న్యాయం జరగలేదనే అభిప్రాయపడ్డాను. తరువాత లెనిన్‌ను కలుసుకొన్నప్పుడా అభిప్రాయాన్ని చెప్పటానికి సాహసించలేకపోయాను. ఇక ట్రాట్‌స్కీతో ముచ్చటించటానికే అవకాశంలేదు. ఆతని విషయంలో వదంతులు పూర్తిగా సత్యమైయుండవచ్చు!

మూడవ ప్రపంచ మహాసభకూడా యన్.యి.పి. ని ఆమోదించింది. ఐనప్పటికీ బోల్షివిక్ పార్టీలో వ్యతిరేకత తగ్గలేదు. దాని ఫలితమే బోల్షివిక్ పార్టీలో ప్రథమ ప్రక్షాళన! (Purkge) పదవపార్టీ మహాసభ జరిగిన ఒక సంవత్సరంలో, పార్టీసభ్యుల్లో

నాల్గవవంతు పార్టీనుండి బహిష్కరింపబడ్డారు! ష్లియాప్నికావ్, కొల్లాన్‌తాయిలకు మాత్రం ప్రక్షాళన వర్తింపలేదు. కాని ష్లియాప్నికావ్‌ను ప్రభుత్వ పదవినుండి తొలగించి, విదేశ రాయబారిగా పంపివేశారు. కొల్లాన్‌తాయ్‌నిగూడా రాయబారిగానే నియమించారు. రాయబారి హోదా కూడా పొందిన మొదటి సోవియట్ వనిత కొల్లాన్‌తాయ్!

## సోవియట్ల మహాసభ

యన్. యి. పి. ని గురించి నా సందేహాలు నివృత్తి కావటానికి కొంతకాలం పట్టింది. "యన్. యి. పి. తిరోగమనం, పరాజయానికి దారితీసి దాసోహం అనిపింపజేయవచ్చు" అని నా అభిప్రాయం. కాని, తిరోగమనమే విప్లవాన్ని రక్షించినట్లు అనుభవం రుజువు చేసింది. అంతేకాదు, యన్. యి. పి. ని పూర్తిగా అనుసరించియుండినచో, సోవియట్ యూనియన్ చరిత్ర మరోవిధంగా ఉండేదని ప్రస్తుతం నా అభిప్రాయం. యన్. యి. పి. లక్ష్యం, మార్క్సిస్టులు కలలుగన్న సోషలిజం కాదు; స్వచ్ఛమైన ప్రజాస్వామ్య వ్యవస్థ. స్వేచ్ఛావిస్తరణకు సాధనంగా ఉపయోగపడటమే గాక, యన్. యి. పి. వల్ల సోవియట్ ప్రభుత్వాన్ని హింసాభయోత్పాతాలకు సాధనంగామార్చిన దారుణ విధానాలతో అవసరం లేకపోయేది.

దేశంలో, శాసనాలు చేసే అధికారం బోల్షివిక్ పార్టీకి లేదు. పార్టీ నిర్వహించే పాత్ర, కేవలం రాజకీయమే గాని, శాసన నిర్మాణాత్మకం కాదు. అందుచే, పార్టీ మహాసభ చేసిన నిర్ణయం ప్రభుత్వానికొక సలహా వంటిది. ప్రభుత్వం ఆ సలహాను ఆమోదిస్తే, దానిప్రకారం శాసనంచేసే అధికారం అఖిల రష్యా సోవియట్ల మహాసభకే ఉండేది.

సోవియట్ల మహాసభ వేసవిలో జరిగింది; అది బహిరంగసభ; మాస్కో ఓపెరా హౌస్‌లో జరిగింది. పార్టీ నాయకులు, ప్రభుత్వాధ్యక్షులు వేదికపై ఆసీనులైనారు. హాలులో చాలభాగం ప్రతినిధు లాక్రమించారు. గ్యాలరీలలోనూ, బాల్కనీలలోను ప్రేక్షకులు; నాటకశాల ముందున్న పార్కులో వేలాది జన సమూహం. నాయకుల ప్రసంగాలు పార్కులోకి విన్పించేటట్లు లౌడ్‌స్పీకర్లు ఏర్పాటు చేశారు.

సోవియట్ మహాసభ కార్యవర్గానికి అధ్యక్షుడుగా, కాలినిన్ మహాసభను ప్రారంభించాడు. ప్రతి మాటనూ విడివిడిగా ఉచ్చరించటం కాలినిన్ అలవాటు; కాని ముఖ్యమైన అంశాలను గట్టిగా, నిదానంగా నొక్కి పలికేవాడు. మహాసభ ఉద్దేశ్యాలను స్పష్టపరచి యన్. యి. పి. ని వివరించవలసిందిగా లెనిన్‌ను కోరాడు. మరుక్షణంలో లెనిన్ ఉపన్యాస పీఠాన్ని సమీపించాడు; ఫ్లాష్‌లైట్లు అతనిపై ప్రసరించినై; విశాలమైన ఆ వేదికమీద లెనిన్ మామూలుకంటె పొట్టిగా కన్పించాడు.

హాలును దద్దరిల్లజేస్తూ, లెనిన్‌కి స్వాగతం పలికిన కరతాళధ్వనులు, 'విజయం లెనిన్‌దే' నని సూచించినై.

లెనిన్ ఉపన్యాసంలో, సిద్ధాంత చర్చగానీ, పార్టీ మహాసభలో కన్పించిన గాంభీర్యంగానీ లేవు. ఐతే, ఆ సభకూ ఈ సభకూ ఎంతో తేడా ఉంది. అప్పు డతడు మాట్లాడింది పార్టీ సభ్యులతో; నేటి ఉపన్యాసం ప్రజల నుద్దేశించినది; పార్టీ సభలో వివరించిన వాదనలను స్పష్టీకరించి ముగించాడు: "మార్క్సిస్టులుగా మనం కోరుతున్నది శ్రామిక నియంతృత్వం; అందుకు శ్రామికవర్గం అవసరం. కాని, రష్యాలో శ్రామికవర్గం ఏది? వస్తుతా రష్యాలో శ్రామికులు అల్పసంఖ్యాకులు; వారిలో సగానికిపైగా విప్లవపోరాటంలోనూ, అంతర్యుద్ధంలోనూ మరణించారు. కాబట్టి, శ్రామికనియంతృత్వ స్థాపనకు క్రొత్త తరం శ్రామికవర్గం ఉదయించాలి. ఆర్థికపరిస్థితి చక్కబడితేగాని, పాడైన పరిశ్రమలను పునర్నిర్మించటానికీ, క్రొత్త పరిశ్రమలు నెలకొల్పటానికీ అవకాశంలేదు. నేటికీ, రష్యా ఆర్థిక విధానం వ్యవసాయం పైనే ఆధారపడియున్నది; కాబట్టి రైతులకు దోపిడిభయం తొలగిస్తేగాని ఆర్థిక విధానం చక్కబడదు. రైతులను దోపిడిభయంనుండి విముక్తిచేయటమే యన్. యి. పి ఉద్దేశ్యం. వినిమయవస్తువుల్లో స్వేచ్ఛావాణిజ్యాన్ని చట్టబద్ధం చేసినప్పుడు రైతులు తమ ధాన్యాలను మార్కెటులో అమ్మకోగలుగుతారు; వారికి దోపిడిభయం తొలగి పోతుంది."

తన చివరివాక్యాలతో లెనిన్ సభికుల నుత్సాహితులుగించాడు; అతని కవి సర్వసాధారణమైన మాటలే. ఐతే, ఎంతో వివేకంతో కూడిన మాటలు: "విప్లవాన్ని సాధించాం; ఇక, విప్లవగృహాన్ని చక్కబెట్టటం నేర్చుకుందాం!"

వక్తృత్వ ప్రదర్శనతో వృథా కాలహరణం చేయకుండా, లెనిన్ తన ఆసనానికి మరలాడు. కరతాళధ్వనులు చేయటానికై సభికులందరూ నిలబడ్డారు. వెలుపలనున్న జనసమూహం సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయినై. బరువుభారం తీరిందన్నట్లు నిట్టూర్చారు; లెనిన్ ధైర్యం ప్రజల భయాన్ని తీర్చింది. ఇక వోటింగ్ అనే తంతు అనవసరం. లెనిన్ సూచనలను ప్రజలు ఏకకంఠంతో ఆమోదించారు. అంతవరకూ నేను యన్.యి.పి. ని ప్రతిఘటించాను; కాని ఆ క్షణంలో యన్.యి.పి. కి వోటుచేయటానికై, అప్రయత్నంగా జేబులోని ఎఱ్ఱని కార్డు బైటికితీశాను! అది మాస్కో సోవియట్ సభ్యత్వంకార్డు. ఈ హటాత్పరిణామానికి నాకే ఆశ్చర్యమైంది. వేదికకు మరోవైపున కూర్చున్న లెనిన్, ఉదారమందహాసంతో నావైపు చూచాడు. ట్రాట్‌స్కీ మాత్రం, తన భావాలు పైకి కన్పడకుండా తలవంచుకున్నాడు; అతడు వోటు చేయలేదు; అతని సన్నిహితులు కొందరతణ్ణే అనుసరించారు.

## మూడవ ప్రపంచ మహాసభ—ట్రాట్‌స్కీ

మూడవ ప్రపంచ మహాసభ కార్యక్రమంలోని మూడు అంశాల్లో మొదటిది
అధ్యక్షోపన్యాసం; రెండవది ట్రాట్‌స్కీ నివేదిక; మూడవది యన్.యి.పి. ని గురించి
లెనిన్ ఉపన్యాసం. వీటన్నింటిలో చాల ముఖ్యమైంది ట్రాట్‌స్కీ నివేదికయే.
సభాధ్యక్షుడు, జినోవీవ్ తన ఉపన్యాసంలో జర్మన్ కమ్యూనిస్టుపార్టీలోని కలతలను
వివరించాడు. లెనిన్, యన్.యి.పి.ని గురించి క్లుప్తంగావివరించి, ఆమోదించవలసిందిగా
మహాసభను కోరాడు. ఇక, ట్రాట్‌స్కీ నివేదికలోని ప్రధానాంశం, ప్రపంచ ఆర్థిక
పరిస్థితిని సమీక్షించటం! అందులో లెనిన్ తిరోగమనానికి రష్యాలోని క్లిష్టపరిస్థితీ,
అంతర్జాతీయ పరిస్థితులే కారణంగా వివరింపబడింది. ట్రాట్‌స్కీ ఆ విధంగా
మాట్లాడటం చాల విచిత్రమైన విషయం! ఐతే, అతడు మాట్లాడినది రష్యన్
కమ్యూనిస్టుపార్టీ తరఫున; నివేదికలోని ముఖ్యాంశాలను పార్టీ రాజకీయ విభాగం
(Political Bureau) తయారుచేసింది. వ్యక్తిగతంగానే ఐతే, యన్.యి.పి. కి వ్యతిరే
కముగానే మాట్లాడేవాడు. కాని నివేదిక పార్టీబ్యూరో సూచనలకు విరుద్ధంగాఉంటే,
పార్టీ క్రమశిక్షణకు గురిఅయ్యేవాడు. లెనిన్ అండ గలదనే విశ్వాసం ఎంతవున్నా,
ఆ పనికి సాహసింపలేకపోయినాడు ట్రాట్‌స్కీ!

### ట్రాట్‌స్కీ నివేదిక :

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చరిత్రలోనే ట్రాట్‌స్కీ నివేదిక ఒక ముఖ్య
ఘట్టం. ఇంటర్నేషనల్ సమాచారశాఖ సేకరించిన సమాచారాన్ని ఉపయోగించి,
ట్రాట్‌స్కీ అసమాన వక్తృత్వం ప్రపంచ ఆర్థికపరిస్థితులను కన్నులకు గట్టినట్లు చిత్రిం
చింది. మొదట జర్మన్‌భాషలో మూడుగంటలుమాట్లాడాడు; తరువాత ట్రాట్‌స్కీయే
ఫ్రెంచిభాషలోకి తర్జుమా చేశాడు. ఇంతలో రష్యను ప్రేమకులు తమ భాషలోనికి
గూడా తర్జుమాచేయాలని పట్టుబట్టారు. అంటే, మధ్యమధ్య స్వల్పకాల వ్యవధితో
తొమ్మిదిగంటలసేపు మాట్లాడాడు. ఉపన్యాసం ఏ భాషలోనైనా ప్రతినిధులూ,
రష్యన్ ప్రేక్షకులూ అందరూ హాజరైనారు. ట్రాట్‌స్కీ మాట్లాడేది అర్థంకావలసిన
పనిలేదు. ఆ ఉపన్యాసం ఒక మాటల మహా ప్రవాహం! ఎవరైనా అందులోబడి
కొట్టుకొని పోవలసినదే! వేదికపై, మిలిటరీ యూనిఫారంలో నిశ్చలంగా, విగ్రహం
లాగా ఉన్న అతని ఆకారాన్ని మెచ్చుకోనివాడులేడు. ట్రాట్‌స్కీ పొట్టివాడనే
చెప్పవచ్చు; కాని, నాటి సభావేదికపై చాల పొడవరిలా గన్పించాడు. అప్పుడప్పుడు
సందర్భోచితంగా ఎత్తుమడమల బూట్లు వాడేవాడని చెప్పుకొనేవారు. ఎన్ని సద్గుణా
లున్నా ట్రాట్‌స్కీలో అహంభావమూ, దురభిమానమూ విపరీతం!

సభాకార్యక్రమం ఆశించినంత ప్రశాంతంగా జరగలేదు; సాధారణంగా
ప్రధాన ఉపన్యాసంలోని అంశాలే అధ్యక్షుని ఉపన్యాసంలో సూచింపబడతై.

ఇక్కడ ఆవిధంగా జరగలేదు. ప్రపంచ పరిస్థితిని సింహావలోకనంచేస్తూ, ఆసన్న భవిష్యత్తులో కమ్యూనిస్టుపార్టీ ఎత్తుగడలను వివరించాడు అధ్యక్షుడు. ట్రాట్స్కీ అసలు నివేదికలోని అంశాలే అవి. కానీ ట్రాట్స్కీ ఉపన్యాసంలో ఎక్కువపాలు యన్.యి.పి.ని గురించి! ఈ మార్పుకు కారణం లెనిన్. మర్యాదగా యన్. యి. పి. పట్ల వ్యతిరేకతను ఉపసంహరించుకొనే అవకాశాన్నివిధంగా ట్రాట్స్కీకి కల్పించాడు లెనిన్. ఈ చర్య అభిప్రాయభేదాలకు కారణమైంది; ట్రాట్స్కీపై లెనిన్ ప్రదర్శించిన అభిమానం తన ప్రతిష్ఠకు భంగంగా భావించాడు జినోవీవ్; తన ప్రత్యర్థి అసమానమైన వాగ్ధాటితో మహాసభ నుఱ్ఱూతలూపటం, స్వయంగా అధ్యక్షస్థానంలో నుండి చూచి సహింపలేపోయినాడు.

మొదటి సమావేశంలోనే, సభాకార్యక్రమం నడపటానికి ముగ్గురు అధ్యక్షులను ఎన్నుకొన్నారు; వారిలో నేనొకణ్ణి. వేదికమీద జినోవీవ్ ప్రక్కనే కూర్చున్నాను. ట్రాట్స్కీ ఉపన్యసిస్తూ ఉండగా, నన్ను అధ్యక్షుడుగా నుండమని జినోవీవు బైటికి వెళ్ళిపోయాడు. అది సభామర్యాదకు విరుద్ధం; సభికులు గూడా జినోవీవ్ ప్రవర్తనలోని ఆంతర్యాన్ని గ్రహించారు. ఎవరేమనుకున్నా జినోవీవులో అసూయ మూర్తీభవించింది; ఉదారబుద్ధిగానీ, పరిస్థితులతో రాజీపడే శక్తిగానీ అతనిలో శూన్యం. ఎవరు అధ్యక్షుడైనా, ఆ పరిస్థితుల్లో చేయగలదేమీలేదు. లెనిన్ అభిమానం గలదనే విశ్వాసంతో, స్వస్వర మాధుర్యంతో పూర్తిగా మత్తెక్కినట్లె తన పరిసరాలనే విస్మరించాడు ట్రాట్స్కీ; ప్రేక్షకులుకూడా మంత్రముగ్ధులైనట్లున్నారు; సభాకార్యక్రమం నిరాటంకంగా సాగిపోతోంది. ఇంతలో హాలు నలువైపులనుండి ట్రాట్స్కీపై ఫ్లాష్‌లైట్లు ప్రసరించినై; అది జులై నెల; మాస్కోలో బాగా వేడిగానున్న రోజులు; హాలు క్రిక్కిరిసినట్లుంది; ఈ వాతావరణం ట్రాట్స్కీకి బాధాకరమైంది; కాలర్‌ను సవరించుకొంటూ ఫొటోగ్రాఫర్లపై విరుచుకుపడ్డాడు. "ఏమిటిదంతా? ఊపిరాడనివ్వరా? ఆపేయండి, లేకపోతే మిమ్మల్ని బైటికి గెంటేస్తాను" అధ్యక్షుడు జోక్యం కలిగించుకొనక తప్పలేదు. బైటికి వెళ్ళవలసిందిగా ఫోటోగ్రాఫర్లను కోరాను. ఆ దృశ్యం అంత ఆకర్షణీయంగాఉందిగాబోలు నలువైపులనుండి ఫ్లాష్‌లైట్లు మెరిసినై. నిస్సహాయంగా రక్షణకోరరతో అన్నట్లు ట్రాట్స్కీ అధ్యక్షునివైపు మరలాడు; నా స్థానంలోనే నిలబడి ఫొటోగ్రాఫర్లకు చెయ్యి ఊపుతున్నాను. ఫొటోగ్రాఫర్లనాకర్షించిన సన్నివేశమదే! వారు నిర్గమించిన మరుక్షణంలోనే ట్రాట్స్కీ ఉపన్యాసం గాడినపడి యథాప్రకారం సాగిపోయింది.

ట్రాట్స్కీ సిద్ధాంతంలోని ప్రధానాంశం: "ప్రపంచ పెట్టుబడిదారీవిధానం, యుద్ధానంతర క్లిష్టపరిస్థితినిదాటి, విప్లవఘాతికి తట్టుకోగల బలాన్ని చేకూర్చుకొన్నది. దీన్నిబట్టి, రాజకీయంగా మనం గ్రహించిన విషయం, ఆసన్న భవిష్యత్తులో ప్రపంచ విప్లవానికి అవకాశం లేదు; కాబట్టి, శ్రామికవర్గం కూడా తిరోగమించి, మరొక

అవకాశం లభించేవరకూ ఇతోధికంగా బలాన్ని సమకూర్చుకొనటం అవసరం. మార్క్స్ వ్రాసిన ప్రపంచ జాతకం ప్రకారం పెట్టుబడిదారీ విధానంలో మరొక క్లిష్టపరిస్థితి తప్పకవస్తుంది. అదే శ్రామికవర్గానికి సదవకాశం". ఈ విధంగా తన సిద్ధాంతాన్ని తానే ఖండించుకుంటూ కూడా, లెనిన్ యన్.యి.పి తో తాను పూర్తిగా ఏకీభవించటంలేదని సూచన ప్రాయంగా పేర్కొన్నాడు: "పెట్టుబడిదారీ విధానం పుంజుకొనటం కేవలం తాత్కాలికమే. కాబట్టి, ఏక్షణాన్నైనా దాడిచేయటానికి సంసిద్ధమైయుండి శ్రామికవర్గం, ప్రపంచ చరిత్రలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించాలి".

ట్రాట్‌స్కీ వాదనలోని ధ్వని ఎందరు ప్రతినిధుల కర్థమైందో అనుమానం; లెనిన్ మాత్రం ట్రాట్‌స్కీవాడే ప్రతిమాటనూ, శ్రద్ధగావిని, తూకం కడుతున్నాడు; నేనది గమనిస్తూనే ఉన్నాను. అప్పుడప్పుడు ట్రాట్‌స్కీ వాదనలకు అసమ్మతిగా తల నాడించేవాడు లెనిన్; ట్రాట్‌స్కీ కూడా లెనిన్‌మీద ఒక కన్నుఉంచే మాట్లాడాడు; లెనిన్ అసమ్మతి సూచించినప్పుడల్లా. "ఇవి, వాదానికి బలం చేకూరటానికి అన్నమాటలే; మూలసిద్ధాంతంలో లేవు" అని నేర్పుగా తప్పించుకొనేవాడు.

## ట్రాట్‌స్కీతో బ్రిటన్‌పై చర్చలు

బహిరంగ సభలో ప్రతిపాదించటానికి పూర్వం, ట్రాట్‌స్కీ సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గం చర్చించింది. మంచి జోరుగా వాదోపవాదనలు జరిగినై. హంగేరియన్ కమ్యూనిస్టు జోసెఫ్ పోగానీ (Josef Poganyi) కూడా ఈ చర్చలో పాల్గొన్నాడు. జోసెఫ్ అప్పుడే మాస్కో వచ్చాడు; చాల తెలివైనవాడు. యన్.యి.పి.కి ట్రాట్‌స్కీ వ్యతిరేకతను ఈ నివేదికఖండిస్తున్నట్లు కనిపెట్టాడు; లెనిన్ అనంతరం పార్టీ నాయకత్వానికి ట్రాట్‌స్కీ ప్రయత్నిస్తున్నట్లూ, లెనిన్ సహచరులైన జినోవీవ్, కామెనీవ్, స్టాలిన్ లాతణ్ణి ఎదిరిస్తున్నట్లు అందరికీ తెలిసినవిషయమే! అందుచే, వేదికపై ట్రాట్‌స్కీతో తలపట్లు పట్టగలిగితే, కీర్తితోబాటు ట్రాట్‌స్కీ ప్రత్యర్థుల సానుభూతికూడా లభింపగలదని జోసెఫ్‌లోని రాజకీయ కౌటిల్యుడు పసిగట్టాడు. ఐతే, మితిమీరి వ్యవహరించి, ట్రాట్‌స్కీ కురిపించగల నిప్పుల వర్షాన్ని తన తలపైకి ఆహ్వానించుకున్నాడు. వ్యంగ్య గర్భితంగా ట్రాట్‌స్కీ పోగానీకి సలహాయిచ్చాడు: "రష్యా కమ్యూనిస్టుపార్టీ పొలిటికల్ బ్యూరో అభిప్రాయంలో తప్పులు వెదకటానికి ప్రయత్నించేముందు పరిస్థితులను అవగాహన చేసికొనటం చాల ముఖ్యం".

బ్రిటిష్ సామ్రాజ్య వాదాన్ని గురించి ట్రాట్‌స్కీ వ్రాసిన దానితో నేను ఏకీభవించలేను. ఆతనివాదం యదార్థంకాదని వాదించాను. బ్రిటన్‌లో యుద్ధానంతర ఆర్థిక క్లిష్టత 1921 నాటికి తీవ్రరూపం దాల్చింది. "కన్పించని

ఎగుమతులు" (Invisible Exports) అనేవే బ్రిటిష్ సామ్రాజ్యానికి పునాదులు; అవి: విదేశాలలోని పెట్టుబడులపై లాభాలు; నౌకాదళంపై ఆదాయం; బ్యాంకు, భీమాకమీషన్లు. వీని సహాయంతోనే అంతర్జాతీయ వాణిజ్యతూకాన్ని నిలుపుకో గలుగుతోంది బ్రిటన్. బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రాణప్రదమైన ఈ "కన్పించని ఎగుమతులు" యుద్ధానంతరం దిగజారటం ప్రారంభమై, 1921 నాటికి పూర్తిగా అదృశ్యమయ్యే ప్రమాద మేర్పడింది; ఈ పరిస్థితి కొనసాగితే, మరుసటి సంవత్సరమే అంతర్జాతీయ లావాదేవీలలో బ్రిటన్‌కు లోటు తప్పదు; అంటే బ్రిటన్ విదేశాలకు బాకీపడక తప్పదు అని గ్రహించవచ్చు. నేను గ్రహించినట్లే జరిగిందికూడా! ఈ పరిణామమిచ్చిన ప్రోత్సాహంతోనే (The Decline and Fall of the British Empire) అనే గ్రంథం వ్రాయ ప్రారంభించాను. ఈ గ్రంథరచన పేరాశతో కూడిన సాహసమే! ఐనా బ్రిటిష్‌కమ్యూనిస్టుపార్టీ సభ్యుడైన హ్యూ రాత్‌బోన్ సహాయముతో విషయసేకరణ జరిపాను.

1930 లో యూరోపు విడిచిపెట్టేవరకూ కృషి సాగించాను. ప్రయాణాల్లో వెంటతీసుకువెళ్ళటానికి వీలుకానంత సమాచారాన్ని సేకరించాను. ఐనా, మా ప్రయాణాలన్నీ అసాధారణ పరిస్థితుల్లోనేజరిగేవి. ఒక పెద్దపెట్టెలో భద్రపరచి బెర్లిన్‌లో ఒక పబ్లిషర్ దగ్గర ఉంచాను. అది ఒక కమ్యూనిస్టు కంపెనీ. హిట్లర్ అధికారంలోకి రావటంతో ఆ కంపెనీపై దాడిజరిగింది. నాజీలు నిషేధించిన ఇతర గ్రంథాలతో బాటు, సంవత్సరాల తరబడి చేసిన నా కృషి అంతా పరశురామ ప్రీతియైంది.

ట్రాట్‌స్కీ చేసిన రాజకీయ నిర్ణయం ప్రకారం, "త్వరలోనే బ్రిటన్‌లో విప్లవం జరుగుతుంది", అంతేగాక బ్రిటన్ అమెరికాలమధ్య యుద్ధం రానున్నదనికూడా సూచించాడు ట్రాట్‌స్కీ; చాల రోజులవరకూ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో ఆంగ్లో-అమెరికన్ యుద్ధం తప్పనిసరి అని విశ్వసిస్తూ ఉండేవారు; అది ప్రపంచ విప్లవానికి పచ్చజెండా! ప్రపంచ విప్లవం తప్పనిసరి! కాబట్టి పచ్చజెండా ఎగిరి తీరాలి! అనే ట్రాట్‌స్కీ ప్రభృతుల విశ్వాసం. నివేదికలోని ఈ నిర్ణయాలకే నేను సవరణ సూచించాను. "బ్రిటన్‌లో పటిష్ఠమైన కమ్యూనిస్టుపార్టీ లేనికారణంగా, అక్కడ విప్లవం రాగల అవకాశంలేదు; ఆర్థికంగా బ్రిటన్ చితికిపోవటంవల్ల ఆంగ్లో-అమెరికన్ యుద్ధమనేది అసంభవం" అనేది నా వాదనలోని సారాంశం. ప్రపంచంలో ఐశ్వర్యవంతమైన దేశంగా బ్రిటన్ స్థానాన్ని అమెరికా ఆక్రమిస్తున్నది. ఇట్టి పరిస్థితిలో, సాహసించి అమెరికాతో యుద్ధానికి దిగటానికి బదులుగా, తమ మధ్యగల రక్తసంబంధాన్ని పురస్కరించుకొని బ్రిటన్, అమెరికా సఖ్యాన్ని ఆశిస్తుంది. ఎవరెన్ని చెప్పినా, రక్తసంబంధం బలీయమైనదిగదా! ఈ కూటమిలో బ్రిటన్‌ది ద్వితీయ స్థానమే! ఐనా, ప్రపంచ పెట్టుబడిదారీ విధానానికి ఆంగ్లో-అమెరికన్ కూటమి

వినా వేరొక రక్షలేదు; కాబట్టి ఆంగ్లో-అమెరికన్ కూటమి యేర్పడటం తథ్యం; ఆంగ్లో-అమెరికన్ యుద్ధం అసంభవం" అని వివరించాను.

ట్రాట్‌స్కీకి నా వాదన నచ్చినట్లుంది; అది చాల అసాధారణమైన విషయం. సాధారణంగా లెనిన్‌వినా, ఇతరులవాదాన్ని అంగీకరించడు ట్రాట్‌స్కీ; లెనిన్‌వాదన నైనా నచ్చికాదు అత డంగీకరించేది. రాజకీయ అవకాశ వాదదృష్టిలో అది తప్పనిసరి కావటంవల్లనే! ఏమైనా, తనతో వచ్చి ఏకాంతంగా చర్చించమనికోరాడు ట్రాట్‌స్కీ. ఆంతరంగికంగా ముఖాముఖి, ట్రాట్‌స్కీతో సంభాషించటం అదే ప్రథమం. నాకది చాల ఉల్లాసకరమైన అనుభవం. ట్రాట్‌స్కీ మంచి బుద్ధిసూక్ష్మత గలవాడు; ఆ విషయంలో నా కెన్నడూ అనుమానంలేదు; కాని సాధారణవ్యక్తుల్లో కన్పించే దౌర్బల్యా లితనిలోకూడా ఉన్నై అనే అనుమానం ఉండేది; అందులో ప్రధానమైనది భావప్రకటనలోకంటే భాషాప్రదర్శనలో శ్రద్ధవహించటం! తన నివేదికను తయారు చేసినవారు నా వాదనను ఆధారమైన విషయాలను గమనింపకపోవటం శోచనీయమనీ, బ్రిటన్ గురించినంతవరకైనా నివేదికను సవరించాలనీ, ట్రాట్‌స్కీ అంగీకరించాడు. కాని, 'ప్రపంచ విప్లవం తథ్యమని' మొండిగా విశ్వసిస్తున్న ట్రాట్‌స్కీ, బ్రిటిష్ సామ్రాజ్యంలో యేర్పడిన పరిస్థితివల్ల 'ప్రపంచవిప్లవం జరగదు' అనే వాదనను అంగీకరించటానికి తటపటాయించాడు :

"సామ్రాజ్యం పొలిమేరల్లో (వలసల్లో) ఎందుకు విప్లవం ప్రారంభింప కూడదు?" అని అడిగాడు.

"నాకు ఆ ఆశ కన్పించటంలేదు" అని సమాధానం చెప్పాను.

వినా, ట్రాట్‌స్కీకి వలసదేశాల పరిస్థితుల్లో శ్రద్ధలేదు; అతడు పదహారు అణాల యూరోపియన్! ప్రపంచ విప్లవనాటకంలో రెండవ అంకం జర్మన్‌విప్లవమనీ, జర్మనీనుండియే విప్లవం ఇతర ఐరోపాదేశాలకు విస్తరిల్లుతుందనీ ఆతని గాఢవిశ్వాసం! మహాసభ కార్యక్రమంలో తరువాత అంశం జర్మన్ విప్లవం. అందుచే ఆ విషయాన్ని గురించికూడా చర్చించాం.

మా చర్చల తరువాతకూడా ట్రాట్‌స్కీ తన నివేదికను సవరింపలేదు. కాని ఆ చర్చ ఫలితంగా మరుసటి సంవత్సరమే "బ్రిటన్ గమ్యస్థానం?" అనే గ్రంథాన్ని వ్రాసి ప్రచురించాడు. బ్రిటన్‌కు రెండేరెండు గమ్యా లున్నవనే సిద్ధాంతాన్ని ఆ గ్రంథంలో ప్రతిపాదించాడు. మొదటి గమ్యం సోషలిజం; రెండవది అమెరికాకు దాసోహం అనటం!

ఆంతరంగిక చర్చల ఫలితంగా ట్రాట్‌స్కీ, నేనూ పరస్పరం అర్థంచేసికొన గలిగాం; నాలో ట్రాట్‌స్కీపట్ల గౌరవం ఇనుమడించింది; కాని అతనితో స్నేహముగా వ్యవహరించలేకపోయాను. ట్రాట్‌స్కీతో ఇదొక పెద్దసమస్య. ఈ అనుభవం

సా ఒక్కరిదే కాదు; ఎవరితోనూ ఆత్మీయంగా వ్యవహరించేవాడు కాదు ట్రాట్‌స్కీ. అతడు ఏకాకి! ఏకాకి స్వభావానికి అహంభావం, దురభిమానం అనే కవచాలు తొడిగి రక్షించుకొనేవాడు; ఆ కవచాలను బ్రద్దలుచేయ సంకల్పించిన వ్యక్తులు తారసిల్లినపుడు మరింత ఏకాకితనాన్ని ప్రదర్శించేవాడు. ఉపన్యాసాలు దంచే సమయంలోగానీ, తనను అభినందించే సమయంలోగానీ తప్ప ట్రాట్‌స్కీని పదిమందిలో ఎన్నడూ చూడలేదు. అతనిది అసాధారణమైన జీవితం; ఎంతో సంఘటనాత్మకం! ఐనా, అతనికి ఇద్దరే ఇద్దరు మిత్రులు! ఫ్రెంచి కమ్యూనిస్టు ఆల్ఫ్రెడ్ రోస్మర్, రుమేనియన్ కమ్యూనిస్టు రకోవ్‌స్కీ. రష్యన్ కమ్యూనిస్టుపార్టీలో ప్రముఖస్థానాన్ని సంపాదించాడు రకోవ్‌స్కీ. ప్రపంచ మహాసభ జరిగినప్పుడు తరచుగా పార్టీలు జరిగినై; వీనిలోని సరదా కాలక్షేపాలలో కొంత విశ్రాంతి లభించేది; రష్యన్ కమ్యూనిస్టు నాయకులు విదేశ కామ్రేడ్లతో కలిసి మెలిసి తిరిగేవారు. ట్రాట్‌స్కీమాత్రం ఈ పార్టీలకు హాజరయ్యేవాడు కాదు; తోటివారితో కూడా చనువుగా ఉండేవాడుకాదు; అతనికి త్రాగుడు అలవాటు లేకపోలేదు; ఐతే ఇతరులతో కలిసి త్రాగటం అలవాటు లేదట! స్నేహదూరమైన అతని ప్రవర్తన "నన్నంటకు నామాలకాకీ" అన్నట్లుండేది, ట్రాట్‌స్కీ వ్యక్తిత్వానికది ఒక తీరని కళంకమేనని చెప్పాలి. తనలోని ఏదో అవగుణాన్ని దాస్తున్నట్లు కన్పించేవాడు; ఇతరులతో స్నేహం చేయకపోవటానికి అదే కారణమేమో!

ప్రధాన విషయాలు కొన్నింటిలో అతనితో ఏకీభవింపకపోయినా, రాజకీయాల్లో ట్రాట్‌స్కీ, నేనూ సన్నిహితులమైనాం. అతని వ్యక్తిత్వం నన్ను బాగా ఆకర్షించింది; వృద్ధబోల్షివిక్ వీరు లందరినీ ఎదిరించి, ఒంటరిగా వారితో పోరాటం సాగిస్తున్న అతని అసహాయశూరతపట్ల సానుభూతి కలిగేది. నా ధోరణి ట్రాట్‌స్కీని మోసగించింది. తనను బలపరుస్తున్నానని పొరబడ్డాడు; నేను కూడా ఇతరులతో కంటె నాలోనే ట్రాట్‌స్కీ సన్నిహితంగా ఉన్నాడని భావించాను. బహుశా, నాదీ పొరబాటే కావచ్చు!

ఏమైనా, ట్రాట్‌స్కీ, స్టాలిన్‌ల మధ్య విభేదం, విప్లవానికి పట్టిన పెద్ద దురదృష్టమని నా నమ్మకం. విప్లవ చరిత్రలలో, లెనిన్ తరువాత ఎన్నదగినవారు వీరిద్దరే. వీరిలో ఎవరి గొప్ప వారిదే! వారి వారి రంగాల్లో ఇద్దరూ ఘనులే. ఇద్దరూ కలిసినట్లయితే, లెనిన్ మృతితో ఏర్పడిన ఖాళీని భర్తీచేయగలిగేవారు. ఆ రోజుల్లో ఉభయులమధ్య రాజీకి నా శక్తికొలది ప్రయత్నించాను. ఫలితం లేకపోయింది. చివరకు, ట్రాట్‌స్కీకి ఆశాభంగం కలిగింపక తప్పలేదు. నా జీవితంలో అది అత్యంత క్లిష్టమైన సమయం; అది నా వ్యక్తిగత నిర్ణయంకాదు; గొప్ప రాజకీయ

సమస్య; ఒక సిద్ధాంతాన్ని గురించిన నిర్ణయం; ట్రాట్‌స్కీకి వ్యతిరేకంగానే నిర్ణయించాను. *

## కమ్యూనిస్టుల ప్రవర్తన

మాస్కోలో నివశించే విదేశ కమ్యూనిస్టుల జీవిత విధానంలో యన్.యి.పి. కొన్ని మార్పులను తీసుకువచ్చింది. అంతకు పూర్వం, వారందరూ సమిష్టిగా ఉండే వారు; తిండి, గుడ్డ, ఇతర అవసరాలూ, వారికి ఉచితంగానే సరఫరా చేయబడేవి. రష్యాలో అక్కడక్కడ అనేక కుటుంబాలు కలిసి ఒకే ఇంట్లో ఉండేవి. అట్టి గృహాలలో ఒకే భోజనశాల ఉంటుంది. అదేవిధంగా, విదేశ కమ్యూనిస్టులు బసచేసే హోటల్లోకూడా ఒకే భోజనశాల ఉండేది; అక్కడ వీరందరికీ భోజనంకూడా ఉచితమే. ఐతే, సమిష్టి భోజనశాలల్లో ఉచితభోజనానికి అర్హులైన వారందరికీ చీట్లు ఇచ్చేవారు.

పైపద్ధతి యన్. యి. పి. తో మారిపోయింది. పరిమితంగా స్వేచ్ఛావాణిజ్యా నికి అనుమతి లభించటంవల్ల కాఫీహోటళ్లూ, భోజనశాలలూ ప్రారంభమైనై. హోటళ్ళలో ప్రజలు తమకిష్టమైన పదార్థాలను కొనుక్కోనటానికి వీలైంది. తిరిగి, డబ్బు మారకవస్తువైంది. వినిమయ వస్తు సముదాయమంతా కేంద్ర సహకారసంఘ పరం చేయబడింది. ఈ సంఘం పట్టణాలలో షాపులను నెలకొల్పింది; కాని, స్థానిక సహకారసంఘాలలో సభ్యులైనవారికే ఈ షాపులో వస్తువులను కొనే హక్కు ఉంది. కమ్యూనిస్టుపార్టీ సభ్యులూ, కార్మిక, వృత్తిసంఘాల సభ్యులూ సహకార సంఘాలలో సభ్యులై తీరవలసిందే!

## చిల్లర దుకాణాలు

స్వేచ్ఛావాణిజ్యమూ, డబ్బూ పునరుద్ధరింపబడటంతో నగరంలో పలుచోట్ల చిల్లరదుకాణాలు తలెత్తినై. వీనిని ప్రారంభించినవారు ఉన్నత, మధ్య తరగతులకు చెందినవారు; వీరు "పనిచేయనివారికి తిండిలేదు" అనే విప్లవసిద్ధాంతంప్రకారం హక్కులు కోల్పోయిన ప్రజానీకమే! శ్రామిక రాజ్యంలో పౌరహక్కులను పొందటానికి ఉత్పత్తికృషిలో పాల్గొనాలనేదే పై విప్లవసిద్ధాంతంలోని ఆంతర్యం. విప్లవం తరువాత కూడా రష్యాలో ఉన్నతవర్గాలవారు లేకపోలేదు; ఉత్పత్తికృషిలో పాల్గొనేశక్తి వీరికి లేదు. శక్తి ఉన్నా పాల్గొనరు! కాబట్టి ఏ వృత్తిసంఘంలోనూ వీరికి సభ్యత్వంలేదు;

---

* 1927 లో, 'ప్రపంచ విప్లవ' సమస్యపై, తన సిద్ధాంతాన్ని పునఃపరిశీలన చేయ:బోవుటచే, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంనుండి, ట్రాట్‌స్కీ బహిష్కరణను చేసిన నిర్ణయం; రాయ్ వోటుతోనే ట్రాట్‌స్కీ వ్యతిరేకులకు మెజారిటీ లభించింది; ట్రాట్‌స్కీ బహిష్కరింపబడ్డాడు.

ఇక కమ్యూనిస్టుపార్టీ సంగతి వేరుగా చెప్పనక్కర్లేదు. అందుచే, సహకార సంఘాలలో ప్రవేశంలేక, యన్. యి. పి. అమలుజరిగేవరకూ వీరి జీవితం దుర్భరమైంది. వీరిలో కొంత సాహసం గలవారు ఏవో రహస్య వృత్తులు సాగించి జీవనోపాధి గడించుకొనే వారు; యువతులు రహస్యంగా పూటకూటిళ్ళు నడిపారు; వీని కవసరమైన వస్తు సామగ్రిని బ్లాక్ మార్కెట్‌లో కొనేవారు; నాటి రష్యాలో బ్లాక్ మార్కెట్ నేరానికి మరణశిక్ష విధించేవారు. కొందరు తమ తమ దుస్తుల్ని, నగల్ని అమ్ముకొని తింటూ ఉండేవారు. ఇదీ శిక్షార్హమైన నేరమే! యన్. యి. పి. తో ఈ రహస్య మార్గాలు స్వస్తి చెప్పబడినై; పౌరసత్వంలేని దురదృష్టవంతులకు గూడా జీవితంలో క్రొత్త ఆశలు చిగురించినై. అందుచేతనే, వామపక్ష కమ్యూనిస్టులు యన్. యి. పి. బూర్జువా తిరుగుబాటుకు దోహదం చేస్తుందనే భయాందోళనలను వెల్లడించ సాగారు.

వర్తక స్వేచ్ఛ లభించటంతో, రైతులు అధికోత్పత్తిని సాధించి, నగరాలకూ, పట్టణాలకూ ఆహార ధాన్యాలను సరఫరా చేయగలరని యన్. యి. పి. ఉద్దేశించింది. కాని డబ్బువిలువ అనుమానాస్పదం కావటంచే, రైతులు ధాన్యాన్ని డబ్బుకు అమ్మటం మాని, నిత్యావసరమైన వస్తువులను మారకంగా కోరసాగారు. ఐతే, రైతు ప్రజానీకానికి నిత్యావసరములైన వస్తువులన్నీ, ప్రభుత్వ భారీపరిశ్రమల్లో ఉత్పత్తి కావటంలేదు. అందుచే, చిన్న తరహా పరిశ్రమలు అవతరింపసాగినై. ఈ పరిస్థితులన్నీ, పెట్టుబడిదారీ పునరుద్ధరణకూ, బూర్జువావర్గ అవతరణకూ అనుకూలించవచ్చు. కాని, గ్రామాలకూ పట్టణాలకూ మధ్య వస్తువుల సరఫరాను క్రమబద్ధం చేయటంద్వారా, సహకారసంఘాలు ఆ ప్రమాదకరమైన పరిణామాన్ని అరికట్టినై. బూర్జువావర్గం జరుపుతున్నదంతా రహస్య వాణిజ్యం; కాబట్టి, యన్. యి. పి. దుష్ఫలితాల్లో రహస్య వాణిజ్యం ఒకటిగా చెప్పవచ్చు.

## రష్యన్ భోజనం

మూడవ ప్రపంచ మహాసభకు, అసంఖ్యాకంగా, అంతకుముందెన్నడూ లేనంత మంది విదేశప్రతినిధులు హాజరైనారు. వీరందరికీ 'హోటల్ లక్స్'లో విడిది ఏర్పాటైంది. 'హోటల్ లక్స్' అనేది జారులనాటి ప్రాత పేరే; మూడంతస్థుల భవనం; మాస్కోలోని ఒక ప్రధాన వీధిలో ఉంది. లక్స్‌లో భోజనశాల క్రింది అంతస్థులో, రోడ్డుమీదికి ఉండేది. ఇతరులు కూడా అక్కడికి రావచ్చు. ఐతే డబ్బు చెల్లించి భోజనం చేయాలి.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యాలయంలోని ఉద్యోగులు, ఉదయం పని లోనికి వెళ్ళేముందు టీ త్రాగేవారు. హోటల్ బాయిలర్‌లో వేడినీరు లభించేది; తేయాకూ, పంచదారా కొనుక్కోవచ్చు; రష్యాలో టీలో పాలువాడే అలవాటు

లేదుగదా! పాలకు బదులు, నిమ్మబద్ద లుపయోగిస్తారు. నిమ్మకాయలు కూడా దొరుకుతూనే ఉండేవి. ఇక మధ్యాహ్న భోజనం కోమిన్‌టరన్ కార్యాలయం కాన్‌టీన్‌లో చేసేవారు; అక్కడ భోజనం చప్పగా చల్లారిపోయి ఉండేది. శాండ్‌విచెసూ, టీ గానీ, పెరుగు గానీ ఇచ్చేవారు. కార్యాలయంలో పని ఎప్పుడు పూర్తయితే అదే భోజన సమయం; అదీ రష్యాలో ఆచారం. విదేశీయు లీ ఆచారానికి అలవాటు పడాలి. రాత్రి భోజనమే ప్రధాన భోజనం; అది హోటల్ లక్స్‌లో జరిగేది. అందులో సూపు, మాంసమూ, ఏదో ఒక తీపి పిండివంట యిచ్చేవారు.

కోమిన్‌టరన్‌లో సాయంకాలం కూడా పని ఉండేది; బాధ్యతాయుతమైన పదవుల్లోనివారు అర్ధరాత్రి వరకూ పనిచేసేవారు అర్ధరాత్రి దాటిన తరువాతనే విశ్రాంతి సమయం; అర్ధరాత్రి వరకూ పనిచేయటం కూడా రష్యన్ల అలవాటే! రోజంతా కష్టించి పనిచేసిన తరువాత, హోటల్ లక్స్‌లో వారు, భోజనాల దగ్గిర త్రాగుతూ ఉల్లాసంగా గడిపేవారు.

## రష్యన్ కరెన్సీ

నవఆర్థికవిధానం వేతనాలపద్ధతిని ప్రవేశపెట్టింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లోని ఉద్యోగులకూ, నౌకర్లకూ జీతాలిచ్చేవారు. కార్యనిర్వాహకవర్గ సభ్యుని నెల జీతం 500 రూబుల్సు. ఇది పార్టీ నిర్ణయించిన జీతా లన్నిటిలో పెద్ద జీతం. యుద్ధానంతరం యేర్పడిన ద్రవ్యోల్బణాన్ని అరికట్టి, క్రొత్త కరెన్సీని సుస్థిరం చేయటం పెద్ద సమస్య ఐంది. ఈ కరెన్సీలో షెర్వానెజ్ పరిమాణం; షెర్వానెజ్ పది రూబుల్సుకు సమానం. కరెన్సీ సమస్యకు పరిష్కారం సాధించినవాడు సొకోల్నికావ్; మధ్యఆసియాలో టర్కు రంగంలో సేనాధిపతిగా నాతో పనిచేసి వచ్చిన తరువాత ఆర్థికమంత్రి యైనాడు (Commissar of Finance). రష్యాలో బంగారు నిధులు లేవు. కేవలం కాపిటల్ మూడు సంపుటాలే, షెర్వానెజ్‌కు ఉన్న నిధులు! అంత మాత్రాన షెర్వానెజ్ ప్రచారక కరపత్రాలని అపోహ పడకూడదు. ఆకారంలో పది పౌన్లనోటును పోలియుండేది. రష్యాలో దానివిలువకూడా అంతే. ఇట్టి పరిస్థితుల్లో కరెన్సీని సుస్థిరంచేయటంలో సొకోల్నికావ్ విజయం ఒక గొప్ప విశేషం.

క్రొత్త కరెన్సీ నోట్లను లెనిన్‌గ్రాడులో ఒక ప్రెస్‌లో అచ్చువేసేవారు. అచ్చట అధునాతనమైన యంత్రసామగ్రి ఉండేది; అందులో గుడ్డపీలికలతో కాగితపు గుజ్జు తయారుచేసేవారు; కాగితపు గుజ్జు మొదలు, నోట్ల అచ్చు వరకూ ఆ యంత్రశాలలోనే జరిగేది. లెనిన్‌గ్రాడ్ వెళ్ళినప్పుడు నన్నీకర్మాగారానికి ఆహ్వానించి, కరెన్సీ ముద్రణలోని వివిధ దశలనూ చూపించారు. తరువాత అచటి కార్మికులు, లెనిన్‌గ్రాడ్ సోవియట్‌లో సభ్యుడుగా నన్ను ఎన్నుకొన్నారు.

## సాంఘిక కాలక్షేపాలు, మద్యం

డబ్బు చట్టబద్ధమైంది. ఉన్నతోద్యోగులూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సభ్యులూ జీతాలుపుచ్చుకుంటున్నారు; వారి మనుగడకు ఆ జీతాలేఆధారం; కాని విదేశీ కమ్యూనిస్టులుమాత్రం తమ జేబుల్లోని డబ్బును చూచి సిగ్గుపడేవారు. మాట వరసకు, నే నెన్నడూ కాషియర్ చెంతకు వెళ్ళి జీతం తీసుకోలేదు; నా కార్యదర్శియే వెళ్ళి వస్తూ ఉండేవాడు! గది అద్దెతోసహా అవసరవస్తువు లన్నిటి ధరలపై కంట్రోళ్ళు విధింపబడినై; ఆ ధరలనుబట్టి ఆలోచిస్తే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ సభ్యుని జీతం చాల ఎక్కువ; నెలసరి అద్దెకూ, భోజనానికీ చెల్లించిన తరువాత కూడా జేబులో చాల డబ్బు మిగిలేది; దానిని ఇష్టము వచ్చినట్లు ఖర్చుచేసుకోవచ్చు. మాలో చాల మందిమి రాత్రిపూట సాంఘిక కాలక్షేపాలకు ఖర్చుచేసేవారం. మే మందరమూ, ఒకే ఆశయసాధనకు వేరువేరు దేశాలనుండి ఇక్కడ చేరాం; ఈ కాలక్షేపాలలో, కేవలం మానవులుగా కలుసుకొని మా ఉద్రేకాలకు స్వేచ్ఛనిచ్చేవారం; వీనిలో సాంప్రదాయ నిషేధాలకుగానీ, సిద్ధాంత వైరుధ్యాలకుగానీ తావు లేదు. ఈ సమావేశాలలో త్రాగుడుకు ప్రథమస్థానం; అది సహజం! అంతేగాదు. కృత్రిమంగా నిర్మించుకొన్న అవధులను నిర్మూలించి, బిడియస్తుణ్ణి కూడా నిజస్వరూపంతో కన్పించేటట్లు చేయగలిగింది మద్యమే!

రష్యా విప్లవం మద్య నిషేధాన్ని ప్రవేశ పెట్టింది. జారిస్టు ప్రభుత్వంలో మద్య వ్యాపారం ప్రభుత్వాధీనం. "మద్యాన్ని అధికంగా సరఫరాచేసి శ్రామికులను మందబుద్ధులుగా చేయటమే ఈ వ్యాపారం ఉద్దేశ్యం" అని విప్లవకారులు ప్రచారం చేశారు. కారణం ఏమైనా, రష్యాలో శ్రామికులు త్రాగుడుకు బాగా అలవాటు పడ్డారు. రష్యా జాతీయ మద్యం 'వోడ్కా'; చాల ఘాటుగా ఉంటుంది; దీన్ని 'రై' ధాన్యం నుండిగానీ, బంగాళాదుంపల నుండి గానీ తయారు చేస్తారు. వోడ్కాను ఎక్కువగా సేవించటం వల్ల రష్యా శ్రామికులు పశుప్రాయంగా తయారైన మాట నిజమే. రైతులు కూడా వోడ్కాకు బానిసలైనారు. అందుచే విప్లవ కార్యక్రమంలో మద్యనిషేధ మొక ముఖ్యాంగమైంది. కమ్యూనిస్టు పార్టీ సభ్యులుగా నున్న శ్రామికుల్లో బుద్ధిమంతులైన వారు త్రాగుడును తీవ్రంగా నిరశించారు; త్రాగుడు వల్ల కార్మిక వర్గం పశుప్రాయమౌతున్నదనే వారి ఆరాటం. అందుచే మద్య నిషేధాన్ని అమలు జరపటంలో బలప్రయోగానికి వెనుదీసే వారుకాదు. ధనిక, బూర్జువా వర్గాలలో ఇండ్లలో అలమర్ల నిండా ఖరీదైన మద్యా లుండేవి; విప్లవం తొలి రోజుల్లో, ఆగ్రహావేశులైన శ్రామికుల ముఠా లీయిండ్లపై దాడిచేసి వేల కొలది మద్యం సీసాలను ధ్వంసం చేశారు. మాస్కో చేరిన క్రొత్తలో మకాం చేసిన 'చక్రరాజు భవంతి' నుండి సాంపేన్ వాగులాగా ప్రవహించి మాస్కో నదిలో

కలిసిందని చెప్పుకుంటూ ఉండేవారు. మద్య విక్రయాన్ని నిషేధించటమే కాదు; త్రాగి వీధిలో కన్పిస్తే ఖైదుచేసేవారు; ఒక్కొక్కప్పుడు కాల్చిచంపేవారు!

విప్లవం తొలిరోజుల్లో ప్రతి రంగంలోనూ కన్పించిన తీవ్రత క్రమంగా దిగజారి పోయింది; మద్యనిషేధం విషయంలో కూడా పట్టుదల సడలింది. ఇది ఆలోచనా పూర్వకంగా జరిగిన పరిణామమే! విప్లవం అమలు జరిపిన మద్యనిషేధానికి నైతికమైన కారణాలు లేవు; ఆ చట్టం ఉద్దేశ్యం నైతికంగా పతనమైన వారి నుద్ధరించటం కాదు. త్రాగుడు నైతిక పతనానికి కారణమని వాదించేవారు కూడా లేరు. మానవుని పశుప్రాయంగా చేసే అలవాటును మాన్పటమే ఆ చట్టం ఉద్దేశ్యం. అందు చేతనే, వోడ్కాను నిషేధించినా, ఘాటులేని ద్రాక్ష సారాయికి అనుమతి నిచ్చింది సోవియట్ ప్రభుత్వం. ఈ విధానం, ఆర్థికంగా కూడా అవసరమైంది; క్రిమియా, కాకసస్, మధ్యఆసియా ప్రాంతాలలో ద్రాక్ష పంట ఎక్కువ; ద్రాక్షసారాయి పరిశ్రమ కూడా ఆ ప్రాంతాల్లో బాగా సాగుతోంది; వ్యక్తులే చాలవరకీ పరిశ్రమను నడుపుతున్నారు. యన్. యి. పి. కూడా మద్యం ఉత్పత్తి, విక్రయాలలో స్వాతంత్ర్యాన్నిచ్చింది. మొదట్లో ఈ మద్యంలో సారాయిపాలు చాల తక్కువగా ఉండాలని శాసింపబడింది. అసలులేని దానికంటే, ఇదే మంచిదనుకొన్నారు సారాయి ప్రియులు. ఈ మద్యం ధరకూడా తక్కువ కావటంవల్ల మద్య పరిశ్రమ బాగా వికసించింది. ఒక లీటర్ మద్యం ఖరీదు అరవై కోపెక్కులు; కోపెక్ ఎనిమిది అణాలకు సమానం. ఐతే, మద్యాన్ని సహకార సంఘాలే విక్రయిస్తుండేవి. వోడ్కా అలవాటు క్రమంగా అంతరించింది. తరువాత కొన్ని సంవత్సరాలకు వోడ్కా మార్కెట్‌లో పునర్దర్శన మిచ్చింది; కాని దాన్ని తలచినవారే లేరు. వోడ్కాలోకూడా సారాయి పాలు మూడు వంతులు తగ్గింపబడింది.

## కమ్యూనిస్టులూ మానవులే

విదేశ కార్మేడ్లకు అనుకూలంగా హోటల్ లక్స్‌కు ఎదురుగా ఒక సహకార సంఘాన్ని నెలకొల్పారు. అందులో చేపలూ, హామ్ (Ham), జున్ను, మాంసము, వెన్న, రొట్టె, గుడ్లు మొదలైన తినుబండారాలూ, పలురకాల మద్యాలూ లభించేవి. అది సర్వవస్తుసమృద్ధం అని చెప్పవచ్చు. అక్కడ ఇష్టం వచ్చిన వస్తువులు కొనుక్కోవచ్చు. మా మధ్యాహ్న భోజనం నాలు గైదు గంటల మధ్య కావటం చేత, రాత్రి భోజనానికి చాలా ప్రొద్దుపోయేది. భోజనశాలలవలెనే, మా సహకార సంఘం అర్ధరాత్రి వరకూ తెరిచే ఉండేది.

హోటల్ లక్స్‌లోని గదులు అన్నిటికీ టెలిఫోను ఉంది. రాత్రి 11 గంటల ప్రాంతంలో ప్రముఖుల మధ్య టెలిఫోన్ సందేశాలు నడిచేవి. ఆ సందేశాల అనంతరం

మాలో ఒకరిద్దరు సహకార సంఘానికి పరుగెత్తేవారు; ఇంచుమించు అది మూసి వేసే సమయంలో. విదేశ కామ్రేడ్ దర్శనం మాజిక్‌లాగా పనిచేసేది. వెంటనే స్టోర్సు తలుపులు తీసేవాడు; కాని బైటివారి నెవ్వరినీ రానిచ్చేవాడు కాదు. విదేశ కమ్యూనిస్టు లందరిలోనూ ఎందుచేతనో దుకాణదార్లు నేనంటే ప్రత్యేక అభిమానం వహించేవారు. అందుచేత, ఈ అర్ధరాత్రి కొనుగోలు బాధ్యత సాధారణంగా నాపైనే బడేది. నాకు సాయంగా ఒకరిద్దరు మిత్రులు వచ్చేవారు.

కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయంలోని కామ్రేడ్లు, కొంత ఎక్కువ కాలమే మాస్కోలో ఉండవలసి వచ్చింది. అందుచే, వారందరూ భార్యలతో కాపురాలు పెట్టారు; స్త్రీలలో కూడా చాల మంది, కార్యాలయంలో ఏదో పనిచేస్తూ ఉండేవారు. అర్ధరాత్రి విందులకు వీరూ హాజరయ్యేవారు; చాల మంది కన్యలు విదేశాల నుండి వచ్చి టైపిస్టులుగా, స్టెనోగ్రాఫర్లుగా పని చేస్తుండేవారు; వారిది పాపం ఒంటరి జీవితం; వారిని కూడా ఆహ్వానించేవాళ్ళం; వీరందరితో అర్ధరాత్రి విందు తిరునాళ్ళగా తయారై అప్పుడప్పుడు ప్రొద్దుపొడిచే వరకూ సాగుతుండేది. వివిధ దేశాల కమ్యూనిస్టులు, వ్యక్తులుగా, మానవులుగా పరస్పరం వ్యవహరించిన ఈ సమావేశాలొక అపూర్వమైన అనుభవం. రష్యా కమ్యూనిస్టు నాయకులు గూడా, అప్పుడప్పుడీ విందులకు హాజరై మాలో కలిసిపోయేవారు. ట్రాట్‌స్కీ, జినోవీవ్, స్టాలిన్‌లు మాత్రం ఎన్నడూ రాలేదు. ట్రాట్‌స్కీ స్వభావాన్ని గురించి వివరించాను గదా! వ్యక్తిగతమైన లోపాలు బయల్పడే సన్నివేశాలను తప్పించుకొని తిరిగేవాడు! స్టాలిన్, ఇంకా పలుకుబడిలోకి రాలేదు; అదీగాక, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌తో అతని కేమీ సంబంధం లేదు. బుఖారిన్, రాడెక్ మున్నగు ద్వితీయశ్రేణి నాయకులు మాత్రం మా విందులకు హాజరై, నృత్య సంగీతాలలో పాల్గొనేవారు; నృత్యంలో గానీ, సంగీతంలో గానీ నాకు ప్రవేశం లేదు; ఐనా ఈ సరదాల్లో నాకు ప్రత్యేక ఆహ్వానం ఉండేది. అప్పుడప్పుడు చాల విచిత్రమైన సంఘటనలు జరిగేవి.

విదేశ కమ్యూనిస్టుల్లో 'ఆనంద విధ్వంసకులు' కొందరుండేవారు; మూతి బిగించుకు కూర్చొనటమేగాక, విందుల్లో జరిగే అల్లరివల్ల తమ పనికి ఆటంకమౌతున్నదని నిందించేవారు. మరి కొందరిలో ఆటకాయితనం ఎక్కువగా ఉండేది. వీరు, 'ఆనంద విధ్వంసకుల' గదులపై దాడి జరిపి వారి పని పట్టించేవారు. అదీ స్నేహపూర్వకమైన సరదా కాలక్షేపమే. చివరికంతా సుఖాంతంగా పరిణమించేది!

విప్లవం తొలి రోజుల్లో, హోటల్ లక్స్‌లో నివశించే భాగ్యం లభించటం, జీవితంలో మరపురాని మహత్తరమైన అనుభూతి. నాటికే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో వారసత్వాలేర్పడినై. కార్యవర్గం (Executive Commitee),

ప్రెసిడియం (Presidium), కార్యదర్శి బృందా (Secretariat) ల్లోని సభ్యులకు ప్రత్యేక హక్కు లుండేవి; వీరిని ఆఫీసులకు చేర్చటానికి కార్లు వచ్చేవి. ఆఫీసుల్లో సులభంగా వీరి దర్శనం కాదు! వీరిలో కొందరు తాము గొప్పవారమనే అహం భావంతో వ్యవహరించే దౌర్బల్యానికి బానిసలౌతూ ఉండేవారు. కాని హోటల్ లక్స్‌లోని అర్ధరాత్రి విందుల్లో అందరూ సమానులే. మానవ సహజమైన సుగుణాలూ దౌర్బల్యాలూ ఉన్న మానవులే. గోరంతలైన ఈ సుగుణాలను కృత్రిమదర్పంతో కొండంతలుగా చేయనక్కర్లేదు; దౌర్బల్యాలకు సిగ్గుపడవలసిన పనీలేదు!

## మార్క్సిస్టు దృక్పథంతో భారతీయ చరిత్ర

### ఇండియా - భూత భవిష్యద్వర్తమానాలు

మెక్సికో వెళ్ళిన క్రొత్తలో, అచటి దివ్యజ్ఞానసమాజంలో ఇండియానుగురించి కొన్ని ఉపన్యాసాలిచ్చాను. తరువాత ఆ ఉపన్యాసాలు స్పానిష్‌భాషలో India's Past, Present & Future ("ఇండియా - భూత భవిష్యద్వర్తమానాలు") అనే శీర్షికతో ప్రచురింపబడినై. అదిమార్క్సిస్టుదృక్పథంలో భారతీయచరిత్రను పరిశీలించటానికి చేసిన తొలి ప్రయత్నం. అదీ, క్రొత్తగా మతం పుచ్చుకొన్నవాడు, ఆ మతంలో నిశ్చలమైన గాఢవిశ్వాసం కుదరనివ్యక్తి చేసినప్రయత్నం. పవిత్రభారతభూమిపై అడుగైనా మోపని మెక్సికో దివ్యజ్ఞానులకు, ప్రాచీన భారతీయ సంస్కృతిలో కొన్ని మూఢవిశ్వాసా లుండేవి. వీరిలో ప్రముఖులను కలుసుకొన్నప్పుడు, ప్రసంగవశాత్తూ వారివిశ్వాసాలను, అభిప్రాయాలనూ ఖండించాను. ప్రాచీనయుగంలోనైనా, 'ఇండియా మహర్షుల దేశం' కాదనీ, హిమాలయాల కావలి టిబెట్‌లో నివశించే నిగూఢశక్తులు గల సిద్ధులతో నిరంతర సంబంధమున్న యోగులు ఇండియాలో లేరనీ చెప్పాను. ఆ మెక్సికను లందరూ భారతమాతకు పెంపుడు బిడ్డలు! నా దుర్మతభావాలతో హడలిపోయినారు; తమ విశ్వాస కవచం సడలిందని గ్రహించి, నా నాస్తిక భావాల నెదిరించటాని కా కవచాన్ని మరమ్మతు చేసి కోవాలని ప్రయత్నించారు. దివ్యజ్ఞాన పండితుల ముందు నా సిద్ధాంతాలను వివరింప వలసిందిగా ఆహ్వానించారు. అదొక విచిత్రమైన అనుభూతి! ప్రతి ఉపన్యాసం తరువాత, ప్రశ్నల వర్షం కురిపించేవారు. వారందరూ విద్యాధికులూ, ఉపాధ్యాయులూ; కాని, వారి ఆధ్యాత్మిక మాతృదేశచరిత్ర తెలి యదు; ఆ అజ్ఞానాన్ని అంధవిశ్వాసాలతో కప్పిపుచ్చుకుంటున్నారు; భారతదేశం దివ్యపురుషుల దేశమనే వారి నమ్మకం!

'ప్రాచీన భారతీయ సంస్కృతిలో మత ఆలోచనా ప్రభావమే ప్రధాన మనేది నిజమే; కాని భారతీయులుసైతం మానవమాత్రులే! భౌతికమైన అవసరాలపట్ల శ్రద్ధవహించినవారే!' అని నచ్చజెప్పటమే నా ఆశయం. ఆ విషయాన్ని అంగీకరించి

నప్పుడు, భారతీయ సాంఘికవ్యవస్థ గానీ, సాంస్కృతిక పద్ధతిగానీ ఇతర దేశాల ప్రాచీన సంస్కృతికి భిన్నంగా ఉండదు అని నా వాదం. ఇది సహేతుకమే ఐనా, అవసరమైన సమాచారం లేకపోవటంవల్ల ఉదాహరణాత్మకంగా వివరించటం సాధ్యం కాలేదు. ఐతే, దివ్యజ్ఞానుల మూఢవిశ్వాసాల ఫలితంగా, యదార్థమైన భారతదేశ చరిత్ర ఆవశ్యకతను గుర్తించాను; నా క్రొత్త విశ్వాసబలంతో, ఆ చరిత్రను వ్రాయ గలననే ధైర్యంకూడా కలిగింది.

## ఆర్యజాతిలో దురభిమానం

ప్రాచీన భారతీయ సంస్కృతిని నిర్మించిన జాతులను గురించిన నా ఊహలూ, అభిప్రాయాలూ అచిరకాలంలోనే యదార్థమని రుజువైనై. ఆర్యులే ప్రాచీన భారత సంస్కృతీ నిర్మాతలని సర్వసాధారణమైన అభిప్రాయం. కాని భారతీయులందరూ ఆర్యజాతులవారు కాదు అనేది నిర్వివాదాంశం. వైదికార్యులు ఇండియాలో ప్రవేశించారను కొందాం. ఐనప్పుడు వారు తెచ్చినది పశుపాలక నాగరికత ఐ యుండాలి. వైదిక సంస్కృతికి ఆ నాగరికతే సాంఘిక పునాది అనటం ఉచితం. కాని క్రమంగా క్లిష్టమైన సాంస్కృతిక విధానాన్ని రూపొందించటానికి అంతకంటె మంచి వికాసాన్ని సాధించిన నాగరికత అవసరం. కాబట్టి, ఆర్యులు రాకపూర్వమే, ఉదాత్త నాగరికతా నిర్మాతలైన ప్రజలు ఇండియాలో నివశించి యున్నారనే నిర్ణయం హేతుబద్ధమైంది. ఆర్యులు దండెత్తి వచ్చినట్లయితే, ఉత్తర భారతంలో ఒక భాగాన్ని ఆక్రమించి తమ నాగరికత నచట ప్రతిష్ఠించి యుండవచ్చు! కాని ఇండియాలో ప్రతి వ్యక్తిలోనూ తాను ఆర్యసంతతిగా గుర్తించబడాలనే తాపత్రయం కన్పిస్తుంది. అమెరికాలోని శ్వేతజాతులు రంగుజాతులపట్ల ద్వేషం వహిస్తారు; ఈ ద్వేషానికి విరుగుడుగా, అచటి భారతీయులు, తాముగూడా శ్వేత ఆర్యజాతుల వారమని నొక్కి చెప్పటం అలవాటైంది!

కట్టుకథలు ఆధారంగా, జాతి సంబంధాలను నిర్ణయింప బూనటం హాస్యాస్పదం. ఆ ఉద్దేశ్యంతోనే, భారతీయుల జాతీయతను గురించిన ఉపన్యాసంలో, ఆర్య గాథలను ఖండించి, ద్రావిడ జాతీయతను రుజువు చేయుటానికి ఎక్కువ ఆధారాలున్నై అని చెప్పాను; సింధు నాగరికత పరిశోధింపబడినది 1922 లో; అంతకు పూర్వమే, భారతీయ నాగరికతకు పునాదులు వేసినవారు అనార్యులే నని చెప్పాను. సింధు నాగరికత ద్రావిడీయమా, సుమేరియనా అనే సమస్య ఇంకా పరిష్కృతం కాలేదు. ఏమైనా అది ఆర్యులకు పూర్వమే నిర్మింప బడినదనటం సత్యం. మధ్య ఆసియా ప్రాంతాలనుండి వాయువ్య సరిహద్దులగుండా సంచారజీవనులైన ఆర్యులు ప్రవేశింపక పూర్వం ఇండియా అరణ్యం కాదు; నిర్మానుష్యమూ కాదు. ఇతిహాసాలవల్ల, ముఖ్యంగా రామాయణం ద్వారా, ఇండియా జనాకీర్ణమై, ఉత్తమ నాగరికతా సంస్కృతులు గల దేశమని తెలుస్తుంది. జీవశాస్త్రజ్ఞులూ, మానవశాస్త్రకారులూ

ఏకముఖోత్పత్తి సిద్ధాంతాన్ని తిరస్కరిస్తున్నారు. వారి వాదమే నిజమైనచో ద్రావిడులు ప్రసిద్ధ జాతులలో నొకరని అంగీకరించాలి. ఐనప్పుడు, మధ్యఆసియా ప్రాంతాల మీదుగా వచ్చిన సంచార జీవనులే భారతీయ సంస్కృతికి పునాదులు వేశారని ఎందుకు విశ్వసించాలి ?

## చరిత్రలో నూతన దృక్పథం

మార్క్సిస్టు దృక్పథంతో భారతచరిత్రను సింహావలోకనంచేసే కృషి ఎంతో దూరం సాగలేదు. అవసరమైన సాధనసామగ్రి లేకపోవటం, ఇతర వ్యాసంగాలూ అందుకు కారణం. ఐతే చరిత్రను వ్యాఖ్యానించటంలో మార్క్సిస్టు విధానాన్ని గ్రహించిన కొలదీ, భారతదేశ చరిత్రను పునర్నిర్మించాలనే కాంక్ష బలపడింది. తిరిగి ఈ కృషిని 1921లో ప్రారంభించాను. అహమదాబాదు కాంగ్రెస్ మహాసభకు పంపిన నివేదికలో ఇండియాలో బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని గురించి కొన్ని సూచనలు చేశాను. ఆ నివేదిక తయారు చేయటానికి, సమకాలిక భారతీయ సమాజ పరిస్థితిని గ్రహించటం అవసరమైంది. మాస్కోలో నాకు అందుతున్న వార్తాపత్రికలనుండి కొంత సమాచారం సేకరించాను; ఇక ఆర్థిక జీవితాన్ని గురించిన వివరాలకు ప్రభుత్వం ప్రచురించిన గ్రంథాలమీద ఆధారపడవలసినదే. ఆ సమయంలోనే జనాభా లెక్కలను గురించిన ప్రాథమిక నివేదికకూడా వెలువడింది; వార్తాపత్రికల్లో ప్రకటింపబడిన దాన్నిబట్టి ఆ నివేదిక అమూల్యమైనదని గ్రహించాను. అందుచే, లండన్‌లోని సోవియట్ వాణిజ్యప్రతినిధివర్గంద్వారా, జనాభా లెక్కలతో సహా ఇండియా ప్రభుత్వ ప్రచురణలకు ఆర్డరు చేశాం. అచిరకాలంలోనే "నీలిరంగు పుస్తకాల పర్వతం" ప్రత్యక్షమైంది. సమకాలిక భారతదేశ ఆర్థిక పరిస్థితినిగురించీ, వర్గసంబంధాలను గురించీ, నివేదికను తయారు చేయగలననే ధైర్యం చేకూరింది. నాటి ఇండియాలో జమీందారీ వర్గమే ప్రధాన సాంఘిక శక్తియని బోల్షివిక్కుల అభిప్రాయం; అది పొరబాటనీ, అందుచే జాతీయ బూర్జువావర్గం ప్రగతిశీలమనటానికి ఆధారం లేదనీ రుజువుచేసి విప్లవ భవితవ్యాన్ని గురించి నా అభిప్రాయాలను సమర్థిస్తూ నివేదికను తయారుచేశాను. నివేదికను తయారుచేయమని మొదట కోరినవాడు చిచిరిన్; కాని నా అభిప్రాయాన్ని సమర్థించుకొనే ఉద్దేశ్యంతో, లెనిన్ కొరకే నివేదిక తయారు చేశాను "వలసల్లోని. ఆర్థికవిధానం జమీందారీ వర్గసంబంధాలకు ప్రోత్సాహకరంగా రూపొందిన మాట నిజమే; కాని ఆ విధానం స్థానిక పెట్టుబడిదారీ వర్గోదయాన్ని అరికట్టలేదు. అందుచే పెద్ద పెద్ద ఆశలతో బూర్జువావర్గం తలెత్తుతుంది. నాటికి బాగా పాదుకొనిపోయిన ఆర్థిక వ్యవస్థ బూర్జువా ఆశలకు ఆటంకంగా పరిణమిస్తుంది. ఐనప్పటికీ వారి శ్రేయస్సుల కా విధానమే పునాది; అందుచే ఆ వ్యవస్థను సమూలంగా నిర్మూలించే విప్లవానికి బూర్జువావర్గం నాయకత్వం వహింపలేదు." అనే అంశాన్ని స్పష్టీకరించటమే నా నివేదిక ఉద్దేశ్యం.

రష్యన్ కమ్యూనిస్టు నాయకులు, నివేదికను చదివి నన్నభినందించారు; వివరణలతో పుస్తకంగా తయారు చేయమనీ, 'రష్యా పెట్టుబడిదారీ విధాన వికాసం' అనే లెనిన్ గ్రంథానికిగల ప్రాధాన్యత రాగలదనీ సలహా యిచ్చారు. ఈ పుస్తకాన్ని, 19వ శతాబ్ది చివర్లో వ్రాశాడు లెనిన్; "శ్లావ్ జాతీయ సంస్కృతిలోని ప్రత్యేక విశిష్టతవల్ల, పాశ్చాత్య పెట్టుబడిదారీ విధానం మార్గాలను రష్యా అనుసరించదు" అనే పాపులిస్టు అభిప్రాయాన్ని ఆ గ్రంథంలో లెనిన్ ఖండించాడు. దానితో, మార్క్సిస్టుగా లెనిన్‌కి కీర్తి లభించింది; లెనిన్ గురువైన ప్లెఖనావ్ ఆ గ్రంథాన్ని చూచి, "రష్యా భావినాయకుడు లెనినే" అన్నాడట!

నివేదికను చదివి, పుస్తకరూపంలో వ్రాయమని లెనిన్ కూడా సలహా యిచ్చాడు; కాని "ఉపలక్ష్యమైన స్వల్పఆధారాలను ఊహలతో, ఆశలతో వ్యాఖ్యానించవలద"ని హెచ్చరించాడు. "సమకాలిక భారత సమాజ వాస్తవ స్వరూపాన్ని చిత్రించి, విప్లవ మార్గానికవి ఏ విధంగా అనుకూలమో వివరించమని" అతని సూచన. ఇది చాల పెద్ద కార్యభారమే. కొన్ని నెలలు తరబడి కృషిచేస్తేగాని పూర్తికాదు. లెక్కల మహారణ్యంగుండా ప్రయాణం చేయాలి. ఈ లెక్కల్ని రెండు విధాలుగా వ్యాఖ్యానించే అవకాశం ఉంది. కాని నాలో మార్క్సు విధానంపట్ల అచంచల విశ్వాసం ఉంది; కాబట్టి సత్యాన్ని పరిశోధించటం కష్టం కాదు. మాస్కోలో, టర్కిస్థాన్‌లో లాగా సాగించవలసిన విప్లవ కార్యక్రమం లేదు; కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యక్రమంలో శ్రద్ధ తగ్గిపోయింది; ఇక కమ్యూనిస్టు యూనివర్సిటీలో చదువు చెప్పటానికి రెండు గంటలు చాలు. మిగిలిన కాలమంతా ఖాళీగానే ఉంటున్నాను. సాధ్యమైనంతత్వరలో పశ్చిమ ఐరోపాకు వెళ్ళాలనే ప్రయత్నంలో ఉన్నాను. ఈలోగా గ్రంథ రచన, లెనిన్ గ్రంథంతో తులతూగబోయే గ్రంథం రచించాలి!

## అవనీతో తగాదా

అప్పటికి ఇంకా, పోలీసుల అనుమాన పిశాచచ్ఛాయలోనే మసలుతున్నాడు అవనీముఖర్జీ. అతనికేం పనిలేదు. ఓర్పుతోబాటు పెద్ద పెద్ద ఆశలు గలవాడు. అందుచే, లెక్కలన్నీ పరిశీలించి టేబుల్సు తయారు చేయమని అతణ్ణి కోరాను. వెంటనే అంగీకరించి, భారత పారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన ప్రచురణలన్నీ తీసుకున్నాడు. క్రమంగా భూస్వామ్యవిధానం క్షీణించి పెట్టుబడిదారీవిధానం తలెత్తటమే సమకాలిక భారతీయ ఆర్థిక పరిస్థితిలోని ప్రధానాంశం. అందుచే నా పుస్తకానికి 'India in Transition' అనే పేరు నిర్ణయించాను. కేవలం సమకాలిక చరిత్రేగాని భారత చరిత్ర అంతటికీ ఇది మార్క్సిస్టు వ్యాఖ్యానం కాదు. అందలి మొదటి అధ్యాయం 'బూర్జువా వర్గోదయం'. దీన్ని, కేవలం అవనీముఖర్జీ సేకరించిన సమాచారంతోనే వ్రాశాను. త్వరగా ముగించాలనే ఆరాటంతో, అవనీ తయారుచేసిన పట్టికలు

సరిగా ఉన్నవో లేదో పరిశీలించలేదు. అవనీ సహాయానికి, కృతజ్ఞతతో, సహరచయితగా అతని పేరు చేర్చాలని సూచించాను. కాని, అవనీ చర్యలూ, శీలమూ అనుమానాస్పదం. అతని పేరు చేర్చితే పుస్తకం విలువ క్షీణిస్తుందనే భయంతో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రచురణశాఖ అంగీకరింపలేదు. ఐనా, అతని సహాయాన్ని గుర్తించాలని నా పట్టుదల. అందుచే 'అవనీముఖర్జీ సహాయంతో యం. యన్. రాయ్. వ్రాసిన పుస్తకం' అని ప్రచురింపబడింది.

నా పట్టుదలవల్ల, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ముభావంగా అంగీకరించిన పై ఏర్పాటు అవనీ కొక హోదాను తెచ్చిపెట్టింది. ఇది ఆసరాగా అవనీ నాకొక హాని తలపెట్టాడు గాని సాగలేదు. ఐతే, అజ్ఞానప్రేరితమైన అతని ఉత్సాహంవల్ల కొంత హాని జరగనే జరిగింది. "శ్రామిక విప్లవానికి ఇండియా సన్నద్ధమగుచున్నదనీ, అందుచే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో బ్రిటన్ జర్మనీల కిచ్చిన స్థానాన్ని ఇండియాకీయాలనీ నిరూపించే తాపత్రయంతో, నాటి లెక్కలను మసిబూసి మారేడుకాయ చేసి, ఇండియాలో పెట్టుబడిదారీ విధాన వికాసాన్ని గురించి గోరంతలు కొండంతలుగా చేశాడు. బూర్జువావర్గాభివృద్ధిని గురించి అత డుదాహరించిన లెక్కలన్నీ తప్పుల తడకలు. అచిర కాలంలోనే విమర్శకు లీ విషయాన్ని గమనించారు. గ్రంథకర్తగా, ఆ తప్పు లన్నిటికీ నేనే బాధ్యత వహించాలి; మొదట్లో ఆ బాధ్యత నాది కాదని వాదించాను; కాని, ఉపయోగించే పూర్వం అంకెలను కనీసం సరిచూడవలసిన బాధ్యత నాదే! ఇది ఇలా ఉండగా, గ్రంథకర్తగా తన పేరులేక పోవటంతో అవనీకి నాపై ఆగ్రహం కలిగింది. గ్రంథం వ్రాసింది తానేననీ, వ్రాతప్రతిని తస్కరించి నా పేర ప్రచురించుకొన్నానని దుష్ప్రచారం ప్రారంభించాడు. వాస్తవాన్ని బహిరంగపరచటం తప్పని సరైంది; నాకతడు సాయం చేసింది ఒకే ఒక అధ్యాయంలోననీ, ఆ సహకారం నన్నే విధంగా త్రప్పుడు త్రోవ తొక్కించి ఎంతటి హానికలిగించిందీ వివరించాను. నానాటికీ అవనీ దుష్ప్రచారం మితిమీరటంవల్ల, అందరి సత్యాసత్యాలను తేల్చి తగాదా పరిష్కరింపవలసిందిగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఆజ్ఞాపించింది. మొట్టమొదటి వ్రాతప్రతి నా టైప్ రైటర్ మీదనే తయారైనదని రుజువైంది. మొదటి ప్రతి తన టైపుమీద తయారయినదనీ దాన్నే తస్కరించి, ప్రతిని తయారు చేసికొన్నాననీ వాదించాడు. ఐతే, అవనీ ఒకే ఒక ప్రతిని తయారుచేసియుండడనేది స్పష్టం; మరొక ప్రతిని దాఖలు చేయమన్నారు; చేయలేక పోయినాడు; ఇంతకంటె ముఖ్యమైన విషయం: అతడే గ్రంథకర్త ఐనట్లయితే, ప్రతి అధ్యాయంలోని ప్రధాన అంశాన్ని చెప్పమన్నారు. ఈపరీక్షను సంతోషంతో అంగీకరించాడు. కాని అతడు చెప్పిన విషయాలు గ్రంథంలోని విషయాలకు పూర్తిగా విరుద్ధం! ఏమైనా అతడు నాపై చేసిన ఆరోపణల నెవ్వరూ పట్టించుకోలేదు. చివరకు, అతణ్ణి తృప్తిపరచటానికై మరొక గ్రంథం వ్రాయమని కోరారు. అతడా గ్రంథం వ్రాయలేదు; వ్రాయలేడు కూడాను!

## INDIA IN TRANSITION

నా గ్రంథాన్ని రష్యన్ భాషలోనికి తర్జుమా చేశాను. రష్యన్ ప్రతి మాస్కోలో ప్రచురించారు. ఇంగ్లీషు ప్రతి ఉద్దేశ్యం ఇండియాలో ప్రచారం; అందుచే ఇండియాకు సులభంగా అందుబాటులో నున్నచోట అచ్చువేయాలి. బెర్లిన్ వెళ్లినప్పుడు ఇంగ్లీషు ప్రతిని అక్కడనే అచ్చువేయించాం; కాని జనీవాలోని ఒక ప్రచురణకర్త పేర ప్రచురింపబడింది. వాస్తవానికా పేరుగల ప్రచురణకర్త ప్రపంచంలోనే లేడు! అచ్చయిన వెంటనే, ఇండియాలో కొందరి వ్యక్తులకూ, గ్రంథాలయాలకూ తగినన్ని ప్రతులు పంపబడినై; అవి గమ్యస్థానం చేరినట్లు విశ్వసనీయంగా తెలిసింది. నేటికీ వానిని కొన్ని ప్రసిద్ధ గ్రంథాలయాలలో చూడవచ్చు. పుస్తకం ఇండియా చేరిన మరుక్షణమే Sea Customs Act క్రింద నిషేధింపబడింది. బహిష్కృత గ్రంథం కాబట్టి స్వేచ్ఛగా అమ్మటానికీ, కొనటానికీ వీలులేకపోయింది. ఐనా, ప్రముఖ ఆర్థిక శాస్త్రాధ్యాపకుల నా గ్రంథం ఆకర్షించింది. ముఖ్యంగా రైతు వర్గానికి సంబంధించినంత వరకూ, ఇండియా వ్యవసాయ సమస్యలను ఉత్తమంగా చర్చించిందని పేర్కొంటూ ఒక ఆర్థిక శాస్త్రాచార్యుడు తన విద్యార్థుల నా గ్రంథం చదువవలసిందిగా సూచించాడు.

అంతర్జాతీయంగాకూడా India in Transition గ్రంథానికి మంచి ప్రచారం లభించింది. జర్మన్ ప్రతి అచ్చయి సంవత్సరం నిండకముందే లక్ష కాపీలు అమ్ముడుపోయినై; ఇతర ఐరోపాభాషల్లో కూడా ప్రచురింపబడింది; విద్యాధిక వర్గాలలో సమీక్షింపబడింది. ఫిన్‌లాండ్ దేశంలో ఒక చరిత్రాచార్యుని అభిప్రాయంలో "శాస్త్రీయ దృక్పథం కలవారికి ఇండియా వాస్తవ పరిస్థితులను సవిమర్శకంగా వివరించే ప్రథమ ఏకైక గ్రంథం." ఇదే అభిప్రాయాన్ని అర్జంటైనా చరిత్రాచార్య డొకరు వెలిబుచ్చాడు: "భారతదేశం దేవతల, మహర్షుల రాజ్యం కాదనీ, అచటి ప్రజలంతా మానవులేననీ, ఇతర దేశాల ప్రజలవలెనే వారికీ సుఖదుఃఖాలూ, ఆశలూ, ఆకాంక్షలూ ఉన్నవనీ అందుచే సాధారణ సాంఘిక వికాస సూత్రాలే వారి చరిత్రకూ వర్తిస్తవనీ మొట్టమొదటి సారిగా వివరింపబడిన గ్రంథం".

సమకాలిక చరిత్రలో శ్రద్ధగలవారందరూ, ఆ పుస్తకాన్ని చదివి, అభినందించారు. ఇండియా కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలు, మార్క్సిస్టు ఆచరణలోనూ, విప్లవ రాజకీయాలలోనూ 'ఓనమాలు' నేర్చిన దా గ్రంథం నుండే అనటం అతిశయోక్తి కాదు. మొదట అందరూ తమ ఋణాన్ని సంతోషంతో అంగీకరించారు. తరువాత నేను ద్రోహినంటూ తిట్టిపోశారు. అదే కమ్యూనిజం నీతి! నే నా మతాన్ని పరిత్యజించటానికిగల కారణాల్లో ప్రధానమైనది ఆ మతం నీతి బాహ్యం కావటమే!

★

పదవ అధ్యాయంతో 'రాయ్ స్వీయ గాథలు' పరిసమాప్తమైనవి. ఈ రెండు అధ్యాయాలలో 1922 నుండి 1954 వరకు రాయ్ జీవితం సంక్షిప్తంగా వివరింపబడింది. ఇందలి విషయాలను పత్రికలనుండీ (Radical Humanist) రాయ్, తదితరులూ వ్రాసిన గ్రంథాలనుండీ సేకరింపబడినది.



# 11

# కోమింటరన్ - 'రాయ్'

# కోమింటరన్ - రాయ్

## భారత కమ్యూనిస్టు ఉద్యమం

కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ రెండవ మహాసభ తరువాత ఇండియాలోను, ఇతర ఐరోపా దేశాల్లోనూ, కమ్యూనిస్టు ఉద్యమాన్ని స్థాపించి విస్తరింపజేసే కార్యక్రమాన్ని రాయ్ నిర్వహించాడు. "The Vanguard of Indian Independence", "The Masses" అనే పత్రికలు ప్రకటించి వానినీ, పుస్తకాలూ, కరపత్రాలూ, విప్లవోద్యమ వ్యాప్తికి అవసరమైన ధనాన్నీ భారతీయ నావికులద్వారా, తదితర రహస్య మార్గాలగుండా ఇండియాకు పంపేవాడు. The Vanguard[1] 1922 నుండి 1928 వరకూ ప్రచురింపబడింది. ఇండియాలో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి ప్రధాన సాధనంగా ఉపకరించింది. ఈ ప్రచారాన్ని బ్రిటిష్ పోలీసులు పరిశోధించటంతో ఇండియాలో మూడు కమ్యూనిస్టు కుట్రకేసులు విచారణకువచ్చినై. అవి అన్నీ రాయ్ అనుచరులచే, రాయ్ ప్రోత్సాహంమీద జరిగినవే. వీనిలో కాన్పూరు కుట్రకేసు మూడవది. ఇందు పరోక్షంగా రాయ్ ప్రధాన ముద్దాయి. ఆ నేరంమీదనే రాయ్ ఇండియాకు తిరిగివచ్చిన తరువాత 1931 లో అరెస్టయినాడు!

### పెషావర్ కుట్రకేసు, 1921 :

యం. యన్. రాయ్ టాష్కెంటులో నున్నప్పుడు భారత ముజహిర్ కాందిశీకులకు రక్షణనిచ్చి వారితో భారత కమ్యూనిస్టు పార్టీకి అంకురార్పణ జరపటం చదివియేయున్నారు[2]. రష్యన్ల సందిగ్ధ విధానంవల్ల టాష్కెంట్ శిక్షణా కేంద్రాన్ని మూసివేయవలసి వచ్చింది. 1921 ఏప్రిల్ నెలలో రాయ్ టాష్కెంట్‌నుండి మాస్కోకు వెళ్ళినప్పుడు తనతో షౌకత్ ఉస్మానీ, అబ్దుల్ మజీద్, అబ్దుల్ కబీర్

---

1. The Vanguard రెండు నెలల కొకమారు బెర్లిన్, పారిస్, లండన్, జ్యూరిచ్, రోమ్ నగరాలనుండి వెలువడుతూ ఉండేది.

2. ఇటీవల భారత వామపక్ష కమ్యూనిస్టు నాయకుడైన ముజఫర్ అహమ్మద్ ఇండియన్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర వ్రాశాడు. "The Communist Party of India & Its Foundation Abroad". అందు తాను పార్టీ స్థాపకుల్లో ఒకడని వర్ణించుకొన్నాడు. ఇది అసత్యం; నాడాతడు టాష్కెంట్‌లో లేడు. కమ్యూనిస్టు దక్షిణ నాయకుడైన యస్. ఎ. డాంగే విషయం కూడా అంతే!

షెహారీలను తీసికొని వెళ్ళి ప్రాచ్య కార్మిక విశ్వవిద్యాలయంలో చేర్చాడు (University of the Toilers of the East). రాయ్ ఆ విశ్వవిద్యాలయానికి అధ్యక్షుడుగా ఉండేవాడు. ఆ రోజుల్లోనే మావ్ సేటుంగ్, హోచిమిన్ మొదలైన ఆసియా కమ్యూనిస్టు నాయకులా సంస్థలో శిక్షణ పొందారు.

టాష్కెంటులో శిక్షణ పొందిన మహమ్మద్ అక్బర్ అనే యువకుడు ఇండియాకు తిరిగివచ్చి విప్లవ కార్యక్రమాలు సాగించాడు. ఈతని చర్యలను గురించి బ్రిటిష్ పోలీసు ఉద్యోగి పి. బిగానే తయారు చేసిన "ఇండియన్ కమ్యూనిస్టు ముఠా-బెర్లిన్; 1-4-1921 — ?-11-1922" అను నివేదిక వల్ల తెలుస్తుంది. "బోల్షివిక్ కుట్ర" నేరానికి మహమ్మద్ అక్బరూ, అతని అనుచరుడైన బహదూరూ 1922 సెప్టెంబర్‌లో అరెస్టయినారు. వీరితోబాటు సామర్కాండుకు చెందిన ఎనిమిది మంది 'ముజహిదన్ల'ను [1] కూడా అరెస్టు చేశారు. అక్బర్ టాష్కెంటులో కమ్యూనిస్టుగా పరివర్తన చెంది, బోల్షివిక్ విప్లవ కార్యక్రమంలో సామర్కాండ్, కాబూలు నగరాలు దర్శించి అచట బ్రిటిష్ వ్యతిరేక వర్గాలను సంఘటిత పరుస్తున్నాడనే అభియోగం మీద, పెషావర్ జిల్లా మేజస్ట్రీటు జె. హెచ్. యస్. ఫ్రేజర్ విచారణ జరిపి అతనికి మూడేండ్ల కఠిన శిక్ష విధించాడు (31-5-1922). ఈ కుట్రతో సంబంధం ఉన్నదనే కారణంగా ఉమార్ మొదలైన ఎనిమిది మందికిగూడా శిక్ష విధింపబడింది. ఇదే ఇండియాలో జరిగిన మొదటి కమ్యూనిస్టు కుట్రకేసు.

## రెండవ కమ్యూనిస్టు కుట్రకేసు

1922 ఏప్రిల్ నెలలో రాయ్ తన సహచరులలో పన్నెండు గురిని ఇండియాకు పంపాడు. ఈ సమాచారం అక్టోబర్ నెలలో బ్రిటిష్ ప్రభుత్వానికి తెలిసింది. ఈ బృందానికి నాయకుడు రష్యా కమ్యూనిస్టు ఉద్యోగి గోల్డ్‌బెర్గ్. వీరిలో సలీమ్ అనే మారుపేరు గల అక్బర్‌షా, గోహర్, అఫ్జుల్ మొదలైనవారున్నారు. వీరిలో పదిమంది పట్టుబడ్డారు; ఏడుగురికి శిక్ష విధింపబడింది.

---

1. ముజహిదన్లది ఒక ప్రత్యేక చరిత్ర. వీరి ఉద్యమం 19 వ శతాబ్దంలో ప్రారంభమైంది. అయోధ్యలోని రాయ్ బారెల్లీ నివాసియైన సయ్యద్ అహమ్మద్ వీరి నాయకుడు. 1827 లోనే ఈతడు ఇండియా-ఆఫ్ఘనిస్థానుల మధ్య బునేర్‌లోని ఆస్మాన్ చెంత స్థావర మేర్పరచుకొని, ముజహిదన్ బృందాన్ని తయారు చేసి పంజాబులోని శిక్కు రాజ్యంపై 'జీహద్' ప్రకటించాడు. తరువాత 'ఆస్మాన్' బ్రిటిష్ వ్యతిరేక కేంద్రంగా తయారైంది. మూడవ ఆఫ్ఘన్ యుద్ధంలో ముజహిదన్లు ఆఫ్ఘనులతో చేరి బ్రిటిష్‌వారితో పోరాడారు. వీరికి కాబూలు తాత్కాలిక ప్రభుత్వ స్థాపకుడైన ఒబీదుల్లా ప్రోత్సాహం కూడా లభించింది.

ఈ బృందంలోనివాడే షౌకత్ ఉస్మానీ. చాలరోజుల వరకూ పోలీసుల కన్నులు గప్పి సంచరించాడు; కాన్పూరులో నేషనల్ ముస్లిం స్కూలులో హబీబ్ అహమ్మద్ అనే మారుపేరుతో సహాయోపాధ్యాయుడుగా పనిచేశాడు. చివరకు 1923 జనవరిలో ఉస్మానీని పోలీసులు పట్టుకున్నారు దాని ఫలితమే కాన్పూరు కుట్రకేసు.

## కాన్పూరు కుట్రకేసు, 1923 - 24

యం. యన్ రాయ్. 9-12-1922 నాటికి బెర్లిన్ చేరి, ఇండియాలో కమ్యూనిస్టు భావప్రచారానికి కార్యక్రమం నిర్ణయించటానికి ఒక సభ నేర్పాటు చేశాడు. ఆ సభలో చర్చించే నివేదికను తయారు చేయుటానికొక ఉపసంఘం నియమింపబడింది. అందలి సభ్యులు: (1) తాల్ హీమర్ (జర్మనీ), (2) హేకర్ట్ (జర్మనీ), (3) హెర్టా (రష్యా), (4) రాయ్ (ఇండియా), (5) రాయ్ సతీమణి ఈవ్‌లిన్ ట్రెంట్ [1] (అమెరికా), (6) జాట్టీ (ఐర్లెండ్), (7) భట్టాచారి (ఇండియా), (8) పీక్ (రష్యా). వీరి నివేదికను చర్చించిన తరువాత ఈ క్రింది తీర్మానం చేయబడింది: "ఉపసంఘ సభ్యుల్లో ఒకరు వెంటనే ఇండియా వెళ్ళి, రాయ్ మిత్రులనూ, కమ్యూనిస్టు సానుభూతిపరులనూ కలిసి, భారతీయ శ్రామికవర్గానికి సహాయం చేయటానికి కోమిన్‌టరన్ సర్వదా సంసిద్ధంగా నున్నదని నచ్చజెప్పాలి. ఆర్థికంగా, విప్లవ సలహా రూపంలో ఈ సహాయం సక్రమంగా అందే సదుపాయాలను ఆలోచించటానికై బాధ్యతగల భారతీయ ప్రతినిధులు వెంటనే యూరప్ రావాలి; 1923 మార్చిలో కోమిన్‌టరన్ బెర్లిన్‌లో జరిపే ప్రపంచ మహాసభకు భారతీయప్రతినిధులు హాజరు కావటంఅవసరం."

పై తీర్మానానికి అనుగుణంగా ఇండియాలో కమ్యూనిస్టులకు జాబులు వ్రాశాడు. వారి కార్యక్రమాన్ని గురించి సూచనలుచేస్తూ కరపత్రాలు వ్రాసి పంపాడు.[2] వానిని పరిశీలిస్తే, బాల్యదశలోనున్న భారత కమ్యూనిస్టు ఉద్యమానికి రాయ్ చేసిన సేవ స్పష్టమాతుంది?

---

1. ఈవ్‌లిన్ ట్రెంట్ స్టాన్‌ఫర్డు విశ్వవిద్యాలయంలో పట్టభద్రురాలు; 1915లో రాయ్ అమెరికాలో దిగినప్పుడు ఈమెను వివాహమాడాడు. రాయ్‌తో బాటు ఈమె మెక్సికో, మాస్కో, బెర్లిను వెళ్ళి కమ్యూనిస్టు ఉద్యమాల్లో పాల్గొన్నట్టు తెలుస్తుంది. ఇండియాను గురించిన 'One year of Nonco-operation' అనే కరపత్రాన్ని రాయ్, ఈవ్‌లిన్‌లు ఉభయులూ రచించారు. స్వీయగాథల్లో ఈమె ముచ్చట ఏమాత్రమూ కన్పింపదు. ఈ ఉభయులూ ఏ కారణంవల్ల, ఎప్పుడు, ఎచ్చట విడిపోయినదీ తెలియదు. ఇది స్వీయగాథల్లోని లోపంగా కొందరు విమర్శిస్తారు. ప్రస్తుతం ఈవ్‌లిన్ అమెరికాలోనే ఉంటున్నట్లు తెలుస్తున్నది.

2. ఈ పత్రాలన్నిటినీ రాయ్‌పై నేరాన్ని రుజువు చేయటానికై పోలీసులు సేకరించి 1930 లో కోర్టులో దాఖలు చేశారు.

మాస్కో నుండి 2-11-1922 నాడు యస్. ఎ. డాంగేకు రాయ్ వ్రాశాడు: "దేశంలోని వాస్తవ విప్లవశక్తులన్నింటినీ కూడగట్టి ప్రజాబాహుళ్యానికి సంబంధించిన పార్టీని స్థాపించాలి; పేరుతోనే హడలిపోయేవారుంటారు; అందుచే ఆ పార్టీకి People's Party అని పేరుపెట్టండి. రైతులూ, కార్మికులూ ఆ పార్టీకి సాంఘిక పునాదులు; కమ్యూనిస్టులూ, సోషలిస్టులు నాయకులు; శ్రామిక ప్రజాశ్రేయస్సులను రక్షింపగలిగినవారు వీరే ........ కమ్యూనిస్టుపార్టీ పేర నేర్పడిన బలమైన రాజకీయ పక్షాన్ని ప్రభుత్వం సహింపకపోవచ్చు; దాన్ని అణచటంలో ప్రభుత్వానికి బూర్జువాల నైతిక, భౌతిక సహాయం లభించవచ్చు. కాబట్టి క్రొత్తపార్టీని రెండు శాఖలుగా స్థాపించాలి: ఒకటి చట్టబద్ధమైన బహిరంగశాఖ; రెండవది రహస్యశాఖ. దాని కార్యక్రమాన్ని గురించి కరపత్రం వ్రాసి పంపుతున్నాను. ఆ కరపత్రం పేరు What Do We Want?"

డాంగే, సింగరవేలు, ముజఫర్ అహమ్మదులకు జాబులు వ్రాస్తూ వానితోబాటు గయలో సమావేశమౌతున్న భారత జాతీయ మహాసభ నుద్దేశించి ఒక కరపత్రం వ్రాసి పంపాడు. (To the All India National Congress, Gaya, India). అందులో కాంగ్రెస్‌కు రాయ్ సూచించిన మార్గం: "భారతదేశాన్ని హింసతో జయించి, హింసతో నిలుపుకొంటున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని హింసతోనే కూల్చివేయాలి. ఈ పోరాటంలో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఇండియాకు వెన్నండగా నిలుస్తుంది. ఐతే, ప్రతీపగామి బూర్జువావర్గ యాజమాన్యంనుండి విముక్తి పొంది, నేషనల్ కాంగ్రెస్, ప్రజాస్వామ్య గణతంత్రమే (Democratic Republic) తన లక్ష్యమని స్పష్టంగా ప్రకటించాలి. ప్రజలలో విప్లవాత్మక చైతన్యం వెల్లివిరియటానికై, రిపబ్లిక్ నిర్మాణానికి అనుసరించే రాజకీయ కార్యక్రమానికి ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమాన్ని జోడించటం అవసరం. బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి విశ్వాసపాత్రులై అభివృద్ధి నిరోధకులైన భూస్వామ్య ధనిక వర్గాలకు వ్యతిరేకంగా పేదరైతు ప్రజానీకాన్ని సంఘటితి పరచినపుడు ప్రజానీకంలో కాంగ్రెస్ వేళ్ళు తన్నుకొనుటయే గాక బ్రిటిష్ సామ్రాజ్య పునాదులు విచ్ఛిన్నమౌతై. బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని రక్షిస్తున్న స్థానిక సైన్యంలో చాలవరకు పేదరైతు వర్గంనుండి వచ్చినవారే. భూ సంస్కరణల కార్యక్రమంద్వారా రైతువర్గ సానుభూతిని పొందగలిగినప్పుడు స్థానిక సైనికులు జాతీయ స్వాతంత్ర్య ఉద్యమంవైపు మరలుతారు ........ ప్రజాశక్తితో బ్రిటిష్ సామ్రాజ్యన్నికూల్చే చరిత్రాత్మక పోరాటంలో సర్వదా మీకు మా (కోమింటరన్) సహకారం లభిస్తుంది. బ్రిటిష్ సామ్రాజ్యం నశించాలి! స్వతంత్ర భారత ప్రజానీకం వర్ధిల్లాలి!"

బెర్లిన్‌నుండి షౌకత్ ఉస్మానీకి వ్రాసిన జాబులో: ప్రస్తుతం ఇండియాలో ఐదు ముఠాలున్నై: (1) బొంబాయిలో యస్. ఎ. డాంగేముఠా (2) లాహోర్‌లో

జుగుల్ ముఠా (3) సంయుక్త పరగణాలలో నీవూ (4) కలకత్తాలో ముజఫర్ అహమ్మద్ బృందం (5) మద్రాసులో సింగరవేలు - ఈ ఐదు ముఠాలను సంఘటితం పరచాలి. దీనితో పంపుతున్న జాబును బొంబాయిలో నీకు తెలిసినవారికిపంపి డాంగేకు అందజేయి ........ చౌరిచౌరా శిక్షలను గురించి కార్మిక సంస్థలకు నేను పంపిన విజ్ఞప్తి అందేఉంటుంది. దానిని ప్రాంతీయ భాషలలోనికి అనువదించి ప్రకటించటానికి యేర్పాట్లు చేయండి" అని రాయ్ కోరాడు.

జ్యూరిచ్ నుండి సింగరవేలుకు ఈ విధంగా వ్రాశాడు : "ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ చమన్‌లాల్ పిడికిలి నుండి బయట పడటం ముదావహం. మణీలాలుకు మన కార్యక్రమం సమ్మతమైతే, నీవూ, మణీలాలూ కలిసి ఒక కరపత్రం యివ్వండి. అందులో : కార్మిక సంస్థల పరిస్థితిని వర్ణిస్తూ ప్రస్తుత నాయకత్వంలోని లోపాలను నిర్దాక్షిణ్యంగా విమర్శించండి. ప్రపంచ ఉద్యమాల అనుభవం ద్వారా సంస్కరణ వాదం నిష్ప్రయోజనమనీ, వర్గ చైతన్యం అవసరమనీ, రాజకీయాలతో సంబంధంలేని కేవల ఆర్థిక విధానం నిష్ప్రయోజనమనీ చాటండి .... .... విప్లవాత్మక నాయకత్వం లేనిచో కార్మికోద్యమం పాలకవర్గం చేతి కీలుబొమ్మగా దిగజారిపోతుంది; కార్మిక సంఘాలే ప్రజానీకానికి ప్రతినిధులని చెప్పలేము; కాని బాల్యదశలో నున్న కార్మికోద్యమంలో సనాతనత్వాన్నీ, సంస్కరణ ప్రియత్వాన్నీ నాయకులు తెచ్చి పెట్టవచ్చు. ముందుగా జాగ్రత్త వహిస్తే అట్టి ప్రమాదకర ప్రతీపగామి శక్తులను అరికట్టవచ్చు".

షౌకత్ ఉస్మానీకి ఈ విధంగా వ్రాశాడు : "కర్తవ్యాన్ని గురించి వ్రాసిన కొలదీ మీరు సూచనలు కోరటం నాకు ఆశ్చర్యంగా ఉంది .... .... పార్టీకి అంకితార్పణ చేయమని చాల మార్లు వ్రాశాను .... .... ఇండియాలో జరిగే ప్రతి పనికీ ఇక్కడి నుండి ఆర్థిక సహాయం అందటం కష్టం. .... .... నీ కలకత్తా ప్రయాణానికై కాన్పూరు అడ్రసుకు 25 పౌన్లు పంపుతున్నాను .... .... నిర్దుష్ట కార్యక్రమం లేనిదే ధన సహాయం లభిస్తుందని చెప్పలేను."

ముజఫర్ అహమ్మదుకు బెంగాలీలో వ్రాసిన జాబు : "ఎనిమిది మాసాలుగా మీ కార్యక్రమాలను గురించిన సూచనలు వ్రాస్తూ ఉన్నాను .... .... నీవు ఇక్కడికి వస్తేగాని మా చర్యల ప్రాధాన్యత పూర్తిగా అర్థం కాదు. కమ్యూనిస్టు లందరిలోనూ మనకు విశ్వాసం ఉంది .... .... ఐతే కొద్దిమంది సనాతన కమ్యూనిస్టుల ద్వారా ఇండియా విమోచన సాధ్యం కాదు .... .... మన దేశంలో కార్మిక సంఘాలు లేని మాట వాస్తవమే ........ మనమే నిర్మించాలి .... .... కాంగ్రెసును వశపరచుకొనటం సాధ్యమా ? ........ నీవు వ్రాసిన చిరునామాకే పుస్తకాలూ, పత్రికలూ, కరపత్రాలూ పంపుతున్నాను. ఇతర దేశాల నుండి కూడా పంపే యేర్పాట్లు చేశాను .... .... మీ

కార్యక్రమాన్ని గురించి తిరిగి వ్రాస్తున్నాను. పార్టీ స్థాపనకు నాందిగా రాష్ట్ర ప్రతినిధులతో ఒక మహాసభను సమావేశపరచండి. డాంగే, సింగరవేలుల మురాలూ, లాహోర్‌లోని 'ఇన్‌క్విలాబ్' సభ్యులూ తప్పక హాజరుకావాలి. వారి ప్రయాణాల కయ్యే ఖర్చులు పంపుతాను. ఎక్కడికి పంపాలో వ్రాయి ........"

కార్మిక పక్షాన్ని స్థాపించే అవసరాన్ని గురించి ఒక కరపత్రం వ్రాశాడు రాయ్. అందులో 'కార్యక్రమం' అనే శీర్షిక క్రింద :

"గులాం హుస్సేన్, షంసుద్దీన్ హసన్‌లు మహాసభ నుద్దేశించి కరపత్ర మొకటి ప్రకటించారు గదా! అందులో చెప్పినట్లు మహాసభలో స్వరాజ్యాన్ని గురించి చర్చించటానికి బదులు, ఒక కార్యక్రమాన్ని నిర్ణయించటమే సమంజసం. గయ జాతీయ కాంగ్రెస్ మహాసభకు నివేదించిన కార్యక్రమాన్నే మన పార్టీ కార్యక్రమంగా అనుసరించవచ్చు .... .... ఉత్పత్తి కారకమైన వర్గ స్వాతంత్ర్యం విప్లవాత్మక పోరాటం ద్వారానే సాధ్యమౌతుంది. ఆ విషయాన్నే మన కార్యక్రమంలో స్పష్టంచేయాలి. శ్రామిక నియంతృత్వ నినాదాన్ని ఆరాధించటానికి పూర్వం భారత శ్రామికవర్గం రాజకీయ చైతన్యం పొందాలి; సామ్రాజ్యవాదంపై జరిపే పోరాటంలోనే ఆ చైతన్యం లభిస్తుంది. ఐతే, ఈ పోరాటం బూర్జువా నాయకత్వంలోగాక, కర్షక-కార్మిక శ్రేయస్సులను రక్షించే పార్టీ నాయకత్వంలో జరగాలి. మన కార్యక్రమంలోని రాజకీయ సూత్రాలను రూపొందించటంలోనే, బూర్జువా జాతీయ పక్షాలకూ, శ్రామిక వర్గానికీ సహకారం సాధ్యమా, కాదా అనే సమస్యకు పరిష్కారం ఆధారపడుతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ఈ సహకారం సాధించవచ్చు. విప్లవ చైతన్యంగల ప్రజానీకం వత్తిడివల్ల, జాతీయ బూర్జువా వర్గానికి గల విప్లవ ప్రాశస్త్యం మనకు అనుకూల పడుతుంది. గ్రామ పంచాయితీలను గురించిన శుష్క ఉపన్యాసాలతో ప్రజలలో ఉత్సాహం కలగదు .... .... జమీందారీ విధానాన్ని పూర్తిగా రద్దుచేసినప్పుడే వ్యవసాయ సమస్యలకు సంపూర్ణమైన పరిష్కారం లభిస్తుంది".

ఆ కరపత్రంలోనే Illegal Organization అనే శీర్షిక క్రింద: "ప్రజాబాహుళ్యంతో పార్టీని స్థాపించే అవకాశం లేనప్పుడు, దానికి సమానాంతరంగా చట్టవిరుద్ధమైన వ్యవస్థనే రూపొందించమని సూచించాను;.... కమ్యూనిస్టుపార్టీని రద్దు చేయటాన్ని ఏమాత్రమూ అంగీకరించను ...ఆ పార్టీ ఛాపుటా నీడనే శ్రామికవర్గం విజయాన్ని సాధించగలదనేది ప్రపంచం నేర్పిన అనుభవ గుణపాఠం. అహింసా సూత్రాన్ని అంగీకరించి నంతమాత్రాన, కమ్యూనిస్టుపార్టీ శిక్షాస్మృతినుండి తప్పించుకొనజాలదని గుర్తుంచుకోవాలి. మనది, కార్మికోద్ధరణయే లక్ష్యంగాగల విప్లవాత్మక పక్షం. కార్మిక కర్షకవర్గాలు దోపిడికి బలియౌతున్నై; దోపిడీదారులను నిర్మూలించి

నప్పుడే ఈ వర్గాల విముక్తి సాధ్యమాతుంది. అట్టిది అహింసాయుతంగా జరుగుతుం దనటానికి అవకాశం కన్పింపదు. అహింస నవలంబించిన విప్లవ కారుల మనటం హాస్యాస్పదం. భారతదేశంలోనైనా అట్టి సిద్ధాంతం తలెత్తజాలదు."

* India in Transition అనే గ్రంథంలో రాయ్ ఇచ్చిన సందేశం : "ఆ విధంగా ప్రారంభమైన ప్రజాఉద్యమం వ్యవసాయ సమ్మెలుగా, ఆకలి తిరుగు బాట్లుగా, ధాన్యాగార దోపిడీలుగా, జమీలపై దొమ్మీలుగా పరిణమిస్తుంది. చిర కాలంగా రైతు ప్రజానీకం అణగారి పోతున్నది. మానవమాత్రులుగా జీవించేహక్కు తమకు గలదనీ, ఆహక్కును పొందటానికి బలప్రయోగమే మార్గమనీ వారు గుర్తించేటట్టు ప్రచారం చేయాలి. దాని ఫలితంగా, తరతరాలుగా మానసిక-ఆధ్యాత్మిక దాస్యంలో మగ్గుచున్న ప్రజలు చైతన్యవంతులై తమ శక్తిని గ్రహింపగలుగుతారు. అభివృద్ధి నిరో ధకమైన జోకొట్టే విధానానికి స్వస్తి జెప్పాలి. గోరక్‌పూర్, రాయ్ బారెల్లీ, చౌరీ చౌరా, మలబార్, మధ్యఇండియా, పంజాబులలో స్వచ్ఛందంగా విజృంభించినప్రజా వ్యతిరేకతను పెంపొందించి ఆసేతుహిమాచలం విస్తరించే దావానలంగామార్చాలి."

ఈ ప్రచారంతో బ్రిటిష్ ప్రభుత్వం హడలి పోయింది. 1923 ఫిబ్రవరి 14 వ తారీఖున పోలీసు పరిశోధనశాఖకు చెందిన హెచ్. వి. హేర్‌స్కాట్ దేశీయ వ్యవ హారశాఖకు ఈ విధంగా వ్రాశాడు: "మనం ఎంత జాగరూకతతో ఉన్నా కమ్యూనిస్టు సారస్వతం కొల్లలుగా దేశంలోకి దిగుమతి అవుతూనే ఉంది; అందులో ఎక్కువ భాగం పోస్ట్ ఆఫీస్ ద్వారానే చేరుతున్నది; ఆ సారస్వతం అందుకొనే వారిసంఖ్య నానాటికీ ఎక్కువౌతున్నది; మా దగ్గరనున్న జాబితాలోనే 500 పేర్లున్నై; రోజు రోజుకూ ఈ జాబితా పెద్దదౌతున్నది; మరికొంత సారస్వతం రహస్యంగా చేరు తున్నది." ఈ సారస్వతాన్ని పంపే వ్యక్తి యం. యన్. రాయ్ అనేది కూడా పోలీసులకు తెలిసిన విషయమే, పెషావర్ 'బోల్షివిక్' కుట్రకేసు నాటినుండీ రాయ్‌పై బ్రిటిష్ పోలీసులు కన్నువేసే ఉంచారు. వారి దృష్టిలో అత డొక ప్రమాదకరమైన కమ్యూనిస్టు ప్రచారకుడు. అతని ద్వారా బ్రిటిష్ సామ్రాజ్యంలో కీలకస్థానమైన ఇండియాపై దెబ్బతీయాలని రష్యా ప్రభుత్వం ప్రయత్నిస్తున్నదనే సంగతి 1923 మొద ట్లోనే పి. బిగానీ పరిశోధింపగలిగాడు. "రష్యన్లు, యం. యన్. రాయ్ ద్వారా ఇండియాలో విస్తృతమైన ఉద్యమానికి పునాదులు వేస్తున్నారు. ప్రభుత్వంపై దెబ్బ తీయటానికి ఉపకరించే ఏ సాధనాన్నీ నిర్లక్ష్యం చేయటం లేదు. ముఖ్యంగా, కాంగ్రెస్ కార్యకర్త, పత్రికా రచయిత, శ్రామిక ప్రజానీకం, విప్లవ కుట్రదారు వీరందర్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉపయోగించు కొంటున్నారు. ఇప్పుడే అందిన సమాచారాన్నిబట్టి (నవంబర్ 1923), కోమిన్‌టరన్ నాయకులకు రాయ్

---

* ఈ గ్రంథ రచనను గురించి స్వీయగాథలో చివరి అధ్యాయంలో రాయ్ వివరంగా వ్రాశాడు.

కార్యక్రమం బాగా నచ్చినట్లు తెలుస్తున్నది. ఇంత అల్పకాలవ్యవధిలో, కమ్యూనిస్టు ప్రచారం ఇండియాలో సాధించి నంతటి విజయాన్ని మరే ప్రాంతంలోనూ సాధింపలేకపోయింది; అందుచే, ఇండియాలో తమ ప్రయత్నాలను ద్విగుణీకృతం చేయాలని రష్యన్లు నిర్ణయించినట్లు తెలుస్తున్నది. జర్మనీలో కలిగిన పరాజయాన్ని ఈ విజయం భర్తీచేస్తుందని వారి ఆశ" అని బిగానీ వ్రాశాడు.

ఈ పరిశోధనల ఫలితంగా 1924 నాటికి, ఇండియాలో కమ్యూనిస్టు చర్యలను గురించి నివేదిక తయారైంది. అందులో అధికభాగం రాయ్ చర్యలను గురించినదే. బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూలద్రోయటమే ఆ చర్యల ఆశయం. అతని అనుచరులైన కుట్రదారులలో ముఖ్యులు: షౌకత్ ఉస్మానీ, ముజఫర్ అహ్మద్, గులాం హుస్సేన్, యస్. ఎ. డాంగే, సింగరవేలు చెట్టియార్, ఆర్. సి. యల్. శర్మ, నలినీగుప్త, యస్. డి. హసన్, యం. పి. టి. వేలాయుధన్, సంపూర్ణానంద్, మణీలాల్, సత్యభక్త. వీరందరినీ గాలించి పోలీసులు పట్టుకున్నారు. ప్రధాన ముద్దాయి రాయ్ మాత్రం దేశంలో లేడు. చివరకు ఉస్మానీ, అహ్మద్, డాంగే, నలినీగుప్తాలపై నేరం మోపబడింది. కాన్పూరు సెషన్సు కోర్టులో మే 20 వ తారీఖున విచారణ పూర్తయింది. "చక్రవర్తికి బ్రిటిష్ ఇండియా సార్వభౌమత్వాన్ని తొలగించే ఆశయంతో ఇండియా అంతటా 'కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ శాఖలు' అనబడే విప్లవ సంస్థలను నెలకొల్ప యత్నించినట్లు" వైవారిపై నేరం ధృవపరచింది. "వీరి ఆశయాలు ఎంతటి అసంబద్ధములైనవైనా, వీరు పరస్పరమూ, యం. యన్. రాయ్ తోనూ కలిసి బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూలద్రోయాలని ఆశించారనటం సుస్పష్టం" అంటూ కుట్రదారులు ఒక్కొక్కరికి నాల్గు సంవత్సరముల కఠిన జైలుశిక్ష విధించింది. ఈ శిక్షను అలహాబాదు హైకోర్టు ధృవపరుస్తూ, "బెర్లిన్‌లో నివసిస్తూ, మాస్కోలోని మూడవ ఇంటర్నేషనల్‌తో సంబంధమున్న యం. యన్. రాయ్ నుండి సూచనలేగాక, ధన సహాయాన్నికూడా పైనల్గురూ పొందుతున్నారు. వీరు యం. యన్. రాయ్‌కి వ్రాస్తున్న జాబులన్నీ, తమ నాయకుడైన ప్రధాన కుట్రదారుకు, ఉపకుట్రదారులు వ్రాస్తున్న ధోరణిలో ఉన్నై" అని నవంబర్ 10 వ తేదీన తీర్పు చెప్పింది.

సెషన్సు కోర్టులో యస్. ఎ. డాంగే ఇచ్చిన వాఙ్మూలం చాల వింతగా ఉంది. తాను కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రతినిధియైన యాష్లీని 1922 లో కలుసుకొన్నాడట; అతని ద్వారా రాయ్ భారతదేశ స్వాతంత్ర్యానికి కృషిచేస్తున్నట్లు విన్నాడట! కాని అట్టి ఉద్యమానికి తాను మాత్రం సుముఖుడను కాదని యాష్లీతో చెప్పాడట! ఐనా ప్రపంచ సోషలిస్టు ఉద్యమ ప్రగతిని గురించి తెలిసికొనే ఉద్దేశ్యంతో మాత్రమే రాయ్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడట; అదీ అతని విప్లవ దీక్ష!

కాన్పూరు కుట్రకేసు విచారణ సమాచారం ఎప్పటికప్పుడే రాయ్‌కి అందేది. కుట్రదారుల వాఙ్మూలాలు విన్నప్పుడాతని ఆశాభంగం, ఆవేదనా వర్ణనాతీతం! ఆ సమయంలో రాయ్ చేసిన వ్యాఖ్యానం: "జైలులో నాల్గు సంవత్సరాల శిక్షకు భయపడే ఉత్తర కుమారులా విప్లవకారులు? ఇట్టివారి వల్ల ఏ మాత్రం ప్రయోజనం లేదు; మనకు కావలసినది కాకలుదీరిన కమ్యూనిస్టులు. 'బోనులోనూ, న్యాయస్థానం లోనూ సమర్థులైనవారు లభించినట్లయితే భారత రాజకీయ చరిత్రలో కాన్పూరు కుట్రకేసు నూతనాధ్యాయాన్ని ప్రారంభించి యుండేది."

## చైనాలో యం. యన్. రాయ్

చైనాలో వక్రమార్గానపడిన కమ్యూనిస్టు ఉద్యమాన్ని సరిదిద్దటానికై, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్, రాయ్‌ని 1926 చివర్లో చైనా పంపింది. నాటికే పరిస్థితి పూర్తిగా విషమించటంచేత, చైనాలో రాయ్ కార్యక్రమం విఫలమై కమ్యూనిస్టు ఉద్యమం క్రూరంగా అణచివేయబడింది. ఇది సాకుగా భారత కమ్యూనిస్టులు రాయ్‌పై దుమ్మెత్తిపోసి, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నుండి రాయ్ బహిష్కరణకు అదేకారణంగా దుష్ప్రచారం సాగించారు. చైనా దుస్సంఘటన రాయ్ జీవితంలో పెద్దమలుపు అనటం వాస్తవమే. నాటినుండియే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అధికార శిఖరాలనుండి రాయ్ తిరోగమనం ప్రారంభమైంది. అంతేగాదు. హృదయంలేని అవకాశవాదంపై ఆధారపడిన కమ్యూనిస్టు కార్యక్రమ యదార్థ స్వరూపం రాయ్‌కి జ్ఞానోదయాన్ని కలిగించినట్లై, స్వేచ్ఛాసాధనంగా కమ్యూనిజంలో రాయ్‌కిగల విశ్వాసం నశించింది. విప్లవకార్యక్రమంలో తలమునకలౌతూనే రాయ్ "చైనా సమస్య"ను ఆమూలాగ్రంగా గతితార్కిక దృక్పథంతో పరిశీలించాడు. ఆ తాత్త్విక ఆలోచనాక్రమంలోనే కమ్యూనిజంనుండి మానవతావాదానికి రాయ్ పురోగమనం ప్రారంభమైనట్లు స్పష్టమౌతుంది. *

---

* చైనాను గురించి రాయ్ పెక్కు గ్రంథాలు వ్రాశాడు. అందు ముఖ్యమైనవి.

(1) The Chinese Revolution రష్యన్ భాషలో వ్రాయబడి సోవియట్ ప్రభుత్వ ప్రచురణశాఖ (Russian State Publishing Department) చే ప్రచురింపబడినది. ఇతర భాషల్లో ప్రచురింపరాదనే సోవియట్ ప్రభుత్వ శాసనంపట్ల క్రమశిక్షణతో, రాయ్ ఈ గ్రంథానికి సేకరించిన సమాచారమంతా ప్రభుత్వపరం చేశాడు. ఆ గ్రంథం మనకిప్పుడు దుర్లభం.

(2) Revolution and Counter Revolution in China : జర్మన్ భాషలో రచింపబడి, 1930 లో జర్మనీలో ప్రచురింపబడింది. ఇంగ్లీషుప్రతి ఇండియాలో 1946 లో ప్రచురితమైంది.

(3) My Experience in China : 1936 లో ఇండియాలో వెలువడింది. ఈ వ్యాసంలోని అంశాలలో అధికభాగం చివరి రెండుగ్రంథాల నుండి సేకరింపబడింది; చాలవరకు రాయ్ మాటలే వాడబడినై.

అంతర్జాతీయ సామ్రాజ్యవాదమూ, స్థానిక భూస్వామి - పెట్టుబడిదారీ - సేనాని వర్గాల దోపిడికి గురియౌతున్న చైనా కార్మిక - కర్షక - మధ్యతరగతి ప్రజానీకాన్ని కమ్యూనిస్టు సిద్ధాంతం ఆకర్షించటంలో వింతలేదు. 1920 లోనే కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడింది. నాటికి సన్‌యట్‌సేన్ చైనా ప్రజాస్వామ్య ఉద్యమ నాయకుడు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం విల్సన్ ఉదారవాదం పరాజయం పొందటంవల్ల పాశ్చాత్య ప్రజాస్వామ్య సహాయంలో విశ్వాసం సడలి, సన్‌యట్‌సేను కూడా సోవియట్ రష్యా సహాయం అర్థిస్తాడు. ఐతే, 1920 లో జరిగిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ద్వితీయ మహాసభలో వలసలలోని బూర్జువావర్గ విప్లవప్రాధాన్యతను గురించి లెనిన్, రాయ్‌ల మధ్య అభిప్రాయ భేదాన్ని గురించి పైన చదివియున్నారు. ఉభయుల సిద్ధాంతాలకు మధ్య రాజీధోరణిలో చైనా విధానం రూపొందింపబడింది. "కాంటన్‌లోని జాతీయ ప్రభుత్వంతో సహకరిస్తూ, కమ్యూనిస్టులు సన్‌యట్‌సేన్ పక్షమైన కూమిన్‌టాంగ్‌లో చేరి, దానిని సామ్రాజ్యవాదంపై పోరాటంలో బ్రహ్మాస్త్రంగా రూపొందించాలి." జెఫీ మొదలైన రష్యన్ సలహాదారులు చైనా వెళ్ళారు. కమ్యూనిస్టుల సాయంతోనే 1924 లో సన్‌యట్‌సేన్ కాన్‌టన్‌లో జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించాడు. కాని 1925 మార్చిలో మరణించాడు. వ్యాంగ్ చిన్‌వై కాన్‌టన్ ప్రభుత్వానికి నాయకుడైనాడు. ఇతడు ప్రజాస్వామ్యంలో గాఢ విశ్వాసం ఉన్న మధ్యతరగతి విద్యావంతుడు. 1925 మే నెలలో ట్సింగ్‌టీ, షాంఘై, హాంకాంగ్ నగరాలలో భారీయెత్తున కార్మికులు సమ్మెలు జరిపారు; కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం 800 నుండి 54,000 లకు పెరిగింది. కాన్‌టన్ ప్రభుత్వం 'ఎఱ్ఱ ప్రభుత్వ'మనే భయాలు ప్రారంభమైనై.

"సామ్రాజ్యవాదంపై జరిపే పోరాటంలో జాతీయ బూర్జువా వర్గంతో సహకరించాలి" అనే తాత్కాలిక సూచనను చైనా కమ్యూనిస్టులు వేదవాక్యంగా శిరసావహించి, వర్గవైరుధ్యమే విప్లవపోరాటానికి ఆధారమనే మార్క్సిస్టుసిద్ధాంతాన్ని పూర్తిగా విస్మరించారు. రైతు కూలీ విప్లవ కార్యక్రమాలను విస్తృతమూ, పటిష్ఠమూ చేసినచో వామపక్ష జాతీయవాదులతో సహకారం విచ్ఛిన్నమౌతుందనే భయంతో విప్లవం సామ్రాజ్యవాదపోరాట దశను దాటనంతవరకూ వర్గపోరాటాన్ని బలపరచ రాదని వాదింపసాగారు. రష్యన్ సలహాదార్లు ఈ వాదాన్ని సమర్థించారు. వీరిలో బొరొడిన్ ముఖ్యుడు. సోవియట్ ప్రభుత్వం కూడా అనేక రాజకీయకారణాలవల్ల కాంటన్ ప్రభుత్వంతోనేగాక, విప్లవ వ్యతిరేక పీకింగ్ ప్రభుత్వంతోనూ, ఫెంగ్ యు హిసియాంగ్ వంటి భూస్వామి - సేనాపతులతోనూ స్నేహసంబంధాలు నెలకొల్ప

కొన్నది. అందుచే చైనా కమ్యూనిస్టులూ, వారి రష్యన్ మార్గదర్శకులూ, రష్యా ఎత్తుగడలన్నీ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రూపొందించిన విప్లవ విధానంలోని అంశాలే వనే భ్రాంతిలో పడి బూర్జువావర్గంతోనేగాక, భూస్వామి - సేనాపతులతో సైతం పొత్తు కలపటం అవసరమని భావించారు. అంటే విప్లవకారులకు రైతు కార్మికవర్గాల విప్లవ సామర్థ్యంపై విశ్వాసం నశించింది. రైతులు భూస్వామ్యంపై దండెత్తరాదనీ, కార్మికులు సమ్మె చేయటం విప్లవ ద్రోహమనీ ప్రచారమైంది. ఈ విధానం ఆత్మహత్యా సదృశమై కూమిన్‌టాంగ్‌లో కమ్యూనిస్టులు చేరటంలోగల ఆశయానికే విఘాతమైంది. కమ్యూనిస్టు నాయకత్వంలో విశ్వాసం నీరసించిన మధ్యతరగతి సానుభూతితో ప్రతీపగామి నాయకత్వానికి బలం చేకూరసాగింది.

క్రమంగా విప్లవ వ్యతిరేక శక్తులకూ, జాతీయసేనానులకూ నాయకత్వం వహించి, చియాంగ్ కేషేక్ 1926 మార్చిలో కాన్‌టన్ ప్రభుత్వాన్ని వశపరచుకొన్నాడు; వ్యాంగ్ చిన్‌వై దేశం విడిచివెళ్ళాడు. చైనాసమైక్యత అనే సాకుతో, జాతీయ ప్రభుత్వాన్ని విప్లవశక్తుల ప్రభావంనుండి తప్పించే ఆశయంతో చియాంగ్ కేషేక్ ఉత్తరదండయాత్రను సంకల్పించాడు. విప్లవాన్ని విస్తరింపజేయవచ్చునసే ఆశతో కమ్యూనిస్టు లీ ప్రణాళికను బలపరిచారు. దండయాత్రా ప్రణాళికను తయారు చేసినది రష్యన్ సైనిక సలహాదారైన గాలెన్. రైతులు, కార్మికులు తండోపతండాలుగా జాతీయసైన్యంలో చేరారు. దండయాత్ర మొదటిదశలో వూహాన్‌నగరాలు ఆక్రమింపబడినై (వూచాంగ్, హాన్‌కౌ, హాన్యాంగ్). కాన్‌టన్ విప్లవప్రభుత్వం వూహాన్‌కు మార్చబడింది. కియాంగ్సీరాష్ట్రం ఆక్రమింపబడింది. ఈ విజయాలు కర్షక కార్మికులవే! గ్రామాలలో విప్లవోద్యమాలను పటిష్ఠంచేసే అవకాశాన్ని కమ్యూనిస్టులు చేతులారా జారవిడిచారు. సామ్రాజ్యవాదులతో రాజీపడి షాంఘై ప్రవేశించిన చియాంగ్ కేషేక్ కార్మికులపై దారుణ హింసాకాండ జరిపించాడు. అంతేగాదు, కార్మికసంఘాలను రద్దుచేయవలసిందిగా వూహాన్ ప్రభుత్వానికి శ్రీముఖం పంపాడు. చియాంగ్ విప్లవ విరోధియని రుజువైంది. ఐనా అతణ్ణి వ్యతిరేకిస్తే వామపక్ష జాతీయవాదుల ఆగ్రహానికి గురికాగలమనీ, సామ్రాజ్యవాదపోరాటం బలహీనమౌతుందనీ బొరొడిన్‌వర్గీయులంతా కర్తవ్యతామూఢులైనారు.

చైనాలో కమ్యూనిస్టుల అవకాశవాదాన్ని రాయ్ మొదటినుండీ ఖండిస్తూనే ఉన్నాడు. వారుకూడా రాయ్‌ని, "లెనిన్ తప్పులు దిద్దటానికి ప్రయత్నించే వామపక్ష కమ్యూనిస్టు" అని నిందించేవారు. పై సంఘటనలతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ చైనాకమ్యూనిస్టుల తప్పటడుగుల్ని గుర్తించి చైనావిధానాన్ని పునఃపరిశీలించటానికై 1926 నవంబరులో ఆత్యవసర సమావేశం జరిపింది. అందులో రాయ్ సూచనలపై ఒక నిర్ణయంజరిగింది: "చైనా విప్లవం ప్రజాస్వామ్య దశలోనే ఉండటం చేత, వర్గసహకారమే దానికి సాంఘికపునాదిగా ఉండాలి; ఈసహకారం క్రమంగా

రైతు - కార్మిక - మధ్యతరగతులకే పరిమితమై తీరుతుంది. కాబట్టి విప్లవ నాయకత్వానికి శ్రామికవర్గం సంసిద్ధమై యుండాలి; వూహాప్రభుత్వంలో చేరిన కమ్యూనిస్టులు దానిని ప్రజాస్వామ్య నియంతృత్వానికి సాధనంగా రూపొందించాలి. ఈ కార్యక్రమంలో భూమిని జాతీయంచేయటమే కమ్యూనిస్టుల నినాదం." ఈ విధానానికి మొదట్లో వ్యతిరేకించినా, చివరకు స్టాలిన్ సమ్మతించి దీన్ని వెంటనే అమలుజరపటానికై 1926 నవంబరులోనే రాయ్‌ని చైనా పంపాడు.

రాయ్ హాన్‌కా చేరేసరికే పరిస్థితులు విషమించినై. వూహాన్ ప్రభుత్వానికి వ్యాంగ్‌చిన్‌వై అధిపతియైనప్పటికీ అధికారం సేనాధిపతియైన టాంగ్ షెన్‌చీ హస్తగతమైంది. టాంగ్ సలహాదారులందరూ విప్లవద్రోహులే. కమ్యూనిస్టులూ, బొరోడినూ టాంగ్‌ను వామపక్ష జాతీయవాదిగా గుర్తించి అతనితో సహకరిస్తున్నారు. ఇట్టి పరిస్థితిలో, అతి కష్టంమీద రాయ్ పార్టీ కార్యవర్గాన్ని హాంకౌలో సమావేశపరచి రైతు, కార్మిక ఉద్యమాలను తీవ్రతరం చేయాలనీ, గ్రామపరిపాలనను హస్తగతం చేసికోవాలనీ తీర్మానాలు చేయించాడు; కాన్‌టన్ కమ్యూనిస్టులచేత చియాంగ్ దౌర్జన్యచర్యలకు సంజాయిషీకోరుతూ ఒక కరపత్రాన్ని యిప్పించాడు. ఈ చర్యలవల్ల కమ్యూనిస్టులకూ, వామపక్ష నేనానులకూ మధ్య సహకారం నశిస్తుందని తన అసమ్మతిని, చైనా కమ్యూనిస్టునాయకుడైన చెన్ టు హిసియూ మాస్కోకు తెలియజేశాడట! చెన్ టు హిసియూను బొరోడిన్ ప్రోత్సహించాడు. సర్వాధికారముతో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రత్యేక ప్రతినిధిగా రాయ్‌వచ్చినప్పటికీ, బొరోడిన్ చేతిలో కీలకమైన ఆర్థికఅధికారం ఉండేది. అదీగాక 1923 నుండీ చైనాలో ఉంటూఉండటంవల్ల చైనాకమ్యూనిస్టులు బొరోడిన్‌పట్ల ప్రత్యేకాభిమానం వహించేవారు. రాయ్, బొరోడిన్లు వ్యక్తిగతంగా స్నేహితులే! కాని, చైనాలో బొరోడిన్ ప్రవర్తనకు సరియైన అర్థం దొరకదు, బొరోడిన్ సహాయ నిరాకరణతోనే చైనాలో రాయ్ ప్రణాళికలు విఫలమై చైనావిప్లవం అధోగతిపాలైంది!

ఈలోగా, పీకింగ్ ప్రాంతాల్లో నున్న ఫెంగ్ హిసియాంగ్‌తో సంప్రదించి, చియాంగ్‌పై దండయాత్రకు సంకల్పించాడు టాంగ్. నాటికి నాన్‌కింగ్‌లో స్థావరమేర్పరచుకొన్నాడు చియాంగ్. విప్లవ విస్తరణ అనే పాత ఆశయంతోనే బొరోడిన్ వర్గీయులు టాంగ్ ప్రణాళికకు అంగీకరించారు. కాని ఈ సైనిక సాహసం వల్ల బూర్జువా సైనిక శక్తి ఇనుమడించి విప్లవ వ్యతిరేకత బలపడే ప్రమాదం కలదని వాదించి, రాయ్ ఒక ప్రత్యామ్నాయ ప్రణాళికను సూచించాడు. వూహాన్ రాష్ట్రాల్లో రైతు సంఘాల ద్వారా గ్రామ పంచాయితీ, లేక సోవియట్లు పరిపాలన నేర్పాటుచేసి, ఇదే విప్లవ కార్యక్రమాన్ని క్వాంగ్‌టుంగ్ మున్నగు దక్షిణ రాష్ట్రాలకు విస్తరింపజేయాలనీ, క్రమంగా గ్రామ పంచాయితీలే విప్లవ రాజ్యానికి ప్రాతిపదిక

గానూ, విప్లవ సైన్యానికి బీజప్రాయంగానూ రూపొందగలదనీ రాయ్ ప్రణాళిక.* విప్లవ ప్రగతిలోని ఆంతర్యాలు గ్రహింపలేని చైనా కమ్యూనిస్టులు బోరొడిన్ అవకాశ వాదాన్నే అనుసరించారు. టాంగ్ దండయాత్ర విఫలమైంది; కాన్‌టన్ విప్లవ సైన్యం సర్వనాశనమైంది. యుద్ధ అవసరాలకు అనుగుణంగా వూహాన్ రాష్ట్రాల్లో రైతు కార్మిక ఉద్యమాలు అణచివేయబడినై; ఇందుకు కమ్యూనిస్టుల సానుభూతి సహకారాలు లభించినై!

ఇంతలో హూనాన్‌లోనూ, చాంగ్షా దగ్గరా, టాంగ్ సైన్యంలోని అధికారులు తిరుగుబాట్లు చేశారు. వీరు భూస్వామి వర్గాలవారనీ, గ్రామాలలోని రైతుల దౌర్జన్యాలే వీరి తిరుగుబాటుకు కారణమనీ, కాబట్టి రైతులను అదుపులో నుంచాలనీ టాంగ్ కమ్యూనిస్టులను హెచ్చరించాడు. బోరొడిన్ కూడా రైతు దౌర్జన్యాలను ఖండింపసాగాడు. అతని సలహాపైనే, ఆంతరంగిక-వ్యవసాయ మంత్రి, టామ్ పిన్ షాన్ స్వయంగా హూనాన్ వెళ్ళి రైతు ఉద్యమాల నణచివేశాడు. "ప్రతీపగామి సేనానుల సానుభూతికై రైతు-కార్మిక విప్లవ చర్యల నణచటం తెలివి తక్కువనీ, విప్లవోద్యమాన్ని పటిష్ఠం చేయటమే తక్షణ కర్తవ్యమనీ రాయ్ చేసిన సూచనలను త్రోసిపుచ్చారు. ఇక వీరితో లాభంలేదని గాలెన్ ముననుగు రష్యన్ల సహాయంతో, స్థానిక కమ్యూనిస్టు కార్యకర్తల ప్రోత్సాహంతో రాయ్, 20 వేల కర్షక సైన్యాన్ని తయారుచేశాడు; హాన్యాంగ్ ఆయుధ కర్మాగారాన్ని ఆక్రమించటానికి పదివేలమంది కార్మికులు సమాయత్తమైనారు. ఈ ప్రణాళికకు సమ్మతించి నట్లే నటిస్తూ చివరి క్షణంలో బొరొడిన్ చేసిన నమ్మక ద్రోహంతో ఈ ప్రణాళిక

---

* ఇటీవల కమ్యూనిస్టు చైనాలో ప్రచురింపబడిన చరిత్రలోని ఈ క్రింది వాక్యాలను పరిశీలించండి :

"సామ్రాజ్యవాదంతోనూ, భూస్వామ్యంతోనూ పోరాడటానికి దేశంలోని శక్తులన్నింటినీ సంఘటితపరచటానికి కూమిన్‌టాంగ్‌తో సహకారం తప్ప మార్గాంతరం లేదు. ఈ కూటమిలోనే ప్రజాస్వామ్య పద్ధతులలో పునర్నిర్మింపబడిన విప్లవ ప్రభుత్వ అంగాల్లోనూ, సైన్యంలోనూ కీలక స్థానాలను ఆక్రమించటానికి కమ్యూనిస్టులకు మంచి అవకాశం లభించింది; ఇంతకు మించి విప్లవ భవిష్యత్తును ఆశాజనకంగా చేయటానికి వేరు మార్గంలేదు. కాని కూమిన్‌టాంగ్‌లోని మితవాద పెట్టుబడిదారీ-భూస్వామి వర్గాల భయాలను తొలగించే ఆశయం పెట్టుకొని పట్టి బృహన్నలవలె, చెన్‌టుహిసియా (కమ్యూనిస్టు నాయకుడు) పై విధానాలను అనుసరింపలేక పోవుటయే గాక, విప్లవ సైన్యాలచే విముక్తి చేయబడిన ప్రాంతాలలో రైతు-కార్మిక నినాదాలు కార్యరూపంలోకిరాకుండా ద్రోహియై పార్టీ అధికారాన్ని వినియోగించుకొన్నాడు."

From Opium War to Liberation by Ireal Epstein Page 90
New World Press, Peking, 1956.

కూడా విఫలమైంది. టాంగ్ సేనానులు విప్లవశక్తులపై ప్రతీకారచర్యలకు పూనుకొన్నారు.

దేశమంతటా విప్లవశక్తులు నీరసించి, ప్రతిఘటన విజృంభిస్తున్నది. చియాంగ్‌తో చేరటానికి టాంగ్ మంతనాలు ప్రారంభించాడు. అట్టి విషమపరిస్థితిలో వ్యాంగ్ చిన్‌వై సహకారంతో విప్లవాన్ని రక్షించటానికి రాయ్ తుది యత్నం చేశాడు. వ్యాంగ్ కమ్యూనిస్టు అవకాశవాదంతో విసివి పోయినాడు; అతనిలో భయాందోళన లెక్కువైనై. అతడు రాయ్‌తో అన్న మాటలు: "అన్ని విధాలా నాకు మాస్కో వెన్నుండగా ఉంటానని వాగ్దానమిచ్చిన మీదటే వూహాన్ ప్రభుత్వానికి ఆధిపత్యం వహించాను. కాని, నన్ను తొలగించటానికై కమ్యూనిస్టులు సేనాపతులతో చేరి కుట్రలు పన్నుతున్నారు". అట్టి వ్యాంగ్‌లో మాస్కో సహకారాన్ని గురించి నమ్మకం కలిగించి, అతనిచేత ఒక విప్లవ ప్రణాళికను సమ్మతింపజేశాడు రాయ్. వ్యాంగ్ కోరిన మాస్కో వాగ్దానం ఆలస్యంగా చేరింది. ఇంతలో టాంగ్‌తోసహా వూహాన్ ప్రభుత్వ సభ్యులందరూ చియాంగ్‌పక్షం చేరటానికి సన్నాహాలు పూర్తి చేశారు. అప్పటికే కమ్యూనిస్టులలో విశ్వాసం కోల్పోయిన వ్యాంగ్ చిన్‌వై మాస్కో సందేశాన్ని స్వయంగా చూస్తేగాని నమ్మనన్నాడు. అది అతనికి ఉద్దేశింపబడిన సందేశమే! అందలి సారాంశం, ఒకప్పుడు మాస్కో చేసిన వాగ్దానమే! ఆ సందేశం ప్రతిని రాయ్ వ్యాంగ్‌కు యిచ్చాడు; ఈ సమాచారాన్ని వ్యాంగ్ తన అనుచరులకు తెలియజేశాడు. ప్రతిఘటనోద్యమానికి సిద్ధంగా ఉన్న వారికిది అవకాశమైంది. కమ్యూనిస్టులను ద్రోహులంటూ నిందించి, వారిని కూమిన్‌టాంగ్ నుండి బహిష్కరించారు; వారి రష్యన్ సలహాదారులను చైనా విడిచి వెళ్ళవలసిందని ఆజ్ఞాపించారు.

ఈ పరిస్థితిలో బొరోడిన్ సలహాపై కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సమావేశమై వర్గపోరాటాన్ని త్యజిస్తూ 'తిరోగమన వేదిక' (Platform of Retreat) ను రూపొందించింది. ఈ సమావేశానికి హాజరు కావటానికి రాయ్ నిరాకరించాడు. 'తిరోగమన వేదిక'ను లక్ష్యం చేయక ప్రతిఘటనశక్తులు కమ్యూనిస్టులను దారుణ హింసాకాండకు గురిచేశారు. "ప్రజాఉద్యమం జాతీయవాదులకు ఘనమైన విజయాలు చేకూర్చింది; కాని తనపై జరగబోయే దాడి నెదుర్కొనే బలాన్ని సమకూర్చుకొనలేకపోయింది. ప్రజాఉద్యమ పునాదులను బలహీనంగా ఉంచాలనే ఉంచారు; అందుచే అనతికాలంలోనే ఆ ఉద్యమం కూలిపోయింది. అదొక దుర్భరవిషాదాంత నాటకం" అంటాడు రాయ్.

ఇండియాకు తిరిగివచ్చినతరువాత కమ్యూనిస్టులు తనపై సాగిస్తున్న ప్రచారానికి సమాధానంగా రాయ్ వ్రాసిన మాటలు:

"ఇది కేవలం ద్వేషంతో చేస్తున్న దుష్ప్రచారం; బాధ్యతా, అధికారమూ ఉన్నవారెవరూ నాపై అటువంటి అభియోగాన్ని తీసుకురాలేదు; ఆ నేరంచేసినది చైనాకమ్యూనిస్టుపార్టీనాయకులూ, సోవియట్ ప్రతినిధి బోరోడినూ అని రుజువు చేయటానికి కొండంత సాక్ష్యం నా దగ్గరఉంది. అవకాశవాదం విప్లవశక్తుల నైతిక బలాన్ని మట్టుబెట్టుతున్న క్లిష్టపరిస్థితిలో చైనావెళ్ళాను. విప్లవనాయకులే విప్లవానికి ద్రోహంచేశారు. ఆ ద్రోహంనుండి విప్లవాన్ని రక్షించటానికై నాశక్తికొలదిగా ప్రయత్నించాను. నా సూచనపై కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఇచ్చిన సలహాను—నిర్దుష్టమైన విప్లవమార్గం[1] అనుసరింపవలసిందని — చైనాకమ్యూనిస్టులు నిరాకరించినందువల్లనే చైనాప్రజానీకం దారుణహింసకు గురియైంది. ఈ విప్లవ విద్రోహం హృదయవిదారకమైన విషాద సంఘటన. ఆ రక్తపాతం చైనానుండి నేను బైటపడిన తరువాతనే జరిగింది. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ పత్రాల్లోగానీ, మరి యే అధికార పత్రాల్లోగానీ, నాపై నేరంమోపే ఒక్కవాక్యాన్నయినా చూపవలసిందిగా నాపై దుష్ప్రచారం చేస్తున్న అసత్యవాదులను సవాలుచేస్తున్నాను! చైనానుండి మరలిన తరువాతకూడా బాధ్యతాయుత పదవుల్లో ఒకసంవత్సరంవరకూ మాస్కోలోవున్నాను. ఆ రోజుల్లోనే చైనాలో విప్లవప్రతిఘటన భయంకరంగా విజృంభించింది. అందుకు ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ ఏమాత్రమైనా నాకు బాధ్యత ఉన్నట్లయితే నా తల ఎగిరిపోయేది; మాస్కోనుండి బైటపడేవాణ్ణేగాదు. ఇంతమాత్రమే కాదు. నేను మాస్కోవచ్చినంతనే, కమ్యూనిస్టుఇంటర్నేషనల్ అధ్యక్షవర్గమూ (Presidium) సోవియట్ రష్యా కమ్యూనిస్టుపార్టీ రాజకీయశాఖా కలిసి చైనాసంఘటనలనుగూర్చిన నివేదికను విచారించటానికై ఒక సంఘాన్ని నియమించింది. అందులో స్టాలిన్ కూడా సభ్యుడు. ఈ సంఘంవారు, విప్లవానికి నేను ద్రోహంచేశాననటానికి బదులు, నన్ను అభినందిస్తూ తీర్మానించారు. ఆ తీర్మానాన్ని రూపొందించినవాడు స్టాలిన్."

## కోమిన్‌టరన్‌నుండి బహిష్కరణ

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ వ్యవస్థాపకులలో యం. యన్. రాయ్ ఒకడు.[2] కోమిన్‌టరన్ కార్యక్రమాన్ని, ఆర్థికంగా వెనుకబడియుండే సామ్రాజ్య

1. 1932 లో మాస్కోలో ప్రకటింపబడిన ఒక గ్రంథంలో: "బాల్యదశలో నున్న చైనాకమ్యూనిస్టుపార్టీకి యమ్. యన్. రాయ్ ప్రపంచ బోల్షివిజం అనుభవాన్ని చేకూర్చాడు." అని వ్రాయబడింది మాస్కోలోనే 1936 లో అన్నాలూయీ స్ట్రాంగ్ రచించిన "China's Millions" అనే గ్రంథంలోకూడా చైనాలో రాయ్ ప్రణాళికలు అభినందింపబడినై.

2. "లెనిన్ స్టాలిన్-యుగంలో రష్యా నేతర కమ్యూనిస్టు లందరిలో ఆకర్షణీయమైన వ్యక్తిత్వంగలవాడు యం. యన్. రాయ్ అనటంలో సందేహం లేదు" అని ఇటీవల కాలిఫోర్నియా విశ్వవిద్యాలయాచార్యుడైన ఆర్. సి. నార్త్ Mission to China అనే గ్రంథంలో వ్రాశాడు.

వాదుల దోపిడికి బలియగుచున్న వలసల స్వాతంత్ర్య విప్లవోద్యమాలపట్ల కమ్యూనిస్టు విధానాన్ని లెనిన్‌తోబాటు రూపొందించినాడు. తూర్పుదేశాల కమ్యూనిస్టులకు శిక్షణనిచ్చే కేంద్రాలకు అధ్యక్షుడైనాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రెండవ మహాసభ తరువాత ఐరోపా దేశాల్లోనూ, ఇండియాలోనూ కమ్యూనిస్టు ఉద్యమాన్ని వ్యాపింపజేసే బాధ్యత వహించి బెర్లిన్‌లో కార్యస్థానాన్ని నెలకొల్పి ప్రచారం సాగించాడు. ఆ రోజుల్లోనే ఇండియాలో కాన్పూరు కుట్రకేసు విచారణ జరిగింది. 1924 జనవరిలో రాయ్‌ని బెర్లిన్‌నుండి జర్మన్ ప్రభుత్వం బహిష్కరించింది. అందుచే జ్యూరిచ్‌లో (స్విట్జర్లాండ్) కొంతకాలమూ, అన్నెసీ (ఫ్రాన్సు) లో కొంతకాలమూ గడిపి తన కార్యస్థానాన్ని పారిస్‌కు మార్చాడు. 1924 జూన్‌లో జరిగిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఐదవ మహాసభలో రాయ్‌ని కార్యవర్గంలోనూ, అధ్యక్షవర్గం (Presidium) లోనూ సభ్యుడుగా ఎన్నుకొన్నారు. ఆ సభలోనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ నియమించిన 'వలస సంఘము'లో స్టాలిన్, కాటయామాలతోబాటు రాయ్ సభ్యుడైనాడు. 1925 జనవరిలో ఫ్రెంచి ప్రభుత్వం రాయ్‌ని అరెస్టుచేసి పారిస్‌నుండి మాస్కోకు పంపారు. ఈ సమయంలోనే రాయ్‌కీ, బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీకీ అభిప్రాయభేదాలు పొడసూపినై. ఇండియా కమ్యూనిస్టు ఉద్యమాన్ని తన చెప్పు చేతల్లో నుంచుకోవాలని బ్రిటిష్ కమ్యూనిస్టుల ఆశయం; ఇండియా శ్రేయస్సుల కది చాల ప్రమాదకరమని రాయ్ అభిప్రాయం.

## సామ్రాజ్య ఉపసంహరణ సిద్ధాంతం

రాయ్ చైనాలో ఉన్న సమయంలో ఇండియన్ కమ్యూనిస్టు ప్రతినిధులు మాస్కో వెళ్ళి, ఇండియా ఉద్యమంపట్ల రాయ్ భావాలనుగురించి బుఖారిన్‌తో ఫిర్యాదు చేశారట! ఆ భావాలకు బుఖారిన్ 'సామ్రాజ్య ఉపసంహరణ సిద్ధాంతము' (Theory of De colonisation) అనే పేరు పెట్టి, రాయ్ మాస్కోకు తిరిగి వచ్చినంతనే తన సిద్ధాంతాన్ని వివరింపవలసిందిగా కోరాడు. రాయ్ వివరణ ననుసరించి సామ్రాజ్య ఉపసంహరణ సిద్ధాంత సారాంశం: "మాతృదేశంనుండి పెట్టుబడులను ఎగుమతిచేసే సామర్థ్యంమీదనే ఆధునిక సామ్రాజ్యాలు స్థాపింపబడుతున్నై. బ్రిటన్ యుద్ధానికి పూర్వం ఇండియాలో అపారంగా పెట్టుబడి పెట్టింది; అందుకు కారణం బ్రిటన్ పరిశ్రమలు బాగా వికాసంచెంది పెట్టుబడికి స్థానికంగా అవకాశం లేకపోవుటయే. ప్రపంచయుద్ధంతో పరిస్థితి తారుమారైంది. 1880 - 1913 మధ్యలో బ్రిటన్ విదేశ పెట్టుబడులు దినదినాభివృద్ధిచెంది యుద్ధానంతరం క్రమంగా దిగజారినై; అందుకీ క్రింది అంకెలే నిదర్శనం!

బ్రిటన్ పెట్టుబడి ఎగుమతులు

| సంవత్సరం | 1920 | 1923 | 1924 | 1925 |
|---|---|---|---|---|
| మిలియన్ పౌన్లు | 200 | 170 | 86 | 54 |

"అంతేగాక, ఇండియా ప్రభుత్వం తరచు బ్రిటన్‌లో రుణాలు చేస్తూండేది; ఆ రుణాలు 1923 నుండి ఆగిపోయినై. ఈ పరిస్థితికి కారణం బ్రిటన్‌లో యుద్ధానంతరం పరిశ్రమలు క్షీణించి పెట్టుబడి నీరసించింది. ఈ లోపాన్ని భర్తీచేసి కొనటానికై పూర్వం ఇండియానుండి ప్రభుత్వశాఖల వ్యయం రూపంలో వసూలు చేస్తున్న కప్పాన్ని శ్రామికవర్గ ఉత్పత్తులరూపంలో వసూలు చేయవలసివచ్చింది. అంటే ఇండియా, బ్రిటన్ కొరకు ఉత్పత్తిచేయాలి! భారతదేశం పారిశ్రామికంగా అభివృద్ధిజరగాలి; అందుకు అవసరమైన పెట్టుబడి భారతదేశంలోనే తయారుకావాలి.

"బ్రిటిష్ సామ్రాజ్యవాదంలో యుద్ధంవల్ల ఆంతరంగికంగా నేర్పడ్డ ఈ క్లిష్టత వల్ల 'చిన్న మేకైనా ఇండియాలో తయారుకాగూడదు' అన్న పిట్టు మంత్రి విధానానికి స్వస్తిజెప్పి ఇండియాలో పరిశ్రమలను ప్రోత్సహించాలి. ఇట్టి పరిస్థితిలో తమ వాణిజ్య శ్రేయస్సులకు ప్రమాదం యేర్పడకుండా భారతీయ బూర్జువా వర్గాన్ని ఇంగ్లీషు బూర్జువా వర్గం భాగస్వామిగా అంగీకరిస్తుంది. ఇందుకు 1913 నుండి ఇండియాలో జరిగిన పారిశ్రామికాభివృద్ధి, వాణిజ్య విస్తరణ నిదర్శనం.

పారిశ్రామికాభివృద్ధి

| సంవత్సరం | 1913 | 1920 | 1924 | 1925 | 1926 |
|---|---|---|---|---|---|
| దుక్క ఇనుము (వేల టన్నులు) | 207 | 316 | 891 | 894 | 927 |
| ఉక్కు ,, | 32 | 159 | 340 | 456 | 457 |

విదేశ వాణిజ్యంలో ఇండియా నికర లాభం

| సంవత్సరం | 1913 | 1923 | 1924 | 1925 |
|---|---|---|---|---|
| లాభం (మిలియన్ రూపాయలు) | 210 | 680 | 517 | 1092 |

"ఇండియన్ ప్రభుత్వం స్వేచ్ఛా వాణిజ్యానికి గూడా స్వస్తి చెప్పి విదేశ సుంకాలను విధించటం ప్రారంభించింది; పరిశ్రమలకు రక్షణ కల్పించింది. ఇట్టి పరిస్థితుల వల్ల 1928 ఆగస్టు నెలలో Economist అనే బ్రిటిష్ పత్రిక 'ఇండియాలో బ్రిటిష్ పరిపాలన తన ప్రయోజనాన్ని కోల్పోయింది' అని వ్యాఖ్యానించింది.

"ఈ ఆర్థిక పరిణామాల ఫలితంగా, భారతదేశ పారిశ్రామికాభివృద్ధిలో స్థానిక బూర్జువా వర్గానికి స్థానం లభిస్తుంది. క్రమంగా పరాధీన రాజ్యంగా (Dependency) వుంటున్న ఇండియాకు అధినివేశ ప్రతిపత్తి లభిస్తుంది. ఈ అవకాశాలనూ, అధికారాలనూ ఇండియన్ బూర్జువా జాతీయవాదులు స్వయంగా జయించినవి కావు; ఆంగ్లేయులు తమకు తప్పనిసరియై భారతీయులకు ప్రసాదించినవే. సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటిస్తున్నట్లే కన్పిస్తూ ప్రజా విప్లవ పురోగతిని నుంచు పరుస్తూ స్థానిక బూర్జువా వర్గం ఆంగ్లేయులతో రాజీపడుతుంది. చౌరిచౌరా సంఘటన సాకుగా 1920లో ఉద్యమాన్ని ఉపసంహరించటం, తరువాత సైమన్ కమీషనును

బాయ్‌కట్ చేస్తూనే వారి ప్రతిపాదనలను అంగీకరించటం, ఇండియన్ బూర్జువా రాజీ ధోరణికి నిదర్శనం. కాబట్టి, ఆంగ్లేయుల సామ్రాజ్య ఉపసంహారణ విధానంవల్ల జాతీయ బూర్జువా వర్గానికి గల విప్లవ ప్రాధాన్యత క్షీణిస్తుంది. (Decolonisation is parallel to the process of the derevolutionization of the nationalist bourgeoisie); విప్లవాత్మక ప్రజాస్వామ్య ఉద్యమానికి ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ నాయకత్వం వహింపజాలదు. ఇట్టి పరిస్థితిలో దేశంలోని విప్లవాత్మక శక్తులన్నీ సంఘటితమై కాంగ్రెస్‌లో చేరి, నాయకత్వాన్ని ఆక్రమించి ప్రజా విప్లవానికి సాధనంగా మార్చివేయాలి".

సామ్రాజ్య ఉపసంహారణ సిద్ధాంతాన్ని గురించి మొదట్లో నిశితంగా ఎవ్వరూ ఆలోచింపలేదు. చివరకు, కోమిన్‌టరన్ నుండి రాయ్‌ని బహిష్కరించటానికి అదే సాధనమైంది. 1927 మధ్యలో సోవియట్ అగ్రనాయకుల మధ్య అధికార పోరాటం ప్రారంభమైంది. స్టాలిన్, ట్రాట్‌స్కీ ఉభయులూ రాయ్‌కి వ్యక్తిగతంగా మిత్రులే. ట్రాట్‌స్కీ అతివాద ధోరణివల్ల సోవియట్ ప్రభుత్వానికే ముప్పవాటిల్లే ప్రమాదం ఉండటంచేత స్టాలిన్ విధానాన్ని బలపరచాడు రాయ్. 1928 అక్టోబర్‌లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నుండి ట్రాట్‌స్కీ, జినోవీవులు బహిష్కరింపబడ్డారు. అనంతరం రష్యా పార్టీపై తన ఆధిపత్యాన్ని స్థాపించటానికై తన ఉదార విధానానికి (Liberal) స్వస్తి జెప్పి దారుణ వామపక్ష (Ultra-leftist) కమ్యూనిజాన్ని అనుసరింపసాగాడు స్టాలిన్. ఈ క్రొత్త విధానానికి రాయ్ పూర్తిగా వ్యతిరేకి. నాటికే, ఇటలీ, జర్మనీలలో ఫాసిస్టు శక్తులు తలెత్తుతుండటం స్వయంగా చూడాడు రాయ్. అందుచేత, ఐరోపాలోని ప్రగతిశీలమైన ప్రజాస్వామ్య శక్తులను సంఘటిత పరచి ఫాసిజాన్ని నిర్మూలించటమే జరూరు సమస్య అనీ, దారుణ వామపక్ష విధానం ద్వారా ప్రజాస్వామ్య శక్తులతో సహాయ నిరాకరణ జరపటం వల్ల అవి నీరసించి క్రమంగా ఫాసిజం విజృంభించి మానవ స్వేచ్ఛకూ, సంస్కృతికీ ప్రమాదకరంగా పరిణమిస్తుందనీ రాయ్ వివరించాడు. సోవియట్ అధికార రాజకీయపు కెత్తులలో రాయ్ సహకారం తనకు లభించదని గ్రహించి స్టాలిన్, రాయ్ మైత్రికి తిలోదకా లీయ నిర్ణయించాడు. ఇది గ్రహించి, కోమిన్‌టరన్‌లోని రాయ్ విరోధులు, ముఖ్యంగా బ్రిటిష్ కమ్యూనిస్టులు రాయ్‌పై దుమారం ప్రారంభించారు. 1928 ఫిబ్రవరిలో కోమిన్‌టరన్ కార్యవర్గం అవసర సమావేశం జరిగింది. ఆ సమయానికి రాయ్ తీవ్రంగా జబ్బు పడ్డాడు (Mastoiditis). మాస్కోలో రాయ్‌కి వైద్య సదుపాయాలను గురించి కూడా ఆలోచించినవారు లేరు. రష్యాలోనూ, జర్మనీలోనూ ఉన్న మిత్రుల సహాయంతో మాస్కో నుండి మారు పేరుతో బైటపడి బెర్లిన్ చేరాడు (మార్చి 1928); అక్కడే కొన్ని నెలల తరువాత రాయ్‌కి స్వస్థత చిక్కి ఆరోగ్యం చేకూరింది.

కోమింటరన్ కార్యవర్గ ఆరవ మహాసభ 1928 జూలై-సెప్టెంబర్‌లలో మాస్కోలో జరిగింది; రాయ్ హాజరు కాలేకపోయినాడు. ఈ మహాసభకు మొట్టమొదటిసారిగా ఇండియన్ ప్రతినిధివర్గం హాజరైంది. వీరిని ఇంతకుపూర్వం అనేక మార్లు రాయ్ మాస్కోకు ఆహ్వానించాడు. ఆరవ మహాసభలో ఇండియన్ ప్రతినిధి వర్గం బ్రిటిష్ కమ్యూనిస్టుల చేతికీలుబొమ్మలై రాయ్‌పై దుష్ప్రచారం చేశారు; ఇండియాలో రాయ్‌కి పేరూ ఊరూ లేదనీ ఇండియాలోని విప్లవోద్యమంతో రాయ్‌కి ఏమాత్రం సంబంధం లేదనీ కోమింటరన్‌తో నివేదించారు. చివరకీ ప్రతినిధి వర్గంలో ఒకే ఒకవ్యక్తి ఇండియాకు తిరిగి వెళ్ళగలిగాడు! మిగిలినవారు బ్రిటిష్ గూఢచారులని అనుమానింపబడి రష్యాలో సాధారణంగా, గూఢచారులు పొందేదుర్గతికి పాల్పడ్డారు! ఇండియాకు మరలినవ్యక్తి తిరిగి రాజకీయాల జోలికే పోలేదు! ఈ సభలోనే 'సామ్రాజ్య ఉపసంహరణ సిద్ధాంతం'పై కామ్రేడ్ కూసినెన్ దండయాత్ర చేశాడు. ఆ సిద్ధాంతం ద్వారా రాయ్ బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని సమర్థిస్తున్నాడనీ, విప్లవ వ్యతిరేక సోషల్ డెమొక్రాటిక్ సిద్ధాంతాల శరణు జొచ్చాడనీ నిందించాడు. కోమిన్‌టరన్ నుండి రాయ్‌ని తొలగించటానికి అవసరమైన తంతు పూర్తయింది.

ఆరవ మహాసభానంతరం కూడా కొంతకాలం 1929 ఫిబ్రవరి వరకూ, కోమిన్‌టరన్ పత్రిక ఇన్‌ప్రెకర్ (Inprecor)లో రాయ్ వ్యాసాలు ప్రచురింపబడినై. 1929 జులైలో కోమిన్‌టరన్ పదవ అవసర సమావేశం జరిగింది. అందులో కోమిన్‌టరన్ పత్రికల్లో రాయ్ భావాలకు స్థానమీయరాదనీ శాసింపబడింది. అందుచే రాయ్ జర్మన్ కమ్యూనిస్టు నాయకుడైన బ్రాన్‌డ్లర్ నడిపే గెగెన్ డెన్ స్ట్రామ్ (Gegen Den Strom) అనే పత్రికలో తన వ్యాసాలు ప్రచురించేవాడు. నాడు కోమిన్‌టరన్ అధికార విధానానికి అంటే దారుణ వామపక్ష విధానానికి బ్రాన్‌డ్లర్ వ్యతిరేకి. ఆ పత్రికకు వ్యాసాలు వ్రాయడం రాయ్ చేసిన మరొక నేరం. కాబట్టి, స్వయంగానే కోమిన్‌టరన్ సభ్యత్వానికి రాయ్ తిలోదకాలిచ్చినట్లు పరిగణింపబడింది. 1929 డిసెంబర్‌లో కోమిన్‌టరన్ నుండి రాయ్ బహిష్కరణ జరిగినట్లు ఇన్‌ప్రెకర్‌లో ప్రకటింపబడింది. తరచుగా రాయ్ అంటూ ఉండేవాడు. "తన సంతానాన్నే తన పొట్టన పెట్టుకోనటం విప్లవం యొక్క స్వభావం." మరొకమారు యదార్థమైన స్వేచ్ఛాన్వేషణే తన జీవితాశయమని రుజువు చేశాడు రాయ్.

## ఇండియాకు ప్రయాణం

కోమిన్‌టరన్ నుండి బైటికి వచ్చిన తరువాత గూడా, సుమారొక సంవత్సరం వరకూ రాయ్ బెర్లిన్‌లో గడిపాడు. ప్రసిద్ధ జర్మన్ కమ్యూనిస్టులైన బ్రాన్‌డ్లర్, తాల్‌హీమర్ మున్నగు వారితో కలిసి దారుణ వామపక్ష విధానం నుండి కోమిన్‌టరన్‌ను మరలించటానికి కృషి చేశాడు. జర్మన్ కమ్యూనిస్టులు పోటీ కోమిన్‌టరన్‌ను స్థాపించటానికి గూడా ప్రయత్నించారు. అనతికాలంలోనే కోమిన్‌టరన్

తన తప్పు దిద్దుకొంటుందనే నమ్మకంతో వారి నా ప్రయత్నాల నుండి విరమింప జేశాడు రాయ్.* ఐతే, దారుణ వామపక్ష విధానం వల్ల బాల్యదశలో నున్న కమ్యూనిస్టు ఉద్యమాలకు ప్రమాదం వాటిల్లగలదని రాయ్ వెల్లడించిన భయాందోళనలు ఇండియాలోనే రుజువైనై. 1928-29 లలో ఇండియా ప్రభుత్వం కమ్యూనిస్టు ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేసింది; మీరట్ కుట్ర నేరం మిషతో కమ్యూనిస్టు నాయకుల నందర్నీ నిర్బంధించింది. మీరట్ కుట్ర నేరంలో గూడా, పరోక్షంలో యమ్. యన్. రాయే ప్రధాన ముద్దాయి!

జర్మనీలోని భారత విద్యార్థుల ద్వారా భారత జాతీయోద్యమ సమాచారం ఎప్పటికప్పుడు రాయ్ గ్రహిస్తూనే ఉన్నాడు. 1929 లో నేషనల్ కాంగ్రెస్ లాహోరులో సమావేశమై 'సంపూర్ణ స్వాతంత్ర్యమే'తన లక్ష్యంగా ప్రకటించింది. చరిత్రాత్మకమైన ఈ తీర్మానాన్ని జరిపినందుకు కాంగ్రెసు నభినందిస్తూ, ప్రజాస్వామ్య జాతీయ విప్లవ సాధనకు కనీస కార్యక్రమాన్ని సూచిస్తూ, రాయ్, ఒక కరపత్రాన్ని (The Lessons of Lahore Congress) పంపాడు. ఆ కరపత్రంలో : ప్రజాస్వామ్య సూత్రాలపై నిర్మింపబడిన రాజ్యాంగం (Constitution) ఆధారంగా ఫెడరల్ రిపబ్లిక్ స్థాపన, స్త్రీ పురుష వయోజన వోటు హక్కుపై ఒకే సభతో పార్లమెంటు నిర్మాణం, రాష్ట్ర స్వీయపరిపాలన, భాషారాష్ట్ర నిర్మాణం, జమీందారీల రద్దు, రైతులకు భూమి పంపకం, రైతు రుణ విమోచన, కార్మికుల కనీస వేతనమూ, 8 గంటల పని కాలమూ నిర్ణయించటం, సాంఘిక భీమా, పత్రికా, వేదికా, సమావేశ స్వాతంత్ర్యం, అల్పసంఖ్యాకుల రక్షణ, ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య మొదలగువానికై కాంగ్రెస్ ఆందోళన జరపాలని సూచించాడు. 1930 మే నెలలో లేబర్ అండ్ సోషలిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గం బెర్లిన్‌లో సమావేశమైంది. బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకులా సమావేశానికి హాజరైనారు. వారి నుద్దేశించి An Open Letter అనే కరపత్రం ప్రచురించి, భారత జాతీయోద్యమాన్ని ప్రభుత్వం అణచివేయటంలో లేబర్ పార్టీ పాత్రను నిశితంగా విమర్శించాడు రాయ్.

---

* 1935 లో కోమిన్‌టరన్ ఏడవ మహాసభ జరగబోయే ముందు వారికొక సుదీర్ఘమైన బహిరంగలేఖ వ్రాస్తూ 1929 విధానం వల్ల కమ్యూనిస్టు ఉద్యమాలకు కల్గిన దుష్ఫలితాలను వివరించాడు. ఆ లేఖలోని అంశాల ప్రభావం వల్లనోయేమో ఏడవమహాసభ 1929 విధానానికి స్వస్తి చెప్పి, 1929 నుండీ రాయ్ సూచిస్తున్న విధానాన్నే అనుసరించింది. ఇండియాలో కమ్యూనిస్టులు తిరిగి కాంగ్రెస్‌లో చేరసాగారు. రాయ్ పంథాయే సరియైనదని రుజువైంది. కాని 1929 బహిష్కరింపబడిన రాయ్, బ్రాన్డ్లర్, తాల్‌హీమర్ మున్నగువారిని తిరిగి చేర్చుకొనే నైతిక బలం కోమిన్‌టరన్‌కు లేకపోయింది.

1930 నాటికి తాను భారతదేశం వెళ్ళటం అవసరమని రాయ్ గ్రహించాడు. “బ్రిటిష్ సామ్రాజ్యవాదం క్షీణిస్తున్న తరుణంలో, ఇండియన్ కాంగ్రెస్ తుది పోరాటానికి సమాయత్తమౌతుంది; అట్టి భారత జాతీయోద్యమాన్ని, మత ప్రోక్తమై అభివృద్ధి నిరోధకమైన గాంధీ నాయకత్వంనుండి తప్పించి, విప్లవాత్మక కర్షక- కార్మిక నాయకత్వం క్రిందికి గొనిరావటానికి అదే తరుణం; అనుభవశూన్యులై, రష్యా విధేయులైన యువక కమ్యూనిస్టులీ బాధ్యతను నిర్వహింపలేరు; అందుచే ఇండియాలోని వామపక్ష వర్గాలను విప్లవాత్మక పంథాలో నడిపి ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించే కార్యక్రమానికి అవకాశం గలదని భావించి ఇండియా ప్రయాణానికి సిద్ధమైనాడు. కాని, కాన్పూర్, మీరట్ కుట్రనేరాలలో రాయ్‌పై ‘వారంట్లు’ ఉండటంచే ఇండియాలో అతనికి కారాగారశిక్ష తప్పదని బ్రాన్‌డ్లర్, తాల్‌హీమర్లు వారించారు; రాయ్ అంగీకరింపలేదు. జర్మనీలో భారత విద్యార్థులైన తయాబ్ షేక్, సుందర్ కబాడీ, బ్రజేష్ సింగుల ద్వారా ప్రయాణ సన్నాహాలు పూర్తయినై. ఈ విద్యార్థులు ముందుగానే భారతదేశానికి తిరిగివచ్చి రాయ్ రహస్యంగా గడపటానికి గూడా ఏర్పాట్లు చేశారు.

ఐరోపాలో నున్న చివరి వారంరోజులూ, రాయ్, గోషాల్‌క్రితో, ఆల్ఫ్స్ పర్వతాల సమీపంలో గడిపినట్లు తెలుస్తుంది. ఈమే 1937 లో ఇండియా వచ్చి ఎలెన్ పేరుతో రాయ్ సహధర్మచారిణి యైంది. 1930 లో జర్మనీలోనే రాయ్‌కి ఎలెన్‌తో పరిచయమైంది. ఈమె దొక విచిత్రమైన చరిత్ర. ఎలెన్ తండ్రి అమెరికన్ విదేశాంగశాఖలో ఉద్యోగి; తల్లి జర్మన్ వనిత; ఈమె జన్మించినది ఫ్రాన్సులో (1904); విద్యాబుద్ధులు నేర్చినది జర్మనీలో; తండ్రిలో అమెరికా అభిమానమూ, ఎలెన్‌లో జర్మనీ అభిమానమూ విపరీతంగా ఉండేవట. బాల్యంలోనే ఎలెన్‌ను కమ్యూనిజం ఆకర్షించింది! కమ్యూనిజంలోని మతేతర స్వభావమూ, అంతర్జాతీయత, సమత్వమూ అందుకు కారణం. కమ్యూనిస్టు భావాలు గల ఈమెను, తండ్రి ఇంటి నుండి బైటికి పంపివేశాడు. నాడు జర్మనీలో సంచరించటానికి అవసరమైన అధికార పత్రాలు ఎలెన్ దగ్గర లేవు; అందుచే చాలరోజులు రహస్యంగా గడుపుతూ అంతర్జాతీయ కర్షకసంఘ (Peasants' International) ఐరోపా శాఖకు కార్యదర్శిగా పని చేసింది; జర్మన్ భాషలో అనేక గ్రంథాలు రచించింది. గుణంలో, స్వభావంలో, భావనాపద్ధతిలో రాయ్, ఎలెన్‌లు చాల సన్నిహితులు; ఉభయులూ ప్రపంచ పౌరులే! జర్మనీలో చట్టవిరుద్ధమైన ఉనికి గలవారే; ఉభయుల జీవితాలూ క్లిష్ట పరిస్థితుల నెదుర్కొంటున్నై; పరస్పర సానుభూతి వారి మైత్రిని దృఢతరం చేసింది; కాని తాత్కాలిక వియోగానికి సమ్మతించారు. ఏడ్రియాటిక్ సముద్రతీరంలో రాయ్ ఇండియాకు నౌక నెక్కాడు.

ఇది జరిగిన కొన్ని రోజులకే నాజీలచే నిర్బంధం తప్పించుకొని ఎలెన్ ఫ్రాన్సు పారిపోయింది.

# ఇండియాలో యమ్. యన్. రాయ్

## అరెస్టు — శిక్ష

స్వేచ్ఛాన్వేషణలో సాగించిన ఇరవై రెండేండ్ల ప్రపంచ యాత్ర తరువాత 1930 డిసెంబరులో రాయ్ ఇండియాకు తిరిగివచ్చాడు. డాక్టర్ మహమ్మద్ అనే మారు పేరుతో, దొంగ ప్యాస్‌పోర్టుతో కరాచీలో దిగి బొంబాయి చేరాడు కొద్ది రోజుల్లోనే, యువకుల్ని రాజకీయ కార్యకర్తలనూ, కార్మిక సంఘ నాయకులనూ ఆకర్షించాడు. వారికతడు ప్రత్యేక రాజకీయపాఠశాలలు నడిపాడు. వి. బి. కార్నిక్, మణిబెన్ కారా మొదలైన కార్మిక నాయకుల సహకారం అతనికి లభించింది. కోమిన్‌టరన్ దాసుల దారుణ వామపక్ష కమూనిస్టు ఉచ్చుల్లో కార్మికోద్యమం చిక్కుకొనకుండా రక్షించగలిగాడు. త్వరలోనే ఈ మాయమనిషి ప్రఖ్యాత కమ్యూనిస్టు యమ్. యన్. రాయ్ అని గ్రహింపబడింది. అతని అనుచరులు 'రాయ్ బృందం' గా తయారైనారు. కాని రాయ్ రహస్యంగా ఉండటం తప్పనిసరి; కాన్పూరు, మీరట్ కుట్రనేరాల సందర్భంలో పోలీసు లాతణ్ణి గాలిస్తూనే ఉన్నారు.

ఈ సమయంలోనే రాయ్ Independent Communist Party ని కూడా స్థాపించినట్లునూ, అందులో క. క. సిన్హా, ఎ. క. ముఖర్జీ, డాక్టర్ యం. ఆర్. షెట్టీ మొదలైన వారు సభ్యులైనట్లూ తెలుస్తుంది. 1931 లో జరిగిన కరాచీ కాంగ్రెస్ మహాసభకు రహస్యంగానే రాయ్ హాజరై పండిట్ నెహ్రూ, సుబాస్‌బోస్ మొదలైన కాంగ్రెస్ వామపక్షనాయకులను విస్మయంలో ముంచివేశాడట! రాయ్ ప్రభావం కరాచీ కాంగ్రెస్ కార్యక్రమంలో స్పష్టంగా కన్పిస్తుంది. ఈ మహాసభలోనే మొట్ట మొదటిసారిగా కాంగ్రెస్, తన సాంఘిక ఆర్థిక లక్ష్యాలను నిర్వచించింది; ఇదే 'కరాచీ తీర్మాన'మని ప్రసిద్ధి చెందింది. 1919 నుండి ఆర్థిక పునర్నిర్మాణ కార్యక్రమం లేని 'స్వరాజ్య నినాదం' నిస్సారమైన దంటూ రాయ్ సందేశాలు పంపుతూనే ఉన్నాడు! కరాచీ కాంగ్రెస్ మహాసభయే "ప్రాతిపదిక హక్కుల"ను (Fundamental Rights) గురించిన తీర్మానం కూడా చేసింది. ఈ తీర్మానాన్ని గురించి అభిప్రాయ భేదం ఉంది. పండిట్ జవహరిలాల్ నెహ్రూ 'స్వీయచరిత్ర' వల్ల ఆ తీర్మానాన్ని ప్రవేశపెట్టినది నెహ్రూ అని తెలుస్తున్నది. కాని పై తీర్మానాన్ని రాయ్ తయారుచేశాడనీ, అది ఆతని పెట్టీబూర్జువా భావాల కది చక్కని నిదర్శనమనీ, యమ్.యన్. రాయ్ దొంగ పేరే డాక్టర్ మహమ్మద్ అనీ కమ్యూనిస్టులు

దుమారం లేపారు. పోలీసు రికార్డులలో పై తీర్మానం రాయ్ తయారుచేసినట్లే నమోదైంది. కరాచీ కాంగ్రెస్ తరువాత డాక్టర్ బెనర్జీ అనే పేరుతో రాయ్ సంయుక్త పరగణాలలో సంచారం చేశాడు.

కమ్యూనిస్టుల ప్రచారం పోలీసులకు పదవకాశమైంది. రాయ్‌ని బంధించటానికి ఉచ్చులు పన్నారు. చివరకు 1931 జులై 21 వ తారీఖున అర్ధరాత్రివేళ నిద్రలో ఉన్న సమయంలో రాయ్‌ని బొంబాయిలో అరెస్టుచేశారు. జాగ్రదావస్థలో ఉంటే చిక్కడని భయం కాబోలు! 16 సంవత్సరాలు తమ కండ్లను గప్పి సంచరిస్తున్న విప్లవకారుని బంధించిన విజయగర్వంతో పొంగిపోయినారు పోలీసులు.

కాన్పూరు మేజస్ట్రేట్ రాయ్‌పై నేరం మోపి సెషన్సు కోర్టుకు పంపాడు. తన నేరానికి సెషన్సుకోర్టులో రాయ్ యిచ్చిన సమాధానం: "నా నేరాన్ని ధృవపరిచే సాక్ష్యాలుగా ప్రదర్శింపబడిన పత్రాలలో, స్వాతంత్ర్య సమరంలో భారత ప్రజానీకం, దౌర్జన్యాలకు దిగటం తప్పనిసరి అనే విషయం స్పష్టం చేయబడింది. భారతీయుల సర్వసత్తాక అధికారాన్ని (Sovereignty) విదేశీయు లాక్రమించారు; విదేశపాలకులు దౌర్జన్యంపైనా, బలప్రయోగంపైనా ఆధారపడి పరిపాలన సాగించినంతకాలమూ, ప్రజలు తమ అధికారాన్ని తిరిగి పొందటానికి బలప్రయోగం చేయక తప్పదు. బ్రిటిష్ ప్రభుత్వంవల్ల భారతీయులకు మేలుజరగటం లేదనీ, అది కేవలం దౌర్జన్యపూరిత దోపిడీవిధానమనీ నా విశ్వాసం; అందుచే లాక్, హ్యూం, బెన్‌థామ్ మున్నగు ఆంగ్లరాజనీతి వేత్తల సిద్ధాంతాల ప్రకారం ప్రస్తుత ప్రభుత్వంపై భారతీయులు సాయుధ తిరుగుబాటు చేయటంలో తప్పేమీ లేదు; బ్రిటిష్ సార్వభౌములపట్ల విధేయులై యుండవలసిన అవసరం భారతీయులకు లేదు!"

సెషన్సు కోర్టులో 9-1-1932 తారీఖునాడు రాయ్‌కి 12 సం. ల ద్వీపాంతర వాస శిక్ష విధింపబడింది. హైకోర్టుకు అప్పీలు చేయబడింది. డా. కైలాసనాథకట్జూ, డి. సన్యాల్ రాయ్ తరఫున వాదించారు. అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తి మిస్టర్ థోమ్ తన తీర్పులో "వాది, సెషన్సుకోర్టులో తన వాదానికి బలంగా హ్యూం, బెన్‌థాముల గ్రంథాలను ఉదాహరించి బలప్రయోగంతో ప్రభుత్వాన్ని కూలద్రోసే ప్రయత్నం న్యాయవిరుద్ధం కాదన్నాడు. ఈ సందర్భంలో హ్యూం, బెన్‌థాముల రచనల ప్రసక్తికి అవకాశం లేదు. పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ చదువుకొనే వరకూ మాత్రమే ఆ గ్రంథాలలోని భావాల విశిష్టత! రాజకీయతత్త్వవేత్తలు ప్రతిపాదించిన ఆకర్షణీయమైన సిద్ధాంతాలనేగాక, కేవలం లౌకికమూ, అతివాస్తవమూనైన భారతీయ శిక్షాస్మృతి (Indian Penal Code) లోని అంశాలను గూడా వాది గుర్తించి యుండాల్సినది" అంటూ శిక్షను ఆరు సంవత్సరాల కఠిన జైలు శిక్షకు తగ్గించాడు.

తరువాత ప్రీవీకౌన్సిల్‌కు అప్పీలు చేయబడింది. సర్ స్టాఫర్డ్ క్రిప్సు రాయ్ తక్షాన పనిచేశాడు. అప్పీలును త్రోసివేసి ప్రీవీకౌన్సిల్ హైకోర్టు విధించిన శిక్షనే ధృవపరిచింది.

రాయ్, ఐదు సంవత్సరాల నాల్గు మాసాలు జైలు శిక్ష ననుభవించాడు; అందు ఎక్కువ భాగం బారెల్లీ జైలులోనే గడిచింది. వేసవిలో బారెల్లీలో ఎండ లెక్కువ. అందుచే రాయ్ ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. ఇది గమనించి కొన్ని వేసంగులు రాయ్‌ని ఆల్మోరా జైలుకు మార్చారు. శిక్ష చివరిదశలో రాయ్ డెహ్రాడూన్ జైలులో గడిపాడు. జైలులోనున్న కాలంలో రాయ్ కాలక్షేపం గ్రంథ పఠన, గ్రంథ రచన, ఫ్రాన్సులోనున్న ఎలెన్‌కు పెక్కు జాబులు వ్రాశాడు.* ఎలెన్ ఫ్రాన్సులో గ్రంథ రచనతో సంపాదించిన ధనంతో గ్రంథాలు కొని రాయ్‌కి పంపుతూ ఉండేది. 'రాయ్' బృందంతోనూ, కాంగ్రెస్, సోషలిస్టు నాయకులతోనూ రహస్యంగా సంబంధ మేర్పరచుకొని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు రాయ్. జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని సాధించటానికై కనీస కార్యక్రమాన్ని సూచిస్తూ కాంగ్రెస్ నాయకులకు జాబులు వ్రాశాడు; మధ్యయుగ మతతత్వాన్ని ఖండిస్తూ, దేశంలో తాత్త్విక మానసిక పునరుజ్జీవనానికి అనుకూల వాతావరణాన్ని సృష్టించే ఆశయంతో పెక్కు గ్రంథాలు వ్రాశాడు.

ఆ గ్రంథాలలో ముఖ్యమైనవి :

Historical Role of Islam.
Fascism.
Heresies of the Twentieth Century.
Fragments of a Prisoners' Diary (2 Vols.)
Materialism.
Philosophical Consequences of Modern Science.

జైల్లోవున్న రోజుల్లోనే, 'రాయ్ బృందంతో' రహస్యంగా వ్యవహరిస్తూ రాయ్ భారత కార్మికోద్యమానికి నవచైతన్యం కలిగించాడు. ఈ విషయం ప్రభుత్వం తయారుచేయించిన భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో స్పష్టం చేయబడింది : "తన రాజకీయ పరిజ్ఞానంతో, ఉద్యమ నిర్మాణదక్షతతో, నాయకత్వానికవసరమైన శక్తి సామర్థ్యాలతో అన్నిటికంటె, తన ప్రఖ్యాత వ్యక్తిత్వంతో, అధికారకమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్వీర్యం చేయగలడు రాయ్" అని కోమిన్‌టరన్ భయపడింది. ఆభయాలు

---

* ఈ జాబులు 'Letters from Jail' అనే గ్రంథంగా ప్రచురింపబడింది. దీనికి పరిచయం వ్రాస్తూ ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా పనిచేసిన కీ. శే. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు, 'ఇది ఆబాలగోపాలమూ చదువ వలసిన గ్రంథమని నా సలహా' అన్నారు.

నిజమే అయినవి. రాయ్ యూరోప్‌లో ఉంటూ ఇండియాలో తయారుచేసిన కమ్యూనిస్టు నాయకులందరూ అతణ్ని విడిచి కోమిన్‌టరన్ విధేయులై నారు; కానీ 1934 చివరికే రాయ్‌కి క్రొత్త అనుచరులు ఘనమైన విజయాలు సాధించారు; All India Trade Union Congress లో తమ స్థానాన్ని నిలద్రొక్కుకోగలిగారు. వారిద్వారా నలభై క్రొత్త కార్మికసంఘాలు A. I. T. U. C. లో చేరినై; కలకత్తాలో ప్రత్యేకంగా A. I. T. U. C. కార్యాలయాన్ని స్థాపించారు. కార్మిక ఉద్యమ నిర్మాణంలో, నాయకత్వంలో ప్రథమస్థానాన్ని తిరిగి A. I. T. U. C. సాధింప గలిగింది.'

'ఇండియాకు తిరిగి వచ్చిన తరువాత స్వల్పకాల వ్యవధిలో రాయ్ ఒక్కడే ఇంతటివిజయాన్ని సాధింపగలగటానికి అతని ఉపజ్ఞ, శక్తిసామర్థ్యాలే కారణం. జైల్లో ఉండికూడ రాయ్ తన అనుచరులకు ఉత్సాహాన్ని చేకూర్చాడు; మార్గదర్శకు డైనాడు. రాయ్ సూచించిన విధానమే, అతని యెత్తుగడలే సరియైనవని భారత కమ్యూనిస్టు ఉద్యమంలో తరువాత జరిగిన పరిణామాలు రుజువుచేసినై. 1930-32 లో జరిగిన శాసనోల్లంఘనోద్యమంలో (Civil Disobedience Movement) పాల్గొన వలసిందని భారత కమ్యూనిస్టు పార్టీని, కోమిన్‌టరన్ ఆదేశించి ఉండినట్లయితే, నేటి కమ్యూనిస్టులకు, స్వాతంత్ర్య సంగ్రామానికి దూరంగా ఉన్నారనే అపఖ్యాతి యైనా కనీసం తప్పిపోయేది; వారి భావాలూ, ఉత్సాహమూ, క్రమశిక్షణా భారత రాజకీయాలపై శాశ్వతంగా చెరగని ముద్రవేసి యుండేది.'

## కాంగ్రెస్ రాజకీయాలు

డెహ్రాడూన్ సెంట్రల్ జెయిల్ నుండి 1936 నవంబర్ 20వ తేదీ నాడుదయం 8-30 గంటలకు యమ్. యన్. రాయ్‌ని విడుదల చేశారు. డూన్ మునిసిపల్ చైర్మన్ ఖుర్షీద్‌లాలూ, కార్మిక నాయకులైన వి. బి. కార్నిక్, మణిబెన్ కారా, డాక్టర్ షెట్టీ మొదలైన వారు రాయ్‌కి స్వాగతం చెప్పారు. శరత్ బోస్ "ఇండియా దృష్టిలోనే గాక, ప్రపంచ దృష్టిలోనే వంగరాష్ట్రానికి మహోన్నత స్థానాన్ని చేకూర్చి మా అందరికీ గర్వకారణమైన నీకు బెంగాలు రాష్ట్రమూ, బెంగాలీలు అభివాదన చేస్తున్నారు. నీ ఘనతను వర్ణించటానికి నా భాషాజ్ఞానం చాలదు" అంటూ రాయ్‌ని అభినందించాడు. తాల్‌హీమర్, బ్రాన్‌డ్లర్ మొదలైన విదేశ మిత్రులు అభినందనలు పంపారు. ఆ రోజునే ఎలెన్‌కు జాబు వ్రాస్తూ "పరిస్థితులు సుముఖంగానే ఉన్నై; నా కార్యక్రమం విజయవంతం కాగలదనే ఆత్మవిశ్వాసం కలుగుతోంది; రేపే బార్లీలో పండిట్ నెహ్రూను కలుసుకొని ముందు కార్యక్రమం నిర్ణయిస్తాను" అంటూ వ్రాశాడు. 'రాయ్ బృందానికి 'కాంగ్రెస్‌లో చేరి కాంగ్రెస్‌ను బలపరచండి' (Rally round the Congress) అనే సందేశ

మిచ్చాడు. యు. పి. కాంగ్రెస్ కార్యవర్గంలో రాయ్‌ని సభ్యుడుగా చేర్చి డిసెంబర్‌లో జరగబోయే ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్‌కు (A. I. C. C.) ప్రతినిధిగా ఎన్నుకొన్నారు.

మాస్కోలో ఉన్నప్పటి నుండి రాయ్, కాంగ్రెస్ పట్ల శ్రద్ధవహించాడు. కాంగ్రెస్ ఉన్నత బూర్జువావర్గ జాతీయవాదుల సంస్థ. వారి నాయకత్వంలో యదార్థ ప్రజాస్వామ్య విప్లవం వర్ధిల్లదు. కాని కాంగ్రెస్‌కు పోటీగా ప్రత్యామ్నాయ ఉద్యమాన్ని స్థాపించటం అసంభవమేగాక, దాని వల్ల జాతీయోద్యమంలో ఐక్యత నశించి సామ్రాజ్యవాద పోరాటం బలహీనమౌతుంది; అందుచేత విప్లవ చైతన్యమూ, ఆత్మవిశ్వాసమూ గల వామపక్షీయులు అంటే కర్షక కార్మిక వర్గాలు కాంగ్రెస్‌లో చేరి, నాయకత్వాన్ని ఆక్రమించి కేవల రాజకీయ స్వాతంత్ర్య సంపాదనకే గాక, ఆర్థిక సాంఘిక పునర్నిర్మాణాలు ఆశయంగా గల విప్లవానికి సైతం సాధనంగా కాంగ్రెస్‌ను రూపొందించాలని రాయ్ అభిప్రాయం. ఈ భావాలతోనే రాయ్ అహమదాబాద్ కాంగ్రెస్‌కు (1921) మాస్కో నుండి ఒక కరపత్రాన్ని పంపాడు. అంతకు పూర్వం నాగపూర్, కలకత్తా సమావేశాలలో కాంగ్రెస్, గాంధీజీ నాయకత్వాన్నీ, సత్యాగ్రహ విధానాన్నీ అంగీకరించింది. 1919-20 లలో సత్యాగ్రహోద్యమం సాగి 'స్వరాజ్' నినాదంతో దేశం మారుమ్రోగింది. మాస్కోలోనూ, సమీపదేశాల నుండీ లభించిన పత్రికలద్వారా, రాయ్ ఇండియాలోని పరిణామాలను గురించి తెలిసికొన్నాడు. "ఇండియాలో ప్రారంభమైన మహోద్యమానికి కేవలం గాంధీ వ్యక్తిత్వమే కారణం కాదు; యుద్ధానంతరం అన్ని తరగతుల ప్రజలలోనూ ప్రబలిన అసంతృప్తి కారణం; మతప్రోక్తమైన గాంధీజీ భావాలు ప్రజల మధ్య యుగ మనస్తత్వానికి బాగా నచ్చినందున గాంధీజీ జాతీయోద్యమ నాయకుడు కాగలిగాడు. ఐతే, తన బూర్జువావర్గ భావాలవల్ల గాంధీజీ కార్మిక-కర్షక విప్లవ శక్తిని జాతీయోద్యమ సత్వర విజయానికి వినియోగించటంలేదు. అంటే సామాన్య ప్రజానీకంలోనికి విప్లవ పురోగతిని గాంధీజీ ఆటంకపరుస్తున్నాడు; అతని 'స్వరాజ్' సంపూర్ణ స్వాతంత్ర్యం కాదు; దేశ ఆర్థిక సాంఘిక పునర్నిర్మాణానికి అవసరమైన కార్యక్రమమూ అందులో లేదు. కాబట్టి 1919-20 సత్యాగ్రహోద్యమం నిర్వీర్యమైనది. మధ్యతరగతి విద్యావంతుల్లో నిరుద్యోగం తాండవించే సమయంలో సహాయ నిరాకరణ విజయవంతం కాదు. ఖాళీయైన పదవులను నింపటం ప్రభుత్వానికి కష్టం కాదు. కాబట్టి దీనివల్ల ప్రభుత్వ యంత్రాంగం స్తంభించటానికి బదులు జాతీయోద్యమం మధ్యతరగతి సానుభూతిని కోల్పోతుంది. ఇక, విద్యార్థులను ఉద్యమంలోనికి లాగటం వల్ల ప్రయోజనం లేకపోగా ముందు ముందు ప్రమాదకర పరిణామాలకు దారి తీస్తుంది. ఇక మిగిలినవారు, దేశ జనాభాలో అధిక సంఖ్యాకులైన కార్మిక కర్షక ప్రజానీకం. వీరిలో విప్లవాత్మక చైతన్యం కలిగించి, నిర్దుష్టమైన ఆర్థిక కార్య

క్రమంద్వారా వీరిని కాంగ్రెస్‌లోనికి ఆకర్షించినచో, జాతీయ స్వాతంత్ర్యసాధనకూ, ప్రజాస్వామ్య విప్లవానికీ కాంగ్రెస్ పటిష్ఠమైన సాధనంగా రూపొందుతుంది” అని భావించాడు రాయ్.

సత్యాగ్రహోద్యమాన్ని గురించి కాంగ్రెస్ అధ్యక్షుడైన సి. ఆర్. దాసుకూ, గాంధీకి అభిప్రాయభేదాలు వచ్చినట్లు కూడా రాయ్‌కి తెలిసింది. అందుచేత, సి. ఆర్. దాసును బలపరచి, అతనిద్వారా గాంధీజీ ప్రణాళికకు ప్రత్యామ్నాయమే గాక ఎక్కువ ఫలప్రదమైన ప్రణాళికను ఆచరణలోనికి గొనిరావచ్చునని ఆశించి, ఒక కరపత్రం తయారు చేశాడు రాయ్. ఇందులో: ‘స్వరాజ్’ అంటే సంపూర్ణ స్వాతంత్ర్యం మని స్పష్టం చేయబడింది. కాంగ్రెస్ లక్ష్యం ప్రజాస్వామ్య విప్లవమనీ అందు కవసరమైన సాంఘిక ఆర్థిక సంస్కరణలు వివరింపబడినై. ఆ విప్లవానికి ప్రథమ సోపానంగా, సత్వరం ప్రభుత్వం, రైతు, కార్మిక ప్రజల కోర్కెలను మన్నించాలనీ, అందుకు సాధనంగా రైల్వే పనివారల సమ్మె జరిపితే ప్రభుత్వం కాళ్ళబేరానికి రాక తప్పదనీ సూచింపబడింది. ఈ కార్యక్రమాన్ని లెనిన్, స్టాలిన్‌లు అంగీకరించారు. కరపత్రం మీద రాయ్, అవనీముఖర్జీలు సంతకాలు చేశారు. సి. ఆర్. దాస్‌తో పరిచయమున్న నళినీగుప్త, స్వయంగా అతనికే అందజేసే బాధ్యత వహించి కరపత్రాలతో ఇండియాకు వచ్చాడు. కాని కాంగ్రెస్ సమావేశానికి ముందే సి. ఆర్. దాసును ప్రభుత్వం అరెస్టు చేసింది. రాయ్ సంతకం ఉండటంవల్ల కాంగ్రెస్ ఆ కరపత్రాన్ని చర్చించటానికి భయపడింది! అందుచే, ఆజ్మీర్ ప్రతినిధు లిద్దరు ఆ కరపత్రాన్ని తమ పేర ప్రచురించి కాంగ్రెస్ చర్చించాలని పట్టుబట్టారు. స్వరాజ్ అంటే సంపూర్ణ స్వాతంత్ర్యమని నిర్వచించవలసిందిగా మౌలానా హజ్రత్ మొహానీ ఒక తీర్మానం తెచ్చాడు. గాంధీజీ వీనిని ‘బాధ్యతా రహిత’ తీర్మానాలుగా నిందించాడు! కాంగ్రెస్ త్రోసి వేసింది. సమావేశ అనంతరం మౌలానా హజ్రత్ మొహానీని పోలీసులు అరెస్టు చేశారు!

తరువాత ఎనిమిది సంవత్సరాలకు లాహోర్ కాంగ్రెస్ (1929) ఆమోదించిన పూర్ణస్వరాజ్ తీర్మానాన్ని అభినందిస్తూ బెర్లిన్‌నుండి రాయ్ పంపిన కరపత్రాన్ని గురించీ, కరాచీ కాంగ్రెస్‌పై రాయ్ ప్రభావాన్ని గురించీ పై అధ్యాయంలో చదివారు గదా! జైల్లో ఉన్న కాలంలో సైతం రాయ్ కాంగ్రెస్ కార్యకర్తలకు ప్రజాస్వామ్య స్థాపన కనుగుణమైన సంస్కరణలు సూచిస్తూ అనేక జాబులు వ్రాశాడు. వాని సారాంశం: జాతీయ శ్రేయస్సూ, ఆర్థికాభివృద్ధీ సాధించటానికై ఉత్పత్తి సాధనాల యాజమాన్యంలో సమూలమైన మార్పులు జరగాలనీ, ప్రజల కొనుగోలుశక్తి పెరగాలనీ, దేశంలో సమత్వంపై ఆధారపడిన పారిశ్రామిక ప్రజాస్వామ్యాన్ని స్థాపించాలనీ కాంగ్రెస్ ఆశయాలుగా ప్రకటించాలనీ అందు కనుగుణమైన కార్యక్రమాన్ని రూపొం

దించాలనీ రాయ్ అనేక సూచనలు చేశాడు.* రాయ్ జైల్లో ఉన్న రోజుల్లోనే కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ యేర్పడింది. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఫార్వర్డ్ బ్లాక్ నిర్మాణానికి రాయ్ పూర్తిగా వ్యతిరేకి. ఇట్టి ముఠా లేర్పడటంవల్ల సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం దుర్బలం కావటమే గాక వామపక్షీయ వర్గాలలో అనైక్యత యేర్పడి కాంగ్రెస్ నాయకత్వం వహిస్తున్న అభివృద్ధి నిరోధక శక్తులకు బలపడే అవకాశాన్నిస్తుంది. కాబట్టి వామపక్షీయ శక్తులు సుసంఘటితమై, ఐక్యతతో వ్యవహరించి కాంగ్రెస్‌కు ప్రగతిశీల నాయకత్వాన్నీయాలని రాయ్ ఎత్తుగడ. కాని ఈ వామపక్ష ముఠాతత్వం రాయ్‌ని 'తిరోగామి'గా దుయ్యబట్టింది!

ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ (డిసెంబర్ 1936) లో సభాసదుల్ని విశేషంగా ఆకర్షించాడు రాయ్; బీహార్ నుండి 'పదయాత్ర' సాగించి వచ్చిన రైతులతో సంభాషించిన ఉపసంఘానికి డా. సంపూర్ణానంద్, పండిట్ నెహ్రూ, ఆచార్య రంగాలతో బాటు రాయ్‌ని ఎన్నుకొన్నారు. మహాసభలో రాయ్ 'రాజ్యాంగపరిషత్తు' ప్రణాళికనూ, ప్రజాసంఘాల కార్యక్రమాన్నీ విశదీకరించాడు. ఇంగ్లీషు పార్లమెంటు తయారుచేసిన శాసనాలనూ, సంస్కరణలనూ అంగీకరించటానికి బదులు, భారతీయులతో రాజ్యాంగపరిషత్తు నేర్పరచాలనీ, దేశానికి అవసరమైన రాజ్యాంగాన్ని ఆ పరిషత్తే నిర్ణయించాలనీ రాయ్ వివరించాడు. దేశంలో కాంగ్రెస్ సంఘాలను (Congress Committees) ప్రజాస్వామ్య సూత్రాలపై నిర్మించి (Democratise), చైతన్యవంతం (Activise) చేయాలనీ అవియే ప్రజాసంఘాలు (Poeples' Committees) గా వ్యవహరిస్తూ రాజ్యాంగపరిషత్తు (Constituent Assembly) కు నియోజకవర్గాలు (Constituencies) గానే గాక అవసరమైనప్పుడు దేశ వ్యాప్తమైన విప్లవానికి సాధనలుగా, ప్రజాస్వామ్య వ్యవస్థా నిర్మాణానికి ప్రాతిపదికలుగా నుపకరింపగలవని రాయ్ వివరించాడు. రాజ్యాంగ పరిషత్తు సూచనేగాక, విప్లవ చర్యకు రాయ్ చేసిన నిర్దుష్టమైన కార్యక్రమ వివరణకూడా కాంగ్రెస్ చరిత్రలో ఇదే ప్రథమం అంటూ డా. సంపూర్ణానంద్ తన స్వీయ చరిత్రలో వ్రాశాడు. ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్‌లోనే గాంధీని కలుసుకున్నాడు రాయ్. తమ సంభాషణ

---

* అందులో ముఖ్యమైన సూచనలు: (1) దున్నేవాడికే భూమి (2) పంటలో 80% రైతుది (3) శాసనబద్ధమైన కనీస వేతనం (4) నిర్మాణ కార్యక్రమాల (Public works) ద్వారా ఉద్యోగ అవకాశాల విస్తరణ (5) రాకపోకల సౌకర్యాలను ప్రభుత్వ పరం చేయటం (6) గనులలో, భారీపరిశ్రమలలో ప్రభుత్వ పర్యవేక్షణ (7) బ్యాంకింగ్, పరపతి ప్రభుత్వ పరంగా ఉండాలి (8) సాంఘికభీమా (9) వాక్, పత్రికా, సమావేశ, మత స్వాతంత్ర్యము (10) స్త్రీ పురుష సమత్వం (11) 15 సం.ల లోపు బాల బాలికలకు ఉచిత మతేతర విద్య (Secular Education) (12) మత విభేదాలను తొలగించటానికి జాతీయ ప్రజాస్వామ్య ఆశయాన్ని సాధనంగా చేయాలి.

అనంతరం 'మా లక్ష్యాలు ఒకటే, కాని మార్గాలు వేరు' అని గాంధీజీ ప్రకటించాడు. రాయ్ భావాలూ, మార్గమూ అనుసరించినవారు. "రాడికల్ కాంగ్రెస్‌వాదుల బృందము" (League of Radical Congressmen) గా నేర్పడి 'రాయిస్టు' (Royists) లని వ్యవహరింప బడ్డారు. ఫెయిజ్ పూర్ కాంగ్రెస్ తరువాత రాయ్ మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర ప్రాంతాల్లో కాంగ్రెస్‌కు ప్రచారం చేశాడు. తన భావ ప్రచారానికి సాధనంగా బొంబాయిలో 'Independent India' అనే పత్రికను స్థాపించాడు.

కాంగ్రెస్‌లో వామపక్షాలను సుసంఘటితం చేయాలనే దీక్షతో (Leftist Consolidation) కృషిచేశాడు రాయ్. ఇందుకు పండిట్ నెహ్రూ, సుభాస్ బోస్‌ల సహకారం లభిస్తుందని ఆశించాడు; కాని జైల్లో ఉన్న రోజుల్లోనే నెహ్రూ సహకారంలో రాయ్‌కి అనుమానం కలిగింది; అందుచే సుభాస్‌బోస్‌పై తన దృష్టి కేంద్రీకరించి అతనికి అన్నివిధాలా సహాయంచేయటానికే ప్రయత్నించాడు. తన జన్మభూమినీ, కుటుంబాన్నీ గురించి వ్రాస్తూ: "జన్మతః బెంగాలీనైనా, బెంగాలు దర్శించాలనే కుతూహలాన్ని కొన్ని కారణాల వల్ల అణచివేయాల్సి వచ్చింది. నాడు సుభాస్‌బోస్ బెంగాలు వీరుడు; భారతదేశ ఉపనాయకుడైన నెహ్రూ స్థానాన్ని ఆక్రమించాలని ప్రయత్నిస్తున్నాడు. ఇండియా నాయకుడు గాంధీ; గాంధీని సవాలు చేయగల ధైర్య సాహసాలు ఎవరికీ లేవు; ఇట్టి పరిస్థితుల్లో తనకు ప్రత్యర్థి తటస్థించటం బోసుకు బాధాకరమైన విషయం; బోసు ఆశలకూ ఆశయాలకూ ఆటంకం కలిగించదలచ లేదు ...." అంటాడు రాయ్. త్రిపురీ కాంగ్రెస్ అధ్యక్షుడుగా (1939 మార్చి) భోగరాజు పట్టాభిసీతారామయ్యను నోడించి బోస్ విజయం సాధించటానికి రాయ్, రాయ్‌బృందమూ చేసిన సహకారమే ప్రధానకారణం. ఐతే, 'పట్టాభి ఓటమే నా ఓటమి' అని గాంధీజీ ప్రకటించాడు. అంతటితో కాంగ్రెస్ కార్యవర్గం రాజీనామా చేసింది; బోస్‌కు దిక్కు తోచలేదు; ప్రత్యామ్నాయ కార్యవర్గాన్ని నియమించి పని సాగించ వలసిందని రాయ్ సలహా యిచ్చాడు; బోస్‌కు ధైర్యం చాలలేదు; ఈ ఆందోళనతో ఆరోగ్యం చెడి బోస్ మంచాన పడ్డాడు. రాయ్‌కి మరొక ఆశాభంగం!

రాయఘర్ కాంగ్రెస్ సభలో (1940 మార్చి) అధ్యక్షస్థానానికి అబుల్ కలాం అజాద్‌తో పోటీకిసిద్ధమైనాడు రాయ్. ఈసందర్భంలో నేరాయ్ Road to Freedom అనే కరపత్రం ద్వారా తన ప్రణాళికను స్పష్టం చేశాడు. స్థానిక ప్రజాసంఘాల ప్రాతిపదికపై నేర్పడిన ఫెడరల్ రిపబ్లిక్ మాత్రమే స్వతంత్ర భారత స్వరూపమనీ దానిని సాధించటానికి సత్యాగ్రహం నిష్ప్రయోజనమనీ ప్రజాబాహుళ్యం పాల్గొనే విప్లవాత్మక మహోద్యమమే సాధింపగలదనీ, రాజ్యాంగపరిషత్తు నిర్మాణ ఆవశ్యకతనూ వివరించాడు. ఎన్నికలో రాయ్ ఓడి అజాద్ గెలిచాడు! పండిట్ నెహ్రూ తన



రాయ్ దంపతులు - భారత జాతీయ కాంగ్రెసులో

స్వీయచరిత్రలో "యం. యన్. రాయ్ జాతీయ భారతావనికి పనికిరాడు" అన్నాడు! అందుకు సమాధానంగా, "జాతీయ భారతావనికి నేను పనికిరానని చెప్పటంలో నెహ్రూ ఉద్దేశ్యం నేను గాంధీవాదిని కాదని. ఐతే, గాంధీవాదమే జాతీయ వాదమా? నా జీవితం గొప్పది కాకపోవచ్చు; కాని నా జీవితం సర్వమూ జాతీయ స్వాతంత్ర్యం కొరకే ధారపోశాననే విషయాన్ని ఎవ్వరూ కాదనలేరు. ఐనప్పుడు జాతీయ భారతావనికి నే నెందుకు పనికిరాను? అందుకు ఒకే ఒక కారణం కన్పిస్తున్నది. భారత ప్రజల్లో నూటికి నూరుపాళ్ళకూ స్వరాజ్యం రావాలని నా వాదన; నెహ్రూ ఉద్దేశించిన జాతీయ భారత ఆదర్శం అది కాదని స్పష్టమౌతుంది" అన్నాడు రాయ్.

నాటికే ఐరోపాలో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. అక్ష రాజ్యాలు ఫాసిస్టు రాజ్యాలనీ, మిత్రరాజ్యాలలో ప్రజాస్వామ్యం అమలులో ఉన్నదనీ అందరూ ఎరిగిన సత్యమే. అందుచే యుద్ధాన్ని ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా వర్ణించి, ప్రజాస్వామ్య వాదులందరూ యుద్ధంలో మిత్రరాజ్యాలతో సహకరించాలని రాయ్ వాదించాడు. బ్రిటిష్‌సామ్రాజ్యం ప్రమాదంలో ఉన్నదనీ, ఇదే భారతస్వాతంత్ర్య సంపాదనకు సదవకాశం అనీ, గాంధీజీ నాయకత్వంలో కాంగ్రెస్ నిర్ణయించి సహాయ నిరాకరణ ప్రారంభించింది; [కమ్యూనిస్టు లీయుద్ధాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధమనే దుర్భ్రమలోపడి కాంగ్రెస్‌ను బలపరిచారు; హిట్లర్ రష్యాపై దండెత్తటంతో ఆ భ్రమ తొలగి 'ప్రజా యుద్ధం' (Peoples' War) అంటూ నినాదాలు ప్రారంభించారు.] కాంగ్రెస్ నాయకులకు తన వాదంలోని యదార్థాన్ని నచ్చజెప్పటానికి ప్రయత్నించి విఫలుడైనాడు రాయ్; గత్యంతరంలేక కాంగ్రెసు నుండి విడిపోయి 1940 డిసెంబర్‌లో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించాడు.

## రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ

రెండవ ప్రపంచ యుద్ధ విజృంభణతో ఇండియాలోని రాజకీయ పరిస్థితి క్లిష్ట రూపాన్ని ధరించింది. ప్రధాన రాజకీయ పక్షమైన కాంగ్రెస్ 1940 నుండీ యుద్ధ ప్రయత్నంలో ప్రభుత్వంతో సహకరింప నిరాకరించింది. కాంగ్రెస్ నాయకుల్లో పండిట్ నెహ్రూ వంటివారు ఫాసిజం విజృంభణను గర్హించినా, మొత్తంమీద హిట్లర్ సామ్రాజ్య దాహం భారత జాతీయవాదానికి అనుకూలిస్తుందనే భావించారు. వీరిలో వామపక్షీయులని భావింపబడిన కొందరు, ఫాసిస్టు శక్తులు లేక అక్షరాజ్యాల (జర్మనీ, జపాను, ఇటలీ) సహాయంతో భారత దేశ స్వాతంత్ర్యాన్ని సాధింపవచ్చనే అపోహతో ప్రయత్నాలు ప్రారంభించారు. మొదటి ప్రపంచ యుద్ధంలో యమ్. యన్. రాయ్, ఒబీదుల్లాల చర్యలకు అనుకరణగా సాగినవి వీరి ప్రయత్నాలు. హిట్లర్ 'మీన్ కాంఫ్' గ్రంథంద్వారా అతనికి భారతజాతీయ వాదంపట్ల గౌరవం

లేదని స్పష్టమౌతుంది. ఇక, 1935 నుండి చైనా ప్రజలను దారుణ హింసాకాండకు బలిచేస్తున్న జపాను సామ్రాజ్య దాహం భారత దేశంపట్ల ప్రత్యేక అభిమానం వహించినదనడం హాస్యాస్పదం. మొదటి ప్రపంచయుద్ధంలో ఇంగ్లండుతో చేరి జర్మనీతో పోరాడి తూర్పు దేశాల్లోని జర్మన్ సామ్రాజ్య భాగాల నాక్రమించిన జపాను, రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ పక్షం వహించటానికి కారణం ఆంగ్ల సామ్రాజ్య భాగాల నాక్రమించే దురాశతోనే అనటంలో అసందర్భం ఉండదు. ఇక కమ్యూనిస్టులు మొదట్లో యుద్ధాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక యుద్ధమని, హిట్లర్ నభినందించి, అతడు రష్యాపై దండెత్తగానే 'ప్రజా యుద్ధమ'నే నినాదం ప్రారంభించారు.

ఇంతటి ప్రతికూల వాతావరణంలో రాయ్ 1940 చివర్లో రాడికల్ డెమోక్రాటిక్ పార్టీని స్థాపించి మిత్రమండలి కనుకూలంగా యుద్ధ ప్రచారం సాగించాడు. యుద్ధారంభం నుండీ, రెండవ ప్రపంచ యుద్ధం ప్రజాస్వామ్యానికీ ఫాసిజానికీ మధ్య యుద్ధమనీ, కాబట్టి యుద్ధంలో మిత్రమండలికి సహాయ నిరాకరణ పరోక్షంగా ఫాసిస్టులను బలపరచుటేనని రాయ్ వాదన. 1928 లోనే రాయ్ ప్రతిపాదించిన "సామ్రాజ్య ఉపసంహరణ" (Decolonisation) సిద్ధాంతం ఈ యుద్ధంతో రుజువు కాగల అవకాశం స్పష్టమైంది. అందుచేతనే యుద్ధంలో ప్రథమంగా నష్టపడేది బ్రిటిష్ సామ్రాజ్యమనీ, యుద్ధానంతరం బ్రిటన్‌లో, భారత జాతీయోద్యమంపట్ల సానుభూతి వహించిన లేబర్ పార్టీ అధికారంలోకి రాగలదనీ, భారతదేశానికి స్వాతంత్ర్యం తప్పదనీ వివరించాడు. అంతేగాక, యుద్ధంలో మిత్రమండలికి విజయం తథ్యమనీ, మిత్రమండలే భావి ఐక్యరాజ్య సమితికి (United Nations) బీజప్రాయమనీ, అందుచే యుద్ధంలో సహకారం చేయటం ద్వారా ప్రపంచ ప్రజాస్వామ్య రాజ్యాల సానుభూతి పొందగలమని పేర్కొన్నాడు. ఒకవేళ యుద్ధంలో ఫాసిస్టు శక్తులే జయిస్తే ప్రజాస్వామ్యానికీ మానవనాగరికతకూ భయంకర ప్రమాదం తప్పదనీ హెచ్చరించాడు. ఈ ఆలోచనా క్రమంతోనే రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ స్థాపనలో తన ఆశయాన్ని స్పష్టంచేశాడు రాయ్: "అంతర్జాతీయ ఫాసిస్టు విజృంభణ కారుమేఘంలా నాగరిక ప్రపంచంపై విస్తరిస్తున్న ఈ క్లిష్ట సమయంలో, సాంఘిక మానసిక బానిసత్వం నుండి ప్రజానీకానికి స్వేచ్ఛను సాధించే పోరాటంలో విప్లవకారుల ధర్మాన్ని పునరుద్ఘాటించటానికై డెహ్రాడూన్‌లో సమావేశమైనాం ........ ఈ కృషిలో గత రాజకీయ ప్రతిష్ఠనూ, భావి అవకాశాలను సైతం కాలదన్నటానికి నేను వెనుదీయటం లేదు."

రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ సహాయంతో దేశంలో ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమాన్ని సాగించాడు రాయ్. దేశంలోని పారిశ్రామికవర్గం కాంగ్రెస్‌ను పోషిస్తూ 'ఐక్య రాజ్యాల' (United Nations) శ్రేయస్సులకు భిన్నంగా జపాన్‌తో లాలూచీ పడుతున్నది. అందుచే కనీసం కార్మికవర్గానికి ఫాసిస్టు వ్యతిరేక చైతన్యం కలిగించి

సంఘటిత పరచటం అవసరమని గ్రహించి Indian Federation of Labour ను స్థాపించాడు. ఈ కార్మిక సంఘ సభ్యత్వం మూడు లక్షల వరకూ పెరిగి రాయ్ ఆశయానికి అనుగుణంగా కృషి చేసింది. ఇండియాపై జపాను దండయాత్ర జరిగితే ప్రజలను ప్రతిఘటనకు సమాయత్త పరచటానికీ, ప్రభుత్వానికి సలహా యివ్వటానికీ National Democratic Council ఒకదాని నేర్పాటు చేశాడు. వైస్రాయి తన సలహా సంఘంలో చేరవలసిందిగా రాయ్‌ని ఆహ్వానించాడు. రాయ్ తిరస్కరించాడు.

దేశీయ సమస్యలపట్ల కూడా రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ నిర్దుష్టమైన విధానాల ననుసరించి, రాజకీయాలలో పార్టీ విధేయతకు బదులు స్వతంత్ర ఆలోచనా శక్తిని ప్రోత్సహించింది. ఆ పార్టీవి 'Scientific Politics'.[1] 1942 లో, జాతీయ అంతర్జాతీయ సమస్యల దృష్ట్యా క్రిప్సు సూచనలను అంగీకరింపవలసిందిగా రాయ్ సూచించాడు.[2] Quit India ఉద్యమంతో రాడికల్ పార్టీ మరింత ఇరుకున పడింది. రాయ్‌నీ, అతని అనుచరులనూ దేశద్రోహులుగా, సామ్రాజ్యవాద బానిసలుగా దూషించటం జరిగింది; రాడికల్ పార్టీ సమావేశాలు భగ్నం చేయబడినై; కలకత్తాలో పార్టీ మహాసభా శిబిరంమీద నాటుబాంబులు పడినై! ఈ చర్యలకు కారణమైన వారిని స్థానిక ఫాసిస్టు వర్గీయు లనవచ్చునేమో! వారి నుద్దేశించియే, నేటి ప్రపంచంలో 'జాతీయవాదం - బూజుపట్టిన మతం'[3] అని రాయ్ సమాధాన మీయవలసి వచ్చింది. భారత జాతీయోద్యమంతోనే ప్రారంభమైన మతప్రోక్త రాజకీయ నినాదాల దుష్ఫలితమే 'పాకిస్థాన్' కోరిక అని రాయ్ సిద్ధాంతం; మతరాజకీయాలకు విరుగుడుగా లౌకిక జాతీయ ప్రజాస్వామ్య విధానాన్ని 1934 నుండి రాయ్ సూచిస్తూనే ఉన్నాడు. జాతీయ వాదుల నిర్లక్ష్యంవల్ల పాకిస్తాన్ వాదం ముదిరిపోయింది. పాకిస్థాన్ తప్పని సరియైనప్పుడు కాశ్మీర్‌ను పాకిస్థాన్‌తో చేర్చి, అఖండ బెంగాలును ఇండియన్ యూనియన్‌లో నుంచటం ఉభయులకూ శ్రేయస్కరమనీ, అనేక సమస్యలకు పరిష్కారమనీ రాయ్ సలహా! యుద్ధానంతరం భారతదేశ ఆర్థిక విధానం ప్రణాళికా

---

1. ఈ శీర్షికతో రాయ్ ఒక గ్రంథం రచించాడు.

2. క్రిప్సు సూచనలను తిరస్కరించటం గాంధీజీ పొరపాట్లలో ఒకటిగా ప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ బి. శివరావు ఇటీవల ఒక వ్యాసంలో పేర్కొన్నాడు. అబుల్ కలాం అజాద్, నాటి కాంగ్రెస్ అధ్యక్షుడు, తనకు క్రిప్సు సూచనలు సమ్మతమే ఐనట్లూ, కాని గాంధీజీ అభిప్రాయాన్ని వ్యతిరేకింప లేకపోయినట్లూ 'India Wins Freedom' అనే తన గ్రంథంలో వ్రాసుకున్నాడు. శ్రీ కె. యం. మున్షీ, క్రిప్సు సూచనలను గాంధీజీ ఎందుకు తిరస్కరించాడో తనకు అగమ్యగోచరంగా (Mysterious) ఉన్నదంటూ వ్రాసాడు.

3. "Nationalism-Antiquated Cult" అనే రాయ్ గ్రంథం.

బద్ధం కాక తప్పదని గ్రహించి Peoples' Plan నూ, స్వతంత్ర భారత పునర్నిర్మాణానికి సూచనగా Draft Constitution నూ రాయ్ తయారు చేశాడు. 1946 ఎన్నికలలో ఇవియే రాడికల్ పార్టీ ప్రణాళికలయినై (Manifesto). 1948 లోనే, అంటే టిబెట్‌ను చైనా ఆక్రమించినప్పుడే చైనాలో నున్నది జాతీయ - సైనిక - కమ్యూనిస్టు వాదాల మిశ్రమ విధానమనీ, హిమాలయాలమీదుగా ఇండియాపై చైనా దండయాత్రకు అవకాశం ఉన్నదనీ, అట్టి పరిస్థితిలో చైనాతో పాకిస్థాన్ మైత్రి వహింపగలదనీ భారత ప్రభుత్వాన్ని హెచ్చరించాడు రాయ్. ఇవి కేవలం జోస్యాలుగా త్రోసి వేశారు అధికార విధాననిర్ణేతలు! కాని ఇవి ముప్పది సంవత్సరాల ప్రత్యక్ష ప్రపంచ విప్లవాల అనుభవంతో, చెప్పిన జోస్యం! వాస్తవానికి ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలోనూ, తరువాతనూ అంతర్జాతీయ రాజకీయాలలో రాయ్ చెప్పిన జోస్యాలన్నీ తు. చ. తప్పకుండా ఫలించినై. అందుకనే ప్రొఫెసర్ శ్రీనివాసయ్యంగారు,[1] ఇరవయ్యో శతాబ్దపు హైరీషియస్‌గా రాయ్‌ని వర్ణించాడు.

యుద్ధం 1945 లో సమాప్తమైంది; ఫాసిజం పరాజయమైంది. కాని ప్రపంచం రెండుకూటాలుగా చీలిపోయింది. ఒకటి ప్రజాస్వామ్యకూటమి, మరొకటి కమ్యూనిస్టుకూటమి. లాంఛనప్రాయమైన పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి భవిష్యత్తు లేదని రాయ్ చాటిచెప్తూనే ఉన్నాడు; యుద్ధకాలంలో మార్క్సిజాన్ని పునర్విమర్శ చేసి అందలి లోపాలను గ్రహించి 'కమ్యూనిజం అనంతరం'[2] ప్రపంచ స్వరూపాన్ని ఊహించాడు. తదనుగుణ్యంగా కమ్యూనిజాన్ని సంస్కరించి స్టాలిన్ మానవజాతికి వెలుగుబాట చూపించగలడని నిరీక్షించాడు[3]; కాని ఆశాభంగమే కలిగింది. ఈ ఆవేదనలో నూతనమార్గాన్వేషణ ప్రారంభమైంది. సామాజిక శాస్త్రంలో ఉన్నత పరిశోధనలకై డెహ్రాడూన్‌లో రాయ్ స్థాపించిన Indian Renaissance Institute యందు పరిశోధనలు జరిగినై; రాయ్ నడిపిన Independent India, Marxist Way అనే పత్రికల్లో ఆ ఆవేదన ప్రతిఫలించింది. 1946 నుండి రాడికల్ పార్టీ సమావేశాలలో చర్చలు జరిగినై. రాజకీయ పార్టీసభల్లో తాత్త్విక జిజ్ఞాస, మూల సిద్ధాంత చర్చ అపూర్వమైన విషయం! చివరకు 1947 నాటికి లాంఛనప్రాయ ప్రజాస్వామ్యానికి బదులుగా రాడికల్ డెమోక్రసీకి సూత్రాలు నిర్వచింపబడినై; సమూల ప్రజాస్వామ్యానికి తాత్త్విక పునాదిగా నవ్యమానవవాదం రూపొందింది. సమూలప్రజా

1 శ్రీ అయ్యంగారు ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఆంగ్లభాషా శాఖాధ్యక్షులు; హైరీషియస్ ప్రాచీన గ్రీకు తత్త్వవేత్త; అతని రాజకీయ జోస్యాలన్నీ యథాతథంగా జరిగినవట!

2. Beyond Communism by Roy & Philip Spratt.

3. ఈ విషయాన్ని If I were Stalin అనే వ్యాసాల్లో రాయ్ స్పష్టం చేశాడు. చేజిక్కిన అపూర్వ అవకాశాన్ని స్టాలిన్ జారవిడిచాడని రాయ్ ఆరోపణ!

502(అ)



యమ్. యన్. రాయ్ - 13, మోహినీరోడ్డు డెహ్రాడూన్‌లో - లెని ! అంతిమ చిత్రం (గోడమీద) స్టాలిన్‌ఫొటో

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | CP03-F-137 | Date | 15/05/2020 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | C I I(a), IX XII XII 2,20 48, 202, 260, 262, 300, 302 | | |
| Missing Pages | NO | | |
| Prepared | | Scanned | Deepika |
| PS | | Pages | |

Blank :- 338, 368, 370, 392, 430, 464, 486
488, 496 (20) 501, 517, 518

స్వామ్య సాధనకు అధికార రాజకీయాలూ, పార్టీల కుమ్ములాటలు ప్రతిబంధకాలు; అందుచే 1948 లో రాడికల్ పార్టీ స్వయంగా రద్దయింది. 1848 సంIIన మార్క్స్ కమ్యూనిజాన్ని ప్రవచించాడు; సరిగా శతాబ్దానికి 1948 లో మార్క్స్ పరోక్ష శిష్యుడైన రాయ్ నవ్యమానవవాదాన్ని సిద్ధాంతీకరించాడు !

రాడికల్ పార్టీని రద్దు చేసిన తరువాత డెహ్రాడూన్‌లో మోహినీ రోడ్, 13 కేంద్రంగా నవ్యమానవవాద ప్రచారానికి ఉద్యమం ప్రారంభించాడు రాయ్. ఈ ఉద్యమంలో రాయ్‌కి సర్వవిధాల తోడ్పడింది ఎలెన్‌రాయ్. ఐరోపా నుండి 1937 లోనే ఎలెన్ ఇండియా వచ్చి రాయ్‌ని వివాహ మాడి ఆదర్శ భారత సతీ మణులను మరపించేటట్లు వ్యవహరించింది.

నవ్యమానవవాద ఉద్యమ ప్రచారానికి సాధనాలుగా Independent India ను Radical Humanist అను పేరున, Marxist way ను Humanist way అను పేర వెలువరించేవారు. సాంస్కృతికంగా మధ్యయుగ వాతావరణంలో నున్న భారతీయులలో మానసిక పునరుజ్జీవనం, రాజకీయ చైతన్యం కలిగించటానికీ పత్రికా ప్రచారం ఇతోధికంగా తోడ్పడింది. విద్యావంతులై కూడా నిర్లిప్తంగా ఉంటున్న మధ్యతరగతి ప్రజానీకంలో నూతనోత్తేజం కలిగించింది.

యుద్ధానంతరం ప్రపంచ మంతటా నవ్యమానవవాదానికి అనుకూలమైన ఆలోచనా విధానం తలెత్తింది. ఐరోపా దేశాల్లోనూ, అమెరికాలోనూ స్థానికంగా మానవతావాద సంఘాలు స్థాపింపబడినై. మానవతావాదాన్ని సుప్రతిష్ఠితం చేస్తూ రాయ్ వ్రాసిన Reason, Romantism and Revolution అనే గ్రంథం సర్వత్రా శ్లాఘింపబడింది. 1952 లో రాయ్‌ని అంతర్జాతీయ మానవవాద-నైతిక సంఘానికి ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. ఐరోపా, అమెరికాల నుండి విశ్వవిద్యాలయాలూ, సాంస్కృతిక సంఘాలనుండీ రాయ్‌కి ఆహ్వానాలు వచ్చినై. తత్వవేత్తగా తిరిగి ప్రపంచ యాత్ర ప్రారంభింప సంకల్పించాడు రాయ్. కాని, 1953 చివర్లో ప్రమాదం సంభవించి రాయ్ గాయపడ్డాడు; కోలుకొంటున్నాడని ఆశించిన సమయంలో పక్ష వాతం వచ్చింది. ఆశలు అడియాసలైనై. 1954 జనవరి 25 వ తేదీ అర్ధరాత్రి యమ్. యన్. రాయ్ అస్తమించాడు. మానవజాతి ఒక ధ్రువతారను కోల్పోయింది !

## నవ్యమానవవాదము

యమ్. యన్. రాయ్ ప్రతిపాదించినది మానవతా వాదం. ఇది కేవలం క్రొత్త సిద్ధాంతం కాదు. గౌతమ బుద్ధాది భారతీయ దార్శనికులూ, ప్రొటోగొరస్ మొదలుగా గ్రీకు తత్త్వవేత్తలూ ప్రాచీన కాలంలోనే మానవతావాదానికి పునాదులు వేశారు. నవీనయుగారంభంలో దేవాలయ దౌర్జన్యంపై తిరుగుబాటు జరిపిన

పెట్రార్క్ (ఇటలీ), ఎరాస్మస్ (హాలెండ్) లు మానవతావాదులే. ఆధునిక ప్రజా స్వామ్యానికి తాత్త్విక పునాదులు నిర్మించిన ఉదారవాదానికి (Liberalism) కూడా వ్యక్తి స్వేచ్ఛయే కీలకం; కమ్యూనిస్టు సిద్ధాంత కర్తయైన కారల్ మార్క్స్ "మానవ జాతికి మానవుడే మూలం" అన్నాడు. ఐతే, ఈ సిద్ధాంతాలలో కన్పించే మానవతా వాదం సమగ్రమూ, స్వయం సంపూర్ణమూ కాదు; మానవుని ఉనికీ, ప్రకతి-మానవుని స్వభావము, ప్రకృతి-మానవ సంబంధం, సమాజము-వ్యక్తి సంబంధాలను గురించీ నాటికి ఉపలభ్యమైన శాస్త్రీయ పరిజ్ఞానం చాల పరిమితముగుటయే అందుకు కారణం. అందుచే ఆ సిద్ధాంతాలు మానవతావాదానికే అఘాతాన్ని కలిగించే భావాలను ఆశ్రయింపవలసి వచ్చింది. మతవాదులు మానవుడు భగవంతుని సృష్టియనీ, దైవ సంకల్పమే ప్రపంచంలోని సంఘటనలకు కారణం అనీ మానవునకు వ్యక్తిత్వంగానీ, స్వేచ్ఛగానీ లేకుండా చేశారు. ఉదారవాదంలోని నీచమైన 'డబ్బు మనిషి' భావం స్వార్థపరులైన వ్యక్తుల సంఘర్షణకు దారితీసే, 'బలవంతునిదే రాజ్యం' (Survival of the fittest) అనే ప్రమాదకర సిద్ధాంతాన్ని ఆశ్రయించింది. ఇక భౌతికమైన ఆర్థిక శక్తుల నియంతృత్వానికి మనిషిని బానిస చేశాడు కారల్ మార్క్స్. కాబట్టి వర్తమాన సిద్ధాంతాల దౌర్బల్యం వల్ల వ్యక్తి సర్వంసహాధికారం వమ్ము చేయబడి అతడు నిస్సహాయుడౌతున్నాడు; లేదా జాతి, వర్గం, రాజకీయ పక్షం అనే సమిష్టి భావాలకు దాసోహమని, ఆ భావాలపై నేర్పడే పుంజీ విధానాలకు బలియౌతున్నాడు. వ్యక్తి సర్వం సహాధికారాన్ని గుర్తించి కూడా, దాన్ని ఆచరణలోనికి తీసుకొని రాలేక పోవటమే నేటి మానవ జాతి నెదుర్కొంటున్న తాత్త్విక క్లిష్టత. జాతీయ అంతర్జాతీయ రంగంలో కన్పించే అనారోగ్యకర వాతావరణం ఆ క్లిష్టతలో నుండి ఉదయిస్తున్నదే!

ఈ క్లిష్టతకు పరిష్కారంగా మానవుని సర్వంసహాధికారాన్ని పునరుద్ధరించేదే రాయ్ మానవతావాదం. ఈ వాదం అంతర్వాణి ప్రబోధం కాదు, అంతిమ సత్యాన్ని బోధించేదీ కాదు, గాలి మేడలు నిర్మించే సోమరి వేదాంతి మెదడులో ఉద్భవించిన ఆదర్శవాదమూ కాదు. గత ఏబది సంవత్సరాలలో ప్రపంచ విప్లవాలలో రాయ్ పాత్రనూ, అనుభవాన్నీ గురించి స్వీయ గాథలలో చదివియున్నారు. ఆ ప్రత్యక్షాను భవాన్నీ, న్యూటన్, డార్విన్, ఐన్‌స్టయిన్ మొదలైన శాస్త్రకారుల పరిశోధనల ఫలితంగా భౌతిక, రసాయనిక, శారీరక, మానసిక శాస్త్రాలలో లభిస్తున్న అద్యతన విజ్ఞానాన్నీ జోడించి సమగ్రమైన తత్వంగా రూపొందించాడు. అందుచేతనే రాయ్ తన సిద్ధాంతానికి శాస్త్రీయ మానవవాదమనీ, నవ్యమానవవాదమనీ పేరు పెట్టాడు. తత్త్వశాస్త్ర మంటే శాస్త్రాలకు శాస్త్రమని రాయ్ నిర్వచనం. దాని దృష్టి ప్రపంచం మీద కేంద్రీకృతమౌతుంది; వ్యక్తిగా మానవుడే దాని లక్ష్యం. అట్టి తత్వశాస్త్రమే రాయ్ నవ్యమానవవాదం.

## మానవుని అవతరణ

నవ్యమానవవాదానికి కేంద్రం మానవుడు. అంటే మానవుని అస్తిత్వాన్నీ పురోగతినీ ప్రకృతి-మానవ సంబంధాన్నీ, వ్యక్తి-సమాజ బాంధవ్యాన్నీ వివరించటమే అందలి విషయమూ, విశిష్టత. విశ్వ పరిణామ క్రమానికి మానవుడు మకుటం అని అంగీకరిస్తుంది నవ్యమానవవాదం. విశ్వం పదార్థ మయం; పదార్థం శక్తివంత (Energy) మైంది. పదార్థమూ శక్తీ పరస్పరాశ్రయములు; న్యూటన్ సిద్ధాంతం ప్రకారం విశ్వం ఒక యంత్రం; స్వయం నిబద్ధ సూత్రాల ననుసరించి పరిణామం చెందుతూ ఉంటుంది; కార్యకారణ సంబంధాల ననుసరించిన నియమాలను అతిక్రమించదు; అందుచే విశ్వం క్రమమైందీ, నియమబద్ధమైనదీ. అట్టి ప్రకృతిలో నుండియే సమస్త చరాచర జగత్తు ఆవిర్భవించింది. విశ్వ పరిణామ సూత్రాల ననుసరించి, శక్తియుతమైన పదార్థమే భౌతిక రసాయనిక మార్పులను పొంది జీవంగా పరిణమిస్తుంది. జీవోత్పత్తి ప్రకృతి పరిణామంలో అత్యంత ప్రధానమైన ఘట్టం! శాస్త్రకారుల ఈ పరిణామ సిద్ధాంతం మతవాదుల సృష్టి సిద్ధాంతాన్ని ఖండిస్తున్నది. జీవోత్పత్తి జరిగిన మరుక్షణమే జీవానికీ ప్రకృతికీ సంఘర్షణ ప్రారంభమాతుంది. జీవితేచ్ఛ బలీయం కావటంవల్ల ప్రకృతితో పోరాటంలో పరిసరాలకు అనుగుణంగా ఒదుగుతూ జీవి ఆత్మ రక్షణార్థమై అనేక శక్తి సామర్థ్యాలను సాధిస్తుంది. రకరకాల అవయవాలు, నరాలు, ఉద్వేగాలూ, మెదడు, జ్ఞాపకశక్తి అవతరిస్తై. మెదడు పెరుగుతున్న కొలదీ జీవి భూమికి సమానాంతరంగా ఉండటం మాని, సూటిగా పెరగటం గమనింపదగిన విశేషం. ప్రాథమిక జీవ పదార్థమే మానవుడుగా పరిణతి పొందుతుంది; మానవునిలో మెదడు సంపూర్ణ స్వరూపం దాల్చినదనటానికి ఆతడు భూమికి లంబంగా నిలబడగలగటమే నిదర్శనం. అంటే ప్రకృతి బానిసత్వం నుండీ జీవి స్వేచ్ఛ సాధించినదని చెప్పవచ్చు. ఈ పరిణామ సిద్ధాంతం వల్ల తన అవతరణకు తాను దేవుడనే అగోచర వ్యక్తికి ఋణపడి యున్నాననే భావము నుండీ, ఆతనిపట్ల కృతజ్ఞత వెల్లడించటం అవసరమనే భావం నుండీ మానవునకు విముక్తి లభించింది.

## హేతుశీలం – స్వేచ్ఛా పిపాస

మానవుని సారసత్వంలో రెండు అంశాలు ప్రధానంగా ఉన్నై. ఒకటి విశ్వ ప్రకృతిలోని నియమబద్ధ స్వభావం; రెండవది ప్రాణికోటికి సహజమైన జీవితేచ్ఛ. ప్రకృతిలోని నియమబద్ధ స్వభావమే మానవునిలో హేతుశీలంగా అవతరిస్తుంది. "భూమి మీదికి మానవు డెక్కడ నుండియో ఊడిపడినవాడు కాదు; ఆతని మెదడు, బుద్ధి, సంకల్పములూ, భౌతిక విశ్వములోని అంతర్భాగములే. భౌతిక విశ్వము క్రమమైనది; నియమబద్ధమైనది. కావున మానవుని అస్తిత్వము, అభ్యున్నతీ క్రమబద్ధమైనవి; అంటే ఆతని ఉద్వేగాలూ, సంకల్పమూ భావములూ నియమబద్ధములు;

అందువల్ల మానవుడు ప్రాయికంగా హేతుశీలి; విశ్వంలోని సామరస్య లక్షణం యొక్క ప్రతిచ్ఛాయయే మానవునిలోని హేతుతత్వం" అంటాడు రాయ్. ప్రకృతి లోని హేతుశీలాన్ని గమనించినప్పుడు మానవునిలో జ్ఞానోదయమౌతుంది; జ్ఞానానికి సాధనం మెదడు; మెదడు పదార్థమయం కావుననే పదార్థమయమైన విశ్వాన్ని గుర్తింప కలుగుతోంది; అందువల్లనే జ్ఞానం సాధ్యమైంది. కాబట్టి, మెదడు కూడా దైవ సృష్టికాదని స్పష్టం చేస్తున్నది నవ్యమానవవాదం.

ఇక ప్రాణికోటిలో సర్వసామాన్యమైన జీవితేచ్ఛ మానవునిలో ఉదాత్త స్థాయి నందుకొంటుంది. జన్మ మొదలు ప్రాణి ప్రకృతి నుండి విడివడటానికై అనంత మైన పోరాటం సాగిస్తుంది; ఈ పోరాటంలోనే హేతుతత్వానికి పీఠంగా మెదడు జనించింది. ఐనా జంతువులు పరిసరాలకు బానిసలుగానే ఒదిగి జీవిస్తై; కాని మానవు నిలో మెదడు పరిణతి పొందింది; అందుచే అతడు ప్రకృతి బానిసత్వం నుండి విముక్తి సాధించటానికి ప్రయత్నిస్తాడు. ఇందుకు ప్రకృతి సూత్రాలను గురించిన పరిజ్ఞానం అవసరం; జ్ఞానం పెరుగుతున్న కొలదీ మానవుని స్వేచ్ఛ విస్తరిస్తుంది. అందుచేతనే "స్వేచ్ఛాన్వేషణ, ఉత్తమ స్థాయిలో జరిగే జీవిత పోరాటమే" అంటాడు రాయ్. 'సత్యము' అనేది అవాఙ్మానసగోచరమైన ఆధ్యాత్మిక క్లిష్ట విశేషం కాదు; జ్ఞాన సారమే సత్యం; జ్ఞానం పెరుగుతున్న కొలదీ సత్యం పరిధులు విస్తరిస్తై; స్వేచ్ఛాన్వే షణకు ఛాయగా సత్యాన్వేషణ సాగుతుంది. కాబట్టి మానవునిలోని హేతుశీలమూ, స్వేచ్ఛాపిపాస మానవాభ్యున్నతికి ప్రధాన కారణాలు. స్వేచ్ఛాపిపాస పురోగతికి అవసరమైన ఉద్రేకాన్నీ కార్యసూరతనూ సమకూరుస్తుంది; హేతుశీలం ఉద్రేకాన్ని అదుపులో నుంచి సక్రమ మార్గాన నడిపిస్తుంది.

## సాంఘిక నైతిక విలువలు - మానవ సృష్టి

స్వేచ్ఛాపిపాసగానీ, ఆ పిపాసను తృప్తిపరచే సత్యాన్వేషణగానీ కేవలం వయ్యక్తికం. వ్యక్తులుగానే స్త్రీ పురుషులలో స్వేచ్ఛాపిపాస వ్యక్తమౌతుందని రాయ్ వాదం; కాబట్టి నవ్యమానవవాదం వ్యక్తివాదం అన్నంత మాత్రాన స్వార్థ వాదంగా భ్రమపడకూడదు. మానవునిలో స్వార్థం ఉన్నదని నవ్యమానవవాదం అంగీకరిస్తుంది. ఐతే అతడు హేతుశీలి అనికూడా గుర్తించిరి; హేతుశీలంతో, వివే చనతో మానవుడు ఆదికాలంలోనే పరస్పర సహకారంలోని ప్రయోజనాన్ని గుర్తిం చాడు; స్వార్థం తృప్తిపొందటానికి పరస్పర సహకారంలోనే ఎక్కువ అవకాశం గలదని గ్రహిస్తాడు. ఇదే ప్రబుద్ధమైన స్వార్థం (Enlightened self-interest) ఇట్టి స్వార్థ భావంతోనే సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ సంస్థలను నిర్మించుకొన్నాడు. వీని ఉద్దేశ్యం మానవుని సత్యాన్వేషణకు - స్వేచ్ఛాపిపాసకు ఉపకరించటమే; వ్యక్తి శ్రేయోభివృద్ధికే; కాబట్టి ఈ సంస్థలు వ్యక్తి స్వేచ్ఛను

కబళింపకూడదు; సమాజ అభ్యున్నతి అందులో వ్యక్తి అనుభవించే స్వేచ్ఛను బట్టి నిర్ణీతమౌతుంది.

సాంఘిక విలువలవలె నైతిక విలువలుకూడా మానవుడు నిర్మించుకొన్న వేనని నవ్యమానవవాదం చాటుతుంది. నేను సర్వసాధారణంగా ప్రబలంగా ఉన్న భావం మత విశ్వాసం వల్లనే మానవుడు నీతిపరుడౌతున్నాడనేది. ఈ విశ్వాసాన్ని తీవ్రంగా ఖండిస్తుంది నవ్యమానవవాదం. "మతం లేక నీతి లేనిచో ఆధునిక లౌకిక రాజ్యం (Secular State) లవినీతి రాజ్యం కావాలి" అంటాడు రాయ్. కాబట్టి నీతికిగూడా మానవుని హేతుశీలమే మూలం. మానవుడు హేతుశీలి కాబట్టి ప్రాయికంగా నీతిపరుడు అనేదే రాయ్ తత్వంలోని విశిష్టత. "అనుభవం ద్వారా, తనకు ఏది శ్రేయస్కరమో, ఏది కాదో మానవుడు గ్రహిస్తాడు. తనకు శ్రేయస్కరమైనది ఇతరులకూ శ్రేయోదాయకమే. తనకు హాని చేసేది ఇతరులకూ హానికరమే అని గూడా గ్రహిస్తాడు" ఈ వివేచనయే నీతి వర్తనకు ఆధారం. అంతేగాని భగవంతుని భయంతోగానీ ప్రభుత్వ భయంతోగానీ యేర్పడే నీతి యదార్థమైనది కాదు; కృత్రిమమైనది. నీతికి వ్యక్తి అంతరాత్మయే ప్రమాణం; అప్పుడే నీతి నిర్నిమిత్తమూ, స్వచ్ఛందమూ ఔతుంది; అదే యదార్థమైన నీతి; శాశ్వతంగా మనగలిగిన నీతి. ఐతే 'అంతరాత్మ' అనేది చైతన్య స్థాయిలో జరిగే శారీరక కార్యక్రమమే గాని మరొకటి గాదు; హేతుశీలం కార్య రూపాన్ని ధరించటమేనని చెప్పవచ్చు. కాబట్టి వ్యక్తి తన హేతుశీలత్వాన్నీ, సాంఘిక బాధ్యతలనూ గుర్తించినప్పుడు నీతి పరుడౌతున్నాడు. కాని నేటి ప్రపంచంలో దురాశ, పరపీడన, అధికార వ్యామోహం, వంచన, నైతిక విలువల పట్ల దుస్పృహమైన నిర్లక్ష్యం ప్రబలంగా ఉన్నమాట యదార్థమే. అందుకు కారణం నేటి సిద్ధాంత దౌర్బల్యం వల్ల కల్గిన సాంఘిక, మానసిక దుష్ఫలితాలే నంటాడు రాయ్. ఇందుకు పరిష్కారంగా మానవుడు తన విశిష్టతను, తన సర్వంసహాధికారాన్ని గుర్తించి ఆత్మ విశ్వాసం పుంజుకొనటానికి దోహదకారియైన విద్య ప్రధాన మంటాడు రాయ్. నవ్యమానవవాదం, మానవ జాతి మానసిక పునరుజ్జీవనం ఆవశ్యకతను స్పష్టంగా గుర్తించింది.

## భావ విశిష్టత

భావాలు దైవ ప్రసాదాలు కావు; ఆర్థిక శక్తుల ననుసరించి యేర్పడేవీ కావు; హేతుశీలం వలెనే భావోత్పత్తి కూడా శారీరక కార్యక్రమంలోని అంశమేనని నవ్యమానవవాద పరిశీలన. యోచనాపరుడైన మానవుడు ప్రకృతితో సన్నిహితుడైనపుడు భావాలు ఉత్పన్నమౌతున్నై; మానవ మేధాశక్తియే భావాలకు జన్మస్థలం. ఒకసారి ఉత్పన్నమైన భావం స్వతంత్రమై శాశ్వతంగా మనగలుగుతుంది. అంతేగాక ఒక భావం మరొక భావానికి ప్రేరకమౌతూ భావ పురోగమనం సాగుతుంది. పరిసరా

లను బట్టి భావాలు యేర్పడతై; భావాల ప్రభావం పరిసరాలను సంస్కరిస్తుంది. ఈ విధంగా సమానాంతరంగా పురోగమించే భావ గమనం, భౌతిక కార్యక్రమం. ఇదే చరిత్రకు కథా వస్తువు" అంటూ నవ్యమానవవాదం భావాల స్వాతంత్ర్యాన్నీ, సృజనా సామర్థ్యాన్నీ గుర్తించింది. అందుచేతనే రాయ్ తన సిద్ధాంతానికి తాత్త్విక పునాది పదార్థవాదం (Materialism) అనటానికి బదులు, భౌతిక అస్తిత్వము (Physical Realism) అంటాడు. అందులో భౌతిక పరిణామానికి ఎంత ప్రాధాన్యత ఉన్నదో, భావ గమనానికి కూడా అంత విశిష్టత ఉంది. "నాగరికతోదయం నుండీ భావవాదమూ, భౌతికవాదమూ సమైక్యమై పురోగమించినై. ఈ రెంటినీ కలిపి పరిశీలించినప్పుడే మానవ జాతి చరిత్రకు సమగ్రమైన వ్యాఖ్యానం లభిస్తుంది; అగాధమూ, అజ్ఞాతమూ ఐన భావి కాలానికి మార్గం గోచరిస్తుంది".

## మానవ చరిత్ర

కాబట్టి "మానవ చరిత్ర అనేది దైవ సంకల్పంచేత నిర్ణయింపబడినదీ కాదు; ఆర్థిక శక్తులచే నియమితమైనదీ కాదు; అది పునరావృత్తమయేదీ కాదు." అని రాయ్ అభిప్రాయం. ఐతే "మానవుడు ప్రకృతిపై, జీవం (Spirit) పదార్థం మీద, స్వేచ్ఛ నియంతృత్వం మీదా జరిపే అనంత పోరాటమే చరిత్ర" అన్న మిషిలెట్ అభిప్రాయంతోనూ "సామాజిక ప్రపంచం మానవుని సృష్టి అనటంలో సందేహం లేదు" అన్న ఎకో అభిప్రాయంతోనూ రాయ్ చాలవరకు ఏకీభవిస్తాడు. రాయ్ నిర్వచనం ప్రకారం పరస్పర సహకారంతో స్వేచ్ఛాసాధనకై మానవులు చేస్తున్న హేతుబద్ధమైన ప్రయత్న గాథే చరిత్ర. స్వేచ్ఛ అనేది వ్యక్తి అంతశ్శక్తుల పరిపూర్ణ వికాసానికి అనగా భౌతిక, సాంఘిక, మానసిక ఆటంకాలను తొలగించటమే. ఈ పురోగమనాన్ని, ఒక్కొక్క యుగంలో పాదుకొని పోయిన సామాజిక వ్యవస్థ ఆటంకపర్చవచ్చు. కాని మానవునిలో నున్న సంకల్పబలం, స్వేచ్ఛాపిపాస, ఆ అవరోధాలపై తిరుగుబాటు చేస్తుంది. అందుకు విప్లవభావాల ప్రోత్సాహం అతనికి లభిస్తుంది. అంటే, స్వేచ్ఛకూ, అభ్యున్నతికీ తోడ్పడగల సామాజిక వ్యవస్థను మానవుడు భావన చేయగలుగుతాడు; ఒక క్రొత్త సిద్ధాంతం తయారౌతుంది. దాని ప్రోత్సాహంతోనే విప్లవం సాగుతుంది. చరిత్రలో విప్లవాలన్నీ ఈ క్రమంలోనే జరిగినై.

ఐతే, తాను ఊహించిన సమాజాన్ని ఊహించినట్లుగా మానవుడు నిర్మింపలేడు; అంటే చరిత్ర కాతడు పూర్తిగా సార్వభౌముడు కాడు. చరిత్రకు ఒక నియతమైన పంథా ఉంది. ఆ పంథా అనేక శక్తులచే నిర్ణయింపబడుతుంది. వానిలో మానవ సంకల్పబలం ఒకటి మాత్రమే. కాని ఆ శక్తులన్నింటిలో క్రియాత్మకమైన శక్తి మానవుని సంకల్పబలమే. అందుచేతనే "పరిస్థితుల కనుగుణంగా చరిత్ర గతిని దిద్దగల సామర్థ్యం మానవునకు గలదు" అనేదే నవ్యమానవవాదంలోని ప్రధాన సూత్రం.

## మానవవాద రాజకీయాలు

మానవుని ఔన్నత్యాన్ని గుర్తించి, వ్యక్తి స్వేచ్ఛాపిపాసను తృప్తిపరుస్తూ, సత్యాన్వేషణలో ఇతోధికంగా తోడ్పడే విధంగా సమాజ రాజకీయ వ్యవస్థను (State) పునర్నిర్మించాలని సూచిస్తుంది నవ్యమానవవాదం. రాజ్యం మానవుడు నిర్మించుకొన్న సంస్థలలో ఒకటి; సమాజంలో సంఘర్షణలు లేకుండా శాంతి భద్రతలు రక్షించటమే రాజ్యం ధర్మం; రాజ్యం యంత్రాంగమే ప్రభుత్వం; క్రమంగా రాజ్యం ఇతర సంస్థలపై ఆధిపత్యం సాధించింది. తరతరాల నుండీ రాజ్యాధికారం, వ్యక్తి స్వేచ్ఛ వీటి సంబంధాలను గురించీ, రాజ్యం స్వరూప స్వభావాలను గురించీ అనేక సిద్ధాంతాలు బయలుదేరినై; అధికారానికీ, స్వేచ్ఛకూ పొత్తు కుదర్చటానికి ప్రయత్నాలు జరిగినై. రాచరికముగానీ, వామపక్షాల నియంతృత్వం (Communism) గానీ, కుడిపక్షాల నియంతృత్వం (Fascism) గానీ వ్యక్తి స్వేచ్ఛను హరించుననీ, మానవాభ్యున్నతికి ఆటంకాలనీ చరిత్ర రుజువు చేసింది. ఏ రూపంలోనూ నియంతృత్వాన్ని మానవవాదం సహించదు. కాగా వ్యక్తి స్వేచ్ఛపై ఆధారపడిన ప్రజాస్వామ్యాన్ని ఉత్తమ విధానంగా అంగీకరిస్తుంది; ఐతే కేవలం రాజకీయ యంత్రాంగంగా కాక ప్రజాస్వామ్యాన్ని జీవిత విధానంగా ఉద్దేశిస్తుంది.

ప్రాచీనకాలం నుండీ పలు దేశాల్లో విభిన్న రూపాల్లో ప్రజాస్వామ్యాన్ని అనుసరించారు. నేడు ఇంగ్లండు మొదలైన దేశాల్లో అమలులో ఉంది. కాని ఆధునిక ప్రజాస్వామ్య ఆచరణలో కన్పిస్తున్న లోపాల ఫలితంగా ప్రజాస్వామ్యం లాంఛనప్రాయంగా తయారైంది. నేటి ప్రజాస్వామ్యం వ్యక్తి స్వాతంత్ర్యం అనే పేరుతో ప్రజలను ఏకాకులుగా తయారు చేయటం వల్ల సుసంఘటితమై ప్రబుద్ధమైన ప్రజాభిప్రాయాన్ని రూపొందించే అవకాశాలు మృగ్యమైనై: ప్రజలలో నిస్సహాయత యేర్పడింది. ఇది అవకాశంగా రాజకీయ పక్షాలు అవతరించినై. పార్టీలలో క్రమశిక్షణ పేర వ్యక్తిస్వాతంత్ర్యానికి తిలోదకాలీయబడతై; పార్టీ అధిష్ఠానవర్గనిర్ణయాలే పార్టీ నిర్ణయాలై, అవే క్రమంగా ప్రజాభిప్రాయంగా చలామణీ అవుతుంది; సమాజ అభ్యున్నతికి సాధనమైన అధికారం పార్టీలకు ఆశయమౌతుంది; అధికారం కొరకు జరిగే పార్టీ కుమ్ములాటల్లో ప్రజా జీవితం అవినీతి పాలౌతుంది. ఎంత అధిక సంఖ్యాబలంతో నెగ్గినప్పటికీ, ఒక పార్టీ ప్రభుత్వం దేశంలో అల్పసంఖ్యాకుల ప్రభుత్వమే ఐతీరుతుంది. ఒకమారు అధికారంలోనికి వచ్చిన పార్టీ, అందుబాటులో నున్న సాధనాలన్నీ ప్రయోగించి అధికారం గుత్తకొనటానికి ప్రయత్నిస్తుంది. ప్రజాస్వామ్యం పార్టీ స్వామ్యంగా దిగజారిపోతుంది.

నేటి ప్రజాస్వామ్యంలో మరొక పెద్ద లోపం అధికారాన్ని పరదత్తంచేసే పద్ధతి. నేడు రాజ్యాలు పెద్దవి కావటంవల్ల ప్రత్యక్ష ప్రజాస్వామ్యానికి అవకాశం

నశించి, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యం ఆచరణలోనికి వచ్చింది. ఈ ప్రతినిధులను నిర్ణయించేది ప్రజలు కాదు; పార్టీలు! మూడు లేక ఐదు సంవత్సరాల కొకమారు జరిగే ఎన్నికల్లో తన సర్వాంసహాధికారాన్ని పౌరుడు ప్రతినిధికి దత్తం చేస్తాడు; తిరిగి ఎన్నికలు జరిగేవరకూ ప్రజలకా హక్కు ఉండదు; ఎన్నికైన ప్రతినిధిపై కూడా ఎన్నుకొన్నవారి కేవిధమైన హక్కు లేదు; అధికారం లుప్తమై, ఎన్నికల మధ్య పౌరులు పరాధీను లౌతున్నారు.

ప్రజాస్వామ్య మూల సిద్ధాంతాలకే అఘాతం కలిగిస్తున్న ఈ లోపాలను తొలగించి, రాయ్ సమూల ప్రజాస్వామ్య విధానాన్ని (Radical Democracy) రూపొందించాడు. సమూల ప్రజాస్వామ్యానికి పునాది రాజ్యాంగ విరుద్ధాలైన పార్టీ కాదు; వ్యక్తులు. ఈ వ్యక్తులు చైతన్యవంతులై యుండాలి. వారిలో నిస్సహాయత, నిర్లిప్తత తొలగించి స్వేచ్ఛాపిపాస, ఆత్మశక్తిలో విశ్వాసమూ కలిగించే విద్య అత్యవసరం; వివేచన కలిగి చైతన్యవంతులైన వ్యక్తులు, అధికారాన్ని స్వేచ్ఛాయుత సమాజ అభ్యున్నతికి సాధనంగా మాత్రమే గుర్తిస్తారు. కావున సమూల ప్రజాస్వామ్యంలో అధికార రాజకీయాలకు స్వస్తి చెప్పబడుతుంది.

అధికార వికేంద్రీకరణ, సమూల ప్రజాస్వామ్యానికి ముఖ్య లక్షణం. ఈ వికేంద్రీకరణ ద్విముఖంగా జరగాలి; ఒకటి ప్రాదేశికం; రెండు సంస్థాపరం.

దేశ వ్యాప్తంగా ప్రజా కూటముల (Peoples' Committees) నిర్మాణం జరగాలి. గ్రామం, తాలూకా, జిల్లా, రాష్ట్రం అనే అంచెలవారీగా ఈ కూటము లేర్పడి స్థానిక పరిపాలనాధికారాన్ని పొందుతై. దేశ సంఘం పార్లమెంటుగా వ్యవహరిస్తుంది; దేశాని కంతటికీ సంబంధించిన సమస్యలకూ, స్థానిక సంఘాల మధ్య సామరస్య సాధనకూ మాత్రమే దీని అధికారం పరిమితమౌతుంది. ఇందలి సభ్యులను ప్రజా సంఘాలు ఎన్నుకొంటై; తృప్తికరంగా వ్యవహరించని సభ్యులను ఉపసంహరించుకొనే హక్కు (Recall), శాసనాలు సూచించే హక్కు (Initiative), ప్రభుత్వం ఉద్దేశించిన శాసనాలపై గానీ, ఇతర చర్యలపై గానీ అభిప్రాయమును వెల్లడించే హక్కు (Referendum and Plebiscite) ఈ సంఘాలకు ఉంటుంది. అంటే ప్రజా కూటముల ద్వారా పౌరులు సర్వదా తమ సర్వాంసహాధికారాన్ని చెలాయిస్తూ ఉంటారు. నిత్య జీవితంలోనికి ప్రజాస్వామ్యం ప్రవేశిస్తుంది.

మానవ జీవిత వ్యాపారాలలో రాజకీయా లొకటి మాత్రమే. రాజకీయాలకు సాధనంగా రాజ్యాన్ని నిర్మించుకొన్నాడు. రాజ్యం కాక అనేక సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక సంస్థలను కూడా మానవుడు నిర్మించాడు. విశ్వవిద్యాలయాలు, క్లబ్బులు, సారస్వత సంఘాలు, వృత్తి సంఘాలు, వర్తక సంఘాలు, కార్మిక సంఘాలు మొదలైన వాని ద్వారా సామాజిక జీవితం తీర్చి దిద్దబడుతోంది; వ్యక్తి

వికాసానికి రాజ్యం ఎంత అవసరమో ఈ సంఘాలు సైతమూ అంతే అవసరం. తమ తమ విధులను నిర్వహించటానికి ఈ సంస్థలకు సైతం స్వతంత్రమైన అధికారం ఉండాలి. ఈ సంస్థలన్నీ అధికారంలో భాగస్వాములైనపుడు రాజ్యం విధులు ఈ సంఘాల మధ్య సామరస్య సాధన, దేశ రక్షణ, శాంతి భద్రతల సంరక్షణకు మాత్రమే పరిమితమౌతుంది. ఇట్టి బహువ్యవస్థాయుత రాజ్య నిర్మాణము ప్రజాస్వామ్యానికి పెట్టనికోట యని చిరకాలం నుండీ రాజకీయవేత్తలు భావిస్తున్న విషయమే.

## ఆర్థిక పునర్నిర్మాణం

సమాజ ఆర్థిక జీవితం కూడా ప్రజాస్వామ్య సూత్రాలపై పునర్నిర్మించాలని రాయ్ సూచించాడు. ఈ సూత్రాలలో ప్రధానమైనవి సహకారమూ, వికేంద్రీకరణ. కమ్యూనిస్టు, సోషలిస్టు శ్రేయోరాజ్యాలలో ప్రణాళికల పేరున ఆర్థిక విధానం కేంద్రీకృతం చేయటం ప్రజాస్వామ్యానికి గొడ్డలి పెట్టని రాయ్ విశ్వాసం. అందుచేత సమూల ప్రజాస్వామ్యానికి వికేంద్రీకృతమైన సహకార ఆర్థిక విధానమే ఆధారంగా వివరించాడు. ఈ విధానంలో ప్రధాన ఆర్థిక కార్యక్రమాలైన ఉత్పత్తి, పంపిణీలు, సహకార సంఘాల ద్వారా జరుగుతై. ఈ సంఘాలు స్థానికంగా నేర్పడి ఉత్పత్తి కార్యక్రమాన్ని సాగిస్తై. ఉత్పత్తి కేంద్రాలు అందులో పనిచేసేవారు నిర్వహింపగల్గినంతటి ప్రమాణం కలవిగా ఉంటై; జిల్లాలోనూ, రాష్ట్రంలోనూ దేశం మొత్తానికీ ప్రణాళిక సంఘాలుండి ఉత్పత్తి, పంపిణీ కేంద్రాల కృషిని సంఘటితపరుస్తూ ఉంటవి. ఈ విధానం ఆశయం వ్యక్తి జీవన ప్రమాణాన్ని పెంచి స్వేచ్ఛకు దోహదం చేయటం.



## నవ్యమానవవాద సూత్రాలు

నవ్యమానవతత్వాన్ని రాయ్ ఇరవై రెండు సూత్రాలలో నిర్వచించాడు; ఈ సూత్రాలను 1946 లో బొంబాయిలో జరిగిన రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ మహాసభ చర్చించి ఆమోదించింది.

## 1

మానవుడు సమాజానికి నమూనా (Archtype); సహకార సామాజిక సంబంధాలు వ్యక్తిలోని అంతర్గత శక్తుల వికాసానికి దోహదం చేస్తై. వ్యక్తివికాసమే సమాజ ప్రగతికి ప్రమాణం. సమాజ ఉనికికి వ్యక్తులే ఆధారం. వ్యక్తులు యథార్థంగా అనుభవించే స్వాతంత్ర్యమూ, సుఖజీవ

నాల మొత్తంగా కాని సమాజ స్వేచ్ఛ, ప్రగతీ కేవలం ఊహాకల్పితాలు; అసాధ్యములూ. వ్యక్తుల అనుభవంలోనికి వచ్చినదే యదార్థమైన సుఖ జీవనం. జాతి, వర్గం పేర్లతో మానవసమాజానికి సమిష్టిభావం కల్పించటం తప్పు. అవిధంగా చేయటం వ్యక్తిని సమిష్టిభావానికి బలిచేస్తుంది. వ్యక్తుల సుఖజీవనంయొక్క వ్యాపారమే సమిష్టి సుఖజీవనం.

2

స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణలు మానవాభ్యున్నతికి ప్రధాన ప్రేరకములు. స్వేచ్ఛాపిపాస అనేది, శారీరకమైన జీవితపోరాటాన్ని మానవుడు తన బుద్ధిబలంతో, ఉద్వేగంతో, ఉన్నతస్థాయిలో సాగించటమే. స్వేచ్ఛాపిపాసకు ప్రతిచ్ఛాయయే సత్యాన్వేషణ. ప్రకృతినిగురించి క్రమానుగతంగా పెరిగే పరిజ్ఞానం, భౌతికమూ, సామాజికమూ ఐన ప్రకృతిశక్తుల దౌష్ట్యంనుండి విముక్తి సాధించుటలో మానవునకు వుపకరిస్తుంది. జ్ఞాన విషయమే సత్యం.

3

వ్యష్టిగాగానీ, సమిష్టిగాగానీ జరిగే హేతుబద్ధమైన మానవప్రయత్నానికి లక్ష్యం స్వేచ్ఛాసముపార్జనమే. ప్రయత్నానుగుణంగా స్వేచ్ఛ క్షణ క్షణం వికాసం చెందుతుంది. సామాజిక యంత్రంలోని భాగంగా మాత్రమే కాక మానవులుగా, వ్యక్తులలోని శక్తులు పరిపూర్ణ వికాసం పొందటానికిగల అటంకాలను క్రమక్రమంగా తొలగించటమే స్వేచ్ఛ. సమిష్టికృషిగానీ, వ్యవస్థ కృషిగానీ ఎంతవరకు ప్రగతిశీలమూ ఎంతవరకు స్వేచ్ఛాదాయకమూ అని నిర్ణయించటానికి ఆ సమాజంలోని వ్యక్తుల ఉనికియే సాధనం. సమిష్టి కృషియొక్క విజయాన్ని అందలి వ్యక్తులకు కలిగిన ప్రయోజనాన్నిబట్టి నిర్ణయించాలి.

4

మానవుడు, నియమబద్ధమైన ప్రకృతినుండి ఉద్భవిస్తున్నాడు. అందుచే అతడు ప్రాయికంగా హేతువాది. హేతుత్వం శారీరక లక్షణం, కాబట్టి సంకల్పానికి (Will) విరుద్ధంకాదు. బుద్ధికుశలత, ఉద్వేగమూ (Emotion) సామాన్య శారీరక లక్షణాలుగా నిరూపించవచ్చు; కాబట్టి

చారిత్రక నియతివాదం సంకల్పబలానికిగల స్వేచ్ఛను కాదనలేదు. వాస్త వానికి, మానవసంకల్పమే బలీయమైన నిర్ణాయకశక్తి; కానిచో చరిత్ర గతిలో హేతుబద్ధంగా జరిగిన విప్లవాలకు ఆస్కారం ఉండేదేకాదు. హేతు బద్ధమూ, శాస్త్రీయమూ ఐన ఈ నియతివాదం ప్రకృతి ప్రయోజన సిద్ధాంత మని (teleological) గానీ, మతవాదుల కర్మసిద్ధాంతమని గానీ భ్రమపడ కూడదు.

## 5

భౌతికవాదాన్ని పొరపాటుగా అర్థంచేసుకొనటం వల్లనే చరిత్రను ఆర్థికశాస్త్రపరంగా నిర్వచించటం జరిగింది. ఆర్థికశాస్త్ర నిర్వచనంలో ద్వైత భావం (dualism) యేర్పడింది; భౌతికవాదం, అద్వైతాన్ని (monism) ప్రతిపాదించే సిద్ధాంతం. చరిత్రగమనం నియతమైనది; కాని ఈగమనానికి గల కారణాలు అనేకం; అందులో మానవ సంకల్పబలం ఒకటి; మానవ సంకల్పబలానికి కేవలం ఆర్థిక అవసరాలే కారణం అని చెప్పలేము.

## 6

భావోత్పత్తి శరీరధర్మాలలో ఒకటి; పరిసరాల అనుభూతివల్ల భావోత్పత్తి జరుగుతుంది. ఒకమారు ఉత్పన్నమైన భావాలు అంతర్గత సూత్రబద్ధములై జీవిస్తై. సమాజ పరిణామమూ, భావగమనమూ పరస్పర ప్రభావానికి లోనవుతూ, సమానాంతరంగా పురోగమిస్తై. ఐతే, మానవ పరి ణామంలోని ఏదశలోనూ ప్రత్యేకించి చారిత్రక సంఘటనలకూ, భావఉద్య మాలకూ సూటియైన సంబధాలను నెలకొల్పజాలము. సాంస్కృతిక రీతులూ, నైతిక విలువలూ కేవలం వ్యవస్థాపిత ఆర్థికసంబంధాల పునాదు లపై నేర్పడిన భావనాసౌధాలు కాదు; అవికూడా చరిత్రచేత అంటే భావ గమన చరిత్రలోని సూత్రాలచేత నియతమైనవే.

## 7

స్వేచ్ఛాయుత నవప్రపంచాన్ని సృష్టించాలంటే, సమాజ ఆర్థిక పునర్నిర్మాణస్థాయిని దాటి విప్లవం ముందుకుసాగాలి. "పీడితవర్గాల పేరుతో, రాజకీయాధికారాన్ని కైవసం చేసికొని, ఉత్పత్తిసాధనాల్లో, సొంత

ఆస్తిని రద్దుచేసినంతమాత్రాన స్వేచ్ఛ అవతరించి తీరుతుంది" అనుకొనటం పొరబాటు.

8

స్వేచ్ఛయేలక్ష్యం; ఆ లక్ష్యసాధనకు కమ్యూనిజంగానీ, సోషలిజం గానీ ఎంతవరకు ప్రయోజనకారులు అనే విషయాన్ని అనుభవంద్వారా నిర్ణయించాలి. జాతి, వర్గం అనే ఊహామాత్ర సమిష్టి సూత్రానికి రక్త మాంసాదులుగల మానవుని బలిచేసే రాజకీయ విధానంగానీ, ఆర్థిక ప్రయోగంగానీ స్వేచ్ఛకు అనుకూలసాధనం కాజాలదు. స్వేచ్ఛను నిరాకరించటం ద్వారా స్వేచ్ఛను సాధిస్తామనటం అసంబద్ధమైన విషయం. ఊహాకల్పితమైన సమిష్టి భావ పూజాపీఠంమీద వ్యక్తిని బలిచేయటం స్వేచ్ఛ కాజాలదు. వ్యక్తికిగల సర్వంసహాధికారాన్ని (Sovereignty) గుర్తింపక స్వేచ్ఛను నిస్సారమైన భావనగా త్రోసివేసే సాంఘికసిద్ధాంతం వల్లగానీ, సమాజ పునర్నిర్మాణ ప్రణాళికవల్లగానీ కలిగే ఫలితాల విప్లవ ప్రాధాన్యతా, ప్రగతీ చాల సంకుచితంగా ఉంటై.

9

సమాజ రాజకీయ నిర్మాణమే రాజ్యం (State). రాజ్యం అదృశ్యమౌతుందనే కమ్యూనిస్టు సిద్ధాంతం కేవలం అపోహయేనని అనుభవంవల్ల తేలిపోయింది. సమాజపరమైన పరిశ్రమలతో, ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానానికి పటిష్టమైన రాజకీయ యంత్రాంగం అవసరం. ఆ యంత్రాంగం ప్రజాస్వామ్యం అదుపులో నున్నప్పుడే, నవసమాజంలో స్వేచ్ఛకు రక్షణ ఉంటుంది. రాజకీయ ప్రజాస్వామ్యమూ, వ్యక్తిస్వేచ్ఛా పునాదులైనప్పుడే వినియోగం కొరకే ఉత్పత్తి జరిపించవచ్చు.

10

ప్రభుత్వ (State) యాజమాన్యంగానీ, ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానంగానీ శ్రామికుల దోపిడీని ఆపుచేయజాలవు. సంపదను సమంగా పంపిణీ చేయనూలేవు. ఆర్థిక ప్రజాస్వామ్యంలేక రాజకీయ ప్రజాస్వామ్యం అసంభవమైనట్లే, రాజకీయ ప్రజాస్వామ్యంలేని ఆర్థికప్రజాసామ్యం అసంభవం.

## 11

నియంతృత్వం చిరస్థాయిగా ఉండటానికే ప్రయత్నిస్తుంది. సామర్థ్యమూ, సమిష్టికృషీ, సమాజ ప్రగతీ అనే సాకులతో, రాజకీయ నియంతృత్వంలో అమలుజరిగే ప్రణాళికావిధానం వ్యక్తిస్వేచ్ఛను నిర్లక్ష్యం చేస్తుంది. అందుచే సోషలిస్టు సమాజంలో, ప్రస్తుతం భావింపబడుతున్న ఉన్నతస్థాయి ప్రజాస్వామ్యం అసంభవమౌతుంది. నియంతృత్వం తన లక్ష్యాన్ని తానే నిరోధిస్తుంది.

## 12

అనుభవంలో లాంఛనప్రాయ ప్రజాస్వామ్యంలోని లోపాలు వ్యక్తమైనై; అధికారం పరదత్తం (delegate) చేసే పద్ధతే ఆ లోపాలకు కారణం. ప్రజాస్వామ్యం సమర్థంగా ఉండాలంటే సర్వథా అధికారం ప్రజలపరంగానే ఉండాలి. తమ సర్వంసహాధికారాన్ని పటుతరంగా వినియోగించుకొనటానికి, ఎప్పుడోగాక నిత్యమూ అధికారాన్ని చలాయించుకొనే సదుపాయాలను ప్రజలు ఏర్పరచుకోవాలి. అణువణువులుగా విడివడియున్న పౌరులు కార్యాచరణలో శక్తిహీనులౌతున్నారు. తమ సర్వంసహాధికారాన్ని వినియోగించటానికీ, ప్రభుత్వయంత్రాంగంపై స్థిరమైన అజమాయిషీ చలాయించటానికీ వారికి సాధనాలులేవు.

## 13

లాంఛనప్రాయ పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, విపరీత వ్యాఖ్యానాలకు లోనై ఉదారవాదం (liberalism) నగుబాట్లపాలైంది. స్వేచ్ఛా వాణిజ్యసూత్రం (laisses faire) మనిషిని మనిషి దోచుకొనటానికి చట్టబద్ధమైన అవకాశం కల్పించింది. వ్యక్తివాదం (Individualism) స్వేచ్ఛాదాయకమైనదే; కాని 'డబ్బుమనిషి' (economic man) అనే భావం అగుణాన్ని పరిహరిస్తున్నది. డబ్బుమనిషి బానిసైనా ఔతాడు; బానిస యజమానియైనా ఔతాడు. మానవునిగురించిన ఈ నీచభావానికి స్వస్తిచెప్పి యదార్థమైనభావాన్ని అంటే హేతుత్వం మానవుని సహజ లక్షణమని, హేతుశీలి కావటంచే అతడు నీతిపరుడు అనే భావాన్ని స్థాపించాలి. నీతి అనేది మనస్సు (conscience) కు చేసే విజ్ఞాపన; ఇక, మనస్సు అనేది అప్రయత్నంగా పరిసరాలను గుర్తించి తదనుగుణంగా వ్యవహరించే శక్తియే.

కాబట్టి నీతి మానసికస్థాయిలో జరిగే యాంత్రికమైన జీవప్రవృత్తి; అందుచే అది హేతుబద్ధము.

## 14

పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి నియంతృత్వం ప్రత్యామ్నాయం కాదు; నిర్మాణాత్మక ప్రజాస్వామ్యమే ప్రత్యామ్నాయం. అట్టి నిర్మాణాత్మక ప్రజాస్వామ్యం ఒక పిరమిడ్ ఆకారంలో ఉంటుంది; దేశ వ్యాప్తంగా నిర్మింపబడిన ప్రజాసంఘాలే దానికి పునాది; శిఖరం పార్లమెంటు. ఈవిధానంలో సమాజరాజకీయనిర్మాణము సమాజంతో సహయోగంచెందుతుంది; తత్ఫలితంగా రాజ్యం శాశ్వితమైన ప్రజాస్వామికపు అదుపులో ఉంటుంది.

## 15

మానవుడు ఆలోచనాపరుడు; వ్యక్తిగామాత్రమే ఆలోచనాపరుడు కాగలుగుతున్నాడు; ఆలోచనాపరుడైన మానవుడు తన ప్రపంచానికి తానే కర్త; ఇదే చరిత్రకు ప్రాతిపదికయైనసూత్రము. ఈ సూత్రాన్ని బలపరచటమే, విప్లవాత్మకమై స్వేచ్ఛాదాయకమైన ఏ సామాజిక సిద్ధాంతానికైనా కర్తవ్యం. మేధస్సు ఒక ఉత్పత్తిసాధనం; అది ఉత్పత్తిచేసేపదార్థం చాలవిప్లవాత్మకం. ప్రాతను నిర్మూలింపగల భావాలు విప్లవానికి చాల అవసరం. తమ సృజనాసామర్థ్యాన్ని గుర్తించి, ప్రపంచాన్ని పునర్నిర్మించాలనే దృఢసంకల్పంకలిగి, భావప్రగతిచే నుత్సాహవంతులై, 'స్వేచ్ఛామానవులతో స్వేచ్ఛాసమాజం' అనే ఆదర్శంతో ఉద్దీప్తులైన మానవులసంఖ్య ఇతోధికంగా పెరిగినకొలదీ ప్రజాస్వామ్యం సంభవంగాగల అనుకూల పరిస్థితు లేర్పడతై.

## 16

సామాజిక అభ్యుదయంలోని మూలసూత్రాన్ని పునరుద్ఘాటించటం మీదనే సాంఘిక విప్లవ విధానమూ, కార్యక్రమమూ ఆధారపడాలి. స్వేచ్ఛాసూత్రాలనుగురించీ, హేతుబద్ధమైన సహకారవిధానాన్నిగురించీ ప్రజలకు చైతన్యం కలిగించే నిరంతరకృషిద్వారా సాంఘిక పునరుజ్జీవనం సాధ్యమౌతుంది. అప్పుడు ప్రజలు పటిష్ఠమైన ప్రజాసంఘాలుగా సమీకృతులై, విప్లవానంతర వ్యవస్థకు సాంఘిక, రాజకీయ పునాదులు నిర్మింపగలుగుతారు. చైతన్యవంతులైన వ్యక్తులసంఖ్య పెరుగుతూ, ప్రజాసంఘాలు విస్తృతం కావటం సాంఘికవిప్లవానికి చాలముఖ్యం. అదేవిధంగా, స్వేచ్ఛ,

హేతుత్వం, సాంఘిక సామరస్యం అనే సూత్రాలమీదనే విప్లవకార్యక్రమం ఆధారపడాలి. తత్ఫలితంగా సామాజిక జీవిత విధానంలో అన్నిరకాల గుత్తపద్ధతులు, స్వార్థశ్రేయస్సులు తొలగిపోతవి.

## 17

మానవుణ్ణి మానవుడు దోచుకొనే అవకాశం తొలగిపోయేవిధంగా సమాజ ఆర్థికవిధానాన్ని పునర్నిర్మించటమే సమూల ప్రజాస్వామ్యానికి ప్రథమ నిబంధన. సమాజంలో సభ్యులైన వ్యక్తుల వైజ్ఞానిక కళాత్మక మానవశక్తులు వికసించటానికి వారి భౌతిక అవసరాలు అభివృద్ధికరంగా తృప్తిపొందాలి. జీవనప్రమాణంలో క్రమాభివృద్ధికి హామీ యివ్వగల ఆర్థిక పునర్నిర్మాణమే సమూల ప్రజాస్వామ్యానికి పునాది. స్వేచ్ఛ అనే గమ్యం వైపు పురోగమించటానికి ఆర్థికంగా విముక్తిపొందటం అవసరం.

## 18

నవసమాజ ఆర్థికవిధానం రెండుసూత్రాలపై ఆధారపడివుంటుంది. వినియోగంకొరకే వుత్పత్తి; మానవ అవసరాల ననుసరించి పంపిణీ. ఇక, నవసమాజ రాజకీయవ్యవస్థ, ఆచరణలో వాస్తవాధికారం ప్రజలకు లేకుండా చేసే అధికారదత్త విధానంమీదగాక, ప్రజాసంఘాలద్వారా ప్రయోజను లందరూ ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకొనే విధానంపై ఆధారపడుతుంది. విజ్ఞానాన్ని విశ్వవ్యాప్త మొనర్చటంపైనే ఆ సమాజ సంస్కృతి నిలబడు తుంది. అందులో వైజ్ఞానిక, సృజనాత్మక కార్యక్రమాలమీద పెత్తనం తక్కువ; వానికి ప్రోత్సాహమూ, అవకాశమూ ఎక్కువ. ఈ నవసమాజం శాస్త్రీయంగా హేతుత్వంపై నిర్మింపబడినందున, ప్రణాళికాబద్ధమై ఉంటుంది. ఐతే ఈ ప్రణాళిక, వ్యక్తిస్వేచ్ఛయే లక్ష్యంగా తయారౌతుంది; ఈ విధంగా రాజకీయ—ఆర్థిక — సాంస్కృతిక ప్రజాస్వామ్యమైన నవసమాజం తన్ను తానుస్వచ్ఛందంగా రక్షించుకొనగల్గుతుంది.

## 19

ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాన్ని సాధించి, స్వేచ్ఛాప్రపంచాన్ని సృష్టించా లనే దృఢసంకల్పంతో సన్నిహితులైన మానవుల సమిష్టి కృషిద్వారా సమూల ప్రజాస్వామ్య ఆదర్శం సాధ్యమౌతుంది. ఇట్టి మానవులు, భావి రాజ్యవ్యవస్థలో పరిపాలకులుగాగాక, ప్రజలకు మార్గదర్శకులుగా, మిత్రు

లుగా, దార్శనికులుగా మాత్రమే వ్యవహరిస్తారు. స్వేచ్ఛా ఆదర్శానికి అనుగుణంగా, రాజకీయ ఆచరణ హేతుబద్ధమౌతుంది; అందుచే నది నీతివంతమౌతుంది. ప్రజలలో స్వేచ్ఛానక్తి పెరిగినకొలదీ, వారి కృషికి బలం చేకూరుతుంది. చివరకు, ప్రబుద్ధమైన ప్రజాభిప్రాయంపైనా, వివేకవంతమైన ప్రజాసహకారంమీదా సమూలప్రజాస్వామ్యం అమలులోనికి వస్తుంది. అధికార కేంద్రీకరణ స్వేచ్ఛకు ఆటంకమని గుర్తించటంవల్ల సమూల ప్రజాస్వామ్యవాదులు విస్తృతమైన అధికార వికేంద్రీకరణకు కృషి చేస్తారు.

## 20

చివరకు తేలిన సారాంశం: వ్యక్తి స్వేచ్ఛను హరించకుండా సమాజ అభ్యుదయానికి దోహదమిచ్చేవిధంగా పునర్నిర్మించటానికి పౌరులను విద్యావంతులుగా చేయటం ముఖ్యఅవసరం పౌరుని పౌర, రాజకీయ శిక్షణకు ప్రజాసంఘాలే పాఠశాలలుగా ఉపకరిస్తై. సమూల ప్రజాస్వామ్య రాజకీయ వ్యవస్థ, నిస్సంగులై తప్పుకు తిరిగే వ్యక్తులను సైతం ప్రజాహిత కార్యాలలో పాల్గొనేటట్టు చేస్తుంది. అట్టి వ్యక్తులచే నడపబడే ప్రభుత్వ యంత్రాంగం, ఒక వర్గం మరొక వర్గంపై అధికారం చలాయించటానికి సాధనం కాదు. ఆధ్యాత్మిక స్వేచ్ఛ సాధించిన వ్యక్తులు అధికారంలో ఉన్నప్పుడే దాస్య శృంఖలాలను ఛేదించి అందరికీ స్వేచ్ఛను ప్రసాదింప గలుగుతారు.

## 21

రాడికల్ సిద్ధాంతం శాస్త్రవిజ్ఞానాన్ని సమాజ నిర్మాణంలో అంతర్భాగంగా చేస్తుంది; వ్యక్తిత్వానికీ, సమిష్టి జీవితానికీ పొత్తు సాధిస్తుంది; స్వేచ్ఛకు నైతిక, మానసిక, సాంఘిక ప్రాధాన్యతను చేకూరుస్తుంది; ఆర్థిక నియతివాదంలోనూ, భావగమనవాదంలోనూగల గతితార్కికాలనుగమనించి సమగ్రసామాజికాభ్యుదయ సిద్ధాంతాన్ని రూపొందించింది; ఆ సిద్ధాంతం ఆధారంగానే నేడు సామాజిక విప్లవానికి అవసరమైన విధానాన్నీ, కార్యక్రమాన్నీ నిర్ణయించింది.

## 22

"మానవుడే అన్నిటికీ ప్రమాణం" (ప్రొటోగొరస్), "మానవజానికి మానవుడే మూలం" అనే సూక్తులనుండి 'రాడికలిజం' ఉత్పన్నమైంది. ఆధ్యాత్మికంగా విముక్తి పొందిన నీతిపరుల సమిష్టి కృషిద్వారా ప్రపంచాన్ని శ్రేయోరాజ్యంగా (Common wealth)విశ్వభ్రాతృత్వ వ్యవస్థగా పునర్నిర్మించటమే రాడికలిజం ఆశయం.

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | CP03-F-137 | Date | 15/05/2020 |
| Front Cover | YES | Back Cover | YES |
| Blank Pages | C I I(a), IX XII XII 2,20 48, 202, 260, 262, 300, 302 | | |
| Missing Pages | NO | | |
| Prepared | | Scanned | Deepika |
| PS | | Pages | |

Blank :- 338, 368, 370, 392, 430, 464, 486
488, 496 (29) 501, 517, 518